భారత కమ్యూనిస్టు ఉద్యమ చారిత్రక ఘటనలు, సైద్ధాంతిక సమస్యలు

# కమ్యూనిస్టుల ఐక్యసంఘటన

## అన్వేషణ

సంపుటి - 7ఎ

# అడుగుజాడల పర్వం

(ప్రథమ భాగం)

డి.వి. సుబ్బారావు

కాంతిరేఖ ప్రచురణలు

చిలువూరు-522 332, గుంటూరు జిల్లా, ఫోన్: 08644-85109.

COMMUNISTULA IKYA SANGHATANA ANVESHANA
**ADUGUJADALA PARVAM**

ప్రచురణ నెం : 8
ప్రచురణ : సెప్టెంబరు, 2002.



**వెల : రు. 70-00**

డి.టి.పి. : స్పందన పబ్లికేషన్స్, విజయవాడ-2, ఫోన్:434266.
ముద్రణ : విశాలాంధ్ర, విజయవాడ-2.

ప్రతులకు :
విశాలాంధ్ర బుక్ హౌస్ అన్ని బ్రాంచిలలోను.
ప్రజాశక్తి బుక్ హౌస్ అన్ని బ్రాంచిలలోను.
నవోదయ బుక్ హౌస్, విజయవాడ.
మైత్రి బుక్ హౌస్, విజయవాడ.
నవయుగ బుక్ హౌస్, హైదరాబాద్.
డి.వి. సుబ్బారావు, చిలువూరు-522 332. ఫోన్:85109.

# అంకితము

నా జీవిత సహచరిణి,భాగస్వామిని,

కాంతిరేఖ నన్ను ఈ బృహత్తర, సుదీర్ఘ రచనకు,

అన్నివేళలా, అన్ని విధాల ప్రోత్సహించుతు, తప్పొప్పులు

సరిచేయుటకు కూడా సహకరించిన నా శ్రీమతి



**శ్రీమతి దేవినేని సూర్యకాంతమ్మకు**

ప్రేమపూర్వకంగా ఈ రచనను

సమర్పించుకొంటున్నాను.



1952 లో మైకాలజి రిసర్చి అసిస్టెంట్‌గా
రాజేంద్రనగర్‌లో నిజాం ప్రభుత్వోద్యోగిగా
రచయిత డి.వి.సుబ్బారావు
భార్య సూర్యకాంతమ్మ.

# తొలిపలుకు

1. ప్రపంచ యుద్ధానంతరం 1947 – 50లలోని "టెక్స్టుబుక్" భారత విప్లవ "రష్యా పంథా", "చైనా పంథా" ల "మితవాద", "అతివాద" వక్రీకరణల అనంతరం భారత కమ్యూనిస్టు పార్టీ సైద్ధాంతిక చర్చలు, సమాలోచనల అనంతరం "భారత విప్లవ పంథాను రూపొందించే ప్రయత్నం నిరవధికంగా సాగించింది. ఈ క్రమంలో రెండు పూర్తి దృక్పథాలు రూపొంది 1962లో తీవ్రంగా సంఘర్షించి, చీలికదశకు చేరగా, సుక్లోవ్ "జట్లిప్రోలు" పంచాయతీతో, తాత్కాలికంగా వాయిదాపడింది. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో కృశ్చేవ్ మితవాద పంథా, లిన్‌పియావో అతివాద పంథాలు తీవ్రంగా సంఘర్షించి, రెండుగా చీలిన ఫలితంగా, ఆ ప్రభావానికి తీవ్రంగా లోనైన సి.పి.ఐ.రెండుగా చీలి 1964లో సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)లుగాను, తదనంతరం 1967లో సి.పి.ఐ.(యం) చీలి సి.పి.ఐ.(యం), సి.పి.ఐ.(యం.ఎల్)లుగా భారత కమ్యూనిస్టు ఉద్యమం మూడుస్రవంతులైంది.

2. ఈ "భారత విప్లవ పంథా" అన్వేషణ, సైద్ధాంతిక పోరాటం పేరుతో సాగిన పరస్పర "హననం" రెండున్నర దశాబ్దాలు సాగి, 1978లో ప్రధాన కమ్యూనిస్టు స్రవంతులు భటిండా, జలంధర్ పార్టీల కాంగ్రెసులలో నూతన విధానాలను అవలంభించి, "హిమాలయ శిరోభారాలను" పాక్షికంగా క్షాళనం చేసుకొన్నవి. ఈ అధ్యయన ప్రయత్నమే "అడుగుజాడల పర్వం" లో జరిగింది.

3. ఈ "అడుగుజాడల పర్వం" మొదటి భాగంలో నూతన విధానం అవతరణ, బహుముఖ రాజకీయ సంక్షోభం, పార్లమెంటరీ పోరాటాలు, వామపక్ష ఐక్యత, దేశ ఐక్యత, సమగ్రతలకై పోరాటం అనే అయిదు ఖండాలలో వివిధ అంశాలు అధ్యయనం చేయబడినది.

4. నూతన విధాన ఆవిష్కరణకు భటిండా సి.పి.ఐ. కాంగ్రెసు, మితవాద స్కరణవాదాన్ని, జలంధర్ సి.పి.ఐ.(యం) కాంగ్రెసు అతివాద సంస్కరణవాదాన్ని, అనుభవాల శాస్త్రీయ పరిశీలను, ఆత్మవిమర్శనలతో అధిగమించవలసి వచ్చింది. ఈ "జాతీయ వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయం" అనే నూతన విధానపు అడుగుజాడలు 9వ కొచ్చిన్, 10వ విజయవాడ పార్టీ కాంగ్రెసుల రాజకీయ విధానీలలో కానవస్తాయి.

5. సి.పి.ఐ. వాస్తవికతా దృక్పథంతో సెక్టేరియనిజం విడనాడి, పార్టీల స్వతంత్రపాత్రను గుర్తించే వామపక్ష ,ప్రజాస్వామ్య ఐక్యత, వర్గాల ప్రాతిపదిక గుర్తించే వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన, ప్రభుత్వ నిర్మాణం, భటిండా వ్యూహంలో ప్రధాన మార్పులుగా కనపడుతున్నవి. సి.పి.ఐ.(యం) జలంధర్ పార్టీ కాంగ్రెసు వామపక్ష, ప్రజాస్వామ్య ఐక్యత మౌలికాంశంగా ఆమోదించిన దానికి గట్టి ప్రతిఘటనను ఎదుర్కొనవలసి యుండుటను "పీపుల్స్ డెమోక్రసీ"లోని, ఆగస్టు 1979 సంపాదకీయం స్పష్టం చేస్తున్నది. అదే ఆచరణలో ప్రస్ఫుటమగుతున్నది.

6. దేశంలో అభివృద్ధి చెందుతున్న సర్వతోముఖ సంక్షోభం, బూర్జువా రాజకీయ నాయకులతో విసిగి వేసారిన ప్రజాసామాన్యం, వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయానికై ఎదురుచూస్తున్నారు. కేరళలో నూతన సుముఖ పరిణామాలు దీనిని ప్రతిబింబించుచున్నాయి. నేడు జనతా ప్రభుత్వం స్థిరత్వాన్ని పొందుట లేక ఇందిరా కాంగ్రెస: "వ్యక్తి పూజ - కాకస్" పాలనను తిరిగి ప్రతిష్టించుటకాదు, వామపక్ష, ప్రజాస్వామ్య ఐక్యత ప్రత్యామ్నాయాన్ని రూపొందించుట ప్రధమ కర్తవ్యంగా కమ్యూనిస్టులు, వామపక్ష ప్రజాస్వామ్య శక్తులు ప్రకటించాయి.

7. పార్లమెంటరి ఎన్నికలలో పాల్గొనుట వొక రాజకీయ పోరాట రూపంగా వొక్క పీపుల్స్‌వార్‌లో కొన్నిగ్రూపులు తప్ప వివిధ భారత కమ్యూనిస్టు శ్రేణులన్నీ గుర్తించాయి. జాతీయ ప్రజాస్వామ్య విప్లవ పంధా చేబట్టిన సి.పి.ఐ ఎన్నికలలో ఎత్తుగడగా పాల్గొంటున్నామన్నది, జనతా ప్రజాస్వామ్య విప్లవ పంధా చేబట్టిన సి.పి.ఐ.(యం) బూర్జువా ప్రభుత్వ పార్లమెంటరీ విధానంలో చురుకైన పాత్రనే పోషించుతూ, సి.పి.ఐ. వలెనే సి.పి.ఐ.(యం) ప్రభుత్వ యంత్రాంగాన్నీ భగ్నం చేయుటకు ఎత్తగడగా ఎన్నికలలో ప్రభుత్వంలో పాల్గొంటున్నామని చెప్పినా ఆచరణలో బూర్జువా ఎన్నికలు, పాలనా యంత్రాంగంలోని అన్ని అవాంఛనీయ విధానాలకు "ఎర" లయ్యాయి. ఈ పార్టీల లక్ష్యమైన మిలిటెంట్ పోరాట ప్రజాసంఘాలు, పార్టీ నిర్మాణాలను పెంపొందించి బలపడుటకు బదులు, ఉన్న ప్రజాసామాన్య బలాన్ని కూడా కోల్పోయాయి. పార్టీల నిర్మాణాన్ని, క్రమశిక్షణ, స్వయంసేవా దృక్పధాన్ని, కమ్యూనిస్టుల లక్షణాలనెన్నింటినో పార్లమెంటరీ "రొంపి"లో కోల్పోయారు. ప్రజలలో కమ్యూనిస్టు పార్టీల గౌరవ ప్రతిష్టలు, అభిమానాన్ని కోల్పోవుట గణనీయంగా జరిగింది. పార్టీలు పూర్వ ఔన్నత్యాన్ని తిరిగి పొందాలంటే "శస్త్రచికిత్స" తప్పితే మరోమార్గం కనుపించుటలేదు. "కోమా"లోనికి వెళ్లకముందే, ఎంతో ఆలస్యమైనా "శస్త్ర చికిత్స"తో కుళ్లిపోయిన వివిధ అంగాలను తొలగించుట కంటే మరో మార్గంలేదు.

9. దేశం అత్యంత ప్రమాదకర మత, కుల, ప్రాంతీయ దురహంకార విచ్ఛిన్నకర శక్తుల చర్యలకు "ఎర" అగుతు దేశభద్రత, సమగ్రతలకు, దేశ ఐక్యతకు, లౌకిక, ప్రజాస్వామ్య వ్యవస్థకు సంక్షోభాన్ని సృష్టించాయి. దేశంలోని వివిధ పార్టీల రాజకీయ విధానాలు, పాలన నిజాయితీలపై ప్రజలు విశ్వాసాన్ని అత్యంత వేగంగా కోల్పోతున్నారు. ఈ విశ్వాస శూన్యత 1976-77, 1986-87, 1996-97లలో వలె ఏర్పడి, విస్తరించి, దేశాన్ని సంక్షోభంలోనికి నడుపిస్తున్నట్లున్నది. ప్రజాస్వామ్య శక్తులు నిద్రనుండి లేచి, కాలం మించిపోకుండా, ఐక్యపోరాటాలలో విజృంభించి మత మౌఢ్య కవాతు దళాల రాజకీయ పార్టీల, నిరంకుశ ఫాశిస్టు శక్తులకు పుట్టగతులు లేకుండా చేయండని కోరుతున్నవి. వివిధ వామపక్షాల, ప్రజాస్వామ్య శక్తులు,ముఖ్యంగా వివిధ కమ్యూనిస్టు శ్రేణుల అగ్రగామి దళాలతోపాటు పురోగమించుటకు ప్రజాసామాన్యం సంసిద్ధంగా వుంది.

– డి.వి. సుబ్బారావు.

# విషయసూచిక


## 1. నూతన విధానం అవతరణ (9)

నాంది (9) భటిండా, జలంధర్ సి.పి.ఐ., సి.పి.ఐ.(యం) పార్టీల కాంగ్రెసుల విధానాలు, భిన్నత్వాలు, ఐక్యతాంశాలు (11) వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనపై సి.పి.ఐ.(యం) జలంధర్ పార్టీ కాంగ్రెస్ అవగాహన (14) ప్రత్యామ్నాయ వేదికకు సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)ల ప్రతిపాదనలు (24) సంయుక్త ప్రకటన, ముఖ్య పరిణామాలు (28) అంతర్గత సైద్ధాంతిక పోరాట ఫలితాలే భటిండా, జలంధర్ కాంగ్రెస్‌ల సుముఖ అంశాలు (33) వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతపై కొన్ని వివేచనాంశాలు (39) కొన్ని సుముఖ రాజకీయ అంశాలు (44)

## 2. బహుముఖ రాజకీయ సంక్షోభం (48)

నాంది (48) బూర్జువా వర్గ రాజకీయ పార్టీలలో తీవ్ర రాజకీయ, నిర్మాణ సంక్షోభం (50) వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత (54) కార్మిక వర్గ ఐక్యత (61) ఐక్యసంఘటనలు కమ్యూనిస్టుల స్వతంత్ర పాత్ర (66) సారాంశం (71)

## 3. పార్లమెంటరీ పోరాటాలు (76)

i) 1980 మధ్యంతర ఎన్నికల పూర్వ రాజకీయ పరిస్థితి, ఇటీవల రాజకీయ పరిణామాలు (76)

ii) పార్లమెంటు 1980 ఎన్నికలు, వివిధ పార్టీల విధానాలు, ఎత్తుగడలు (82)

iii) వివిధ రాష్ట్రాలలో కమ్యూనిస్టుల ఎన్నికల ఎత్తుగడలు (85)

కేరళ (85) అసెంబ్లీ ఎన్నికలు ఫలితాల కొంత పరిశీలన (87) పశ్చిమబెంగాల్ (88) బీహార్ (90) సంయుక్త రాష్ట్రాలు (యు.పి.) (94) మహారాష్ట్ర (98) తమిళనాడు (99) పంజాబ్ (101) ఆంధ్రప్రదేశ్ 1985 అసెంబ్లీ ఎన్నికలు (103) లోక్‌సభ 1984 ఎన్నికలు (103) కమ్యూనిస్టుల ఎన్నికల విధానాలు (104) అసెంబ్లీ 1985 ఎన్నికలు సి.పి.ఐ. (105) అసెంబ్లీ 1985 ఎన్నికలు సి.పి.ఐ.(యం) (106)

iv) అసెంబ్లీ ఎన్నికలు వివిధ పార్టీల నూతన అవగాహనా సరళి (106)

కాంగ్రెస్ ఎన్నికల అవగాహనలు (107) రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘం దాని రాజకీయ పార్టీ బి.జె.పి. (108) కమ్యూనిస్టులు ఎన్నికల అవగాహనలు (109)

v) నూతన పరిస్థితి, ప్రత్యామ్నాయ సోపానాలు (115)

కేరళలో 1987 ఎన్నికలు (116) పశ్చిమబెంగాల్‌లో అసెంబ్లీ ఎన్నికలు (118) హర్యానా అసెంబ్లీ ఎన్నికలు (119) రాష్ట్రపతి ఎన్నికలు (121) కాంగ్రెస్‌కు మరో బూర్జువా ప్రత్యామ్నాయాన్ని నిర్మించే ప్రయత్నాలు (123) వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనల నిర్మాణ పోరాటాలు (126)

vi) కమ్యూనిస్టులు - ఎన్నికలు, సైద్ధాంతిక సమస్యలు (136)

నాంది (136) ఫాసిజం పతనానంతరం ఫ్రాన్స్, ఇటలీ బూర్జువా పార్లమెంటులలో కమ్యూనిస్టుల అనుభవాలు (138) భారత కమ్యూనిస్టుల ఉద్యమం, ఎన్నికల దృక్పథం (142) ఎన్నికలలో పాల్గొనులకు సాధారణ మార్గదర్శక సూత్రాలు (144) ప్రజలకు పార్లమెంటుపై భ్రమలు లేవా? (145) కమ్యూనిస్టు విప్లవకారులు, ఎన్నికలు (146) రెడ్‌ఫ్లాగ్ విప్లవకారుల ఎన్నికల అవగాహనలు (149) ఎన్నికలలో పాల్గొనుటపై సి.పి.ఐ.(యం.ఎల్.), యు.సి.సి.అర్.ఐ. (యం.ఎల్.) మధ్య సైద్ధాంతిక పోరాటం (152) ఎన్నికలలో పాల్గొనుట వ్యవసాయ విప్లవానికి ద్రోహమా ? (155) యు.సి.సి.ఆర్.ఐ. (యం.ఎల్.) ఎన్నికల వైఖరి (156) పాలక పార్టీలు, సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)లపై విప్లవ పార్టీల వైఖరి (159)

vii) సారాంశము (162)

**4. వామపక్ష ఐక్యత (174)**

i) నాంది (174)

ii) వామపక్ష ఐక్యతా వివేచన (176)

iii) ఐక్యపోరాటాల క్రమంలో వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత నిర్మాణం (188)

జాతీయ కన్వెన్షన్; ధరలు పెరుగుదలకు వ్యతిరేకంగా, మత సామరస్యం, పౌరహక్కుల కొరకు (191) వామపక్ష ప్రతిపక్షాల సమిష్టి అవగాహనలు (197) వివిధ సమస్యలపై ఐక్యపోరాటాలు (201) కాంగ్రెసేతర రాష్ట్రప్రభుత్వాల రద్దు, నియంతృత్వ పోకడలు (207) లౌకిక వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయం (211) సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)ల మధ్య సంబంధాలు, ఐక్యత (214) ఐక్య కార్యాచరణ సోపానాలు (217) వామపక్షాల 1974 సమావేశం (220).

iv) సారాంశము (221)

**5. దేశ ఐక్యత - సమగ్రతలకై పోరాటము (228)**

విజయవాడ సి.పి.ఐ.(యం) 11వ, వారణాసి సి.పి.ఐ. 12వ పార్టీ కాంగ్రెస్‌లు (231) వామపక్ష శక్తుల ఐక్యత (245) రాష్ట్రీయ పార్టీలు ఐక్యత - సమగ్రతా సమస్యలు (250) కేంద్ర - రాష్ట్ర సంబంధాలు (251) సర్కారియా కమిషన్ (254) సర్కారియా కమిషన్ ప్రశ్నావళికి కమ్యూనిస్టుల సమాధానాలు (256) మండల్ కమిషన్ (260) రిజర్వేషన్ల విషయంలో పరిగణించవలసిన కొన్ని ముఖ్యాంశాలు (262) పంజాబ్ సమస్య (265) అస్సాంలో అన్యజాతీయుల సమస్య (268).

# 17

# అడుగుజాడలపర్వం

# 1

# నూతన విధానం అవతరణ

## (భటిండా, జలంధర్ కమ్యూనిస్టుపార్టీల కాంగ్రెసుల రాజకీయ విధానాలు)

### నాంది

**1.1.** భటిండాలో భారత కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసు జరిగిన కొలది వారాలలోనే కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) కాంగ్రెసు, జలంధర్‌లో 1978లో జరిగింది. భారత కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రలో యీ రెండు కాంగ్రెసులు నూతన రాజకీయవిధానాల ఆవిష్కరణలుగా వామపక్ష, ప్రజాస్వామ్యశక్తులు, ప్రజానీకం తలచాయి. ఈ నూతన విధానాలకు ప్రాతిపదికలైన రాజకీయానుభవాల ముఖ్యాంశాలను సంగ్రహంగా తెలుసుకొందాము.

అంతర్జాతీయంగా, సోవియట్ యూనియన్, చైనా ప్రజారిపబ్లిక్‌ల మధ్యగల సైద్ధాంతిక బేధాభిప్రాయాలను, వలసలు, నూతన స్వాతంత్ర్య దేశాలలో సామ్రాజ్యవాదులు వినియోగించుకొని విప్లవోద్యమాల ఐక్యపోరాటాలను, ఐక్యకార్యాచరణలను విచ్ఛిన్నంచేయ కుటిలప్రణాళికలు అమలు పెట్టారు. దేశంలోని వ్యూహలు, గుత్తపెట్టుబడిబడి నియంతృత్వ వర్గాలను ప్రోత్సాహవరస్తూ ప్రమాదకర, అనిశ్చిత పరిస్థితులను సృష్టించ ప్రయత్నిస్తున్నారు. అదేకాలంలో బూర్జువా, భూస్వామ్యవర్గాల మధ్యజరుగుతున్న తీవ్ర సంఘర్షణలు, నియంతృత్వవ్యతిరేక విస్తృత వేదికను ఏర్పాటు చేయగల అవకాశాలు బహిర్గతముగుచున్నవి.

పెట్టుబడిదారి విధానాభివృద్ధి, ఆర్థిక సంక్షోభాన్ని మరింత తీవ్రతరంచేసిన ఫలితంగా, పాలకవర్గాల పార్టీలకు ప్రజలకు మధ్య గలవైరుధ్యమేగాక తదితరవైరుధ్యాలు తీవ్రమయ్యాయి. బడాబూర్జువావర్గం, మధ్య తరగతి, చిన్నబూర్జువావర్గం మధ్యగల వైరుధ్యంకూడ తీవ్రమైంది. సంక్షోపరిస్థితులలో బడాబూర్జువా వర్గం మార్కెట్‌పై పూర్తి ఆధిపత్యం సంపాదించుటంతో, వేలకొలది చిన్న పరిశ్రమలు, వ్యాపారస్తులు కనుమరుగయ్యారు. ఈ విధంగా మార్కెట్టులు కుదించుకు పోవుటతో దేశవిదేశ గుత్తపెట్టుబడిదారి వర్గాలమధ్యగల సహజవైరుధ్యం తారాస్థాయికి చేరేఅవకాశముంది.

సంక్షోభం తీవ్రమైనకొలది, భూస్వామ్య, బూర్జువావర్గాలు ప్రభుత్వాధికారంతో నిరంకుశవిధానాలతో గడ్డుదినాలను దాటప్రయత్నిస్తాయి.

అధిక పన్నులు, ద్రవ్యోల్బణం, లోటుబడ్జెట్టు విధానం, పారిశ్రామిక, వ్యవసాయ ఉత్పత్తులు, నిత్యావసర వస్తువులధరలు పెరిగిపోవుటతో, ఆర్థిక సంక్షోభం, పారిశ్రామిక, వ్యవసాయ రంగాలలో సంక్షోభానికి దారి తీస్తుంది. ఫలితంగా కార్మిక, కర్షక ఉద్యోగులు, తదితర మధ్యతరగతి వర్గాల పోరాటాలు తీవ్రమగుతవి. ప్రభుత్వం ప్రజాపోరాటాలను పోలీసు నిర్బంధ, దమనకాండలతో అణచివేయు ప్రయత్నంతో, "ఒక సమగ్రరాజకీయ సంక్షోభానికిదారి తీస్తుంది.[1]"

అభివృద్ధి చెందుతున్న నూతన రాజకీయ పరిస్థితులలో దేశంలోని అన్ని వామపక్ష ప్రజాస్వామ్యశక్తులను, గ్రూపులను, వ్యక్తులను కార్మిక, కర్షక, విద్యార్థియువజన, ఉద్యోగ, తదితర మధ్య తరుగతుల ఆర్థిక, ప్రజాసమస్యలపై ఐక్యకార్యాచరణ, పోరాటాల క్రమంలోనే సంఘటిత పరచుట, ఐక్యతనెలకొల్పుట జరుగుతుంది. ఈ లక్ష్యవిజయానికి భూమికయైన వామపక్ష ఐక్యత, సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)ల మధ్య స్నేహ, సహకార, సత్సంబంధాలు నెలకొల్పుట ప్రత్యేక ప్రాముఖ్యతగల కర్తవ్యంగా నెంచబడాలి. ఈ ప్రధానకర్తవ్యం సంయుక్త మహోద్యమాలను నిర్మించుట, దేశవ్యాపిత పోరాటాలద్వారానే సాధ్యమగుతుంది. అట్టిమహోన్నత ప్రజాపోరాటోద్యమాలను నిర్మించి, విజయవంతంగా సాగించాలంటే, రెండు ముఖ్యకమ్యూనిస్టుపార్టీలు సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)లు, నక్సలైట్లలోని కొన్నిశ్రేణులు కనీసం, ప్రజా అవసరాలపైనైనా చేరువగుటకు, నిజాయితీతో తీవ్రప్రయత్నాలు చేస్తున్నారనే నమ్మకం, విశ్వాసం ప్రజలు, అభ్యుదయ శక్తులు, కార్మిక కర్షక, మధ్యతరగతి వర్గాలలో కలిగినపుడు ఐక్యప్రజాకార్యచరణలు, ఐక్యప్రజాపోరాటాలు విస్తృత ప్రజోద్యమాలుగ విస్తరించి, విప్లవపోరాటాల వెల్లువగా ఉప్పొంగగలవు.

అట్టి ఐక్యప్రజావిప్లవకార్యచరణ, పోరాటాలకు సి.పి.ఐ. "మితవాద" సంస్కరణవాద అవగాహనలు కొన్ని, సి.పి.ఐ.(యం) అవకాశవాద పెడ, "అతివాద" పోకడలు కొన్ని, నక్సలైట్లలోని కొన్ని శ్రేణులు, "సాహసిక అతివాద" ఒంటెత్తు "వర్గశత్రువుల ఖతం", హింసా, దౌర్జన్యచర్యలు అడ్డంకులుగా ఉన్నవి. అంచేత, వామపక్ష, ప్రజాస్వామ్యశక్తుల విస్తృత ఐక్యతా నిర్మాణ పోరాటంలో భాగంగా శక్తివంతమైన సుదీర్ఘ సైద్ధాంతిక, ఆర్థిక, రాజకీయపోరాటాలు సహనం, ఓర్పు, పరస్పరం అవగాహనను పెంపొందించు మార్గంలో, నిరవధికంగా సాగించే క్రమంలోనే వామపక్ష, ప్రజాస్వామ్య సంఘటన రూపు దాల్చుతుంది.

"జీవితం జనతా ప్రభుత్వప్రజాస్వామ్య, ప్రజావ్యతిరేక విధానాలు త్వరితంగానే సి.పి.ఐ.(యం) సిద్ధాంతాల నిస్సారాన్ని బహిర్గతం చేస్తూ సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)ల ఐక్యకార్యచరణను, ముఖ్యంగా కార్మిక, కర్షక, మధ్యతరగతి, ఉద్యోగులసమస్యలను

---

*1. రాజకీయ తీర్మానం (1978) సి.పి.ఐ.(యం) జలంధం7*

ముందుకు తెచ్చింది. భవిష్యత్తులో మరింత బలపడుట తప్పనిసరి. అయితే "సి.పి.ఐ.(యం) జనతా పార్టీతో తమసఖ్యతను కాంగ్రెసు నియంతృత్వానికి వ్యతిరేకంగా పోరాడుటకు "ఎత్తుగడమాత్రంగా" సమర్థించుకొన్నది. కాని మనదేశంలో నియంతృత్వానికి వ్యతిరేకంగా పోరాటంలో కాంగ్రెసులోని ప్రజాస్వామ్యశక్తులను బలపరచుటను సి.పి.ఐ.కూడ "ఎత్తుగడమాత్రంగానే చెప్పుకొని సమర్థించుకొన్నా, తదనంతర పరిణామాలు, నియంతృత్వ వ్యతిరేక ప్రజాసామాన్యపు రక్షణపోరాటం సి.పి.ఐ. లాగ ఏదోఒక బూర్జువాపార్టీపై ఆధారపడి చేయజాలమనికూడ జీవితం తేటతెల్లం చేసింది.

## 1.౨. భటిండా, జలంధర్ సి.పి.ఐ., పి.పి.ఐ.(యం) పార్టీల కాంగ్రెసుల విధానాల సారూప్యతా, భిన్నత్వాల ఐక్యతాంశాలు :

పెట్టుబడిదారి పంథాలో ఆర్థికవిధానాభివృద్ధి, బూర్జువారాజకీయాలు సంక్షోభంలో పడినందున దేశాన్ని ఏబూర్జువవర్గపార్టీ సంక్షోభాన్నుండి రక్షింపజాలని పరిస్థితి ఏర్పడింది. ప్రజాస్వామ్యం నిరంకుశాత్వానికి బలి అయ్యే ప్రమాదం ఏర్పడింది. ఈ సంక్షోభాన్నుండి బయటపడుటకు, సామ్రాజ్యవాద, గుత్తపెట్టుబడిదారి, భూస్వామ్య వ్యతిరేక ఆర్థికాభివృద్ధి పంథాను చేబట్టుటయే మార్గమని ప్రజాస్వామ్యవర్గాలు తలంచుతున్నవి. అట్టి పంథాను కోరే వామపక్ష, ప్రజాస్వామ్య, తదితర శక్తులన్నీ సంఘటితమై నిజమైన జాతీయ ప్రజాస్వామ్యంగా రూపొందే ప్రత్యామ్నాయాన్ని రూపొందించితేనే అది సాధ్యమౌతుంది. వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయమే జాతయ ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయం. అదే జనతా ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయమని సి.పి.ఐ. విశ్వాసం. ప్రారంభంలో సి.పి.ఐ.(యం)నేరుగా జనతా ప్రజాస్వామ్యమొక్కటే మార్గమంటూ, అందులో ప్రాథమిక, ఉన్నతరశను గుర్తించనిరాకరించింది. సి.పి.ఐ. 1980 దశకంలో యీ విధమైన అవగాహనకు వచ్చి, ఆచరణను ఏకపక్షంగా సాగించింది.

"వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయమే జాతీయప్రత్యామ్నాయం" అని. భటిండా రాజకీయతీర్మానం స్పష్టంచేసింది. "అదే దేశాన్ని ప్రజలను సంక్షోభాన్నుండి బయటపడవేయగలదని" పేర్కొన్నది. "ఈదృక్పథం జనతా ప్రభుత్వపాలన కొనసాగింపును, కాంగ్రెసు పాలన పునరుద్ధరణను రెండింటిని త్రోసిబుచ్చుతున్నదని" సరిగానే చెప్పినా "నేడు భారతప్రజానీకంలో అత్యధిక భాగం యీ దృక్పధానికి చేరువగా వస్తున్నారని,[1]" 1977లో అనేక రాష్ట్రాలలో పాలక కాంగ్రెసు అధికారన్ని కోల్పోవుటను, జనతా విజాయులను అతిగా సి.పి.ఐ. అంచెనా వేసింది. దేశమంతావిస్తృతి, విస్తరణ, ప్రజాబలాన్నియింకాకలిగి ఉన్న కాంగ్రెసు మినహా, మరోబూర్జువా పార్టీ లేక వామపక్ష ప్రజాస్వామ్యశక్తిగాని లేదు. అట్టిది సత్వరం రూపొందే పరిస్థితి రాజకీయాలలో కానరానప్పుడు, అత్యవసరపరిస్థితుల కాలంలో ప్రభుత్వ నిర్బంధ హింసాచర్యలకు ప్రతిగా ప్రజలు యిచ్చిన యాదృచ్ఛిక తీర్పు ఫలితంగా లభించిన ప్రజా విజయాలను,

---

1. *రాజకీయతీర్మానం. 11వ సి.పి.ఐ. పార్టీకాంగ్రెసు. భటిండా. ఏప్రియల్ 1978లో ఆమోదించబడింది. (ఆంగ్లంలో) సి.పి.ఐ. పబ్లికేషన్. పే. 17.*

ప్రతిపక్షాలవైపుకు ప్రజాసామాన్యం రాజకీయచైతన్యంతో యిచ్చిన తీర్పుగా అతిగా అంచెనా వేసారనేది సత్యం, తదనంతరదశకపు ప్రారంభ ఎన్నికల ఫలితాలేరుజువు చేసాయి. దేశ్వ్యాప్తంగా కాంగ్రెసును ఎదుర్కోనగలిగిన మరోబూర్జువా రాజకీయ శక్తిగాని లేక వామపక్ష, ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయశక్తి గాని ఏర్పడనపుడు, అట్టి అంచెనా వేయుట, వాస్తవ పరిస్థితిని చూడలేక పోవుటను మాత్రమే తెలియజేస్తుంది.

ఈ విశాల దృక్పథంలో వామపక్ష, ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయానికై జరిగే పోరాటంలో ప్రాధాన్యత వహించే అంశాలను, భటిండా రాజకీయ తీర్మానం యిలాపేర్కొన్నది. అవి: 1) జాతీయ ప్రజాస్వామ్య, ప్రజావ్యతిరేక జనతా పార్టీ ప్రభుత్వంపై, కాంగ్రెసు తదితర బూర్జువాపార్టీల విధానాలపై రాజీలేని పోరాటం, 2) జనతా, కాంగ్రెసులరెండింటి వ్యతిరేక ప్రత్యామ్నాయం రూపొందించే పోరాటంలో బూర్జువా విధానాలు ఏరూపంలో ఉన్నా బహిర్గతంకావించి, ప్రజాచైతన్యం కలిగించాలి, 3) వామపక్షశక్తుల ఐక్యతకై పోరాడుటతో పాటు వామపక్ష, ప్రజాస్వామ్య, తదితరశక్తుల విస్తృత ఐక్యతను నిర్మించుట, 4) ప్రపంచ సోషలిస్టు వ్యవస్థతో స్నేహ, సౌభాతృత్వాలను పెంపొందించుతు, సామ్రాజ్యవాద వ్యతిరేక సోవియట్ విధానాలను బలపరచుటను తీర్మానం పేర్కొన్నది.[1]

ఈ కర్తవ్య నిర్వహణకై సి.పి.ఐ., ప్రజాసంఘాలు వామపక్ష, ప్రజాస్వామ్య జాతీయ ప్రత్యామ్నాయాన్ని నిర్మించుటకై నిరవధికంగా, ఆచరణ చొరవకు అత్యధిక ప్రాధాన్యత నిచ్చి, రాబోవు కాలంలో పనిచేస్తుందని తీర్మానించింది. ఇంకా, సి.పి.ఐ అదే కాలంలో సి.పి.ఐ(యం) సైద్ధాంతిక, రాజకీయ అవకాశవాద అవగాహనలకు వ్యతిరేకంగా పోరాడుతూ, రెండు పార్టీల మధ్య అమోదం గల ముఖ్యాంశాలను నొక్కి చెప్పుతు సంయుక్త కార్యాచరణను రూపొందించుతుంది. ఏ పార్టీ ఐక్య కార్యాచరణకు ముందుగానే షరతులను పెట్టి ఆచరణను అసాధ్యం చేయరాదు. ప్రజాసమస్యలపై ఐక్యవర్గ కార్యాచరణ అవసరం అది సాధ్యము. అదేవిధంగా జాతీయ, అంతర్జాతీయ అంగీకృత సమస్యలపై సంయుక్త కార్యాచరణతోపాటు, కార్మిక, కర్షక సమస్యలపై ఐక్యకార్యాచరణ అవసరము. అట్టి ఐక్యత లేనిదే బూర్జువావర్గానికి వ్యతిరేకంగా శ్రామికవర్గాలకు అనుకూలంగా వర్గశక్తుల బలాబలాలలో మార్పులు తెచ్చుట సాధ్యం కాదు.

సి.పి.ఐ తన యెడల సి.పి.ఐ(యం) వహించుతున్న విచ్ఛిన్నకర వైఖరి, శతృభావ ప్రకటనలకు ముగింపు పలకమాని, విస్తృత ఐక్య ప్రజాకార్యాచరణలను పెంపొందించుటకు, ఐక్యతకు ఎట్టి షరతులు విధించవలదని విజ్ఞప్తి చేసింది.[2]

వామపక్ష పార్టీలైన రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ, ఫార్వర్డ్ బ్లాక్, పీజెంట్సు అండ్ వర్కర్స్ పార్టీ, లాల్ నిషాన్ పార్టీ, రివల్యూషనరీ కమ్యూనిస్టుపార్టీ, తదితర వామపక్ష

---

*1. రాజకీయతీర్మానం, 11వ సి.పి.ఐ. పార్టీకాంగ్రెసు, ఏప్రియల్ 1978లో ఆమోదించబడింది. (ఆంగ్లంలో) సి.పి.ఐ. పబ్లికేషన్. పే. 18.*

*2. -- అదే --- పే. 20-21*

పార్టీలు, గ్రూపులు అన్నీ ఐక్యఆర్థిక, రాజకీయ, కార్యాచరణలలో సమీకరించు ప్రయత్నం చేయాలి. ఈ పునాది వామపక్ష ఐక్యతపై, దేశంలోని ప్రజాస్వామ్య పార్టీలను, వివిధ ప్రాంతీయ పార్టీలు, ప్రజావుద్యమాలను, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతను నిర్మించి, ఐక్యపోరాట కార్యాచరణను పెంపొందించాలి. అందుకు అవేసాధనాలు కూడా కాగలవు.

"ఈ మహత్తర కర్తవ్యనిర్వహణకు నేటి పరిస్థితులలో వామపక్షపార్టీల ఐక్యత, కమ్యూనిస్టుపార్టీల ఐక్యత కార్యాచరణలు మాత్రమే చాలవు. అన్ని వామపక్షపార్టీల, ప్రజాస్వామ్యశక్తుల ఐక్యకార్యాచరణతో పాటు, ఈ కర్తవ్య సాధనకు వివిధ బూర్జువా పార్టీలను అనుసరించే ప్రజాసామాన్యాన్ని ఐక్యకార్యాచరణలో ఆర్థిక, రాజకీయ సమస్యలపై సమీకరించగలిగినపుడే పూర్తి విజయం లభించగలదు.

నేడున్న "రెండు కాంగ్రెసులలో యేదీ వామపక్ష ప్రజాస్వామ్య శక్తి కానప్పటికీ, ప్రజాస్వామ్య వామపక్ష శక్తులు తరతమభేదాలతో రెండింటిలోను వున్నవి. అవి మన సహచరులు కాగల అవకాశాలున్నవి. మన సంయుక్త, ఐక్యకార్యాచరణోద్యమాలలోనికి, కాంగ్రెసు, జనతా పార్టీలలోని వామపక్ష, ప్రజాస్వామ్య శక్తులను విజయవంతంగా ఆకర్షించగలగాలి. కొన్ని ప్రాంతీయపార్టీలను అనుసరించుతున్న ప్రజాసామాన్యాన్ని, వామపక్ష, ప్రజాస్వామ్యశక్తులను ఐక్యకార్యాచరణ, పోరాటాలలోనికి, చివరకు ఐక్యసంఘటనలోనికి ఆకర్షించగల అవకాశాలు ఎక్కువగానే వున్నవి.[1]

కార్మికవర్గ ఐక్యత, కార్మిక కర్షక ఐక్యత ఐక్యకార్యాచరణకు, ఐక్యసంఘటనా నిర్మాణానికి, వామపక్ష ప్రజాస్వామ్య జాతీయ ప్రత్యామ్నాయ నిర్మాణంలో కీలకాంశమని గుర్తించాలి.

"రాబోవుకాలంలో రాజకీయ అస్థిరత, రాజకీయ నూతన కలయికలు, రాజకీయ పరిస్థితులలో వూహించనరీతిలో తీవ్రమలుపులు, మెలికలు ప్రత్యక్షమయ్యే అవకాశాలున్నవి. సామ్రాజ్యవాదశక్తులు భారతదేశాన్ని అస్థిరతలో ముంచివేయుటకు తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నవి. దేశరాజకీయ సంక్షోభాలలో కలుగజేసుకొని; నూతన వలసవిధానాన్ని ప్రవేశపెట్టుటకు అనుకూల పరిస్థితులను సృష్టించుటకు ప్రయత్నిస్తున్నవి. అందుకు యే భూస్వామ్య, బూర్జువావర్గాల కలయికనైనా తనలక్ష్యాల సాధనకు తోడ్పడే దానిని బలపరచుటకు, నిర్ణయాత్మక చర్యలను చేబట్టుటకు సిద్ధంగా వేచియున్నది."[2]

ఈ అవగాహనకు, తూర్పు పాకిస్తాన్ – భారతదేశపు సంఘర్షణల కాలంలో అమెరికా తన సప్తమనౌకాదళాన్ని పసిఫిక్ మహాసముద్రము నుండి బంగాళాఖాతంలోనికి పాకిస్తాన్‌ను సైనికంగా బలపరచుటకు ఆజ్ఞలు జారీచేయుటకు మించిన మరోతార్కాణం అవసరంలేదు.

అంచేత, వామపక్ష ప్రజాస్వామ్య శక్తుల అత్యంత రాజకీయ అప్రమత్తతను

1. రాజకీయతీర్మానం, 11వ సి.పి.ఐ. పార్టీకాంగ్రెసు, ఏప్రియల్ 1978లో ఆమోదించబడింది. (ఆంగ్లంలో సి.పి.ఐ. పబ్లికేషన్. పే. 21.
2. -- అదే --- పే. 27.

పెంచుకొంటూ, అభివృద్ధి నిరోధకశక్తుల ఎత్తులను సకాలంలో గ్రహించగలశక్తిని అభివృద్ధి చేసుకొంటూ. పరిస్థితులలో వచ్చే మలుపులు, మెలికలు తెలుసుకొని సకాలంలో రంగ ప్రవేశం చేసి. అభివృద్ధి నిరోధకుల ఎత్తులను చిత్తు చేయాలి.

"ఇందుకు, ప్రజలు ఐక్యకార్యాచరణలోనికి దిగాలి, ఆర్థిక, రాజకీయ, సామాజిక సమస్యలపై కదలాలి. అన్ని పార్టీలకు చెందిన ప్రజాసామాన్యం అదే క్రమంలో ఐక్యత పెంపొందించాలి. ఈ పోరాటాల నినాదాలనుండి సామాన్య రాజకీయ కార్యాచరణ వేదిక వుద్భవిస్తుంది. ఆర్థిక, రాజకీయసంక్షోభ పరిస్థితులు బూర్జువా రాజకీయ పార్టీల ఆర్థిక నియంత్రణను అమలు చేయుటలోని అసమర్థత, ప్రజోద్యమాలకు విస్తృత రాజకీయపరిధిని, దృక్పధాన్నియిస్తుంది.[1]

ఈ క్రమంలో ప్రజాసామాన్యం త్వరితగతిని రాజకీయచైతన్యంతో ప్రభావితులగుతారు. ప్రజాసంఘాల విస్తృతి, విస్తరణ, పోరాటశక్తి అత్యంతవేగంగా జరుగుతుంది. వామపక్ష ప్రజాస్వామ్య జాతీయ ప్రత్యామ్నాయాన్ని ప్రజోద్యమాలు వెదుకుట ప్రారంభమగుతుంది. వామపక్ష, ప్రజాస్వామ్య పార్టీలు, బూర్జువా పార్టీలలోని అభ్యుదయ, పురోగామి వర్గాలు యీ ప్రత్యామ్నాయం వైపు మొగ్గుతారు. నూతన పరిస్థితులలో అట్టి వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయాన్ని నిర్మించే ప్రయత్నం, జనతా పార్టీ, రెండు కాంగ్రెసులు అనుసరించే పెట్టుబడిదారి విధానాభివృద్ధికి భిన్నంగా ప్రత్యామ్నాయ పంథాకై జరుగు పోరాటంలో దాని విజయం, ఆమోదాలతో పూర్తి అగుతుంది. మౌలిక ఆర్థిక, సామాజిక మార్పులు, నేటి సంక్షోభ పరిస్థితుల పరిష్కారానికి అత్యవసరమని సి.పి.ఐ విశ్వసిస్తున్నదని తీర్మానం పునరుద్ఘాటించింది.

ఈ అవగాహనలతో సి.పి.ఐ 19 అంశాల కార్యక్రమ వేదికను, వామపక్ష ప్రజాస్వామ్య జాతీయ ప్రత్యామ్నాయాన్ని, ప్రాతిపధికగా ప్రజానీకం ముందుంచింది.

### 1.3 వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనపై సి.పి.ఐ(యం) జలందర్ పార్టీ కాంగ్రెసు అవగాహన.

భటిండా, సి.పి.ఐ. కాంగ్రెసు తరువాత కొద్దిరోజులకే జరిగిన సి.పి.ఐ(యం) జలందర్ పార్టీ కాంగ్రెసు వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనపై యిచ్చిన అవగాహన యీ క్రింది విధంగా వున్నది.

కాంగ్రెసు ఇందిరాగాంధీ నాయకత్వంలో అవలంభించిన ఫాశిస్టు నియంతృత్వ పోకడలను, అత్యవసర పరిస్థితి ప్రకటించి పౌరహక్కులను కాలరాచి జరిపిన హింసా, దౌర్జన్య, పోలీసు దమనకాండలకు కోపోద్రిక్తులైన ప్రజాసామాన్యం, మూడుదశాబ్దాల కాంగ్రెసు కేంద్ర పాలనాధికారాన్ని, ప్రభుత్వాన్ని జనతా పార్టీకి కోల్పోవుటయేగాక, మూడుమాసాల తరువాత జరిగిన రాష్ట్ర అసెంబ్లీల ఎన్నికలలో ఎనిమిది రాష్ట్రాలలో

---

1. *రాజకీయతీర్మానం, 11వ సి.పి.ఐ. పార్టీకాంగ్రెసు, భటిండా. ఏప్రియల్ 1978లో* ఆమోదించబడింది. (ఆంగ్లంలో) సి.పి.ఐ. పబ్లికేషన్. పే. *27-28.*

కాం(గ్రెసు పాలనకు స్వస్తిచెప్పింది. పంజాబులో అకాలీ-జనతాపార్టీల సంకీర్ణ ప్రభుత్వం మిగిలిన రాష్ట్రాలలో వివిధ రూపాల ఐక్యసంఘటనల ప్రభుత్వాలుయేర్పడినవి.

ఈవిజయాలన్నీ సి.పి.ఐ(యం) కాం(గ్రెసు విధానాలకు వ్యతిరేకంగా ప్రజలు యిచ్చిన తీర్పుగానే తక్కువగా అంచెనావేయరాదని, ఎన్నికలలో ఒక బూర్జువాపార్టీకి వ్యతిరేకంగా మరొక బూర్జువా పార్టీ విజయం మాత్రమే కాదని, నియంతృత్వానికి, దాని అత్యవసరపరిస్థితి ప్రకటన, దాని అమలుకు వ్యతిరేకంగా ప్రజాశక్తుల చైతన్య విజయంగా నెంచాలనే అభిప్రాయాన్ని వెల్లడించింది. అదే కాలంలో వామపక్ష ప్రజాస్వామ్య శక్తులను విజయమార్గంలో నడుపుటలో వివిధ కమ్యూనిస్టు శ్రేణులవైఫల్యంగా పేర్కొనుట పూర్తి సత్యం. రాజ్యాంగ వ్యతిరేక చర్యలకు, నిరంకుశపాలన, అధికారదుర్వినియోగానికి, పోలీసు హింసా, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా ప్రజలు యిచ్చిన తీర్పు అన్నది. నిరంకుశత్వానికి వ్యతిరేకంగా విస్తృతప్రాతిపదికపై జరిగిన ప్రతిఘటనాశక్తిని బలపరచుటయే తక్షణ కర్తవ్యంగా నేటి పరిస్థితులలో చేబట్టాలని కోరింది.

ఆర్థిక సంక్షోభం రాజకీయ, పార్లమెంటరీ రంగాలకు వ్యాపించుట బూర్జువా, భూస్వామ్యవర్గాలకు తమ ఐక్యతను కాపాడుకోలేని స్థితి, అంతర్గత పోరాటాలు ఎక్కువగుటను తెలియజేస్తున్నదని, సి.పి.ఐ(యం) పార్టీ కాం(గ్రెసు విశ్లేషించింది. కాం(గ్రెసు రెండుగా చీలిపోయింది. ఒకరి నొకరు సంస్థనుండి బహిష్కరించుకొన్నారు. బూర్జువా, భూస్వామ్య పార్టీయైన కాం(గ్రెసు ఐక్యతతో యింక యేమాత్రం వొక్కటిగా వ్యవహరించజాలదన్నది చారిత్రిక సత్యమగుతుంది.

పాలక జనతాపార్టీ రాజకీయ సమగ్రసైద్ధాంతిక, నిర్మాణ, అవగాహనలను రూపొందించుకొనవలసివుంది. ఈ విషయాలపై ఆపార్టీలో అంతర్గత వివాదాలు, తమ పూర్వపార్టీల యెడల విశ్వాస ప్రకటనలు, ఎవరు బాణిని వారు కొనసాగిస్తున్నారు. అధికార దుర్వినియోగం, లంచగొండి తనం, ఉద్యోగాల నియామకాలంలో ఆశ్రిత బంధువర్గాల పక్షపాతము, స్త్రీలపై అత్యాచారాలు, దోపిడి, హత్యలు, నిందా ప్రతినిందలు విశృంఖలమయ్యాయి.

పాలక, ప్రతిపక్షపార్టీలు తీవ్ర సంఘర్షణలకు లోనగుట, బూర్జువావర్గం తీవ్రసంక్షోభంలో మునిగి పోవుటను తెలియజేస్తుంది. ఈ సంఘర్షణలు అత్యవసరపరిస్థితి ప్రకటన కాలంలో ప్రభుత్వ నిరంకుశపాలనకు విస్తృత ప్రతిఘటనను రూపొందించుటకు సహాయపడినవి. నేటి పరిస్థితులలో కూడ కొంత ముఖ్యపాత్ర వహించగలవు.

"కాం(గ్రెసు నాయకత్వం ఇందిరాగాంధి అత్యవసరపరిస్థితిని నేడు కూడ సమర్థించుకొంటూ, అవే విజయాలని పొగడుకొంటూ వుంది. అంతేగాక పొంచుకొని వున్న అనుచరవర్గ ప్రమాదాన్ని చూడలేకుండా వుంది. జనతాపార్టీలో కూడ నియంతృత్వ పోకడలు గల శక్తులు కొన్ని వున్నవి. పార్టీ నైజాన్ని బట్టి యిది సహజమే అధికారానికి అంటిపెట్టుకుని వుండాలనే తత్వం పెరిగితే, యీ శక్తులు మరింతగా పెరుగుతవి."[1] అని సి.పి.ఐ(యం) అవగాహనగా వుంది.

కాం(గ్రెసులో చీలిక ఇందిరాగాంధీ తీసుకొచ్చినదే అయినా మాతృసంస్థబలం అంతా

1. రాజకీయతీర్మానం,(1978) సి.పి.ఐ(యం) జలందర్ పార్టీ కాం(గ్రెసు ఆమోదించినది. పే. 17.

ఆమె వెనుకలేదు. ఆమె నియంతృత్వాన్ని బలపరిచిన కొన్ని వర్గాలు సైతం ఆమెను వదలి వెళ్ళాయి. అయినప్పటికీ ఆమెయే నియంతృత్వప్రధానశక్తి, అత్యవసరకాలంలో జరిగిన దూరంతాలకు ఆమె యేమాత్రం పశ్చాత్తాపం చెందలేదు. అదేవిధంగా పశ్చాత్తాపం ప్రకటించని వర్గాలన్నీ ఆమె వెనుకనే చేరాయి.

పరిస్థితుల ప్రధాన లక్షణాలను జలందర్ పార్టీ కాంగ్రెసు, నాడు కాంగ్రెసు ఎన్నికలలో వోడిపోవుటతో నియంతృత్వ ప్రమాదం తప్పిపోయిందన్నిది. పౌరహక్కులు, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం పునరుద్ధరించబడినవి. నియంతృత్వ వ్యతిరేక ప్రతిఘటన, ఎన్నికల పోరాట విజయాలు, దేశంలోని రాజకీయశక్తుల బలాబలాలలో మార్పు శ్రామికవర్గాలకు అనుకూలంగా లేదు. అంటే బూర్జువాపార్టీల ప్రభావంలోని స్థితి నుండి ప్రజాసామాన్యం బయటపడి, ప్రత్యామ్నాయ నాయకత్వాల చుట్టూ సమీకరించబడలేదు.

ఇటీవల ఎన్నికలలో కూడ 1971 ఎన్నికలలో వలెనె రెండు బూర్జువా పార్టీలైన కాంగ్రెసు, జనతాపార్టీల చుట్టూనే ప్రజలు సమీకరించబడ్డారు. అత్యవసరపరిస్థితిని నిరంకుశత్వానికి వ్యతిరేకంగా, పోరాడిన ప్రాంతాలలో ప్రజలు వొక బూర్జువా పార్టీనుండి మరొక బూర్జువా పార్టీకి మారారు. గుజరాత్, బీహారు పోరాటాలు, డిల్లీ ప్రదర్శనలు ప్రజలపై పెద్ద ప్రభావాన్ని కలుగజేసాయి.

ఈ పరిస్థితులలో కార్మిక, కర్షక, విద్యార్థి, నిరుద్యోగుల తక్షణ సమస్యలపై పోరాటాలు, నియంతృత్వవ్యతిరేక ప్రజాస్వామ్య పోరాటాలుగా రూపాంతరం చెందుతవి. అంటే ఆర్థిక పోరాటాలు. శాంతియుతంగా, ప్రజాస్వామ్య రాజ్యాంగ సంస్కరణలకై జరిగే పోరాటాలుగానే పరిమితమై వుండక అనిశ్చిత పరిస్థితులలో విప్లవ పోరాటాలుగా అభివృద్ధి చెందే అవకాశాలున్నవి. అట్టి పోరాటాలు కార్మికవర్గ నాయకత్వంలో వామపక్ష, ప్రజాస్వాసంఘటన సమీకరణలలోనే విజయవంతం కాగలవు.

ఐక్యసంఘటనపై సి.పి.ఐ(యం) ఏడవపార్టీ కాంగ్రెసు ఆమోదించిన కార్యక్రమం "జనతా ప్రజాస్వామ్య విప్లవ లక్ష్యాన్ని చేరుటకు, అన్ని దేశభక్త ప్రజాస్వామ్యశక్తుల విప్లవ ఐక్యతను, కార్మిక, కర్షక ఐక్యత పునాదిగా నిర్మించుట, సంక్లిష్టమూ, సుదీర్ఘమైన పంథాలో "పయనించుటగా వివరించింది." వివిధ ప్రాంతాలలో భిన్న పరిస్థితులలో దాని నిర్మాణానికి పోరాదవలసివుంటుందని, వివిధ వర్గాలు, వాటిలోని వివిధ శాఖలు విప్లవపోరాట వివిధ దశలలో వివిధ వైఖరులు అవలంభించుతారని[1]" వివరించింది.

ఇంకా, "అంచెత మారే రాజకీయ పరిస్థితులలో పార్టీ త్వరితంగా తాత్కాలిక నినాదాలను రూపొందించవలసివుంటుంది. కార్మిక కర్షక మైత్రిపై ఆధారపడిన నూతన ప్రజాస్వామ్య రాజ్యాంగాన్ని, ప్రభుత్వాన్ని నేటి పాలకవర్గాలను పారద్రోలి యేర్పరచాలనే లక్ష్యాన్ని ప్రజల ముందుంచుతు వేగంగా ప్రజలకు సంక్షేమపథకాలను, సహకారాలను అందించే కనీస కార్యక్రమాన్ని ఆమోదించి, అమలుకు ప్రయత్నించే ప్రభుత్వమేర్పాటును

---

*1. కార్యక్రమం (1964) సి.పి.ఐ(యం) 7వ. కాంగ్రెసు ఆమెదించినది. పేరా. 111.*

పార్టీ చేబట్టుతుంది.[1] ప్రజలను సమీకరించుటకు తాత్కాలిక నినాదాలను, వేదికలను ప్రథమ దశలో రూపొందించవలసివుంటుంది. ఇవన్నీ జనతా ప్రజాస్వామ్య సంఘటనను వివిధ దశలలో వివిధ పోరాటాల ద్వారా రూపొందించే క్రమమార్గంలోనే జరుగుతవి.

"మా పార్టీ శక్తివంతమైన వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనను అనేక సంవత్సరాలుగ నిర్మించ ప్రయత్నించుచున్నది. పశ్చిమ బెంగాలులో గణనీయమైన విజయాల అనంతరం, కేరళ, త్రిపురలలో విజయాలను పొందాము, ఈ మూడు రాష్ట్రాలలో మా నాయకత్వంలోని సంఘటన, కాంగ్రెసు వ్యతిరేక రాజకీయాలకు నాయకత్వం వహించింది. ముఖ్యంగా పశ్చిమబెంగాల్ త్రిపురలలో యీ విధంగా జరిగింది. కేరళలో మా వామపక్ష సంఘటన, కాంగ్రెసునాయకత్వంలోని సంఘటనతో పోరాడుట జరిగింది. ఇతర రాష్ట్రాలలో ప్రధాన చీలిక రెండు బూర్జువా పార్టీలుగా యేర్పడినందున పై మూడు రాష్ట్రాలలోనిది గుణాత్మకమైన రాజకీయ పరిణామం, అట్టి పరిణామాన్ని యితర రాష్ట్రాలలో కొని వచ్చుటకే మా ప్రయత్నం. దీనికి ప్రతిగానే ఇందిరాగాంధి వామపక్షసంఘటనను బ్రద్దలు కొట్టుటకు, కుటిల, ద్రోహ మార్గాన్ని అనుసరించి, "మితవాద" కమ్యూనిస్టుపార్టీ సి.పి.ఐ.ని తమకు అనుకూలంగా త్రిప్పుకొందని"[2] జలందర్ తీర్మానం పేర్కొన్నది.

ఈ వామపక్ష, ప్రజాస్వామ్య సంఘటనా నిర్మాణ పోరాటంలో వర్గశక్తుల బలాబలాలలో మార్పును తీసుకొని వచ్చి, ప్రజలు రెండు బూర్జువా పార్టీలలో వొకదానిని ఎన్నుకొనేమార్గం తప్పమరోమార్గం లేని పరిస్థితి నుండి తప్పించుటకు చేయు ప్రయత్నమిది. పురోగమనానికి వామపక్ష, ప్రజాస్వామ్యశక్తులన్నిటిని సమీకరించి, భవిష్యత్తులో జనతా ప్రజాస్వామ్యాన్ని రూపొందించు కర్తవ్యాన్ని కార్మికవర్గ నాయకత్వం చేబట్టగల ఐక్యసంఘటనను రూపొందించుటకు మార్గాన్ని సుగమం చేయుటకు ఉద్దేశించబడింది. వామపక్ష, ప్రజాస్వామ్యసంఘటన కార్మికవర్గ నాయకత్వంలో ఏర్పడిన ఒక ఎన్నికల సంఘటన మాత్రంగానే యెంచరాదు. ఆర్థిక విధానాన్నింటిని తమ గుప్పిటలో పెట్టుకొన్న అభివృద్ధి నిరోధకవర్గాలను వేరు చేసి పురోగమించే పోరాట శక్తులను సమీకరించే సంఘటనా నెంచాలి.

"మా మిత్రుల వర్గనైజవు వూగిసలాటలతో వామపక్ష, ప్రజాస్వామ్యశక్తులతో ఐక్యసంఘటనను యేర్పరచుటలో మేము క్రిందా, మీదా అనేకసారులు పడ్డాము. మధురై 9వ, పార్టీ కాంగ్రెసు తీర్మానం "సాంప్రదాయ వామపక్షపార్టీలలో అత్యధికులు, గ్రూపులు వర్గపోరాటం తీవ్రమగుటతో ఆందోళన వొకవైపున, పాలకవర్గాల రాజకీయసైద్ధాంతిక ప్రభావాలవొత్తిడి మరొకవైపున ఎక్కువగుటతో 1959లలోని కాంగ్రెసు వ్యతిరేక ప్రజాస్వామ్య సంఘటననుండి జారిపోవుట ప్రారంభించారు. సి.పి.ఐ. కాంగ్రెసు వైపు మొగ్గుచూపుటతో, సోషలిస్టుపార్టీ "గ్రాండ్ అలయెన్సు"తో చేతులు కలుపుట వామపక్ష ఐక్యతకు చరమగీతం పాడబడింది.

---

*1.* కార్యక్రమం *(1964)* సి.పి.ఐ(యం) *7వ,* కాంగ్రెసు ఆమెదించినది. పేరా. *112.*

*2.* రాజకీయతీర్మానం,*(1978)* సి.పి.ఐ(యం) జలందర్‌పార్టీ కాంగ్రెసు ఆమోదించినది. పే. *34.*

ప్రజాసంఘాల వుద్యమాలు పురోగమించిన కొలది అనేక వామపక్షాలలో సుముఖ స్పందనలు పొడచూపినవి. ఎ.ఐ.టి.యు.సి., హెచ్.యం.యస్., ఐ.యన్.టి.యు.సి., సి.ఐ.టి.యు.., యు.టి.యు.సి.ల సంయుక్త కార్యాచరణలు యెక్కువయ్యాయి. అనేక ఉద్యోగుల సంఘాలలో ప్రజాచైతన్యం పెరిగి, సుముఖ స్పందనలతో ప్రజాపోరాటాలలో ప్రజలు పాల్గొన్నారు.

అనేక ఐక్యకార్యాచరణల శిఖరాగ్రంగానే చారిత్రాత్మక రైల్వే వర్కర్స్ సమ్మె పోరాటం జరిగింది. అనేక కేంద్ర కార్మిక సంఘాల అపూర్వ ఐక్యకార్యాచరణల ఫలితంగా ఆపోరాటం రూపొందింది. రైల్వే కార్మికులకు మద్దతుగా మే 15న అఖిలభారతబంద్, ప్రదర్శనలను ఇందిరాగాంధి ప్రభుత్వం ఘోరనిర్బంధ, హింసాకాండలతో అణచివేయబడినా ఐక్యతకు, సమిష్టి పోరాటానికి చిహ్నంగా నిలబడింది. దీని తరువాత బ్రహ్మాండమైన వేతన స్తంభన వ్యతిరేక కన్వెన్షన్‌లో కార్మికులు, ఉద్యోగులు లక్షల కొలది పాల్గొన్నారు. వామపక్ష, ప్రజాస్వామ్య వాదుల మద్దతు వీరి పోరాటాలకు ప్రోత్సాహాన్ని యిచ్చింది.

"మా పార్టీ 1973లో అనేక అతివాద పార్టీలను వొక వేదిక పైచేర్చుటకు చొరవ తీసుకొంది. మేము సోషలిస్టుపార్టీతో, యితరపార్టీల నాయకులతో సంప్రదింపులు జరువుటతో, వివిధ వామపక్షలు సమావేశమై సమిస్టికార్యక్రమాన్ని, ఆచరణ, ఆందోళనలను కలసి చర్చించారు. సి.పి.ఐ తో సహా అన్ని వామపక్ష పార్టీల సంయుక్త సమావేశం 1974 ప్రారంభంలో ఆమోదించబడిన "వేదిక" వామపక్ష, ప్రజాస్వామికవాదుల ఐక్యతాపోరాటంలో ప్రధానమైలు రాయిగా చెప్పవచ్చును. వామపక్ష పార్టీల యీ ఐక్యతే రైల్వే కార్మికుల సమ్మె విజయానికి తోడ్పడింది. మే 15న రైల్వే కార్మికులను బలపరస్తూ జరిపిన, చారిత్రాత్మక బంద్ కార్మికవర్గ ఐక్యతను చాటిచెప్పింది.[1]

వామపక్ష ప్రజాస్వామ్య శక్తుల ఐక్యత, పాత్రలపై సి.పి.ఐ(యం)కు గల నిర్ధిష్ట అభిప్రాయాలు యిలా వున్నవి.

ఇందిరాగాంధి నాయకత్వంలోని జాతీయవర్గాలు యింకా అత్యవసర పరిస్థితుల కాలంనాటి నిరంకుశపాలనను బహిరంగంగా సమర్థించుకొంటున్నవి. ఈ శక్తుల వ్యతిరేకంగా వామపక్ష, ప్రజాస్వామ్యశక్తులు ముందు పీఠీన నిలబడి పోరాడాయి. అట్టి నిరంకుశ శక్తులు తిరిగి తలెత్తుకుండా పోరాడుటకు సాధ్యమైనంత విస్తృత ప్రతిఘటనను కొనసాగించుటకు మార్గాలు వెతుకుచున్నవి.

వామపక్ష ప్రజాస్వామ్యశక్తులు ఆర్థికవేదికను ఆమోదించనివారిని కూడ సమీకరించుటకై, ప్రజాస్వామ్య సంస్కరణల ద్వారా పురోగమించుదామనే శక్తులను బలపరస్తూ, అట్టి వేదిక నిర్మాణానికి పోరాడుతున్నవి. అవి తమదాడి, వాడిని గుత్త బడా పెట్టుబడిదారి వర్గాలు, భూస్వాములపై కేంద్రీకరించినవి. అదే కాలంలో ప్రభుత్వ వూగిసలాటను, దిగజారుదుతనాన్ని, మితవాద శక్తులు ప్రజలపై చేసే దాడులను ప్రతిఘటించుచున్నవి.

---

1. *రాజకీయతీర్మానం,(1978) సి.పి.ఐ(యం) 10వ జలందర్ సి.పి.ఐ(యం) పార్టీ కాంగ్రెసు ఆమోదించినది. పే. 34-37.*

ప్రభుత్వ ఆర్థిక విధానాలను మితవాదశక్తుల ప్రయోజనాలను కాపాడే ప్రయత్నాలను, వామపక్ష ప్రజాస్వామ్యశక్తులు ప్రతిఘటించుతవి. అట్టిశక్తులు, ప్రభుత్వంలోని జనతా శక్తులుగా గుర్తించాలి. బెంగాల్, త్రిపురలలో యేర్పడిన వామపక్ష ప్రజాస్వామ్య శక్తుల సంఘటనా ప్రభుత్వాలను బలపరస్తుంది. అంతేగాక, వామపక్ష ప్రజాస్వామ్య శక్తులు హిందూమతోన్మాదశక్తులను. దాని రాష్ట్రీయ స్వయంసేవకసంఘపు కవాతుదళాల హింసను, మత, కుల సిద్ధాంతాలను నేరుగ తలపడి, పోరాడి వోడించుతవి.[1]

జలందర్ సి.పి.ఐ(యం) పార్టీ కాంగ్రెసు తీర్మానం యీ క్రింద పేర్కొన్న రాజకీయ పార్టీలు, సంస్థలు, గ్రూపులను వామపక్ష ప్రజాస్వామ్య శక్తులుగ, ఐక్యసంఘటనలో భాగస్వాములుగా గుర్తించింది.

అవి "1) సి.పి.ఐ(యం) దాని నాయకత్వంలోని ప్రజాసంఘాలు కిసాన్ సభ, సి.ఐ.టి.యు. వ్యవసాయ కూలి సంఘం, విద్యార్థి, యువజన, మహిళా, ఉపాధ్యాయ సంఘాలు, వాటి వివిధ శాఖలు. 2) పశ్చిమబెంగాల్ కేరళలో సి.పి.ఐ(యం) మిత్రులైన వామపక్ష ప్రజాస్వామ్య పార్టీలు, వారి అధ్వర్యంలోని ప్రజాసంఘాలు, మహారాష్ట్రంలోని యితర వామపక్షాలు. 3) "మితవాద" కమ్యూనిస్టుపార్టీ. అనుచరులు, వారి అధ్వర్యంలోని ప్రజాసంఘాలు. వాస్తవంగా సి.పి.ఐ కాంగ్రెసుతో రాజీవిధానాలను పూర్తిగా వదలివేయుటకు సిద్ధంగా లేదు. కాన అది అనుసరించే విధానాలు వామపక్ష ప్రజాస్వామ్య శక్తుల విచ్ఛిన్నతకు దారి తీయవచ్చు. ఆ పార్టీ శ్రేణులు యీ విధానాలను విడనాడి ప్రభుత్వ నిరంకుశ విధానాలకు వ్యతిరేకంగా జరిగే పోరాట ప్రధాన స్రవంతిలో చేరే బలమైన కోరిక వారిలో వుంది. నేటి పరిస్థితులలో పోరాటాల యెడల "జారుడు" లేక "నీరుగారిపోయే" విధానాలకు వ్యతిరేకంగా పోరాడేశక్తులు అభివృద్ధి చెందాయి. 4) చైతన్య ప్రజాస్రవంతి, నియంతృత్వశక్తులకు వ్యతిరేకంగా పోరాడి జయంపొందుట, అనేకపార్టీలలోని వామపక్ష ప్రజాస్వామ్యశక్తుల బలాన్ని పెంచింది. అన్ని పార్టీలలో నాయకత్వపు విధానాల యెడల విమర్శనాత్మకదృక్పదాన్ని, అనేక సమస్యలపై అభివృద్ధికర వైఖరిని చేబట్టే వారు అధికంగానే వున్నారు. సమస్యల తరువాత సమస్యలపై యీ శక్తులకు ప్రోద్బలమిచ్చి పెంపొందించాలి. 5) కాంగ్రెసులోని "యంగ్‌టర్క్"లుగా పేరొందిన వామపక్ష ప్రజాస్వామ్యశక్తులను, యితర అభ్యుదయవాదులను, సోషలిస్టుపార్టీ సభ్యులను, స్వతంత్రులు, వ్యక్తులు, తదితర నిరంకుశశక్తుల నెదిరించువారినందరిని, అన్ని పార్లమెటు, అసెంబ్లీ ప్రాంతాలలోని జనతాపార్టీని యిముడ్చుకోవాలి. వీరందరూ అభివృద్ధి నిరోధక రాష్ట్రీయ స్వయంసేవక సంఘం, దాని రాజకీయసైద్ధాంతిక అవగాహనలను వ్యతిరేకించాలి, మతాతీత ప్రజాస్వామ్య శక్తులకు అండగా నిలబడాలి. జనతా పార్టీలో వివిధ పార్టీల అధ్వర్యంలోని ప్రజాసంఘాలు ప్రజల కోర్కెలకై నిలబడి పోరాడుటకు సిద్ధపడిన వారందరూ సంఘటన మహాశక్తిలో భాగస్వాములు. 6) అభివృద్ధి నిరోధక నియంతృత్వశక్తిగా ఇందిరాగాంధి రూపొందుటతో కాంగ్రెసులో చీలిక

---

1. *రాజకీయతీర్మానం,(1978) సి.పి.ఐ(యం) 10వ జలందర్ సి.పి.ఐ(యం) పార్టీ కాంగ్రెసు ఆమోదించినది. పే. 38.*

యేర్పడింది. స్వర్ణసింగ్ నాయకత్వంలోని కాంగ్రెసు మహారాష్ట్రంలో ఇందిరాగాంధి నాయకత్వంతో కలసి సంకీర్ణ ప్రభుత్వాన్ని యేర్పరచింది. అయినా అందులో ఇందిరాకాంగ్రెసులో నిరంకుశ శక్తులకు వ్యతిరేకశక్తులు, గ్రూపులేగాక, అభివృద్ధికర ఆర్థిక, సామాజిక సంస్కరణలు బలపరచే శక్తులున్నవి. ఈ శక్తులను వామపక్ష ప్రజాస్వామిక శక్తులు బలపరచి, తమపక్షంలో చేర్చుకొనుటలో విజయం సంపాదించాలి. 7) తమిళనాడులో ప్రజాస్వామ్యశక్తులైన "ఎ.ఐ.ఎ.డి.యం.కె.," "డి.యం.కె."లు పంజాబ్‌లోని అకాలీ పార్టీ, రిపబ్లికన్ పార్టీలు, తదితర శక్తులతో సత్సంబంధాలు అభివృద్ధి పరచి, వామపక్ష ప్రజాస్వామ్య శక్తులలో భాగస్వాములుగ చేయాలి.

జలందరు సి.పి.ఐ(యం) పార్టీ కాంగ్రెసు గుర్తించిన వామపక్ష పార్టీలు, ప్రజాస్వామ్యశక్తుల యెడల అవలంబించవలసిన వైఖరులను యిలా వివరించింది.

కాంగ్రెసు ప్రధాన బూర్జువా వర్గ రాజకీయపార్టీ, అంతర్గత పోరాటాలతో చీలికలకు గురైంది. ఇందిరాగాంధీ అనుచరవర్గాలు మాతృసంస్థయైన కాంగ్రెసు నుండి విడిపోయి పోటీ కాంగ్రెసు యేర్పాటు చేసాయి. జాతీయ కాంగ్రెసులో చీలిక ఇందిరాగాంధికి వాస్తవంగా వొక అపజయం. కారణం, కేంద్ర కాంగ్రెసు కమిటి, వర్కింగు కమిటీలలో ఆధిక్యత సంపాదించి, తన ముఠా చర్యలకు సాధనంగా చేసుకొనుటలో ఇందిరాగాంధీ అపజయం పొందింది. నాయకత్వంలోని వొక ప్రధాన భాగం, అప్పటివరకు ఆమె అన్ని నిరంకుశ చర్యలకు మద్దతునిస్తూ ముఖ్యపాత్ర దారులుగా వున్నవారు, ఆమె చర్యలను యింక యేమాత్రం బలపరచజాలమని బహిరంగంగా ప్రకటించుటతో, మరోమార్గం లేక ఇందిరాగాంధీ తన ముఠా శేష సహచరులతో కాంగ్రెసు నుండి బయటకు వెళ్ళిపోయింది. మాతృసంస్థ జాతీయ కాంగ్రెసు నాయకత్వాన్ని చేబట్టినవారు, నాడు అత్యవసర పరిస్థితిని, రాజ్యాంగానికి 42వ సవరణను బలపరిచిన వారే తమ గౌరవాన్ని మంట గులుపుకొని ఆమెకు దాసోహం అన్నవారు, ఆవిధంగా నిండు తమ కుర్చీలను కాపాడుకొన్నవారు, మంత్రి వర్గాలకు అతుక్కొనివున్నవారు, అత్యవసర పరిస్థితి ప్రకటన వలన లాభం చేకూరిందన్నవారు, మితమీరిన హింసా, దౌర్జన్యాలు, నిర్బంధకాండలకు దారితీయుటను తదుపరి విమర్శించారు.

అత్యవసర పరిస్థితి ప్రకటనను, పరిపాలనను నిర్భయంగా ఖండించినవర్గాలున్నవి. వారు క్రాంగెసు ప్రజాస్వామిక వ్యతికరేక విధానాలను ఖండించుతు, ప్రజాస్వామ్యం పురోగమనాన్ని కోరుతున్నవారున్నారు. కమ్యూనిస్టులు యీ పరిణామాలను సునిశితంగా పరిశీలించి పురోగామి వర్గాలను వామపక్ష ప్రజాస్వామ్యసంఘటనలోనికి తీసుకొని వచ్చేప్రయత్నాలు చేయాలి, సమిష్టి పోరాటాలలో పాల్గొనునట్లు చేయాలి. ఇది సి.పి.ఐ.(యం) కాంగ్రెసు యెడల అవలంభించవలసిన వైఖరిగా నిర్ణయించింది.[1]

జనతా పార్టీలోని ప్రధానశక్తులు గతంలో ప్రజాస్వామికానికి అభివృద్ధి నిరోధకశక్తులుగా పనిచేసాయి. ఈ పార్టీలన్నీ 1971లో "గ్రాండు అలయెన్స్"గా కలసిపనిచేసాయి. అప్పుడు

---

*1. రాజకీయతీర్మానం (1978) జలందర్ సి.పి.ఐ.(యం) కాంగ్రెసు ఆమోదించింది పే. 51.*

సి.పి.ఐ.(యం) వారిని అభివృద్ధి నిరోధకులుగా, మితవాదులుగ వివరించింది. కమ్యూనిస్టుపార్టీ ప్రత్యేకంగా జనసంఘం, రాష్ట్రీయస్వయంసేవక సంఘాల మితవాద, అభివృద్ధి నిరోధక సిద్ధాంత అవగాహనలను తీవ్రవిమర్శనాదాడికి గురిచేసింది. సి.పి.ఐ.(యం) అధికార కాంగ్రెసు (ఒ)ను గుత్తపెట్టుబడి, భూస్వామ్యవర్గాల బహిరంగ ప్రాతినిధ్య సంస్థగా విశ్లేషించింది. ఈ వర్గాలు ఆస్తిహక్కును పవిత్రమైనదిగా యెంచుతు, బ్యాంకుల జాతీయకరణను, రాజుల, జమీందారుల, వ్యక్తుల భరణాలరద్దు చేయుటను వ్యతిరేకించారు. కమ్యూనిస్టు వ్యతిరేకతతో ముందు వీథిన నిలబడి పార్టీని పశ్చిమబెంగాల్‌లో రాష్ట్ర ప్రభుత్వంపై నిందాప్రచారం నిరవధికంగా సాగించుతున్నారు.

ఆచరణ ఎలా ఉన్నా, జనతాపార్టీవాగ్దానాలు విలువైనవి, వాటిని రాజకీయపోరాటంలో వినియోగించాలి. జాగృతి చెందుతున్న జనతాపార్టీ వర్గాలు ముఖ్యంగా అత్యవసరపరిస్థితులలో భాదలకుగురైన వర్గాలు, రాజీవాదులను గ్రుడ్డిగా బలపరచారు, పూర్వపరిస్థితులు పునరావృతం అగుటను సహించజాలరు. జనతాపార్టీ మితవాద పార్టీల ఆధిక్యతతో సోషలిస్టుపార్టీ, కాంగ్రెసులోని "యంగ్‌టర్క్స్" వర్గాలతో కూడా ఉంది. జనసంఘం, జనతాదళ్ పార్టీల మితవాద వర్గాలకు ఆధిక్యతను ఆపాదించుచున్నవి. రాష్ట్రీయ స్వయంసేవకసంఘం ప్రత్యేక నిర్మాణంగా ప్రమాదకరశక్తిగా ఉంది. జనతాపార్టీ స్వయం సేవకసంఘాన్ని తేలికగా త్రోసిబుచ్చజాలదు. జనతాపార్టీలో రాజీవాదులకు వ్యతిరేకంగా సంఘర్షణలు తప్పనిసరియైనవి. ఇది మితవాద – అతివాదుల సంఘర్షణగా రూపొందింది. ఇది క్లుప్తంగా సి.పి.ఐ.(యం) యొక్క జనతాపార్టీ పై రాజకీయ అవగాహనగా వుంది.

"భారతకమ్యూనిస్టు పార్టీ (సి.పి.ఐ.) కాంగ్రెసుతో సహకారాన్ని నెరపుట, వర్గసామరస్యవిధానాన్ని అనుసరించుటవామపక్ష ప్రజాస్వామ్య ఉద్యమానికెంతో నష్టాన్నికలుగజేసింది. శిఖరాగ్రంగా అత్యవసరపరిస్థితి ప్రకటనను బహిరంగంగా బలపరచి, నిరంకుశత్వం ప్రజాస్వామ్య, పౌరహక్కులను నేలరాయుటను పరోక్షంగా బలపరచింది. బూర్జువాసమాజాన్ని మార్చుటకు మార్క్స్, లెనిన్‌ల సూత్రమైన కార్మికవర్గనాయకత్వంపై ఆధారపడక బూర్జువావర్గం పై ఆధారపడింది, సంస్కరణ వాదంవైపుపయనించింది. ఈ అవగాహనతో సి.పి.ఐ. కాంగ్రెసునుబలపరస్తూ, సి.పి.ఐ.(యం) నాయకత్వంలో ప్రభుత్వంపై పోరాడుతున్న వామపక్షాలపైగూడ దాడిసాగించింది. ఈ విధానానికి యేరాజకీయరంగు పులిమినా కాంగ్రెసును అనుసరించుతు సి.పి.ఐ.(యం)ని విమర్శించింది. సంవత్సరాలు ఐక్యసంఘటనలోనే వుంటూ వామపక్ష ఐక్యతను ఐక్యసంఘటనను విచ్ఛిన్నంచేయ ప్రయత్నించింది. పరోక్షంగా కాంగ్రెసు బలపరచింది. ఇదే కేరళ, పశ్చిమ బెంగాలులలో ఐక్యసంఘటనా ప్రభుత్వాలయెడల" [1] వివిధ సందర్భాలలో తెలుసుకొన్నాము.

వామపక్ష ఐక్యసంఘటన నుండి "మితవాద" కమ్యూనిస్టు పార్టీ దూరమగుట వలన జరిగిన నష్టంకంటే పశ్చిమబెంగాల్ కేరళలలో నిరంకుశ ఫాశిస్టువిధానాలను బలపరచుట

---

*1. రాజకీయతీర్మానం (1978) జలందర్, సి.పి.ఐ.(యం) కాంగ్రెసు ఆమోదించినది. పే. 53.*

వలన ప్రజాస్వామ్యశక్తుల అభివృద్ధికి యెక్కువ నష్టంజరిగింది. ఇవన్నీ సి.పి.ఐ.ని, సి.పి.ఐ.(యం) విమర్శించుటలోని సహేతుకతను రుజువుచేస్తుంది.

సి.పి.ఐ.(యం) 9వ, పార్టీ కాంగ్రెసు "సి.పి.ఐ.లోని సంక్షోభాన్ని స్పష్టంగాచూచి, వారిశ్రేణులుకొన్ని వారినినాదాలను, వారివర్గ సామరస్యవిధానాన్ని ప్రశ్నించమొదలు పెట్టారని, అసంతృప్తిచెంది, నిజానికి అనేక సందర్భాలలో కాంగ్రెసువ్యతిరేక నిర్దిష్ట విధానాన్ని అవలంభించకోరుతున్నారని" తీర్మానం అతిగా అంచెనావేసింది. అంతేగాక "నేడు యీక్రమంవేగాన్ని సంతరించుకొంటున్నది. నేటివారి విధానాన్ని సరిచేయుటకు వారి నాయకత్వం తిరస్కరించుటతో తీవ్ర అసంతృప్తి వ్యాపించివుంది. చాలా మంది ఆపార్టీకి నమస్కారం చెప్పిబయటకు వచ్చేస్తున్నారని" సి.పి.ఐ.లో భిన్నవైఖరులను అతితీవ్రమైనవిగా అంచెనావేసి, ఆపార్టీ కూలిపోతుందని, స్వీయమానసిక దృష్టిలో సైద్ధాంతిక అవగాహనకు వచ్చినట్లు కన్పడుతున్నది. అంతేగాక "ఇది స్వాగతం చెప్పవలసిన అంశమని, నిజాయతిగల శ్రేణులు చైతన్యంతో తమముందున్న కర్తవ్యాల యెడల జాగరూకతను చూపుతున్నారని, అదివారి రాజీవిధానాన్ని త్రోసి వేయాలనే ఆకాంక్షను తెలియజేస్తుందని యీ వైఖరినిపెంచి, పోషించేందుకు అన్ని చర్యలను చేపట్టాలని, వామపక్షశక్తులకు మితవాద కమ్యూనిస్టులు కలుగజేసిన నష్టాన్నిభర్తీ చేయుటకు మార్గమని వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనను నిర్మించుటలో ముఖ్యకర్తవ్యమైంది. ఈ శ్రేణులు రోజు రోజుకు నాయకత్వవ్యతిరేఖ ధోరణి చేబట్టుటకు మనపార్టీ ఓర్పుతో ప్రోత్సహించాలి. వామపక్షశక్తులను ఇందిరాగాంధి ఉద్దేశ్య పూర్వకంగా చీల్చుటను కార్మికవర్గ ప్రధానశక్తియైనట్టి సి.పి.ఐ.(యం) తిరిగి ఐక్యపరచు బాధ్యతను చేపట్టుతుందని" స్పష్టం చేయబడింది. అంతేగాక, "నేడు మితవాద కమ్యూనిస్టు పార్టీ వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన నిర్మాణాన్ని నిరవధికంగా పేర్కొంటూ, సి.పి.ఐ.(యం)తో చేతులుకలుపుటకు తమసంసిద్ధతను తెలయజేస్తున్నారు." "అత్యవసర పరిస్థితిప్రకటన విధానాన్ని హృదపూర్వకంగా కాకపోయినా ఖండించుతున్నా తమపూర్వవైఖరిని విడవకుండా ఉన్నారు. కేరళలో తమ రాజీ, పొత్తువిధానాన్ని కొనసాగిస్తూనే ఉన్నారు."[1]

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ సి.పి.ఐ.ని బలపరస్తున్నందున, తమ సి.పి.ఐ. సంస్కరణ వాదవ్యతిరేకపోరాటం కష్టతరమైందని, అదేవిధంగా సి.పి.యస్.యు. భారత ప్రభుత్వ అత్యవసర పరిస్థితి విధానాన్ని, దాని సంస్కరణవాదవ్యతిరేక పోరాటం వాడిని, తీవ్రతను కోల్పోయిందని సి.పి.ఐ.(యం) అంటున్నది. ఇది అంతా సి.పి.ఐ. యెడల సి.పి.ఐ.(యం) అవలంభించుతున్న శతృవైఖరిలో యెట్టిమార్పు లేదని తెలియజేస్తున్నది.

"ఈ విధంగా, చీలికవాదంలో తమ ఆశలను సి.పి.ఐ.(యం) నాయకత్వం ఇంకా కోల్పోలేదనుట స్పష్టం. అది 1960దశకం మధ్యలో సి.పి.ఐ.ని చీలికతో చిన్నాభిన్నంచేసి, నాశనం చేయుటలో పొందిన వైఫల్యాన్ని 1970 దశకం చివరలో చేయతలపెట్టినట్లు తెలుస్తున్నది. అప్పటివలెనె యిప్పుడు కూడ "కార్మిక వర్గపు ప్రధానశక్తిగా" అదితన

---

*1. రాజకీయతీర్మానం (1978) సి.పి.ఐ.(యం) జలందర్ కాంగ్రెసు ఆమోదించినది. పే. 54.*

కర్తవ్యంగా నెంచుతున్నది. ఆ విధంగా "అతివాద వర్గాలను ఐక్యం చేయుట అవసరమంటున్నది. సి.పి.ఐ.ని చిన్నాభిన్నం చేసివామపక్షాల ఐక్యత నిర్మించాలంటున్నది. ఈ వైఖరిని కొనసాగిస్తూ, వామపక్ష లేక ప్రజాస్వామ్యసంఘటనగాని తననాయకత్వాన్ని ఆమోదించి, విశ్వాసపాత్రులుగ ఉంటే, తప్పదాని వలన ఎటువంటి ఉపయోగం ఉండదని, సి.పి.ఐ.(యం) నాయకత్వంలో బలంగావున్నదని తెలిసినప్పుడే, దానివైఖరిని అర్థం చేసుకొనగలము. "ఇంకా" కమ్యూనిస్టు ఉద్యమంలోని అన్నిశ్రేణులు, సి.పి.ఐ.(యం) మాత్రమే నిజమైన కమ్యూనిస్టు పార్టీయనే సూత్రీకరణను ఆమోదించింది తేనే "సూత్రబద్ధ ఐక్యతసాధ్యం" అనేది సి.పి.ఐ.(యం) వైఖరి అనుట స్పష్టము.

పశ్చిమ బెంగాల్, కేరళలలో 1969-70లలో ఐక్యసంఘటనలను భగ్నం చేయుటకు దారితీసిన సి.పి.ఐ.(యం) నాయకత్వపు ఒంటెత్తు లేక సెక్టేరియన్ వైఖరి, పోకడలు అందరికీ తెలిసినవే. పెట్టుబడిదారి వర్గ ప్రత్యేక పాలనకు సి.పి.ఐ.(యం) నాయకత్వపు ఒకే ఒక ప్రత్యామ్నాయం జనతా ప్రజాస్వామ్యంగా ఉంది. "జనతా ప్రజాస్వామ్యం కార్మిక వర్గనాయకత్వం లేనిదే సి.పి.ఐ.(యం) ఊహించలేనిది. కార్మికవర్గనాయకత్వమంటే సి.పి.ఐ.(యం) నాయకత్వం. అంచేత నేడు వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతానినాదంతో సంఘటన నిర్మించుటకర్తవ్యంగా ఉంది. పెట్టుబడి దారి వర్గపాలనకు వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత ప్రత్యామ్నాయంగా ప్రజలను సమీకరించే నినాదంగా కాక సి.పి.ఐ.(యం) నాయకత్వాన్ని నిర్మించే తాత్కాలిక నినాదంగా అంటే ఎత్తుగడగా తలచబడింది. పశ్చిమబెంగాల్ , కేరళలో 1967 తదనంతరం సి.పి.ఐ.(యం) యేకొద్దిపాటి ఆత్మవిమర్శనను చేసుకొనకపోవుటలో ఆశ్చర్యమేమిలేదు."[1] అనేక విషయాలలో మొహిత్‌సేన్ అవగాహనలను ఆమోదించకపోయినా, సి.పి.ఐ.(యం) పై సేన్ యొక్క యీ విమ్శనను త్రోసివేయజాలం.

వాస్తవానికి సి.పి.ఐ.(యం) రాజకీయతీర్మానం చాలావరకు పూర్వ విధానాల కొనసాగింపే, కమ్యూనిస్టు అతివాద ఉద్యమానికి సంబంధించినంత వరకు ఒంటెత్తు, సెక్టేరియన్ విచ్ఛిన్నకర అవకాశవాద దృక్పథం. అభివృద్ధి నిరోధకపార్టీలయెడల దానివైఖరి ముఖ్యంగా దీనినే స్పష్టంచేస్తున్నది. ఐక్యసంఘటనపై తన పార్టీనాయకత్వాన్ని షరతుగా రుద్దాలనే పూర్వవైఖరి కొనసాగింపే జలందర్ పార్టీ కాంగ్రెసు ఐక్యసంఘటనా విధానములో కూడా యిమిడి వుంది.

సి.పి.ఐ.(యం) తీర్మానం వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత, జాతీయ ప్రత్యామ్నాయంగా నెంచుట లేదని స్పష్టం చేస్తున్నది. నేడు మనదేశంలో పెట్టుబడిదారి వర్గపు ప్రత్యేకపాలనకు జాతీయ ప్రజాస్వామ్యం సాధ్యం కాదని తలంచుచున్నది. తన నాయకత్వంలో జనతాప్రజాస్వామ్యసంఘటన ఏర్పడి నప్పుడే సాధ్యమని నమ్ముతున్నది. ఇట్టి అవగాహన వామపక్ష ప్రజాస్వామ్య శక్తుల ఐక్యతకు ఎంత వరకుతోడ్పతుందో విశ్వసించుట కష్టమనుట సత్యం.

---

*1. మొహిత్‌సేన్ (1978) సి.పి.ఐ.(యం) పాలిటిక్స్ ఎక్స్ రేడ్. సి.పి.ఐ. పబ్లికేషన్ నెం.2 (సి.247) 1978 పే. 10-11.*

ప్రజా సంఘాలైన ట్రేడుయూనియనులు, కిసాన్‌సభలు, విద్యార్థి, యువజన సంఘాలు, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతను నిర్మించుటకు అవసరమైన పునాదులను ఏర్పరచుటలో ముఖ్యపాత్ర వహించవలసియుంటుంది. ఆర్థిక ప్రయోజనాల రక్షణకై జరిగే పోరాటాలలో ప్రజలను సరియైన ఐక్యపోరాటాలలో సమీకరించి. సారథ్యం వహించి గుత్తపెట్టుబడిదారి. బడాబూర్జువావర్గ, భూస్వామ్య విధానవ్యతిరేకపోరాటంతో సంలీనం చేసి మౌలిక ఆర్థిక సామాజిక పరిణామాలకై జరిగే పోరాటంగా రూపొందించాలి.

ఈ సామాన్య పోరాటాలలో ప్రజాసంఘాలలోని విస్తృత బహుళప్రజాసామాన్యాన్ని, వామపక్షప్రజాస్వామ్యపార్టీలు సమీకరించబడినపుడే వామపక్ష ప్రజాస్వామ్యసంఘటన, సజీవ శక్తివంతమైనది ఏర్పరుచుట సాధ్యమౌతుంది. ఈ విధంగా జరుగనిచో ఆర్థిక తక్షణ సమస్యలకై జరిగే పోరాటంగానే రూపొంది దేశంలోని రాజకీయ పరిణామాలలో తమప్రభావాన్ని కలుగజేసి, ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాల నెదిరించే ప్రజాపోరాటంగా రూపొందజాలదు.

కార్మిక సంఘాల ఐక్యత, ఐక్యపోరాటాలు, వీటికి బాధ్యత వహించవలసిన పార్టీ చేబట్టవలసిన కర్తవ్యాన్ని తీర్మానం ఈ విధంగా సూచించింది. "కార్మికవర్గంలో రాజకీయచైతన్యంతో పాటు, నాయకత్వం చేబట్టవలని ఉంటుందినే చైతన్యాన్ని, కార్మికవర్గంలోని అనైక్యతను అధిగమించి, ప్రధాన పారిశ్రామికవాడలలోని అత్యధిక కార్మికులను సమీకరించవలసిన దానిని పార్టీ సాధ్యం చేయాలి. దీనితో పాటుశక్తి వంతమైన రహస్య ఉద్యమాన్ని నిర్మించాలి, దానికి ఫ్యాక్టరీ, స్థానిక కమిటీలు, కేంద్రాలు కావాలి. అందుకుబలమైన కార్మికోద్యమాన్ని నిర్మించాలి. ఐక్యమైన కార్మికవర్గం నాయకత్వపాత్ర వహించాలనే చైతన్యం గలది మాత్రమే జాతీయైక్యతను నిర్మించగలదు. "సిటు" ఐక్యపోరాటాలలో, కార్మికోద్యమంలో ప్రధాన ఐక్యతను రూపొందించేదిగా తయారైంది. పశ్చిమబెంగాల్, కేరళలలో మాత్రమే రాజకీయ శక్తిగా అయిందని, నిర్మాణాలలో ఉన్న కార్మికులలో. మైనారిటిగానే ఉందని సంకోచించవలసిన పనిలేదు[1]. ఇదే విధమైన వైఖరిని కిసాన్‌సభ తదితర ప్రజాసంఘాల యెడల చేబట్టింది.

## 1.4 ప్రత్యామ్నాయ వేదికకు సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)ల ప్రతిపాదనలు :

వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత, ఐక్యసంఘటనలను రూపొందించుటకు అందరి ఆమోదంపొందగల ప్రత్యామ్నాయ వేదికకు సి.పి.ఐ., సి.పి.ఐ.(యం) ల ప్రతిపాదనలు యిలావున్నవి.

1. అత్యవసర పరిస్థితుల ప్రకటన కాలంలో హరింపబడిన అన్నిపౌర, ప్రజాస్వామ్య హక్కుల పునరుద్ధరణ, అన్ని నిర్బంధ చట్టాలు, రూల్సు రద్దు చేయుట, ప్రభుత్వపాలనా యంత్రాంగాన్ని ప్రజాస్వామికీకరణకు, రాజ్యాంగ చట్టానికి సవరణలు చేయుటను రెండు కమ్యూనిస్టు పార్టీలు ప్రతిపాదించాయి.

---

*1. రాజకీయ తీర్మానం (1978) సి.పి.ఐ.(యం) జలందర్ కాంగ్రెసు ఆమోదించినది. పే. 55-6.*

2. రాష్ట్ర ప్రభుత్వ అధికారాలను విస్తరించుట, కేంద్ర-రాష్ట్ర సంబంధాలను పునర్నిర్మాణం చేయుట, రాష్ట్రస్వపరిపాలనను గ్యారంటీ చేస్తూ రాజ్యాంగ చట్టానికి సవరణ చేయుట రెండు పార్టీలు ప్రతిపాదించగా సి.పి.ఐ. రాజ్యాంగ సంస్కరణలు అని మాత్రమే పేర్కొనగా, సి.పి.ఐ.(యం) రాజ్యాంగంలోని 356, 360 అధికరణలను రద్దు చేయాలని ఉదహరించింది.

3. ప్రపంచబ్యాంక్, ఐ.యం.యఫ్. అంతర్జాతీయ బహుళజాతుల సంస్థల ప్రవేశానికి, జోక్యానికి, నియోవలసదోపిడిని, ఆర్థిక పరాధీనతను, విదేశీ పెట్టుబడులను జాతీయం చేయుట ద్వారా రద్దుచేయుట, విదేశీ అప్పులపై సత్వరం మారుటోరియం ప్రకటించుట రెండుపార్టీలు సూచించాయి.

4.విదేశగుత్త సంస్థలను జాతీయం చేయాలని రెండుకమ్యూనిస్టుపార్టీలు ప్రతిపాదించగా సి.పి.ఐ.(యం) దేశీయగుత్తపెట్టుబడి సంస్థలను కూడా జాతీయం చేయాలని ప్రతిపాదించింది.

5. ప్రణాళికాబద్ధ స్వతంత్ర ఆర్థికాభివృద్ధి, ప్రభుత్వం, ప్రజారంగాలకు ఆధిక్యతనిచ్చే విధానం రెండు పార్టీలు ప్రతిపాదించాయి. సి.పి.ఐ. సోషలిస్టు ప్రపంచ మార్కెట్టులో అత్యధిక సన్నిహిత సంబంధాన్నిపెంపొందించుటను కూడా ప్రతిపాదించింది.

6. వేతనస్తంభన, లాకవుట్లు, మూసివేతలకు వ్యతిరేకంగా ప్రభుత్వంచర్యలు చేబట్టుట, మూసివేసిన మిల్లులను ప్రభుత్వం స్వాధీనంచేసుకొని నడుపుట, కనీసజీవనవేతనం, ప్రభుత్వరంగ పరిశ్రమలయాజమాన్యంలో కార్మికులకు భాగస్వామ్యం రెండుకమ్యూనిస్టు పార్టీలు ప్రతిపాదించాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వరంగాలలోని కార్మికులందరికి ట్రేడుయూనియన్ హక్కులు విస్తరింపజేయుట కూడా ప్రతిపాదించారు. ఉద్యోగనియమకాలకు ముందు పోలీసు పరిశీలనకు పంపుటను రద్దుచేయుట సి.పి.ఐ., నిరుద్యోగాన్ని పెంచే ఆటోమాటికీకరను రద్దుచేయాలని సి.పి.ఐ.(యం)లు ప్రతి పాదించాయి. నిరుద్యోగ భృతినివ్వాలని రెండూకోరాయి.

7. భూస్వామ్య విధానాన్ని రద్దుచేయాలని, అభివృద్ధి కరమౌలిక భూసంస్కరణలు చేయాలని కౌలుదారుల తొలగింపులను నిషేదించాలని, వ్యవసాయ కార్మికలకు పేదరైతులకు ఉచితంగా భూములివ్వాలని, వ్యవసాయకూలీలకు కనీస జీవనభృతి వేతనమివ్వాలని, రైతులకు విత్తనాలు, ఎరువులు, క్రిమిసంహారక మందులు అందజేయాలని, సేవాసహకార సంస్థల ద్వారా జరగాలి, రైతులకు రుణసౌకర్యాలు, వ్యవసాయుఉత్పత్తులకు మార్కెటింగు సౌకర్యాలు కలుగజేయాలని ఉభయకమ్యూనిస్టుపార్టీలు ప్రతిపాదించాయి.

8. పనిచేయు హక్కును ప్రాధమికహక్కులలో చేర్చాలని, అందరికి ఉద్యోగాలు, నిరుద్యోగ భృతిని కలిగించాలని రెండు పార్టీలు కోరాయి. అదనంగా ఆస్తిహక్కు ప్రాధమిక హక్కుల నుండి తొలగించాలని సి.పి.ఐ.(యం), చిన్న ఆస్తిపరులకు, రైతులకు రాజ్యాంగంలో హక్కులు, కలిగించి, గ్యారంటీ చేయాలని కోరింది.

9. నిర్బంధ ప్రాధమిక విద్య, ఉచిత సెకండరీవిద్య, బీదలకు విద్యార్థి ఉపకారవేతనం, విశ్వవిద్యాలయాలలో పాలనా యాజమాన్యంలో ఉపాధ్యాయులు, విద్యార్థుల భాగస్వామ్యమివ్వాలి, అన్ని స్థాయిలలో మాతృభాషలో విద్యాబోధన, పాలన, న్యాయస్థానాలలో వినియోగించుట రెండు పార్టీలు ప్రతిపాదించాయి.

10. నిమ్నజాతులు, ఆటవిక తెగలు, భూస్వాములు, కాంట్రాక్టర్లు, వడ్డీవ్యాపారుల అత్యాచారాలకు గురిచేసిన వారికి కఠిన శిక్షలు, దౌర్జన్యాలకు స్వస్తిజెప్పుట, వారుకోల్పోయిన భూములను, అన్యాక్రాంతాలను తిరిగివారికి ఇచ్చుట రెండు కమ్యూనిస్టుపార్టీలు ప్రతిపాదించాయి.

11. ప్రభుత్వోద్యోగాలలో, విద్యాసంస్థలలో ఎట్టి మత, కుల, మైనారిటీలపైవిచక్షణ రహితంగా వారిహక్కులను రక్షించుట, ఉర్దుభాషపై విచక్షణ చూపరాదు. హిందూ, ముస్లిం మతతత్వవాదుల విషప్రచారాన్ని రూపుమాపాలని రెండుపార్టీలు ప్రతిపాదించాయి.

12. స్త్రీలకు సమానవేతనం, సమాన ఉద్యోగావకాశాలు కలుగజేయాలని, వయోజన వోటుహక్కును 21 సంవత్సరాలనుండి 18 సంవత్సరాలుకు తగ్గించుట దామాషా నిష్పత్తి ప్రాతిపధికన ప్రతినిధుల ఎన్నికల విధానాన్ని ప్రవేశపెట్టుట వంటి మౌలిక సంస్కరణలను ఉభయ పార్టీలు ప్రతిపాదించాటు.

13. దేశంలోని భాషలన్నిటికి సమానత్వాన్నియిచ్చి, హిందీని సంధానభాషగాను, హిందీయేతర భాషా ప్రాంతాలు కోరుకొన్నపుడు పాలనాభాషగాను, అప్పటివరకు ఇంగ్లీషు, హిందీలు ఉంటాయనే నెహూపథకం కొనసాగాలని సి.పి.ఐ.(యం); సి.పి.ఐ.లు ప్రతిపాదించాయి. అంతేగాని మూడుభాషల సూత్రమనే పేరుతో హిందీని బలవంతంగా ప్రవేశపెట్టరాదు. ప్రాంతీయ భాషల హక్కులు రక్షింపబడాలి, ఆటవిక జాతుల భాషలు రాజ్యాంగపు 8వ , షెడ్యూలులో చేర్చి, ప్రత్యేక సహాయాన్నిచ్చి, సహాయపడాలి.

14. లంచగొండి తనాన్ని రూపుమాపుట, కేంద్ర, రాష్ట్ర మంత్రులు, లంచగొండులుగా ఎంచబడినవారిని విచారించుటకు ప్రత్యేక శాశ్వతన్యాయస్థానాలు ఏర్పాడాలి. అవి రాజకీయనాయకులు, మంత్రులు, ఉన్నతోద్యోగులపైగల ఫిర్యాదులను విచారించాలి. ఇది సర్వసాధారణ సర్వజనాభిప్రాయము.

15. ప్రపంచ సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటం అలీన దేశాల సామ్రాజ్య వాదవ్యతిరేక పోరాటాలను బలపరచుట, అదే ప్రాతిపధికపై అలీన దేశాలన్నిటితో ఐక్యత, మైత్రి, స్నేహ, సహకార సంబంధాలను పెంపొందించుట బలపరచుట, శాంతి, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, సోషలిజంల కొరకు నిరవధిక ధృఢతర పోరాటం సి.పి.ఐ. ప్రతిపాదించింది. ఒక్క సోషలిజం విషయంలో మినహా అన్నిఅంశాలతో సి.పి.ఐ.(యం) అంగీకారంవుంది.[1]

---

*1. రాజకీయతీర్మానం (1978) భటిండా. జలందర్ కాంగ్రెసులు ఆమోదించినవి. పే. 28-31 మరియు 38-41.*

వామపక్ష ప్రజాస్వామ్య వేదికకు ప్రతిపాదనలను రూపొందించి, సి.పి.ఐ.తన అవగాహనలను యిలా వివరించింది.

భవిష్యత్తులో రాజకీయ అనిశ్చిత పరిస్థితులు, తీవ్రపరిణామాలు, తరచుగా మార్పులు సంభవిస్తూ ఉంటవి. ఈ అనిశ్చిత పరిస్థితులు ఏర్పడుటలో సామ్రాజ్యవాదుల పాత్రచాలమౌలికమైనది. సామ్రాజ్యవాదం మనదేశంలో తన నియోవలసవిధానాన్ని, దోపిడిని సాగించుటకు సానుకూలపరిస్థితులున్నవని తలంచుచున్నది. అందుకు ఎట్టిబూర్జువా, భూస్వామ్య అభివృద్ధి నిరోధక మితవాద ప్రభుత్వాన్నైనా బలపరచి, తన లక్ష్యం సాధించ తలపెట్టుచున్నది.

కార్మికవర్గం, దానిపార్టీలు, మిత్రులు నియోవలస సామ్రాజ్యవాదశక్తులు, దేశంలో వారితైనాతీలు, గుత్తపెట్టుబడి, భూస్వామ్య, మతతత్వశక్తులు, పార్లమెంటరీ విధానాన్ని త్రోసిబుచ్చి, నిరంకుశత్వం ప్రభలకుండా ప్రతిఘటించే చారిత్రాత్మక కర్తవ్యాన్ని చేబట్టాలని స్పష్టంచేసింది. వామపక్ష ప్రజాస్వామ్యశక్తులు అభివృనిరోధక మిత, మత వాదశక్తులు తమ పునరుద్ధరణకై చేయుచర్యలను, రాజకీయదురాలోచనలను అప్రమత్తులై అత్యంత వేగంగా రాజకీయ ప్రతిఘటనా చర్యలు చేబట్టాలి.

ఈ చారిత్రాత్మక కర్తవ్యం చేబట్టు విషయంపై సి.పి.ఐ.(యం) తన అవగాహనను యిలా వివరించింది.

"మా పార్టీకి విజయాన్ని చేకూర్చుటలో పశ్చిమ బెంగాల్ కార్మికవర్గం మహోన్నత పాత్ర నిర్వహించింది. అదే వామపక్ష శక్తుల విజయమైంది. తక్షణ ప్రయోజనాలను పరిరక్షించుకొంటూ, మంత్రివర్గం చేబట్టి వ్యవసాయ సంస్కరణలకు కార్మికవర్గం తమబలాన్నంతా నవిూకరించి, బలవరచింది. అభివృద్ధి నిరోధకవర్గాలు గ్రామీణప్రాంతాలలో, విద్రోహచర్యలతో వ్యవసాయ భూసంస్కరణలను నీరుగార్చి, రైతాంగంలో నిరుత్సాహాన్ని, అసంతృప్తిని పెంపొందించే చర్యలను ప్రతిఘటించుతు, సంస్కరణల అమలుకు కార్మికవర్గం మహోద్యమాన్ని రైతాంగంతో సంయుక్తంగా నిర్వహించింది. ప్రజోపకరములైన అన్ని ప్రభుత్వ చర్యలను కార్మికవర్గం బలపరచి, అభివృద్ధినిరోధకుల, వ్యతిరేకుల ఆటలను కట్టించింది. అధికారయంత్రాంగంలోని నియంతృత్వాన్ని, లంచగొండితనాన్ని యెదిరించుటలో ప్రజాసామాన్యమంతా కార్మిక వర్గంతోకలసి పోరాడి అభివృద్ధి నిరోధకుల కుట్రలను, నిందాప్రచారాలను ప్రతిఘటించి, ఓడించుటలో విజయాన్ని సాధించింది.

ఒక్కమాటలో చెప్పాలంటే సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)లు వామపక్షప్రజాస్వామ్య ఐక్యతకైజరిపే పోరాటాల వేదికకు చేసిన ప్రతిపాదనలలో మౌలిక భేదాభిప్రాయాలు ఏవీలేవు.

## 1.5 సంయుక్త ప్రకటన, ముఖ్యపరిణామాలు

భారతవామపక్ష, ప్రజాస్వామిక, అభ్యుదయవర్గాలు, సి.పి.ఐ. భటిండా, సి.పి.ఐ.(యం) జలంధరు పార్టీల కాంగ్రెసుల అనంతరం ఆశించిన విధంగానే, రెండు పార్టీలమధ్య సంప్రదింపులు జరిగి ఏప్రిల్ 1978లో వెలువడిన సంయుక్త ప్రకటనకు వామపక్ష ప్రజాస్వామ్యశక్తులు స్వాగతం పలికాయి. ఆర్థిక, రాజకీయ, ప్రజా సమస్యలపై రెండు పార్టీలు ఐక్యకార్యాచరణను, రూపొందించ ప్రయత్నించుట, అనేక రాష్ట్రాలలో ప్రజాసంఘాల కార్యాచరణలను యెంతో ఉత్తేజపరచింది. సంయుక్త ప్రకటన, ఐక్యకార్యాచరణలు దేశంలోని వామపక్ష శక్తులలోని మితవాద, అతివాద వొంటెత్తు పెడమార్గాల భ్రమలు చెదరిపోయి, కాంగ్రెసు వ్యతిరేక అన్నివామపక్ష ప్రజాస్వామ్యశక్తులను, జనతాపార్టీమినహా అందరిని ఐక్యపరచి, సమగ్రవిస్తృత ఐక్యసంఘటన రూపొందించాలని కోరింది, నూతన విధానాల ఆవిష్కరణకు నాంది పలికింది.

జాతీయ, అంతర్జాతీయ, ఆర్థిక, రాజకీయవిధానాలపై మౌలిక సైద్ధాంతిక భేదాభిప్రాయాలు రెండు ప్రధాన కమ్యూనిస్టుపార్టీలమధ్య ఉన్నప్పటికి, స్నేహ, సౌభాతృత్వసంబంధాలు స్నేహపూర్వక సంప్రదింపులు జరుపుట, పరస్పరం ఒండొరుల విధానాలను వక్రీకరించి, వ్యాఖ్యలు చేయుట, ఆపివేయుట పరస్పరం విశ్వాసం, నిజాయితీ పెంపొందించు కొనవలసిన అవసరముందని గుర్తించిన ఫలితంగానే సంయుక్త ప్రకటన రూపొంది, వెలువడింది.

సంయుక్త ప్రకటనానంతరం సి.పి.ఐ.(యం) నాయకులు వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయ అవగాహనలపై రెండుపార్టీల మధ్యగల అభిప్రాయ భేదాలను నొక్కి చెప్పుతు ప్రకటన చేసారు. వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయం సి.పి.ఐ. దృష్టిలో జనతాపార్టీ వ్యతిరేకమని, అది తాము అంగీకరించజాలమని సి.పి.ఐ.(యం) ప్రకటించుటయే గాక, ఆకారణంగారెండు పార్టీలమధ్య రాజకీయ ఐక్యతకు ప్రాతి పధికలేదన్నది. దేశంలో జనతా పార్టీలో ఏర్పడిన సంక్షోభ పరిస్థితులు, నాడు వామపక్ష పార్టీలు, జనతా పార్టీ, కాంగ్రెసు (ఐ), తదితర పార్టీల యెడల సరియైన దృక్పథం చేబట్టితేనే వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయం విజయవంతంగా యేర్పడి పురోగమిస్తుందని రాజకీయ వర్గాలన్నీ ఆశించాయి. ఈ సందర్భంలో "అటువంటి ఐక్యకార్యాచరణ సంఘటనలకు, జనతాపార్టీ ప్రభుత్వంపై దాడి చేయకుండా ఉండాలనే షరతుపై," తన అభిప్రాయాన్ని అనంగీకారంగా సి.పి.ఐ. వెలిబుచ్చింది. ఇదే విషయమై సి.పి.ఐ. భటిండా పార్టీ కాంగ్రెసు తీర్మానం. "బూర్జువావర్గ పాలనలో సంక్షోభంయేర్పడిందని", అనిశ్చిత రాజకీయ పరిస్థితి" "రాజకీయ సంక్షోభం" కారణంగా కాంగ్రెసు, జనతా పార్టీలు రెండూ సంక్షోభంలో పడిపోయాయని, జనతాపార్టీవలన గాని, కాంగ్రెసు తిరిగి అధికారంలోనికి వచ్చినా సంక్షోభం నుండి దేశం ప్రజలు

---

*1. సంపాదకీయం, పీపిల్సు డెమోక్రసీ, 16 ఏప్రిల్ 1978.*

రక్షింపబడజాలరని తెలిపింది. అధికారంలో ఉన్న జనతాపార్టీ, అధికారంలో లేని కాంగ్రెసు ప్రజాస్వామ్య, ప్రజావ్యతిరేక విధానాలపై రాజీలేని పోరాటం జరుపుటకై, ఆరెంటికి ప్రత్యామ్నాయంగా వామపక్షశక్తులను ఐక్యపరచి, ఆ భూమికపై వామపక్ష ప్రజాస్వామ్య శక్తుల జాతీయ ప్రత్యామ్నాయన్ని రూపొందించాలని, నాటి ప్రపంచ సోషలిస్టు వ్యవస్థతో సత్సంబంధాలు ఏర్పరచుకొని, బలోపేతం చేసుకొనాలని స్పష్టం చేసింది. అంతేగాక బూర్జువా భూస్వామ్య ప్రభుత్వం ఏరూపంలో ఉన్నా ఎదురించుటయే ప్రధమకర్తవ్యంగా వివరించింది. అదేకాలంలో జనతా అధధికారాన్ని స్వీకరించినా అత్యవసర పరిస్థితులు నాటి దుష్ఫలితాలను కొన్నింటిని తొలగించుట గుర్తించామున్నది. అంతమాత్రంచేత జనతా పార్టీని "వామపక్షప్రజాస్వామ్య శక్తులు ప్రజాస్వామ్యానికై పోరాడుటలో మిత్రులు, సహచరులుగా తలచుట ప్రమాదకరమనే అభిప్రాయాన్ని కూడా స్పష్టం చేసింది.

ఆర్థిక, రాజకీయ, సైద్ధాంతిక బేదాభిప్రాయాలను చర్చించవచ్చు, తమతమ విధానాలను స్పష్టం చేయవచ్చు. అయితే అదే పనిగా సి.పి.ఐ., సి.పి.ఐ.(యం) ల మధ్యయేకాభిప్రాయానికి రాజకీయ ప్రాతిపధికలేదని సి.పి.ఐ.(యం) ప్రకటించుట ప్రజానమన్యలపై ఐక్యకార్యాచరణను రూపొందించుటకు యేమాత్రం సహాయకారికాకపోగా, విచ్ఛిన్నానికి కూడా అవకాశమిస్తుంది. ప్రధాన రాజకీయ, సైద్ధాంతిక అభిప్రాయబేధాలను తమ శ్రేణులకు ప్రత్యేక సమావేశాలలో వివరించవచ్చు, అదివారి రాజకీయచైతన్యానికి తోడ్పతుంది. బహిరంగ సమావేశాలలో, ప్రకటనలలో బేదాభిప్రాయాలనే తరచు నొక్కి చెప్పేవిధానం, ప్రభుత్వంపై, వారి ప్రజావ్యతిరేక విధానాలను ప్రతిఘటించుటకు, సాధారణ సమస్యలపై సమిష్టి అవగాహనతో ప్రజా సమీకరణ కావించి, శక్తివంతమైన ప్రజాపోరాటాలు సాగించుటకు ఏమాత్రమూ సహాయకారులు మాత్రం కావు. భటిండా, జలందర్ రెండు కమ్యూనిస్టు పార్టీల కాంగ్రెసులు చేసిన తీర్మానాలు, ఇచ్చిన అవగాహన ఐక్యకార్యాచరణ, పోరాట ఐక్యతలతో పాటు, కాంగ్రెను, జనతా పార్టీలు రెండూ జాతివాంఛలను నంతృప్తి పరచుటలో విఫలమయ్యాయని, అంచేత మూడవ రాజకీయ ప్రత్యామ్నాయం రూపొందించ వలసిన అవసరమువుందని స్పష్టం చేసాయి.

భటిండా సి.పి.ఐ. పార్టీ కాంగ్రెసు ప్రధాన విజయం నిర్మొహమాటంగా, నిర్ద్వందంగా, సాహనంతో చేసుకొన్న బహిరంగ ఆత్మవిమర్శనయని నిస్సందేహంగా చెప్పవచ్చును. రాజకీయ సమీక్షా నివేదికలో ఆత్మవిమర్శనను చేర్చుటకు, కాంగ్రెసు పూర్వచర్చలలో తీవ్రవ్యతిరేకతకాన వచ్చింది. అంతేగాక, రాజకీయ తీర్మానం, అంతర్జాతీయ పరిస్థితిపైఅవగాహన తీవ్రచర్చలకు గురైనప్పటికి, ఆత్మవిమర్శనను రాజకీయ నివేదికలో చేర్చాలన్న అంశం యేకగ్రీవంగా ఆమోదించబడింది. మిగిలిన రెండు తీర్మానాలు మెజారిటీచే మాత్రమే ఆమోదించబడినవి.

భటిండా కాంగ్రెసులో సి.పి.ఐ. ఆత్మవిమర్శనపై వ్యాఖ్యానించుతు "అత్యవసర పరిస్థితి విధానంపై విమర్శ, ఆత్మవిమర్శ చేబట్టనిచో వామపక్ష ప్రజాస్వామ్యశక్తులు" పార్టీల నుండి "వేరుపడుట" నుండి ఇంత త్వరగా, సమర్ధవంతంగా బయటపడి ఉండే

వాళ్లంకామని, ఒప్పుకొనవలసి ఉంటుంది. వామపక్ష శక్తులలో పార్టీ తనస్థానాన్ని అంత త్వరగా పునరుద్ధరించు కొనగలిగి ఉండేది," కాదని భూపేష్ గుప్తా వ్రాసారు. అత్యవసర పరిస్థితికాలంలో పార్టీవైఖరితో కోల్పోయిన పార్టీరాజకీయ ప్రతిష్ట పునరుద్ధరించ బడుటయేగాక, అభివృద్ధి నిరోధకపార్టీలు పార్టీపై ఎక్కుపెట్టబడిన ఆయుధాలు వాడిని, కోల్పోయి మొద్దుబారిపోయాయి. "అత్యవసర పరిస్థితిని బలపరచుట పొరపాటు అని బహిరంగంగా మనం ఒప్పుకొనుటతో "ఇతర వామపక్ష పార్టీలు ప్రజాసమస్యలపై సంప్రదింపులకు ఆమోదం తెల్పుట తేలిక అయింది." రాజకీయ సమీక్షా నివేదికలో సైద్ధాంతిక రాజకీయ సమస్యలపైగల అవగాహనలను, తప్పులను దిద్దుకొనుటతో పార్టీ సరియైన ఎత్తుగడల పంథాను భటిండాలో రూపొందించుకొనుట జరిగింది". అని భూపేష్‌గుప్తా వివరించారు.

ఆర్థిక, రాజకీయ పరిణామాలు తీవ్రమైన మార్పులు తెచ్చి పెట్టినా పూర్వపు ఎత్తుగడలను, విధానాలను పట్టుకొని వ్రేళ్ళాడుట, తీవ్రమైన తప్పులకుదారి తీస్తుందని లెనిన్ చేసిన హెచ్చరికను మరువరాదు. అదేకాలంలో శాస్త్రీయంగా నూతన ఎత్తుగడలను చేబట్టినంత మాత్రాన నిన్నటి ఎత్తుగడల పంథాలోని అంశాలు అన్నీతప్పు అని, అందులోని యేఅంశం కొనసాగించవలసిన అవసరంలేదనుట పొరపాటు అగుతుంది. సహజంగానే సిద్ధాంత సూత్రాల ఆచరణ తప్పులను సరిచేసుకొంటూ, నూతన అవగాహనలతో పురోగమించుటయే శాస్త్రీయపద్ధతి.

భటిండా పార్టీ కాంగ్రెసు, "జాతీయ వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయం" అనే కేంద్ర నినాదాన్ని పెట్టుబడిదారి వర్గవిధానానికి బదులుగా ఇచ్చినపుడు, పైశాస్త్రీయ అంశాలపై వివేచనతో అవగాహన విస్తృతి పొందుతుంది. కొచ్చిను 9వ, విజయవాద 10వ, పార్టీ కాంగ్రెసులలో "వామపక్ష ప్రజాస్వామ్య ప్రభుత్వం" అనే నినాదాన్ని కేంద్ర రాజకీయ దృక్పధంగా ప్రజలముందుంచిందని గుర్తుపెట్టుకొనవలసి ఉంది. ఈ నినాదపు ప్రత్యేక కేంద్రసమితి అవగాహన ఏమిటి? నూతనాంశాలతో తప్పులను సరిచేసుకొనుట ఒకటి. జాతీయ సమితి సమీక్షా నివేదికలో "వామపక్ష ప్రజాస్వామ్య పార్టీల, అభ్యుదయ కాంగ్రెసు వాదుల ఐక్యతగారూపొందుతుంది." ఇందిరా కాంగ్రెసు నియంతృత్వవిధానాలకు వ్యతిరేక పోరాటం అనే పేరుతో సి.పి.ఐ.(యం) మితవాద పార్టీలతో ఐక్యత నిర్మించుట వాస్తవమైనంత మాత్రాన సి.పి.ఐ. "వామపక్ష ప్రజాస్వామ్య పార్టీల ఐక్యతను నిర్మించుటకు వెనుకాడ వలసిన కారణం కన్పించదు" అనే అవగాహనను స్పష్టంచేసింది. అంతేగాక, అత్యవసర పరిస్థితి విధానంపై ఆత్మవిమర్శ చేసుకొన్నా జాతీయ సమితి వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతా నినాధాన్ని అమలు చేయుటలో తప్పుల జరిగినవని సి.పి.ఐ. అనుకొనుటలేదు. కాంగ్రెసు మొత్తంతో ఐక్యతయని యెప్పుడూ చెప్పలేదని, అట్టి ప్రయత్నం చేయలేదని స్పష్టం చేసింది. మితవాద, అతివాద వర్గాలు కొన్ని సి.పి.ఐ. రాజకీయ విధానాన్ని వక్రీకరించి, తమ భాష్యంతో నిందాప్రచారం కావించుటతో అట్టి అపోహకు ప్రాచుర్యం, ప్రచారం లభించింది. సి.పి.ఐ. ఈ ప్రచారాన్ని ఎదుర్కొని తొలగించుటలో విఫలమైంది.

కాంగ్రెసు పార్టీతో సి.పి.ఐ. ఐక్యసంఘటనకు ప్రయత్నించిందన్న వాదనను జాతీయ సమితి త్రోసిబుచ్చింది. కేరళలో సి.పి.ఐ. యేర్పరచిన ఐక్యసంఘటన, ప్రభుత్వం ఇందిరాకాంగ్రెసుతో గాక చీలిపోయి వేరే మరోకాంగ్రెసుగా ఏర్పడిన వారితోనని, నిదర్శనలతో స్పష్టం చేసింది. ఇదీ వాస్తవికత, వ్యతిరేక వర్గాలు దీనినే కాంగ్రెసుతో ఐక్యసంఘటనగా చిత్రించుటలో నిజాయితి శూన్యతనే తెల్పుతుంది. కేరళలో అట్టిఐక్యసంఘటనను నిర్మించుట సరియైనదేనని నివేదిక స్పష్టం చేసింది. సి.పి.ఐ. జాతీయ ప్రజాస్వామ్య సంఘటన నిర్మాణ దృక్పథంతో అది సమర్థనీయమే అగుతుంది. ఆచరణలో సి.పి.ఐ.(యం) తదితర కేరళ వామపక్షాలు, ప్రజాస్వామ్య పక్షాలలో అధికసంఖ్యాకులు లేకుండా ఏర్పడిన "మినీ సంఘటన"లో అవకాశవాద. ఒంటెత్తు పోకడలు లేకపోలేదు. అంతేగాక తదనంతరకాలంలో సి.పి.ఐ.యీ ఎత్తుగడలు కాంగ్రెసు పాలన పునరుద్ధరించబడుటకు పరోక్షంగా తోడ్పడినందున, వారి వ్యూహమైన జాతీయ ప్రజాస్వామ్య సంఘటన, జనతా ప్రజాస్వామ్య సంఘటన యొక్క ప్రాథమిక దశరూపమైనా ఆచరణలో అవలంభించిన ఎత్తుగడలు విరుద్ధఫలితాలనిచ్చుటతో ఎత్తుగడల ఆచరణ కత్తిమీదసాములా పరిణమించింది.

అంతేగాక, నివేదిక సి.పి.ఐ.(యం) అతివాద సెక్టేరియన్ పంధాకన్నా మెజారిటితో కాంగ్రెసు మాత్రమే ప్రభుత్వానికి స్థిరత్వాన్ని చేకూర్చగల దన్న ఇందిరా కాంగ్రెసు విధానం కన్నా సి.పి.ఐ. వామపక్ష ప్రజాస్వామ్య శక్తులతో ఐక్యమావ్వాలన్న విధాన వాస్తవికత, అధికృత కేరళ ఎన్నికలలో రుజువైందని" జాతీయసమితి అవగాహనగా ఉంది. కేరళ అనుభవాలు సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)లు రెండూ ఐక్యకార్యాచరణను చేబట్టవలసినఅవసరాన్ని తెలియజేస్తున్నవి.

కాబట్టి, జనతా ప్రభుత్వంకొనసాగింపునకు, కాంగ్రెసు పాలనపునరుద్ధరణకు రెండింటికి వ్యతిరేకంగా వామపక్షప్రజాస్వామ్య ఐక్యతను నిర్మించాలని, వారిలో ఒకరు ప్రధాన శతృవులని, మరొకరు ద్వితీయ శత్రువులని వేరు చేసి చూడదలచలేదని, భటిండా సమీక్ష స్పష్టం చేసింది. ఆవిధంగా తప్పులను దిద్దుకొనుట, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతను కాంగ్రెసు సి.పి.ఐ ఐక్యతగా దిగజార్చుట జరుగదని నివేదిక చెప్పింది. కాంగ్రెసులోని వామపక్ష ప్రజాస్వామ్యశక్తులతో ఐక్యతా ప్రాముఖ్యతను నొక్కి చెప్పుటలో వేమరుపాటు వహించదని తెలిపింది. అంతేగాక, నివేదిక వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయాన్ని, నిర్మించుటకై, సి.పి.ఐ(యం) తో సన్నిహింత సంబంధాలను అభివృద్ధి చేస్తుందని స్పష్టం చేసింది. ప్రధాన వామపక్షపార్టీలైన సి.పి.ఐ(యం); సి.పి.ఐ.లు పరస్పరం చేరువయ్యే ప్రయత్నం చేయనిచో, వామపక్ష ప్రజాస్వామ్యశక్తుల ఐక్యత యెడల ప్రజలకు పూర్తి విశ్వాసం యేర్పడదని, ప్రజాసామాన్యం మూకుమ్మడిగా వామపక్ష వర్గాలతో కలియుటకు ప్రవాహంగా రాజాలదని స్పష్టంచేసింది. అంతేగాక ప్రస్తుత పరిస్థితులలో వామపక్ష శక్తులు ఐక్యమగుట మాత్రమే చాలదని, కాంగ్రెసును, ప్రజాస్వామ్య పక్షాలను అనుసరించుతున్న ప్రజలు అని రెండుగా ప్రజాసామాన్యం చీలియున్న దశనుండి, అందరిని వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యకార్యాచరణ, సంఘటనలలో సమీకరించే ప్రయత్నం,

అవగాహన వుండాలని నివేదిక వివరించింది. ఈ ప్రయత్నంలో కాంగ్రెసు, జనతాపార్టీలను అనుసరించే ప్రజాసామాన్యాన్ని కూడ సంఘటన సమీకరించగలగాలి. ఈ సందర్భంలో సి.పి.ఐ. ప్లాట్ఫాట్ పార్టీ కాంగ్రెస్ ప్రజలలో యేర్పడిన యీ అఘాతాన్ని అధిగమించే ఎత్తుగడలు అవలంభించాలని స్పష్టం చేయుట గుర్తుపెట్టుకొన వలసివుంటుంది. అదేవిధంగా జనతాపార్టీని తదితర మితవాద అభివృద్ధి నిరోధకులను అనుసరించే వారిని ఆకర్షించి, సమీకరించాలని పేర్కొనబడింది. జాతీయసమితి సమీక్ష నూతనంగా జనతాపార్టీలోని ప్రజాస్వామ్యశక్తులను కూడ చేర్చింది. ఈవిధంగా, వామపక్ష ప్రజాస్వామ్యశక్తుల సంఘటనకు విస్తృత స్వరూపం చేకూర్చింది.

ఈ అంశాలతోపాటు సి.పి.ఐ. ఎత్తుగడలమార్పులో రెండు ప్రధానాంశాలు గమనించాలి. అవి ఒకటి, పార్టీ స్వతంత్ర పాత్ర, పునాది, స్వరూపంలను నొక్కిచెప్పట సంకుచిత స్వప్రయోజనము, సెక్టేరియనిజం దృక్పధంతో కాక, నేటి వాస్తవికత, మరేయితర పార్టీ వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతను ప్రధానంగా తమ రాజకీయ పంథాలో చేర్చి వుండకపోవుటను గుర్తించాలి. ఈ కర్తవ్యనిర్వహణలో పార్టీ స్వతంత్ర పాత్ర, శక్తిని పెంపొందించుటనుండి అత్యంత తోడ్పాటు లభించుతుంది. అదే కాలంలో సంఘటనలోని భాగస్వామ్య పార్టీలున్నీ తమ స్వతంత్ర పాత్రను, బలాన్ని పెంచుకొనుటను గుర్తించుతుంది. అట్టి దృక్పధమే సంఘటనను బలోపేతం చేస్తుంది. రెండవది, విప్లవాత్మక ప్రత్యామ్నాయ దృక్పధాన్ని నొక్కి చెప్పింది. ఏదోవిధమైన ఐక్యత రూపొందించుటకాదు. ఏదోవిధమైన మార్పుకు కాదు. ఐక్యత, ప్రభుత్వ నిర్మాణ స్వరూపాన్ని వర్గపాలన ప్రాతిపధికయైన ముఖ్యాంశాన్ని మార్చుటగా నెంచాలి. అదే వామపక్ష ప్రజాస్వామ్య, ప్రత్యామ్నాయ నిర్మాణంలోని విప్లవాత్మకాంశము. ముఖ్యమైనది కార్మిక కర్షక ఐక్యతలను క్రింది నుండి నిర్మించుట, యిది వొక్క పోరాటాల ద్వారానే సాధ్యపడుతుంది. అదే పోరాట ఐక్యత, ఐక్యతకై పోరాటం, సుదీర్ఘకాలం చేయవలసివుంటుంది. అదే అన్ని అవాంతరాలను అధిగమించగలుగుతుంది. అది వొక వర్గపోరాట రూపం అగుతుంది.

భూపేష్ గుప్తా భటిండా రాజకీయంగా, అంతర్గతంగా ఎదుర్కొన్న అవాంతరాలను పేర్కొంటూ "భటిండా పంథాను అమలు చేయుటలో వ్యతిరేక గ్రూపుల ప్రయత్నాలు, పార్టీని చీల్చగలమనే బెదిరింపులు, జాతీయ సమితి నిర్ణయాన్ని మార్చలేకపోయాయి. భటిండా పంథాను జాతీయ సమితి నిజాయితితో, చొరవతో, శక్తివంతంగా, హృదయపూర్వకంగా అమలు చేయుటతో వ్యతిరేకులు, ఇందిరా అనుకూలురు, అవకాశవాద రాజీవాదులు, వక్రీకరణవాదులుగా అప్రదిష్టపాలై, ముసుగుతొలగి బయటివడిపోయారు." అని పార్టీ అంతర్గత సైద్ధాంతిక పోరాటంపైనాడు వ్యాఖ్యానించారు. అంతేగాక, రాజకీయ సమీక్షానివేదిక, అనేక సైద్ధాంతిక, రాజకీయ సమస్యలపైగల తప్పుడు అవగాహనలను సరిదిద్ది, వివరించి, పార్టీ సరైన ఎత్తుగడల పంథాను రూపొందించుకొనగల చొరవను యిచ్చిందని వివరించారు.[1]

---

1. *భూపేష్‌గుప్తా (1980) రిమెంబరింగ్ భటిండా, పార్టీ లైఫ్ నం. 1. జూన్ 22 1980 పే. 10-11.*

## 1.6. అంతర్గత సైద్ధాంతిక పోరాట ఫలితాలే భటిండా, జలంధర్ కాంగ్రెసుల సుముఖ అంశాలు

బూర్జువా వర్గపుపాలక రాజకీయశక్తుల ఆలోచన, ఆచరణ యెప్పుడూ కార్మికవర్గాన్ని, వామపక్ష శక్తులను చీల్చి, బలహీనపరచుట చేస్తూనే వున్నవి. అవే ఆవర్గపు వ్యూహం, ఎత్తుగడలు. అందుకు అసెంబ్లీ, పార్లమెంటు మంత్రివర్గాలలో స్థానాలు లేక యితర రాయితీలు యిస్తారు. అంతేగాక, విప్లవ శక్తులను సైద్ధాంతికంగా, రాజకీయంగా భ్రష్టు పట్టించుటకు పాలకవర్గాలు ముఖ్య కర్తవ్యంగా పెట్టుకొన్నవి.

బీహారులో ఎన్నికలు, పార్లమెంటరీ విధానం, రాజకీయ గ్రూపులు, గూండాలు సాయుధులై వోటరులను భయభ్రాంతులను చేసి “రిగ్గింగు” యధేచ్ఛగా చేయుటతో “పెద్దమోసంగా” తయారయ్యాయి. బూర్జువా వర్గం సంక్షోభంలో పడుటతో “హింసా, దౌర్జన్యమే రాజకీయ విధానమైంది” వొక జాతీయ వుపద్రవంగా రూపొందింది. బీహారులో ఎన్నికలు” బ్యాలెట్‌తో గాక తుపాకి గొట్టం ద్వారా” జరుగుతున్నాయి. ఇట్టి ఎన్నికలలో, జనవరి –మేలలో సి.పి.ఐ. భటిండా రాజకీయవిధానం తుడిచి పెట్టుకొని పోయిందని ఆశించిన మితవాద, అతివాదవర్గాలు నిరాశ చెందాయి. తమ అభిప్రాయాలను మార్చుకొనవలసివచ్చింది. సి.పి.ఐ లో వూగిలాడే వర్గాలకు కేరళలో ఐక్యసంఘటన విజయాలు కనువిప్పుకలిగించాయి, ఫలితంగా జాతీయ సమితి అవగాహనలకు మరింత బలంచేకూరింది. భటిండా పార్టీ కాంగ్రెసులో ఆత్మ విమర్శనను వ్యతిరేకించిన కొన్ని వర్గాలు, ప్రత్యామ్నాయ రాజకీయ విధానాన్ని ప్రతిపాదించిన వారు, ఎన్నికలలో ఇందిరాగాంధీతో అవగాహనకు రావలసివుంటుందని సిద్ధాంతీకరించినవారు, ఎన్నికలలో సి.పి.ఐ. విజయంతో తమ వైఖరులను పునర్విచారించుకొని, జాతీయసమితి అవగాహనలను పూర్తిగా అంగీకరించారు. కాని దీనర్థం అభిప్రాయభేదాలు పూర్తిగా సమసిపోయాయనిగాని, రాజకీయ సంపూర్ణ ఐక్యత యేర్పడిందని కాని చెప్పజాలము.

భటిండా పంథాను కుచ్చిత బుద్ధితో వక్రీకరించి, తప్పుడుగా చిత్రీకరించి, పార్టీ ఎన్నికల ఎత్తుగడలు “భటిండా పంథాననుసరించి” లేవన్నారు. పార్టీ రాజకీయ సమీక్షా నివేదికను, ముఖ్యంగా అత్యవసరపరిస్థితి పైచేయబడిన ఆత్మ విమర్శనను, ఇందిరాగాంధీపై చేసిన తీవ్రవిమర్శనను వ్యతిరేకించిన పార్టీ వర్గాలే, ఎన్నికల ఎత్తుగడలను వ్యతిరేకించుటలో ఆశ్చర్యపడనవసరంలేదు. అయితే భటిండా పంథాను బలపరచిన వారు కూడా కొందరు ఎన్నికల ఎత్తుగడలను వ్యతిరేకించారు. కొందరు కోరిన విధంగా సి.పి.ఐ జాతీయసమితి, కీలక సమస్యయైన ఎన్నికల ఎత్తుగడలలో ఇందిరాగాంధి ననుసరించి అధిక స్థానాలను పొందగలిగినా, రాజకీయంగా పార్టీ భటిండా పంథా విడనాడినట్లు అయ్యేది. పైగా వ్యూహన్ని గాలికి వదలివేసి ఎత్తుగడలకు ప్రాధాన్యత నిచ్చినట్లు అయ్యేది. మరోమాటలో పూర్తి మితవాద అవకాశవాదమయ్యేది. కార్మిక, కర్షక, విప్లవ వర్గాలలో పార్టీసంబంధాలు బలహీనమయ్యేవి. పార్టీలో రాజకీయ చైతన్యం సన్నగిల్లేది. పార్టీశ్రేణులలో పోరాట శక్తి బలహీనపడేది. వామపక్ష ప్రజాస్వామ్య శక్తుల

ఐక్యసంఘటనా నిర్మాణ ప్రయత్నాలు మరుగునపడేవి. వర్గ విప్లవ వ్యూహం. పార్టీ కాంగ్రెసు రాజకీయవిధానం తెలియజేసే మౌలికాంశాలు యివి.

నాడు మనం "కాకస్, రాజ్యాంగేతర అధికార శక్తి" "అధికార దురహంకారతత్వం" వగైరాలుగ మనం యిచ్చిన నిర్వచనం నేడు రాజకీయ పదజాలంలో భాగమైంది. సైద్ధాంతికంగా "అధికార దురహంకార తత్వాన్ని" సరళీకృతం చేసే ప్రయత్నం కూడ జరిగింది. ఇందిరాగాంధీకి వ్యతిరేకంగా "అధికార తత్వదురహంకార తత్వమనే" నినాదాన్ని, సామ్రాజ్యవాదం మద్దతుతో గుత్తపెట్టుబడిదారి వర్గాలు పైకి తెచ్చాయని సమర్ధించే ప్రయత్నం జరిగింది. పార్టీ 1961 విజయవాద కాంగ్రెసు రాజకీయ తీర్మానంలో "ప్రజాస్వామ్య వ్యతిరేక అధికార దురహంకార తత్వవైఖరి ఎక్కువగుతున్న"[1] దని పేర్కొనుటను యిప్పుడు వుదహరించి గుర్తు చేయవలసి వస్తున్నది.

"వామపక్ష ప్రజాస్వామ్య శక్తులతో ఐక్యత నెరపే మాప్రయత్నాలను అసహన విమర్శలు, వ్యాఖ్యలకు గురి చేసారు. కేరళ ప్రజాసామాన్యానికి ద్రోహం చేస్తూ సి.పి.ఐ(యం) కు లొంగిపోయి, పార్టీని రద్దు చేయువిధానాన్ని చేబట్టామని నిందించారు. కా॥ వాసుదేవనాయర్ చే మంత్రిపదవికి రాజీనామా చేయించామని, నంబూద్రిపాద్ ఆదేశాలను, సాహసికవాదియైన ప్రయోద్‌దాస్ గుప్తా ఆజ్ఞలను శిరసావహించామని నిందించారు. మన పార్టీ ఆత్మగౌరవాన్ని, ప్రతిష్టను, మన కార్మికవర్గ పోరాటాలు ఆత్మత్యాగాలతో నిర్మించుకొన్న దానినంతా కోల్పోయామని, మన విమర్శకుల వలె ప్రశ్నించుచున్నారు. జనవరిలో జరిగిన లోక్‌సభ ఎన్నికలలో ఇందిరాగాంధి తోకపట్టుకొనిపోవుటకు నిరాకరించి, అధికార దురహంకార తత్వానికి, మత, కుల తత్వాలకి వ్యతిరేక వేదికగా, వామపక్ష ప్రజాస్వామ్య పార్టీల ఐక్యతను నిర్మించుటకు నిర్ణయించుకొన్నందున, అతి పరుషంగా దుర్భాషలాడారు.[2]

"మద్రాసులో "ఎఐఎడియంకె"తో మా ఎన్నికల అవగాహనను, లోక్‌సభ ఎన్నికల సందర్భంలో జరిగిన దానిని ఖండించారు. "మిత్రకూటమి" ఎన్నికలలో వోడిపోవుట జరిగింది. కాని, అయిదు మాసాలలో జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో కాంగ్రెసు, డి.యం.కె. ఎన్నికల కూటమిపై "మిత్రకూటమి" విజయాన్ని సాధించింది.

"ఈ వాస్తవాలు ముఖ్యమైనవి అనుటలో సందేహంలేదు, కాని విప్లవవ్యూహం, ఎత్తుగడలు సందర్భంలో పార్టీ ఎన్నికల విజయాలు, అపజయాల గణాంకాలు, కమ్యూనిస్టుపార్టీ రాజకీయపంథానిగాని, వామపక్ష ప్రజాస్వామ్య ఉధ్యమాన్నిగాని సరిగా యేమాత్రం ప్రతిబింబించ జాలవు.

సామ్రాజ్యవాద, గుత్తపెట్టుబడిదారి, భూస్వాముల వ్యతిరేక నైజములో జాతీయ ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలకు కట్టుబడిన, జాతీయ దేశభక్త బూర్జువావర్గ ప్రతినిధిగా ఇందిరాగాంధిని అర్థం చేసుకొనుటలో సి.పి.ఐ విఫలమైందనే విమర్శనకు భూపేష్

---

*1. భూపేష్‌గుప్తా (1980) రిమెంబరింగ్ భటిండా పార్టీ లైఫ్, నం.1. జూన్ 22, 1980 పే. 12.*

*2. భూపేష్‌గుప్తా (1980) రిమెంబరింగ్ భటిండా, పార్టీ లైఫ్ నం.1. జూన్ 22 1980 పే. 1.*

గుప్తాయిలా సమాధాన మిచ్చారు. "స్వాతంత్ర్యానంతరం మూడు దశాబ్దాలు పైగా నెహ్రూ, శాస్త్రి, ఇందిరాగాంధీలు, కాంగ్రెసు అధికారంలో లేనపుడు మూరార్జీ దేశాయ్, చరణ్‌సింగులు ప్రధానమంత్రుల కాలంలో కూడ విస్తృత సామ్రాజ్యవాద వ్యతిరేక దేశభక్త శక్తులను పాలక కాంగ్రెసులోని అట్టి శక్తులను సమీకరించు పాత్రను చేబట్టి, సి.పి.ఐ. సామ్రాజ్యవాద వ్యతిరేక పాత్రను మహోజ్వలంగా నిర్వహించిన ఉదాహరణలెన్నో వున్నవి. ఈ సామ్రాజ్యవాద వ్యతిరేక సోవియట్ యూనియన్ తదితర సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తులతో స్నేహ, సహకార, మైత్రీ సంబంధాల అభివృద్ధికి జాతీయ బూర్జువా వర్గాల, జాతి మొత్తం ప్రయోజనాలకు అనుకూలంగా వున్నందున మేము యీ కర్తవ్యాన్ని నిర్వహించగలిగాము.[1]

"మా విమర్శకులు సందర్భశుద్ధి లేకుండా, వాగాడంబరంతో కృత్రిమంగా సామ్రాజ్యవాద వ్యతిరేక సమస్యను, వర్గ సామరస్య పంథాను, మావిధానాలను వక్రీకరించి, మాపై రుద్దుటకు సాకుగా చూపి, కార్మికవర్గపార్టీ స్వతంత్ర భూమికను త్రోసి బుచ్చనెంచారు. కార్మికవర్గం బలమైన సంబంధాలతో వర్గపోరాటాలలో ఉక్కుగా రాటుదేలిన కమ్యూనిస్టుపార్టీ "మితవాద సంస్కరణవాదానికి, అతివాద సెక్టేరియన్ పెడ...ానికి" లోను కాకుండా బలమైన సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తిగా, అదే ధోరణిలో పరిణామాలపై తన ప్రభావాన్ని చూపగలిగింది. కమ్యూనిస్టుపార్టీగాని, మరే యితర సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తిగాని, వొక బూర్జువా పాలక పార్టీతోకగా యీ కర్తవ్యాన్ని నిర్వహించజాలదు.

"మన పార్టీ జాతీయ సమితిని, ముఠాచర్యలుగాని, పార్టీని చీల్చుతామనే బెదరింపులుగాని, భటిండా పంథాని ఆచరణలో పెట్టుటను అడ్డు కొనజాలక పోయాయి. నాయకత్వ సమర్థత, జాతీయ సమితి హృదయపూర్వక విశ్వాసపాత్ర, భటిండా పంథాయెడల ధృఢమైన విశ్వాసం వలన జరిగింది. కాని మరేవిధమైన "మంత్రజాలం" వలనకాదు. భటిండా రాజకీయ విధాన వ్యతిరేకవర్గాలు బయటిపడి పోవుటతో ఇందిరాగాంధీ అనుకూల అవకాశవాదులు, పెడధోరణి వాదులుగ, రాజీవాదులుగ బహిర్గతమై గౌరవాన్ని కోల్పోయారు.[2]

ఇప్పుడు సి.పి.ఐ (యం) జలందర్ కాంగ్రెసు వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనపై సుముఖ అవగాహన వచ్చుటకు తోడ్పడిన అంశాలను సూక్ష్మంగా తెలుసుకొందాము.

ఆగస్టు 1978లో పీపిల్సుడెమోక్రసీ, సి.పి.ఐ (యం) అధికార పత్రిక సంపాదకీయంలో "సి.పి.ఐ. అడకత్తెరలో" అనే శీర్షిక క్రింద తీవ్రంగా దాడి చేయుట వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత లేక సంఘటన యేర్పాటుకు యేవిధంగా తోడ్పడుతుందో అర్థం చేసుకోలేము

---

1. *భూపేష్‌గుప్తా (1980) రిమెంబరింగ్ భటిండా, పార్టీ లైఫ్ I, జూన్ 22 1980 పే. 3–4.*

2. *భూపేష్‌గుప్తా (1980) రిమెంబరింగ్ భటిండా II. పార్టీ లైఫ్ జూన్ 7 1980 పే. 29.*

మితవాద అభివృద్ధి నిరోధక, మత శక్తుల ప్రమాదం యెక్కువైందని అతివాదవర్గాలు అన్నీ గుర్తించిన నేడు సి.పి.ఐ(యం) మెజారిటి వర్గానికి నాయకత్వం వహించే జనరల్ సెక్రటరీయే వారి పత్రికలో, సి.పి.ఐతో ఎట్టి ఐక్యకార్యాచరణ సాధ్యం కాదనే ధోరణిలో, తన దాణికి పదును పెట్టుట ప్రతివారు గమనించే వుంటారు. రెండు పార్టీల మధ్యగల భేదాభిప్రాయాలు కారణంగా, వాటి మధ్య ఎట్టి ఐక్యకార్యాచరణ అసాధ్యమని సెక్రటరీయే దేశమంతటా ప్రచారం సాగించారు.

ప్రజా సమస్యలపై గూడ ఐక్యకార్యాచరణ, ట్రేడు యూనియనుల, కిసాన్ సభల మధ్య సాధ్యమగుటకు అనేక అడ్డంకులు కలవంటున్నారు. పరిస్థితి గతంలో కంటె విషమించింది. ప్రజాసంఘాల సి.పి.ఐ(యం) నాయకత్వాలు మరిన్ని షరతులు పెట్టుతు, జనతా ప్రభుత్వ వ్యతిరేకంగా ఎట్టి నినాదాలుగాని, లక్ష్యాలుగాని వుండరాదంటున్నారు. పాలక పార్టీ జనతా వ్యతిరేక నినాదాలు వుండరాదనుట, ప్రజల సమస్యలపై వారిని సమీకరించుటకు యెట్లు తోడ్పడుతుందో అర్థం కాదు. దీనిని బట్టి సి.పి.ఐ (యం) నాయకత్వపు మెజారిటి సి.పి.ఐతో ఆర్థిక సమస్యలు, ప్రజాదైనందిన సమస్యలపై కూడ ఎట్టి ఐక్యకార్యాచరణ కూడదనే అభిప్రాయానికి వచ్చినట్లు కన్పడుతుంది.

సి.పి.ఐ(యం) నాయకత్వం వామపక్ష ఐక్యతా కార్యక్రమం చేబట్టి నా ఆచరణలో అవకాశవాదాన్ని అంటి పెట్టుకొని వుండటతో యేర్పడిన వైరుధ్యం స్పష్టమగుతున్నది. లేనిచో వామపక్ష ఐక్యతా నినాదాన్ని ఆచరణ నినాదంగా కాక ప్రచార ఎత్తుగడ నినాదంగా చేబట్టారని అనుకొనవలసి వుంటుంది. పార్టీ శ్రేణులు యీ వైరుధ్యాన్ని చూడగలిగి ప్రశ్నించ మొదలిడినందున కావచ్చు, లేదా రాజకీయ విధానం వొకవైపు, ఆచరణ మరోవైపు పయనించుట, యీ అనిశ్చిత పరిస్థితి యెంతో కాలంసాగదనిపిస్తున్నది.

ఏ పాలక బూర్జువా, భూస్వామ్య పార్టీ నైనా కనీసం రాజకీయంగా అంటరానిదనేది, "సి.పి.ఐ (యం) రాజకీయ సిద్ధాంతంగా" కన్పడుతున్నది. అయివంటి రాజకీయపార్టీలలో "అభ్యుదయకరమైనదేదీ వుండదనేది కూడ యీ సిద్ధాంతంలో భాగంగానే వున్నట్లున్నది. ఈ సిద్ధాంతం పెట్టుబడిదారి వర్గపాలక పార్టీలపై నిరవధికంగా దాడిచేసి చిన్నాభిన్నం చేయుట, నిజమైన విప్లవ వైఖరిగా చెప్పబడుతున్నది. జలంధర్ పార్టీ కాంగ్రెసులో మెజారిటి నాయకత్వం సమర్పించిన 1972 -79 సమీక్షా నివేదికకు కా॥ సుందరయ్యా తన అనంగీకారాన్ని స్పష్టం చేసారు. ప్రజాస్వామ్య రక్షణకై "విస్తృత సఖ్యత"ను నిర్మించాలని, దానిని కేంద్రవరకు విస్తరింపజేయాలని, అంటే జనతా పార్టీ ప్రభుత్వాన్ని బలపరచాలని, అది కొనసాగుటకు ఐక్యంగా నిలబడుటకు అన్ని విధానాల తోడ్పడాలని పార్టీ నిర్ణయంగా కన్పడుతున్నది. ఈజనతాపార్టీ, జనసంఘం, రాష్ట్రీయస్వయం సేవకసంఘం, భారతీయలోక్‌దళ్‌ల కలయికలతో యేర్పడింది. ఇది మితవాద అభివృద్ధి నిరోధక కూటమి. దీని ప్రభుత్వాన్ని బలపరచుట అంటే, సి.పి.ఐ(యం)కు వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత, ఐక్యసంఘటనలపై అనగా జలందర్ పార్టీ కాంగ్రె నిర్ణయాలపై పూర్తి విశ్వాసం లేదు అనుకొనాలి లేదా "విస్తృత ఐక్యత"కు జనతా పార్టీ, సి.పి.ఐ(యం)ల

"విస్తృత ప్రజాస్వామ్య ఐక్యత" జనతా ప్రజాస్వామ్యానికి దారి తీసేదిగా వివరం చెప్పుకొనవలసివుంది. బెంగాల్‌లో సంకీర్ణ ప్రభుత్వ యేర్పాటుకు జనతా పార్టీకి ఎన్నో విధాల సి.పి.ఐ(యం) నచ్చజెప్పుటకు ప్రయత్నించుట, త్రిపుర సంకీర్ణ ప్రభుత్వంలో చేరుటను బట్టి పైవిధంగా అర్థం చేసుకొనుటకు అవకాశం యెక్కువగా వుంది. అంటే జనతా పార్టీతో కలియుట, ఇందిరాగాంధి పాలన తిరిగి రాకుండుటకు మాత్రమే కాదు, విస్తృత ప్రజాసామ్య విధానం, కార్యక్రమాన్ని అమలు చేయుటకు అని చెప్పవలసి వస్తుంది.

పాలక బూర్జువా వర్గ పార్టీలను ఎల్లవేళలలో, అన్నిచోట్లా "ప్రధాన శత్రువులుగా" నెంచాలనే సిద్ధాంతానికి, యీ ఆచరణకు పొత్తు ఎలా కుదురుతుంది? అట్టి పాలక బూర్జువా వ్యవస్థలను విడనాడి వస్తేనే అభ్యుదయకర వాదిగా చెప్పే "సిద్ధాంతానికి" దీనికి పొత్తు ఎలా కుదురుతుంది. అనే ప్రశ్నలు వుదయించక మానవు.

ఈ అవగాహనల దృష్టిలో కేంద్రంలో బూర్జువా, భూస్వామ్య ప్రభుత్వం అధికారంలో వున్నపుడు, వొక రాష్ట్రంలో యేర్పడిన వామపక్ష ప్రజాస్వామ్య ప్రభుత్వం చేబట్టవలసిన దృక్పదం, ఆచరణ పంధా అనే సమస్యలు పైకి వచ్చాయి. ఈ విషయంలో సి.పి.ఐ (యం) సిద్ధాంత వైఖరి, రాష్ట్ర ప్రభుత్వంపాలన సాగిస్తూనే కేంద్రంతో ఆచరణలో పనిచేయాలనే దానిని అధికార రీత్యా నిరాకరించుటగాని, సమీక్షించి తప్పని త్రోసి బుచ్చుటగాని జరుగలేదు. కేంద్రంలో అధికారం సంపాదించకుండా గణనీయమైనదేనిని రాష్ట్ర ప్రభుత్వం చేయలేదని, అంచేత ప్రజలకు కొద్ది సౌకర్యాలు, రాయితీలు కలుగజేయుట ప్రజలలో రాజ్యాంగ చట్టం యెడల భ్రమలను కలుగజేస్తుందని, కాన రాజ్యాంగాన్ని పూర్తిగ త్రోసి బుచ్చాలనేది, సి.పి.ఐ(యం) సిద్ధాంతంగా వుంది. దాని ప్రకారమే పశ్చిమబెంగాల్, కేరళ రాష్ట్ర ప్రభుత్వాలను సి.పి.ఐ (యం) 1969-70లలో భగ్నం చేసింది.

ఇప్పుడు పశ్చిమ బెంగాల్, త్రిపుర ప్రభుత్వాల ఆచరణ పూర్తిగా సి.పి.ఐ(యం) సిద్ధాంతాల అవగాహనకు భిన్నంగా వుంది. కేంద్ర ప్రభుత్వంతో ఎట్టి పరిస్థితులలోను సంఘర్షించరాదు, పైగా సంఘర్షణ రాకుండా చూచుకొనాలని, ఆర్థికాభివృద్ధిని సాగించాలనే పేరుతో గుత్త పెట్టుబడి, బహుళ జాతుల అంతర్జాతీయ సంస్థలకు స్వాగతం చెప్పుతున్నారు.

నేడు ఐక్యతగాని, ఐక్యసంఘటనగాని సి.పి.ఐ(యం) ద్వారా కార్మికవర్గ నాయకత్వం వహించనిచో పరిగణలోనికి తీసుకొన తగినది కాజాలదు, అనేది సి.పి.ఐ(యం) సిద్ధాంతం. సి.పి.ఐ(యం) అధికార అగ్రనాయకత్వం, పార్టీ నాయకత్వ షరతులను విధించలేదని ఎగతాళి పట్టించింది. ప్రధానమైనది కార్యక్రమంలోని అంశాల ఆమోదమని, వాటిలో కొన్నిటినైనా ఆచరణలోనికి తెచ్చుటకై ప్రజలను కదిలించుట అనే సి.పి.ఐ వైఖరిపై తీవ్రవదాడిని, సి.పి.ఐ (యం) సాగించింది. కాని సి.పి.యం తదనంతరం ఆచరణ సిద్ధాంతానికి పూర్తి బిన్నంగా వుంది. "విస్తృత ప్రజాస్వామ్య సంఘటనలో నాయకత్వ

సమస్య కూడ వదలి వేయబడింది. పంజాబ్‌లో అకాలీలతో ఐక్యసంఘటన, తదనంతరం జనతాపార్టీతో, మహారాష్ట్రంలో కాంగ్రెసులోని వొక గ్రూపు నాయకుడు శరద్‌పవార్‌తో సి.పి.ఐ(యం) ఐక్యకసంఘటనలో భాగస్వామి అగుటయే సరళీకృత విధానాలకు వుదాహరణగా చెప్పవచ్చును. ఇదంతా ఎత్తుగడలలోని అవకాశవాద సరళీకృత విధానం తప్ప మరొకటి కాదు.

ఈ సందర్భంలో జనరల్ శెక్రటరీ కా॥ సుందరయ్య సి.పి.ఐ(యం) అవలంభించుతున్న వైఖరిని ముఖ్యంగా జనసంఘం, రాష్ట్రీయ స్వయం సేవకసంఘం, భారతీయ లోక్‌దళ్‌తో సంయుక్త కార్యాచరణలను యు.పి., పంజాబ్, మహారాష్ట్ర తదితర రాష్ట్రాలలో తీవ్రంగా వ్యతిరేకించారు. అదేవిధంగా, కార్మికవర్గ ఐక్యత అనే పేరుతో సి.పి.ఐ(యం); "సీటు"లు భారతీయ మజ్దూర్ సంఘంతో సంయుక్త కార్యాచరణను వ్యతిరేకించారు. అంతేగాక తాను 1975లో సి.పి.ఐ (యం) జనరల్ శెక్రటరీ పదవికి, పొలిట్ బ్యూరో సభ్యత్వానికి రాజీనామా ఎందుకు చేయవలసి వచ్చిందో తెలుపుతు, యితర అనేక కారణాలతోపాటు మితవాద అభివృద్ధి నిరోధక ఫాశిస్టు శక్తులైన జనసంఘం, స్వయం సేవక సంఘాలతో సి.పి.ఐ (యం) సంయుక్త కార్యాచరణను చేబట్టుట ప్రధాన కారణంగా పేర్కొన్నారు. "నారాజీనామాకు కారణం, కేంద్రసమితిలోని మెజారిటి, సామ్రాజ్యవాదం వైపు మొగ్గు చూపే జనసంఘం, రాష్ట్రీయ స్వయం సేవక సంఘం, ఫాశిస్టు కవాతు దళాలతో సంయుక్త కార్యాచరణకు నిర్ణయించింది. మనం, మనపార్టీ, మనదేశంలోని, విదేశాలలోని ప్రజాస్వామ్యశక్తుల నుండి దూరమగుతామని, మన పార్టీకి అది తీవ్ర నష్టాన్ని కలుగజేస్తుందని నేను పరిగణించుతున్నాను. సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రపంచ ప్రజాస్వామ్య, సోషలిస్టు శక్తుల నుండి దూరమగుతామని" పేర్కొన్నారు. నేడు రెండు శతాబ్దాలు పైగా కాలచక్రం తిరిగిన తరువాత, రాజకీయపరిణామాలు అక్షరాల సుందరయ్య చెప్పినట్లే జరుగుట ప్రతి వొక్కరు స్పష్టంగా చూడగలరు.

భటిండా, జలందర్ పార్టీల కాంగ్రెసులలో వామపక్ష ప్రజాస్వామ్యశక్తుల ఐక్యతను బడాబూర్జువా, భూస్వామ్య, మతతత్వ శక్తులకు వ్యతిరేకంగా నిర్మించాలనే నిర్ణయాలు, ఆపార్టీలలో సుదీర్ఘ అంతర్గత సైద్ధాంతిక తీవ్ర పోరాటాల ఫలితంగా లభించిన విజయాలు.

సి.పి.ఐ.లో కాంగ్రెసుతో రాజకీయ ఐక్యసంఘటనను, ఎన్నికలలో కాంగ్రెసును బలపరస్తూ, వారితో సర్దుబాటులు చేసుకొనాలనే మితవాద, సంస్కరణవాదాన్ని చేబట్టిన మైనారిటికి వ్యతిరేకంగాను, సి.పి.ఐ(యం)లో జనసంఘం, స్వయంసేవక సంఘ ఫాశిస్టు శక్తులతో ఐక్యకార్యాచరణను వ్యతిరేకంగా మైనారిటివర్గం, ఆయా పార్టీలలో సాగించిన సైద్ధాంతిక తీవ్ర పోరాటాల ఫలితంగానే, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత, ఐక్యసంఘటనలపై సానుకూల, సుముఖ నిర్ణయాలు జరిగినవి.

## 1.7. వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతపై కొన్ని వివేచనాంశాలు.

భారత కమ్యూనిస్టువర్గాలు 1980 దశకపు ఉత్తరార్థంలో "పెట్టుబడిదారి విధానం బహుముఖ సంక్షోభమార్గంలో పయనిస్తుందని" లోక్‌సభ ఎన్నికలలో జనతాపార్టీ, జనసంఘంల కూటమి విజయం పొందటంతో దేశ రాజకీయాలలో తిరోగమనం ప్రారంభమై, అభివృద్ధి నిరోధక మతశక్తుల ప్రతీఘాతుక విప్లవం నేడు ప్రారంభమైందని విశ్లేషణగావించాయి. దైనందిన సమస్యలపై కార్మికవర్గపోరాటాలు వొక నూతన దశకు చేరుకొన్నవి. కార్మికవర్గంలో యీ పోరాటాలను ఆర్థిక పోరాటాలుగానే చూచుట పొరపాటు. కార్మికవర్గం 1980 దశకం ప్రారంభంలో కోల్పోయిన కార్మికసంఘాల హక్కులు, సి.డి.యస్, బోనస్ వ్యతిరేక చట్టాలకు వ్యతిరేకంగా యీ పోరాటాలు జరుగుచున్నవని యెంచాలి. వీటితోపాటు రాజకీయ సమస్యలపై ఐక్యతను పెంపొందించుట, గ్రామీణ రైతాంగ, బడుగువర్గాలతో కార్మికవర్గ ఐక్యతను పెంపొందించుట ప్రత్యేక ప్రాముఖ్యత వహించుతుంది. జనతాపార్టీ గ్రామీణ ప్రాంతాలలో పైవర్గాలను ఆకర్షించే కార్యక్రమాలతో, వారిలో భ్రమలు కలుగజేస్తుంది. వ్యవసాయ భూములపై గుత్తాధికారాన్ని, మార్కెట్టుపై గుత్త వ్యాపారుల "పిడికిలిపట్టు"ను, ప్రభావాన్ని రద్దు చేయనిదే గ్రామీణాభివృద్ధి అసాధ్యము. అభ్యుదయకర వ్యవసాయ భూముల సంస్కరణలకు గ్రామీణ రైతాంగాన్ని పేదరైతులను, వ్యవసాయ కూలీలను, యితర బడుగువర్గాలను సమీకరించనెంచాయి. నేడు వామపక్ష, ప్రజాస్వామ్య ఐక్యత కాంగ్రెసులోని అభ్యుదయ వర్గాలతో రూపొందించవలసిన ఆవశ్యకత యెంతో వుంది.

జులై 1977లో సి.పి.ఐ జాతీయసమితి, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతను నూతన దృక్పథంలో ప్రతిపాదించింది. లోక్‌సభ ఎన్నికలలో జనతాపార్టీ, జనసంఘకూటమి విజయం సాధించిన నేపథ్యంలో యీ నూతన కర్తవ్యాలను చేబట్టింది. అననుకూల పరిస్థితులలో జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో, బీహార్ యు.పి, పంజాబ్, ఢిల్లీ, తమిళనాడు తదితర రాష్ట్రాలలో కమ్యూనిస్టుల బలాన్ని కొంతమెరుగుపరచుకొనుట జాతీయసమితి దృష్టికి వచ్చింది. అసెంబ్లీ ఎన్నికలలో జనతా ప్రభుత్వం ఎడల ప్రజలలో కొంత అసంతృప్తి ప్రబలుట స్పష్టమైంది.

పశ్చిమబెంగాల్‌లో వామపక్ష సంఘటన విజయం, పురోగామిశక్తుల ఐక్యతాభివృద్ధికి ఎంతో తోడ్పడింది. జనతా, కాంగ్రెసు ప్రభుత్వాలు దేశం యెదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించజాలవు. "వామపక్ష ప్రజాస్వామ్యశక్తుల ఐక్యపోరాటాలకు అవకాశాలు పెరుగుతున్నవని జాతీయసమితి విశ్లేషణ స్పష్టం చేసింది." కమ్యూనిస్టు వుద్యమం సూత్రబద్ధంగా ఐక్యమగుటకు, సుదీర్ఘ రాజకీయ సైద్ధాంతిక పోరాటమే ఐక్యతామార్గంగా సి.పి.ఐ గుర్తించింది." సి.పి.ఐ., సి.పి.ఐ(యం) ల నాయకత్వంలోని ప్రజాసంఘాల మధ్య అనేక ఆటంకాలున్నా ఐక్యకార్యాచరణ అవసరం, సాధ్యమని ఆ పార్టీల కంటే కార్మిక, కర్షక, తదితర ప్రజాసామాన్యమే అట్టి అవగాహనకు ముందుగా వస్తున్నారు. ప్రజల ఆశలను, అభిప్రాయాలను కమ్యూనిస్టుపార్టీలే గుర్తించలేదు. అయితే, సి.పి.ఐ

మాత్రం "ఐక్యకార్యాచరణలకు సిద్ధమని, తాముగా ఎట్టి షరతులు పెట్టమని స్పష్టం చేసింది. అంతేగాక, "ఐక్యకార్యాచరణకు ముందుకు రావలసిందిగా" సి.పి.ఐ(యం)కు సి.పి.ఐ విజ్ఞప్తి చేసింది. అంతేగాక, సి.పి.ఐ (యం.యల్) గ్రూపులన్నిటికి "అభివృద్ధి నిరోధకుల వ్యతిరేకంగా ఐక్యకార్యాచరణకై తన స్నేహ హస్తాలను చాచుచున్నదని" సి.పి.ఐ. జాతీయ సమితి విజ్ఞప్తి చేసింది.

"ఈ సందర్భంలో పశ్చిమ బెంగాల్ వామపక్ష సంఘటన ప్రభుత్వం, కేరళలోని ఐక్యసంఘటన ప్రభుత్వం దేశంలోని వామపక్ష ప్రజాస్వామ్య శక్తులు అగ్రగామిదళంగా పనిచేసి, ప్రధాన పాత్ర వహించగలవు. పశ్చిమబెంగాల్ ప్రభుత్వం యెడల మా పార్టీ స్పష్టమైన నిర్మాణాత్మకవైఖరిని చేబట్టగా, కేరళలో ఇ.యం.యస్. నంబూద్రిపాద్, కేరళ ఫ్రంటు ప్రభుత్వ పతనం వరకు పోరాటాన్ని ప్రకటించుట దురదృష్టకరము. కేంద్ర సి.పి.ఐ(యం) నాయకత్వం, మా పార్టీ కేరళ ఐక్యసంఘటనా ప్రభుత్వమంత్రి వర్గాన్నుండి వైదొలగి, దానిని భగ్నం చేయనిచో మాపార్టీతో ఎట్టి ఐక్యకార్యాచరణకు సిద్ధంగా లేదని స్పష్టం చేసింది."[1]

సి.పి.ఐ జాతీయసమితి తీర్మానం, ఎన్నికల అనుభవాలను పేర్కొంటూ, కాంగ్రెసును బలపరచే అశేష ప్రజాసామాన్యం ముఖ్యంగా గ్రామీణ బడుగువర్గాలు, గత కొద్దికాలంగా చైతన్యవంతులయ్యారు. కాంగ్రెసు అధికారాన్ని కోల్పోయి, ప్రతిపక్ష స్థానంలో వున్నపుడు, వారితో వామపక్ష, ప్రజాస్వామ్యశక్తులు, పార్టీలు, సహకారాన్ని, సంయుక్త కార్యాచరణను చేబట్టే అవకాశాలు పెరిగాయని వివరించింది.

వామపక్ష వుద్యమం బలహీనంగా వుండి, అభివృద్ధి నిరోధకులైన జనసంఘం, రాష్ట్రీయ స్వయం సేవక సంఘం, భారతలోక్‌దళ్‌లు బలంగా వేరూనివున్న హిందీ భాషా ప్రాంతాలలో అభివృద్ధి నిరోధకులకు వ్యతిరేకంగా ఐక్యకార్యాచరణ చేబట్టిన కాంగ్రెసువాదులు, కాంగ్రెసు ప్రజా సామాన్యం క్రింది స్థాయిలో కలసివచ్చిన వామపక్ష వుద్యమం శక్తివంతంమై ప్రాముఖ్యత వహించుతుంది. ఆప్రాంతాలలో రాజకీయ స్తబ్దత తను బ్రద్దలు చేయుటకు ఐక్యకార్యాచరణ అత్యవసరము. ప్రజలహక్కులను, కోర్కెలను సాధించుటకు పార్టీ ఐక్యప్రజావుద్యమాలతో పురోగమించాలి. వర్గశక్తుల సంబంధాలలో వాటి నూతన కలయికలలో యువతరంలో మార్పును తీవ్రంగా కోరే కార్మిక, విద్యార్థి, యువజనులలో అసంతృప్తి, అసహనం ప్రబలింది.

ఈ పరిస్థితులలో కమ్యూనిస్టు వుద్యమం ఐక్యతగా పనిచేయవలసి వుంటుందనే సమస్య ప్రముఖంగా ముందుకు వచ్చింది. తీర్మానం యిలా పేర్కొన్నది. "సి.పి.ఐ., సి.పి.ఐ(యం), సి.పి.ఐ(యం.యల్) లేక నక్సలైట్ల మధ్య సహకారాన్ని, సఖ్యతను నిర్మించుట తప్పనిసరి కార్యక్రమాలలో భాగంగా అనుసరించిన, వామపక్ష ప్రజాస్వామ్యశక్తుల, పార్టీల ఐక్యత, సంఘటనా నిర్మాణానికి దోహదపడుతుందని సి.పి.ఐ విశ్వసించుతున్నది. ఇందుకు సి.పి.ఐ., సి.పి.ఐ(యం) నక్సలైటు గ్రూపులతో సంభాషణలు

---

*1. కృష్ణన్. యస్.కె. (1977) పార్టీ లైఫ్. వా.13,నం.14., పే. 29.*

ప్రారంభించుతుంది. సి.పి.ఐ.,సి.పి.ఐ(యం) లు వాటి నాయకత్వంలోని ప్రజాసంఘాల మధ్య ఐక్యకార్యాచరణకు అనేక కష్టాలున్నా అవసరమూ, సాధ్యమూ అంటున్నది. సి.పి.ఐ. అట్టి కార్యాచరణకు తాను ఎట్టి షరతులు పెట్టనన్నది. తనకు, సి.పి.ఐ(యం) మధ్య రాజకీయ, సైద్ధాంతిక అభిప్రాయభేదాలు కొనసాగుతున్నా, అవి ఐక్యకార్యాచరణకు అడ్డు కాజాలవన్నది. భారతదేశ కమ్యూనిస్టు ఉద్యమ సూత్రబద్ధ ఐక్యతకు సి.పి.ఐ నిలబడివుందని" స్పష్టం చేసింది.

కేరళ,బెంగాల్ రాష్ట్ర ప్రభుత్వాలు అట్టి ఐక్యకార్యాచరణ అవకాశాన్ని కలుగజేసాయి. సి.పి.ఐ., సి.పి.ఐ(యం), నక్సలైట్లులోని కొన్ని గ్రూపులు సాధ్యమైనంత విస్తృత ఐక్యతను నిర్మించుటకు, సాధారణ ప్రజలకోర్కెలను చేబట్టి సహకరించినట్లయితే ఆ రెండు ప్రభుత్వాలు ఎన్నో మంచి పనులు చేసి వుండేవి. అదే కాలంలో ఆ ప్రభుత్వాలు సరిగా పనిచేయుట, ప్రజాస్వామ్య శక్తులు వాంచించే విధంగా ఐక్యతా క్రమంలో మరింతగా పురోగమించేవి.

ఈ సమస్యపై రెండు విషయాలు స్పష్టం చేయాలి. ఒకటి, ఐక్యతా విధానక్రమం సుదీర్ఘమైనదని, సి.పి.ఐ గుర్తించింది. దీనికి దగ్గరి మార్గాలు, సత్వరఫలితాలు లేవు. ఓర్పు, తెలివి, దృఢ నిశ్చయం, దీర్ఘకాలం అవసరము. రెండవది, విస్తృత వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతకు ప్రతిగా కమ్యూనిస్టు ఐక్యతను ప్రతిపాదించలేదు. ఈవిధాన క్రమం, కర్తవ్యాలు పరస్పరం సంబంధం కలిగి, పరస్పరం సహరించుకొంటవి. వామపక్ష ప్రజాస్వామ్యశక్తుల మధ్య యేర్పడే ఐక్యత బలోపేతమై విస్తరించి, కొనసాగించాలని సి.పి.ఐ కోరుతున్నది.

ఇప్పటికి యేర్పడిన సఖ్యత, ఐక్యత విస్తరించకుండా భగ్నం చేయబడితే కమ్యూనిస్టు వుద్యమ ఐక్యత ఏకీకరణ క్రమవిధానానికి పెద్దగా నష్టం జరుగుతుంది. వామపక్ష ప్రజాస్వామ్య కాంగ్రెసు వాదులు సి.పి.ఐ., సి.పిఐ.(యం), నక్సలైట్లు ఐక్యత అవసరము, సహాయకారియని గుర్తించుచున్నారు. అదేవిధంగా సరియైన అవగాహన, కాలవ్యవధివుంటే సి.పి.ఐ(యం), నక్సలైట్లు, వామపక్ష, ప్రజాస్వామ్య కాంగ్రెసువాదుల ఐక్యతా అవసరం, అది సాధ్యమని గుర్తించారు. జనతా పార్టీలో గూడ ప్రజాస్వామ్య శక్తులున్నవి. సి.పి.ఐ వీటిని గుర్తించింది. వారి యెడల సౌమ్యవిధానాన్నే అనుసరించుచున్నది.

డిసెంబరు 1978 ప్రారంభంలో కేరళలో ఎ.కె. ఆంతోని ఐక్యతా ప్రయత్నాలకై విజ్ఞప్తి చేసినపుడు ఆశ్చర్యకరమైన రెండు వాదనలను కా॥నంబూద్రిపాద్ తీసుకొచ్చారు. మొదటిది, కేరళలో ఐక్యసంఘటనా మంత్రివర్గం సి.పి.ఐ(యం) ప్రాతిపదికపై యేర్పడింది. రెండవది, సామాజిక, ఆర్థిక సమస్యలపై సి.పి.ఐ(యం) జనతా ప్రభుత్వంతో పోరాడుతుంది, కాని ప్రజాస్వామ్యం కొనసాగింపుకు శ్రీమతిగాంధి నియంతృత్వపాలన తిరిగిరాకుండా జనతాపాలనను బలపరస్తుంది. వీటిని కొంత పరిశీలిద్దాము. కేరళలోని ఐక్యసంఘటనా సంకీర్ణ ప్రభుత్వం రెండు పరిణామాలు పెనవేసుకొన్న ఫలితంగా యేర్పడింది. గతంలో 1967లో కేరళలో యేర్పడిన ఐక్యసంఘటనా ప్రభుత్వం

నంబూద్రిపాద్ ఛీఫ్‌మినిష్టరుగా యేర్పడిన సి.పి.ఐ(యం) ప్రభుత్వం. మంత్రివర్గంలోని యితరవర్గాలు శక్తిహీనమై సి.పి.ఐ(యం) పైన పూర్తిగా ఆదారపడినవి అయినట్లయితే అట్టి మంత్రివర్గం సాధ్యమయ్యేది. "మరోముఖ్యవిషయం మంత్రులు, తమశాఖలలో ఎట్టి సంస్కరణలు తెచ్చే ప్రయత్నం చేయరాదు. కారణం అది సంస్కరణవాదాన్ని ప్రోత్సహించుతుంది. రాజ్యాంగ చట్టం భ్రమలను కలుగజేస్తుందనే సిద్ధాంతాన్ని" చేబట్టారు. "మంత్రివర్గాలు కేంద్రంపై పోరాట సాధనాలుగ రూపొందాలని ఆవిధంగా రాజ్యాంగ చట్టాన్ని బ్రద్దలు చేయాలని" అన్నారు. ఈవిధానంలో, వాస్తవంగా రాష్ట్ర మంత్రి వర్గాలు "పక్షపాతం" వచ్చియేమీచేయలేక పోయాయి. సహజంగానే యీ విధానం ఐక్యసంఘటనలలో తిరుగుబాటులను తెచ్చింది. మంత్రివర్గం ప్రజలకు దూరమైందని మంత్రివర్గంలోని అందరూ, సి.పి.ఐ(యం)లోని కొన్నివర్గాలతోసహా అందరూ తలచారు. నంబూద్రిపాద్ సి.పి.ఐ.(యం) యితర నాయకులు ఎంతో సహేతుకంగా వివరించ ప్రయత్నించినా పలితం లేకపోయింది. అదే కాలంలో కేరళ యువజన నాయకుడు, కాంగ్రెసువాది శ్రీ ఆంతోని, అతని అనుచరులలో అభ్యుదయకర భావాలు అభివృద్ధి చెందగా, వారు ఐక్యసంఘటనా కనీస కార్యక్రమాన్ని పోలిన వొక కార్యక్రమాన్ని సమావేశమై ఆమోదించారు. వారు తమ పూర్వ కమ్యూనిస్టు వ్యతిరేకతను విడనాడి, కేరళలో ప్రజాస్వామ్య మార్పులకు కారణభూతులయ్యారు. వారితో సహకార, సయోధ్యతలు నెలకొల్పుట, అఖిలభారత వామపక్ష ప్రజాస్వామ్య పోరాటానికి బలాన్ని చేకూర్చింది.

ఈ పరిణామాలను సి.పి.ఐ(యం) సరిగా అంచెనావేయుటలో విఫలమైంది. నంబూద్రిపాద్ రాజీనామా చేస్తానని బెదరించారు. అసెంబ్లీ సభ్యులు, ప్రజలు తననే బలపరచుతారని ఆశించారు. సి.పి.ఐ(యం) నాయకులు నంబూద్రిపాద్‌ను ప్రతిష్టంబనను కలుగజేయవద్దని ప్రజాస్వామ్యవారులంతా కోరారు. సమస్య చివరికంటా లాగుటతో రాజీనామా చేయక తప్పలేదు. నంబూద్రిపాద్ అంచెనాలు తలక్రిందులయ్యాయి. ఐక్యసంఘటన కొనసాగింది. నూతన నాయకునిగా ముఖ్యమంత్రిగా అచ్చుతమీనన్‌ను ఎన్నుకొన్నది. ఇది 1969లో జరిగింది. ఈ ఐక్యసంఘటనా ప్రభుత్వాన్ని పడగొట్టుటను చేసిన ప్రయత్నాలు విఫలమయ్యాయి. కేరళ అనుభవాలు అఖిలభారత అనుభవాలయ్యాయి. జీవితం కేరళలో అన్ని వామపక్షాలు సహకరించుకొనాలనే పాఠాన్ని నేర్పింది.

రెండో విషయం, జనతా ప్రభుత్వంయే సామాజిక ఆర్థిక శక్తులకు ప్రాతినిధ్యం వహించుచున్నదో ఆ సామాజిక ఆర్థిక కార్యక్రమాలను వ్యతిరేకించుటలో ఎవరికీ సి.పి.ఐ(యం) తీసిపోదని అంటూ, ఆశక్తుల రాజ్యాధికారాన్ని బలపరస్తూ, ప్రజాస్వామ్యాన్ని యేవిధంగా రక్షించగలుగుతుందో అనే సి.పి.ఐ విమర్శను పూర్తిగ త్రోసివేయజాలము. అయితే, యీ విధమైన కసరత్తు సి.పి.ఐ చేసిన సందర్భాలు లేకపోలేదు. రాజకీయంగా అధికారంలో వున్న ప్రభుత్వాన్ని మౌలికంగా బలపరస్తూ, కార్మిక, కర్షక, యితర బడుగువర్గాలు, మధ్యతరగతులపై సంక్షోభ కారణంగా ప్రభుత్వం దాడి చేయువిధానాన్ని

ప్రతిఘటించకుండా వుండుట ఎంతోకాలం సాధ్యం కాదు. కారణం యీ ఆర్థిక పోరాటాలన్నీ తీవ్రమై రాజకీయ పోరాటాలుగ అభివృద్ధి చెందునపుడు, పరస్పర సహకారం, సఖ్యత, ఐక్యసంఘటన అవగాహనలలో సంఘర్షణలు యేర్పడి భగ్నం కాక తప్పదు. అయితే, ఎప్పుడో భగ్నం కాక తప్పదన్న సైద్ధాంతిక అవగాహనతో నేటి అత్యవసర, తక్షణ, కార్యక్రమాలను వదలివేయుట, శాస్త్రీయతకాదు. అయితే సిద్ధాంత సమగ్ర అవగాహన, పరిమితుల పరిజ్ఞానం అవసరం. జనతా పార్టీ ప్రభుత్వాన్ని బలపరస్తూ నిరంకుశత్వంతో పోరాడగలమా? జనతా పాలన వలన రాష్ట్రీయస్వయం సేవక సంఘం విపరీతంగా బలపడలేదా? నిజానికి "ఆర్ యస్ యస్" నియంతృత్వం ఇందిరా కాంగ్రెసు నియంతృత్వం కంటె, హింసాపూరితం, క్రూరము, మతతత్వపూరితం అనుటలో సందేహం లేదు.

ఫిబ్రవరి 1979లో సి.పి.ఐ జాతీయసమితి, రాజకీయ ముఖ్య పరిణామాలపై చేసిన ప్రకటన ముఖ్యాంశం, యిలా వుంది.

జనతా ప్రభుత్వం రెండు సంవత్సరాల పరిపాలనతో మునుపెన్నడు లేని అత్యంత తీవ్ర ఆర్థిక సంక్షోభంలో దేశాన్ని ముంచి వేసింది. జనతా ప్రభుత్వం ప్రజావ్యతిరేక విధానాలు భూస్వాములు, గుత్తపెట్టుబడిదారులు, పెద్ద వ్యాపారులు మినహా అన్ని వర్గాల ప్రజలను దుర్భర పరిస్థితులలో ముంచివేసింది. జాతీయ ఆర్థిక విధానం ముక్కలైపోయింది, అంతర్జాతీయ బహుళ జాతుల గుత్త సంస్థలకు స్వాగతం చెప్పింది. జనతాపార్టీ కేంద్ర, రాష్ట్రాలలో అంతర్గత సంఘర్షణలతో తీవ్ర సంక్షోభదశకు చేరింది. ప్రభుత్వ పోలీసుశాఖ నిరంకుశత్వవర్గాలు, పాలకవర్గాల నిరంకుశత్వం చేతులలోనికి పోయింది. రాజకీయ స్థిరత్వం పోయి అస్థిర పరిస్థితులు నెలకొన్నవి. దేశ, విదేశ ప్రమాదకర శక్తులను నిరోధించలేని దశకు జనతా ప్రభుత్వం చేరింది. జనసంఘం దాని "కవాతుదళాలు" రాష్ట్రీయ స్వయంసేవక సంఘశక్తులు, రాష్ట్ర ప్రభుత్వ యంత్రాగంలో కీలకస్థానాలలో చేరి, సాంప్రదాయక లౌకిక, స్వాతంత్ర విధానాలకు ప్రమాదంగా తయారయ్యాయి. జనతా ప్రభుత్వం "అందరితో స్నేహ, సహకారం" అన్న విధానంతో పెకింగు – వాషింగ్టన్ కుట్రలలో భాగస్వామి అయ్యే ప్రమాదాన్ని, జాతి సార్వభౌమాధికారాన్ని, దేశసరిహద్దులకు సమగ్రతకు ప్రమాదాన్ని తెచ్చిపెట్టుతున్నది.

ఈ మొత్తం పరిస్థితిని, పెరిగే ప్రజల అసంతృప్తిని వినియోగించుకొని, ఇందిరాగాంధి తిరిగి అధికారం కొరకు, ప్రయత్నాలు చేస్తున్నది. అత్యవసర పరిస్థితులలో ప్రపంచ బ్యాంక్ యిచ్చిన సూచనలను యథాతథంగా అమలు చేస్తున్నారు, ప్రజావ్యతిరేకవిధానాలు విస్తరించబడినవి. అత్యవసర పరిస్థితులలో ప్రజాస్వామ్య, ప్రజావ్యతిరేక, హింసా, దమనకాండలను, విధానాలను ఇందిరాగాంధి యింకా సమర్థించుకొంటూనే వుంది. ఈదేశాన్ని బూర్జువావర్గ పార్టీలు వరుసగా పెట్టుబడిదారి పంథాలో అభివృద్ధి చేస్తున్నామంటూ సంక్షోభంలో ముంచెత్తాయి. ఈవిధానాలను త్రోసిబుచ్చనిదే దేశసార్వభౌమాధికారాన్ని, జాతిని రక్షించలేము.[1]

---

1. వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతావేదిక. పార్టీలైఫ్. వా 15. నం.5., పే. 8-9.

దేశంలోని వామపక్ష ప్రజాస్వామ్యశక్తులను అత్యంత వేగంగా ఐక్యం చేయవలసిన అవసరముంది. రెండు కాంగ్రెసులు, జనతా పార్టీలోని సామ్రాజ్యవాద, గుత్తపెట్టుబడిదారి, భూస్వామ్య వర్గాల వ్యతిరేకశక్తులను, ప్రత్యామ్నాయ పంథాకై ఎదురుచూస్తున్న అన్ని శక్తులను, కాంగ్రెసు, జనతా రెండు పార్టీలకు ప్రత్యామ్నాయ సంఘటనలో అత్యంత వేగంగా సమీకరించే తక్షణ ఆచరణ కార్యక్రమాన్ని వామపక్ష ప్రజాస్వామ్యశక్తులు ముఖ్యంగా సి.పి.ఐ., సి.పి.ఐ(యం)లు చేపట్టాలి.

## 1.8. కొన్ని సుముఖ రాజకీయ పరిణామాలు

జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులలో కొన్ని సుముఖ పరిణామాలు సంభవించాయి. వామపక్ష ప్రజాస్వామ్యశక్తుల ఐక్యతా క్రమానికి ఇవి తోడ్పడినవి. బూర్జువా పార్టీలలోని అంతర్గత సంఘర్షణలు కొన్నింటిని సుముఖ పరిణామాలుగా నెంచవచ్చును. జనతా పార్టీలో రాష్ట్రీయ స్వయంసేవకసంఘ సమస్య, ఇందిరా కాంగ్రెసుకు స్వర్ణసింగ్ నాయకత్వంలోని వర్గాలు తలవొగ్గక పోవుటలను చెప్పుకొనవచ్చును. ఈ పరిణామాలు పార్టీ ప్రధాన నినాదమైన వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతా నిర్మాణానికై వినియోగించగల నూతనావకాశాల ప్రాముఖ్యతను పరిగణలోనికి తీసుకోవాలి.

ప్రథమంగా, కార్మిక, కర్షక, వ్యవసాయకూలీ, యువజన, విద్యార్థి, మహిళలలో పోరాట ఐక్యత అభివృద్ధి చెందుతున్న వైఖరి స్పష్టమైంది. ఈ ఐక్యత నేటి వరకు ప్రధానంగా ఆర్థిక సమస్యల పునాదిపై ఆధారపడినా వాటికే పరిమితమైలేదు. రాజకీయ సమస్యలు ప్రతిసారి ముందుకు వస్తున్నప్పటికి, పారిశ్రామిక బిల్లు, భూతలింగం నివేదికపై కార్మికవర్గ ఐక్యపోరాటాలు, వేతనస్తంబనపై బ్యాంక్ వుద్యోగుల మహోత్తర పోరాటం పేర్కొన తగినవి. ఈ పోరాటాలు జనతా ప్రభుత్వ కార్మికవర్గ విధానాలకు వ్యతిరేకంగా, దీర్ఘకాల పోరాటాలలో వారు సంపాదించిన హక్కులు త్రోసి బుచ్చుటకు వ్యతిరేకంగా, తీవ్రసంక్షోభంలోని పెట్టుబడిదారి, భూస్వామ్యవర్గాల ప్రయోజేనాలకుద్దేశించబడిన వేతన స్తంబనకు వ్యతిరేకంగా జరిగినవి.

ఈ ఐక్య ప్రజాపోరాటాలలో వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతా ధ్యేయానికి, అనుకూలత రూపొందించులో కమ్యూనిస్టుపార్టీ, "ఎఐటియుసి" నాయకత్వంలో కార్మికవర్గం గణనీయమైన పాత్ర వహించాయి. కార్మిక, కర్షక, బడుగువర్గాల పైగల చారిత్రాత్మక పాత్రను, ప్రజాపోరాటాలలో ఐక్యపరచి, రాజకీయపోరాటాలలో చొరవతో సమర్ధవంతంగా నిర్వహించుటకు ముందుకు వచ్చుటలేదు. ఈ బలహీనతను అధిగమించి, కార్మిక రంగంలో కార్యకర్తలు నేటి పోరాటాలను ఉన్నత రాజకీయ పోరాట దశకు పెంపొందించే ప్రయత్నం చేయసాగారు.

వ్యవసాయ వుత్పత్తులకు ధరలు పెంచాలనే రైతాంగ పోరాటాల వెల్లువ, రైతాంగ ప్రజావుధ్యమానికి, దాని విస్తృత నిర్మిణానికి తగిన పరిస్థితులను, చైతన్యాన్ని పెంపొందించింది. సమస్యలపై ఐక్యతను నిర్మించుట ద్వారా కార్మిక, కర్షక ఐక్యతను, బూర్జువా పార్టీ రాజకీయ ప్రభావాలను నుండి రైతాంగ విముక్తికి యిదివొకటే సరియైన

మార్గం. ఆవిధంగానే వామపక్ష ప్రజాస్వామ్య జాతీయ ప్రత్యామ్నాయాన్ని నిర్మించుటలో రైతాంగం శక్తివంతమైన పాత్ర నిర్వహించునట్లు చేయగలము.

రెండవ అంశంగా, నేడు లౌకిక ప్రజాస్వామ్యశక్తులు "ఆర్‌యస్‌యస్" విశ్వహిందూపరిషత్‌ల ప్రమాదం గుర్తించాలి. రెండు కాంగ్రెసులలోను, జనతా పార్టీలలోను యిది జరిగింది. జనతా పార్టీ అధికారంలోనికి వచ్చిన వెంటనే లౌకిక ప్రజాస్వామ్య శక్తులకు గల యీ ప్రమాదాన్ని గుర్తించి, హెచ్చరించింది. స్వాతంత్ర్యానంతరం మొదటిసారిగా రాష్ట్రీయ స్వయంసేవకసంఘం రాజ్యాధికారంలో పాలుపంచుకొంటున్నది. జనతాపాలనలో కేంద్రం, రాష్ట్రాలలో అధికార యంత్రాంగం భాగస్వామి అయింది.

అన్ని వామపక్ష, లౌకిక, ప్రజాస్వామ్యశక్తులతో "ఆర్‌యస్‌యస్" సమస్యపై విస్తృత ఐక్యతను నిర్మించే బృహత్తర అవకాశం లభించింది. అందులో రెండు కాంగ్రెసులు, జనతా శక్తులతో కలసి విస్తృత ఐక్యతా నిర్మాణం జరిగింది. దేశంలో అన్ని లౌకిక ప్రజాస్వామ్యశక్తులతో ఐక్యమగుటకు కమ్యూనిస్టుపార్టీలకు ఎట్టి సంకోచముండరాదు. నిరంకుశ, మతతత్వశక్తుల ప్రమాదానికి వ్యతిరేకంగా ఐక్యపోరాటాలలో పాల్గొనుటకు కమ్యూనిస్టులు, తదితరవామపక్ష, లౌకిక ప్రజాస్వామ్యశక్తులు చొరవతో ముందుకు రావలసివుంది. లౌకిక, ప్రజాస్వామ్య ఐక్యత యేర్పడుట, ఐక్యతావకాశాలు విస్తృతమగుట, వామపక్ష లౌకిక ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయం యేర్పడుటకు ముఖ్య అంశంగా పరిగణించాలి.

తృతీయాంశంగా, నేడు అమెరికా, మావో అనుకూలవర్గాలు దేశంలోని జనతా ప్రభుత్వం, వియత్నాంలో చైనా దురాక్రమణతో వెనుకడుగువేసాయి. వాజ్‌పాయ్ చైనా సందర్శనాంశంపై చెలరేగిన దుమారం క్రమేణా సమసిపోయింది. ఈ సమస్యపై విస్తృత జాతీయ యేకాభిప్రాయం యేర్పడింది.

చైనా దురాక్రమణకు వ్యతిరేకంగా విస్తృత ఐక్యతా నిర్మాణం సాధ్యమైంది.

చతుర్థాంశంగా, సోవియట్ ప్రధాని కొసిగిన్ భారత సందర్శన ఫలితంగా, ఆర్థిక, వ్యాపార, శాస్త్ర, సాంకేతిక, సహకార వొప్పందాలు జరిగాయి. ఇది సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాస్వామ్య శాంతిశక్తుల ఐక్యతాభివృద్ధికి తోడ్పడింది. ప్రజాసంఘాల ఐక్యకార్యాచరణాభివృద్ధి, రాజకీయ పరిణామాలపై విస్తృతయేకాభిప్రాయవృద్ధికి, వామపక్ష ఐక్యతాభివృద్ధికి, సి.పి.ఐ; సి.పి.ఐ(యం)ల మధ్య సహకారాభివృద్ధికి అవకాశాలు పెరిగాయి. ఆర్థిక సమస్యలపై మాత్రమే ఐక్యత సాధ్యమని, రాజకీయ సమస్యలపై అట్టి ఐక్యత అసాధ్యమనే కొన్ని కమ్యూనిస్టు వర్గాలు అభిప్రాయాలను సరళీకృతం చేసుకొనవలసి వచ్చింది. ప్రజాసంఘాల ఐక్యకార్యాచరణాభివృద్ధి త్వరితంగా పెంపొంది, చొరవతో ఐక్యకార్యాచరణలో భాగస్వామయ్యే అవకాశాలు మరింత పెరిగాయి. భటిండా, జలందర్ కమ్యూనిస్టుపార్టీల కాంగ్రెసులు వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతా నిర్మాణానికి ప్రాతిపదికగా రాజకీయవేదికలను ప్రకటించాయి. వాటిలో సారూప్యతలే యెక్కువగా వున్నవి.

ఐదవ అంశంగా, భారత కమ్యూనిస్టు ఉద్యమంలో భటిండా, జలందర్ పార్టీ కాంగ్రెసులలో ఆవిష్కరించబడిన శాస్త్రీయ సోషలిస్టు రాజకీయ అవగాహనలను, అవి భారత విప్లవపంథాపై ప్రసరించే నూతన వెలుగును సంగ్రహంగా చూద్దాము.

ఈ నూతన విధాన ఆవిష్కరణకు సి.పి.ఐ సంస్కరణవాద అవగాహనలు, సి.పి.ఐ(యం) అతివాద అవకాశవాదనలు, నక్సలైట్ల అత్యుగ్రవాద అవగాహనలను ఆయా కమ్యూనిస్టు శ్రేణులు అనుభవాల శాస్త్రీయ పరిశీలన, ఆత్మ విమర్శనలతో అధిగమించవలసివచ్చింది. భూపేష్ గుప్తా భటిండా పంథా రాజకీయంగా, అంతర్గతంగా ఎదుర్కొన్న అవాంతరాలపై "భటిండా పంథాను అమలు చేయుటలో వ్యతిరేక గ్రూపుల ప్రయత్నాలు, పార్టీని చీల్చగలమనే చెదరింపులు, జాతీయసమితి నిర్ణయాన్ని మార్చలేకపోయాయి. చొరవతో శక్తివంతంగా అమలుచేయుటతో వ్యతిరేకుల, ఇందిరాగాంధి అనుకూలురుల, అవకాశవాద రాజీవాదుల, వక్రీకరణ వాదుల ముసుగులు తొలగి అప్రదిష్టపాలైపోయారని," వాఖ్యానించారు. నూతన పంథా సుదీర్ఘ సి.పి.ఐ అంతర్గత సైద్ధాంతిక పోరాట ఫలితమని స్పష్టం చేసారు. ఇక, భటిండా నూతన పంథా అవతరణ, దానిలోని సుముఖ అంశాలు ఆ పోరాట ఫలితాలేనని చెప్పవలసిన అవసరం లేదు.

భటిండా సి.పి.ఐ పార్టీ కాంగ్రెసు యిచ్చిన "జాతీయ వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయం" అనేకేంద్ర నూతన నినాదం, యాదృచ్ఛికంగా యివ్వబడినదికాదు. వాస్తవానికి యీ నినాదపు అడుగుజాడలు 9వ, కొచ్చిన్, 10వ, విజయవాద పార్టీ కాంగ్రెసులలోని అధికార నివేదికలుగా, రాజకీయతీర్మానాలలోనే కానవస్తాయి.

సి.పి.ఐ ఎత్తుగడలలో రెండు ప్రధాన మార్పులను గుర్తించవచ్చును. ఒకటి, పార్టికి పునాది స్వతంత్రపాత్రతో యేర్పడుతుందని, అదే పార్టీ బలాన్ని పెంపొందిస్తుందనే దానిని నొక్క చెప్పుతున్నది. రాజకీయ పంథాలో స్వప్రయోజనం, సెక్టేరియనిజాలను విడనాడి, వాస్తవికతా దృక్పధంలో వామపక్ష ఐక్యత, తద్వారా ప్రజాస్వామ్య విప్లవ వ్యూహం లక్ష్యంగా చేపట్టింది. సంఘటనలలోని భాగస్వామ్య పార్టీలన్నిటికి స్వతంత్ర పాత్ర వుంటుందని గుర్తించుట. రెండవ అంశంగా, వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయాన్ని నొక్కిచెప్పుట. ఏదోవిధమైన ఐక్యసంఘటన నిర్మించుటగాక వర్గాలపొందిక ప్రధానాంశంగా, సంఘటన ప్రభుత్వ నిర్మాణ స్వరూపాన్ని గుర్తించుట. ఇదేవామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయ నిర్మాణంలోని విప్లవాత్మక అంశము. కార్మిక, కర్షక, మధ్యతరగతి, ఉద్యోగుల, యితర నగర, గ్రామీణ బడుగువర్గాల ఐక్యతను క్రింది నుండి పోరాటాల ద్వారా నిర్మించుట చేబట్టాలి. అట్టి పోరాట ఐక్యతయే వర్గపోరాటరూపంగా, క్రమంగా రూపొందుతుంది.

ఆరవ అంశంగా, జలందర్ పార్టీ కాంగ్రెసులో సి.పి.ఐ(యం) వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతా నినాదం, కార్యక్రమంలో ఆమోదించబడినా, ఆచరణలో అదే పార్టీలోని అవకాశవాదశక్తుల నుండి గట్టి ప్రతిఘటనను యెదుర్కొనవలసివస్తున్నదని, ఆగస్టు

1979లో పీపిల్సు డెమోక్రసీలో "సి.పి.ఐ అడకత్తెరలో" అనే శీర్షికలో వ్రాయబడిన సంపాదకీయాన్ని బట్టి స్పష్టమగుతుంది. మరో ముఖ్య విషయం, ఆ సంపాదకీయరచయిత హరికిషన్‌సింగ్ సూర్జిత్, పార్టీ జనరల్ సెక్రటరీ, సాంప్రదాయంగా పార్టీలోని మెజారిటివర్గ అభిప్రాయాన్నే వెలిబుచ్చారని తలచాలి. పార్టీ కాంగ్రెసులో వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతకై కృషి చేయాలనే తీర్మానాన్ని జాతీయసమితి ఆమోదించినా పార్టీలో భేదాభిప్రాయాలు తీవ్రంగా వున్నందుననే, ఆచరణలో పొడుదొడుకులు. "తాత్సారం"గా ప్రతిబింబిస్తున్నవని స్పష్టమగుతున్నది.

పాలక బూర్జువావర్గ యే పార్టీలో "అభ్యుదయకరమైనదేదీ వుండదని", "రాజకీయంగా అంటరానిదనేది" సి.పి.ఐ(యం) సిద్ధాంతంగా కన్పడుతున్నది. జలందర్‌పార్టీ కాంగ్రెసులో మెజారిటి అవగాహన ఆధారంగా సమర్పించిన నివేదికను కా॥ సుందరయ్య వ్యతిరేకించి, తన అనంగీకారాన్ని నమోదు చేయించారు. నివేదిక ప్రజాస్వామ్య రక్షణకై "విస్తృత సఖ్యత – అలయన్స్" నిర్మించాలని, యిది కేంద్రం వరకు విస్తరించాలని, అంటే జనతాపార్టీ ప్రభుత్వం కొనసాగుటకు అన్ని విధాల బలపరచాలనే అవగాహనకు, అంటరాదనే అవగాహనకు మధ్యగల అభిప్రాయభేదాలు పార్టీలోని "సైద్ధాంతిక అంతర్గత పోరాటాల" ప్రతిబింబించుటయే అగుతుంది. బీహార్, యు.పి., మహారాష్ట్రాలలో సి.పి.ఐ(యం) లోని మైనారిటి వర్గం జనసంఘం, రాష్ట్రీయ స్వయంసేవక సంఘం, భారతీయ లోక్‌దళ్‌లతో సంయుక్త కార్యాచరణలను, కార్మికవర్గ ఐక్యత అనే పేరుతో సి.పి.ఐ(యం), "సిటు"లు భారతీయ మజ్దూర్ సంఘంతో సంయుక్త కార్యాచరణను వ్యతిరేకించింది. "కేంద్రసమితిలోని మెజారిటి, సామ్రాజ్యవాదంవైపు మొగ్గే జనసంఘం, ఫాశిస్టు "కవాతుదళాలైన" రాష్ట్రీయస్వయంసేవకసంఘం"తో సంయుక్త కార్యాచరణ చేబట్టుట, పార్టీని దేశ, విదేశాల ప్రజాస్వామ్యశక్తులు, సోషలిస్టుశక్తుల నుండి దూరం చేస్తుందని, తీవ్రనష్టాన్ని కలుగజేస్తుందని మైనారిటి వెల్లడించింది. ఈ వాస్తవాన్ని తదనంతర చరిత్ర రుజువు చేయుటతోపాటు, వారి "విస్తృత ఐక్యతా" వ్యతిరేక తప్పిదాన్ని స్పష్టం చేసింది.

జలందర్ సి.పి.ఐ(యం) పార్టీ కాంగ్రెసులో, కాంగ్రెసుకు ముందు పార్టీలోని మైనారిటి వర్గపు అతివాద అవకాశవాద వక్రీకరణలకు వ్యతిరేకంగా జరిగిన అంతర్గత సైద్ధాంతిక పోరాటాల ఫలితంగానే, నిరంకుశ మతతత్వ శక్తులకు వ్యతిరేకంగా వామపక్ష లౌకిక ప్రజాస్వామ్యశక్తులన్నిటి ఐక్యపోరాటం, వామపక్ష లౌకిక ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయాలపై సుముఖ నిర్ణయాలు జరిపే చొరవ వామపక్ష శక్తులకు వచ్చింది.

# 2
# బహుముఖ రాజకీయ సంక్షోభం

## నాంది

**2.1.** అమెరికా, చైనాలు భారతదేశానికి వ్యతిరేకంగా పాకిస్తాన్‌ను సాయుధీకరముచేస్తున్నవి. పెకింగు నుండి అత్యున్నత సైనిక ప్రతినిధివర్గం పాకిస్తాన్‌ను సందర్శించింది. పశ్చిమదేశాల పత్రికలలో రహస్య సైనిక ఒప్పందంపై సంతకాలు జరిగాయని ప్రకటించబడింది. కాశ్మీరంలోని కార్కోరం రహదారిపై సైనిక సహాయంతో విస్తరణ కార్యక్రమం బలవంతంగా చేస్తున్నారు. విస్తారమైన భారత భూఖండాలను తమవిగా వాదించుతు చైనాలో తాజాగా మ్యాపులు ముద్రించబడినవి. విదేశాంగమంత్రి వాజపాయ్ బహుశా ప్రభుత్వ విజయంగా ప్రచారం చేసుకొనే తన "పెకింగ్ సందర్శన సౌహార్ధయాత్ర" మరో ఆలోచన లేకుండా కొనసాగింది. మణిపూర్, మిజోరం, మేఘాలయ, అస్సాంములలో చైనాలో గెరిల్లా శిక్షణ పొందిన మావోయిస్టు విచ్ఛిన్నకర శక్తులు తమ దుష్కార్యాలను మరింతగా ఎక్కువ చేసారు.

దేశంలో ఎన్నికలు సమీపించుటతో ప్రతిసారి వివిధ రాజకీయపార్టీలు వైరుధ్యాలతో రాజకీయ, భౌతిక సంఘర్షణలకు దిగుచున్నవి. ఈ దురదృష్టకర నేపథ్యంలో దేశంలో యేర్పడిన బహుముఖరాజకీయ సంక్షోభాన్ని, అనిశ్చిత పరిస్థితులను సామ్రాజ్యవాద విచ్ఛిన్నకర మావోయిస్టుశక్తులు వినియోగించుకొని దేశపు ఉత్తర, వాయువ్య ప్రాంతాలలో అనిశ్చిత పరిస్థితులను మరింత తీవ్రతరం చేస్తున్నది.

ఎన్నికలు సమీపించుటతో రాజకీయపార్టీల సంచలనం వేగాన్ని పుంజుకొన్నది. ఒకవైపు జగజీవన్‌రాం అతని అనుచరులు, మరోవైపు జనతాపార్టీలోని జనసంఘం-రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘాల మధ్య సంఘర్షణలు తీవ్రస్థాయికి చేరాయి. జనతాపార్టీ-జనసంఘం కూటమిలోని ప్రతిపార్టీ ప్రతిగ్రూపు ఎదిరిపక్ష బలాన్ని కుదించి, తాను విస్తరించే ఎత్తుగడలను అసెంబ్లీ స్థానాల కేటాయింపులలో అనుసరించుటతోపాటు, అందుకై దెయ్యాలతో విందులకు సిద్ధమగుటతో ఘర్షణలకు అంతులేకుండా పోయింది. జనతాపార్టీకి భుజబలాన్ని, కార్యకర్తల బలాన్ని చేకూర్చిన జనసంఘ-రాష్ట్రీయ స్వయంసేవకసంఘకూటమి, అందుకువారు అత్యధిక స్థానాలు కోరుట ఆశ్చర్యకరమేమికాదు.

కాంగ్రెసు (ఐ) జనతా ప్లానులను చిత్తుచేయుట సాధ్యము. కాంగ్రెసులో సంజయగాంధీ, 1976లో వలెనె ముందుకు త్రోసుకు వస్తున్నాడు. ఇది యిప్పటికే యు.పి., బీహార్, పంజాబ్, పశ్చిమబెంగాల్, మహారాష్ట్ర, కర్నాటక, ఆంధ్రప్రదేశ్‌లలో

తీవ్రవాదోపవాదాలకు, సంఘర్షణలు ప్రజ్వరిల్లుటకు కారణమైంది. పైగా సంజయగాంధీని ఇందిరాగాంధి బహిరంగంగా బలపరచసాగింది. బన్సీలాల్ తిరిగి రంగ ప్రవేశం చేయుటతో వాతావరణం మరింత కలుషితమైంది.

లోక్‌దళ్ - కాంగ్రెసులలో దురదృష్టకరంగా అభిప్రాయభేదాభిప్రాయాలు ఎక్కువయ్యాయి. ఈ అభిప్రాయభేదాలను బడా వ్యాపారవర్గాల పత్రికలు గోరింతలు కొండంతలుగా చేసి అఘాతాలను సృష్టిస్తున్నవి. లోక్‌దళ్, కాంగ్రెసు, వామపక్ష పార్టీల పక్షాన్ని సాధ్యమైనంత యెక్కువగా అగౌరవం పాలు చేస్తున్నవి. ఆవిధంగా వామపక్ష ఐక్యతను దెబ్బతీస్తూ, కాంగ్రెసు వొక్కటే దేశానికి స్థిరమైన ప్రభుత్వాన్ని యివ్వగలదని ప్రచారం చేస్తున్నవి. అనైక్యతా ప్రమాదాన్ని లోక్‌దళ్ - కాంగ్రెసులోని అభ్యుదయకరవర్గాలు పరస్పర అవగాహనను, సహకారాన్ని పెంపొందించుకొంటూ, వివాద, ఘర్షణాంశాలను తొలగించుకొనుటకు ప్రయత్నించుచున్నవి.

లోక్‌దళ్ - కాంగ్రెసు, వామపక్ష పార్టీల పక్షాన్ని ఎదుర్కొంటున్న తక్షణ సమస్య ఐక్యతను పెంపొందించుట, వివాదాంశాలను తొలగించుట. ఇది వొక్కటే నిరంకుశశక్తులను, మతతత్వవాదుల వోటమిని గ్యారంటీ చేయగలదు. వామపక్షాలు ముఖ్యంగా సి.పి.ఐ., సి.పి.ఐ(యం) లపై సుముఖ అంశాలను పెంపొందించే ప్రత్యేక బాధ్యత కలదు.

లోక్‌సభ ఎన్నికలు ప్రకటించిన వెంటనే కమ్యూనిస్టుల ముఖ్యప్రయత్నం వామపక్ష ఐక్యత, ప్రధమంగా సి.పి.ఐ., సి.పి.ఐ(యం)ల ఐక్యతను నెలకొల్పుట, కార్యక్రమ ప్రాతిపదికగా జరుగుతుంది. అభ్యర్థుల స్థానాల విషయమై వామపక్షాలు ముఖ్యంగా సి.పి.ఐ; సి.పి.ఐ(యం)లు అఖిల భారత స్థాయిలో వొక అవగాహనకు వచ్చుట ముదావహము. వామపక్షాలు కలసి 150 స్థానాలు దేశ మొత్తంగా పోటీ చేస్తున్నవి.

వామపక్ష, కమ్యూనిస్టు ప్రజాసామాన్యం, పార్టీ శ్రేణులు ఉత్సాహభరితంగా వున్నవి. సంఘర్షణల వాతావరణం అంతరించి సి.పి.ఐ; సి.పి.ఐ(యం)ల పార్టీ శ్రేణులు పరస్పరం సహకరించు కొంటున్నవి. ఇది యితర వామపక్షాలు ప్రజాస్వామ్య పార్టీలపై అత్యధికరాజకీయ ప్రభావాన్ని, ఉత్సాహోన్నిరేకెత్తించి భవిష్యత్తు ఆశాజనకంగా చేసింది.

ఈ పరిణామాలకు అభివృద్ధి నిరోధకులు తత్తరపడిపోయి, లోక్‌సభలో వామపక్ష శక్తులు బలమైన శక్తిగా రూపొందకుండా, నిరోధించు ప్రణాళికలను తయారు చేసారు. వామపక్ష శక్తులకు బలమైన కేంద్రాలుగా వున్న పశ్చిమ బెంగాల్, కేరళలో కాంగ్రెసు (ఐ), జనతా పార్టీలు, వామపక్ష ప్రజాస్వామ్య అభ్యర్థులను వోడించాలనే వొక అవగాహనకు వచ్చారు. ఈ విధమైన సహకారం కాంగ్రెసు (ఐ) జనతాపార్టీలమధ్య, ప్రధానంగా సి.పి.ఐ; సి.పి.ఐ(యం) ల తదితర వామపక్ష పార్టీల అభ్యర్థులను వోడించుటకు, యితర రాష్ట్రాలలో కూడా యేర్పడనున్నవి.

కాంగ్రెసు(ఐ) జనతా ప్లానులను చిత్తు చేయుటకు సి.పి.ఐ, సి.పి.ఐ(యం) తదితర

వామపక్ష పార్టీలు యీ ఎలక్షన్ ప్రచారోద్యమాల సందర్భంలో మరింత బలమైన సహకార సంబంధాలను పెంపొందించుకొన్నవి, ప్రజల వుత్సాహాన్ని మహోద్వృతంగా రేకెత్తించినవి. తక్షణ సమస్యలైన నిరుద్యోగం, నిత్యావసర ధరలు మిన్నంటుట, సామాన్యుని జీవన ప్రమాణం పెరిగిపోవుట, దారిద్ర్యం, దేశం వామపక్ష దిశగా పురోగమించి తేనే పరిష్కారం కాగలవనే విశ్వాసాన్ని ప్రజాసామాన్యంలో కలుగజేయాలి.

వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయ నినాదాన్ని వాస్తవం చేసి విజయం సాధించుటకు వామపక్ష శక్తులను బలోపేతం చేయుట నేడు అత్యవసరం. బూర్జువా రాజకీయవేత్తలతో విసిగివేసారిన ప్రజాసామాన్యం అటువంటి ప్రత్యామ్నాయం కొరకు ఎదురుచూస్తున్నారు.

కేరళలో యీ సంయుక్త దృక్పధంతోనే సామాన్య ప్రాతిపదికపై సి.పి.ఐ. సి.పి.ఐ(యం)లు కలసి యిప్పుడు పని చేస్తున్నవి. ఇది, యిప్పటికే కేరళలో సుముఖ ఫలితాలు కలుగుటకు, రాజకీయశక్తుల నూతన కలయికలకు తోడ్పడింది. వామపక్ష ప్రజాస్వామ్య శక్తుల ఐక్యతాభివృద్ధికి తోడ్పడింది. కేరళ కాంగ్రెసులోని శ్రీమణి గ్రూపు యీనాడు నూతన కలయికలకు అనుకూలంగా తన వైఖరిని స్పష్టం చేసింది. ఇది కాంగ్రెసులో తప్పనిసరిగా కొంత ప్రభావాన్ని కలుగజేస్తుంది.

కమ్యూనిస్టులు, లోక్‌దళ్, కాంగ్రెసు (ఉ) 1980 ఎన్నికలలో రాష్ట్రాల అసెంబ్లీ స్థానాలలో ఎన్నికల సర్దుబాటులు చేసుకొన్నారు. జనతా ప్రభుత్వం పతనంతో యేర్పడిన సంక్లిష్ట పరిస్థితులలో అవసరమైన ఆచరణ యీ సర్దుబాట్లు నిరంకుశతత్వానికి, కుల, మత తత్వానికి వ్యతిరేకంగా యీ పోరాటం పురోగమించవలసివుంది. అంచేతనే, లోక్‌దళ్ కాంగ్రెసు (ఉ) లతో ఎన్నికల సర్దుబాటుల అవగాహన, వారి అభ్యర్థులు లేని చోట్ల పరస్పరం బలపరచుకొనే వొప్పందం జరిగింది.

జనతా-జనసంఘం - రాష్ట్రీయ స్వయం సేవక సంఘాల కూటమితో యేర్పడే సామ్రాజ్యవాద, గుత్తపెట్టుబడి, భూస్వామ్య వర్గాల నిరంకుశ శక్తులు, కుల, మత శక్తులతో యేర్పడే ప్రమాదంతో భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్రసమితి అక్టోబరు 1977 సమావేశంలో వామపక్ష ప్రజాస్వామ్యశక్తుల ఐక్యతా నిర్మాణాన్ని నొక్కి చెప్పింది.

## 2.2. బూర్జువావర్గ రాజకీయపార్టీలలో తీవ్ర రాజకీయ, నిర్మాణ సంక్షోభం.

దేశంలో బూర్జువా రాజకీయ విధానంలో విస్తృత సంక్షోభం తీవ్రతరమైంది. బూర్జువావర్గాలు కూడ దీనిని త్రోసి బుచ్చలేదు. ప్రధాని మొరార్జీదేశాయ్ చూడదలచుకొనక, తనపార్టీలో, ఆర్థిక విధానంలో, దేశరాజకీయాలలో సంక్షోభం యేమీలేదని త్రోసిబుచ్చారు. దేశంలో జూన్-జులై 1979లోని రాజకీయ పరిణామాలు సంక్షోభాన్ని మనముందు స్పష్టంగా వుంచాయి.

ప్రధమంగా, ప్రధాన బూర్జువావర్గ పార్టీలైన కాంగ్రెసు(ఐ), జనతాపార్టీలు రెండూ సంక్షోభంలో మునిగిపోయి, బ్రద్దలై, చీలికలకు సిద్ధంగా వున్నవి. రెండవది,

స్వాతంత్ర్యానంతరం మొట్టమొదటసారిగా రక్షణశక్తులు, రాష్ట్రాలలో పోలీసులు, కేంద్ర సర్వీసులలోని పారామిలిటరీ నిర్మాణాలు, సి.ఆర్.పి., కేంద్ర పారిశ్రామిక రక్షణ దళాలు, సి.ఆర్.పి; రైల్వే రక్షణ దళాలు వగైరాలు దుర్భర పరిస్థితులకు నిరసనగా జాతీయ మహోద్యమాన్ని సాగించారు. రక్షణ దళాల ఆందోళనలోపడిపోయిన బూర్జువావర్గ ప్రభుత్వం సి.ఆర్.పి.ని రాష్ట్రాలలో వినియోగించింది. కాల్పులలో ప్రాణనష్టమూ జరిగింది. శిఖరాగ్రంగా ధరల పెరుగుదలతో మధ్యతరగతి ఉద్యోగులు, టీచర్స్, రక్షణ దళాలు, పారిశ్రామిక కార్మికులు అందరూ బహిరంగంగా పోరాటాలలోనికి దిగుటతో, ప్రధాని మురార్జీదేశాయ్ "ప్రివెంటీవ్ డిటెన్షన్ ఆర్డినెన్స్‌ను" తీసుకొస్తానని బెదరించారు.

ప్రజలు వేగంగా బూర్జువా రాజకీయ పార్టీలు, వారి విధానాల యెడల విశ్వాసాన్ని కోల్పోయారు. అయితే, అభ్యుదయకర ప్రత్యామ్నాయంలేని కారణంగా నిరుత్సాహంతో నిస్సహాయులయ్యారు. దీనిని అభివృద్ధి నిరోధకులు, మితవాద, మతవాద నిరంకుశశక్తులు వినియోగించుకొని కుట్రలు చేయసాగారు.

కర్నాటకలో ఇందిరాగాంధీ కాంగ్రెసు, ముఖ్యమంత్రి దేవరాజ్ ఉరుసు అధికారాన్ని కోల్పోవుటతో కాంగ్రెసు(ఐ) అధికారం రెండు రాష్ట్రాలలో కోల్పోయింది. కర్నాటక రాష్ట్ర పరిణామాలు కాంగ్రెసు(ఐ) కి వ్యతిరేకంగా, ఇందిరాగాంధీ ప్రజాస్వామ్య వ్యతిరేక నిరంకుశ పనివిధానానికి వ్యతిరేకత యెక్కువైంది. అనేక రాష్ట్రాలలో కాంగ్రెసు(ఐ) చీలికలై పోయింది. ముఖ్యంగా సంజయగాంధి, రాజీయరంగ ప్రవేశం చేయుటతో యీ పరిణామాలు వేగాన్ని పుంచుకొన్నవి. పార్లమెంటు, అసెంబ్లీలలోని కాంగ్రెసు(ఐ) ప్రతినిధులు బయటకు వెళ్ళిపోవుట ప్రారంభించారు. దేవరాజ్ ఉరుసు, జులై 1979లో జరిపిన బెంగుళూరు కన్వెన్షన్ కాంగ్రెసు(ఐ) చీలికలయ్యే క్రమాన్ని వేగిరపరిచింది. ఇందిరాగాంధి యు.పి. ఎన్నికలలో వోడిపోగా, దేవరాజ్ ఉరుసుమద్దతుతో కర్నాటకలోని చిక్‌మగలూరు బై ఎలక్షనులో విజయం పొందుట అందరికి గుర్తే వుంటుంది.

మరోవైపున పాలక పార్టీయైన జనతా పార్టీ గూడ తీవ్ర సంక్షోభంలో పడిపోయింది. శ్రీ మురార్జీదేశాయ్ పార్టీ తన స్థానాలను బలపరచుకొనే ప్రయత్నంలో చీలికలను చిరు ఘటనలుగా మనలను నమ్మమంటారు. అయితే ఎవరూ పరిగణలోనికి తీసుకొనలేదు. జనతా పార్టీ అధ్యక్షుడు చంద్రశేఖర్ తనపార్టీ, ప్రభుత్వం "విశ్వాస సంక్షోభాన్ని" ఎదుర్కొంటుందన్నారు.

జనతారాష్ట్ర ప్రభుత్వాల "కూలద్రోయుట" వేగంగానే జరుగుతున్నది, హర్యానా తాజా వుదాహరణ. జనతాపార్టీలో నుండి రాజనారాయణ్ రాజీనామా చేసి రెండు మాసాలలోనే ప్రభుత్వం కూలిపోతుందని అన్నారు. జార్జిఫెర్నాండేజ్ జులై 8లో జరిగిన జనతాలోని సోషలిస్టుల సమావేశానికై పిలుపునిచ్చారు. అతనూ మధులిమాయే యిద్దరూ జనతా ప్రజలకు చేసిన వాగ్దానాలను నెరవేర్చుటలోని వైఫల్యాన్ని తీవ్రంగా విమర్శించారు. ఇద్దరూ జనతాపార్టీని, ప్రభుత్వాన్ని రాష్ట్రీయ స్వయంసేవకసంఘం ఆక్రమించిందని, అంచేత మైనారిటి వర్గాలు జనతాకు దూరమయ్యాయని, జనతా లౌకిక ప్రవచనాలు

వీగిపోయాయని అన్నారు. భారత్ లోక్‌దళ్ ముఖ్యనాయకులు డిప్యూటి ప్రధాని చరణ్‌సింగ్ యింటిలో సమావేశమై, చర్చల అనంతరం, ఎట్టి నిర్ణయాన్ని తీసుకొనుటకైనా చరణ్‌సింగుకు అధికారాన్నిచ్చారు. జనతాపార్టీలోని యితర రాజకీయపార్టీలు, గ్రూపులుపై మార్గాన్నే అనుసరించారు.

ఈవిధంగా ప్రజలు రెండు బూర్జువాపార్టీలపై తమ విశ్వాసాన్ని కోల్పోయారు. కాంగ్రెసు. జనతాపార్టీలు రెండూ అంతర్గత సంక్షోభంలో మునిగిపోయారు. ఇది అనిశ్చిత భవిష్యత్తుకు, చీలికలకు దారి తీసింది.

జనతా పార్టీ చీలిపోవుట, వొక వర్గం స్వర్ణసింగ్ నాయకత్వంలో జనతా (యస్)గా యేర్పడి, తరువాత భారత లోక్‌దళ్‌గా చరణసింగ్ నాయకత్వంలో యేర్పడుట, కాంగ్రెసు సహకారంతో స్వల్పకాలం పరిపాలనా భాధ్యతలు వహించుట తెలిసే వుంది. లోక్‌దళ్-కాంగ్రెసు సహకార. సయోధ్యత అత్యంత క్లిష్ట పరిస్థితులలో, నిరంకుశత్వానికి,మత తత్వాలకు వ్యతిరేకంగా జరిపిన పోరాటంలో యేర్పడింది, పేర్కొనదగిన పాత్ర నిర్వహించింది. అంచేతనే అప్పుడు సి.పి.ఐ తదితర వామపక్షపార్టీలు లోక్‌దళ్ – కాంగ్రెసు సహకార కూటమికి సుముఖవైఖరిని చేబట్టాయి.

రాజకీయ నూతన కలయికలు వొక్కొక్కరికి, వొక్కొక్క అవగాహన వుంది. దేవరాజ్ ఉర్స్ దృష్టిలో ఇందిరాగాంధీ లేకుండా 1978 చీలికకు పూర్వం గల కాంగ్రెసు నిర్మాణం, "కాకస్" ను దూరంగా వుంచుట, ఇతర పార్టీలలోని కాంగ్రెసు వారిని తిరిగి చేర్చుకొనుట, మధులిమాయే మరికొంత ముందుకుకు వెళ్ళి జనతాపార్టీకి బయట వున్న శక్తులతో సంబంధం పెట్టుకొని వుండాలని ముఖ్యంగా దేవరాజ్ ఉర్స్‌ను పేర్కొన్నారు.

ఈ రాజకీయ పరిణామాలు భారత గుత్తపెట్టుబడిదారుల వాణిగా ప్రసిద్ధి కెక్కిన బడా వ్యాపారవర్గాల పత్రికలు తమ ధోరణిని సత్వరమే ఇందిరాగాంధిని బలపరచ మొదలు పెట్టాయి. నిన్నటివరకు తెగనాడిన పత్రికలే తిరిగి ఇందిరాగాంధి వొక్కతే స్థిరమైన ప్రభుత్వాన్ని యివ్వగలదని, పారిశ్రామిక వాతావరణాన్ని మెరుగుపరచగలదని ప్రారంభించాయి. జనతా పాలనను బలపరస్తూనే, ప్రజల అసంతృప్తి పెరిగిపోవుట గమనిస్తున్న గుత్త వ్యాపారవర్గాలు వామపక్ష శక్తుల బలాన్ని పుంజుకొనుటచూసి, మరోవైపు ఇందిరాగాంధీని బలపరచ ప్రారంభించాయి. దేశంలో "ఇందిరాగాంధి వెల్లువ" గాలి వీచుచున్న"దని ప్రచారం ప్రారంభించారు. గుత్తపెట్టుబడివర్గాలు ఇండియాలో "రెండు పార్టీల బూర్జువా సాంప్రదాయ పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని సుస్థిరం" చేయుటకు, ఆవిధంగా తమ ప్రయోజనాలు పెంపొందించుకొనుటకు ప్రణాళికలు వేస్తున్నవి. ఆవిధంగా కాంగ్రెసు(ఐ) జనతాపార్టీలు తప్పితే మరో ప్రత్యామ్నాయం లేని విధంగా రాజకీయాలను మలచే ప్రయత్నాలు చేస్తున్నారు. అంతేగాక, ఇందిరాగాంధీకి పూర్తి మెజారిటి రాక పోవచ్చనే అంచెనాతో ఎన్నికల అనంతరం రెండు పార్టీలు కలసి సుస్థిర ప్రభుత్వాన్ని యేర్పాటు చేయాలనే మరో ప్రమాదాన్ని కూడ వినిపిస్తున్నారు. జనతాపార్టీనాయకుడు జగజీవన్‌రాం, ప్రచారాన్ని గట్టిగా తిరస్కరించుచున్నా,

ఇందిరాగాంధీకి వ్యతిరేకంగా తీవ్రప్రచారం చేయక, రాజీకి ద్వారాలను తెరచి వుంచే ప్రయత్నం మరోవైపు కొనసాగిస్తూనే వున్నారు. అదే విధంగా మురార్జీదేశాయ్, చరణ్‌సింగ్‌లు తమ ప్రచారవాడిని ఇందిరాగాంధీపై ఎక్కుపెట్టుటలో వెనుకాడుతున్నారు. నిజానికి పశ్చిమబెంగాల్ జనతాపార్టీనాయకుడు పి.సి.సేన్ వామపక్ష సంఘటనపై పోరాటానికి ఇందిరాగాంధీతో ఒప్పందానికి సంప్రదింపులు జరుపుతూనే వున్నారు. ఇందిరాగాందీ కూడా జనతాపార్టీ, నాయకుడు జగజీవన్‌రాంతో "సత్సంబందాల వారధిని" నిర్మించ ప్రయత్నిస్తూనే వుంది. బీహార్, హర్యానాలలోని జనతా ప్రభుత్వాలు కూలిపోకుండా పరోక్షంగా సహాయపడింది. యు.పి.లో జనతాపార్టీతో చేతులు కలపి, జనతా (యస్) పార్టీ ప్రభుత్వాన్ని కూలద్రోసింది. ఇందిరాగాంధీ తాజాగా రాష్ట్రీయ స్వయంసేవకసంఘంతో అవగాహనకు ప్రయత్నించింది. బాబాసాహెబ్‌దేవరస్, ఆర్.యస్.యస్ నాయకునితో "మరచిపోదాం-స్నేహాన్ని పెంచుదాం" అనే నూతన విధానాన్ని అవలంభించుతున్నది. తిరిగి అధికారంలోనికి వచ్చుటకు అన్ని అడ్డంకులను తొలగించుకొనుట, అన్ని అవకాశాలను వినియోగించుట, ఎత్తుగడగా కన్పించుచున్నది. ఈ ప్రయత్నాలలో భాగంగానే బీహార్, హర్యానా రాష్ట్ర జనతా ప్రభుత్వాల యెడల తాత్కాలికంగా నూతన విధానాన్ని అనుసరించుచున్నది. భారత బడా బూర్జువావర్గాలు కూడ సుస్థిర ప్రభుత్వానికి కాంగ్రెసు(ఐ), ఆర్.యస్.యస్‌ల మధ్య సదవగాహన అవసరాన్ని గుర్తించి, అవిధానాన్ని ప్రోత్సహించుచున్నవి. హిందుస్థాన్ టైమ్సు యీ వైఖరిని ప్రచారం చేసింది. "ఇందిరాగాంధి ఆర్.యస్.యస్. లింక్" అనే శీర్షిక క్రింద 28 సెప్టెంబరు 1979న "దినేషన్" అనే పత్రిక అట్టి ప్రచారాన్నే సాగించింది. వీటన్నిటిబట్టి నిరంకుశత్వం, మతతత్వం మధ్య స్నేహసత్సంబందాలను పెంపొందించే దళారీగా బడాబూర్జువా వ్యాపారవర్గాలు ప్రయత్నాలు ప్రారంభించాయి అనేది స్పష్టంగా తెలుస్తుంది. ఇందిరాగాంధీపై బడాబూర్జువావర్గం ఆశలు పెంపొందించుకొనుటకు రెండు కారణాలు కన్పించుతున్నవి. ఒకటి, పెట్టుబడిదారి సంక్షోభం తీవ్రమైంది. ఇది ప్రపంచ పెట్టుబడిదారి వర్గ సంక్షోభం నేపథ్యంలో జరుగుతున్నది. ఆకాశాన్నంటే ధరల పెరుగుదల, పరుగెత్తుతున్న ద్రవ్యోల్బణం, పెరిగిపోయే నిరుద్యోగం, పెట్టుబడిదారి విధానం పరిష్కరించేదశ అంతరించుట, అన్నిటి ఫలితంగా సామాజిక కల్లోల పరిస్థితులు యేర్పడగలవనే భయం, అట్టి పరిస్థితులలో "సుస్థిర ప్రభుత్వం" యేర్పడదనే భయం, ఆవర్గాన్ని అంటిపెట్టుకొని వున్నవి. రెండవది, కార్మికవర్గం యీ విధానాలకు వ్యతిరేకంగా పోరాడుతు, వర్గ ఐక్యతను పెంపొందించుకుంటుంది. ఢిల్లీ గుడ్డలమిల్లుల కార్మికులు నాలుగు మాసాలుగా సమ్మె పోరాటం జరుపుతూ, ఐక్యతను పెంపొందించుకొనుట, కళ్ళముందు ప్రత్యక్షంగా వుంది.

భారత బూర్జువావర్గాలను కలవర పెట్టుతున్న మరోవిషయం, వామపక్ష పార్టీలు, గ్రూపులు, వ్యక్తులు నిరంకుశత్వాన్ని, మత మౌఢ్యాన్ని ఇతర అభివృద్ధి నిరోధకవర్గాలపై పోరాడుటకై ఐక్యతను రూపొందించుట. ఇది ఎన్నికల ప్రకటనకు ముందునుండే ప్రారంభమై కార్మికవర్గం సంయుక్తంగా జనతా ప్రభుత్వపు ప్రజాస్వామ్య వ్యతిరేక, ప్రజావ్యతిరేక విధానాలను ప్రతిఘటించుట ప్రారంభమైంది. ఈ పోరాటాలు ఆర్థిక

సమస్యలపై ప్రారంభమై రాజకీయ సమస్యలపై పోరాటాలుగా రూపొందాయి. జనతాపార్టీ ప్రభుత్వం విచ్ఛిన్నమగుటతో యీ పరిణామం వేగవంతమైంది, పైగా సి.పి.ఐ(యం), సి.పి.ఐ రెండు కమ్యూనిస్టుపార్టీలు సమస్యలపై కలసి. పోరాటమార్గాన్ని చేబట్టుట, ప్రత్యేకంగా వామపక్ష వుద్యమానికి వెన్నెముకగా అయింది. అదే కాలంలో వామపక్ష ప్రజాస్వామ్య శక్తులు మధులిమాయే అధ్యక్షతన ఢిల్లీలో కన్వెన్షన్ జరుపుటతో రెండు కమ్యూనిస్టుపార్టీలు సమస్యలపై కలసి పనిచేయుటకు అవకాశాలు యెక్కువగుటతో, బూర్జువావర్గాలలో కల్లోలానికి మరింత గాలితోడైంది. గుత్తపెట్టుబడిదారి వర్గాలు తమ విధానాలకు పదును పెట్టసాగాయి.

బడాబూర్జువావర్గాలు ఎప్పుడూ కమ్యూనిస్టుల యెడల శతృభావవైఖరినే అవలంభించి, తెగనాడుటనే సాగించాయి. కారణం గుత్తపెట్టుబడి వర్గాలకు వ్యతిరేకంగా, ప్రజాప్రయోజనాలకై సి.పి.ఐ పోరాడుట, పైగా అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలో భాగస్వాములువుండుట, వారు సి.పి.ఐ, సి.పి.ఐ(యం)లు దగ్గరగుటను సహించలేకుండా వున్నారు. అందుకే బూర్జువా వార్తాపత్రికలు, రాజకీయవేత్తలు ఐక్యతామార్గాన్ని సి.పి.ఐ(యం) విడనాడుటకై రెచ్చగొట్టుతున్నారు. బడాబూర్జువావర్గం రాజకీయపార్టీలలో వొక్క ఇందిరాగాంధీయే వామపక్ష ప్రజాస్వామ్యపక్షాల ఐక్యతను చిన్నాభిన్నం చేయగలదని విశ్వశిస్తున్నారు. అందుకు ఆమె అవకాశవాదంలో ఆరితేరిందని, మిగతా యేయితర బూర్జువానాయకుని కంటె ప్రజలలో పలుకుబడి కలిగివుందని వారి అంచెనాగావుంది. ఆమెయింతకు ముందు మితవాదులందరిని త్రోసివేస్తానని ప్రచారం కావించింది. ఇప్పుడు కాంగ్రెసు (ఐ) అత్యంత పెద్ద వామపక్ష పార్టీయనే ప్రచారం మొదలు పెట్టింది. జనతా అభివృద్ధి నిరోధకపాలనను 28 మాసాలు సాగించి ప్రజలలో అసంతృప్తిని అధికంగా పొందిన తరువాత, తిరిగి ఇందిరాగాంధీ బలాన్ని పుంజుకొంటుందనుట వాస్తవం. బలమైన వామపక్ష శక్తులు ఐక్యం కాలేకపోవుట, ఆమెకు పరోక్షంగా బలమైన అంశమైంది.

## 2.3. వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత

1. నాడు దేశంలో కావలసింది, జనతా ప్రభుత్వం స్థిరత్వాన్ని సంపాదించుకొనుట, ఇందిరా కాంగ్రెసు పాలనను పునఃప్రతిష్టించుట కాదు. రెండింటిని త్రోసిబుచ్చి, వామపక్ష జాతీయ ప్రజాస్వామ్య రాజకీయ ప్రత్యామ్నాయం రూపుదిద్దుకొనవలసివుంది. కాంగ్రెసులోని ప్రజాస్వామ్యశక్తులు హరిజనులపై పెరిగే దౌర్జన్యాలకు, పెరిగే ధరలకు వ్యతిరేకంగా ప్రజలు సమీకృతులగుట సుముఖ అంశంగా నెంచుతున్నది. అవి మిత్రశక్తులుగా అభివృద్ధి చెందే అవకాశముందని వామపక్షాలు గుర్తించుచున్నవి.

కాంగ్రెసు పాలనను తిరిగి ప్రతిష్టించి, ఇందిరాగాంధి వ్యక్తి పూజావిధానాన్ని, అప్రదిష్టపాలైన "కాకస్" తిరిగి రంగ ప్రవేశం చేయుటను వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయానికి వ్యతిరేకంగా మరో బూర్జువా ప్రభుత్వాన్ని యేర్పరుచుటను వామపక్షాలు వ్యతిరేకిస్తున్నవి. అంచేత కాంగ్రెసువాదులు, తదితరులతో సంయుక్త

కార్యాచరణను పెంపొందించుటతోపాటు, పార్టీ సూత్రబద్ధ స్వతంత్రపాత్రను కాంగ్రెసేతర ప్రజాస్వామ్య శక్తులతో మలినం కాకుండా జాగ్రత్త పడుతుంది. జనతా, కాంగ్రెసుల బూర్జువా నాయకత్వాల ప్రభావం నుండి గ్రామీణ బడుగువర్గాలను, కార్మికవర్గాలను విముక్తి చేసి, వామపక్ష ప్రజాసామ్య ఐక్యతను జాతీయ ప్రత్యామ్నాయాన్ని నిర్మించుట సి.పి.ఐ ప్రథమ కర్తవ్యంగా నెంచుతున్నదని ఆపార్టీ జాతీయ సమితి తీర్మానంలో స్పష్టం చేసింది.[1]

అంచేతనే, జాతీయ సమితి తీర్మానం ప్రధాన వామపక్షాలైన రెండు కమ్యూనిస్టుపార్టీలు సి.పి.ఐ; సి.పి.ఐ(యం)లను దగ్గరకు చేర్చుటకు సాధ్యమైన అన్ని ప్రయత్నాలు తీవ్రం చేస్తుందని నొక్కి చెప్పింది. వామపక్ష ఐక్యత వొక్కటే పరిస్థితుల నెదుర్కొనజాలదు. కార్మికవర్గంలో సి.పి.ఐ; సి.పి.ఐ(యం) ల ఐక్యత, సంయుక్త పోరాటాల వాంఛ అత్యంత బలీయంగా వుంది. విస్తృత ప్రజావాంఛ అలాగే వుంది. కాన అంగీకృత అంశాలపై సంయుక్త కార్యాచరణ అవకాశాలు శోధించే దృక్ఫధాన్ని సి.పి.ఐ(యం) యెడల అవలంభించాలని కూడ తీర్మానం స్పష్టం చేసింది.

నాడు తాత్కాలికంగా జనతాపార్టీ వెనుక చేరిన అశేష ప్రజాసామాన్యం, అభ్యుదయకర వామపక్ష ప్రజాస్వామ్యశక్తులతోపాటు సమీకరించబడే ప్రయత్నం చేయాలని తీర్మానం కోరింది.[2]

బూర్జువా రాజకీయవేత్తలు, మొత్తం వార్తా పత్రికలు దేశంలోని రెండు ప్రధాన బూర్జువా పార్టీల సాంప్రదాయక పార్లమెంటరీ విధానాన్ని సుస్థిరం చేయ, ఎన్నికల ప్రచారంలో హోరెత్తించుచున్నారు. మరోవైపు వామపక్ష ప్రజాస్వామ్యశక్తులు స్థిరమైన ప్రభుత్వాలు యేర్పడుటకు తోడ్పవనే విమర్శనచేస్తున్నారు. కమ్యూనిస్టులు బూర్జువావర్గాల యీ ఆశలను అడియాశలు చేయాలి.

2. నాటి పరిస్థితులలో సి.పి.ఐ., సి.పి.ఐ(యం) లు స్వతంత్రంగాను, వామపక్ష ప్రజాస్వామ్య శక్తులతో కలసి ప్రజోధ్యమాలు నిర్మించుట ప్రత్యేకంగా చెప్పవలసి వుంటుంది. ఒకటి, ఆర్థిక, రాజకీయ పోరాటాల ద్వారానే వామపక్ష ప్రజాస్వామ్య జాతీయ ప్రత్యామ్నాయాన్ని నిర్మించాలి, కాని వామపక్ష ప్రజాస్వామ్య పార్టీల, శక్తుల మధ్య సంప్రదింపులు జరుపుట మాత్రంగానేకాదు. రెండవ అంశం యీ కర్తవ్య నిర్వహణకు దగ్గరిమార్గం, కాలపరిమితియేమీలేదు. దీర్ఘకాల పోరాట క్రమంలో ఐక్యత, సంఘటన నిర్మాణం జరుగుతుంది. మూడవ అంశం, బూర్జువాపార్టీల రాజకీయ ఆధిక్యత, ప్రజాపునాదిని బ్రద్దలు చేయుట ద్వారా, నూతన కలయికల ద్వారా యేర్పడుతుంది. ఇది యే వొక్క బూర్జువా పార్టీతో కలియుటద్వారాకాక, కార్మికవర్గ ఐక్యతను, కార్మిక కర్షక ఐక్యతను నిర్మించుట ద్వారానే యేర్పడుతుంది. అప్పుడే, బూర్జువాపార్టీలో యేర్పడిన సంక్షోభ పరిస్థితులను సమర్థవంతంగా, పూర్తిగా వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతే సంఘటన నిర్మాణానికి వుపయోగించుకొను స్థితిలో కమ్యూనిస్టు వుద్యమం వుంటుంది.

*1&2. తీర్మానాలు (1977) సి.పి.ఐ జాతీయసమితి అక్టోబరు 1977 పే.9-10.*

వామపక్షాలతో కలిసే శక్తులు రెండు కాంగ్రెసులలోనే గాక, మితవాతశక్తుల ఆధిక్యత గల జనతాపార్టీలో గూడ వున్నవి. బూర్జువాపార్టీలు చీలికలు అగుతున్నవి, రాజకీయ పరిస్థితులు త్వరితంగా మారుతున్నవి. నూతన కలయికలకు అవకాశాలు యేర్పడుతున్నవి. అయితే సి.పి.ఐ; సి.పి.ఐ(యం) ల మధ్య, వారి అధీనంలోని ప్రజాసంఘాల మధ్య ఐక్య ప్రజాకార్యాచరణలు అత్యంత ప్రాముఖ్యత వహించుతాయి. అంచేతనే, అనేక సమస్యలపై వివిధ రకాలుగా సి.పి.ఐ; సి.పి.ఐ(యం) ల మధ్య సంబంధాలు పెంపొందించబడుతున్నవి. కార్మికరంగంలో జనతా ప్రభుత్వపు ప్రజావ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా ఐక్యకార్యాచరణ, అదేవిధంగా కాంగ్రెసు(ఐ) ఎ.ఐ డి.యం.కె ప్రభుత్వాలకు వ్యతిరేకంగా, ఐక్యకార్యాచరణలు పెంపొందించబడుతున్నవి. పార్లమెంటులో, అనేక రాష్ట్రాల అసెంబ్లీలలో అనేక సమస్యలపై వొకే విధమైన వైఖరిని రెండు కమ్యూనిస్టుపార్టీలు చేపట్టాయి. సామ్రాజ్యవాద వ్యతిరేక సమస్యలపై "ఎఐప్సో" (ఎ.ఐ.పి.ఎస్.ఓ.) వేదికపై రెండు పార్టీలు పాల్గొన్నవి.

జీవితం రెండు కమ్యూనిస్టుపార్టీలు నెమ్మదిగానైనా కనీసం ఆర్థిక సమస్యలపై చేరువగుటకు అవకాశాలను ముందుంచుతున్నది. ఆర్థిక సమస్యలపైనే గాక కొన్ని రాజకీయ సమస్యలపై కూడ కలసి పని చేయవలసిన అవసరాన్ని బి.టి.రణదివె, మరి కొంతమంది మాట్లాడుట ఆశాజనకము. మార్క్సిజం లెనినిజాన్ని అనుసరించే రెండు కమ్యూనిస్టుపార్టీలు, దానిలో తెరమరగయ్యే అంశాలను, అభివృద్ధి చెందుతు పురోగమనంలో వున్న అంశాలను చూడగలగాలి. నెమ్మదిగానైనా ఐక్యకార్యాచరణ పురోగమనాన్ని గమనించి, పోత్సహించాలి, అడ్డంకులను క్రమేణా తొలగించుకొంటూ, తమ పాత్ర నిర్వహించాలి. ఐక్యప్రజాకార్యాచరణయే కమ్యూనిస్టు వివిధ శ్రేణులు ఆశించే వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయాన్ని రూపొందించే యేకైకమార్గము. నేడు యేవొకటి, రెండు రాష్ట్రాలలోనో, రంగాల్లోనో గాక దేశమంతా విస్తృత ఐక్యకార్యాచరణోద్యమాలు పెల్లుబకాలి. సాధారణ సమిష్టి సమస్యలపైనే గాక ప్రత్యేక సమస్యలపై కలియుటకు సిద్ధంగావున్న అందరితో కమ్యూనిస్టులు ఐక్యప్రజాపోరాటాలు సాగించాలి.

" వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయం, దాని నిర్మాణం కొన్ని రాజకీయపార్టీల, గ్రూపుల పైస్థాయి వొప్పందాల, ఎన్నికల బ్లాకుల నిర్మాణంగా ఎప్పుడూ వూహించబడలేదు." "ఐక్యప్రజాపోరాటాల పంథాగా రాజకీయ పోరాటాలయేకైక పంథాగా, వామపక్ష ప్రజాస్వామ్య జాతీయ ప్రత్యామ్నాయ నిర్మాణ కర్తవ్యానికి ముఖద్వారంగా భటిండా తీర్మానం స్పష్టం చేసింది.[1]" అని రాజశేఖర్‌రెడ్డి వివరించారు.

3. దేశంలోని పరిస్థితి తీవ్ర వైరుధ్యాల సంఘర్షణలను ప్రతిబింబించుచున్నది. జనతాపార్టీ పూర్తిగా అప్రదిష్టపాలైంది. రాష్ట్రీయస్వయంసేవకసంఘం జనసంఘ కూటమి శక్తులు జనతాపార్టీలో ఆధిక్యతగల నిర్ణయాత్మకశక్తియై, రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వ యంత్రాంగంలో కీలక స్థానాలలో బలంగా వున్నవి. ఈ జాతి వ్యతిరేకశక్తికి

---

*1. రాజశేఖరరెడ్డి, నీలం (1979) పార్టీలైఫ్. వా. 15. నం. 7. పే. 8–9.*

జనతాపార్టీలోనే వ్యతిరేకపోరాటం ప్రారంభమైంది. విస్తృత లౌకిక ప్రజాస్వామ్యశక్తులు తీవ్రంగా కలతచెంది, యీ ప్రమాదానికి వ్యతిరేకంగా సమీకరణ ప్రారంభించాయి.

నాడు. నాలుగు రకములైన నూతన కలయికలు. అవి సంపూర్ణ స్వరూపాన్ని ధరించకపోయినా, ఆరోగ్యకరమైనవి కాకపోయినా. యేర్పడుట చారిత్రికసత్యం. అయితే వాటి తాత్కాలిక నైజాన్ని మరువరాదు.[1]

మొదటిది. మధులిమాయే చొరవతో 17మే 1979న జరిగిన సమావేశానికి హాజరైన వారు వామపక్ష ప్రజాస్వామ్య జాతీయ ప్రత్యామ్నాయంలో ముఖ్యభాగస్వాములుగా వున్నారు. ఆసమావేశం పురోగమన మార్గాన్ని వెలుగులోనికి తెచ్చింది. కాని కాంగ్రెసు(ఐ)లోని వామపక్ష ప్రజాస్వామ్యవాదులు తమ ప్రతినిధులను పంపుటను సి.పి.ఐ(యం) లోని మెజారిటి నాయకత్వం వ్యతిరేకించుట దురదృష్టకరము.

రెండవది నూతన సుముఖ విస్తృత ఐక్యతా కలయిక, సామ్రాజ్యవాద వ్యతిరేక సమస్యలలో నాడు సామాన్యం అంశంగా వుంది. విదేశాంగ విధానంలో ఇండో-సోవియట్ స్నేహ సంబంధాలు, వియత్నాం మద్దతులకు యేకాభిప్రాయంవున్నా, చైనా విధాన వ్యతిరేకతో సి.పి.ఐ(యం), నక్సలైట్లు భిన్నాభిప్రాయాన్ని కలిగి వున్నారు. అయినా వామపక్ష ప్రజాస్వామ్య జాతీయ ప్రత్యామ్నాయ ఐక్యతను అభేదాభిప్రాయాలు త్రోసివేయజాలవు. అదే సమయంలో వామపక్ష ప్రజాస్వామ్య వేదికలో వారు చేబట్టే బలమైన పాత్రను తక్కువగా అంచెనావేయరాదు.

మూడవ నూతన సుముఖ కలయిక, కార్మిక యితర మధ్యతరగతి వర్గాల ఐక్యత. సమిష్టి ఆమోదంపొందిన కోర్కెలు వగైరాలకు సంబంధించినది. ఇవి ఆర్థికాంశాలు మాత్రమేగాక, పారిశ్రామిక సంబంధాల బిల్లుకు వ్యతిరేకంగా. పబ్లిక్‌రంగ రక్షణకు, నిరుద్యోగ నిర్మూలోద్యమాన్ని అందరూ ఆమోదించక పోయినా, వీటిలో రాజకీయ దృక్పధం యిమిడి వుంది. వామపక్ష ప్రజాస్వామ్య జాతీయ ప్రత్యామ్నాయానికి దోహదకారిగానే వున్నవి. వీటిని ప్రజాసమీకరణకై వేదికగా రూపొందించే అవసరం, దానినుండే ప్రత్యామ్నాయం వుద్భవించుట కోరుకొనతగినదన్న దృష్టిలోనే సమగ్రంగా చూడాలి.

నాలుగవ సుముఖ అంశం. అనేక రాష్ట్రాలలో నూతన కలయికలు యేర్పడుతున్నవి. విశాలమైన మనదేశంలో వివిధ భాషా, సాంస్కృతిక, సామాజిక భిన్నత్వాలవలన, అన్ని రాష్ట్రాలలో యీ నూతన కలయికలు వొకే విధంగా వుండాలను కొనుట పొరపాటు అగుతుంది. నాటి గందరగోళ సంక్లిష్ట పరిస్థితులలో, జాతీయ రాజకీయ పరిస్థితిలో వామపక్ష ప్రజాస్వామ్య జాతీయ ప్రత్యామ్నాయం రూపొందించుట, ఆశించతగినదిగానే వుంది.

భటిండా పార్టీ కాంగ్రెసు తీర్మానం. వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత సంక్లిష్ట సమగ్ర విధానమని, వివిధ కాలాలలో రాష్ట్రాలలో వివిధ రూపాలలో అభివృద్ధి చెందుతుందని

1. *సెన్ మోహిత్ (1979) పార్టీలైఫ్. వా 15. నం.12. పే. 6-7.*

నొక్కిచెప్పింది. అదే కాలంలో యీ అభివృద్ధి క్రమంలో వచ్చే వివాదాంశాలను వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతకు వ్యతిరేకంగా చూడరాదని, అవి పరస్పరం సమన్వయం చేసుకొనాలని తెలిపింది. ప్రజాకార్యాచరణకు రాజకీయ ఐక్యకార్యాచరణ గీటురాయి. విస్తృత ప్రజాసామాన్యపు ఐక్యతను యేవిధంగా నిర్మించి, వామపక్ష ప్రజాస్వామ్య జాతీయ ప్రత్యామ్నాయాన్ని నిర్మించుటకు మార్గాన్ని యేవిధంగా సుగమం చేయగలమనే దానినే ఆలోచించవలసివున్నది. ప్రతి రాష్ట్రంలో యీ గీటురాళ్ళు వాస్తవికాంశాలనుండి రూపొందుతవి. దేశంలోని అన్ని రాష్ట్రాలకు ఒక నమూనా అంటూ యేదీ లేదు. అటువంటి నమూనా వొకదానిని రూపొందించాలని అనుకొనుటయే అశాస్త్రీయము. కేరళ, పశ్చిమ బెంగాల్, బీహార్, యు.పి., పంజాబ్, తమిళనాడులలో రాజకీయపార్టీల, గ్రూపుల, వ్యక్తుల కలయికలు దీనినే సూచిస్తున్నవి. రాష్ట్ర, కాలపరిస్థితుల బట్టి యీ వైవిధ్యం స్పష్టంగా కన్పించుతుంది. అంచేత, యేదోవొక నమూనా ఆచరణలో పెట్ట ప్రయత్నించితే ఆశాభంగం కలుగుతుంది. రాజకీయపార్టీల పరిణామక్రమంలోనే సహకార, సయోధ్య, ఐక్యతా మార్గాలను శోధించి, ఎప్పటికప్పుడు, సమస్యల ప్రాతికగా విధానాలను రూపొందించుకొనవలసివుంటుంది. జీవితంవలెనె రాజకీయాలు పరిణామశీలమైనవి, అంచేతనే వాటిని ఆవిధంగానే అర్థం చేసుకోవాలి.

4. కాంగ్రెసు, సి.పి.ఐ; సి.పి.ఐ(యం) ల నాయకులు, దేవరాజ్ ఉరుసు, రాజేశ్వరరావు, నంబూద్రిపాదులు, 15 అక్టోబరు 1979లో న్యూఢిల్లీలో 90 నిమిషాలు సంప్రదింపులు జరిపి, రాబోయే లోక్‌సభ ఎన్నికలలో జాతీయస్థాయిలో, కేరళలలో ఐక్యంగా పోటీ చేయాలని నిర్ణయించారు. కేరళలో వామపక్ష ప్రజాస్వామ్య శక్తులలో వచ్చిన అభిప్రాయభేదాలు పరస్పరసంభాషణలు, సంప్రదింపులలో పరిష్కరించబడగలవనే ఆశను వెల్లడించారు. మూడు పార్టీల నాయకులు సూత్రప్రాయంగా 1) మూడు పార్టీలు ఐక్యంగా నిరంకుశ, మతతత్వపార్టీలను వోడించుటకు కలసి పనిచేస్తాయి. 2) లౌకిక అభ్యుదయకర, ప్రజాస్వామ్య శక్తులను బలపరచుటకు సమిష్టిగా అన్ని ప్రయత్నాలు చేస్తాయి. ఈ వొప్పందం కేరళకు కూడా వర్తిస్తుందని నొక్కి చెప్పారు.[1]

కేరళలో పి.కె. వాసుదేవన్ నాయరు నాయకత్వంలోని ఐక్యసంఘటనా మంత్రివర్గం రాజీనామా చేసిన తరువాత సంభవించిన దురదృష్టకర పరిణామాల నేపథ్యంలో యీ సంయుక్త ప్రకటనకు అన్ని వామపక్ష ప్రజాస్వామ్య వర్గాలు దేశమంతటా సంతృప్తి చెందాయి. మత, నిరంకుశ శక్తులకు ప్రాతినిధ్యం వహించే వారందరికి సమానంగా నిరాశనిస్తుంది. కాంగ్రెసు (ఐ) నాయకుడు సి.యం స్టైఫెన్ న్యూఢిల్లీలో చేసిన ప్రకటన దీనినే తెలియజేస్తున్నది. రాజకీయాలలో వచ్చిన మార్పుల కారణంగా రాష్ట్రంలోని ఐక్యసంఘటనను విస్తరించుటకు, సి.పి.ఐ(యం)తో సంప్రదింపులు ప్రారంభించాలని భాగస్వాములందరూ నిర్ణయించారు. అసెంబ్లీ రద్దు చేయుటకు సూత్రప్రాయంగా అందరూ యేకగ్రీవంగా ఆమోదించారు. లోక్‌సభ ఎన్నికలతోపాటు అసెంబ్లీ ఎన్నికలు జరపాలని ఆమోదించారు. ఐక్యసంఘటనలో భాగస్వాములకు, సి.పి.ఐ(యం)కు అసెంబ్లీ,

---

*1. ఫరూకీ. యం (1979) పార్టీలైఫ్. వా.15. నం 20. పే. 1.*

పార్లమెంటు సీట్లు పంపకంపై సంప్రదింపులుకు నిర్ణయించారు. కేరళలో ఐక్యకసంఘటనను బలపరచుటకు అఖిలభారత నూతన కలయికలలో భాగంగా చేసిన నిర్దిష్ట నిర్ణయము. ఇది నిస్సందేహంగా కేరళ ఐక్యసంఘటనను బలపరుస్తుంది.

ఈ అవగాహనను అమలు చేయుటలో ఐక్యసంఘటనలో కొన్ని అవాంతరాలు వచ్చాయి. అంచేత సి.పి.ఐ ముఖ్యమంత్రి సంఘటనను సంప్రదించి, తన రాజీనామా సమర్పించారు. నూతన కలయికలను సులభతరం చేయుటకు అవసరచర్యలు తీసుకొనబడినవి. రాజీనామా అనంతరం వచ్చిన వ్యతిరేక పరిణామాలు వామపక్ష ప్రజాస్వామ్యశక్తుల నూతన కలయికలకు కొన్ని చిక్కులు వచ్చాయి.

ఐక్యసంఘటనా ప్రభుత్వం కేరళలో రాజీనామా చేసిన తదనంతరం యేర్పడిన అవాంఛనీయ పరిస్థితులను చక్కదిద్దుటకు, కాంగ్రెసు అధ్యక్షుడు, సి.పి.ఐ; సి.పి.ఐ(యం) ల జనరల్ శెక్రటరీలు యిద్దరూ కలసి చేసిన సంయుక్త ప్రకటన యెంతో తోడ్పడింది. ఇది వొక ముఖ్య సుముఖఅంశము.

రాజకీయపార్టీలన్నీ, జనతా ప్రభుత్వ పతనంతో యేర్పడిన నూతన పరిస్థితులకు తగినవిధంగా తమ విధానాలను సరిచేసుకొనవలసిన అవసరాలు యేర్పడినవి. వామపక్షాలన్నీ, సి.పి.ఐ(యం) తో సహా, జులై-ఆగస్టు ప్రభుత్వసంక్షోభంలో తమ వైఖరులను నిర్ణయించుకొనవలసి వచ్చింది. జనతా ప్రభుత్వపునరుద్ధరణకు వ్యతిరేకతను స్పష్టం చేయువలసినవచ్చింది. ఈ సమస్యపై సి.పి.ఐ(యం)లో తీవ్ర అభిప్రాయభేదాభిప్రాయాలు వెల్లడగుట ప్రజలందరకు తెలిసినదే. జనతాతో సి.పి.ఐ మినహా అన్ని వామపక్షపార్టీలు రెండు సంవత్సరాలు సహకారం నెరపాయి. ఈ సంక్షోభపు వొక ముఖ్యఫలితమేమంటే, వారు ఆవైఖరిని మార్చుకొనవలసివచ్చింది. అంచేత ఐదు వామపక్షపార్టీలు సి.పి.ఐ.,సి.పి.ఐ(యం),ఆర్.యస్.సి.,పి.డబ్ల్యు.పి.,పార్వర్డ్ బ్లాకులు చేరువగుట సాధ్యమైంది.

ఈసుముఖ విధానాన్ని ముందుకు తీసుకొని వెళ్ళవలసివుంది. రాష్ట్రం తరువాత రాష్ట్రంలో సి.పి.ఐ., సి.పి.ఐ(యం)లు దగ్గర అగుట ప్రారంభమైంది. అదే కాలంలో యితర వామపక్షాలను వారు ఆకర్షించుచున్నారు. లౌకిక ప్రజాస్వామ్యశక్తులు, గ్రూపులు, ఆర్.యస్.యస్. ఆధిక్యతలో గల జనతా, నిరంకుశ ఇందిరా కాంగ్రెసు తిరిగి అధికారంలోనికి రాకుండా వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతవైపుకు వచ్చారు. ఈ సుముఖ పరిణామాల నుండి కేరళను దూరంగా వుంచలేము. కాంగ్రెసు, సి.పి.ఐ.,సి.పి.ఐ(యం) ల అఖిలభారత నాయకత్వాల సంయుక్త సమావేశం ప్రయత్నాల ఫలితంగా, అవాంచనీయ పరిస్థితుల అభివృద్ధిని ప్రతిఘటించి ఆపివేసి, కేరళలలో సుముఖ పరిస్థితి యేర్పడుట, బెంగాల్‌తోసహా అఖిలభారత పరిస్థితి మెరుగు అయింది.

అధికారసమస్య, వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయంతో పరిష్కారమైంది. వివిధ రాష్ట్రాలలో అఖిలభారత స్థాయిలో వామపక్షాలు ప్రజాస్వామ్య, లౌకిక శక్తులతో చేతులు కలిపి, నిరంకుశత్వాన్ని, మతమౌఢ్యతను ఎదుర్కొను అధికారాన్ని పొందుటకు పోరాటం

జరుపుతున్నవి. వామపక్ష ఐక్యతను, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతను వైరుధ్యాలుగా చూడరాదు. కాంగ్రెసు, సి.పి.ఐ; సి.పి.ఐ(యం) నాయకుల సంయుక్త ప్రకటన వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతను నిర్మించాలని స్పష్టం చేసింది.

ఇంతకు పూర్వం, ముఖ్యంగా కార్మికవర్గంలో ఆర్థిక సమస్యలపై పోరాటాలలో, ప్రజాసంఘాలలో ఐక్యతాభావం, పోరాట పటిమ పెరుగుతూ వచ్చాయి. వామపక్ష ప్రజాస్వామ్య పక్షాలు రాజకీయ సమస్యలపై ఐక్యకార్యాచరణకు వెనుకాదారు. ఇప్పుడు ఆదశ పోయింది, కాని ఆటంకాలు లేవని చెప్పలేము.

ఎన్నికల ఐక్యసంఘటనల మిత్రులు వామపక్షాలైన సి.పి.ఐ(యం), సి.పి.ఐలు, కాంగ్రెసు (యు), లోక్‌దళ్‌లు రాష్ట్రస్థాయి ఐక్యతా కన్వెన్షనులు జరుపుతూ ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, పంజాబ్ రాష్ట్రాలలో ఐక్యకన్వెన్షన్‌లలో ప్రజాసమీకరణకావించారు. వీటికి శిఖరాగ్రంగా సి.పి.ఐ; సి.పి.ఐ(యం) లోక్‌దళ్, కాంగ్రెసు (ఉ), పార్వర్డ్‌బ్లాకులు, 23 అక్టోబరు 1979లో ఐక్యప్రజాసమీకరణ, ప్రజాప్రదర్శనలు చేసారు. కమ్యూనిస్టు వ్యతిరేక బడాబూర్జువా పత్రికలు, యీ దశకంలో అత్యంత పెద్ద ప్రజాప్రదర్శనగా వొప్పుకొనక తప్పలేదు. ఈవిధంగా వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత నిర్మించుట, ప్రజాసమీకరణ, ప్రదర్శనగా రూపొందిన క్రమంలోనే ప్రజాస్వామ్యపార్టీల, గ్రూపుల కార్యకర్తలు చేరువగుట ఉత్సాహాన్ని కలిగించే అంశమైంది.

వామపక్షాలు ముఖ్యంగా సి.పి.ఐ., సి.పి.ఐ(యం) చేరువగుట, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతా నిర్మాణ క్రమం బలపడుటకు కీలక ప్రాముఖ్యత కలిగివుంది. అన్ని రాష్ట్రాలలో నేడు సర్వసాధారణ అంశమైందని చెప్పవచ్చు. ఒక్క పశ్చిమబెంగాల్ సి.పి.ఐ(యం) నాయకత్వం, అగ్రగామిగా ప్రమోద్ దాస్ గుప్తా ప్రధాన స్రవంతికి వ్యతిరేకంగా ఆచరణ సాగించారు. పురోగమన వామపక్ష ఐక్యతను ఎదిరించుట ద్వారా అసలు మౌలిక లక్ష్యానికే ముప్పు తెచ్చారు.[1]

కేరళలో వామపక్ష ఐక్యత మరింత పురోగమించింది. సి.పి.ఐ(యం) సి.పి.ఐ., ఆర్.యస్.పి.లు చేరువగుటతో శ్రామికులు, బడుగువర్గాలలో ఉత్సాహం అవధులు దాటింది. సంయుక్త ప్రజాసమీకరణ, ప్రదర్శనలు, సమావేశాలు మూడు పార్టీలచే జిల్లా, స్థానిక స్థాయిలలో రాష్ట్ర మంతటా జరిగాయి. వివిధ పార్టీల కార్యకర్తలు, ప్రజల మధ్య స్నేహ, సౌహార్ద భావాలు పెల్లుబికుట ప్రత్యేకత ఇంతటి విస్తృత సౌహార్ధ రెండు పార్టీల ప్రదర్శనలు 1964 చీలిక తరువాత ఎన్నడూ జరుగలేదు. ఇదే ఐక్యతకు పెట్టనికోట.

వామపక్ష ఐక్యతకై సి.పి.ఐ ముఖ్యమంత్రి రాజీనామా సి.పి.ఐ(యం) కోరిక ననుసరించి చేయుట గొప్పత్యాగము. అయినా, సి.పి.ఐ., సి.పి.ఐ(యం) ఆర్.యస్.పి.లు చేరువగుటతోనే సంతృప్తి పదరాదు. వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతను మరింత విస్తృత పరచి, కాంగ్రెసులోని ప్రజాస్వామ్య శక్తులను ముస్లింలీగు తదితరులను సంఘటన భాగస్వాములను చేయుట సి.పి.ఐ లక్ష్యంగా చెప్పుతున్నది.

---

*1. ఫరూకి. యం (1979) పార్టీ లైఫ్. వా.15. నం.21. పే. 5.*

## 2.4. కార్మికవర్గ ఐక్యత

కార్మికవర్గం అనేక చీలికలుగా, వివిధ పార్టీల అనుబంధ, స్వతంత్రయూనియనులుగా, మరికొన్ని పారిశ్రామిక యాజమాన్యాలు పరోక్షంగా యేర్పరచిన యూనియనులుగా వున్నది. ఇన్ని చీలికలు యింతకు ముందెన్నడులేవు. మరోవైపున యిటీవకాలంలో ఐక్యకార్యాచరణలు, బ్రహ్మాండమైన ప్రజాపోరాటాలు, అనేక సంస్థలు కలసి సంయుక్త పోరాటాలు, గతంలో కంటె తరుచుగా జరుగుచున్నవి. సారాంశం వొక్కటే, వాస్తవ పరిస్థితులు కార్మికులు పోరాటాలలో సమీకరించబడి ఐక్యతా మార్గంలో పురోగమిస్తూ వుంటే, బూర్జువా, మధ్యతరగతి నాయకత్వాలు నేలవిడిచిన సిద్ధాంతాల ప్రభావాలకు, వొంటెత్తు పోకడలకు" తదితర వర్గ ప్రలోభాలకు గుర్రై వివిధ చీలికలకు ముఖ్య కారణాలు అగుతున్నవి. సంక్షోభం తీవ్రమైన కొలది కార్మిక వర్గం యీ అడ్డుగోడలను తుడిచివేసి ఐక్యతవైపు పయనించుటతో సహజంగానే పోరాటాలు విజృంభించుతాయి. పెట్టుబడిదారుల దాడులను ఎదుర్కొనుటలో ఈ ఐక్యత, మరింత విస్తరించి, బలపడుతుంది.

ఒక పరిశ్రమలో ఒకే సంఘం, అఖిలభారత స్థాయిలో ప్రతి ప్రధాన పరిశ్రమలోని కార్మికవర్గమంతా ఒకే ఫెడరేషనుగా ఏర్పడు మార్గాన్ని చేపట్టవలసి ఉంటుంది. అదే విధంగా ప్రతి రాష్ట్రంలో ఒకేఒక ఐక్య కార్మిక సంఘాన్ని ఏర్పరచుకొనే ప్రయత్నం కార్మికవర్గమే చొరవతో ఐక్యమై తమ లక్ష్యాన్ని చేరవలసి ఉంటుంది. శాస్త్రీయ అవగాహన కార్మిక వర్గం ఐక్యమగుటకే ఎక్కువ అనుకూల అంశాలు కలిగివుండుటను స్పష్టం చేస్తుంది. దీనికి వ్యతిరేకంగా కార్మికసంఘాలలోని కొన్ని నాయకత్వాలు బూర్జువావర్గ, యాజమాన్య ప్రలోభాలకు లోనై వారి కుటిల రాజకీయాలు నడిపిస్తూ ఉంటవి. వాటిని అధిగమించుట లోనే కార్మికవర్గ ఐక్యత, భవిష్యత్ ఆధారపడి ఉంటుంది. కొంతమంది నిరాశ, స్వప్రయోజన పరులు కార్మిక సంఘాలు "రాజకీయాలకు దూరంగా ఉండాలని", "స్వతంత్రంగా ఉండాలనే" వాదనలతో కూడా కార్మిక సంఘాలలో చీలికలకు కారణభూతు లౌతుంటారు. ఇది స్వతంత్ర సంఘాలనే పేరుతో "రాజకీయాలలో కార్మికవర్గ పాత్రలేకుండా, వారు తటస్థం వహించాలనుట" సంపూర్ణ ఆర్థికతత్వానికి దారితీస్తుంది. సమాజంలో సర్వఉత్పత్తులకు, సంపదలకు సృష్టికర్తలైన కార్మికవర్గానికి, సమాజ పాలనాధికారాలలో పాత్రలేకుండా ఏశక్తిచేయజాలదు, అది కార్మికవర్గ విప్లవ పాత్రను నిర్వీర్యం చేస్తుంది. ఏవక్క రాజకీయపార్టీ కార్మికసంఘాలను తమజేబు సంస్థలుగా, పూర్తి నిర్ణయాత్మక అధిపత్యంలోగాక, స్వతంత్ర సమిష్టి నాయకత్వంలోని సంస్థలుగా కార్మికవర్గ దృక్పథంతో నడుపుట, కార్మికవర్గ ఐక్యత పెంపొందించి, సుస్థిరంచేసి, పోరాట ఐక్యత, శక్తిని పెంపొందిస్తుంది. వివిధ రాజకీయ సిద్ధాంతాలపై విశ్వాసంగల రాజకీయ పార్టీలన్నీ, ప్రధానంగా కార్మికవర్గ శ్రేయస్సుకై పాటుబడే విషయంలో పోటీపడవచ్చు, కాని కార్మికవర్గ ఐక్యతకు, ఐక్యపోరాట శక్తికి ముప్పుతెచ్చే ఏపనీ చేయరాదనే ఒక స్వచ్ఛంద నిర్ణయం మాత్రం అత్యవసరము.

కార్మికవర్గంలోని కొన్నివర్గాలు వర్గపోరాట దృక్పథం లేక ధోరణి అవలంభించుట, ట్రేడ్‌యూనియన్‌ల ఐక్యతను విచ్ఛిన్నం చేయకపోగా, కార్మికవర్గాన్నంతా, అగ్రగామి దళంగా పోరాటోన్ముఖులను చేస్తుంది. ఎవరో కొందరు వర్గపోరాటాన్ని, చైతన్యాన్ని పెంపొందించ ప్రయత్నించినంత మాత్రాన వర్గపోరాటాలలో తీవ్రత ఏర్పడదు. నాటి సమాజనైజాన్ని అనుసరించే జరుగుతుంది. ఈ సందర్భంలో "వర్గపోరాటం మనం సృష్టించినదికాదు. పెట్టుబడిదారీ విధానం సృష్టించింది. ఆ విధానం ఉన్నంతవరకు అది కొనసాగుతుంది." అని అన్న పండిట్ నెహ్రూ మాటలు పాలక వర్గాలు గుర్తుపెట్టుకొనాలి.

జీవితం, నేటి కార్మికవర్గ అనైక్యతా వాస్తవ పరిస్థితులనుండి ఐక్యతకై పురోగమించుటకు, చొరవతో వివిధ కార్మిక సంఘాలు, కార్మిక ఫెడరేషనులు, ట్రేడ్‌యూనియన్ సెంటరులు, సాధ్యమైన స్థాయిలలో సంయుక్త లేక సమిష్టి కార్యాచరణలు, ఐక్యపోరాటాలు చేపట్టవలసి ఉందని నేర్పింది. ప్రజలు ఆందోళన చెందుతున్న ఏఒక్క సమస్యయైనా, సమిష్టిగా రూపొందించబడిన కోర్కెలు చార్టరు లేక కార్యక్రమముపైనైనా ఐక్యకార్యాచరణను చేపట్ట వచ్చును. అవితక్షణ, తాత్కాలిక సమస్యలు లేక దీర్ఘకాలపు కార్యాచరణలు కావచ్చు, అవి వాటికి తగిన పోరాట రూపాలను అవే రూపొందించుకొంటవి. అలాగే సంయుక్త కార్యాచరణ సమితిలు, సమన్వయ కమిటీలు తదితర యేనిర్మాణ రూపాలైనా కావచ్చు, పోరాటమే ప్రధానంగా చేబట్టవలసినది.

రెండో ముఖ్య ఆచరణీయాంశం సంయుక్త సమావేశాలు, సంప్రదింపులు, అభిప్రాయభేదాలలో సమన్వయం సాధించుటకు చర్చలు, కార్మికుల సమస్యలపై అందరికి అమోదకర అంశాలను గుర్తించుటకు, పోరాట కార్యక్రమాన్ని చర్చించి నిర్ణయించుటకు సమావేశాలు, సంప్రదింపులు అనుసరణీయాలు. వివిధ స్థాయిలలో పరస్పర చర్చలు, సంప్రదింపులు, సమన్వయం కమిటీలు ప్రముఖ పాత్ర నిర్వహించుతాయి.

సంయుక్త కార్యాచరణ వేదికలన్నిటిలో, అందరి ఆమోదంతో పరస్పర వొప్పందాల ద్వారానే ఐక్యకార్యాచరణ సాగాలి. వీటితోపాటు తమను తాము బలపరచుకొనే స్వతంత్ర కలిగివుంది. అయితే ఆ కార్యక్రమాలు అందరి ఆమోదంతో కొనసాగే ఐక్యకార్యాచరణలకు వ్యతిరేకంగా వుండరాదు. రాజకీయపార్టీలు వొకరిపై మరొకరు దాడి చేసుకొంటూ అనైక్యతను చాలా కాలంగా పెంచుకొంటూ వచ్చారు. అంచేతనే కార్మికవర్గంలో అత్యధిక భాగం యేనిర్మాణంలో లేకుండా బయటనే వుండి పోయారు.

మూడో అంశం, అనేకంగా వున్న కేంద్ర ట్రేడుయూనియనులు వచ్చే రోజులలో వాటిని కాన్ఫెడరేషనులుగా రూపొందిన కార్మికవర్గ ఐక్యకార్యాచరణ కార్య రూపం ధరించుటకు తోడ్పడుతుంది. కార్మికవర్గంలో ఐక్యత నెలకొల్పుటకు సోపానమగుతుంది. అందుకు తగిన ప్రాతిపధికలను జాగ్రత్తగా రూపొందించాలి. పరస్పర విశ్వాసంతో ఐక్యతా నిర్మాణానికి పురోగమించుటకై అందరి ఆమోదం పొందిన అంశాలపై అనేక సంయుక్త ప్రజాకార్యాచరణలను చేపట్టాలి. ప్రజాభిప్రాయలకు నాయకత్వాలు తగిన విలువ నిచ్చి పురోగమించాలి.

నూతన ఆర్థిక విధానాలను ప్రభుత్వం ప్రవేశపెట్టిన అనంతరం కార్మిక సంఘాల ప్రతిపాదనల (స్పాన్సరింగు) కమిటిని,ప్రజాసంఘాల జాతీయ వేదికను యేర్పాటు చేయుట సుముఖ పరిణామము. ఈ కాలంలో అఖిల భారత స్థాయిలో నాలుగు సమ్మె పోరాటాలు జరిగాయి. సమ్మెలలో కోల్పోయిన పనిదినాలు తగ్గుట, ఆర్థిక మాంధ్యం కారణంగా కార్మికవర్గం యితర పోరాటాలను రూపాలను చేబట్టుటతో పాటు, కార్మికవర్గంలో అనైక్యత కొంతకారణంగా చెప్పవచ్చును. కార్మికవర్గం చేపట్టవలసిన ఆందోళనా రూపాలలో భేదాలు వున్నప్పటికి, అనేక జాతీయ సమస్యల పై వుమ్మడి అవగాహనకు రాగలుగుతున్నారు. ప్రవేటీకరణకు, పెట్టుబడులు వుపసంహరణకు వ్యతిరేకంగా ప్రభుత్వరంగ కార్మికసంఘాలు, అపూర్వ ఐక్యతతో వుమ్మడి పోరాటాలు చేపట్టాయి.

కార్మికులపై యాజమాన్యం తెస్తున్న వొత్తిడి తీవ్రతను పెరిగే లాకౌట్లు తెలియజేస్తున్నవి. అవమానకర షరతులపై వారిని కాంట్రాక్టు కార్మికులగా మార్చుతున్నారు. అక్రమ లాకౌట్లు వ్యతిరేకంగా కార్మికవర్గం ఐక్యంగా పోరాడుతున్నది. అజెండాలోనికి కార్మికవర్గ ఐక్యత యీ కాలంలో ప్రధానంగా వచ్చింది. కార్మికోధ్యమంలో సంఘీభావయేకత్వంకై భారత కార్మిక సంఘాల కాన్ఫెడరేషన్‌ల ప్రతిపాదనలు సి.ఐ.టి.యు. చొరవతో, యితర సంఘాల సుముఖ స్పందనలతో కార్యరూపం ధరించాయి.

భారతదేశంలో కార్మికోధ్యమం నిర్మాణయుతంగా సంఘటితపడకుండా కార్మికవర్గం అత్యున్న రాజకీయస్థాయికి ఎదుగలేదు. అంతిమంగా భారత కార్మికోధ్యమ నిర్మాణ సమైక్యతను దారితీసే యిలాంటి సమగ్రమైన సమాఖ్య అవసరాన్ని గత కొలది సంవత్సరాలుగా వామపక్షాల నాయకత్వంలోని కార్మికసంఘాల ప్రచారం చేస్తూన్నవి. పాక్షిక విజయాన్ని కూడ సాధించాయి. కాని యీ విషయంలో మరింత కృషి అవసరం. వివిధ కార్మిక సంస్థలలో జరిగిన సదస్సులలో చర్చలలో వెల్లడైన సుముఖ స్పందనలు యీ లక్ష్యాన్ని కార్మికోధ్యమాలు సాధించగలవన్న విశ్వాసాన్ని కలుగజేస్తున్నవి.

భారతదేశంలో మత, కుల తత్వాలు పెరిగిపోవుటతో గతంలో వొక్క రాజకీయపార్టీలే కార్మికసంస్థలను యేర్పాటుచేసి కార్మికవర్గాన్ని చీల్చగా, నేడు కుల, మత సంఘాలు, ప్రాంతీయపార్టీలు కార్మికసంఘాలను యేర్పరచి అనేక సంఘాలుగా కార్మికవర్గాన్ని చీల్చే పరిస్థితి యేర్పడింది. "ప్రపంచ కార్మికులారా యేకంకండి!" అన్న నినాదం భారతదేశ సామాజిక వ్యవస్థ వూబిలో ఎంతగా దిగిపోతున్నదో వామపక్షాలు చూడాలి. కార్మికవర్గ ఐక్యతపై వామపక్షాలలో ప్రధానంగా వొక సమిష్టి సుముఖ అవగాహన పెంపొందనిదే, అందుకై తీవ్ర ప్రచారం సాగించనిదే చీలికలు పేలికలుగా అయిన కార్మికవర్గ ఐక్యత తిరిగి యేర్పడదు.

ఇటీవల కార్మికవర్గంలో వచ్చిన కొన్ని ముఖ్య పరిణామాలను పేర్కొనవలసివున్నది. పారిశ్రామికాభివృద్ధిలో కార్మికవర్గ సంఖ్యాబలం పెరిగింది. గ్రామీణ నిరుద్యోగులలో కొంతభాగం, నూతన యువజనవర్గాలలో నుండి కార్మిక శ్రేణులలో పెక్కు మంది

కలిశారు. వీరందరు మొదటి తరం నూతన కార్మికులైనందున పారిశ్రామిక కార్మికవర్గ సంస్కృతిని వారసత్వంగా పొందలేదు. కార్మికవర్గ నైతిక, పోరాట సాంప్రదాయాలను జీర్ణించుకొనలేరు. కార్మికవర్గ సంఘాలలో కలసి ఐక్యంగా పనిచేయుట, పోరాడుట, నూతన అనుభవం, భారతసమాజంలో తరతరాలుగ పనిచేస్తున్న విచ్ఛిన్నకర, అనైక్యతాభావాలు, కుల, మత, తెగ, భాషా, ప్రాంతీయ, సంకుచిత భావాలనుండి బయటపడలేరు. ఈధోరణులు, భావాలు, కార్మికసంఘాల ఐక్యతను నిర్మించుటలో ఆటంకముగా వుంది.

వెనుకబడిన ప్రాంతాలలో ప్రభుత్వ, ప్రజారంగాలలో భారీ ప్రాజెక్టులను నిర్మించుటతో, వివిధ ప్రాంతాలలో సాంకేతికశిక్షణ పొందిన కార్మికులు, మామూలు శిక్షణ పొందిన కార్మికులు, సాంకేతిక నిపుణులు కార్మికవర్గంలో ప్రవేశించారు. ఇది సమాజంగానే శిక్షణ గలిగిన, శిక్షణ యేమాత్రం పొందని స్థానిక కార్మికులలో సంఘర్షణలకు మూలమైంది. దేశపు ఈశాన్య ప్రాంతాలలో "ప్రాంతీయ భూమి పుత్రులు", "విదేశీయులని" దేశంలో యితర ప్రాంతాలనుండి వచ్చిన వారి మధ్య తీవ్రపోరాటాలు, సంఘర్షణ పరిస్థితులు యేర్పడినవి. పరిపక్వత చెందిన స్థిరపడిన పెద్ద ట్రేడు యూనియనుల నాయకత్వం, అత్యంత క్లిష్ట పరిస్థితులలో కార్మికులలో సోదర ఐక్యతను నిర్మించుటలో సఫలమగుట వాటి సమర్థతను తెల్పుతుంది.

ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమ అనుభవం, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం సోషలిజంలకై జరిగే పోరాటంలో కార్మికవర్గ నాయకత్వంలో, కార్మిక-కర్షక ఐక్యత వ్యూహాత్మక కీలక ఆయుధమని స్పష్టంగా చెప్తుతున్నది. భారత స్వాతంత్ర్యానుభవం కూడ రైతాంగపు పాత్రను విదితం చేసియున్నది. రైతాంగ పరిస్థితులలో స్వాతంత్ర్యానంతర మార్పులను పరిగణలోని తీసుకొనకపోయిన కార్మిక, కర్షక ఐక్యతను నిర్మించుటలో అనేక చిక్కులను యెదుర్కొనవలసివుంటుంది. ప్రభుత్వం చేబట్టిన భూసంస్కరణలు అమలు 1960 దశకంలో సంతృప్తికరంగా లేనప్పటికి, గ్రామీణ సమాజంలో గణనీయమైన మార్పులు వచ్చాయి. దేశంలో అత్యధిక వ్యవసాయ భూములు జమిందారీ, జాగిర్దారీ, మాల్గుజారీ విధానంలోనే వుంది. భూసంస్కరణలతో జమిందారులు, జాగిర్దారులు, రాజులు తమ భూములను అమ్ముటతో ధనిక రైతులు కొనుటగాని, ఆక్రమించటగాని జరిగింది. మధ్యతరగతి రైతులు వున్న, కొన్న భూములను అప్పులకు గురై క్రమేణా కోల్పోవుట జరిగింది. భూములు లేని వ్యవసాయ కూలీలు సెంటు భూమికూడ సంస్కరణల వలన పొందలేదు.

రష్యన్ విప్లవానుభవాలను సమీక్షించిన క్లుప్తంగా, "వ్యవసాయ సమస్య సిద్ధాంతాన్ని" రూపొందించి రెండవ అంతర్జాతీయ కమ్యూనిస్టు కాంగ్రెసులో లెనిన్ ప్రతిపాదించారు. అందులో "కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలో నాయకత్వంలో పారిశ్రామిక కార్మికవర్గం మాత్రమే, పెట్టుబడిదారి వర్గం, భూస్వామ్యవర్గాల దోపిడి, దౌర్జన్యాల నుండి గ్రామీణ శ్రామిక వర్గాలను విముక్తి చేస్తుంది. పారిశ్రామిక కార్మికవర్గం, వారి వృత్తి నైపుణ్యం

వారి పరిశ్రమలలోని వారి ప్రయోజనాల యెడల మాత్రమే సంకుచిత దృష్టిలో శ్రద్ధ వహించితే యీ యుగం పారిశ్రామిక కార్మికవర్గంపై వుంచిన భాధ్యతను నిర్వహించజాలదు. దోపిడికి గురి అయ్యే అన్ని శ్రామికవర్గాలు, దోపిడిదారులకు వ్యతిరేకంగా జరిపే పోరాటాలలో అగ్రగామిదళంగా నాయకత్వం వహించి పోరాటాలు సాగించినపుడే, కార్మికవర్గం నిజమైన విప్లవవర్గమగుతుంది, సోషలిస్టు పంధాలో ఆచరణ కొనసాగించగలుగుతుంది. అయితే గ్రామీణ ప్రాంతాలలోనికి వర్గ పోరాటాన్ని విస్తరింపజాలక పోయినచో, పార్టీ నాయకత్వంలో గ్రామీణ శ్రామికవర్గాలు నిర్మాణంలో సమీకరించబడి, పోరాటోన్ముఖులు, సుశిక్షుతులు కానిచో ఇది అసాధ్యం[1]" అని లెనిన్ స్పష్టం చేసారు. ఈవిధంగా మార్క్స్, లెనిన్‌లు ప్రజాస్వామ్య విప్లవానికి, అది సోషలిస్టు విప్లవంగా పరిణామ మొందుటకు కార్మికవర్గ నాయకత్వంలో కార్మిక-కర్షక ఐక్యతా నినాదం, విజయానికి వ్యూహాత్మక కీలక నినాదంగా స్పష్టంగా వివరించారు.

అతివాద వర్గాలు కూడ బూర్జువావర్గ ప్రభావంలో పడిపోవుట జరిగింది. స్వాతంత్ర్యానంతరం, గత నాలుగు దశాబ్ధాలలో జరిగిన పారిశ్రామికీకరణతో రైతాంగ ఆర్థికవిధానం పెట్టుబడిదారి విధాన మార్కెట్టు పరిధిలోనికి వచ్చింది. ఇట్టి పరిస్థితులలో గిట్టుబాటు ధరలు వ్యవసాయ వుత్పత్తులకు యివ్వాలనే ఆందోళన ప్రధానంగా గుత్తపెట్టుబడిదారులకు, పెద్ద వ్యాపారుల దోపిడికి వ్యతిరేకంగా వుద్దేశించబడింది. ఈ వుద్యమం ధనిక రైతుల ప్రయోజనాలకుద్దేశించబడిందనే నెపంతో అతివాదవర్గాలు చిన్న చూపు చూచుట, యీ వుద్యమ నాయకత్వాన్ని బూర్జువా వర్గాలకు చేజేతులా అప్పజెప్పుట, వివిధ శ్రామికవర్గాల ప్రజాసంఘటనను నిర్మించుటను వ్యతిరేకించుటయే అగుతుంది. అంచేత అభ్యుదయకర వ్యవసాయ భూముల సంస్కరణలకు ఆందోళన చేస్తూనే, వ్యవసాయ కూలీలకు అధిక వేతనాలు, అదే కాలంలో రైతాంగంపై అధిక పన్నులకు వ్యతిరేకంగా ఆందోళన చేయుటతో పాటు వ్యవసాయ వుత్పత్తులకు గిట్టుబాటు ధరలకై ఆందోళన చేయుట వినియోగదారులకు వ్యతిరేకమైనదిగా నెంచరాదు. అంతేగాక అదే కాలంలో ఆహారధాన్యాల టోకు వ్యాపారాన్ని ప్రభుత్వం చేబట్టి, ప్రజా పంపిణి విధానాన్ని విజయవంతం చేయాలనే ఆందోళన కూడ చేబట్టుట ద్వారానే, కార్మిక-కర్షక ఐక్యత అభివృద్ధి చెందుట, గుత్తపెట్టుబడిదారి వ్యతిరేకత అన్ని వర్గాలు ఐక్యసంఘటన నిర్మాణం సులభతరమగుతుంది. ఈ రైతాంగ పోరాటాలలో కార్మిక సంఘాల, వుద్యోగుల సంఘాల మద్ధతునుపొందుటకు మార్గమేర్పడుతుంది. ఈవిధంగా యేర్పడేమద్దతును, ఐక్యతను ముందుకు తీసుకొని పోవాలి.

ఈ విషయంలో వామపక్షాల ముఖ్యంగా కమ్యూనిస్టుపార్టీల చొరవ అవసరాలకు, రైతాంగ పోరాటాల సంసిద్ధతకు తగినంతగా లేదనేది స్పష్టం. అంచేతనే శరద్‌జోషీ, నారాయణస్వాములు యీ వుద్యమాల నాయకులుగా ధనిక రైతులు, భూస్వాములు నాయకులై ప్రజా ఐక్యత విచ్ఛిన్నకర నినాదాలను యిస్తూ తప్పుదు మార్గాన్ని పట్టించుటకు అవకాశాలు యేర్పడినవి.

---

1. లెనిన్. సెలెక్టెడ్ వర్క్స్ వా. III. పే. 378-9.

రైతాంగపు న్యాయమైన కోర్కెలు, వారి పోరాట చొరవను, కిసాన్ సభలు గుర్తించి వుద్యమాల నిర్మాణంలో చొరవను తగిన కాలంలో ప్రదర్శించాలి. ఏమరుపాటు యేమాత్రం జరిగినా బూర్జువా పెటీ బూర్జువా ధనిక రైతాంగ నాయకత్వాలకు చొరవపోతుంది.

## ౭.౫ ఐక్యసంఘటనలు కమ్యూనిస్టుపార్టీ స్వతంత్రపాత్ర

భటిండా సి.పి.ఐ పార్టీ కాంగ్రెసు, పార్టీ స్వతంత్రపాత్ర, అస్తికతా ఔన్నత్యాన్ని గతంలో కోల్పోయే పొరపాటు జరిగిందని, ఆత్మ విమర్శనా క్రమంలో పేర్కొని, వామపక్ష ఐక్యత, ప్రజాస్వామ్య పార్టీల, శక్తుల బూర్జువా వర్గ పాలనకు జాతీయ ప్రత్యామ్నాయాన్ని నిర్మించుట కేంద్ర నినాదంగా యిచ్చింది. ఐక్యసంఘటనా నిర్మాణం, పార్టీ స్వతంత్ర పాత్రలు రెండు యేక కాలంలో ఐక్యకార్యాచరణ, ఐక్యపోరాటాలలో, వాటి సన్నాహాలలో, వివిధ పార్టీలతో ఐక్యసంఘటనలలో వ్యవహారించుతీరులో, వివిధ దృక్పథాలను, అభిప్రాయాలను సమన్వయం చేయుటలో, ఐక్యసంఘటనా సమిష్టి తత్వానికి, స్వతంత్రపాత్ర, పార్టీ వ్యక్తిత్వం ప్రతిబింబించే కార్యాచరణ, సమిష్టి కార్యాచరణల మధ్య వైరుధ్యం యేర్పడే అవకాశాలు పూర్తిగా లేకుండా వుండవు. ఐక్యసంఘటనలలో అన్ని కార్యక్రమాలను వివరంగా చర్చించి, అందరి అభిప్రాయాల లోతుపాతులను వివరములతో సహేతుకూలంకుషంగా చర్చించి, వొక సమిష్టి అవగాహనకు రావలసివుంటుంది, దానినే ఆచరణలో పెట్టవలసివుంటుంది. మరొక విషయాన్ని కమ్యూనిస్టు శ్రేణులు గుర్తుపెట్టుకొనవలసి కార్మికవర్గ సమిష్టి పాత్రకు, ఆ కార్మికవర్గ పార్టీయైన కమ్యూనిస్టుపార్టీకి స్వతంత్రపాత్రకి మధ్య యెట్టి వైరుధ్యంలేదు.

పార్టీ స్వతంత్రపాత్ర విషయమై అశ్రద్ధవహించిన మితవాద సంస్కరణవాద తప్పులకు దారి తీస్తుంది. ఫలితంగా పార్టీ పురోగమనం, పార్టీ ప్రయోజనాలకు నష్టం కలుగుతుంది. ఆమేరకు ఐక్యసంఘటనలో అపజయాలకు తావు యేర్పడుతుంది. రెండూ నష్టపోతవి. పార్టీ స్వతంత్ర పాత్రను కనీస స్థాయికి దిగాజార్చిన ఐక్యసంఘటనా నిర్మాణం, అభివృద్ధి జరుగక పోగా, బలహీనపడుతుంది. ఐక్యసంఘటన పలుపార్టీలు, కొన్ని తక్షణ సమస్యలపై అందరి ఆమోదం పొందిన కనీస కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టుటకు ప్రజాసమీకరణ చేసి, పోరాటాలు చేయవలసివుంటుంది. ఈ పోరాటాలరూపాలు అనుసరించవలసిన ఎత్తుగడలుపై అభిప్రాయభేదాలు వచ్చే అవకాశాలున్నవి. సంఘటనలో వివిధ పార్టీలు ఆమోదించిన కార్యక్రమమే అయినా, దానిని ఆచరణలో పెట్టునపుడు చేబట్టే ఎత్తుగడలు ఆయా పార్టీల బలం, సమీకరణ శక్తి, అవి ప్రభుత్వ నిర్భంద విధానాలకు నిలబడే శక్తి వగైరాలపై ఆదారపడి ఎత్తుగడలను చేబట్టవలసివుంటుంది.

సమిష్టి ప్రయోజనాలు, పార్టీ ప్రయోజనాలు రెంటి మధ్య వైరుధ్యం లేదు, పైగా పరస్పరం ఆధారపడి వుంటాయి. అయితే రెండూ వొకటికాదు. సమిష్టి లేక ఐక్యసంఘటన కర్తవ్యాల నిర్వహణపైనే కేంద్రీకరించుటతో పార్టీ నిర్మాణం, విస్తరణ జరుగదు. పార్టీ నిర్మాణం, విస్తరణ, ప్రయోజనాలపైన కేంద్రీకరించుటతో ఐక్యకార్యాచరణ, విస్తరణ

జరుగదు. పార్టీ బలం, ప్రతిష్ట పెరిగితే, ఐక్యసంఘటన బలంపెరుగుతుంది. ఐక్యసంఘటన పోరాట కార్యక్రమాలు విస్తరించుట జరిగితే, పార్టీ బలం పెరుగుతుంది. ఐక్యసంఘటనలో అనేక పార్టీలు, గ్రూపులు వున్నందున, సంఘటన కార్యక్రమాలు, ఐక్యపోరాటాల విజయాలకు యేయేపార్టీ గ్రూపులు ఎంతెంత తోడ్పాటు, వారి వారి కార్యకర్తలు కార్యనిర్వహణలో వారెంతశక్తిని ధారపోస్తారో, అదే స్థాయిలో సంఘటనలోని వివిధ పార్టీలు బలపడుట, ప్రతిష్ట పెరుగుట జరుగుతుంది. అసహజ విధానంలో గాక, యేవొక్క పార్టీయైన స్వప్రయోజనాలను ఆశించి, నీచ ఎత్తుగడలు అవలంభించి తన బలాన్నే పెంచుకొనుటకు, విస్తరించుటకు ప్రయత్నించితే, సంఘటన బలహీనపడుటకు బీజాలు పడినవని తెలియాలి. అంచేత సమిష్టి లేక పార్టీ ప్రయోజనాల మధ్య వొక తాత్విక, ఆచరణల సమన్వయం లేక ఐక్యత, ఎత్తుగడల సమన్వయంతో సహా వుండాలి. అప్పుడే ఐక్యసంఘటనా బలం, విస్తరణలు అభివృద్ధి చెందుటతోపాటు, సంఘటనలోని వివిధ పార్టీలు బలం, విస్తరణ పెరుగుతుంది.

భటిండా సి.పి.ఐ కాంగ్రెసు తరువాత వివిధ స్థాయిలలో ఐక్యకార్యాచరణల కార్యక్రమాలు రూపొందించుటకు చొరవతో సి.పి.ఐ(యం) తో సంప్రదింపులకు ప్రయత్నాలు చేసింది. ఏ స్థాయిలో, ఏ రూపంలో, ఎక్కడైనా ఐక్యకార్యాచరణను ముందుకు తీసుకొని వెళ్ళుటకు సంప్రదింపులు జరుపుటకు తాము సిద్ధమేనని సి.పి.ఐ స్పష్టంచేసింది. ఈ ప్రయత్నాలు చేస్తూనే సి.పి.ఐ(యం) విధానాలను, పంథాను సూత్ర బద్ధంగా విమర్శించుటమానలేదు.

సి.పి.ఐ., సి.పి.ఐ(యం)లు చేరువగుటకు హృదయ పూర్వకంగా తీవ్రప్రయత్నాలు చేస్తున్నవని ప్రజలలో విశ్వాసం కలిగించనచో జాతీయ ప్రజాసామ్య ప్రత్యామ్నాయం నిర్మాణం కొరకు అసంఖ్యాక ప్రజాసామాన్యాన్ని సమీకరించజాలమని భటిండా కాంగ్రెసు స్పష్టం చేసింది. అంచేతనే సి.పి.ఐ యీ చొరవను ప్రదర్శించింది. ఈ సందర్భంలో కాంగ్రెసు(ఐ), కాంగ్రెసు, జనసంఘాలలోని అభ్యుదయకరశక్తులను వామపక్ష ప్రజాస్వామ్య పార్టీలలోని శక్తులనన్నిటిని సమీకరించుటకు సి.పి.ఐ యీ చొరవను తీసుకొంది.

సి.పి.ఐ ఐక్యతను పెంపొందించుటకు చేసిన ప్రయత్నమిది వొక్కటే కాదు. భటిండా కాంగ్రెసు అనంతరం సి.పి.ఐ ప్రజాకార్యచరణలో ఐక్యతను పెంపొందించుటకు తన శక్తినంతా వినియోగించింది. దేశంలో ఎప్పుడు ఎక్కడయే ఐక్య ప్రజాకార్యచరణ రూపొందినా, యీ విధంగానే సి.పి.ఐ తన పాత్ర నిర్వహించింది. ఈ ప్రజా కార్యచరణలన్నిటిలో ప్రత్యేకంగా కన్పించేది యీ ఐక్య ప్రజాకార్యచరణ వాంఛయే అనుట స్పష్టం పంతనగర్, అగ్రా బైలదిలా, గ్వాలియర్‌లలో వారి రాజకీయ అభిప్రాయాలతో సంబంధాలు లేకుండా ప్రజలు ఐక్యంగా ప్రభుత్వ నిర్బంధ విధానానికి వ్యతిరేకంగా పోరాడారు. పశ్చిమబెంగాల్‌లో కరువు బత్తెపు కోతకు వ్యతిరేకంగా కార్మికవర్గపు బ్రహ్మాండమైన సమ్మె పోరాటంలో, యీ ఐక్యతా వాంఛయే ప్రస్ఫుటమైంది.

ఈ విధమైన ప్రజాకార్యచరణ కూడ దాని అంతట అదే మనం కోరుకొనే వామపక్ష

ప్రజాస్వామ్య ఐక్యత నిర్మించుటకు దారి తీయదు. ఈగమ్యానికి యింకా అనేక విస్తృత ప్రజాకార్యాచరణలు, ఐక్యరాజకీయ వుద్యమాలు, వాటిని విడవకుండా కొనసాగించుట అవసరము. అట్టి ప్రజాకార్యాచరణ లేకుండా మనం కోరే ఐక్యతను నిర్మించజాలము. అట్టి పోరాటాలలోనే ప్రజలు అత్యంత వేగంగా చైతన్యవంతులై రాజకీయాలు నేర్చుకొంటారు.

ఐక్యకార్యాచరణలో పాల్గొనుటకై తీసుకొన్న చొరవతో ప్రజలు సి.పి.ఐ వైఖరి అవగాహనలను బాగా అర్థం చేసుకొనుటకు తోడ్పడింది, ఫలితంగా ప్రజలలో సి.పి.ఐ యెడల గౌరవం పెరిగి, వారిని సమీకరించుటకు తోడ్పడింది. ఈవిధంగా సి.పి.ఐ విస్తృత ప్రజానీకాన్ని సమీపించగలిగింది. దీని అర్థం పార్టీ స్వతంత్రపునాది బలపడి, విస్తృతంగా విస్తరించిరించిందని నొక్కి చెప్పవలసివుంది.

ఇటీవల సి.పి.ఐ ఐక్యసంఘటనాధ్యేయాన్ని కొనసాగించుతూ ప్రజాసామాన్యాన్ని సమీకరించు స్వతంత్ర కార్యాచరణ చొరవను ప్రదర్శించింది. స్థానిక, రాష్ట్ర స్థాయి ప్రయత్నాలు వదిలివేసినా, అఖిలభారతస్థాయిలో "పోలీసు నిర్బందచర్యలకు" వ్యతిరేకంగా జూన్ 5,1978, దినోత్సవాన్ని ప్రత్యేకంగా చెప్పాలి. ఈ కార్యాచరణలన్ని సి.పి.ఐ చేపట్టిన స్వతంత్ర కార్యాచరణలే అయినా సి.పి.ఐ.,సి.పి.ఐ.(యం) ని బలపరచే వారి సమస్యలు కాక, విస్తృత ప్రజాసామాన్యపు జీవన సమస్యలు పోలీసు నిర్బంద చర్యలు, హరిజనులపై హింసా, దౌర్జన్యాలు, వేతన, కరువుబత్తెం, బోనసు, సంస్కరణలు మొత్తం ప్రజానీకపు సమస్యలు. ఈ ముఖ్య సమస్యలపై సి.పి.ఐ స్వతంత్ర కార్యాచరణను కేంద్రీకరించింది, యిదే దాని ప్రాముఖ్యత.

జనసంఘం, రాష్ట్రీయస్వయంసేవకసంఘం, భారతీయ లోక్‌దళ్‌ల కూటమి అధికారాన్ని చేజిక్కించుకొన నిర్ణయించింది. జనతా పాలనతో ప్రజలలో వ్యాపించిన అసంతృప్తిని వినియోగించుకొని, ప్రభుత్వవైఫల్యాలకు జనతా అనైక్యత కారణంగా నిందించి, తామొక్కరమే సమస్యలన్నిటిని పరిష్కరించగలమని, అందుకే తమకు అధికారాన్ని అప్పగించమని ప్రజలలో ప్రచారం సాగించింది. అభ్యుదయకరజాతీయ విధానాలను వెనుకకు కొట్టి, సంక్షోభాన్ని, అరాచకాన్ని తొలగించు నినాదాలతో అభివృద్ధి నిరోధక నియంతృత్వాన్ని స్థాపించనెంచుతున్నది. ఈ ప్రజా అసంతృప్తినే వినియోగించుకొని తిరిగి అధికారంలోనికి రావాలని ఇందిరాగాంధీ కూడా యిట్టి ఎత్తుగడలనే చేబట్టింది.

ఈ యిద్దరిలో ఎవరు విజయం పొందినా వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతను జాతీయ ప్రత్యామ్నాయంగా నిర్మించాలనే లక్ష్యం నెరవేరదు. పార్టీ స్వతంత్రకార్యాచరణ, ఐక్యసంఘటనా నిర్మాణానికి కీలకాంశమైన ఐక్యతను నిర్మించుటకు తోడ్పతుంది.

పార్టీ స్వతంత్ర కార్యాచరణ పార్టీ పురోగతిని మాత్రమే గాక, ఐక్యకార్యాచరణ పురోగతిని ఆశించుతున్నది. వామపక్ష, జాతీయ ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయాన్ని నిర్మించే పనిని పార్టీ వొక్కటే చేయగలదని తలచుట లేదు. పై సమిష్టి కార్యాచరణలో బాగంగానే స్వతంత్ర కార్యాచరణ నెంచబడింది. ఈవిధంగా ఐక్యసంఘటనా నిర్మాణం, పార్టీ స్వతంత్ర

నిర్మాణం పెంపొందించే సమగ్ర కార్యాచరణ యేకకాలంలో కొనసాగించుటయే శాస్త్రీయ పద్ధతి.

ఇటీవల అనుభవాలు నేర్పిన పాఠాలతో సి.పి.ఐ స్వతంత్ర పాత్రను నొక్కిచెప్తూతున్నది. ఇందుకు కారణాలు మూడు ఒకటి, పార్టీ స్వతంత్ర రాజకీయవిధాన స్వరూపం దెబ్బతిన్నందున 1977లోక్‌సభ ఎన్నికలలో, ప్రజాసామాన్యంలో బలహీనపడుట స్పష్టమైంది. ఈ పొరపాటును సరిదిద్దుకొనుట అవసరం. రెండవది, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతను, పార్టీ స్వంత బలాన్ని అభివృద్ధి చేయకుండా, నిర్మించుట అసాధ్యం. వామపక్ష ప్రజాస్వామ్య జాతీయ ప్రత్యామ్నాయాన్ని, నిర్మించి, అభివృద్ధి చేయుట రాజకీయంగా అత్యవసరము. గత దశాబ్దంలో వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతను నొక్కి చెప్తుతున్నా సి.పి.ఐ ఆచరణలో తప్పులు చేసింది. ఐక్యతానిర్మాణం సి.పి.ఐ తలచినంత సరళరేఖామార్గంకాక ఎత్తు పల్లాలు, వంకరు టింకరులుగల సంక్లిష్ట మార్గము. ఇందుకు, సి.పి.ఐ చేసినంతటి ప్రయత్నం మరే యితర పార్టీచేయలేదనుట వాస్తవం.

రాజకీయ అస్థిరతను సి.పి.ఐ(యం) పెంపొందించే ప్రయత్నంలో జనతా పార్టీతో అవకాశవాద పొత్తు పెట్టుకొని, జనతా ప్రభుత్వం పడిపోవు వరకు కొనసాగించింది. "కాంగ్రెసు వ్యతిరేకతను గ్రుడ్డిగా" చేబట్టి, సి.పి.ఐ తోశత్రుత్వాన్ని అనుసరించింది. జనతా పార్టీ అధికారాన్ని చేబట్టిన అనంతరం కూడ కాంగ్రెసును ప్రధాన శత్రువుగా సి.పి.ఐ అంగీకరించాలనే షరతను సి.పి.ఐ(యం) ఐక్యకార్యాచరణకు షరతు పెట్టుటకొనసాగించింది. ఒకవైపు సి.పి.ఐ దాని తప్పులకు బహిరంగ క్షమాపణ చెప్పాలంటూ, సి.పి.ఐ(యం) తన తప్పులపై ఆత్మ విమర్శన చేసుకొన నిరాకరించింది. అయినా, సి.పి.ఐ(యం) కూడ వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతను గురించి మాట్లాడుట సంతోషించతగినది.

పార్టీ స్వతంత్ర పాత్రను గురించి సి.పి.ఐ నొక్కి చెప్పుటకు కారణం, పార్టీ అభివృద్ధి గల అశేష అవకాశాలు. జనతా ప్రభుత్వంపై ప్రజలలో అతిత్వరగా వ్యాపించిన అసంతృప్తి 1977 లోక్‌సభ ఎన్నికల ఫలితాలు స్పష్టం చేసాయి. ప్రజలు మార్పును కోరుతూ, ప్రత్యామ్నాయానికై ఎదురుచూస్తున్నారు.

మొత్తం సి.పి.ఐ రాజకీయ విధానానికి సంబంధించి కొందరు, ఐక్యసంఘటన విధానానికి సంబంధించి మరికొందరు ప్రశ్నలు లేవనెత్తుతున్నారు. మొత్తం పార్టీ విధానాన్ని ప్రశ్నించే వారు వాస్తవానికి పార్టీకి పునాదియైన స్వతంత్ర పాత్రను గురించి ప్రశ్నించుతున్నారు. ముఖ్యంగా గతంలోని పొరపాట్లు, అవి దిద్దుకొనుట జరిగింది. ఇది ప్రస్తుతానికి వాస్తవికంగా అవసరాలను, అవకాశాలను రెండింటిని ప్రతిబింబిస్తుంది.

పార్టీ స్వతంత్ర పాత్ర అంటే ప్రధానంగా సైద్ధాంతిక రాజకీయవిధానాల అవగాహనలు, ఆచరణలేనని, చెప్పాలి. దేశ, ప్రజల జీవితాలలో చొరవ తీసుకొనగల విధానాలను చేబట్ట గలిగిన సమర్థత, ధ్యేయాలను చేరుకొనగలందులకు ఐక్య కార్యాచరణలలో ప్రజలను సమీకరించగలశక్తి, నిర్మాణ ఐక్యతయే స్వతంత్ర పాత్రగా చెప్పవచ్చు. దీనర్థం

పార్టీ ఐక్య సంఘటనా విధానం తప్పు అయినా లేక అసలు వొక విధానమే లేకుండినా, పార్టీకి సరియైన స్వతంత్రపాత్ర, విధానముండదు.

ఇటీవల అనుభవంలో సి.పి.ఐ చేసినతప్పులు కారణంగా స్వతంత్ర పునాదిని, స్వతంత్ర స్వరూపాన్ని ప్రజలదృష్టి లేకపోవుట అందరకు తెలిసినదే. నిజానికి సి.పి.ఐ చేసిన తప్పు, ఐక్యసంఘటవిధాన ఆచరణ తప్పు, దాని సారం జాతీయ బూర్జువావర్గపు శక్తులను అతిగా అంచెనా వేయుట, ఐక్యత-పోరాటం అనే సైద్ధాంతిక ఎత్తుగడలపంథాని ఆచరణలో పెట్టుటలోని వైఫల్యం, ఆధిక్యతగల ఇందిరాగాంధీ నాయకత్వంలోని బూర్జువావర్గ అభ్యుదయకర అంశాల ఆచరణలో, పార్టీకి వుండవలసిన సంబంధాలను అమలు చేయుటలో చేసిన తప్పులలో ప్రతిబింబించింది. అదే కాలంలో పార్టీ స్వతంత్ర పాత్ర, స్వతంత్ర ప్రజాపునాదిని బలపరచుకొనుట వొక్క ఐక్యసంఘటన వలననే జరుగదు. పార్టీ ఐక్యసంఘటనావిధానం, ఆచరణ, సరిగానే జరిగితే పార్టీ స్వతంత్రపాత్రకు, స్వతంత్రప్రజాపునాది విస్తరణకు ఎట్టి ఆటంకం వుండేదిగాదు. అయితే, దీనిని ప్రప్రధమంలోనే చేబట్టవలసిన అంశంగా, షరతుగా నెంచరాదు.

కమ్యూనిస్టుపార్టీ స్వతంత్ర పునాది అంటే నాలుగు ప్రదానాంశాలను పరిగణలోనికి తీసుకొనాలి. ఒకటి పార్టీ ప్రజాపునాదిని సరియైన ఐక్యసంఘటనా దృక్పధంతో పార్టీ రాజకీయవిధానంతో అత్యవసర, తదితర కార్యక్రమాలతో సంలీనం చేసి నెరవేర్చుటతో బలపరచి, విస్తరింపజేయవచ్చును. దీని అర్థం పార్టీ సిద్ధాంతం, కార్యక్రమం నిర్మాణం అన్నింటిని ప్రజలవద్దకు తీసుకొని వెళ్ళుట ప్రజలు పార్టీని వివిధ ఐక్యసంఘటనలను నిర్మించునదిగానే గాక స్వతంత్ర, సమగ్ర అవగాహనలు జీవితం, ప్రపంచం యెడలకలదిగా, వాటిని ఆచరణలో పెట్టుపార్టీగా గుర్తించాలి. దీని అర్థం ప్రజలు పార్టీని పూర్తిగా సమగ్ర విధానం కలదిగా లేక వొక భాగంగా మాత్రమే చూస్తున్నారాయని పరిశీలించుకొంటూ వుండాలి.

రెండవది, పార్టీ స్వతంత్ర ప్రజాపునాదిని, స్వతంత్రపాత్రను యినుమడింపజేయుటద్వారా, శ్రామికావళికి. జీవితంలోని అన్ని అంశాలకు విస్తరించుతుంది. శ్రామిక జనావళికి, శ్రామిక జనావళితో అనే సూత్రాన్ని పార్టీ చేబట్టాలి. క్రిందిస్థాయిలో పని జరుగవలసినన తీరు యిది. ఈవిధమైన పని విధానం లేకుంటే పార్టీ ప్రజలకు చేరువ కాజాలదు. ఇలాకానిచో పార్టీ స్వతంత్రపాత్ర వహించుటగాని, పార్టీకి స్వతంత్రప్రజాపునాది యేర్పడుట కాని జరుగదు.

పార్టీ అభివృద్ధి, పెరుగుదల ప్రచారోద్యమాలవలననే జరుగదు. వివిధ రూపాలలో దైనందిన చర్యగా, ప్రజాకార్యాచరణను నిరవధికంగా చేబట్ట లేకపోవుటయే పార్టీ దీర్ఘకాల బలహీనతగా వుంది.

మూడవది, పార్టీ స్వతంత్ర పాత్రను నిర్మించుటలో, పార్టీ ప్రజాపునాది నిర్మించుటలో పార్టీ సభ్యులు ప్రజాసంఘాలను నిర్మించి, అభివృద్ధి చేయాలి. ఈ ప్రజాసంఘాలన్నీ సంకుచిత వొంటెత్తు పందాలో నడుపరాదు. అవి మరో పార్టీ శాఖలుగా పనిచేయరాదు.

అదే కాలంలో పార్టీ స్వతంత్రపాత్ర. స్వరూపం, ప్రజాపునాది, ప్రజాసంఘాల పెరుగుదల, బలపడుటతో పాటే జరుగుతుంది. మరో మాటలలో పార్టీ స్వతంత్రపాత్ర, ప్రజాపునాది, పార్టీ పెరుగుదలకు సంబంధించినదే కాదు విధానానికి సంబంధించినది.

నాలుగవది, పార్టీ స్వతంత్రపాత్ర, ప్రజాపునాది వగైరాలకు, చొరవకు, ఉద్యమాలకు, పార్టీ కార్యాచరణకు గల పరస్పర సంబంధం తెల్పుతుంది. పార్టీ గతంలో వలెనె ఎల్లప్పుడూ ఐక్యకార్యాచరణ ఉద్యమాన్ని వామపక్ష ప్రజాస్వామ్యశక్తులతో కలసి పెంపొందిస్తుంది. అదే కాలంలో పార్టీ సాంప్రదాయాన్ని, దేశవ్యాప్తంగా, రాష్ట్రాలలో ప్రజోద్యమాలను కొనసాగిస్తుంది. తనంతటతానే పోరాటంలోకి పోయే సాంప్రదాయాన్ని కొనసాగిస్తుంది. పోరాటానికి స్వయంగా వెళ్ళే సాంప్రదాయాన్ని అభివృద్ధి చేస్తుంది.

ఐదవ చివరి అంశం వర్గతత్వంగా పార్టీ స్వతంత్ర పాత్ర ప్రజాపునాది. అయితే యీ స్వతంత్ర పాత్రపునాది యెక్కడ ప్రదర్శిత మౌతుంది. తన వర్గం కార్మికవర్గంలోనే ప్రదర్శిత మౌతుంది. పార్టీ రాజకీయ, సైద్ధాంతిక, నిర్మాణాత్మకంగా తనవర్గంలో బలమైన వ్రేళ్ళూ ప్రగాఢ ప్రభావాన్ని కలుగజేయగల శక్తివంతమైనదిగా లేనిచో స్వతంత్రపాత్ర, ప్రజాపునాదిగురించి మాట్లాడే ప్రశక్తేలేదు.

పార్టీ స్వతంత్ర పాత్ర గురించి విజయవాడ సి.పి.ఐ పార్టీ కాంగ్రెసు నొక్కిచెప్పి విషయం అందరుకు తెలుసు. దేనికైనా ఆచరణే గీటురాయి. భటిండా కాంగ్రెసుకు సమర్పించిన సమీక్షా నివేదిక, ఆత్మ విమర్శనా దృక్పధంలో యిలా చెప్పింది. "అత్యవసరపరిస్థితులలో జరిగిన అమానుష ఘోరాల గురించి, వాటికి వ్యతిరేకంగా మన పార్టీ పోరాడుట నిజం, అంత చేసినా పార్టీ స్వతంత్ర ఆచరణ మసక బారిపోయింది. పాలకపార్టీగా గుర్తించబడింది. అంచేత లోక్‌సభ ఎన్నికలలో నష్టపోయింది. అత్యవసరపరిస్థితిని బలపరుస్తూ, అమానుష చర్యలను వ్యతిరేకించుట, పరిస్థితులు దుర్భరమైనపుడు ప్రజలకు అర్థవంతం, ఆచరణ యోగ్యమైనదిగా కనుపించలేదు." అంచేత పార్టీ స్వతంత్ర పాత్రను, స్వరూపాన్ని, ప్రజా పునాదిని కోల్పోయిందవి," పొరపాటును అంగీకరించింది అంతేగాక, "అత్యవసరపరిస్థితిని ఎత్తివేయాలని కోరుటలో చాలా కాలాతీతమైందని ఒప్పుకుంది.

వర్గ రాజకీయ సమస్యలపై సరియైన విధానాన్ని చేబట్టనిచో చివరకు పార్టీ స్వతంత్ర, నాయకత్వ పాత్ర వహించలేదు. నేటి రాజకీయపరిస్థితులలో వామపక్ష శక్తులను ఐక్యపరచి ముఖ్యంగా ఐక్య ప్రజాకార్యాచరణను పెంపొందించజాలదు. సి.పి.ఐ(యం), సి.పి.ఐ ల మధ్య సన్నిహిత సంబంధాలను పెంపొందించే ప్రత్యేక ప్రాముఖ్యత గుర్తించజాలదు. భటిండా రాజకీయ విధానం నిర్ణయించిన ప్రధానాంశం యిది."[1]

## 2.6 సారాంశం

సంగ్రహంగా నేడు అభివృద్ధి చెందుతున్న సర్వతోముఖ లేక బహుముఖ సంక్షోభం,

1. డిట్రాక్టర్స్ ఆఫ్ సి.పి.ఐ బ్యాంక్ ఆన్ పాల్స్ హుడ్ *(1980)* సి.పి.ఐ పబ్లికేషన్. పే. *13–14.*

దానిని యినుపడింపజేస్తున్న దేశ, విదేశ, సామాజిక రాజకీయశక్తులు, వాటిని ప్రతిఘటించుతున్న వామపక్ష ప్రజాస్వామ్య శక్తుల ప్రయత్నాలు, బూర్జువా రాజకీయపార్టీలలో యేర్పడిన తీవ్ర రాజకీయ నిర్మాణ సంక్షోభం, కార్మికవర్గ ఐక్యతాభివృద్ధి, ఐక్యకసంఘటనలు, కమ్యూనిస్టుపార్టీలు స్వతంత్ర పాత్రల గురించి మరోసారి మననం చేసుకొందాం.

భారతదేశానికి వ్యతిరేకంగా అమెరికా, చైనాలు, పాకిస్థాన్‌ను సాయుధీకరణ చేస్తూ బలమైశక్తిగా రూపొందించుచున్నవి. పాకిస్తాన్ అసైనిక ఆయుధశక్తితో కాశ్మీర్‌లో దౌర్జన్య, విచ్ఛిన్నకర, వేర్పాటు వాద శక్తులకు సైనిక శిక్షణ, ఆయుదాలనిచ్చి, భారతదేశంలో హింసా, దౌర్జన్య, విద్రోహవిచ్ఛిన్న చర్యలు సాగించుటకు రహస్యంగా పంపుతున్నది.

అస్సాం, మణిపూర్, మిజోరం, మేఘాలయాలలో చైనాలో శిక్షణ పొందిన మావోయిస్టు, తదితర విచ్ఛిన్నకర శక్తుల హింసాచర్యలు పెచ్చరిల్లాయి. చైనా విస్తార భారత భూఖండాలను తమవిగా చూపుతు, తాజాగా మ్యాపులు ప్రకటించింది. కాశ్మీర్‌లోని కార్ఘోరం రహదారి చైనా సైన్యం బలవంతంగా ప్రజలచే విస్తరణ చేస్తున్నది.

ఈ నేపథ్యంలో దేశంలో యేర్పడిన బహుముఖ రాజకీయ సంక్షోభాన్ని, అనిశ్చిత పరిస్థితులను సామ్రాజ్యవాద, మావోయిస్టు విచ్ఛిన్నకర శక్తులు హింసా, విచ్ఛిన్నకర, విద్రోహ చర్యలను తీవ్రతరం చేస్తున్నవి.

జనతాపార్టీ జనసంఘ కూటమిలో, సార్వజనిక ఎన్నికలు ప్రకటించుటతో అంతర్గత సంఘర్షణలు తీవ్రమయ్యాయి.

కాంగ్రెసు(ఐ) లో 1977లో వలె సంజయగాంధీ ముందుకు తోసికొనివచ్చుట, పెక్కు రాష్ట్రాలలో వాదోపవాదాలకు, ఘర్షణలకు కారణమైంది.

కాంగ్రెసు లోక్‌దళ్‌ల మధ్య బేధాలు తీవ్రతరమయ్యాయి. కాంగ్రెసు - లోక్‌దళ్ - వామపక్షాలు ఐక్యతను పెంపొందించుకొనుట ద్వారానే, నిరంకుశ, మత, పాశిస్టు శక్తుల వోటమిని గ్యారంటీ చేస్తాయి.

బూర్జువా వర్గ రాజకీయపార్టీలలో, రాజకీయవిధానాలలో తీవ్ర సంక్షోభం వచ్చింది. అదే వాటి నిర్మాణాలలో కూడ ప్రతిబింబించింది. కాంగ్రెసు(ఐ), జనతా పార్టీలు సంక్షోభంలో మునిగి బ్రద్ధలై చీలికలకు గురయ్యాయి. కేంద్ర పారిశ్రామిక, రైల్వేరక్షణ దళాలు, సి.ఆర్.పి., ఆందోళన సమ్మె పోరాటాలకు దిగాయి. సర్వీసులలో సంక్షోభం యేర్పడింది. జనతాపార్టీ కూడ తీవ్ర సంక్షోభంలో పడిపోయింది. శ్రీమురార్జీ "వీటిని చిరుఘటనలని", చంద్రశేఖర్" పార్టీ విశ్వాస సంక్షోభాన్ని ఎదుర్కొంటుందని" అన్నారు. జనతా ప్రభుత్వంలో గూడ కాంగ్రెసు చేసిన విధంగానే "రాష్ట్ర ప్రభుత్వాలను కూలద్రోయు ఆటను ఆడింది".

ఈవిధంగా ప్రజలు రెండు బూర్జువాపార్టీలపై విశ్వాసాన్ని కోల్పోయారు. రెండు పార్టీలు, కాంగ్రెసు(ఐ), జనతాపార్టీలు అంతర్గత సంక్షోభంలో మునిగిపోయాయి. యిది అనిశ్చియుత భవిష్యత్తుకు, చీలికలకు దారితీసింది.

జనతాపార్టీ చీలిపోయి, వొకవర్గం స్వర్ణసింగు నాయకత్వంలో జనతా (యస్) గా తదనంతరం, భారత్‌లోక్‌దళ్‌గా చరణ్‌సింగ్ నాయకత్వంలో యేర్పడుట, కాంగ్రెసు (యు) తో సహకారంతో కేంద్రంలో అధికారాన్ని స్వీకరించుట జరిగింది. కాంగ్రెసు (యు), లోక్‌దళ్ సయోధ్యత, అత్యంత క్లిష్ట పరిస్థితులలో నిరంకుశ, మత తత్వ వ్యతిరేకపోరాటంలో గణనీయపాత్ర నిర్వహించింది.

ఈ విస్తృత సంక్షోభాన్ని గమనించిన భారతబడాబూర్జువా వర్గ పత్రికలు తిరిగి ఇందిరాగాంధీనే బలపరచసాగాయి. కారణం వామపక్షాలు చేరువగుట.

వామపక్షాలు కార్యక్రమ ప్రాతిపధికగా ఐక్యతను పెంపొందించుకొని, సమిష్టిగా 150 స్థానాలకు పోటీ చేయుట ముదావహము.

ఈ పరిణామంతో తత్తరపడిపోయి కాంగ్రెసు(ఐ), జనతాపార్టీలు వామపక్ష, ప్రజాస్వామ్య అభ్యర్థులను బెంగాల్, కేరళలలో వోడించాలనే వొక అవగాహనకు, ఎన్నికల సర్దుబాటులలో వచ్చారు.

బూర్జువా రాజకీయవేత్తలతో విసిగి, వేసారిని ప్రజాసామాన్యం, వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయానికై ఎదురుచూస్తున్నారు. ఇప్పటికే కేరళలో యీ ప్రత్యామ్నాయనినాదం, రాజకకీయశక్తుల నూతనకలయికలకు, కేరళ కాంగ్రెసులోని మణిగ్రూపు సుముఖ వైఖరి చేబట్టుతో నాంది పలికింది.

లోక్‌దళ్ – కాంగ్రెసు (ఉ) – వామపక్షాలు కమ్యూనిస్టులు 1980 అసెంబ్లీ ఎన్నికలలో సీట్ల సర్దుబాట్లు, వారి అభ్యర్థులు లేనిచోట్ల పరస్పరం బలపరచుకొను వొప్పందం చేసుకొన్నారు.

వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతాభివృద్ధి క్రమం యిలా వుంది.

నేడు జనతా ప్రభుత్వం స్థిరత్వాన్ని సంపాదించుకొనుట, లేక కాంగ్రెసు పాలనను, ఇందిరాగాంధీ వ్యక్తి పూజా విధానాన్ని, "కాకస్" పాలనను తిరిగి పునఃప్రతిష్టించుటకాదు. వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతను, జాతీయ ప్రత్యామ్నాయాన్ని రూపొందించుట ప్రధమ కర్తవ్యంగా కమ్యూనిస్టులు వామపక్ష శక్తులు ప్రకటించాయి.

సి.పి.ఐ జాతీయ సమితి, రెండు కమ్యూనిస్టుపార్టీలు దగ్గరకు చేర్చుటకు సాధ్యమైన అన్ని ప్రయత్నాలను చేస్తుందని తీర్మానించింది.

కార్మిక, కర్షక, వ్యవసాయకూలి, మధ్యతరగతులలో వర్గ ఐక్యతను, వర్గాల మధ్య ఐక్యతను కమ్యూనిస్టు శ్రేణులు, నిర్మించాలనే బలమైన అన్ని వర్గాల ప్రజావాంఛకు, సి.పి.ఐ., సి.పి.ఐ(యం)ల మధ్య అవగాహన పునాది కావాలి.

నేడు తాత్కాలికంగా జనతా పార్టీ వెనుక చేరిన అశేష ప్రజాసామాన్యాన్ని, వామపక్ష ప్రజాస్వామ్యశక్తులతోపాటు సమీకరించాలని, తీర్మానించింది.

ఆర్థిక, రాజకీయ, అన్నివర్గాల ప్రజా పోరాటాల ద్వారానే వామపక్ష ప్రజాస్వామ్య జాతీయ ప్రత్యామ్నాయాన్ని నిర్మించాలి కాని పార్టీలు. గ్రూపుల మధ్య రాజకీయ

వొప్పందాల ద్వారా నిర్మించుటకు ప్రాధాన్యతనివ్వరాదు. దీర్ఘకాల పోరాటాల ద్వారానే నిర్మించబడుతుంది. కాలపరిమితిలేదు. బూర్జువా బడా భూస్వామ్యపార్టీల బలాధిక్యతను బ్రద్దలు చేయుట ద్వారానే, కాని యేవొక్క లేక రెండు బూర్జువా పార్టీలతో కలియుట లేక అనుసరించుటతో యేర్పడదు.

రెండు కాంగ్రెసులలోను, జనతా పార్టీలోను వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతతో కలిసే శక్తులున్నవి. నాడు నాలుగు రకములైనా, అవితాత్కాలికమైనవైనా, కలయికలకు అవకాశాలున్నవి. అవి ఒకటి, అభ్యుదయకర వామపక్ష ప్రజాస్వామ్యశక్తుల కలయిక, రెండవది, నూతన విస్తృత ఐక్యతా కలయిక. విదేశాంగ విధానంలో అంగీకార అవగాహన వుండాలనే షరతులుండవు. మూడవది నూతన సుముఖ కలయిక, సమిష్టి ఆమోదం పొందిన కార్మిక, కర్షక, మధ్యతరగతి, యితర బడుగువర్గాల కోర్కెలు, వాటికి సంబంధినది. వీటిని ప్రప్రజావేదికగా రూపొందించే అవసరం, దాని నుండే ప్రత్యామ్నాయం రూపొందగలదనే దృష్టి, విశ్వాసం కలది. నాలుగవది, విశాల భారతంలో భిన్నత్వాలను ప్రతిబింబించే అత్యంత విస్తృత వివిధ శక్తుల కలయికలు, వివిధ రాష్ట్రాలలో భిన్న స్వరూపాలు కలిగి, విస్తృత యేకైక లక్ష్యాన్ని కలిగి వుండే అవకాశముంది. అంటే భిన్నత్వంలో యేకత్వాన్ని కలిగివుండే కలయికలు.

కేరళలో సి.పి.ఐ నాయకత్వంలో సంఘటన ప్రభుత్వం రాజీనామా చేయుట, సి.పి.ఐ(యం) తో దాని నాయకత్వంలోని పక్షాలు మత సంస్థలతో సంబంధాలను విడనాడుటతో; కాంగ్రెసు(యు), సి.పి.ఐ; సి.పి.ఐ(యం) అగ్రనాయకులు, అక్టోబరు 1979లో న్యూఢిల్లీలో సమావేశమై, సూత్రప్రాయంగా; 1) నిరంకుశ మతతత్వపార్టీల వ్యతిరేకంగా కలసి పనిచేయుట 2) లౌకిక ప్రజాస్వామ్య శక్తులను బలపరచుటకు సమిష్టిగా ప్రయత్నించుటపై వొప్పందం చేసుకొని, వామపక్ష ప్రజాస్వాపక్ష రాజకీయాలకు వొక మలుపు నిచ్చారు.

కాంగ్రెసు (యు), సి.పి.ఐ; సి.పి.ఐ(యం) వామపక్షాలు లోక్‌దళ్‌లు రాష్ట్రస్థాయి ఐక్యతా కన్వెన్షనులు ప్రజాసమీకరణలు ఎన్నికలలో కావించారు. ఇవి యీ పార్టీలు శ్రేణులు, చేరువగుట ప్రజలనుత్సాపరచి ఐక్యపోరాటాలకు తోడ్పడింది. సి.పి.ఐ; సి.పి.ఐ(యం) లు బహుశా వొక్క బెంగాలులో తప్ప చేరువగుటకు ఈ పరిస్థితి తోడ్పడినది.

కార్మికవర్గం నేడు వివిధ రాజకీయపార్టీల అనుబంధసంస్థలుగా యాజమాన్యాల యూనియనులు కుల, మత సంబంధ వివిధ సంఘాలుగా చీలికలు పేలికలై కార్మిక వర్గ ఐక్యతను, పోరాట శక్తిని చాలావరకు కోల్పోయింది. ఏవిధమైన రాజకీయ ప్రభావాన్ని ప్రసరించలేనిదిగా వుంది. మరోవైపున ఆర్థిక, రాజకీయ, సామాజిక సంక్షోభ పరిస్థితులు కార్మికులు ఐక్యకార్యాచరణలలో సమీకృతులగుటకు తోడ్పడుతున్నవి.

ఏ రాజకీయపార్టీయైనా కార్మికసంఘాలను తమ జేబు సంస్థలుగాకాక, కార్మికవర్గ నాయకత్వంలో, సమిష్టిగా చర్చించి, నిర్ణయాలు చేసే సంస్థలుగా, కార్మికవర్గ దృక్పథంలో,

కార్మికవర్గ ఐక్యతను. పోరాట శక్తిని పెంపొందించేవిగా వుండాలి. వివిధ రాజకీయపార్టీలు తమ సిద్ధాంతాలపై విశ్వాసం కలిగి, కార్మికవర్గ శ్రేయస్సుకు, సమాజంలో న్యాయమైన స్థానాన్ని వారికి కలిగించే విషయంలో పోటీపడవచ్చు. కాని కార్మికవర్గ ఐక్యతకు. వారి ఐక్య పోరాటశక్తికి ముప్పు తెచ్చే యేపని చేయరాదనే వొకే వొక స్వచ్ఛంద నిర్ణయం మాత్రం అవసరం. కార్మిక సంఘాలలో వర్గ దృక్పధం కార్మికవర్గంలో అనైక్యతకు కారణం కాకపోగా, కార్మికవర్గాన్ని శ్రామిక జనావళికి అగ్రగామిపోరాట దళంగా తీర్చిదిద్దుతుంది.

అనైక్యతా వాస్తవ పరిస్థితుల నుండి, ఐక్యకార్యాచరణ, పోరాటాలవైపు పురోగమించాలనే అనుభవసత్యాన్ని కార్మికవర్గానికి గత కొన్ని దశాబ్దాల జీవితం నేర్పింది. ప్రజలు ఆందోళన చెందుతున్న యే తక్షణ,నిర్ణీత కాల సమస్యలపైనైనా కార్మికవర్గం సమిష్టిగా చర్చించి పోరాటాలు జరుపవచ్చును. అందుకు సాధనాలుగా చర్చలు, సంప్రదింపులు, సమిష్టి అవగాహనలు వచ్చుటకు సమన్వయకమిటీలు, సమిష్టి వేదికలు యేర్పాటు జరిగినది.

కార్మికవర్గ ప్రయోజనాలు దాని సమిష్టి పాత్రకు, ఆవర్గ పార్టీయైన కమ్యూనిస్టుపార్టీ రాజకీయాలలో అనుసరించే స్వతంత్రపాత్రకు ఎట్టివైరుధ్యంలేదు. ఐక్యకసంఘటనలోని పార్టీలు ఆమోదించిన కార్యక్రమమే అయినా, ఆచరణ చేబట్టే ఎత్తుగడలు ఆయాపార్టీల బలం, సమీకరణశక్తి, ప్రభుత్వ నిర్బంధవిధానాలను తట్టుకొనగలశక్తి, పోరాట విధానాలపై ఆధారపడి వుంటవి. మరోవిషయం సమిష్టి ప్రయోజనాలకు, పార్టీ ప్రయోజనాలకు వైరుధ్యం వుండదు. పైగా రెండింటి మధ్య వొక తాత్విక, ఆచరణల సమన్వయం లేక ఎత్తుగడల సమన్వయం వుంటుంది. సమిష్టి కార్యక్రమాల ఆచరణలో కమ్యూనిస్టుపార్టీ స్వతంత్ర పాత్రను చేబట్టుట, ఆపార్టీలో ఐక్యత పెంపొందుటకు ప్రజలలో ఆ పార్టీ బలపడుటకు తోడ్పడుతుంది. ఐక్యసంఘటనలలో కమ్యూనిస్టు పార్టీ తన స్వతంత్ర పాత్ర విడనాడుట అంగీకరించదు, ఆదేవిధంగా యితర పార్టీలకూ స్వతంత్ర పాత్రను అనుసరించే -హక్కువుంటుంది.

# 3

# పార్లమెంటరీ పోరాటాలు

## (రాష్ట్ర, కేంద్ర స్థాయిలలో కాంగ్రెస్(ఐ)కి ప్రత్యామ్నాయ నిర్మాణానికై పోరాటాలు)

## i

## 1980 మధ్యంతర ఎన్నికల పూర్వ రాజకీయ పరిస్థితి ఇటీవల రాజకీయ పరిణామాలు

**1.1.** ఇందిరాగాంధి నాయకత్వంలో కాంగ్రెస్ 1971లో "గరీబీ హటావో", లేక "దారిద్ర్యాన్ని పారద్రోలు" అనే నినాదంతో సార్వత్రిక ఎన్నికలలో ప్రజలకు భ్రమలు కల్పించి, బ్రహ్మాండమైన విజయాన్ని పొందింది. కాంగ్రెసు 1972–77 పాలనలో పెట్టుబడిదారీ వర్గాలు బాగా వృద్ధిచెంది, బలపడి కొన్ని గుత్తపెట్టుబడిదారీ వర్గాల స్థాయికి ఎదిగాయి. అదేకాలంలో దారిద్ర్యరేఖకు దిగువనున్న పేద, బడుగు వర్గాల శాతం పెరిగింది. వ్యవసాయ సంస్కరణలు చేపట్టక పోవటంతో, భూసంస్కరణల పరిమితికి మించిన భూముల పంపకం "హాస్యనాటిక"గా తయారైంది. రైల్వే కార్మికుల 1974 సమ్మెను కేంద్ర ప్రభుత్వం తీవ్రదమనకాండతో అణచివేయుటయేకాక, 1975–77లో కార్మికుల"బోనస్"ను హరించివేయుట, నగర బడుగువర్గాల పాకలను, ప్రత్యామ్నాయం చూపకుండా పీకించి, రాజధాని ఢిల్లీలో "టర్కామన్ గేట్" ప్రాంతాల పేదనివాసులను తొలగించుట వంటి తీవ్రప్రజావ్యతిరేక చర్యలు చేపట్టి బడాబూర్జువా వర్గాల "ఆకాశ హర్మ్యాల" నిర్మాణాలకు ధారాదత్తం చేసింది.

అత్యవసర పరిస్థితి కాలంలో ప్రభుత్వ నిర్బంధ, హింసా, దౌర్జన్యకాండ, నిర్బంధ "నాస్‌బంద్" లాంటి ప్రజావ్యతిరేక చర్యలతో పెరిగిపోయిన కాంగ్రెసు ప్రభుత్వ ప్రజావ్యతిరేకతను వినియోగించుకొని, జనతాపార్టీ 1977లో "ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరించండి", "వ్యక్తినియంతృత్వాన్ని పారద్రోలండి" అనే నినాదాలతో కేంద్రంలో కాంగ్రెసును ఓడించి, అధికార పీఠాన్ని అధిరోహించింది. ఇందిరాగాంధీ "దారిద్ర్యాన్ని పారద్రోలలేదు", జనతా "ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరించిందిలేదు".

జనతాపార్టీ రెండున్నర సంవత్సరాలలో అల్ప సంఖ్యాకవర్గాలు నిమ్న జాతులు, హరిజనులపై కుల, మత చాందసశక్తులు జరిపే హింసా, దౌర్జన్య, దురాగతాలను అరికట్టే ప్రయత్నం చేయక పోవుటతో లౌకిక, ప్రజాస్వామ్యవర్గాలకు అత్యంత ప్రమాదకర పరిస్థితులు యేర్పడినవి. బడాబూర్జువావర్గాల వ్యాపారం "మూడుపూవులు ఆరుకాయలు"గా అభివృద్ధి చెందింది.

జనతా ప్రభుత్వం అంతర్గత కలహాలతో పేకమేడలా కూలిపోవుటతో మధ్యంతర సార్వజనిక ఎన్నికలు తప్పనిసరి అయ్యాయి. ఇందిరాగాంధీ "అభ్యుదయకర స్థిరమైన ప్రభుత్వం" అనే నూతన నినాదంతో పారిశ్రామిక, సంపన్నవర్గాలకు నూతన భ్రమలను కలుగచేయు అనేక వాగ్ధానాలు చేస్తూ ఎన్నికల రంగంలో ప్రవేశించింది. బడా బూర్జువావర్గ వార్తాపత్రికలు తిరిగి ఇందిరాగాంధీని భుజానవేసుకొని ముమ్మరమైన ప్రచారం సాగించాయి.

జనతా ప్రభుత్వం అధికారంలోనికి వచ్చిన వెంటనే 1978లోనే రెండు ప్రధాన కమ్యూనిస్టుపార్టీలు భటిండా, జలంధర్ పార్టీ కాంగ్రెసులలో వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత, ఐక్యసంఘటనా నిర్మాణ కార్యక్రమాన్ని తీర్మానాలలో ఆమోదించినా, వారి రాజకీయ సైద్ధాంతిక దృక్పధాలలోని బేధాభిప్రాయాలే ప్రత్యామ్నాయ నిర్మాణాలలో ఎదురైనా, ఆర్థిక సమస్యలపై ప్రాధమిక ఐక్యకార్యాచరణ, ఐక్యత, సంఘటనల అవగాహనలలో కొంత పురోగమనం కన్పడింది. ఇదే ప్రజాస్వామ్యశక్తులలో విశ్వాసాన్ని పెంపొందించింది.

రెండు ప్రధాన కమ్యూనిస్టుపార్టీల భటిండా, జలందర్‌పార్టీల కాంగ్రెసులు 1977 ఎన్నికల ఫలితాలు క్లుప్తంగా, వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనల అవగాహనలను బలపరచాయని తెలిపాయి. జనసంఘం, ఆర్.యస్.యస్.ల రాజకీయవైఖరి, అవగాహన, విధానాలు పూర్తిగా వోటమిని చవిచూచాయి. నూతన లోకసభలో వామపక్ష శక్తులు సి.పి.ఐ; సి.పి.ఐ(యం) తదితర వామపక్షాలు బలపడినవి, వారి ఐక్యత మరింత అభివృద్ధి చెందింది.

ఇందిరాగాంధీ పెద్ద మెజారిటితో తిరిగి అధికారంలోనికి వచ్చింది. ఆమె నాయకత్వంలో బూర్జువా వర్గాల రాజకీయాధికారాన్ని మరింత బలపరచుటకు చేయు ప్రయత్నాలను తీవ్రతరం చేయుటకు అవకాశం లభించింది. పార్లమెంటులో పెద్ద మెజారిటి, బడాబూర్జువావర్గాల శక్తివంతమైన మద్దతుతో ఇందిరా కాంగ్రెసు పార్టీ, కీలకస్థానాలలో "రాజ్యాంగేతర కాకస్ శక్తుల" తో ప్రజాస్వామ్యహక్కులను హరించి వ్యక్తి నియంతృత్వం స్థాపించే అవకాశం కలిగింది. ప్రజలు తాత్కాలికంగా బాధలకు గురైనా ప్రజల ప్రజాస్వామ్య శక్తుల జాగరూకతే రక్షణకు ప్రజావిజయానికి తోడ్పడింది.

మనదేశ సామాజిక ఆర్థిక విధానం, రాజకీయ సమస్యలు, ద్రవ్యోల్బణం, నిరుద్యోగం, దారిద్ర్యం పెరిగిపోయి తీవ్రసంక్షోభ దిశలో పయనిస్తున్నది. సామాజిక మౌలిక వ్యవసాయ, ఆర్థిక సంస్కరణలు తప్పితే వీటి పరిష్కారానికి మరో మార్గంలేదు. దీర్ఘకాల రోగంలా అంటిపెట్టుకొని వున్న సర్వతోముఖ సంక్షోభం, ద్రవ్యోల్బణం, ధరలు ఆకాశాన్నంటుటకు, మౌలిక సంస్కరణలను పెట్టుబడి దారి విధానాన్ననుసరించుతున్న బడాబూర్జువా భూస్వామ్యవర్గాల కాంగ్రెసు నాయకత్వంలోని ప్రభుత్వం వీటిని పరిష్కరించుటలోని వైఫల్యం స్పష్టం. ఈ పరిస్థితులలో వామపక్ష ప్రజాస్వామ్య శక్తుల అగ్రగామిదళాలుగా సి.పి.ఐ; సి.పి.ఐ(యం)లు శక్తివంతమైన ప్రధాన ప్రతిపక్ష పాత్రను,

వామపక్ష ఐక్యతాపునాదిపై నిర్మించవలసివుంది. ప్రభుత్వ ప్రజావ్యతిరేకచర్యలను వ్యతిరేకించుతు, అదే కాలంలో అభ్యుదయకర విధానాలను బలపరచుటగా భటిండా పార్టీ కాంగ్రెసు విధానాల ఆచరణగా సి.పి.ఐ వైఖరిగా వుంది. అదేవిధంగా, జలంధర్ పార్టీ కాంగ్రెసు విధానాల ఆచరణగా సి.పి.ఐ(యం) వైఖరిగా, రాజీలేని ప్రతిపక్ష విధానంగా వుంది. అంతేగాక, సి.పి.ఐ విధానం కత్తిమీద సాము అని కూడ విదితము.

ఎన్నికలలో రూపొందించబడిన వామపక్ష పార్టీల ఐక్యతను విస్తృత పరచి, బలపరచాలి. ప్రజా ప్రయోజనాల రక్షణకై అసెంబ్లీలలో పోరాడుటకు యిది యెంతో అవసరము. వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత. ఆధారంగా జాతీయ ప్రత్యామ్నాయాన్ని రూపొందించుటకు యిదే అవసరము, అని సి.పి.ఐ తన విధానాన్ని ఫిబ్రవరి తీర్మానంలో వివరించింది.[1]

సి.పి.ఐ(యం), సి.పి.ఐ ల మధ్య ఇటీవల యేర్పడుతున్న స్నేహ సత్సంబంధాలను మరింత బలపరచుకొనుటపై వామపక్ష ప్రజాస్వామ్య శక్తులను, ప్రజా విప్లవోద్యమాలను, వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయాలు రూపొందించబడుట చాలావరకు ఆధారపడి వుంది.

సి.పి.ఐ(యం), సి.పి.ఐల మధ్యగల తీవ్ర సైద్ధాంతిక, రాజకీయ, ఎత్తుగడలపై గల అభిప్రాయ భేదాలు అలాగే వున్నవి. భవిష్యత్తులో గూడ వివిధ అంచెనాలు, రాజకీయ పరిణామాలపై అభిప్రాయబేదాలు మరికొంతకాలం అలాగే కొనసాగవచ్చును. తరచుగా పరస్పరం చర్చలు, సంప్రదింపులు, రెండు పార్టీల నాయకత్వాలు, వివిధ స్థాయిలలో స్నేహ పూర్వక అభిప్రాయాల మార్పిడి జరగాలి. ఈ సంప్రదింపులు చర్చల లక్ష్యం సాధ్యమైనంతవరకు అభిప్రాయభేదాలను తగ్గించేవిగా, చేరువగుటను పెంపొందించేవిగా, తక్షణం పరిష్కరింపజాలని ప్రధాన అంశాలపై సమిష్టి అవగాహనా క్రమాన్ని పెంపొందించేవిగానే వుండాలి గాని అభిప్రాయాభేదాలను లోతుగాను, విస్తృతపరచుకొంటు వొండోరులు ప్రజల నుండి వేరు పరచుకొనే నీచ ఎత్తుగడలు అనుసరించి, విచ్ఛిన్నతా మార్గాన్ని అనుసరించరాదు. అవి నిజాయితికి గీటు రాయి కావాలి.

భటిండా, జలందర్ రాజకీయ తీర్మానాలు, మత మౌఢ్యశక్తులు బలపడుటలోని ప్రమాదాన్ని, పరిణామాల. వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనా నిర్మాణ బృహత్కార్య అవసరాన్ని, సి.పి.ఐ(యం), సి.పి.ఐ ల ఐక్యత వొక్కటే గాని, లేక వామపక్షాల ఐక్యత మాత్రమే నివారించజాలదని సూచించుటయేగాక, అన్ని వామపక్ష ప్రజాస్వామ్యశక్తుల. విస్తృత ఐక్యకార్యాచరణ అవసరాన్ని స్పష్టం చేసాయి. ఇందుకు వివిధ రాజకీయ, ఆర్థిక సమస్యలపై వివిధ బూర్జువా రాజకీయపార్టీలను అనుసరించే ప్రజాసామాన్యాన్ని ఐక్యకార్యాచరణకు వామపక్ష ప్రజాస్వామ్య శక్తులు సమీకరించాలి.

---

1. *మధ్యంతర లోకసభ ఎన్నికల 1980 సమీక్ష, తీర్మానాలు. సి.పి.ఐ జాతీయ సమితి, 3, ఫిబ్రవరి 1980న ఆమోదించినది (ఆంగ్లంలో) పే. 23.*

నాటిదేశ, అంతర్జాతీయ అత్యంత తీవ్ర సంక్షోభ, సంక్లిష్ట పరిస్థితులలో వామపక్షాల నాయకత్వాలపై బృహత్తర భాద్యతవుంది. జనతా ప్రభుత్వ పతనకాలంలో, తదనంతర లోక్‌సభ ఎన్నికలలో వామపక్ష ప్రజాస్వామ్యశక్తుల పెంపొందించుటలో సి.పి.ఐ; సి.పి.ఐ(యం) లు గణనీయమైన పాత్రను నిర్వహించాయి. భవిష్యత్తులో కూడ వారి నుండి అట్టి పాత్రనే ఆశిద్దాము.

కాంగ్రెసు ప్రభుత్వం అత్యవసరపరిస్థితుల కాలంలో చేసిన ఘోరదురంతాలను, జనతా "కీచులాట" ప్రభుత్వం నాటి దుర్భర పరిస్థితులను ప్రజలు మరువలేకున్నారు. కనుచూపుమేరలో వారికి మరో ప్రత్యామ్నాయం కానరాకుండా వుంది. భటిండా, జలందర్ 1978 పార్టీ కాంగ్రెసుల నాటి నుండి సి.పి.ఐ; సి.పి.ఐ(యం)లు వామపక్ష ప్రజాస్వామ్య శక్తుల ఐక్యతా నిర్మాణ యత్నాలు చేస్తున్నా, మధ్యంతర ఎన్నికలలో యీ ప్రయత్నాలు ముమ్మరమయ్యాయి.

జులై 1980లో మత మౌఢ్య చాంధస, అభివృద్ధి నిరోధక భూస్వామ్య బూర్జువా ప్రభుత్వంలో యేర్పడిన రాజకీయ సంక్షోభంలో జనతా ప్రభుత్వం కూలిపోవుటతో వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యకార్యాచరణ, ప్రత్యామ్నాయ నిర్మాణ యత్నాలు ముమ్మరమయ్యాయి. అప్పటికే, ఆర్థిక సమస్యలపై ప్రజాసంఘాలలో ఐక్యపోరాట కార్యాచరణ అభివృద్ధి చెందసాగింది. అయినా, వామపక్ష ప్రజాస్వామ్య పార్టీలు, శక్తులు, గ్రూపులు రాజకీయ సమస్యలపై ఐక్యకార్యాచరణకు సంకోశించుతునేవున్నవి. పరిస్థితులు మారి, ఎన్నికలు వచ్చుటతో "తాబేలు నడక"లో పురోగమించుతున్న వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతా నిర్మాణ యత్నాలు వేగాన్ని సంతరించుకొన్నాయి. పరిస్థితి సంక్లిష్టమూ, మార్గం సంకటమయమూ అయినది, అయినా అదే పురోగమనపంథా.

ఈ కాలంలో ప్రత్యేకంగా వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతా నిర్మాణ యత్నంలో భాగంగా ప్రజాసమీకరణ ప్రారంభమైందని చెప్పవలసివున్నది. వామపక్ష పార్టీలైన సి.పి.ఐ; సి.పి.ఐ(యం) లు ఎన్నికల మిత్రులైన లోక్‌దళ్, కాంగ్రెసు (ఉ)లు రాష్ట్రస్థాయి కన్వెన్షనలను ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, పంజాబు లలో ప్రజా సమీకరణగావించి, జరిపాయి. ఈ ఐక్య ప్రజాసమీకరణలో భాగంగానే సి.పి.ఐ; సి.పి.ఐ(యం), లోక్‌దళ్, కాంగ్రెసు, పార్వర్డు బ్లాకులు 1979 అక్టోబరులో పాట్నాలో బ్రహ్మాండమైన సమిష్టి ప్రదర్శన, సమావేశం జరిపి, ప్రజలకు వొక విజ్ఞప్తిని చేసాయి. వామపక్ష వ్యతిరేకులైన బడాబూర్జువా వార్తా సంస్థలు, గత కొద్ది సంవత్సరాలుగా యింత పెద్ద ప్రదర్శన జరుగలేదని వ్రాసాయి.

ఈవిధంగా వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యకార్యాచరణ ప్రజాసమస్యలు, ప్రజాసమీకరణ ద్వారా ఐక్యతా నిర్మాణం వైపు దృష్టిని సారించింది. ఈ క్రమంలో వామపక్ష ప్రజాస్వామ్య పార్టీలు, గ్రూపులు, కార్యకర్తలు ఐక్యకార్యాచరణలో, సమీకరణలో పాల్గొనుట గణనీయమైన నూతనాంశము. ఇవన్నీ కలసి ఐక్యకార్యాచరణకు కొంత నిలకడ స్వభావాన్ని, బలాన్ని చేకూర్చాయి. ఈ సుముఖ అంశాన్ని ఎన్నికల పోరాటాలలోనేగాక, తదనంతరం

ముఖ్యంగా ప్రజాసమీకరణను కొనసాగించుట ద్వారానే ఐక్యసంఘటన రూపొందు అవకాశాలు మెరుగు అగుతవి.

ఈవిధంగా, కమ్యూనిస్టుపార్టీలు రెండూ ఐక్యప్రజాసమీకరణ, కార్యాచరణల క్రమంలో చేరువగుట, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతా క్రమానికి బలాన్ని చేకూర్చుట, మౌలిక ప్రాముఖ్యత గల అంశమని వామపక్ష శక్తులు తలచుచున్నవి. దేశమంతటా వ్యాప్తి చేయవలసిన వొక నమూనా విధాన క్రమంగా దీనిని చెప్పవచ్చును. అదేకాలంలో కమ్యూనిస్టుపార్టీలలోని కొన్ని తీవ్రవాద శక్తులు యీ క్రమాన్ని వ్యతిరేకించుట గమనించి వారిని గర్హించవలసిన ఆవశ్యకత వుంది.

జనతా పార్టీలో ఎన్నికలు దగ్గర పడుటతో వివిధ వర్గాల మధ్య సీట్లు పంపకాలు, సర్దుబాటుల విషయమై సంఘర్షణలు ప్రారంభమై, నవంబరులో బహిరంగ చర్చనీయాంశాలైనవి. జగజీవన్‌రాం, అతని అనుచరులు వొకవైపు, జనసంఘం, ఆర్.ఎస్.ఎస్.లు మరోవైపున జనతాలో సంఘర్షణలు తారాస్థాయికి చేరాయి. జనతాపార్టీలో ధన, దండబలాలను, కార్యకర్తలను, కవాతుదళాలను కలిగివున్న జనసంఘం, ఆర్.యస్.యస్. లే తమ బలాన్ని పెంపొందించుకొన నిర్ణయించినట్లు కన్పడుతున్నది.

ఇందిరాగాంధీ కాంగ్రెసులో సంజయుగాంధీ వర్గం తమ బలాధిక్యతను పెంపొందించుకొని 1976లో వలెనె వ్యవహరించుటతో బీహారు, యు.పి., పంజాబ్, పశ్చిమబెంగాల్, మహారాష్ట్ర, కర్నాటక, ఆంధ్రప్రదేశ్‌లలో అంతర్గత సంఘర్షణలు తీవ్రమయ్యాయి. వీటికి తోడు, ఇందిరాగాంధీ బహిరంగంగా కుమారుని బలపరుస్తూ, అత్యవసరకాలం నాటి నాయకులను కీర్తించుటతో కాంగ్రెసు (ఐ) లోని కలతలు, సంఘర్షణలు మరింత తీవ్రమయ్యాయి.

లోక్‌దళ్-కాంగ్రెసు (ఉ)-వామపక్షాల బలాన్ని, ఐక్యతను పెంపొందించుకొనుటకుగల అడ్డంకులను తొలగించుకొనుటకు చర్యలు గైకొనుట నాటి తక్షణావసరము. అది వొక్కటే నాడు, ఇందిరాగాంధీ "కాకస్" నిరంకుశపాలన పునరుద్ధరణను ఆపగలదని వామపక్షాలు పరిగణించాయి. ఈ ఐక్యతా క్రమాన్ని పెంపొందించవలసిన భాధ్యత సి.పి.ఐ; సి.పి.ఐ(యం) లపైనే ప్రధానంగా వుంది.

ఇటీవల కేరళలో సి.పి.ఐ(యం), సి.పి.ఐ లు సంయుక్త అవగాహన ప్రాతిపదికపై కలసి పనిచేస్తున్నవి. వామపక్ష ప్రజాస్వామ్య శక్తుల ఐక్యతకు, వారి ప్రయోజనాలకు, నూతన కలయికలకు కేరళ పరిణామాలు ఎంతో తోడ్పడినవి. కేరళ కాంగ్రెసులోని ప్రధానవర్గం అటువంటి నూతన కలయికలకు సుముఖ నిర్ణయం తీసుకొన్నది. కాంగ్రెసులో యిది మంచి ప్రభావాన్ని కలుగజేసింది.

ఈ సందర్భంలో శ్రీ బహుగుణ కాంగ్రెసు(ఐ) లో చేరుట దురదృష్టకరము. వామపక్ష ప్రజాస్వామ్యశక్తుల ఐక్యతా, నిర్మాణ ప్రయత్నానికి కొంత, అంతరాయం కలిగింది.

ఇందిరాగాంధి ప్రచార యాత్రలలో ప్రజాస్పందన బాగా కన్పడిందనులో సందేహంలేదు. కాంగ్రెసు(ఐ) కేంద్రంలో సంజయగాంధీ "కాకస్" నిరంకుశ ధోరణిలో తిరిగి పనిచేస్తూనే వుంది. కొద్దిరోజులు ఇందిరాగాంధీ నిరంకుశత్వాన్ని, సంజయగాంధీ "కాకస్"ను తీవ్ర ధోరణిలో విమర్శించి, దూయబట్టిన బ్రహ్మానందరెడ్డి, బహుగుణలు, ఇందిరాగాంధీ ఆశ్రమంలోనే తిరిగి చేరారు. అదేకాలంలో, జగజీవన్‌రాంను గురించి కొన్ని వదంతులను కొన్ని వర్గాలు కావాలనే వ్యాపింపజేసినట్లు కన్పడుతున్నది.

జనతాపార్టీ పరిస్థితి, దాని నాయకుడు జగజీవనరాం పరిస్థితివలెనె అనిశ్చిత పరిస్థితులలోనికి జారి పోయింది. జనతాపార్టీలో ఎన్నికలలో పోటీచేసే అభ్యర్థులను నిర్ణయించుటలో పరిగణించబడిన అర్హతలలో కులమేగాక రాష్ట్రీయ స్వయం సేవక సంఘ ప్రతినిధి అవునా, కాదా అనేది నిర్ణయాత్మక అంశమైనట్లు కన్పడుతున్నది.

కాంగ్రెసు (ఉ)–లోక్‌దళ్ కూటమి నాడు మనగలుగుతుందాయనే ప్రశ్నయెదురైంది. మనగలిగినా, చీలకపోయినా అన్ని రాష్ట్రాలలో ఐక్యంగా వుండుట నాడే అనుమానాస్పదమైంది. అది, సి.పి.ఐ(యం), సి.పి.ఐ తదితర వామపక్షాలు ఆకూటమితో వ్యవహరించవలసి వున్నందున, అది ముఖ్యమైనది అయింది. వామపక్షాలు – కాంగ్రెసు (ఉ) లోక్‌దళ్ కూటమి భగ్నం కాకుండా వుంటేనే ఎన్నికలలో ఇందిరాగాంధీ అధికారం లోనికి రాకుండా చేయు ప్రయత్నాలలో పురోగమనం కన్పడవచ్చును. నాటి పరిస్థితులలో వామపక్ష ప్రజాస్వామ్య జాతీయ నూతన ప్రత్యామ్నాయం అంత తొందరగా యేర్పడు అవకాశాలు లేవు. అప్పుడున్న లోకసభలోని బలాన్ని వామపక్షాలు పెంచుకొనగలిగితే వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయ యేర్పడుటకు అవకాశాలు యెక్కువ అయ్యేవి. అంచేతనే అన్ని విధాల వామపక్ష శక్తుల సంఖ్యాబలాన్ని నూతన పార్లమెంటులో పెంచుట అత్యవసరము. అన్ని కాలాలలో చేబట్టవలసిన వైఖరేయిది. అయితే, యిది ప్రధాన లక్ష్యమైన వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యకార్యాచరణ, ఐక్యసంఘటనల నిర్మాణానికి తోడ్పడాలి గాని, విచ్ఛిన్నకరచర్యగా పరోక్షంగా నైనా కారాదు.

ఈ పరిస్థితులలో కమ్యూనిస్టుపార్టీలు రెండు అంశాలను చూడాలి. మొదటిది, దేశం వామపక్ష విధానాలవైపు మొగ్గుటకు కార్యక్రమాలనురూపొందించాలి. అది జాతీయ లేక జనతా ప్రజాస్వామ్య విప్లవాలవైపు పురోగమించుటకు కాదు, పెట్టుబడిదారి విధానాన్ని సంస్కరించుటకూకాదు. పెట్టుబడిదారి పంథాలో అభివృద్ధి చేయు పంథాను విడనాడుటకు రూపొందించబడాలి. సోషలిజంవైపు పురోగమించుటకు ప్రాతిపదిక అయ్యేది కావాలి. సామ్రాజ్యవాదాన్ని, గుత్తపెట్టుబడిదారివర్గాలను అదుపులో పెట్టుచు, బలహీనపరచేది కావాలి. రెండవది, పై అంశాలను అమలు పెట్టగల రాజ్యాంగ యంత్రాన్ని వామపక్ష ప్రజాస్వామ్య శక్తులు నిర్మించుకొనగలిగిన శక్తిని పెంపొందించుకొనగలగాలి.

## ii

# పార్లమెంటు 1980 ఎన్నికలు, వివిధ పార్టీల విధానాలు, ఎత్తుగడలు

**2.1** .ఎన్నికలలో రాజకీయవిధానాలు, ఎత్తుగడలు రూపొందించుటకు సెప్టెంబరు - అక్టోబరు 1979లో సి.పి.ఐ జాతీయసమితి, వెంటవెంటనే రెండు పర్యాయములు సమావేశమై నిర్ణయాలు చేసింది. సి.పి.ఐ(యం) 1980 లోక్‌సభ సార్వత్రిక ఎన్నికల సందర్భంలో పార్టీ విధానాలను, ఎత్తుగడలను వివరించుతు ఎన్నికల ప్రణాళికను ప్రకటించింది. సెప్టెంబరులో సి.పి.ఐ. జాతీయసమితి ఎన్నికల లక్ష్యాలను యిలా పేర్కొన్నది. "మొదటిది జనతా ప్రభుత్వ కాలంలో జనసంఘం, రాష్ట్రీయ స్వయంసేవకసంఘాల పరోక్ష నాయకత్వంలో సాగిన ప్రజా వ్యతిరేకచర్యలను ప్రతిఘటించుటకు నిర్మాణం చేయతలపెట్టిన వామపక్ష ప్రజాస్వామ్యపార్టీల, గ్రూపుల ఐక్యతను రూపొందించుట; "ఇందిరాగాంది కాకస్ " నియంతృత్వం తిరిగి నెలకొల్పుటను ప్రతిఘటించాలని; రెండవది, పై లక్ష్యసాధనకు లోక్‌దళ్-కాంగ్రెస్ కూటమితో ఎన్నికల అవగాహనకు రావాలని; చాందస, మతమౌఢ్యశక్తుల; అధికారనియంతృత్వశక్తుల ద్వంద ప్రమాదాలకు వ్యతిరేకంగా పోరాడగలమని ప్రతిన చేసింది. "ఈ కూటమి కూడ బూర్జువావర్గ కూటమి యేనని, దానకి అనేక పరిమితున్నవని తెలుసని" స్పష్టం చేసింది. రాజకీయ పరిణామాలు వేగంగా మారుతుండుటతో అక్టోబరు 1979లో సి.పి.ఐ జాతీయ సమితి నాగపూరులో పై లక్ష్యాలు, అవగాహనలకు ఎన్నికల నినాదంగా "దేశాన్ని వామపక్ష దిశకు మళ్ళించండి" అనే పిలుపునిచ్చింది. ఈవిధానంతో యితర పార్టీలతో కలసి ప్రజా సమీకరణకు, ఆర్థిక సమస్యలపై పోరాటాలకు ఉపక్రమించింది.[1]

సి.పి.ఐ(యం) లోక్‌సభ సార్వత్రిక ఎన్నికలలో తమ లక్ష్యాలను ప్రణాళికలో యిలా వివరించింది. "ఒకవైపున కాంగ్రెసు (ఐ) నాయకులు మరోవైపున జనతా పార్టీ యీ రెండింటికి వ్యతిరేకంగా మాజీ కాంగ్రెసు పార్టీలో ఇందిరాగాంధీకి ఎదురునిలచినశక్తులు, జనతా పార్టీలో ఆర్.యస్.యస్. జనసంఘాల కూటమికి వ్యతిరేకంగా నిలబడి, తరువాత జనతా (యస్) గా పిలువబడుతున్న శక్తుల సంఘటనను యేర్పాటుకోరుతున్నవి." "ఎన్నికలలో నియంతృత్వకాంగ్రెసు (ఐ) కి, ఆర్.యస్.యస్; జనసంఘాల ప్రాబల్యం గల జనతా పార్టీకి వ్యతిరేకంగా నిలబడిన జనతా (యస్), కాంగ్రెసుల నాయకత్వంలో ఎంచుకొనుటకు, దానినే ఎన్నుకొనమని ప్రజలకు విజ్ఞప్తి చేయుటకు మార్క్సిస్టు కమ్యూనిస్టుపార్టీ ఎంతమాత్రం వెనుకాడుటలేదు." అంతేగాక, "ఇందిరాగాంధీ నాయకత్వంలోని నియంతృత్వాన్ని, జనతా నాయకత్వంలోని మత మౌఢ్యశక్తులను వోడించుటకు కలసి రావలసిందిగా పీజెంట్స్ అండ్ వర్కర్స్ పార్టీకి, ఫార్వర్డ్ బ్లాకుకు, జనతా వదలి వచ్చిన సోషలిస్టులకు, జనతాలోని సోషలిస్టులకు, రిపబ్లిక్ పార్టీ ఆఫ్

*1. సి.పి.ఐ జనవరి -ఫిబ్రవరి 1980లో ఆమోదించిన తీర్మానాలు (ఆంగ్లంలో) పే. 10-11.*

ఇండియాకు, అకాలీదళ్‌కు, ఎ.ఐ.ఎ.డి.యం.కె.కు, సి.పి.ఐ కు, యితర వామపక్ష ప్రజాతంత్ర పార్టీలు, గ్రూపులు శక్తులకు, వ్యక్తులకు సి.పి.ఐ(యం) పిలుపునిచ్చింది.[1]

అంతేగాక, పాలకపార్టీలైన కాంగ్రెసు (ఐ), జనతాపార్టీల రాజకీయ విధానాలు, ఆచరణలపై అవగాహనలు, అంచెనాలు నాడు యిలా వున్నవి.

"ప్రజాస్వామ్య శక్తులకు నియంతృత్వశక్తులకు మధ్య పోరాటము మరోసారి జరుగబోతున్నది. ఇందిరాగాంధీ ప్రాతినిధ్యం వహించే నియంతృత్వశక్తులు, తమ ఎమర్జెన్సీ పెట్టె, బిస్తరులతో సహా తిరిగి రంగంలోనకి వచ్చాయి." అదేవిధంగా "వికలాంగులైన ఆర్.యస్.యస్, జనసంఘాల ప్రాబల్యంలోని జనతా పార్టీ దాని ప్రజాతంత్ర వ్యతిరేక, మత, కుల తత్వ సిద్ధాంతాలతో మన ప్రజలముందు మరొక అభివృద్ధి నిరోధక సవాలుగా నిలబడ్డాయి."

"నియంతృత్వ దురాగతాలకు, దురాశలకు ఆటపట్టు అయిన కాంగ్రెసు (ఐ) నేటికీ ప్రధాన నియంతృత్వ ప్రమాద కారిగా వున్న దానిని ఎదుర్కొనిపోరాడాలి. ప్రధాన నియంతృత్వ ప్రమాదానికి, బీభత్సానికి, రాజ్యాంగపు త్రొక్కివేతకు ప్రతినిధిగావున్న కాంగ్రెసు (ఐ) ని వోడించాలి." అదేవిధంగా జనతాపార్టీ యెడలవైఖరి" జనతాపార్టీ నాయకత్వం ప్రజల ఆశలు నెరవేర్చుటలో విఫలమైంది. అది ప్రజల ఆశలకు విరుద్ధమార్గాలు చేబట్టి, తన సంస్థ విచ్ఛిత్తికి కారణమైంది. జనతాపార్టీకి ఆర్.యస్.యస్ యొక్క మత, కులతత్వ, మను సిద్ధాంతాలకు, ప్రజావ్యతిరేకవైఖరులను కాదనే ధైర్యంలేదు. అంచేతనే, ఎన్నికలలో ప్రజలు జనతాపార్టీని, కాంగ్రెసు (ఐ)తో పాటు తిరస్కరించాలి."[2]

జనతా పార్టీని, ప్రభుత్వాన్ని రాష్ట్రీయ స్వయంసేవకసంఘం, జనసంఘాలకూటమి హస్తగతం చేసుకొని, తమకు రావలసిన అధికారవాటా రాకుండా చేయుటను గమనించిన యితర భాగస్వామ్యపార్టీలు, శక్తులు స్వయంసేవక సంఘం ప్రాబల్యానికి వ్యతిరేకంగా పోరాటం సాగించాయి. ఫలితంగానే, జనతా పార్టీ (యస్) యేర్పడింది. అదేవిధంగా, యితర భాగస్వామ్యపార్టీలు, శక్తులు, వ్యక్తులు జనసంఘం, ఆర్.యస్.యస్.ల ద్వంద సభ్యత్వానికి, విధానాలకు వ్యతిరేకంగా పోరాడి బయటకు వచ్చాయి.

జనతాపార్టీలోని లౌకిక, ప్రజాస్వామ్య శక్తుల తిరుగుబాటు, అదే కాలంలో కాంగ్రెసులోని ప్రజాస్వామ్య శక్తుల పునరాలోచన; కాంగ్రెసు (ఐ)లోని దేవరాజ్ ఉరుసు తదితరశక్తులు చేసిన తిరుగుబాటులతో సహా అన్నీ కలసి నాడు వొక నూతన పరిస్థితిని సృష్టించాయి. ఈ రాజకీయసంక్షోభ, సంక్లిష్ట పరిస్థితులు నూతన ఆలోచనలకు నూతన కూటములు యేర్పడుటకు నాంది అయ్యాయి.

---

*1. లోక్‌సభ 1980 సార్వత్రిక ఎన్నికలు, భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) ఎన్నికల ప్రణాళిక (తెలుగులో) ప్రజాశక్తి ప్రచరణ పే. 24-25.*

*2. -- అదే -- పే. 17.*

అధికార నియంతృత్వం, మతమౌఢ్యతత్వ ద్వంద ప్రమాదాలను నిరోధించుటకు మాత్రమే గాక, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత బలపడుటకు, మౌలిక దృక్పధంతో పరిమితంగానైనా లోక్‌దళ్ - కాంగ్రెసు కూటమితో సాధ్యమైన చోట్ల స్థానిక ఎన్నికల అవగాహనకు వచ్చుట నిర్ణయించింది. ఈ అవగాహన దృక్పధంతో ప్రాంతీయ పార్టీలతో సర్దుబాటులు, ముఖ్యంగా కాంగ్రెసు(ఐ) కు వ్యతిరేకంగా పోరాడుటకు జనతా సిద్ధపడిన స్థానాలలో అవగాహనకు సంసిద్ధతను వెల్లడిచేస్తూ సి.పి.ఐ ఎన్నికల విధానాన్ని, లక్ష్యాలను, ఎత్తుగడలను యిలా పేర్కొన్నది. "జనతా పార్టీని ఇందిరా కాంగ్రెసు యిద్దరినీ వోడించుట; లోక్‌దళ్-కాంగ్రెసు, వామపక్షాల విజయానికి పనిచేయుట, వామపక్షాల ఐక్యత బలపడి, నిలద్రొక్కుకొనునట్లు లోక్‌సభలో రాజకీయ చొరవను ప్రదర్శించుటకు బలాన్ని పెంపొందించుట; లోక్‌సభలో పార్టీ ప్రాతినిధ్యాన్ని సాధ్యమైనంతగా పెంచుట,"[1] ప్రజావుద్యమాల బలాన్ని లోక్‌సభలో ప్రతి బింబించునట్లు చేయుటను తీర్మానం స్పష్టం చేసింది.

ఈ ఎన్నికల రాజకీయ విదానం, ఎత్తుగడలతో ప్రజా సమికరణ, పోరాటాలకు యితర పార్టీలతో కలసి ఐక్యకార్యాచరణకు ఉపక్రమించింది. ప్రజాసమీకరణ, ప్రజాపోరాటాలను ఇందిరా కాంగ్రెసు అధికార నియంతృత్వానికి, జనసంఘం, ఆర్.యస్.యస్.ల కూటమి మతమౌఢ్య తత్వానికి వ్యతిరేకంగా కలసి వచ్చే అన్ని పార్టీల, గ్రూపుల, వ్యక్తులతో సంయుక్తంగా సి.పి.ఐ; సి.పి.ఐ(యం)లు సాగించాయి. ఎన్నికల ప్రచార, ఆందోళనలో భాగంగానే క్రింది స్థాయిలో కూడ ప్రజాసమికరణ, పోరాటాలు, కన్వెన్షనలు పార్టీ శాఖలు చేపట్టాలని సి.పి.ఐ కోరింది. సి.పి.ఐ; సి.పి.ఐ(యం) ల మధ్య పెరుగుతున్న ఐక్యతకు సంతోషాన్ని వెలిబుచ్చింది. లోక్‌దళ్ ఎన్నికల చిత్తుప్రణాళికను, చరణ్‌సింగు రాజకీయ విధాన ప్రకటనను సి.పి.ఐ కార్యవర్గం తీవ్రంగా విమర్శించింది. లోక్‌దళ్ నాయకత్వం అంతర్గత కలహాలతో ప్రజాస్వామ్య పోరాటాలకు తీవ్ర నష్టాన్ని కలుగుజేసింది.

ఈ పోరాటంలో అగ్రభాగాన నిలబడి, అదికార నియంతృత్వ, మతమౌఢ్యశక్తులకు వ్యతిరేకంగా వోట్లను వొకచోట చేర్చి కాంగ్రెసు (ఐ), జనతాపార్టీల వోటమిని ఖాయం చేయుట వామపక్ష ప్రజాస్వామ్య శక్తుల కర్తవ్యంగా", సి.పి.ఐ(యం) ఎన్నికల ప్రణాళిక నొక్కి చెప్పింది.

"ఎన్నికలలో వామపక్ష ప్రజాస్వామ్యశక్తులు అధిక సంఖ్యలో గెలుచుట ప్రత్యామ్నాయం రూపొందుటకు అవసరం. ఆవిధంగా లోక్‌సభలో బాగా బలంపెరిగి ప్రజలలో వారి పలుకుబడి వేరూని ధృఢపడుతుంది" అని నేటి ఎన్నికల పోరాట పరిమితులను భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) స్పష్టం చేసింది.

---

*1. తీర్మానాలు (1980) సి.పి.ఐ. జనవరి - ఫిబ్రవరి 1980లో ఆమోదించినవి పే. 11.*

# iii

# వివిధ రాష్ట్రాలలో కమ్యూనిస్టుల ఎన్నికల ఎత్తుగడలు.

**3.1.** సార్వత్రిక ఎన్నికలలో. రాష్ట్రాలలోని అసెంబ్లీ ఎన్నికలలో కమ్యూనిస్టులు అనుసరించ వలసిన రాజకీయవిధానాలపై ఆ రెండు పార్టీల నిర్ణయాలను చూసాము. వివిధ రాష్ట్రాల స్థానిక పరిస్థితులలో వాటిని అమలు చేసిన తీరును, ఫలితాలను తెలుసుకొందాము.

## 3.2. కేరళ

లోక్‌సభ ఎన్నికలు 1980 జనవరి మొదటి వారంలోను, అసెంబ్లీ ఎన్నికలు మూడవవారంలోను కేరళలో జరిగాయి. కేరళలో వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన రూపొంది, బలపడుటకు గల ప్రత్యేక కారణాలను అధ్యయనం చేయవలసివుంది. ప్రధానంగా జనతా ప్రభుత్వపతనంతో, జయప్రకాశ్ నారాయణ, అతని వుద్యమంతో గల సంబంధాలను సి.పి.ఐ (యం) వదలుకొనుట, అఖిలభారత స్థాయిలో సి.పి.ఐ; సి.పి.ఐ(యం)లు రాజకీయంగా చేరువగుట, ద్వితీయాంశంగా, కేరళ సి.పి.ఐ రాష్ట్ర సమితి తన నాయకత్వంలోని ఐక్యసంఘటనా ప్రభుత్వాన్ని సి.పి.ఐ(యం) కోరికపై, రాజీనామాచేయు సాహస నిర్ణయం చేయుట. ఎన్నికల ముందే సి.పి.ఐ(యం) తో సహా కలసి వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యసంఘటన యేర్పడుటతో కమ్యూనిస్టు రాజకీయ చరిత్రలో నూతన శకారంబమగుట జరిగింది. ఈ సుముఖ పరిణామాలతో కేరళలో ఏడు పార్టీలు సి.పి.ఐ(యం) సి.పి.ఐ; ఆర్.యస్.పి; కాంగ్రెసు (ఉ) కేరళ కాంగ్రెసు (మణిగ్రూపు) అఖిల భారత ముస్లింలీగు, కేరళ కాంగ్రెసు (పిళ్ళైగ్రూపు)లు కలసి వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనగా యేర్పడినవి. సి.పి.ఐ నాయకత్వంలోని మంత్రివర్గం రాజీనామా చేయుట, ఐక్యసంఘటనల యెడల నిజాయితీతో కూడిన సి.పి.ఐ విశ్వాసం ప్రశ్నింపరానిదై ప్రజల మన్నలను పొందింది.

కేరళ ఎన్నికల రాజకీయాలలోని మరో ప్రత్యేకత ఉభయ కమ్యూనిస్టుల నాయకత్వంలోని వామపక్ష ప్రజాస్వామ్యసంఘటన, కాంగ్రెసు (ఐ) నాయకత్వంలోని మితవాద ఐక్యసంఘటన ఒక్క త్రిచూరులో తప్ప అన్ని స్థానాలలో నేరుగా పోటీ చేసాయి. వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన మొత్తం 20 లోక్‌సభ స్థానాలలో పోటీచేసి 12 స్థానాలలో గెలుపొందింది. స్వతంత్రులు పోటీచేసిన నాలుగు స్థానాలలో వామపక్ష విజయం తేలిక అయింది. కుల, మత పార్టీలు, కాథలిక్ మత భిషప్పులు మితవాద సంఘటనను బలపరచారు. వామపక్ష, మితవాద సంఘటనలు రెండూ, తీవ్ర ప్రచారం చేసినా ప్రజలు అనుకొన్నంతవుత్సాహంతో పాల్గొన లేదు. దశాబ్దాలకొలది సి.పి.ఐ(యం); సి.పి.ఐ లు రెండూ, "నీవు ద్రోహివి అంటే నీవు ద్రోహివి" అని నిందించు కొంటూ కమ్యూనిస్టు అభిమాన ప్రజాసామాన్యాన్ని, కార్మిక, కర్షక, నగర, గ్రామీణ బడుగువర్గాలను "నిలువుగాలోతుగా" చీల్చిన దుష్ఫలితాలు కారణంగా కొంత ప్రజాసామాన్యం కుల.

మత వర్గాలవైపు చేరుటయో, తాము ఎన్నికలకొరకు కలిసినా, ప్రజాసామాన్యంలో కమ్యూనిస్టుపార్టీలు రెండూ పూర్తి విశ్వాసాన్ని కలిగించలేక పోయి నందుననే మితవాద సంఘటన అన్ని సీట్లను పొందగలిగింది. వామపక్ష ఐక్యత, ప్రజాసంఘాల ఐక్యత లేక పోవుట, విస్తృత ప్రజాసామాన్యాన్ని కదిలించగలిగిన ఆర్థిక, రాజకీయ పోరాటాలను ఎన్నికల ముందు సంవత్సరాలలో వామపక్షాలు సంయుక్తంగా సాగించి వుండనందుననే ప్రజాసామాన్యంలో యేర్పడిన గండిపూడి, ఎన్నికల ముందు యేర్పడిన వామపక్ష సంఘటన ప్రజలలో విశ్వాసాన్ని కలిగించలేకపోయిందనుట స్పష్టము. వామపక్షాలకు విజయాన్ని చేకూర్చేవి విస్తృత కార్మిక, కర్షక, మధ్యతరగతులు ఆర్థిక, రాజకీయ సంయుక్త పోరాటాలేగాని, ఎన్ని కల ముందుయేర్పడిన తాత్కాలిక ఐక్యసంఘటనలు మాత్రమే కావు.

విజయాలు అనుకొన్నంతగా లేకపోవుటకు కారణాలను సి.పి.ఐ రాష్ట్ర కమిటి యిలా విశ్లేషణగావించింది. "అసెంబ్లీ ఎన్నికలతో పోల్చితే లోక్‌సభ ఎన్నికలలో అంత తీవ్ర రాజకీయ ప్రచారోద్యమం జరుగలేదు. నిర్మాణంలో కూడ యిదే కన్పించింది. క్విలాన్, ఎర్నాకులం, మావత్తు పూజ, చిరాయింకల్‌లలోని అపజయాలకు ముఖ్యకారణం ప్రచారలోపం, అశ్రద్ధయని నొక్కి చెప్పింది. అతిముఖ్యమైన మరోకారణం వామపక్ష సంఘటన వొక రూపం ధరించినా, ఐక్యత ఆచరణలో వెంటనే యేర్పడలేదు. ఇదే అన్ని స్థాయిలలో జరిగింది. కొన్ని ప్రాంతాలలో పార్టీ శాఖలు ఐక్యకసంఘటన అఖిలభారత రాజకీయ ప్రాముఖ్యతను పూర్తిగా అవగాహన చేసుకొనలేదు. కొన్ని ప్రాంతాలలో కొంతకాలం వరకు నూతన కలయికలకు అంతగా స్వాగతం కనపడలేదు. వామపక్షాలు ముఖ్యంగా కమ్యూనిస్టుపార్టీలు రెండూ ఆచరణలో తమ యీ నూతన కలయికలపై శ్రేణులు, ప్రజలలో పూర్తి విశ్వాసాన్ని కలిగించలేక పోయారనుట స్పష్టము. అతికష్టం మీద, అనేక అడ్డంకులను అధిగమించి ఐక్యసంఘటనా నిర్మాణం జరిగిందని క్లుప్తంగా చెప్పవచ్చును.

అంతేగాక, లోక్‌సభ ఎన్నికలైన వెంటనే అసెంబ్లీ ఎన్నికలో జరుగుటతో వనరుల సమీకరణలో కొంత సరళీయత, అలసత్యంచోటు చేసుకొన్నవి. లోక్‌సభ సీట్ల కేటాయింపు,సర్దుబాటుదారులకు అసెంబ్లీసీట్లకు జరుగుటతో, కొన్నిచోట్ల తిరుగుబాటు దారులకు అసెంబ్లీసీట్లను ముందుగానే కేటాయించుటతో సీట్ల లభించనివారిలో అసంతృప్తి పెరిగిపోయి మరోవిధంగా చేయిటకు వారికి కాలవ్యవధి లభించి, మాతృ సంస్థలకు అధిక నష్టాన్ని కలుగజేయుటకు అవకాశం లభించింది. త్రివేంద్రం లోక్‌సభ సీటును కోల్పోవుటకు ప్రత్యేకకారణాలున్నవి. పోటీ తీవ్రత యెక్కువైన కొలది,వృద్ధివించిన కుల రాజకీయ నూతనాంశమును అంచెనా వేయుటలో వామ పక్షాలు విఫలమయ్యాయి. చర్చి ఎన్నికలలో శక్తివంతంగా కలుగు జేసుకొనుటతో పల్లెకారులు, ముస్లింలు మితవాదసంఘటపవైపు మొగ్గారు, త్రివేంద్రం స్థానాన్ని అంచేతనే కోల్పోవుట జరిగింది. ఈ అపజయం పార్టీశ్రేణులలో దుష్ప్రభావాన్ని కలుగజేసింది. ఎన్నికల చిహ్నంలో యేర్పడిన గందరగోళం కారణంగా మావత్తు, పూజ స్థానాన్ని కోల్పోవుట జరిగింది.పాల్ఘాటు స్థానంలో ఐక్యసంఘటన ప్రచారం రైతు, వ్యవసాయ కూలీలలోనికి

వెళ్ళక పోవుటయేనని స్పష్టమైంది. సాంప్రదాయకంగా వామ పక్షాలకు వోటు చేయువారు వ్యతిరేకంగా వోటుచేయుట. కమ్యూనిస్టుల వైఫల్యాలు ఎంతలోతు, తీవ్రమైనవో తెల్పుతుంది. కమ్యూనిస్టు శ్రేణులు, వారిననుసరించే వారిలో దశాబ్దాలకొలది కాలంలో ఏర్పడిన అఘాతాన్ని సరైన కాలంలో పూడ్చుప్రయత్నం చేయుటలోను వైఫల్యం ఫలితంగా కార్మిక, కర్షక మధ్యతరగతులలో కమ్యూనిస్టులు పూర్తి విశ్వాసాన్ని కలిగించలేక పోవుటయే మౌలిక కారణంగా యోచించవలసి వుంటుంది.[1]

లోక్‌సభ ఎన్నికల ఫలితాలు వామపక్షాలకు "షాక్", కాగా మితవాద వర్గాలకు విజయకేతన మగుటలో ఆశ్చర్యంలేదు. వారు 20 సీట్లలో 8 సీట్లలో గెలుపొందుట వారుకూడ వూహించనది.

ఇదే సందర్భంలో, కేరళలో 1984లో జరిగిన లోక్‌సభ ఎన్నికల అనుభవాల సమీక్ష, భవిష్యత్తు కేమైనా ఆశాజనక మార్గదర్శిక ప్రాతిపదికలను, సూచనలేమైనా యివ్వగలదేమో చూద్దాము.కేరళ.యల్.డి.యఫ్,సీట్లకేటాయింపులో సి.పి.ఐ.(యం)కు 10, సి.పి.ఐకు4, కాంగ్రెసు (యస్)కు2, జనతాకు ఆర్.యస్.పి.కు1, డి.యం.కె.పి.కి1, ఎ.ఐ.యమ్.యల్, ముస్లింలీగుకు1, యిచ్చింది. కాంగ్రెసు(ఐ) నాయకత్వములోని వితవాద యు.డి.యఫ్, కాంగ్రెసు(ఐ)13, ముస్లింలీగ్(ఐ,యమ్.యల్)కు2, కేరళ కాంగ్రెసు(జె)2 స్థానాలలోను గెలుపొందారు .మొత్తం 20 స్థానాలలో మితవాద యు.డి.ఎఫ్. 17 స్థానాలకు, యల్.డి.యఫ్ 3స్థానాలలోను గెలుపొందాయి. ఇందిరాగాంధీ దారుణహత్యకాండతో వచ్చిన సానుభూతి వెల్లువ పార్లమెంటు ఎన్నికలలో కాంగ్రెసు(ఐ)కు,దాని నాయకత్వంలోని యు.డి.యుఫ్‌కు ఎనలేని విజయాన్ని, కమ్యూనిస్టుల నాయకత్వంలోని యల్.డి.యఫ్‌కు ఘోరపరాజయాన్ని, సి.పి.ఐ.కి లోక్‌సభలో ప్రాతినిధ్యం లేకుండా చేసింది.

వామవక్షాలు 1982వోటింగు సరళి ప్రాతివధికగా వేసుకొన్న అంచెనాలుతలక్రిందులయ్యాయి. సి.పి.ఐ.సమీక్ష చెప్పినట్లు"అనేక స్థానాలలో అంచెనాలు తప్పు అని తేలినది". వామపక్ష పార్టీల బలమైన కేంద్రాలలో సైతం "ఇందిరాగాంధీ మారణహత్యాకాండ సానుభూతి వెల్లువలో కొట్టుకొని పోయాయి. ప్రజలతో నిత్య సంబంధాలు కలిగివున్నామని చెప్పుకొనే కమ్యూనిస్టులే ప్రజల నాడిని పసికట్టలేకపోవుట, వారు ప్రజలకెంత దూరమయ్యారో తెలుపుతుంది కాని, ఆశ్చర్యాన్ని కలుగజేయదు.

**అసెంబ్లీ ఎన్నికల ఫలితాలను కొంత పరిశీలిద్దాము :**

నూతన లోక్‌సభలో మితవాద కేరళవర్గాలు 8 స్థానాలను గెలుచుట కేంద్రంలో కాంగ్రెసు(ఐ) మూడింట రెండు స్థానాలను కలిగియుండుటలో కేరళ కాంగ్రెస్(ఐ) వర్గాలలో నూతనోత్సాహాన్నిచ్చింది, నైతికంగా కొంత బలాన్ని పొందారు. బడా బూర్జువావర్గం, కంట్రాక్టర్లు వెంటనే మితవాద సంఘటన పక్షంవైపు చురుకుగా పనిచేశారు. అంతోని

---

1. సి.పి.ఐ.కేరళ రాష్ట్రకమిటీ *1980* మార్చిలో ఆమోదించిన సమీక్ష. పార్టీలైఫ్, వా*16* సం*8*. పే.*42-3*

కాంగ్రెసు వర్గం, లోక్‌సభ ఎన్నికల ఫలితాలతో ఇందిరాగాంధి ఆధిక్యత వెల్లడి అగుటతో అటువైపు పయనించారు. లోక్‌సభ ఎన్నికలలో ఇందిరాగాంధి పనిపెట్టుకొని కేరళలోని అన్నిదేవాలయాలు సందర్శించింది, పూజలు, చర్చి-మసీదులలో ప్రార్ధనలు చేసింది.

లోక్‌సభ ఎన్నికల బలహీనతలను అధిగమించుటకు యల్.డి.యఫ్. ఐక్యకార్యాచరణ, సంయుక్త ప్రచారోద్యమాన్ని పెంపొందించుట తక్షణ సమస్యగా చేబట్టింది. వివిధ పార్టీల శ్రేణులు, వాటి సమిష్టి బంధనాలు బలపడిన ఫలితంగా గణనీయమైన మార్పువచ్చి, వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనను గెలిపించాలనే ధృడసంకల్పం యేర్పడింది. కా॥ చండ్ర రాజేశ్వరరావు, భూపేష్ గుప్తా, గోవిందన్‌నాయర్, నంబూద్రిపాద్, జ్యోతిబసు, నృపేన్ చక్రవర్తి, రణదివె, తారకేశ్వరి సిన్హా ఎన్నికల ప్రచారంలో పాల్గొని విజయానికి తోడ్పడ్డారు. ఈ ప్రభావం ముఖ్యంగా త్రివేండ్రం, క్విలాన్ జిల్లాలలో బాగాపడింది. ఫలితంగా లోక్‌సభ ఎన్నికలలో కాంగ్రెసుకు మెజారిటీ లభించిన క్విలన్ జిల్లాలో 6, త్రివేండ్రంలో 4, కొట్టాయంలో 2, ఎర్నాకులంలో 2, కోజికోడ్‌లో 2, కన్ననూర్‌లో 2, పాల్ఘాట్‌లో 1 అసెంబ్లీ స్థానాలను ఆయాజిల్లాలో వామపక్ష ఐక్యసంఘటన సంపాదించింది. లోక్‌సభ ఎన్నికలలో మెజారిటీ ఓట్లను సంపాదించుకొన్న వామపక్షసంఘటన అలెప్పీ, త్రిచూర్, పాల్ఘాట్, ఇదుకి, కోజికోడు, కెననూరు జిల్లాలలో క్రమంగా 5,4,1,1,1 స్థానాలను మాత్రమే అసెంబ్లీ ఎన్నికలలో కోల్పోయింది. మెజారిటీ స్థానాలలో గెలుపొందింది. వామపక్ష సంఘటప మొత్తం 93 స్థానాలలో గెలుపొందింది,పోలైన వోట్లలో 50.7 శాతం, కాంగ్రెసునాయకత్వంలోని మితవాద సంఘటన 46 స్థానాలను 45.6 శాతం వోట్లను పొందింది.[1]

ప్రజా జీవితంపైనేగాక ఎన్నికలలో కూడ మతం,కులం ప్రమాదకరమైన ప్రభావాన్ని కలుగుజేస్తున్నది. అంచేతనే అభివృద్ధి నిరోధక మితవాద, మతవాదమౌఢ్యశక్తులు మత,కుల ముసుగులో వామపక్షశక్తులపై దాడిచేస్తున్నారు. నేడు కుల,మత, ప్రాంతం,భాషాప్రాతిపదికల పై యస్.డి.పి;యస్.హెచ్.పి. పార్టీలను యేర్పనచి, అదే విధంగా కార్మిక,కర్షక,తదితర ప్రజాసంఘాలను చీల్చుతున్నారు. బూర్జువా వర్గరాజకీయ పార్టీలు కుల, మత, దురహంకారాలను ప్రజాఐక్యతను చీల్చిఆయుధాలుగా వినియోగించు చున్నవని వామపక్ష శక్తులు గుర్తించాలి. మత,కుల,ప్రాంతీయ దురభి మానశక్తులను ప్రతిఘటించాలి.

## 3.3. పశ్చిమ బెంగాల్

వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన ప్రభుత్వం అధ్వర్యంలో ఎన్నికలు జరుగుచుండుటతో కాంగ్రెసు(ఐ) బెదిరింపులు, హింసా,దౌర్జన్య పద్ధతులు, భయపెట్టేవిధానాలు చేబట్టింది. కేంద్రమంత్రి గనీఖాన్‌చౌదరి, పశ్చిమ బెంగాల్ ప్రభుత్వాన్ని పడగొట్టుతానని బహిరంగంగా బెదరించారు. కేరళలోలాగ వూగిసలడే

---

*1. సి.పి.ఐ.కేరళ రాష్ట్రకమిటీ (1980) మార్చిలో ఆమోదించిన సమీక్ష. (అంగ్లంలో) పార్టీలైఫ్.వా16 నం8.పే.44-5.*

పెటీబూర్జువా వర్గాలను, ముస్లిం, కాథలిక్కు మతమైనారిటీలను, వివిధ ప్రలోభాలకులోనుగావించి తిరుగదీసే ప్రయత్నాలకు బెంగాలులో అవకాశం లేనందున గనీఖాన్‌చౌదరి , ప్రణబ్ ముఖర్జీలు విజయం పొందలేకపోయారు.ప్రథమంలో కొన్ని ఆటంకాలు వచ్చినా కమ్యూనిస్టు తదితర వామపక్ష ప్రజాస్వామ్య పార్టీలు, కాంగ్రెసు(ఉ) కలసి వామపక్ష ప్రజా సంఘటనగా ఎన్నికలలో పాల్గొని కాంగ్రెసు(ఐ)ని చిత్తుగా ఓడించాయి.

ఇందిరా కాంగ్రెసు వొక్కటే స్థిరమైన జాతీయ ప్రత్యామ్నాయం ప్రజావిశ్వాశాన్ని పొందామని భ్రమలు కలుగజేస్తూ ప్రజా భిప్రాయానికి అడ్డుగోడగా వుంది. కేరళ,పశ్చిమబెంగాల్, త్రిపురలలోని ఎన్నికల ఫలితాలు దీనినే చూచించుతున్నవి. ఈ రాష్ట్రాలలో కాంగ్రెసు(ఐ) ఘోర పరాజయం తెలిపే పాఠమిదే. అంతేగాక, జనతా పార్టీ, మతమౌఢ్య ఆర్.యస్.యస్. జనసంఘుశక్తుల పరాజయం మాత్రమే నియంతృత్వ ఇందిరా కాంగ్రెసు అధికారంలోనికి రాకుండా చేయలేకపోయాయి.

జాతీయ స్థాయిలో స్థిరమైన వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయం రూపొందనందున,వోటర్లు ఇందిరా కాంగ్రెసు " సుస్థిర ప్రభుత్వం" అనే నినాదంతో తిరిగి ఆమె బహుబంధనాలలోనికే త్రోయబడ్డారు. ఇందిరాగాంధీ 1977లో పొలైన వోట్లుకంటే 1980 లో 8శాతం వోట్లును మాత్రమే పొందగలిగినా, 1977లో 34.5 శాతం లోట్లుతో 154 స్థానాలను,1980లో42.6శాతం వోట్లలో 350 స్థానాలనుపొందగలిగింది. అదనంగా లభించిన 8శాతం వోట్లతో 196 స్థానాలు, అనగా 100శాతానికిమించి స్థానాలు పొందింది.

ఈ ఎన్నికలలో సి.పి.ఐ అన్ని వామపక్ష పార్టీలతో ముఖ్యంగా సి.పి.ఐ (యం) తో ఐక్యతను నిర్మించి, ఆ ప్రాతిపధికపై వామపక్ష ప్రజాస్వామ్యపార్టీల ఐక్యతను నిర్మించుటకు అన్ని ప్రయత్నాలు చేసింది. సి.పి.ఐ(యం) నాయకత్వం వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతా నినాదాన్ని సూత్రప్రాయంగా మాత్రమే ఆమోదించి, ఎన్నికల ఎత్తుగడలలో రెండు కమ్యూనిస్టుపార్టీల మధ్య మౌలిక అభిప్రాయభేదాలు తీవ్రంగానే వున్నవని బహిరంగంగా చెప్పసాగింది. సి.పి.ఐ(యం) నాయకత్వం కాంగ్రెసుకు వ్యతిరేకంగా "అందరి" ఐక్యత నొక్కి చెప్పుతు, ఎన్నికలలో వామపక్షాలను బలపరచుటలో తాత్సారం చేసినట్లు కన్పడుతున్నది. భారతీయ జనతాపార్టీతో ఎన్నికల అవగాహనకు కూడ సి.పి.ఐ(యం) సిద్ధపడింది. అంతేగాక, సి.పి.ఐ నేరుగా బహిరంగంగా త్రోసిబుచ్చిన పార్టీలతో కూడ ఎన్నికల సర్దుబాటులను సి.పి.ఐకి వ్యతిరేకంగా చేసుకొన్నది. సి.పి.ఐ ని కొద్ది సీట్లలో నిలబడమని వొత్తిడి చేస్తూ బూర్జువా ప్రతిపక్ష రాజకీయపార్టీలను, వాటితోటి ప్రయాణీకులను కూడ బలపరచమని వొత్తిడి చేసినట్లు తెలుస్తున్నది. ఇది సి.పి.ఐచే తిరస్కరించబడినట్లు కూడ తెలుస్తున్నది. కేరళ, పశ్చిమబెంగాల్, త్రిపురలలో వామపక్ష ప్రజాస్వామ్యశక్తులు గెలిచి. ప్రభుత్వం సాగిస్తూ, ప్రజలందరి దృష్టిలో వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయంగా నిలబడి, వారి ఆశలను, ఆకాంక్షలను ప్రతిబింబించుతూ వామపక్ష పార్టీలను ప్రధానంగా వెలుగులోనికి తీసుకొని రావలసిన రాజకీయ

అవసరముంది. అంతేగాని, వారిని ప్రతిద్వందులుగా నెంచుతు, వారి అభివృద్ధిని అడ్డుకొనరాదు. సి.పి.ఐ(యం) సైద్ధాంతికంగా యీ అవగాహనను ఆమోదించినా, ఆచరణలో నీరుగార్చి వేసింది. ఐ్యసంఘటనలోని భాగస్వాములందరూ బలపడాలి. ఏ వొక్కరో మరొకరి బదులుగా బలపడరాదు. అట్టి ప్రయత్నం రాజకీయ ఐక్యసంఘటనల మౌలిక సూత్రాలకే భిన్నమైనది. విచ్ఛినతకు దారి తీసే అవకాశం వుంది. అందులో మరొకరిని బలహీనపరచే యెట్టి ప్రయత్నం జరిగినా, అది విచ్ఛిన్నతకే మార్గమగుతుంది. అట్టి బలాన్ని బూర్జువావర్గ పాలకపార్టీలు బలహీనపడుటనుండి వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనలోని అన్ని పార్టీలు బలపడాలి. ఈ ఐక్యసపంఘటనల సామాన్య సూత్రాన్ని భాగస్వామ్యపార్టీలన్నీ గుర్తించిననాడు, సంఘటనలలోవచ్చే అభిప్రాయభేదాలు ఎంత తీవ్రమైనవి అయినా పరిష్కరించుట సుసాధ్యము. చివరకు సి.పి.ఐ; సి.పి.ఐ(యం) లు ఘర్షణలు నివారించుకొని, అన్ని రాష్ట్రాలలో అవగాహనకు వచ్చినా పంజాబ్, మధ్యప్రదేశ్, రాజస్తాన్‌లలో కొన్ని ఘర్షణలు తప్పలేదు. కాంగ్రెసు వోడించుటకు బలమైన పోటీ అభ్యర్థిని బలపరచాలనే మిషతో ఒరిస్సా, యు.పి.లలో సి.పి.ఐ అభ్యర్థులను బలపరచకపోగా బూర్జువాపార్టీల అభ్యర్థులను బలపరిచింది.

బూర్జువావర్గ పార్టీలైన కాంగ్రెసు (ఐ), జనతా, లోక్‌దళ్, కాంగ్రెసు(ఉ) లు అనేక సీట్లలో పోటీ చేసినా, కాంగ్రెసు (ఐ) మాత్రమే 4 సీట్లలో గెలిచింది. వామపక్ష సంఘటనలోని సి.పి.ఐ(యం) 27, ఆర్.యస్.పి. 4, సి.పి.ఐ3., ఫార్వర్డ్ బ్లాక్3, స్థానాలలో గెలుపొందాయి. కాంగ్రెసు (ఉ) అభ్యర్థిని వామపక్ష సంఘలనలోని కొందరు బలపరిచనందున, సి.పి.ఐ అభ్యర్థి కొద్ది వోట్ల తేడాతో వోడిపోవుటలోని పొరపాటు స్పష్టంగా కన్పదుతున్నది. వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనకు అనగా సి.పి.ఐకి మెజారిటి రావలసిన సీటు, ఇందిరాగాంధీ కాంగ్రెసుకు యీ విధంగా పోవుటలో ఆశ్చర్యంలేదు.

## 3.4. బీహారు

కేంద్ర ఇందిరాకాంగ్రెసు పాలకపార్టీ "కేంద్రంలో రాష్ట్రాలలో ఒకే రాజకీయ పార్టీ పాలనలో వుండాలనే బడాబూర్జువా రాజకీయ సిద్ధాంతాన్ని" చేబట్టి తొమ్మిది రాష్ట్రాలలో కాంగ్రెస్ (ఐ) యేతర ప్రతిపక్షాల పాలనలో వున్న తొమ్మిది రాష్ట్ర ప్రభుత్వాలను రద్దు చేసిన ఫలితంగా అసెంబ్లీ ఎన్నికలు ప్రధానంగా వచ్చాయి. ఈ రాష్ట్రంలో పాలకపార్టీ కాంగ్రెసు(ఐ) ప్రధానశక్తిగా, లోక్‌దళ్ (జనతా-యస్) చరణ్‌సింగ్ గ్రూపు, జనతా (జె.పి) జనతా (యస్.రాజ్‌నారాయణ) గ్రూపు, కాంగ్రెసు (ఉ)లు అన్నీ కలసి కాంగ్రెసు (ఐ) కి వ్యతిరేకంగా పత్యామ్నాయాన్ని రూపొందించి, మరో బూర్జువా, ప్రభుత్వాన్ని యేర్పరచాలని ప్రధానంగా లోక్‌దళ్-జనతా కూటమి రెండో శక్తిగా ప్రయత్నాలు సాగినవి. ఈ కూటమి భారతీయ జనతా పార్టీని కలుపుకొనే ఆలోచన కలిగివుంది. అయితే యీ కూటమియే భారతీయ జనతాపార్టీ నాయకత్వంలో యేర్పడాలనే వైఖరి బలంగానే వుంది. ఆర్.యస్.యస్ నిర్మాణశక్తిపై ఆధారపడిన బి.జె.పి యీ మరో బూర్జువా ప్రత్యామ్నాయం తన నాయకత్వంలోనే సాధ్యమని నమ్ముతున్నది. మూడో శక్తిగా వున్న వామపక్షాలు, కాంగ్రెసు (ఐ) బి.జె.పి యేతర అన్ని పార్టీలు, గ్రూపులు కలసిన ఐక్యసంఘటన

యేర్పరచుటకు ముందుకు రావలసిందిగా లోక్‌దళ్, కాంగ్రెసు (ఉ) తదితర ప్రజాస్వామ్యశక్తులకు విజ్ఞప్తి చేసాయి. దీనికి కనీస కార్యక్రమం ప్రాతిపదిగా వుండాలని మతతత్వ భారతీయ జనతా పార్టీ, కాంగ్రెస్(ఐ)లతో తెగతెంపులు చేసుకోవాలని కోరారు. ప్రధాన లక్ష్యం కాంగ్రెసు (ఐ)ని వోడించుటగా వుండాలన్నారు. అదే కాలంలో మతతత్వ భారతీయ జనతా పార్టీ ఎట్టి పరిస్థితులలోను అధికారంలోనికి రారాదనేని కమ్యూనిస్టుల ప్రధాన లక్ష్యంగా వుంది. ఒక్కమాటలో మరో బూర్జువా ప్రత్యామ్నాయాన్ని వ్యతిరేకించారు. లోక్‌దళ్ కొన్ని వర్గాలలో కమ్యూనిస్టు వ్యతిరేకత కొనసాగుతూనే వుంది. ఈ విధంగా బూర్జువావర్గాలలో. కాంగ్రెసు (ఐ) బి.జె.పి యేతర లోక్‌దళ్ -జనతా - మాజీ సోషలిస్టు వర్గాలలో నిర్థిష్ట విధానాలు లేనందున బీహారు పరిస్థితిలు అత్యంత సంక్లిష్టంగా వున్నవి.

కాంగ్రెసు (ఐ) బలమైన ప్రధాన శక్తియైనా జనతా, లోక్‌దళ్ పార్టీలతో సంబంధాలు కలిగివుంది. అవసరమైనపుడు వారి నుండి కొంత మద్దతును, చీలివచ్చే వారితో మరికొంత బలాన్ని పొందవచ్చేనే ధోరణిలో వుంది. ఎమర్జెన్సీ నాడు ఇందిరాగాంధీని, కాంగ్రెసు (ఐ)ని బలపరిచిన వారినందరిని తిరిగి అందలమెక్కించింది. తన పూర్వ రాజకీయ, ఆర్థిక విధానాలనే కొనసాగించుతు, కేంద్రంలో గల కాంగ్రెసు (ఐ) బలంతో తిరిగి రాష్ట్రాలలో కోల్పోయిన తన బలాన్ని పునరుద్ధరించుకొనే ప్రయత్నాలను పాత పద్ధతులు తోనే చేయ ప్రయత్నాలుచేస్తున్నది. కాంగ్రెసు (ఉ) నాయకత్వాలు ప్రారంభంలో వామపక్షాలతో ఎన్నికల అవగాహనల యెడల కొంత ఆసక్తి కనబరిచారు. అట్టి ప్రయత్నాలు ప్రారంభించిన వెంటనే వారు సి.పి.ఐ;సి.పి.ఐ(యం) లతో ఎన్నికల సర్దుబాటులుకు సంప్రదింపులలో వారు వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయానికి మారుగా మరో బూర్జువా ప్రత్యామ్నాయాన్ని సూచించగా కమ్యూనిస్టులు సుముఖంగానే స్పందించారు. సీట్ల సర్దుబాటుల విషయమై గూడ సంప్రదింపులలో కొంత పురోగమనాన్నే సాధించారు. కాని తదనంతర పురోగమనం యేమీలేదు. పైగా లోక్‌దళ్, జనతా (జె.పి)లతో కలసి, కమ్యూనిస్టులను యేకాకులను చేసి, ప్రజలకు దూరంచేసి, కులాలకూటమిని, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతకు మారుగా మరో బూర్జువా ప్రత్యామ్నాయాన్ని రూపొందించ ప్రయత్నించారు.

లోక్‌దళ్ నాయకత్వం కమ్యూనిస్టులు విదేశసిద్ధాంతాలను విశ్వసించుతున్నారని, వారితో సహకార ప్రసక్తిలేదని యు.పి.లో 400లు బీహారులో 300 అసెంబ్లీ స్థానాలకు పోటీ చేస్తున్నామని ప్రకటించారు. ఇవన్ని లోక్‌దళ్ మరో బూర్జువావర్గ ప్రత్యామ్నాయాన్ని నిర్మించి ప్రయత్నిస్తున్నారనేది స్పష్టము. అంతేగాక, లోక్‌దళ్ వెనుకబడిన కులాల ప్రత్యామ్నాయాన్ని అభివృద్ధి చెందిన కులాలపాలనకు వ్యతిరేకంగా రూపొందించ సమకట్టింది.

కమ్యూనిస్టులు మరో బూర్జువా ప్రత్యామ్నాయాన్ని వ్యతిరేకించారు. జనసంఘం రాష్ట్రీయ స్వయం సేవక సంఘం, నూతన రూపం భారతీయ జనతాపార్టీ విధానాలను ప్రజలలో బట్టబయలు చేసి, ఆత్మహత్యాసదృశ్యమైన విధానాలను అనుసరించవద్దని

లోక్‌దళ్, జనతాపార్టీ (జె.పి), కాంగ్రెసు (ఉ) లకు విజ్ఞప్తి చేసి, వామపక్ష శక్తులతో కలసి, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతామార్గాన్ని చేబట్టమని కోరారు. కమ్యూనిస్టులు అట్టి వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయాన్ని కాంగ్రెసు (ఐ) నియంతృత్వానికి, మతమౌఢ్య ఆర్.యస్.యస్. జనసంఘం వర్గాల పాలనకు మారుగా రూపొందించ నెంచారు.

సి.పి.ఐ చొరవతో సి.పి.ఐ(యం) తో ఎన్నికల సర్దుబాటులు చేసుకొని, ఫార్వర్డు బ్లాక్ తదితర వామపక్షపార్టీలలోనివారు, జార్కండ్‌పార్టీ, ఖల్సాసేవాదళ్‌లు ప్రత్యేకంగా ప్రాంతీయపార్టీలతో సర్దుబాటులు చేసుకొని పోటీ చేసింది. పూర్తి ఎన్నికల సర్దుబాటులు జరుగక పోయినా యీ విధమైన యేర్పాటులను వామపక్షాల వోట్లు చీలిపోకుండా వుండే ప్రయత్నం కొంతవరకు చేయగలగాలి. మార్క్సిస్టు సమన్వయ కమిటి గణనీయమైన పాత్ర యీ విషయంలో వహించింది.

సి.పి.ఐ(యం) మార్క్సిస్టు సమన్వయం కమిటితో మిగతా వామపక్షాలు సంప్రదింపులు తిరస్కరించాయి. కారణం వారు ఆకమిటిని వామపక్ష పార్టీల కమిటీగా గుర్తించలేదు. వారు సి.పి.ఐ తో మాత్రం సంప్రదించుటకు, సర్దుబాటులకు అంగీకరించారు. ఫార్వర్డ్ బ్లాకు యెడల అదే విధానాన్ని అనుసరించారు. సి.పి.ఐ(యం) వొకవైనవు సీట్లు సర్దుబాటులు గురించి సి.పి.ఐతో మినహా మరేవామపక్షాలతో సంప్రదించుటకు సిద్ధంగాలేరు, మరోవైపు లోక్‌దళ్, కాంగ్రెసు (ఉ) జనతా (జె.పి)లను, సి.పి.ఐ(యం), సి.పి.ఐ లు పోటీ చేయని స్థానాలలో బలవరచే వైఖరిచే బట్టారు. ఏ క్రమపద్ధతివిధానంలోను యిమడలేని సి.పి.ఐ(యం) విధానం, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతామౌలిక విధానానికి ఎంతవరకు తోడ్పడిందో ప్రశ్నార్థకంకంగా వుంది. పార్టీ ప్రయోజనమే ప్రథమాంశంగా వారి విధానం నిర్ణయించినట్లు కన్పడుతుంది.

వామపక్షాలలో సి.పి.ఐ; సి.పి.ఐ(యం) ల మధ్య మాత్రం పూర్తి అవగాహన సర్దుబాట్లు జరిగాయి. రెండు పార్టీలు విడుదల చేసిన సంయుక్త ప్రకటనలో పరస్పరం చురుకుగా బలపరచుకొనగలమని స్పష్టం చేసాయి. ఇది విస్తృతంగా అమలు చేయబడింది. ఈ సమిష్టి కార్యాచరణలో సి.పి.ఐ(యం)ను బలపరస్తూ గోవింద గంజ్‌లో సి.పి.ఐ కార్యకర్త శ్రీరాంలగన్ మహతో ప్రాణాలు అర్పించారు.

సి.పి.ఐ మార్క్సిస్టు సమన్వయ కమిటి, యం.యల్ గ్రూపు తో వొప్పందం చేసుకొంది. మార్క్సిస్టు సమన్వయ కమిటి 23 స్థానాలలో పోటీ చేస్తున్నట్లు ప్రకటించింది. కటిహార్, రూపౌలి, ఫోర్బెస్‌గంజ్, బొకారోలలో బలమైన సి.పి.ఐ స్థానాలలోను, అదేవిధంగా సి.పి.ఐ(యం) బలమైన బెగుసరాయ్‌లలో పోటీ పెట్టింది. ఈవిధంగా మార్క్సిస్టు సమన్వయ కమిటి కొన్ని స్థానాలలో కాంగ్రెసు (ఐ) విజయాన్ని పరోక్షంగా పెంపొందించుటయేగాక వామపక్ష పార్టీల ఎన్నికల ఐక్యతను భగ్నం చేసింది.

సి.పి.ఐ వొకటి., రెండు స్థానాలలో తప్పితే ఫార్వర్డ్ బ్లాకుతో ఫలవంతమైన సర్దుబాటులనే చేసుకొనగలిగింది. అనేకచోట్ల రెండు పార్టీల కార్యకర్తలు హృదయ పూర్వకంగా పనిచేయుట జరిగింది.

సింగ్భూంలో సి.పి.ఐ; సి.పి.ఐ(యం) ; ఫార్వర్డ్‌బ్లాక్, బిర్సాసేవాదళ్, అఖిలభారత జార్కండ్‌పార్టీ, జార్కండ్ ముక్తి మోర్చాల మధ్య సర్దుబాటులు జరిగాయి. రెండు స్థానాలు మినహా 12 స్థానాలలో ఐదు పార్టీల మధ్య సర్దుబాటుల వొప్పందాలు జరిగాయి. అంటే, జార్కండ్ ముక్తి మోర్చాతో తప్ప మిగిలిన అన్ని పార్టీల మధ్య సర్దుబాటులు జరిగాయి. ఇట్టి వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత యితర జిల్లాలలో రాలేదు. మరో జిల్లా బెగుసరాయ్‌లో సి.పి.ఐ; సి.పి.ఐ(యం) కాంగ్రెసు (ఉ) ల మధ్య మిగిలిన ఏడు స్థానాలలో సర్దుబాటులు జరిగాయి. అయినా మార్క్సిస్టు సమన్వయ కమిటి తన అభ్యర్థిని నిలబెట్టి, కాంగ్రెసు (ఐ) అభ్యర్థిని గెలుచునట్లు చేయుటతో బెగుసరాయ్‌లో వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత విచ్ఛిన్నమైంది.

జార్కండ్ ముక్తి మోర్చా ఐక్యంగా వొక విధానాన్ని చేబట్టలేకపోయింది. కాంగ్రెసు (ఐ) తో సర్దుబాట్లు చేసుకొన్నది. మోర్చాపోటీ చేస్తున్న 13 స్థానాలలో కాంగ్రెసు (ఐ) పోటీ చేయనని ప్రకటించింది. మరోవర్గం మార్క్సిస్టు సమన్వయం కమిటిని మిత్రవర్గంగా నెంచింది. అందులోని మరోవర్గం మార్క్సిస్టు సమన్వయు కమిటిని బలపరచ నిరాకంరించింది., బొకారోలో లోక్‌సభ ఎన్నికలలో సి.పి.ఐ; మోర్చా అభ్యర్థుల విజయానికి బాగా తోడ్పడింది. అయినా అసెంబ్లీ ఎన్నికలలో సి.పి.ఐ అభ్యర్థికి పోటీగామార్క్సిస్టు సమన్వయ కమిటి తన అభ్యర్థిని నిలబెట్టింది. ఈ వైఖరికి తోడు మోర్చా అస్పష్ట విధానం, కాంగ్రెసు (ఐ) అభ్యర్థికి తోడ్పడింది.

బీహారులో పరిస్థితులు ఎంతో అనుకూలంగా వున్నప్పటికి ఎన్నికల ఐక్యసంఘటనలు గాని, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతా ప్రత్యామ్నాయాన్ని రూపొందించగలిగినంతటి శక్తివంతమైన సర్దుబాటులు చేసుకొనుట జరుగలేదు. కాంగ్రెసు (ఐ) సాధించిన విజయాలు, బీహారులో హింసా దౌర్జన్యాలు, తుపాకుల కాల్పులతో హత్యలు, "రిగ్గింగు" చేయుట వలన లభించనవి. సి.పి.ఐ(యం) తో సి.పి.ఐ పూర్తిగ సర్దుబాటులు చేసుకొనుట, ప్రాంతీయ పార్టీలతో పరిమితి సర్దుబాటులు, ఫార్వర్డ్‌బ్లాక్‌తో మార్క్సిస్టు సమనవ్వయ కమిటీ సర్దుబాటులు చేసుకొనుట, ప్రజలలో పెద్ద సదభిప్రాయాన్ని కలుగజేసాయి. సి.పి.ఐకి అనుకూలంగా గాలివీచిందని చెప్పలేముగాని, సాధారణ ప్రజాసామాన్యం సి.పి.ఐని ఆహ్వానించారు. ఈ పార్టీలన్నీ కలసి 200 స్థానాలుపైగా పోటీ చేయగా సి.పి.ఐ 23; సి.పి.ఐ (యం) 6; ఫార్వర్డ్‌బ్లాక్-1, మార్క్సిస్టు సమన్వయకమిటి (యం.యల్) 2 సీట్లలోవిజయం సాధించాయి. వామపక్షాలు గెలుపొందిన స్థానాలు తక్కువే అయినా కాంగ్రెసు (ఐ) కి ప్రత్యామ్నాయంగా కన్పడేవి వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనయేననేది స్పష్టమైంది.

ఎన్ని నిరసనలు తెలియజేసినా, ఎన్నికలముందు విస్తృతంగా వుద్యోగులను బదిలీలు చేసారు. ప్రతిపక్షాలు బలంగా వున్న నియోజకవర్గాలలో, పోలింగు స్టేషనులలో బదలీలు యెక్కువగా జరిగాయి. గత అసెంబ్లీ ఎన్నికలలో కాంగ్రెసు (ఐ) తరపున మునుపెన్నడూ జరుగనంతటి "రిగ్గింగు" జరిగింది. పోలింగు కేంద్రాలను గూండాలు స్వాధీనం చేసుకొని "రిగ్గింగు" చేయుట సర్వసాధారణమైంది. పోలింగు, పోలీసు ఆఫీసర్లు, అధికారుల

యేమీ చేయలేని నిస్సహాయులయ్యారు. ఎన్నికలలో 100మంది చనిపోవుట, మరెందరో గాయపడుట, కళ్ళుపీకివేయుట, మనుషులను ఖండఖండాలు నరకివేయుట వంటి మధ్య యుగాలనాటి హింసాచర్యలు పెచ్చరిల్లిపోయాయి. షేక్‌పూర్, ముజఫర్ పూర్, షహర్స, ఘోసి, ఫుల్‌వారి, ఝూరియాలలో జరిగిన అమానుష హత్యాకాండలు ఎన్నికల చరిత్రలో మరెక్కడా జరుగలేదు. అట్టి ఎన్నికలలో ఫలితాలలో కాంగ్రెసు (ఐ)167; లోక్‌దళ్42, సి.పి.ఐ.23; బి.జె.పి21, జనతా (జె.పి)18; కాంగ్రెసు (ఉ) 14; జనతా (రాజనారాయణ్)1, ఫార్వర్డుబ్లాక్1; సి.పి.ఐ(యం)6; జార్కండు మోర్చా 13; మార్క్సిస్టు సమన్వయకమిటీ 1, అసెంబ్లీ స్థానాలలో గెలుపొందారు.

వామపక్షాలు 1977లో సి.పి.ఐ21; సి.పి.ఐ.(యం)4; ఫార్వర్డు బ్లాకు 1; స్థానాలలో గెలుపొందగా, యీ 1980 ఎన్నికలలో వామపక్షాలు మొత్తంగా 4 అదనపు సీట్లలో గెలుపొందగలిగారు. బి.జె.పి నాల్గవపార్టీగా వచ్చింది.

ఈ 1980 ఎన్నికలలో వామపక్షాల విజయాలను సి.పి.ఐ రాష్ట్ర కార్యవర్గం తన సమీక్షా నివేదికలో యిలా పేర్కొన్నది.[1] "గతంలో కంటె ఎన్నో ఎక్కువ వోట్లు పొందగలిగారు. ప్రజలు వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయాన్ని హర్షించారు. వామపక్షాలు ముఖ్యంగా సి.పి.ఐ; సి.పి.ఐ(యం) లు పూర్తిగా ఎన్నికల సర్దుబాట్లు చేసుకొన్నవి. ఎన్నికల పోరాటాన్ని ఐక్యంగా చేసాయి. కాంగ్రెసు (ఐ) అధికార నియంతృత్వపోకడలు ప్రజలు స్పష్టంగా చూడగలిగారు. బూర్జువా కాంగ్రెసేతర పార్టీల ప్రత్యామ్నాయం ప్రజలు హర్షించలేదు. ప్రజాపునాదిలో కాంగ్రెసు బలహీన పడింది. ఎన్నికల ప్రచార ఆందోళనా కార్యక్రమంలో పార్టీ నిర్మాణం, క్రమశిక్షణలలో బలహీనతలు వెల్లడయ్యాయి. సి.పి.ఐ లేకుండా వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయం లేదని, యితర వామపక్ష పార్టీలు ముఖ్యంగా సి.పి.ఐ(యం) ఆలస్యంగానైనా గుర్తించింది. బీహారులో పరిస్థితులు ఎంతో అనుకూలంగా వున్నా ఎన్నికల సహకార, ఐక్యకూటమిని, సంఘటనను వామపక్ష ప్రజాస్వామ్య శక్తులు రూపొందించలేకపోవుట ప్రధాన మౌలిక వైఫల్యం. ప్రజా సమస్యలపై ఐక్యకార్యాచరణ, ప్రజాపోరాటాలు, ప్రజాఉద్యమాలు కొనసాగించలేకపోవుట, మరో మౌలిక వైఫల్యం.[2]

## 3.5 సంయుక్త రాష్ట్రాలు (యు.పి.)

దేశంలో అతిపెద్ద రాష్ట్రం యు.పి. దేశం మొత్తం రాజకీయాలపై, పరిణామాలపై అత్యంతబలమైన ప్రభావాన్ని ప్రసరించగలిగిన రాష్ట్రంలో వామపక్ష ప్రజాస్వామ్యశక్తులు ఎన్నికలపోరాటంలో పాల్గొన్న తీరుతెన్నులు, ఫలితాలు చూద్దాము.

కాంగ్రెసు (ఐ) ప్రభుత్వం 1980లో, జనతా ప్రభుత్వం కేంద్రంలో, అధికారంలోనికి 1977లో వచ్చిన తరువాత యేవిధంగా రాష్ట్రాలలో ప్రతిపక్షాల ప్రభుత్వాలను రద్దుచేసి,

*1&2 రివ్యూ ఆఫ్ బీహార్ అసెంబ్లీ ఎలక్షన్స్, సి.పి.ఐ బీహార్ స్టేటు ఎగ్జిక్యూటీవ్ కమిటీ నివేదిక, పార్టీ లైఫ్ వా.16 నం.15 పే. 16.*

అసెంబ్లీ ఎన్నికల జరిపాయో అదేవిధంగా తిరిగి ఎన్నికలు జరిపించింది. భారత బూర్జువావర్గాలు అధికారంలోనికి వచ్చుటకు ప్రజాస్వామ్యాన్ని ఎంత తేలికగా విడనాడుతవో, వాటి సహజనైజాన్ని చేపట్టగలవో రుజువుచేయుటకు 1977, 1980లలో జరిగిన ఎన్నికలే ప్రత్యక్ష నిదర్శనాలు. అందుకు అవి కేంద్రంలో అధికారంలో వున్న పార్టీయే రాష్ట్రాలలో అధికారంలో వుంటేనే దేశాభివృద్ధి జరుగుతుందనే నూతన రాజకీయ అధికార సిద్ధాంతాన్ని, అధికారంలోవున్న బూర్జువావర్గ రాజకీయ పార్టీలు కాంగ్రెసు (ఐ), తరువాత జనతా పార్టీలు రెండూ సిగ్గువిడిచి ప్రచారం చేసాయి. తొమ్మిది రాష్ట్రాలలో ఆవిధంగా ఎన్నికల తిరిగి జరిపాయి. రాష్ట్రంలో వివిధ ప్రతిపక్ష రాజకీయ పార్టీలు, గ్రూపులు, చీలికలతో పరిస్థితి అత్యంత శోచనీయంగా వుంది.

లోక్‌దళ్ బనారస్‌దాస్ నాయకత్వంలో రాష్ట్ర ప్రభుత్వం అనావృష్టి కిరోసిన్, డీజల్ ఆయిల్, విద్యుశ్చక్తి కొరతలతో "ట్యూబ్‌వెల్స్" బోరుపంపులు నుండి శీతాకాలపు పంటల కాలంలో నీరు అందక గోధుమ తదితర పంటలు పూర్తిగా నాశనమయ్యాయి. దీనికి తోడు పోలీసు, హింసా, దౌర్జన్యకాండలను, నారాయణపూర్‌లో స్త్రీలపై జరిగిన అత్యాచారాలను ఇందిరాగాంధీ, సంజయగాంధీలు రాజకీయ ప్రయోజనాలకు, ప్రచార ఆందోళనలకు పూర్తిగా వినియోగించుకొన్నారు. స్త్రీలపై అత్యాచారాలు జరిగిన ముఖ్యమంత్రి బనారస్‌దాస్ ఎట్టి చర్యలు తీసుకొనక ప్రజల అసంతృప్తికి ఎరఅయ్యాడు. అదే కాలంలో మానవ కనీస అవసరాల ధరలు విపరీతంగా పెరిగిపోవుట, రాష్ట్ర ప్రభుత్వం యెట్టి సహాయక చర్యలు చేపట్టక పోవుటను ఇందిరాగాంధీ ఎన్నికల ప్రధాన సమస్యగా ప్రచారంచేసి, ప్రజల అభిమానాన్ని తిరిగి పొందుటలో పాక్షిక విజయాన్ని సాధించింది.

ఎన్నికల ప్రకటనానంతరం, రాష్ట్రంలోని బూర్జువా ప్రతిపక్ష పార్టీలు తమ ఐక్యతను పెంపొందించుటకు, మారుగా కలతలతో చిన్నాభిన్నమగుట తీవ్రమైంది. జనతా పార్టీ చీలి జనతా (జె), జనతా (జె.పి.), భారతీయ జనతా పార్టీలుగా అయింది. చరణసింగ్, రాజనారాయణల మధ్య ఘర్షణలతో లోక్‌దళ్ చీలి జనతా (యస్–రాజనారాయణ్) జనతా (యస్–చరణసింగ్) లుగా అయింది. ప్రజలు కాంగ్రెసు (ఉ) ను వదలి, కాంగ్రెసు (జె) వైపు మొగ్గుతున్నారు. ఈ పరిస్థితి జగజీవన్‌రాం కాంగ్రెసు (ఉ) లో చేరుటతో మారింది. ఈ చీలికలతో బూర్జువా ప్రతిపక్ష పార్టీలు తమ ఎన్నికల చిహ్నాలను కోల్పోవుట జరిగింది. ఈవిధంగా రాజకీయపరిస్థితి ఇందిరాగాంధీకి అనుకూలంగా మారుటతోపాటు, ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయం శక్తిహీనం, నామమాత్రం అయింది.

ఇట్టి పరిస్థితులలో కాంగ్రెసు (ఐ)ని, ఆర్.యస్.యస్. కవాతు దళాల నాయకత్వంలోని భారతీయ జనతాపార్టీని వోడించి నియంతృత్వ, మతతత్వశక్తుల పురోగమనాన్ని అడ్డుకొనుటకు లోక్‌దళ్, అన్ని ప్రజాస్వామ్యపార్టీలు, గ్రూపులు తదితర శక్తులు వొక వేదిక పైకి రావాలని కమ్యూనిస్టులు అధికారికంగా విజ్ఞప్తి చేసారు. మత శక్తులతో ఎట్టి పరిస్థితులలోను కలువరాదని నిర్ణయించుకొన్నారు. లోక్‌దళ్ మత శక్తులతో కలిస్తే, వారితో కూడ కమ్యూనిస్టులు ఎట్టి సంబంధాలు పెట్టుకొనేరాదని నిర్ణయించుకొన్నారు.

లోక్‌దళ్ నాయకుడు చరణసింగ్ పెదసరితనం, లోక్‌దళ్‌తో ఎట్టి ఎన్నికల అవగాహనకు అవకాశం లేకుండా చేసింది. చరణ్‌సింగ్ లోక్‌దళ్ మొత్తం 400 స్థానాలకు పోటీ చేస్తుందని ప్రకటించారు. రెండు కమ్యూనిస్టుపార్టీలకు, కాంగ్రెసు (ఉ)కు 23 స్థానాలు కేటాయించినట్లు, లోక్‌దళ్ యు.పి., బీహారు, ఒరిస్సా, రాజస్థాన్‌లలో మంత్రివర్గాలను యేర్పాటు చేస్తుందని ప్రకటించారు. ఈ అత్యోక్తి ప్రకటనలు కాంగ్రెసు (ఐ); బి.జె.పిల వ్యతిరేక ప్రతిపక్షాలన్నీ ఎన్నికల అవగాహనలకు వచ్చుటకు అడ్డుగోడలయ్యాయి.

పరిస్థితి అంత ఆశాజనకంగా లేకపోయినా సి.పి.ఐ, సి.పి.ఐ(యం), జనతా (యస్), జనతా (యస్ – రాజనారాయణ), జనతా (జె.పి.), కాంగ్రెసు (ఉ) లు ఎన్నికల సర్దుబాటులకొరకు మే 3న సంయుక్త సమావేశం జరిపారు. అప్పటికే పార్టీలన్నీ తమ తమ విధానాలను, సీట్లపై నిర్ణయాలను తీసుకొని వుండుటతో సంప్రదింపులలో ఆశించిన ఫలితాలు కలుగలేదు. కాంగ్రెసు (ఉ) మాత్రం సి.పి.ఐ, సి.పి.ఐ(యం) పోటీ చేయు స్థానాలలో తమ అభ్యర్థులను నిలబెట్టమని ప్రకటించింది. అయినా మాట నిలబెట్టుకోజాలక గతంలో సి.పి.ఐ. శాసనసభ్యులుగా ఉన్న చోట్లగూడ తమ అభ్యర్థులను నిలబెట్టింది.

కాంగ్రెసు (ఐ) ప్రభుత్వపాలనాయంత్రాంగాన్ని పూర్తిగా వినియోంచుకొనుటకు, గవర్నరులను, వివిధ స్థాయిలలో రెవెన్యూ, పోలీసు, తమ అనుకూల అధికార బృందాలను బదలీలు, నూతనంగా నియమించుట చేసింది. అనేక ప్రాంతాలలో ప్రభుత్వం యంత్రాంగమే కాంగ్రెసు (ఐ) ఎన్నికల యత్రాంగంగా పనిచేసింది. వ్యక్తిగత భుజబలదళాలు, నేరస్థులు, లాఠీలదళాలు, యేర్పాటు చేసి, యేవిధంగానైనా గెలవగలరనుకొన్న దొంగరవాణా, స్మగిలింగు దాదాలకు, నేరస్థులకు, జూద–వేశ్యాగృహాలు నడుపుతున్న వారికి, యాదృచ్ఛికంగా నాయకులైన వారికి, ఇందిరాగాంధీకి, సంజయగాంధీకి విశ్వాస పాత్రులు అవునా–కాదా అన్న వొకే వొక కొలమానంతో సీట్ల కేటాయింపు జరిగింది. ఒక్క యు.పి.లోనే 100మందికి పైగా భూస్వాములకు సీట్లు యిచ్చుట జరిగింది. తూర్పు యు.పిలో జనతా (జె.పి) అధ్యక్షుడు చంద్రశేఖర్ వర్గాలను పశ్చిమ యు.పి.లో చరణసింగ్ లోక్‌దళ్‌కు పోటీ దళ్‌ను యేర్పాటు చేసి వారిని బలహీనపరచే ఎత్తుగడలు కాంగ్రెసు (ఐ) అనుసరించింది. వీటన్నిటి ఫలితంగా వృద్ధ కాంగ్రెసు నాయకులకు సీట్లు లభించపోవుటతో అసంతృప్తి పెరిగిపోయింది. మాజీ యు.పి. ముఖ్యమంత్రి, కాంగ్రెసు (ఐ) శెక్రటరీ అయిన బహుగుణ తన వర్గానికి సీట్లు లభించకపోవుటతో రాజీనామా చేసారు. బహుగుణ అనుచరులు కొందరు, కాంగ్రెసు ఎన్నికల చిహ్నంతో పోటీ చేయ నిరాకరించారు. లోక్‌దళ్ ఆర్థికాబివృద్ధిని విచ్ఛిన్నం చేసిందని, సమర్థవంతమైన పాలనకు కేంద్రంలో, రాష్ట్రాలలో వొకే పార్టీ అధికారంలో వుండాలనే బడా బూర్జువాల నినాదాన్ని చేబట్టింది.

బూర్జువా రాజకీయ పార్టీల విధానాలు ప్రజలలో అవిశ్వాసాన్ని రాజకీయ అనాశక్తిని కలిగించాయి. మరో శక్తివంతమైన ప్రత్యామ్నాయం వారి ముందులేదు. ప్రజలలో

నిరాశా, నిస్పృహా, నిస్సహాయతలతో 44.9శాతం వోట్లు మాత్రమే పోలయ్యాయి. కాంగ్రెసు (ఐ) గెలచిన మెజారిటి స్థానాలలో 35శాతం కంటె తక్కువ వోట్లు పోలయ్యాయి. అనేక స్థానాలలో 20 శాతం కంటె తక్కువ కూడ పోలయ్యాయి. ఈ సందర్భంలో గత నాలుగు అసెంబ్లీ ఎన్నికలలో కాంగ్రెసు (ఐ) ఫలితాల విశ్లేషణ కొన్ని మౌలిక అవగాహనలను వెలుగుకు తెస్తుంది. కాంగ్రెసు (ఐ) 1980 ఎన్నికలలో 425 స్థానాలలో 306 స్థానాలను అంటే 72శాతం సీట్లను సంపాదించిన విధం చూద్దాం.

గతంలోకంటే 1980లో వోటింగ్ శాతంబాగా పడిపోయింది. కాంగ్రెసు(ఐ) అన్ని చట్టవ్యతిరేక విధానాలు అవలంభించి పోలైన వోట్లలో 37.8శాతం పొందగలిగింది, అంటే మొత్తం వోట్లలో 17శాతము. అత్యంత కుతూహలమైన భేధాన్ని 1974, 1977 ఎన్నికలతో పోల్చితే గమనించగలము. కాంగ్రెసు(ఐ) 32.3శాతం వోట్లతో 1974లో 215 అసెంబ్లీ సీట్లను అనగా 50.1శాతం స్థానాలను, 1977లో 32.26 అనగా 1974లో దానికి లభించినన్ని వోట్లతో 46 స్థానాలను మాత్రం అంటే 10.09శాతం స్థానాలలో గెలుపొందింది. ఇది బూర్జువా ప్రజాస్వామ్యంలోని "బూటకపు ప్రజాస్వామ్యాన్ని" స్పష్టంచేస్తుంది. ఇది ఎన్నికల సంస్కరణ, దామాషాప్రాతినిధ్య అవసరాన్ని, అదే నిజమైన "జనతాప్రజాస్వామ్యం" అని నిర్ధారణచేస్తుంది.

ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయం ఉన్నట్లయితే 1980లో వోటర్లు కాంగ్రెసు(ఐ)కు అధికారాన్ని అప్పగించేవారు కాదు. చౌదరి చరణ్‌సింగ్ యీ ప్రత్యామ్నాయాన్ని ప్రజలముందుంచలేకపోయారు. తన కంచుకోట మీరట్‌లోనే అపజయాన్ని పొందారు. ప్రత్యామ్నాయాన్ని ప్రజలముందుంచగలంతటి శక్తివంతంగా వామపక్షాలు లేవు. లోక్‌దళ్ నాయకత్వం బాధ్యతాయుత వైఖరిచేబట్టి కాంగ్రెసు(ఉ), వామపక్షాలు సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)లు, జనతా(యస్), జనతా(జె.పి)లతో ఎన్నికల ఐక్యసంఘటన ఏర్పరచినచో, కాంగ్రెసు(ఐ) అధికారాన్ని చేబట్టగలిగేదికాదు.

సి.పి.ఐ. 1974లో 9, 1980లో 7 స్థానాలలో గెలుపొందింది. బరోడాలో అన్నిసీట్లుకోల్పోవుట, సాంప్రదాయంగా బలమైన అజాంఘర్, ఘాజీపూర్, బలియాలలో ఒకటి మినహా అన్నిస్థానాలను కోల్పోవుట పార్టీకేంద్రానికి ఆశ్చర్యాన్ని కలుగజేసింది. ప్రజాపోరాటాలను చేపట్టకపోవుటతోపాటు, ఐక్యసంఘటనా ఎత్తుగడలలో వైఫల్యం, నిర్మాణ బలహీనతలు ముఖ్యకారణాలు. అయితే "ఎన్నికలు కమ్యూనిస్టుల పునాది, జనతా(ఎస్), జనతా(జె.పి), కాంగ్రెసు(ఉ)లకంటె బలమైనవని నిరూపించాయి. స్వతంత్ర పార్టీ పునాదిని నిర్మించాలనే వైఖరి సరైనదేనని నిర్ధారణ అయింది. ప్రజాస్వామ్యశక్తులు ఐక్యకార్యాచరణ ద్వారానే అధికార నియంతృత్వాన్ని, మతనిరంకుశత్వాన్ని వోడించగలవు.

"ఈ నేపధ్యంలో కాంగ్రెసు (ఐ) ఎన్నికల విజయాలు, ప్రజల అనాసక్తి, నిరాశ, నిస్పృహ, ప్రతిపక్షాల అనైక్యత, ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయంలేకపోవుట,

ప్రభుత్వయంత్రాంగాన్ని రిగ్గింగుకు వినియోగించుట, గుండాయిజం, కోట్లకొలది డబ్బు నీతి బాహ్యంగా, చట్టవిరుద్ధ చర్యలతో పొందగలిగిందని నిర్ధారణైంది. వామపక్షాలు తమ కాళ్ళపై నిలబడే విశ్వాసాన్ని, సంకల్పబలాన్ని చేకూర్చింది.[1]

## 3.౬. మహారాష్ట్ర

సార్వత్రిక పార్లమెంటు ఎన్నికలు, రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికలు ఐదు మాసాల వ్యవధిలో జరిగాయి. వివిధ పార్టీల ఎన్నికల రాజకీయ విధానాలు ఎత్తుగడలు తెలుసుకుందాము.

సి.పి.ఐ, సి.పి.ఐ(యం) లు తమ రాజకీయ దృక్ఫధాలతో చొరవతో, పరస్పరం, తదితర వామపక్షాలు, పీజెంట్సు అండ్ వర్కర్స్ పార్టీతో, ప్రజాస్వామ్య శక్తులు గ్రూపులతో ఎన్నికల అవగాహనలకు సంప్రదింపులు, చర్చలు కాంగ్రెసు (ఐ)పై సమిష్టిగా పోరాడుటకు జరిపాయి. వామపక్షాలు వొక సామాన్య అవగాహనకు వచ్చాయి. కాంగ్రెసు (ఉ) తో, రిపబ్లికన్ పార్టీతో ఎన్నికల అవగాహనకు సంభాషణలు జరిపాయి. జనతా పార్టీలో జనసంఘం భాగస్వామిగా వున్నంతవరకు దానితో సంప్రదింపులు జరుపరాదని వామపక్ష ప్రజాస్వామ్యవాదులు అంగీకరించారు. కాంగ్రెసు (ఉ), రిపబ్లికన్ పార్టీలతో సంప్రదింపులు పూర్తి అగునప్పటికి జనతాపార్టీలో మరో చీలికయేర్పడింది. భారతీయ జనతా పార్టీ యేర్పడింది. వామపక్షాలు జనతా (జె.పి)తో సంప్రదింపులు జరిపాయి.

అప్పుడే, కాంగ్రెసు (ఉ) రాష్ట్ర స్థాయి సమావేశం నాశిక్‌లో జరిగింది. అందులో వై.బి.చావన్ కాంగ్రెసు (ఉ) యితర పార్టీలతో సంబంధం లేకుండా స్వతంత్రంగా మెజారిటి అసెంబ్లీ స్థానాలకు పోటీ చేస్తుందని ప్రకటించారు. దీనితో కాంగ్రెసు (ఉ) సంప్రదింపుల నుండి నిష్క్రమించింది. ఇది నూతన పరిస్థితికి దారితీసింది. కమ్యూనిస్టులు యింకా సంప్రదింపులు కొనసాగించాలా లేదా అని నిర్ణయించవలసి వచ్చింది.

ఇతర వామపక్షాలతో కమ్యూనిస్టులు సంప్రదించి, సీట్ల సర్దుబాటుల విషయమై సంబాషణలు కొనసాగించాలని నిర్ణయించారు. బొంబాయి సీట్లు మినహా అన్ని సీట్లకేటాయింపు విషయమై ఐదు పార్టీల మధ్య వొప్పందం కుదిరింది. అయినా యింకా, నామినేషన్ క్రితం రోజు వరకు సంప్రదింపులు కొనసాగిస్తూనే వున్నారు.

బొంబాయి నగరంలో కమ్యూనిస్టులు కోరిన సీట్లకు, యితర పార్టీలు అంగీకరించనందున, నగరం మినహా మిగతా సీట్ల విషయమై వొప్పందం కుదిరింది. సి.పి.ఐకి 15 సీట్లకేటాయించినా 14 సీట్లలో మాత్రమే తమ అభ్యర్థులను నిలబెట్టింది. సి.పి.ఐ స్వతంత్ర్యంగా 3 అభ్యర్థులను మొత్తం 17 సీట్లలో పోటీచేసింది, 2 స్థానాలలో గెలుపొందింది. దాదర్‌లో సి.పి.ఐ పోటీ చేయగా చీలిపోయిన డాంగేవర్గం బహిరంగంగా కాంగ్రెసు (ఐ) అభ్యర్థిని బలపరిచింది, ఫలితంగా 350 వోట్ల మెజారిటితో కాంగ్రెసు (ఐ) గెలచింది.

---

*1. రిపోర్టు ఆన్ యు.పి అసెంబ్లీ ఎలక్షన్స్, పార్టీలైఫ్. వా. 16., పే. 23-4.*

ఐదు పార్టీల ఎన్నికల సయోధ్యత, ఎన్నికలకు ముందు ఐక్యకార్యాచరణలు, పోరాటాలు, ఉద్యమాలు నడిపి వుండకపోవుటతో వోటరులపై ఆశించినంత ప్రభావాన్ని కలిగించలేకపోయింది. ఎన్నికల సర్దుబాటులు రాజకీయ వాతావరణాన్ని మెరుగుపరచుట సహజమే, కాని అవి సి.పి.ఐ యేకాకితనాన్ని కొంత వరకు పోగొట్టినా, వోటరులపై అనుకొన్నంత ప్రభావాన్ని కలుగజేయలేదనుట పరస్పర విరుద్ధమనుట. సానుకూల అంశాలు, అననుకూల అంశాలు సమానముగుటతో, వోటరులపై ప్రభావంపడలేదని అనుకొనవలసివుంటుంది.

అనేక స్థానాలలో కమ్యూనిస్టులను రిపబ్లికన్ పార్టీవారు, ముస్లింలు బలపరచారు. మిగిలినవారు కాంగ్రెసు వాదులకే మద్దతు నిచ్చారు. అదే విధంగా జనతా వారు సాంప్రదాయంగా కాంగ్రెసునే బలపరచారు.

"నిర్మాణరీత్యా అనేక బలహీనతలు, అభ్యర్థులు బయటివారు అయినపుడు స్థానిక కార్యకర్తలు అంతవుత్సాంగా పనిచేయకపోవుట, పార్టీ సాహిత్యాన్ని సమర్థవంతంగా వినియోగించలేకపోవుట ఎన్నికల అవగాహనల సంప్రదింపులు నామినేషన్ రోజు వరకు కొనసాగుట పార్టీ కేంద్రం నుండి మార్గదర్శికత్వంలోపించుట, పరిస్థితులను మెరుగుపరచకపోగా, బంధనాలు అయ్యాయి, అని సి.పి.ఐ అభిప్రాయంగా వుంది. ఇవన్నీ ప్రజలలో, పార్టీలో కొంత గందరగోళానికి కారణమైందని సమీక్ష స్పష్టంగా పేర్కొన్నది.[1]

## 3.7. తమిళనాడు

తమిళనాడులో "ఎఐఎడియంకె" రాష్ట్ర ప్రభుత్వాన్ని కేంద్ర ఇందిరాగాంధీ ప్రభుత్వం బర్తరఫ్ చేసిన తరువాత "ఎఐఎడియంకె"పార్టీ అఖిలపక్ష సమావేశాన్ని మద్రాసులో 21 ఫిబ్రవరి 1980న, 16 పార్టీలు పాల్గొనగా యేర్పాటు చేసింది. అవి "ఎఐఎడియంకె", సి.పి.ఐ., సి.పి.ఐ(యం), గాంధీ కామరాజ్ జాతీయ కాంగ్రెసు, ఫార్వర్డుబ్లాక్, తమిళనాడు కామరాజ్ కాంగ్రెసు; తమిళనాడు ముస్లింలీగ్; రిపబ్లికన్ పార్టీ; లోక్‌దళ్; ఉర్స్ కాంగ్రెస్, ఆఫ్ ఇండియాముస్లింలీగ్; ముస్లిం యూత్‌లీగ్; క్రిష్టియన్ డెమోక్రటిక్‌ఫ్రంటు; టాయిలర్స్ ప్రోగ్రెసీవ్‌పార్టీ; జనతాపార్టీ; ద్రవిడ కజగం (చీలినగ్రూపులు) పాల్గొన్నవి. మద్రాసులో మార్చి 12న బ్రహ్మాండమైన ప్రజాప్రదర్శన జరుగగా పోలీసులు లాఠీచార్జి చేసారు. డి.యం.కె. వర్గాలు వూరేగింపుపై దాడిచేసారు. అంత్యంత పెద్ద ప్రజావాహినితో సభ ముగిసింది. కేంద్రప్రభుత్వపు వైఖరిపై ఉపన్యాసకుల దాడి కేంద్రీకరించబడింది. వివిధ జిల్లాలలో 16, మార్చిన పెద్దఎత్తున ప్రదర్శనలు జరిగాయి.

"ఎఐఎడియంకె" ఫిబ్రవరి 24 సమావేశంలో కార్యక్రమంపై ఆధారపడి ఐక్యసంఘటను, ప్రభుత్వాన్ని యేర్పరచే వైఖరిని చేబట్టింది. అన్ని కేంద్రాలలో ప్రజాప్రదర్శనకు ప్రజలమద్దతు పూర్తిగా లభించుటను చూచి, సంప్రదింపులలో తనకు

1. పార్టీలైఫ్. వా.16., సం14., పే.7-8.

కేటాయించువలసిన సీట్ల సంఖ్యను పేర్కొనకుండా అత్యధిక మెజారిటి సీట్లను తనకే కేటాయించాలని చెప్పసాగింది.

త్రిచూర్ జిల్లాలో కరూర్‌లో సి.పి.ఐ రాష్ట్ర సమితి సమావేశమై కార్యక్రమపాతిపధికపై "ఎఐఎడియంకె"తో ఐక్యసంఘటన యేర్పాటుకు, తమ సంసిద్ధతను నిర్ణయించింది. అయితే, వారికేంద్ర నిర్వాహకవర్గ సమావేశంలో యీ ప్రతిపాదన చర్చకు వచ్చినపుడు, పార్టీ కేంద్రం యెన్నికల సర్దుబాటులకు మాత్రం ఆమోదించి, మార్గదర్శిక సూత్రాలను సూచించింది. వాటి ననుసరించే సి.పి.ఐ రాష్ట్ర కార్యానిర్వాకవర్గం, సంబంధిత పార్టీలన్నిటితో సంప్రదింపులు ప్రారంభించింది.

అదే కాలంలో సి.పి.ఐ(యం), సి.పి.ఐ ల మధ్య రెండు పార్టీలు చెరిసగం స్థానాలలో, సర్దుబాటులు చేసుకొని పోటీ చేయుట రెండు పార్టీలు సంయుక్తంగా "ఎఐఎడియంకె" తో సంప్రదింపులు చేయుటకు వొక అవగాహనకు వచ్చాయి. ప్రధాన ఆధిక్యతగల పార్టీగా ఎన్నికల ప్రణాళికను ప్రకటించుట, ప్రభుత్వాన్ని యేర్పరచుట అనే లక్ష్యాలను ఆమోదించారు. సి.పి.ఐ., సి.పి.ఐ(యం) ప్రణాళికలో చేర్చుటకు తమ అభిప్రాయాలను సంయుక్త అంశాలుగా ప్రతిపాదించి, వొత్తిడి చేసారు. ఈ ఎన్నికలలో వోట్లు చీలిపోవుటను నివారించుటకు జనతా పార్టీని గూడ చేర్చుకోవాలనే అంశంపై గూడ రెండు పార్టీలు వొక సాధారణ సమిష్టి అవగాహనకు వచ్చాయి.[1]

ఏప్రిల్ 1980లో సి.పి.ఐ; సి.పి.ఐ(యం) లు సంయుక్తంగా "ఎఐఎడియంకె" తో సంప్రదింపులు జరిపారు. ఎన్నికల సంఘటనలోని 14 పార్టీలలో 3 పార్టీలు సీట్లు అడుగలేదు. ఫార్వర్డు బ్లాకు సంఘటనలోనికి తీసుకొనబడి ఒక సీటు పోటీచేయుట కివ్వబడింది. సి.పి.ఐ; సి.పి.ఐ(యం)లకు చెరి 15 సీట్లు కేటాయించబడినవి. సీట్లకేటాయింపు ఒప్పందం యిలావుంది. "ఎఐఎడియంకె" 169; ఇందుండి 2 కామారజ్ కాంగ్రెసుకు; సి.పి.ఐకు 16; సి.పి.ఐ(యం) కు 16; జాతీయ కాంగ్రెసుకు 12; తమిళనాడు కామరాజ్ కాంగ్రెసు6; ఫార్వర్డుబ్లాకు 5; ఉర్స్ కాంగ్రెసు 3; లోక్‌దళ్‌కు 2; తమిళనాడు ముస్లింలీగ్‌కు 1, క్రిస్టియన్ డెమాక్రటిక్ ఫ్రంటు 1, ఆలిండియా రిపబ్లికన్ పార్టీకి 1 కేటాయించబడినవి. జనతా పార్టీకి 27 సీట్లుకేటాయించినా యెక్కువ కావాలని 94 సీట్లు పోటీ చేసి 2 సీట్లు గెలచింది.

కాంగ్రెసు (ఐ); డి.యం.కె; ముస్లింలీగు సంఘటన లేక కూటమి తమిళనాడులో లోక్‌సభ ఎన్నికల ముందు యేర్పడినది. అదే అసెంబ్లీ ఎన్నికలలో కూడ కొనసాగింది. ఈ కూటమి, "ఎఐఎడియంకె" లోని కొన్ని వర్గాల పార్టీలను తన వైపు త్రిప్పుకొన ప్రయత్నించింది. ఫలితంగా టాయిలర్స్ ప్రోగ్రసీవ్‌పార్టీ, జాతీయ ఫార్వర్డ్‌లను వారి సంఘటనలో చేర్చుకొనుట జరిగింది. అధికార ఫార్వర్డుబ్లాకు "ఎఐఎడియంకె" నాయకత్వంలోని ఫ్రంటులోనే చేరింది.[2]

---

*1&2 మాణిక్యం పి. (1980) తమిళనాడు అసెంబ్లీ ఎలక్షన్స్ పార్టీలైఫ్. వా.16., నం14., పే.23-25.*

కాంగ్రెసు (ఐ), డి.యం.కె సంఘటనలో సీట్లు గుర్తించి, సర్దుబాట్లు చేసుకొనుటలో కాలాతీతం జరిగింది. ముఖ్యమంత్రి సమస్యపై తీవ్ర అభిప్రాయభేదాలు, చివరకు ఇందిరాగాంధీ పరిష్కారం చేయుటతో, కాంగ్రెసు (ఐ)లో ముఖ్యమంత్రి విషయమై, డి.యం.కె పక్షంలో సీట్లను గుర్తించుటలో తీవ్ర అసంతృప్తి కారణంగా, అనేక స్థానాలలో అపజయం పొందారు.

'ఎఐఎడియంకె' నాయకత్వంలోని ప్రజాస్వామ్య సంఘటనలోని భాగస్వామ్య పార్టీల విజయాలు ఇలా ఉన్నవి. ఎపడియంకె 129, ఒక తిరుగుబాటు దారుడు గెలిచితిరిగి మాతృసంస్థలో చేరుటతో 130, సి.పి.ఐ.(యం) 11, సి.పి.ఐ. 10, గాంధీ కామరాజ్ జాతీయ కాంగ్రెస్ 6, తమిళనాడు కామరాజ్ కాంగ్రెసు 3, ఫార్వర్డు బ్లాక్, లోక్‌ధళ్, క్రిస్టియన్ డెమాక్రటిక్ ఫ్రంట్ 1చొప్పున స్థానాలలో గెలుపొందారు.

కాంగ్రెస్(ఐ), డి.యం.కె లనాయకత్వంలోని ఫ్రంటు పొందిన సీట్లు ఇలా వున్నవి. డి.యం.క.౩౮, కాంగ్రెస్(ఐ) ౩౦, యూనియన్ ముస్లింలీగ్ 1 స్థానాలలో గలుపొందాయి. కాంగ్రెస్(ఐ), డి.యం.కె లు మొత్తం మీద తాము వోడిపోవుటకు పరస్పరం కారణంగా వాగ్వివాదాలు, నిందలు వేసుకొన్నారు.

ఎన్నికల ప్రచారోధ్యమాలలో "ఎఐఎడియంకె" వామపక్షాలు సంఘటనలోని భాగస్వామ్య పార్టీలు అందరూ సమిష్టిగా, పొరపొచ్చాలు లేకుండా పాల్గొన్నారు. అదే వారి విజయాలకు కారణమైంది. అందువలన ప్రారంభ అంచెనాలకు మించిన విజయాలను "ఎ ఐఎడియంకె," సి.పి.ఐలు పొందాయి.

## 3.8. పంజాబ్

ఎన్నికలు గోధుమకోత, నూర్పిడి కాలంలో వచ్చినప్పటికి 64.4శాతం పోలగుట ప్రజల ఆసక్తిని, వుత్సాహాన్ని తెల్పుతుంది. ఎన్నికల పోరాటం ప్రధానంగా రెండు పక్షాలు, ఒకటి కాంగ్రెసు (ఐ) మరొకటి సంయుక్త ఎన్నికల సంఘటనల మధ్య జరిగింది. ఐక్యసంఘటన ప్రదానంగా అకాలీదళ్, సి.పి.ఐ; సి.పి.ఐ(యం) మూడు పార్టీలతో యేర్పడింది. కాంగ్రెసు (ఐ) మొత్తం 117 సీట్లన్ని పోటీచేయగా, సంఘటన 101 స్థానాలలోనూ, స్వతంత్రులను 5 స్థానాలలోనూ పోటీకి నిలిపింది. సంఘటన జనతా (జె.పి) అభ్యర్థులను 2 స్థానాలలోను, స్వతంత్రులను 5, కాంగ్రెసు (ఉ)1 స్థానంలోను బలపరచింది. కాంగ్రెసు (ఐ)63 సీట్లలో గెలుపొందినా, ఐక్యసంఘటన బలమైన పోటీనిచ్చింది. లోక్‌సభ ఎన్నికలలో కాంగ్రెసు (ఐ) 52.1 శాతం వోట్లు సంపాదించగా, అసెంబ్లీ ఎన్నికలలో 45.1శాతం మాత్రమే సంపాదించుట, కొంతబలాన్ని కోల్పోవుటను తెల్పుతుంది. సి.పి.ఐ వోటరుల బలం యీ ఎన్నికలలో 7-నుండి-9కి పెరిగింది. సి.పి.ఐ(యం) బలం 8.0నుండి5.0శాతానికి తగ్గిపోయింది. పోలైన వోట్లు సి.పి.ఐకి 1977లో 6.59శాతం కాగా 1980లో 6.5శాతం, సి.పి.ఐ(యం) క్రమంగా 3.5, 4.4శాతాలైనవి. అకాలీదళ్ యీ ఎన్నికలలో వామపక్షపార్టీలు ఎన్నికల వొప్పందానికి వచ్చింది, గతంలో లోక్‌సభ ఎన్నికలలో సి.పి.ఐ తో జరిగిన ఎన్నికల వొప్పందాన్ని

భగ్నం చేసి, జనసంఘం అధిపత్యంలోని జనతాపార్టీతో వొప్పందం చేసుకొని 37సీట్లు గెలుపొందింది. లోక్‌సభ ఎన్నికలలో దాని అభ్యర్థులు 22 స్థానాలలో 23.4 శాతం వోట్లు సంపాదించారు. బి.జె.పి 41 స్థానాలలో పోటీ చేసి 4 సీట్లు మాత్రం గెలిచింది. 21స్థానాలలో డిపాజిట్లు కోల్పోయింది. రద్దు చేయబడిన అసెంబ్లీలో 12స్థానాలను కలిగివుంది.

పంజాబ్ రాష్ట్ర సి.పి.ఐ సమితి 1) మార్చిలో అసెంబ్లీ ఎన్నికలపై వొక తీర్మానాన్ని ఆమోదించింది. బి.జె.పి ఎన్నికల లక్ష్యాలను వ్యతిరేకించుట 2) ఆర్.యస్.యస్; జనసంఘం ఆధిక్యత లోగల జనతాపార్టీని బలహీనపరచి, ప్రజలనుండి దూరం చేయుట 3) వామపక్ష ప్రజ స్వామ్య ప్రాతినిధ్యాన్ని రాష్ట్ర అసెంబ్లీలో పెంచుట 4) సి.పి.ఐ ప్రాతినిధ్యాన్ని పెంచుట, మొదలైన నాలుగు అంశాలను లక్ష్యంగా పెట్టుకొన్నది[1].

ఈలక్ష్య సాధనకు యీ క్రింది ఎత్తుగడల విధానాన్ని రూపొందించింది. సి.పి.ఐ; సి.పి.ఐ(యం) ల మధ్య సహకారం, అత్యున్నత సమన్వయాలకు అత్యంత ప్రాముఖ్యనిచ్చుట. రెండు పార్టీలు కలసి సమిష్టి కనీస కార్యక్రమం ప్రతిపాదించాలని ఆమోదించింది. మిగిలిన ఎత్తుగడల ప్రధానాంశాలు యీ క్రింది విధంగా వున్నవి.

ప్రధానాంశాలు 1) కాంగ్రెసు (ఐ), ఆర్.యస్.యస్ జనసంఘాల ఆధిక్యతలోని జనతాపార్టీతో కూడ ఎన్నికల అవగాహనలు, సీట్లు సర్దుబాటులు వుండవు. 2) కాంగ్రెసు (ఐ) నియంతృత్వాన్ని, మత, కుల నియంతృత్వాలను వ్యతిరేకించే పార్టీలతో ఎన్నికల అవగాహనలు, సీట్లు సర్దుబాటులు 3) అకాలీ పార్టీ లోక్‌సభ ఎన్నికల ఫలితాలనుండి, అకాలీ-జనతా సంకీర్ణ ప్రభుత్వ ప్రజావ్యతిరేకచర్యలు ప్రతిఘటించుట, లౌకిక ప్రజాస్వామ్య విధానాన్ని కాపాడుటలోని ప్రభుత్వ వైఫల్యాన్ని ప్రతిఘటించుటయేగాక అకాలీదళ్, ఆర్.ఎస్.ఎస్., జనసంఘం, శిక్కుస్థాన్‌కు పాటుబడే లాంగోవాలా నుండి బయటపడి ప్రతిఘటించుటలో వైఫల్యం స్పష్టంగా గమనించవలసియున్నది.

శిరోమణి అకాలీదళ్, సి.పి.ఐ, సి.పి.ఐ(యం)లు 20మార్చి 1980న సమావేశమై, చర్చలు జరిపి కాంగ్రెసు (ఐ) గుత్తాధికారాన్ని అంతం చేయుటకు, లోక్‌దళ్, కాంగ్రెసు(ఉ)లు హేతుబద్ధవైఖరి చేబట్టితే సీట్లు సర్దుబాటు చేసుకొనుటకు, వొప్పందం కుదిరింది. అదే కాలంలో అకాలీదళ్ కొన్ని సీట్లలో జనసంఘంతో సర్దుబాటు తిరస్కరించబడింది. పై సూత్రాలేగాక మూడు పార్టీలు యేకగ్రీవంగా, ఆమోదించితే తప్ప అమలు కావు, అని వొప్పందంలో స్పష్టంగా నిర్వచించబడింది. అకాలీలు ఏకపక్షంగా కొన్ని స్థానాలలో చాటుగా బి.జె.పి అభ్యర్థులను బలపరచారు. అంచేత సీట్లుకేటాయింపులో, సర్దుబాటులలో అకాలీదళ్ ప్రతినిధులతో కొన్ని యిబ్బందులు ఎదుర్కొనవలసివచ్చింది.[2]

---

*1. పంజాబ్ అసెంబ్లీ ఎన్నికల రివ్యూ.సి.పి.ఐ. రాష్ట్ర కమిటీ జూన్ 1980లో ఆమోదించినది. పార్టీలైఫ్. వా.16., నం14., పే.10.*

*2. -- అదే -- పే.11.*

మూడుపార్టీల ఎన్నికల సర్దుబాటులు చివరకు అకాలీదళ్ 72 సీట్లలో సి.పి.ఐ. 18 సీట్లలో, సి.పి.ఐ(యం) 13సీట్లలో కేటాయింపు, కొన్ని భేదాభిప్రాయాలున్నప్పటికి, ఆచరణ వొప్పందంకుదిరింది. ఎన్నికలలో అకాలీదళ్ 37, సి.పి.ఐ. 9, సి.పి.ఐ(యం) 5స్థానాలోను గెలుపొందారు.

వామపక్ష ఐక్యత యేర్పడనందున సి.పి.ఐ., సి.పి.ఐ(యం)లు అకాలీదళ్‌తో సంప్రదింపులలో, రెండుకమ్యూనిష్టు పార్టీలు సంయుక్తవైఖరి అవలంభించుటలోని వైఫల్యాన్ని అకాలీదళ్ వినియోగించుట జరిగింది. సి.పి.ఐ. మొదట 40 కేటాయించబడాలనికోరి చివరకు 20సీట్లు పైనిలబడుటకు సి.పి.ఐ(యం) తీవ్రంగా విమర్శించింది. మూడు పార్టీలలో ఎవ్వరూ ఏకపక్షంగా ఎవ్వరితో వొప్పందం చేసుకొనరాదని ప్రారంభంలో వొప్పందం చేసుకొన్నా సి.పి.ఐ(యం) అకాలీపార్టీతో 13 సీట్లు తమ పార్టీకి కేటాయించునట్లు వొప్పందం చేసుకొన్నందున, అకాలీదళ్ సిపి.ఐ.కి సీట్లుకేటాయింపులో మొండిపట్టుగా వ్యవహరించుటతో మరోమార్గం లేక సి.పి.ఐ అంగీకరించింది. వామపక్ష ఐక్యత లేనప్పుడు యేదోవొక పార్టీ పెద్దబూర్జువా పార్టీతో "మంచిగావుండే ప్రయత్నం" సహజంగానే వామపక్షశక్తులను బలహీనపరుస్తుంది.

పంజాబ్ అనుభవాలు వామపక్షశక్తులు ముఖ్యంగా సి.పి.ఐ(యం) సి.పి.ఐ లపై యెంతటిబృహత్తర భాధ్యతవుంది తెల్పుతుంది. ఎన్నికల సమయంలో, "అతుకుల బొంత", తాత్కాలిక అచరణలతో సంతృప్తి చెందక. పోరాటఉద్యమలతో పాటు, ప్రజాసమసమస్యలపైఎల్లప్పుడు ఐక్యకార్యాచరణ, విస్తృత ఐక్యపోరాటఉద్యమాలుపిర్మించే ప్రాధమిక మౌళికచర్యలుచేబట్టుట వలననే పోరాట ఐక్యత సంఘటనలు రూపొందుతవి, వాటికి నిర్దిష్టస్థిరస్వరూపం యేర్పడుతుంది.

### 3.8. ఆంధ్రప్రదేశ్ 1985 అసెంబ్లీ ఎన్నికలు

### i) లోక్‌సభ 1984 ఎన్నికలు

అసెంబ్లీ ఎన్నికలకు రెండు మాసాల ముందు జరిగిన లోక్‌సభ ఎన్నికల గురించి తెలుసుకొందాము. ఇందిరాగాంధీ దారుణంగా హత్య చేయబడిన నేపధ్యంలో బ్రహ్మాండమైన సానుభూతి వెల్లువను ఎన్నికల విజయంగా మార్చుటకు, కాంగ్రెసు (ఐ) అఖిలభారతస్థాయిలో జాతీయ ఐక్యత, రక్షణ, జాతీయసమగ్రత నినాదాలతో ఎన్నికల రంగంలోనికి దిగి, 49 శాతము వోట్లను, లోక్‌సభలో 400స్థానాలను కని, వినియెరుగని విజయాన్ని పొంది అందరిని ఆశ్చర్యచకితులను చేసింది.

దేశమంతటా యింతటి ఘనవిజయాన్ని సాధించినా ఆంధ్రప్రదేశ్‌లో 40 స్థానాలలో 6స్థానాలలో మాత్రమే గెలుపొంది, అంతటి ఘనవైఫల్యాన్నే ఎదుర్కొన్నది. అంచేత ఆంధ్రప్రదేశ్ ఎన్నికలకు వొక ప్రత్యేకతవుంది. అదేమిటో చూద్దాము తెలుగుదేశం పార్టీ 28స్థానాలలోను, దానితో సీట్లు సర్దుబాటుచేసుకొన్న సి.పి.ఐ., సి.పి.ఐ(యం), జనతా, కాంగ్రెసు (యస్), బి.జె.పి తలావొక సీటులో విజయాన్ని పొందాయి. మజ్లీస్ కూడ

ఒక సీటులో గెలచింది. అనగా, కాంగ్రెసు (ఐ) వ్యతిరేక ప్రతిపక్ష పార్టీలు అన్నీ కలిసి. 34స్థానాలలో వోడించాయి. భారతదేశమంతటా ఇందిరాగాంధీ సానుభూతి వెల్లువలో విజయభేరి మ్రోగించినా, ఆంధ్రప్రదేశ్‌లో చారిత్రాత్మక ఘోరపరాజయ నేపథ్యాన్ని చూద్దాము. ఈసందర్భంలో 1983లో సంవత్సరం క్రింద జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో కాంగ్రెసు (ఐ) 33.6శాతం పొందగా. నామమాత్రంగా సానుభూతి వెల్లువ వుండటవలన 42శాతం వోట్లను పొందడం ఆంధ్రప్రదేశ్‌లో కూడ జరిగింది. అయినా, ప్రతిపక్షాల వోట్లు చీలకపోవుటతో, గెలుపొందిన సీట్ల శాతం బాగా పడిపోయింది.

తెలుగుదేశపు యీ బ్రహ్మాండ విజయానికి కారణం, కాంగ్రెసు (ఐ) ఆగస్టు 1984లో తెలుగుదేశంలో నాదెండ్ల భాస్కరరావు నాయకత్వంలో 60మంది తిరుగుబాటు దారులను పోత్సహించి, బలపరచి, అతని నాయకత్వంలో తిరుగుబాటు ప్రభుత్వాన్ని నీతి బాహ్యంగా, చట్ట సమ్మతం లేకుండా యేర్పరచింది. దీనికి వ్యతిరేకంగా బ్రహ్మాండమైన ప్రజా పోరాటం సాగింది. 30 రోజులలో తదనంతరం జరిగిన బల పరీక్షలో పోటీ, తిరుగుబాటు ప్రభుత్వం వోడిపోయింది. యన్.టి.ఆర్. మెజారిటి రుజువుకాగా, రామారావు ప్రభుత్వం తిరిగి గద్దె నెక్కింది. రామారావు ప్రభుత్వాన్ని బలపరస్తూ బ్రహ్మాండమైన ప్రజావుద్యమం కొనసాగింది. లోక్‌సభ ఎన్నికలలో కాంగ్రెసు (ఐ) ఘోరపరాజయానికి యిదే ప్రధాన కారణము. ఇదే విధంగా జమ్మూ-కాశ్మీర్; సిక్కింస్టేటులలో ఘోర పరాజయానికి కారణం, ప్రజాస్వామ్యాలపై కాంగ్రెసు (ఐ) జరిపిన చట్టవ్యతిరేకదాడులు. "ప్రజాస్వామ్య పునరుద్ధరణోద్యమాన్ని బలపరస్తూ పార్టీలన్నిటితో తెలుగుదేశం పార్టీ సీట్ల సర్దుబాటు. పరస్పరం బలపరచుకొను వొప్పందాన్ని చేసుకొనుట కూడ మరో ముఖ్యకారణము. అంతేగాక, తెలుగుదేశపు పార్టీ పాలన కాలం చేబట్టిన కిలో 2రు.ల బియ్యం పథకం, విద్యార్థులకు మధ్యాహ్న ఉచిత భోజన పథకము తెలుగుదేశపార్టీ, దాని మిత్రుల బ్రహ్మాండ విజయానికి, కాంగ్రెసు (ఐ) ఘోరపరాజయానికి కారణాలయ్యాయి.

## ii) కమ్యూనిష్టుల ఎన్నికల విధానాలు.

కమ్యూనిస్టులు, తదితర ప్రతిపక్షపార్టీలు "ప్రజాస్వామ్య పునరుద్దణోద్యమం"లో తెలుగుదేశం పార్టీ ప్రజావుద్యమంలో చురుకుగా పాల్గొన్నవి. తెలుగుదేశం పార్టీలోని శాసనసభ్యులు కొందరు ఎన్.భాస్కరరావు నాయకత్వంలో తిరుగుబాటుచేసి, చీలిపోవుటతో మైనారిటి అయిన దానిని, కమ్యూనిస్టులు, తదితర ప్రతిపక్ష పార్టీలతో కలసి, కాంగ్రెసు (ఐ)కు వ్యతిరేకంగా మద్దతునిచ్చి, శాసనసభలో రామారావుకు మెజారిటి వచ్చునట్లు చేసారు. ఈ నేపథ్యంలో తెలుగుదేశంపార్టీతో సీట్లు సర్దుబాట్లు జరిగాయి. మిగతా ప్రతిపక్షాలు యిదే విధానాన్ని అవలంభించాయి. తెలుగుదేశంపార్టీ సి.పి.ఐని ఖమ్మం, భద్రాచలం నియోజకవర్గాల నుండి పోటీ చేయమని ప్రతిపాదించింది. సి.పి.ఐ 3-4 స్థానాలలో పోటీ చేయ నెంచినా, తెలుగుదేశం ఆమోదించలేదు. వారి రాష్ట్ర కార్యవర్గం ఆ రెండు స్థానాలలోనే పోటీ చేయుటకు అంగీకరించింది. సి.పి.ఐ(యం) కు

మిర్యాలగూడెం, తెనాలి స్థానాలు రెండు స్థానాలు కేటాయించబడగా, తెనాలి వదలివేసి సి.పి.ఐ.తో పోటీ పడుటకు ఖమ్మం సీటుకు వచ్చింది. ఖమ్మంలో తెలుగుదేశం పార్టీ సి.పి.ఐని బలపరచిన యెడల లేక తటస్థంగా వుండినా, తెలుగుదేశం పార్టీతో జరిగిన వొప్పందం రద్దు చేయబడుతుందని బెదరించింది. సి.పి.ఐ అభ్యర్థికి వ్యతిరేకంగా సి.పి.ఐ(యం) తీవ్ర ప్రచారంగావించింది. భద్రాచలం నియోజవర్గంలో సి.పి.ఐ అభ్యర్థిని వోడించుటకు స్వతంత్ర అభ్యర్థి బాపన్నదొరకు మద్దతు నిచ్చింది. ఇంత జరుగుతున్నా మిర్యాగూడెంలో సి.పి.ఐ (యం) అభ్యర్థికి అనుకూలంగా సి.పి.ఐ తన అభ్యర్థిపోటీని వుపసంహరించుకొన్నది. యిది కూడ సి.పి.ఐ(యం) లో యేవిధమైన సుముఖ పరిణామాన్ని తీసుకురాలేకపోయింది. ఈవిధంగా, సి.పి.ఐ అభ్యర్థులను వోడించుటకు సి.పి.ఐ (యం) నేరుగా ఖమ్మంలో, పరోక్షంగా భద్రాచలంలో ప్రయత్నాలు చేసింది. ఖమ్మం సీటులో రెండు కమ్యూనిస్టుపార్టీలు పోట్లాడుకుంటున్నవని, తెలుగుదేశం ఆ జిల్లా కమిటి నిర్ణయించాలని కోరగా, సి.పి.ఐ కి మద్దతు లభించింది. తెలుగుదేశంలోని కొన్నివర్గాలు సి.పి.ఐ.(యం)ని బలపరిచారు. రామారావు తెలుగుదేశంపార్టీ కార్యకర్తలకే అవిషయం వదిలి వేసారు. ఖమ్మంలో ప్రచారం చేయుటకు వాగ్దానం చేసినా, సి.పి.ఐ.(యం) వ్యతిరేకించుటతో మానివేశారు, ఎవరినీ బలపరుచుటలేదని ప్రకటన చేయగా సి.పి.ఐ(యం) దానిని లక్ష ప్రతులు ప్రింటు చేయించి, పంపకం చేసింది. వీటన్నిటిని ఫలితంగా తెలుగుదేశం పార్టీని బలపరచే వోటరులు, సి.పి.ఐ అభ్యర్థిని బలపరచుటలో చీలిపోయి గందరగోళంలో పడ్డారు. ఈవిధంగా ఖమ్మం సీటులో కాంగ్రెసు (ఐ) గెలిచిందిం. ఈ సీటులో సి.పి.ఐ అభ్యర్థిని వోడించింది కాంగ్రెసు కాదు సి.పి.ఐ (యం) అనుట సత్యదూరంకాదు. భారతకమ్యూనిస్టు ఉద్యమంలో యిదొక "నల్లని చారిత్రికమచ్చ" చరిత్రలో ఆవిధంగానే లిఖంచబడుతుంది.

## iii) అసెంబ్లీ 1985 ఎన్నికలు సి.పి.ఐ

కాంగ్రెసు (ఐ)ని వోడించుటకు సి.పి.ఐ తెలుగుదేశంపార్టీతో సీట్లు సర్దుబాటులు చేసుకుని, 15స్థానాలలో పోటీ చేయ నిర్ణయించుకొన్నది. ఆ 15 సీట్లులోనే సి.పి.ఐ ప్రజాబలం ప్రతిబింబించదని తెలుసు. ప్రధాన లక్ష్యసాధనకు 15సీట్లకే ఆమోదం తెలిపింది. విజయం మాత్రం 11స్థానాలలోనే లభించింది, 3 సీట్లు నల్లగొండ జిల్లాలో, 2 సీట్లు కరీంనగర్ జిల్లాలో ఖమ్మం, కృష్ణా, గుంటూరు, అనంతపూర్, మెదక్, ఆదిలాబాద్ జిల్లాలలో ఒక్కొక్క సీటులో గెలుపొందింది. ఈ ఎన్నికలలో తెలుగుదేశం పార్టీ మద్దతు సి.పి.ఐకి లభించింది. అదేవిధంగా సి.పి.ఐ అనేక సీట్లలో తెలుగుదేశం అభ్యర్థులను బలపరచింది. అదేకాలంలో సి.పి.ఐ మతతత్వ బి.జె.పి ని వ్యతిరేకించింది, కాని పోటీ బి.జె.పి కాంగ్రెసు మధ్య జరుగుతున్నపుడు తటస్థంగా వుంది. జనతాపార్టీనిగూడ సి.పి.ఐ ఎన్నికలలో బలపరచింది. అదేవిధంగా యం.సి.పి.ఐ అభ్యర్థులను తాము పోటీ చేయని చోట్ల బలపరచింది.

కాంగ్రెసు (యస్) నాయకత్వానికి రాష్ట్రీయ స్వయంసేవకసంఘం భారతీయ జనతాపార్టీతో చేతులు కలుపుటకు కొన్ని పరిమితులు, పరిస్థితులు ఆటంకంగా వున్నందున లోక్‌దళ్, జనతా నాయకులతో కలసి ప్రచార ఆందోళనలు చేబట్టుటకు "సమన్వయకమిటీ"ని యేర్పాటు చేసింది. కొన్ని ప్రత్యేక సమస్యలపై లోక్‌దళ్ అధ్యక్షుడు చౌదరి చరణ్‌సింగ్ హర్యానాలోని బివానీలో జరిగిన మహాసభకు ఆర్.యస్.యస్., బి.జె.పి నాయకుడు వాజ్‌పాయిని ఆహ్వానించి, సంప్రదింపులు జరిపారు. లోక్‌దళ్ నాయకత్వం వొకవైపు కాంగ్రెస్ (యస్) తో సంఘటన, మరో వైపున బి.జె.పి., ఆర్.యస్.యస్‌లతో సఖ్యత అనే ద్విముఖ ఎత్తుగడలు, వారుతలపెట్టిన అన్ని ప్రతిపక్షాల కాంగ్రెసు వ్యతిరేక ఫ్రంటును బి.జె.పి ని కూడ కలుపుకొని యేర్పాటు చేయాలనే వారి లక్ష్యాన్ని అనుసరించియే వున్నది.

కాంగ్రెసు (ఐ) ప్రజాస్వామ్య సూత్రాలను, జాతీయోద్యమ సాంప్రదాయాలను గాలికి వదలి వేసి, కాంగ్రెసేతర రాష్ట్ర ప్రభుత్వాలను, గవర్నర్‌ల వ్యవస్థను వినియోగించి రద్దు చేయుట, కాంగ్రెసు (ఐ) ప్రజల నుండి దూరమగుటకు దారి తీసింది. ఈ అవగాహనతో అక్టోబరు 1984లో సి.పి.ఐ. ఎన్నికలలో, సి.పి.ఐ(యం), తదితర వామపక్షాలతో, ప్రజాస్వామ్య పక్షాలతో కలసి ఐక్యసంఘటనను యేర్పరచి, కాంగ్రెసు (ఐ)ను వోడించుటయేగాక, మతతత్వ భారతీయ జనతాపార్టీని, వారి ప్రధానంగా మద్దతు నిచ్చే రాష్ట్రీయ స్వయంసేవక సంఘపు కవాతు దళాలను వోడించుటను లక్ష్యంగా పెట్టుకొన్నది.

## 4.3 రాష్ట్రీయ స్వయం సేవక సంఘం దాని రాజకీయపార్టీ బి.జె.పి.

అర్ధశతాబ్దంపైగా తన రాజకీయ సిద్ధాంతాలను సంస్కృతి సంఘం అనే ముసుగుతో "లాఠీ కవాతు దళాలను" తయారు చేసుకొని నేడు రాజ్యాధికారం కోసం అర్రులు చాస్తున్నది. అప్రదిష్టపాలైనపుడు రూపాంతరం చెందుతు "హిందూ మహాసభ", "జనసంఘం", "జనతాపార్టీ", నేటి రాజకీయ రూపమైన "భారతీయ జనతా పార్టీగా అవతరించిన ఆర్.యస్.యస్. రాజకీయ పార్టీ రూపంలో వున్న, హిందూమతతత్వ నిరంకుశత్వం మూర్తిభవించి "మను ధర్మాలను", "చాణుక్య రాజకీయసూత్రాలను" మతమారణహింసా, దౌర్జన్యాలను రాజకీయ విధానాలుగా అనుసరిస్తున్నది. అప్రదిష్టపాలైన విధానాలకు మరో ముసుగు వేసి, తన ఎత్తుగడలను మార్చుకొని సంక్షోభ భరితమైన రాజకీయ రంగంలో ప్రవేశించింది. అంతమాత్రం చేతవారి అభిలాష, లక్ష్యం నెరవేరదని, యితర బూర్జువా పార్టీలతో తాత్కాలిక అవసరాలుకు కలుస్తూ, విడిపోతూ ఇతర పార్టీలను చీలిస్తూ, విస్తరణ కార్యక్రమాలు "మతకల్లోలాలను సాధనాలుగ" చేసుకొన్నారు. హిందూ మతతత్వదురహంకారులు, ప్రజలలో సన్యాసుల యెడల గల ప్రేమాభిమానాలను, పూజ్య భావనలను వినియోగించుకొనుటకు "కాషాయరంగు పులుముకొనుటయేగాక, గాంధీజీ హంతక మతావాదులు "తాము నిజమైన గాంధీయన్ సోషలిస్టులమని" కూడ కొంతకాలం, నేడు తామే "అసలు సిసలైన లౌకికవాదుల"మని

రంగులు మార్చుతు ప్రజలను మభ్యపెట్టచూస్తున్నారు. తస్మాత్ జాగ్రత్త! ప్రజలు మరోసారి మోసపోవుటకు సిద్ధంగా లేరు.

నేడు రాష్ట్రీయస్వయం సేవక సంఘం, భారతీయ జనతాపార్టీలు "కార్యాచరణ ఐక్యత" అనే పేరుతో యితర రాజకీయపార్టీలు, వర్గాలకు చేరువగుటకు, అదే క్రమంలో బలమైన ప్రతి పక్షంగా, కాంగ్రెసుకు గౌరవప్రదమైన జాతీయ ప్రత్యామ్నాయంగా రూపొందు లక్ష్యంతో, అధికార పీఠాన్ని అధిరోహించు రాజకీయ వ్యూహాన్ని, ఎత్తుగడలు చేపట్టారు. వారి పాత నగ్నమతకల్లోలాలను సృష్టించే ఎత్తుగడలు కుళ్ళికంపుగొట్టుటతో "జాతీయతారంగుతో" ప్రత్యక్షమయ్యారు. లోక్‌సభకు జరిగిన బై ఎలక్షనులు, మధ్యప్రదేశ్, గుజరాత్, బీహారు రాష్ట్రాలలో అసెంబ్లీలలో కొన్ని సీట్లలో విజయం పొందుటతో మితవాద బూర్జువా ప్రతిపక్ష పార్టీలవారి యీ చొరపాటు, విస్తరణ ప్రయత్నాలకు కొంత తోడ్పాటు లభించింది. వారి ఆశ, వ్యూహం హిందీ భాషా ప్రాంతాలలో ఎన్నికల విజయాలు పొందాలంటే భారతీయ జనతాపార్టీ మద్దతు కీలకమైనదనే కొన్ని బూర్జువా ప్రతిపక్షపార్టీల, గ్రూపుల అంచెనాలు, అవగాహనలను ఆధారం చేసుకొని,తమ "కార్యాచరణ ఐక్యతా" ముసుగుతో విస్తరించనెంచారు.

బి.జె.పి యీ వ్యూహానికి, ఎత్తుగడలకు, మతతత్వ, అభివృద్ధి నిరోధక ప్రతిపక్షాల ఐక్యతను బి.జె.పి. ఆర్.యస్.యస్ పునాదిగా రూపొందుటకు తమ వార్తా సంస్థలతో వారికి అనుకూల ప్రచారం చేస్తూ తోడ్పడుతున్నారు, దేశ రాజకీయాలలో యీ రకమైన మార్పుకు, బడాబూర్జువా పారిశ్రామిక వర్గాలు, వారి విదేశమిత్రులతో కలిసి ప్రయత్నాలు ప్రత్యక్షంగా, పరోక్షంగా అన్ని విధాల కొనసాగిస్తున్నారు. ఈ సందర్భంలో ఆర్.యస్.యస్., బి.జె.పి ల గత చరిత్ర అంతా సామ్రాజ్యవాద అనుకూల, అభివృద్ధి నిరోధక చరిత్రయని అందరకు తెలిసేవుంది.

బి.జె.పి 1980 దశకంలో తన బలాన్ని ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో 4నుండి 8కి పెంచుకొనగలుగుట ప్రమాద సూచన తప్ప మరొకటిగాదు. ఇది తెలుగుదేశం, బి.జె.పి. వొండోరులు బలపరచుకొనుటతో జరిగింది. ఈ కారణంగానే ముస్లింమైనారిటీ వర్గాలు అనేక బస్తీలలో కాంగ్రెసు (ఐ) వైపు తిరిగి మొగ్గారు. అంతేగాక, మతతత్వ ముస్లిం మజ్లీస్ ముస్లిం ప్రజాసామాన్యంలో హైదరాబాద్, తదితరనగరాలు, బస్తీలలో బలపడింది. ముస్లింల సంఖ్య నగరాలు, బస్తీలలో గణనీయంగా వుంది కాని, గ్రామీణప్రాంతాలలో వారి జనాభా చెదురు మదురుగానే ఉంది. అంచేతనే మజ్లీస్ ప్రభావం గ్రామసీమలలో లేదనే చెప్పవలసిఉంటుంది.

### 4.4 కమ్యూనిస్టులు ఎన్నికల అవగాహనలు

కమ్యూనిస్టులు ఆర్.యస్.యస్. బి.జె.పి లను ఎన్నికలలో ఎదిరించే విధానం తప్పితే, బలపరచే విధానాన్ని సర్వసాధారణంగా చేబట్టరు. జనతా ప్రభుత్వము 1979 జులై-డిశెంబరులలో అంతర్గత విభేదాలు తీవ్రమైనందున, జనతాయేతర పార్టీలు అన్ని

వోడించుటతో పడిపోయింది. ఈ ఘటనలక్రమాన్ని ఫలితంగా ఇందిరాగాంధీ తిరిగి అధికారంలోనికి వచ్చుటను, తదనంతర కాలంలో పునశీలించిన పశ్చిమబెంగాల్ సి.పి.ఐ(యం) రాష్ట్రశాఖ కాన్ఫరెన్సులో, ఆపార్టీ నాయకత్వంలోని గణనీయమైన వర్గాలు "సి.పి.ఐ(యం) జనతా ప్రభుత్వానికి వ్యతిరేకంగా వోటు, చేయుట పొరపాటు అనే అభిప్రాయానికి వచ్చినట్లు తెలుస్తున్నదని[1]" వార్తా పత్రికలు వెల్లడించాయి. ఇట్టి పునరాలోచన నేపథ్యంలో సి.పి.ఐ(యం) చెప్పే "బి.జె.పి.తో సహా అన్ని ప్రతిపక్షపార్టీలతో నియంతృత్వ వ్యతిరేక సంఘటన"ను అర్థం చేసుకొనుట కష్టంకాదు.. "అన్ని ప్రతిపక్షాల ఫ్రంటును యేర్పాటు చేయు ప్రయత్నాలను బూర్జువా పత్రికలు స్వాగతం చెప్పవలసిన పరిణామంగా ప్రస్తుతించుట, సి.పి.ఐ(యం) నాయకత్వ వర్గాలు అదే విధంగా తలచుట "తప్పని సరిగా రాజకీయ పాఠకులను ఆలోచింపచేస్తుంది.

కమ్యూనిస్టులు అనుసరించిన ఎన్నికల ఎత్తుగడలను చూద్దాము. ఎన్నికల వొప్పందం 1982లో సి.పి.ఐ., సి.పి.ఐ(యం) ల మధ్య జరిగింది. 1985లో ఆంధ్రప్రదేశ్‌లో భగ్నమైంది. పార్లమెంటు 1982 ఎన్నికలలోనే వొప్పందం వున్నా ఆచరణలో ఆంధ్రప్రదేశ్‌లోని ఖమ్మం స్థానంలో సి.పి.ఐ., సి.పి.ఐ(యం)లు రెండూ పోటీ చేసాయి. పరోక్షంగా, కమ్యూనిస్టువోట్లు చీలిపోయి కాంగ్రెసు(ఐ) అభ్యర్థి గెలుచుట రెండు కమ్యూనిస్టుపార్టీలు సమంగా తోడ్పడ్డారు. అంతేగాక భద్రాచలంలో సి.పి.ఐ అభ్యర్థికి వ్యతిరేకంగా స్వతంత్ర అభ్యర్థిని సి.పి.ఐ(యం) బలపరచిందనే ఆరోపణలో అశ్చర్యంలేదు. రెండు కమ్యూనిస్టుపార్టీలు 1985 అసెంబ్లీ ఎన్నికలలో వారి ఎత్తుగడల ఆచరణ, పరస్పరం వోడించుకొనే స్వీయ మానసికధోరణిలో వుందనే నిర్ధారణకు వచ్చేవిధంగా వుంది. వారి ఆచరణలను మార్క్సిస్టు, సోషలిస్టు పదజాలంతో సమర్థించు కొన ప్రయత్నించినా, వారి శ్రేణులలో, ప్రజలలో విశ్వాసాన్ని కలిగించలేకపోయారు.

అంతకుముందు సి.పి.ఐ అభ్యర్థి గెలచివున్న పాలేరు అసెంబ్లీ స్థానాన్ని తనకు యివ్వమని సి.పి.ఐ(యం) ఏకపక్షంగా తెలుగుదేశం పార్టీతో సంప్రదింపులు ప్రారంభించి, గన్నవరం సీటును తన కిమ్మని, వీలుగానిచో సి.పి.ఐ గతంలో వలెనే పోటీచేస్తున్న విజయవాడ(1) సీటును తనకిమ్మని కోరింది. సి.పి.ఐ గెలుచుటకు ఎక్కువ అవకాశమున్న విజయవాడ (1) సీటును తమకిమ్మని సి.పి.ఐ(యం) కోరుతున్నదని సి.పి.ఐ తలచింది. అంచేత సహజంగానే తీవ్ర వివాదాంశమైంది. "పిట్టపోరు పిట్టపోరు పిల్లి తీర్చుట"గా భూస్వామ్య పార్టీయైన తెలుగుదేశంను న్యాయస్థానంలో రెండు కమ్యూనిస్టుపార్టీలు కూర్చోబెట్టాయి. ఇక ఖమ్మం జిల్లాలో సి.పి.ఐ., సి.పి.ఐ(యం), తెలుగుదేశం, వొక్కొక్కరు తలా 3 స్థానాలలో పోటీ చేయాలని వివాద పాలేరు సీటు తెలుగుదేశం పోటీ చేస్తుందని ప్రతిపాదించింది. అయితే, సి.పి.ఐ(యం) పాలేరుతో సహా 4 స్థానాలను మొండి పట్టుపట్టి బూర్జువా పార్టీ చల్లని చూపుతో పొందగలిగింది. ఖమ్మం పార్లమెంటుస్థానంలో సి.పి.ఐ (యం) సి.పి.ఐలు పోటీ చేసినపుడు సి.పి.ఐ (యం) కంటె సి.పి.ఐ సంపాదించిన

*1. ఫరూకీ, యం., (1982) పార్టీలైఫ్. వా.18., నం 2. మే 1982 పే.1-2.*

ఆధిక్యతను తెలుగుదేశం సహాయంతో నీరు గార్చే యత్నంగా ప్రజలు దీనిని తలచిన ఆశ్చర్యంలేదు. ప్రజలలో కమ్యూనిజంపై బలమైన సాధారణ అభిప్రాయం, సానుభూతి గలిగిన స్థానాలలో తసంటే తానేయని, ఆస్థానాలను సర్దుబాటులలో పొంది. రెండవ కమ్యూనిస్టుపార్టీని నామరూపాలు లేకుండా చేయాలనే దురదృష్టకర నీచ ఎత్తుగడలను రెండు కమ్యూనిస్టుపార్టీలు ఆచరణలో స్పష్టంగా కొనసాగిస్తున్నవి.

సి.పి.ఐ "ప్రజాస్వామ్యాన్ని రక్షించండి" అన్న వుద్యమంలో కలసివచ్చిన తెలుగుదేశంతో లోక్‌సభ ఎన్నికలలో సీట్లు సర్దుబాటు చేసుకొని, కాంగ్రెసు (ఐ)ని సాధ్యమైనన్ని యెక్కువ స్థానాలలో వోడించుటకు తీవ్రంగా ప్రయత్నించింది. సి.పి.ఐ బలం 15 స్థానాలలో పోటీ చేయుటలో ప్రతిబింబించిందని, అయినా ప్రధాన ధ్యేయమైన కాంగ్రెసు (ఐ)ని వోడించుటకు తెలుగుదేశంతో అవగాహనకు రావలసివచ్చిందని సమర్థించుకొన్నది. ఆవిధంగా సి.పి.ఐ తన బలాన్ని 5నుండి 11కు పార్లమెంటులో పెంచుకొన గలిగింది. నల్లగొండ జిల్లాలో 3, కరీంనగర్‌లో2, కృష్ణా, గుంటూర్, అనంతపూర్, మెదక్, ఆదిలాబాద్ జిల్లాలోనే ఒక్కొక్క స్థానాన్ని పొందగలిగింది. గత 1983 ఎన్నికలలో 3 జిల్లాలలోనే ప్రాతినిధ్యం కలిగి వుండగా 1985 ఎన్నికలలో 8 జిల్లాలలో ప్రాతినిధ్యం కలిగివుండుట జరిగింది. తెలుగుదేశం పార్టీ నుండి గణనీయమైన మద్దతు లభించింది. అదేవిధంగా సి.పి.ఐ అనేక స్థానాలలో తెలుగుదేశాన్ని బలపరచింది. అభివృద్ధి నిరోధక మత బి.జె.పి పార్టీ పోటీ చేస్తున్న స్థానాలలో సి.పి.ఐ తీవ్రంగా వ్యతిరేకించింది. కాంగ్రెస్, బి.జె.పి. పోటీచేస్తున్న స్థానాలలో సి.పి.ఐ. తటస్థత వహించింది. అంతేగాక, నరసంపేటలో జనతా పార్టీ అభ్యర్థిని, గిద్దలూరిలో స్వతంత్ర అభ్యర్థిని బలపరచింది. సంగ్రహంగా సి.పి.ఐ తెలుగుదేశంతో సీట్లు సర్దుబాటు చేసుకుని జనతా, స్వతంత్ర అభ్యర్థులను యిద్దరిని బలపరచుట కాంగ్రెసు (ఐ) బి.జె.పి లను వ్యతిరేకించుట అనే ఎత్తుగడలను అవలంభించింది.

పాలేరు, ఇల్లందు అసెంబ్లీ స్థానాలను పరస్పరం మార్చుకొనుటకు సి.పి.ఐ మార్చి 14న ప్రతిపాదించగా సి.పి.ఐ(యం) తిరస్కరించుటతో ఆంధ్రప్రదేశ్ అంతటా ఎన్నికల సీట్లు సర్దుబాటులు అసాధ్యమైనవి. ఖమ్మం జిల్లాకు సంబంధించి సి.పి.ఐ కంటె పార్లమెంటు ఎన్నికలలో సి.పి.ఐ(యం) పాలేరు విభాగంలో ఎక్కువ వోట్లు సంపాదించిందనే వాదన చేస్తే దాని ననుసరించే పశ్చిమ విజయవాడ, నిడుమోలు, ఆచంట విభాగాలలో సి.పి.ఐ అధిక వోట్లు సంపాదించి వుండుటవాస్తవం. అయినా ఆస్థానాలలో సి.పి.ఐ అభ్యర్థులకు సి.పి.ఐ(యం) పోటీ పెట్టింది. స్థానాలు పోటీ చేయుటలో సూత్ర బద్దత శూన్యం. "తిరుగలి ఎటు తిరిగినా పిండి తమవైపే" పదాలని వినాశనకర ఎత్తుగడలనే రెండు పార్టీలు అనుసరించాయి. ఖమ్మం జిల్లాలో యీ ఎత్తులు పై ఎత్తులలో వ్యూహ ప్రయోజనాలు అడుగంటిపోయి, రెండు పార్టీల మధ్య అభిప్రాయభేదాలు తీవ్రమై అఘాతం పెరిగిపోయింది. కమ్యూనిస్టు శ్రేణులలో విశ్వాసం సడలిపోయింది. ఇంత జరిగినా కృష్ణా, గుంటూరు, నల్లగొండ జిల్లాల స్థానాల సర్దుబాటులపై రెండు కమ్యూనిస్టుపార్టీల మధ్య వొప్పందం కుదిరింది. మార్క్సిస్టు

పదజాలంతో "ఐక్యత-పోరాటం" అనే సిద్ధాంతానికి ఆచరణలో అర్థమిదేనని సమర్థించుకొన్నా, ప్రజాభిమానం కమ్యూనిస్టులపై మొత్తంగా తగ్గుట వాస్తవంగా గుర్తించాలి. ఈ జిల్లాలలో జరిగిన వొప్పందాలను కమ్యూనిస్టుపార్టీ పత్రిక ప్రచురించకపోవుట, వాస్తవనైతికతను తెల్పుతుంది. బయటి ప్రపంచానికి కృష్ణాజిల్లా విషయం వదలి, మిగతా సీట్లలో పరస్పరం బలపరచుకొనుటను ప్రకటించినా, ఆచరణలో పరస్పరం బలహీన పరచుకొనుట, పరోక్షంగా కాంగ్రెసు (ఐ) ని బలపరచుటే అయింది.

నిర్ధిష్టమైన మార్పు సి.పి.ఐ(యం)లో ముఖ్యంగా సి.పి.ఐ యెడల 1984 అసెంబ్లీ ఎన్నికల ఫలితాల విశ్లేషణ అనంతరమే వచ్చింది. అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంతో కొన్ని ప్రాథమిక అవగాహనలు యేర్పడిన తరువాతనే సి.పి.ఐ:సి.పి.ఐ(యం) ల మధ్య కొంత హృదయ పూర్వక సంప్రదింపులు సాధ్యమయ్యాయి. అయినప్పటికి కమ్యూనిస్టులలో కొన్ని వర్గాలు మరికొన్ని వర్గాలను సోషల్ డెమోక్రటిక్ పార్టీయని, వామపక్షాలలో తీవ్ర ప్రచారమే కొనసాగింది. కమ్యూనిస్టుల పదజాలంలో "సోషల్ డెమోక్రాట్లు" అనిగాని "ట్రాట్స్కీట్లు" అని పరస్పరనిందా ప్రచారం కంటే తీవ్రమైనది. మరొకటి లేదు.

బీహారులో సి.పి.ఐ; సి.పి.ఐ(యం)లతో సి.పి.ఐ (యం.యల్) గ్రూపులు మార్క్సిస్టు కమ్యూనిస్టు గ్రూపు, వినోదమిశ్రా గ్రూపులుతోపాటు, యితర వామపక్ష పార్టీలు, రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ, ఫార్వర్డుబ్లాకులతో వామపక్షం అనేక చీలికలుగావుంది. ఇక బూర్జువావర్గపార్టీ కాంగ్రెసు, జనతా, లోక్‌పార్టీ; కర్పూరు ఠాకూర్ నాయకత్వంలో యేర్పడిన డి.యం.కె.పి." బి.జె.పి ల విషయం చెప్పనక్కరలేదు.

బీహారులో 1984 లోక్‌సభ ఎన్నికలలో కాంగ్రెసు (ఐ) ఆశ్చర్యకరంగా ఎప్పుడూ పొందని గొప్ప విజయాలను, 54స్థానాలలో 48స్థానాలలో పొందింది. ఇది ఇందిరాగాంధి దారుణ హత్యానంతరం పెల్లుబికిన సానుభూతి వెల్లువ ఫలితంగా అందరూ అంచెనా వేసారు. కాని వామపక్ష అనైక్యతా ప్రభావం కలిసే వుంది.

బీహారులోని వామపక్షపార్టీలు, గ్రూపులు ఎన్నికలలో సీట్లు సర్దుబాటులకు పరస్పర వొడంబడికను చేసుకొన్నవి. సి.పి.ఐ; 16స్థానాలలో, యిందులో యింతకుముందు గెలచి లోక్‌సభ సభ్యులుగా వున్న 6గురు తిరిగి పోటీ చేస్తున్నారు. అదేవిధంగా సి.పి.ఐ(యం) 3 సీట్లలో, ఫార్వర్డు బ్లాక్, రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ చెరివొక స్థానంలో, జె.యం.యం. వినోద మిశ్రాగ్రూపు 2 స్థానాలలో, మార్క్సిస్టుకో ఆర్డినేషన్ యింతకు ముందు గెలచిన స్థానంలో పోటీ చేయుటకు సర్దుబాటుల వొప్పందం జరిగింది.

సి.పి.ఐ (యం) పైవిధంగా 24 సీట్లకు పరస్పరం సర్దుబాటులు, బలపరచుకొను వొప్పందం జరిగిన తరువాత, ఆ 24 సీట్లలో పోటీచేసే అభ్యర్థులను బలపరచజాలనని ప్రకటించింది. గతంలో గెలచిన అభ్యర్థులను మరో 3స్థానాలలో పోటీచేసే సి.పి.ఐ అభ్యర్థులను, అలాగే వొక్కొక్క స్థానంలో పోటీ చేయుచున్న పార్వర్డుబ్లాక్, రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ, జె.యం.యం.వినోదమిశ్రాగ్రూపును బలపరచజాలనని, వామపక్షాలకు దూరమైంది. అదేకాలంలో, కర్పూర ఠాకూర్ నాయకత్వంలోని డి.యం.కె.పి. అభ్యర్థులను

5 స్థానాలలో సి.పి.ఐ(యం) బలపరచింది. వారితో ఎన్నికలలో సీట్ల వొప్పందానికి వచ్చింది. దీని ఫలితం రాష్ట్రంలోని ఎన్నికలపై మొత్తంగా ఎట్టి ప్రభావం చూపజాలకపోయినప్పటికి, సి.పి.ఐ(యం) యేవిధంగాను వివరింపజాలని విధంగా ఎన్నికలలో ప్రవర్తించింది. మారిన యీ పరిస్థితులలో పరస్పరపోటీ, సంఘర్షణ, బహుముఖ పోటీ లేకుండా సీట్లు సర్దుబాటు చేసుకొనుటకు సి.పి.ఐ., జనతాపార్టీతో కలసి జరిపిన సంప్రదింపులలో పాక్షిక విజయాన్ని సాధించింది. జనతాపార్టీ, సి.పి.ఐ ని 9 స్థానాలలో బలపరచుటకు, సి.పి.ఐ 11స్థానాలలో జనతాను బలపరచుటకు వొప్పందం కుదిరింది. జనతాపార్టీ, ఫార్వర్డ్ బ్లాక్, రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ: మార్క్సిస్టు కోఆర్డినేషన్, జె.యం.యం., వినోద గ్రూపులను బలపరచ నిరాకరించింది.[1]

సి.పి.ఐ గతంలో గెలచిన 6 స్థానాలలో 5స్థానాలలో వోడిపోయింది. వొక స్థానంలో మాత్రమే గెలుపొందింది. మిగిలిన స్థానాలలో వోడిపోయినా, వోట్లు గతంలో కంటె యెక్కువగానే వచ్చాయి. గతంలో కంటె సి.పి.ఐ ఫార్వర్డుబ్లాక్, రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ, మార్క్సిస్టు కోఆర్డినేషన్, జె.యం.యం., వినోద్ గ్రూపులు చేరువ కాజొచ్చాయి. సి.పి.ఐ (యం) వామపక్ష ఐక్యతను యేమాత్రం వాంఛించినా సి.పి.ఐ ఫార్వర్డుబ్లాకు రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ, తదితర వామపక్ష పార్టీలకు చేరువగుటకు మారుగ బి.జె.పి., డి.యం.కె.పి." లకు చేరువయ్యేదికాదు.[2]

వామపక్షాల అనైక్యత మూలంగా, లౌకిక ప్రజాస్వామ్య ప్రతిపక్షాలలో సీట్లు సర్దుబాట్లు కూడ జరుగనందున, రెండు కమ్యూనిస్టుపార్టీలు, తదితర వామపక్ష పార్టీలు తీవ్రంగా నష్టపోయాయి. వామపక్షాల నష్టాలకు ఆ పార్టీల సంకుచితవైఖరి ప్రధానకారణం. లోక్‌సభ ఎన్నికలతో పోల్చితే బూర్జువాప్రతిపక్షపార్టీలు తమస్థానాలను, బలాన్ని మెరుగుపరచుకొనగా, వామపక్షాలు మొత్తంగా జాతీయ రాజకీయ రంగంపై తమ ప్రభావాన్ని యేమాత్రం, చూపించ జాలకపోయాయి.

ఈ సందర్భంలో సి.పి.ఐ పాట్నా 13వ, పార్టీ కాంగ్రెసు "ఆత్మ విమర్శనా ధోరణిలో "కొన్ని లోపాలను గుర్తించి వాటిని అధిగమించుటకు కొన్ని సూచనలు చేసింది, వాటిని తెలుసుకొందాము. "ప్రజల మధ్య పనిచేయుటలో మన పార్టీతో సహా వామపక్షాలలో తీవ్రమైన లోపాలున్నవి. బూర్జువా పార్టీల నుండి మనం మన రాజకీయాలను వేరు పరచుకొనుటకు భూసంస్కరణలు, అధిక ధరలు లాంటి కీలక సమస్యలపై విస్తృత జాతీయస్థాయి పోరాటాలను నిర్వహించలేకపోవుట, రాజకీయసమస్యలపై నిరంతర పోరాటాలు, ప్రజోద్యమాలు నిర్వహించలేకపోయినందున వామపక్షాలను, వాటిమిత్రులను దేశ రాజకీయరంగంలో బలమైన శక్తిగా అభివృద్ధి చేయకపోవుట ప్రధానలోపము.

---

1. *ఆన్ లోక్‌సభా ఎలక్షన్స్ ఇన్ బీహార్ (1985) పార్టీలైఫ్. వా.21., నం 2. ఫిబ్రవరి 1985 పే. 16-20.*

2. -- అదే -- *పే. 19-20.*

"ఏవో కొన్ని రాష్ట్రాలు మినహా పట్టణ, గ్రామీణ ప్రజాసామాన్యం తమ ప్రయోజనాల రక్షణ కోసం వామపక్షాలవైపు చూచుటలేదు. బలమైన పునాదులపై శ్రామికుల నిరుపేదల విశ్వాసాన్ని చూరగొనుటకు తక్షణం వారి సమస్యలపై సమరశీల పోరాటాలను నిరంతరం సాగించే ప్రాతిపదికపై చేపట్టాలి.

"సామాన్య ప్రజలదైనందిన సమస్యలను చేబట్టుట, వాటి పరిష్కారానికి ప్రజామోదాన్ని మద్దతును సమీకరించుటలో గల నిర్లక్ష్యం ప్రధాన బలహీనతగావుంది. దీనిని దిద్దుకొనుట తక్షణ ఆవశ్యకతగా నెంచాలి. పేదలకు ఇళ్ళ స్థలాలు, ఋణాలకు ప్రజాపోరాటాలు, నిరుద్యోగ, పెన్షన్ పథకాల వంటి, ఉపశమన చర్యలు అమలుకు పార్టీ యూనిట్లు చురుకుగా కలుగజేసుకొంటూ, విస్తృత ప్రజాసామాన్యాన్ని సమీకరించాలి.

"ముఖ్యంగా గ్రామీణ ప్రజాసంఘాలను నిర్మించుట. పార్టీ నిర్మాణం పట్ల పార్టీ ప్రగాఢ నిరంతర శ్రద్ధాసక్తులను చూపాలి. ఇవి లేకుండా రాజకీయరంగంలో మనపార్టీ గణనీయశక్తిగా రూపొందజాలదు[1].

వామపక్షాల వైఫల్యాలపై పైన పేర్కొన్న కారణాలు సహేతుకాలు. ప్రధాన కమ్యూనిస్టుపార్టీలు చీలిపోయి, గ్రామ, ఫ్యాక్టరీస్థాయిలలో గూడ ప్రజాసంఘాలను చీల్చి, కార్మిక, కర్షక, మధ్యతరగతి, తదితర నగర, గ్రామీణ బడుగువర్గాలలో అనైక్యతను పెంచి, పోషించుతు, కనీస ఆర్థిక కోర్కెలపై గూడ ఐక్యపోరాటాలను గణనీయంగా నడుపజాలక పోవుట, కార్మిక, కర్షక తదితర బడుగువర్గాలలో సైతం వామపక్షాలు విశ్వాసం కలిగించలేకపోయాయి. ఇది అత్యంత ప్రధానాంశం, వామపక్ష ఐక్యతకు పునాదియైన కమ్యూనిస్టు ఐక్యత వొక్కటే అన్ని వర్గాల ప్రజలలో విశ్వాసాన్ని పెంపొందించగలుగుతుంది. వామపక్ష అనైక్యత కారణంగా తమదైనందిన ఆర్థిక పోరాటాలలో వైఫల్యాలను యెంత తీవ్రంగా ఎదుర్కొనవలసి వస్తున్నదో, శ్రామికవర్గాలు పోరాటశక్తిని యెంతగా కోల్పోయారో వారికి ప్రత్యక్ష అనుభవంలో వుంది. అందుకే, వారిని కదిలించలేని నినాదాల యెడల వారు విశ్వాసాన్ని కోల్పోయి స్పందించలేక పోతున్నారు, కమ్యూనిస్టుల యెడల విశ్వాసం సన్నగిల్లుతోంది.

కమ్యూనిస్టుపార్టీలు సి.పి.ఐ., సి.పి.ఐ(యం) లు రెండూ తమ భటిండా, జలందర్ 1978పార్టీ కాంగ్రెసులలో లౌకిక, వామపక్ష, ప్రజాస్వామ్య సంఘటనను, మౌలిక దీర్ఘకాలరాజకీయ వ్యూహంగా చేబట్టుటయే గాక, తదనంతర రెండు పార్టీల కాంగ్రెసులు అదే విధానాన్ని పునరుద్ఘాటించుటయే గాక, అట్టి సంఘటనకు వామపక్ష ఐక్యత పునాదియని కూడ స్పష్టం చేసాయి. అయితే ఆచరణ వామపక్ష ఐక్యతను పెంపొందించేదిగా కాక, దానిని విచ్ఛిన్నచేసే వొంటెత్తు పోకడగా వుందనుటకూడ స్పష్టమైంది. అయితే కమ్యూనిస్టుపార్టీల ఆచరణకు గల సైద్ధాంతిక పునాది, ప్రపంచంలో

---

*1. వారణాసి మహాసభ అనంతర జాతీయ, అంతర్జాతీయ పరిణామాలపై సమీక్ష పాట్నా 13వ. సి.పి.ఐ. మహాసభ ఆమోదించినది ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కమ్యూనిస్టు సమితి ప్రచురించినది.*

యేదేశంలోనూ "ఒక్కటికంటె యెక్కువ కమ్యూనిస్టు పార్టీలు ఉండవు. ఉన్నా అది అశాస్త్రీయమైన మితవాద కమ్యూనిస్టుపార్టీయో లేక అతివాద కమ్యూనిస్టుపార్టీయో అయివుంటాయనే" సాంప్రదాయ "పిడి సిద్ధాంతంగా" కన్పించుతుంది. ఒక అతివిశాల, అనేక జాతులు, మతాలు, కులాలు, ఆటవిక తెగల ఆర్థిక సామాజిక విధానం నుండి, గుత్త పెట్టుబడిదారి విధానం వరకు సజీవంగా వివిధ స్థాయిలలో వున్న, పలురంగుల "ఇంద్రధనుస్సు" లాంటి భారత సామాజిక, ఆర్థిక వ్యవస్థను విశ్లేషించుటలో ప్రధానంగా రెండు దృక్పథాలు గత నాలుగు దశాబ్దాలు మనగలిగిన చారిత్రిక వాస్తకతకు మించిన శాస్త్రీయత మరొకటి వుండదు కాన, "రెండు కమ్యూనిస్టుపార్టీలు వుండవు" అనే పిడి సూత్రాన్ని వదలివేసి, పరస్పరం సోషల్ డెమోక్రటిక్ పార్టీలుగా నిర్వచించుకొనగుండా, కమ్యూనిస్టుపార్టీలు గుర్తించుకొన్నప్పుడే, వామపక్ష ఐక్యత, ఐక్యసంఘటన పురోగమించగలదు. కాని, భారతకమ్యూనిస్టు వుద్యమంలో విచ్ఛిన్నత, చీలికలదశ అంతమై, సమన్వయం, సంలీనం, ఏకీకరణ దశకు నాంది పలుకుతారని ఆశిద్దాము.

కార్మిక, కర్షక, తదితర నగర, గ్రామీణ బడుగువర్గాలలో గత నాలుగు దశాబ్దాలలో పెరిగిన రాజకీయ చైతన్యంతోపాటు, సాంకేతిక, సాధారణ విద్యా, విజ్ఞానాలస్థాయి, రాజకీయ అవగాహనాస్థాయి కూడా పెరిగింది. "కొన్ని ప్రాంతాలలోని కొన్ని వర్గాలలోకమ్యూనిస్టులలోని అనైక్యతయే, వారి అనైక్యతకు కారణమనే అభిప్రాయం చోటు చేసుకొంటున్నది." వీటి ఫలితంగానే కమ్యూనిస్టుల సాంప్రదాయ, బలమైన కేంద్రాలలో వామపక్షాలు బలహీనపడుట, కాంగ్రెసు (ఐ) వర్గాలు బలపడుట జరిగింది. కమ్యూనిస్టులు యీ విషయాలను గమనించలేదని అనుకొనజాలము. వారి మార్క్సిస్టు లెనినిస్టు శాస్త్రీయ అవగాహనలపై స్వీయమానసిక పాక్షిక ప్రయోజనాల ధోరణులు ఆధిక్యత సంపాధించాయని అనుకొనవలసి వుంటుంది. కార్మిక, కర్షక వర్గాల అనుభవ సంజాత చైతన్యాన్ని వామపక్ష కమ్యూనిస్టు వర్గాలు కొన్ని తక్కువగా అంచనా వేస్తున్నవి. కమ్యూనిస్టుపార్టీల కార్యక్రమాల ఆచరణలో ప్రాణాలు తెగించి పోరాడిన కార్మిక, కర్షక, మధ్యతరగతి, నగర గ్రామీణ బడుగు వర్గాలకు వామపక్షాలే ముఖ్యంగా కమ్యూనిస్టుపార్టీలే దూరమగుతున్నవి. నిజంగా సోషలిజం ధ్యేయాన్ని, విజయాన్ని కాక్షించేవారు ఆత్మశోధన, ఆత్మవిమర్శన చేసుకొనవలసిన కాలం ఆసన్నమైంది. ఇందులో వెనుకబడితే చరిత్రపుటలలో తెరమరుగు అగుట తప్పనిసరి అగుతుంది.

# V

## నూతన పరిస్థితి ప్రత్యామ్నాయ సోపానాలు

**5.1.** దేశం 1980 దశకం మధ్యలో రాజకీయ క్లిష్ట పరిస్థితులలో పడింది. కేంద్రంలో పాలక పార్టీయైన కాంగ్రెసు (ఐ) ప్రతిష్టను, ప్రజాభిమానాన్ని అతివేగంగా పోగొట్టుకొంటున్నది. బెంగాల్, కేరళలలో మార్చిలో జరిగిన ఎన్నికలలో వామపక్ష ప్రజాస్వామ్యశక్తులు అఖండ విజయం, హర్యానాలో లోక్‌దళ్ (బి) విజయం

రాజకీయపరిణామాల వేగోద్ధృతినేగాక. కాంగ్రెసు (ఐ) పతనాన్ని వేగవంతం చేసాయి. ఇప్పటికే కాంగ్రెసు (ఐ) 12 రాష్ట్రాలలో ఆధిక్యతను కోల్పోయింది. భారతదేశానికి రాజకీయ కేంద్రాలైన హిందీ రాష్ట్రాలలోను కాంగ్రెసు పతన మార్గంలో పడింది.

## 5.2 కేరళలో 1987లో ఎన్నికలు

కేరళ, పశ్చిమబెంగాల్‌లలో, జమ్మూ-కాశ్మీర్‌లలో అసెంబ్లీ ఎన్నికలు 1987లో జరిగాయి. పశ్చిమ బెంగాల్‌లో వామపక్ష సంఘటన, కేరళలో వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనలు అఖండ విజయాన్ని సంపాదించుట, సి.పి.ఐ., సి.పి.ఐ(యం)లు రెండు హర్షించి, స్వాగతం చెప్పాయి. పశ్చిమబెంగాల్‌లో దీనితో మూడోసారి వామపక్ష సంఘటన అధికారంలోనికి వచ్చుట; కేరళలో వామపక్ష ప్రజాకస్వామ్య సంఘటనలో సి.పి.ఐ (యం), సి.పి.ఐ; ఆర్.యస్.పి.,లతోపాటు, బూర్జువాపార్టీలైన జనతా, కాంగ్రెసు (యస్), లోక్‌దళ్‌లు భాగస్వాములుగా వున్నవి. పశ్చిమబెంగాల్ వామపక్ష సంఘటనలోని కమ్యూనిస్టుపార్టీలు రెండూ, రివల్యూషనరీ, డెమోక్రటిక్, సోషలిస్టు పార్టీలు మూడు, రివల్యూషనరీ కమ్యూనిస్టుపార్టీ, ఫార్వర్డుబ్లాక్ (మార్క్సిస్టు), అన్నీ సోషలిజాన్ని కోరే వామపక్ష పార్టీలే భాగస్వాములుగా వున్నవి. పశ్చిమబెంగాల్ సంఘటనలోని పార్టీలన్నీ సోషలిజం యెడల విశ్వాసాన్ని ప్రకటించాయి. కేరళ ఐక్యసంఘటనలో సోషలిజం యెడల విశ్వాసాన్ని ప్రకటించిన పార్టీలేగాక, బూర్జువా ప్రజాస్వామ్యం యెడల విశ్వాసంగల బూర్జువా రాజకీయపార్టీలు కూడా వున్నవి. ఈ రెండు సంఘటనలలోని భేదాన్ని, దానిలో యిమిడివున్న సైద్ధాంతిక భేదాన్ని, ఆచరణలో వాటి ప్రాముఖ్యత విశాల భారతదేశంలోని ఆర్థిక, రాజకీయ అసమానతల దృష్ట్యా ఎంతో వున్నది. దీనిని పరిగణలోనికి తీసుకొనుటలో పేమరుపాటు, అతివాద పొంటెత్తు పోకడలకు మార్గమగుతుంది. అంతేగాక, వాటి నిర్మాణంలో వున్న భిన్నత్వాన్ని ముఖ్యంగా వర్గాల పొందికను ప్రత్యేకంగా పరిగణలోనికి తీసుకొనవలసివుంటుంది. పశ్చిమ బెంగాల్ వామపక్ష సంఘటనకు పునాదుల స్థిరత్వం, కేరళ వామపక్ష ప్రజాస్వామసంఘటన అస్థిరత్వం, వాటి పునాదుల నైజమైన వర్గాల కూర్పుపై ఆధారపడి వుండుటను గమనించాలి.

కేరళ ఎన్నికల ఫలితాలు మతమౌఢ్య, హింసా శక్తులకు పెద్ద అపజయము. మతాన్ని రాజకీయాలను వేరు చేయాలని రాజీవ్‌గాంధీ ప్రచారం చేస్తున్నా, కాంగ్రెసు (ఐ) కేరళలో అన్ని రకాల కులమత శక్తులతో, "కూటమి" నేర్పరచింది. ఈ రాష్ట్రంలో వామపక్ష, లౌకిక, ప్రజాస్వామ్య శక్తుల విజయం వారు మత మౌఢ్య, వేర్పాటు వాద శక్తులపై పోరాటాన్నే గాక, వారు ప్రజల కోర్కెలకై జరిపే పోరాటాలకు మరింత బలంచే కూర్చుతుంది. ఈ విజయాలు కాంగ్రెసు(ఐ)కి పెద్దదెబ్బ, వారి ప్రజాస్వామ్య, ప్రజావ్యతిరేక చర్యలను త్రోసి బుచ్చుట అగుతుంది. అంతేగాక, కాంగ్రెసు (ఐ) ప్రతిష్ట, ప్రభావం, నెహ్రూ కుటుంబ ప్రభావం అన్నీ అంతం అయ్యాయని స్పష్టమగుతున్నది. వామపక్ష

లౌకిక, ప్రజాస్వామ్య శక్తులు జాగరూకులై మతమౌఢ్యశక్తుల కుట్రలను బహిరంగపరుస్తూ, నిరవధికంగా పోరాటం సాగిస్తూ, ప్రజల నుండి వారిని వేరు చేయాలి.

కేరళ ఎన్నికల పోరాటాలకు కొన్ని ప్రత్యేకతలు వున్నవి. బెంగాలులో వలె నేరుగా కాంగ్రెసు (ఐ) వామపక్షాలు తలపడుటలేదు. కేరళలో పాలక వర్గాలు కాంగ్రెసు (ఐ) నాయకత్వంలో మత, కుల పార్టీలైన ముస్లింలీగు, కేరళ కాంగ్రెసు, నాయర్‌సేవాసమితి తదితరులు వొకవైపు, ప్రతిపక్షాలు సి.పి.ఐ(యం) నాయకత్వంలోని సంఘటన భాగస్వాములైన సి.పి.ఐ: రివల్యూషనరీ సోషలిస్టు, జనతా కాంగ్రెసు (యస్), లోక్‌దళ్ మరొకవైపు, రెండు సంఘటనలు యునైటెడ్ డెమోక్రటిక్ ఫ్రంటు, వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనలు అంటే, ఒకటి కాంగ్రెసు నాయకత్వంలోని మితవాదుల ఐక్యసంఘటన, మరొకటి సి.పి.ఐ(యం) నాయకత్వంలోని వామపక్ష సంఘటనగా యేర్పడి, ఎన్నికలలో తలపడినవి. మత సంస్థలు ముస్లింలీగు, క్రిష్టియన్ మత రాజకీయసంస్థ కేరళ కాంగ్రెసు, నాయర్ సేవాసమితి కుల సంస్థలు కలసి మిత, మతవాద సంఘటనతో సి.పి.ఐ; సి.పి.ఐ(యం) సోషలిస్టుపార్టీలు మూడు కలసి వామపక్ష ప్రజాస్వామ్య, లౌకిక సంఘటన, దీనిని ప్రత్యేకంగా గమనించవలసి వుంటుంది.

వామపక్ష లౌకిక ప్రజాస్వామ్య సంఘటన, "కాంగ్రెసు నాయకత్వంలోని "కుల మత సంఘటన" ను వోడించండి" అనే ఎన్నికల నినాదాన్ని యిచ్చింది. అదే సమయంలో "ఫాశిస్టుల బి.జె.పి., హిందూ మునాని కూటమి" ఎత్తుగడలను చిత్తుగా వోడించండి" అనే పిలుపు కూడా యిచ్చింది. బూర్జువా పార్టీలు, పత్రికలు వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన ఐక్యంగా వుండజాలదనే అవగాహనపై ఆశతో నున్నవి. ఆ ఆశపైనే నిలబడి సి.పి.ఐ(యం)., సి.పి.ఐ., ల మధ్య అభిప్రాయభేదాలున్నవని ప్రచారం సాగించారు. రెండు కమ్యూనిస్టుపార్టీలు సైద్ధాంతిక మౌలిక భేదాభిప్రాయాలు వున్నవని చెప్తుతూనే, అయినా కనీస కార్యక్రమం వొప్పందంపై ఆధారపడి, ఐక్యసంఘటనలో పనిచేస్తున్నామని, ఐక్య పోరాటాలు సాగిస్తున్నామని బహిరంగంగానే చెప్పుతున్నందున ప్రత్యర్థి వర్గాల ప్రచారం, అంతగా పని చేయలేదు. ఎన్నికల ఐక్యసంఘటన, సి.పి.ఐ (యం)కు 79, సి.పి.ఐ., కి 26, ఆర్.యస్.పి.కి 7, కాంగ్రెసు (యస్) కి 14., జనతాకు 12, లోక్‌దళ్ కు2., స్వతంత్రులకు 9 స్థానాలను కేటాయించాలని సమిష్టిగా నిర్ణయించింది.

కేరళకు గత ఐదు సంవత్సరాలలో కేంద్ర ప్రభుత్వ సహాయానంతరం కూడ నిరుద్యోగం 1987లో 30శాతానికి చేరింది, దేశంలో మరెక్కడా యింత నిరుద్యోగం లేదు.

కేరళ ఎన్నికల ప్రాముఖ్యతను తక్కువగా అంచెనా వేయరాదు. కేరళ ప్రజలు, కాంగ్రెసు (ఐ) మత, కుల శక్తుల కూటమికి చక్కని వ్యతిరేక తీర్పు చెప్పారు. దేశ రాజకీయాలలో "కింగ్ మేకరు" పాత్ర వహించ తలచే హిందూ మత శక్తులకు చక్కని గుణ పాఠం నేర్పారు. ప్రజలలో వామపక్షాల వైపు వచ్చిన మొగ్గును ఎన్నికల ఫలితాలు తెలియజేస్తున్నవి.

## 5.3 పశ్చిమ బెంగాల్ అసెంబ్లీ ఎన్నికలు

పశ్చిమ బెంగాలులో వామపక్ష సంఘటన ప్రభుత్వ విజయాలను సంక్షిప్తంగా యిలా చెప్పవచ్చును. అత్యవసర పరిస్థితి కాలంలో కేంద్ర ప్రభుత్వం కాలరాచిన అన్ని ప్రాధమిక, పౌరహక్కులు పునరుద్ధరించబడినవి. పంచాయతీల చట్టాన్ని చేసి, అన్ని అభివృద్ధి కార్యక్రమాలను పంచాయతీల ద్వారా సాగించబడినవి. భూమిలేని రైతులకు, వ్యవసాయకూలీలకు, పేదలకు 12 1/2 లక్షల యకరాలు వ్యవసాయ భూములను పంచారు. ఈవిధంగా భూములు పొందినవారిలో 5.7శాతం షెడ్యూల్డు కులాలకు చెందిన వారున్నారు. వ్యవసాయభూములను సాగు చేస్తున్న 13 లక్షల 39 వేలమంది కౌలుదారులుకు ఆభూములను సాగుచేసుకొనే హక్కులను యిచ్చారు. వామపక్ష సంఘటన ప్రభుత్వం 9 సంవత్సరాలపాలనలో 1987 నాటికి 10 వేల పాఠశాలలను అధనంగా నెలకొల్పారు. విద్యుచ్ఛక్తి వుత్పత్తిని 1700 మెగావాట్సుకు పెంచారు. సామాజిక సేవా కార్యక్రమాలన్నిటిని పంచాయతీల ద్వారా నిర్వహించారు. వీటన్నిటి ఫలితంగానే మూడవ విడత కూడా వామపక్ష సంఘటన 1987 ఎన్నికలలో అఖండ విజయాన్ని పొంది, అధికారాన్ని స్వీకరించింది. వామపక్ష సంఘటన మూడవసారి ఎన్నికలలో తనబలాన్ని గణనీయంగా పెంచుకొనగలిగింది. బెంగాలులో వామపక్ష సంఘటన అవలంభించిన రాజకీయ, ఆర్థికవిధానాలపై ఎన్నికల ఫలితాలు ప్రజల తీర్పుగా నెంచాలి.

వామపక్ష సంఘటన కమ్యూనిస్టుల నాయకత్వంలో 238స్థానాల నుండి 250 స్థానాలకు తన బలాన్ని మెంచుకొనగలిగింది. కాంగ్రెసు (ఐ) దానిని అనుసరించే యితర పార్టీలు తమ బలాన్ని 49 నుండి 38 స్థానాలకు కోల్పోయారు.

వామపక్ష విజయం గణనీయమైనది. అయినా విజయ విశ్లేషణ బలహీనతలను, వాటిని సరిచేసుకొనే మార్గాలను చూపించి తోడ్పడింది. అంతేగాక విజయాన్ని చేకూర్చిన అంశాలను వెలుగునకు తెచ్చింది. మరింత బలపడుటకు తోడ్పడింది. వామపక్ష సంఘటన 1982లో 52.7శాతం 1987లో 53.0శాతం, అంటే 0.32 శాతం మాత్రమే అధిక వోట్లను సంపాదించింది. కాంగ్రెసు (ఐ), కాంగ్రెసు (యస్)లు 1982 లో 41.1శాతం, 1987లో కాంగ్రెసు (ఐ) 41.8శాతం అదనంగా 0.8శాతం సంపాదించింది. అదే కాలంలో వామపక్షానికి నాయకత్వం వహించుతున్న సి.పి.ఐ (యం) 1982లో 38.5శాతం 1987లో 39.3శాతం అనగా 0.8శాతం అదనంగా వోట్లు సంపాదించింది. కేంద్రంలో కాంగ్రెసు (ఐ) అవలంభించే ప్రజాస్వామ్య, ప్రజావ్యతిరేక, ఆర్థిక, రాజకీయ, సామాజిక విధానాలను, నిరుద్యోగం, మత, ఏర్పాటు వాదులతో అది అవలంభించే రాజీ విధానాలను తీవ్రంగా విమర్శనలతో ప్రజలవద్దకు తీసుకొని వెళ్ళినా, కాంగ్రెసు (ఐ) గల వోటింగు బలాన్ని బ్రద్దలు చేయుటగాని, గణనీయంగా చీల్చుటగాని జరుగలేదు. ఓటింగు గణాంకాలు కాంగ్రెసు (ఐ) గ్రామీణ ప్రాంతాలలో బలహీనపడినా, పారిశ్రామిక ప్రాంతాలలో బలాన్ని సంపాదించిదనుటను స్పష్టం చేస్తున్నవి. అంటే పారిశ్రామిక ప్రాంతాలలో బెంగాలీలు కాని హిందీ ఉరుదు మాట్లాడే వర్గాలలో మార్పు వచ్చిందని,

గణనీయంగా వామపక్షాలవైపు మొగ్గుతారని వేసిన అంచెనా సరికాదని తేలింది. వామపక్షాలను బలపరచే కార్మికవర్గాలే, వారి నుండి దూరమయ్యేపరిస్థితి యేర్పడుటను తీవ్రంగా పరిగణించవలసి వున్నది. వామపక్ష ప్రభుత్వపు కాలంలోనే అన్ని ప్రజాసంఘాల బలం పెరిగింది, కాని సి.ఐ.టి.యు విషయంలో యిది జరుగలేదు. ఉరుదు మాట్లాడే కార్మికులలో మతతత్వ, వేర్పాటు వాదులలో కాంగ్రెసు (ఐ) ప్రభావం బాగాపడినట్లు కన్పించుతున్నది. దీనిని తిప్పికొట్టుటలో వామపక్షాల వైఫల్యంతోపాటు, "షాబాను ఉదంతం"పై మతవాదుల ప్రచారం బాగా పనిచేసినట్లు కన్పించుతున్నది. బెంగాలీ భాషా కార్మికవర్గం వామపక్షాలకే వోటు చేసింది. అయితే బెంగాలీ యేతర కార్మికులను ప్రధాన స్రవంతి నుండి వేరుచేయుటలో బూర్జువావర్గం విజయం పొందినట్లు కన్పడుతున్నది.[1]

గ్రామీణ ప్రాంతాలలో కిసాన్‌సభ ప్రచారం బలంతో వ్యవసాయ కూలీలు పేద రైతాంగం అధిక సంఖ్యలో పాల్గొనుటను వోటింగు సరళి స్పష్టం చేస్తున్నది. అయితే మధ్యతరగతి, ధనిక రైతులలో కాంగ్రెసు (ఐ) కోల్పోయిన బలాన్ని తిరిగి సంపాదించినట్లు అధ్యయనం తెలియజేస్తున్నది. ఇది వామపక్ష వుద్యమవ్యాప్తికి చేబట్టవలసిన కార్యక్రమాలను నిర్ణయించుటలో తోడ్పడుతుంది. కాంగ్రెసును అనుసరించే వర్గాలను, వామపక్షాలు సమీకరించే ప్రయత్నం నిరవధికంగా సాగవలసివుంది. అదేవిధంగా హిందీ, ఉరుదు మాట్లాడే వర్గాలలో కూడ వామపక్షాలు తమ కార్యక్రమాలను ముమ్మరం చేయాలి.

## 5.4 హర్యానా అసెంబ్లీ ఎన్నికలు

ఈ రోజులలోనే హర్యానా రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికలలో లోక్‌దళ్ దేవీలాల్ నాయకత్వంలో కాంగ్రెసు (ఐ)ని చిత్తుగా వోడించి, అధికారాన్ని చేబట్టింది. హర్యానాలో కాంగ్రెసు వోడిపోయినా విజయ పొందింది వామపక్ష ప్రజాస్వామ్య పురోగామి శక్తులు కావు. ఫ్యూడలు ప్రభావం కల భూస్వామ్య, మత తత్వశక్తులైన బి.జె.పి., ఆర్.యస్.యస్ శక్తులు పచ్చి మితవాద అభివృద్ధి నిరోధక, మతవాద శక్తులు ప్రధానంగా గెలుపొందాయి.

హర్యానా అసెంబ్లీ 1987 ఎన్నికలలో ఆశ్చర్యాన్ని గొల్పుతవి, కాంగ్రెసు (ఐ)కు రద్దు చేయబడిన అసెంబ్లీలో 36స్థానాలు వుండగా 1987లో అతి కష్టంగా 5 స్థానాలలో మాత్రమే గెలుపొందింది.

ఇంతటి ఘోర పరాజయాన్ని కాంగ్రెసు (ఐ) ఎప్పుడూ ఎదుర్కొనలేదు. ఈ ఎన్నికలలో గణనీయమైన విజయాన్ని, దేవిలాల్ నాయకత్వంలోని లోక్‌దళ్ 59 స్థానాలను బి.యల్.డి తో సహా కలసి పొందగలిగింది. మాజీ అసెంబ్లీలో 31స్థానాలు కలిగి ప్రధాన ప్రతిపక్షంగా లోక్‌దళ్ వుంది. మిత, మతవాదశక్తి బి.జె.పి 15స్థానాలను జనసంఘంతో కలసి

*1. సి.పి.ఐ (యం) ఏప్రిల్ 1987 సి.సి. నివేదిక, రాజకీయ పరిణామాలు పే.40.*

పొందకలిగింది. మాజీ అసెంబ్లీలో 6స్థానాలను మాత్రం కలిగి వుంది. బాగా బలాన్ని పుంజుకున్న పార్టీలలో లోక్‌దళ్ తరువాత రెండవ, పార్టీగా వుంది. రద్దు అయిన అసెంబ్లీలో 14 మందిగా వున్న స్వతంత్రులు 1987 లో 6గురు మాత్రమే ఎన్నిక అయ్యారు. జనతాపార్టీ ఒక్కసీటును సి.పి.ఐ(యం), సి.పి.ఐ చేరి వొకసీటు, కాంగ్రెసు (జె) మాత్రం 2 సీట్లు గెలవగలిగింది.

కాంగ్రెసు (ఐ) చివరి రోజులలో అన్ని రకాల ప్రయత్నాలు, విధానాలు అవలంబించినా ఘోరపరాజయాన్ని పొందింది. ఖలిస్తాన్ వుద్యమకారులు వారి అభిమానుల యెడల గట్టి చర్యలు చేబట్టుతుందనే అభిప్రాయాన్ని కలుగజేయుటకు కేంద్రప్రభుత్వం, బర్నాలా రాష్ట్ర ప్రభుత్వాన్ని రద్దు చేసింది. అంతేగాక ఎరాడి కమిషన్ ద్వారా హర్యానాకు రావలసిన సాగునీటి వాటా కన్నా ఎక్కువ వచ్చునట్లు కాంగ్రెసు (ఐ) చేసింది. కాని వోట్లు సంపాదించలేకపోయింది. ఈ ఎన్నికల ఫలితాలను సరిగా అంచెనా వేయాలంటే కొంతనేపథ్యాని తెలుసుకొనవలసివుంది.

జనతా పార్టీ, కాంగ్రెసు (ఐ) పాలనను తొలగించి తన ప్రభుత్వాన్ని యేర్పరచింది. మితవాద వామపక్షాల మధ్య కాకుండా, లౌకిక ప్రజాస్వామికవాదులు మతవాదశక్తులు మధ్య బేధాభిప్రాయాలున్నప్పటికి, ఇందిరా కాంగ్రెసుకు వ్యతిరేకంగా సి.పి.ఐ (యం), రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ ఫార్వర్డ్‌బ్లాక్, మూడు వామపక్షపార్టీలు జనతాపార్టీ పాలనకు మద్దతు నిచ్చాయి. కాంగ్రెసు (ఐ)కు ప్రత్యామ్నాయ నాయకుని ఎన్నుకొనే సందర్భంలో వున్న భేదాభిప్రాయాలు తీవ్రస్థాయికి చేరి, సజీవంగా అవి అలాగే కొనసాగాయి.

వామపక్ష మూడు పార్టీలు ప్రారంభంలో జనతాపార్టీకి తమ మద్దతు నచ్చినా, తదనంతర పరిణామాలకు కలత చెందాయి. జనతా ప్రభుత్వంలోని వామపక్షేతర ప్రతిపక్ష పార్టీలలోని సంఘర్షణలు బహిరంగమయ్యాయి. జనతాలోని జనసంఘం ఆప్రభుత్వాన్ని బలహీన అల్ప సంఖ్యాకవర్గాలను తొలగించి, హిందూ మతతత్వానికి సాధనంగా చేయ తలపెట్టిన ప్రయత్నంలో ప్రభుత్వాన్ని బలహీనపరచుటకు చేసే పోరాటం బలహీన పడింది. జనతాపార్టీ, రాష్ట్రీయ స్వయంసేవకసంఘం నాయకులతో గల సంబంధాలను విడనాడాలనే ఆందోళన సాగింది. ఇది జనతా పార్టీతో వివిధ రాజకీయపార్టీల మధ్య తాత్కాలికంగా యేర్పడిన సంబంధాలను త్రెంచివేసి, దాని పతనానికి దారి తీసింది.

జనతా పార్టీని వామపక్షపార్టీలు ముఖ్యంగా "విమర్శనాత్మకమద్దతు" అనే పేరుతో బలపరచుట, ప్రభుత్వంతో సహకరించుట, నూతన రాజకీయ పరిణామాలలో కొత్త సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చింది. జనతాలోని నూతన ధోరణిని బలపరచే వామపక్షం వారి మధ్య సంఘర్షణలతో జనతా ప్రభుత్వం పడిపోయింది. ఈ మధ్య కాలంలో జనతా వ్యతిరేకంగా పోరాడుతున్న ఇందిరా కాంగ్రెసుకు మద్దతునిస్తున్న సి.పి.ఐ తన పంథాను మార్చుకొన్నది. సి.పి.ఐ., సి.పి.ఐ(యం) ల మధ్య పరస్పరం సంభాషణల క్రమం యేర్పడింది. సి.పి.ఐ 1978 భటిండా పార్టీ కాంగ్రెసు తదనంతరం.

రాజకీయవిధానాలు మారుటతో నాలుగు వామపక్ష పార్టీలు చేరువగుటతో జాతీయ రాజకీయాలలో గణనీయమైన మార్పులు వచ్చాయి.

"ఇప్పటి నుండి కాంగ్రెసు (ఐ) వొకవైపు, కాంగ్రెసేతర ప్రతిపక్షపార్టీలన్ని ఐక్యసంఘటనగా మరోవైపు అనే ప్రశ్న వుదయించలేదు. వామపక్షం కాంగ్రెసు (ఐ) బ్యాండు మేళంలోకాని, కాంగ్రెసేతర ప్రతిపక్షాలన్నిటి ఐక్యసంఘటన అనే బూర్జువా ప్రతిపక్షాలతో గాక స్వతంత్రశక్తిగా నెమ్మదిగా, ధృఢంగా రూపొందనారంభించింది.[1]

ఆచరణలో 1980, 1984 లోక్‌సభ జనరల్ ఎన్నికలలో పెక్కు రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికలలో ఐక్యపోరాటం వాస్తవంగా కొన్ని రాష్ట్రాలలో జరిగింది. పశ్చిమ బెంగాలులో మూడోసారి జ్యోతిబసు ప్రభుత్వం, నృపేన్ చక్రవర్తి ప్రభుత్వం, త్రిపురలో వామపక్ష ప్రజాస్వామ్య లౌకిక శక్తుల సంఘటనా ప్రభుత్వం కేరళలో యేర్పడుట, వామపక్ష లౌకిక ప్రజాస్వామ్య శక్తులు ఐక్యమగుట, యింకే మాత్రం వూహగాదని, సాధించగల వాస్తమని యీ పరిణామాలే స్పష్టం చేస్తున్నవి.

ఇదే కాలంలోనే లౌకిక ప్రతిపక్షాలనేకం జనతా, లోక్‌దళ్ రెండు గ్రూపులు, కాంగ్రెసు (యస్) తెలుగుదేశం, ద్రవిడమున్నేత్రకజగం తదితరులు వామపక్షాల సమిష్టి ఉద్యమాల ఐక్యకార్యాచరణలో కలసి వచ్చారు. పెంపొందుతున్న యీ వామపక్ష, లౌకిక, ప్రజాస్వామ్య ప్రతిపక్షాల ఐక్యకార్యాచరణ విచ్ఛిన్నం కావలసిందేనా? ఇదే వామపక్షేతర, లౌకికవాద నాయకులు కొందరు వామపక్ష సంఘటన వొకవైపు, మరోవైపు బి.జె.పి. గల ఐక్యసంఘటన అని అంటున్నారు. పురోగామశక్తులు వామపక్ష లౌకిక ప్రజాస్వామ్యశక్తుల సంఘటనను రూపొందించుకొని, మరింత బలపరచుకొనే, సరివధిక కర్తవ్యాన్ని చేబట్టవలసివుంటుంది.

వామపక్షాలు వొకసారి చేసిన విఫల "జనతా ప్రయోగాన్ని" తిరిగి చేసే ప్రయత్నం జరుగదని స్పష్టం చేయాలి. జరుగవలసింది వామపక్షవర్గాలు, పార్టీలు, లౌకిక ప్రజాస్వామ్యశక్తులు కలసి "మధ్యస్థం" కాని, "వామపక్షమొగ్గు" రాజకీయాలుగల ఐక్యసంఘటనా నిర్మాణం. దీనికి కార్మికవర్గ ఐక్యత, కర్షకవర్గ ఐక్యత, కార్మిక కర్షక ఐక్యత ప్రధాన పునాది కావాలి. అట్టి పునాదితో కూడిన ఐక్యసంఘటనయే పురోగామి వామపక్ష పార్టీల, లౌకిక ప్రజాస్వామ్య శక్తులను విజయవంతంగా ప్రజాసామాన్యానికి నాయకత్వం వహించి నడపగలదు.

## ౫.౫ రాష్ట్రపతి ఎన్నికలు

ఈ నేపధ్యంలో రాష్ట్రపతి ఎన్నికలు ప్రత్యేకతను సంతరించుకొన్నవి. హర్యానాలో కాంగ్రెసు పొందిన తీవ్ర అపజయము రాష్ట్రపతి ఎన్నికపై తీవ్ర సంచలనాన్ని

1. నంబూద్రిపాద్, ఇ.యం.యస్ (1987) లెరన్ ఫ్రండిపాస్ట్. పీపుల్సు డెమోక్రసీ. సెప్టెంబరు 27, 1987 పే.1.

కలుగజేసింది. కాంగ్రెసు (ఐ)లో అసంతృప్తి వాదులు తమ కార్యకలాపాలను ముమ్మరం చేయుట, బి.జె.పి, జనతా, తెలుగుదేశం, తదితర ప్రతిపక్ష పార్టీలు రాష్ట్రపతి జ్ఞాని జైల్‌సింగును స్వతంత్ర అభ్యర్థిగా పోటీ చేయమని ప్రోత్సహించసాగాయి. మరోవైపు ప్రధాన మంత్రిని లంచగొండితనం నేరంపై ప్రాసెక్యూట్ చేయమని ఆందోళన చేయసాగారు. రాష్ట్రపతి యీ విషవలయంలోపడిపోయి. స్వతంత్ర అభ్యర్థిగా పోటీచేయ సిద్ధపడ్డారు.

ఈ సందర్భంలో వామపక్షాలతోపాటు, కాంగ్రెసేతర ప్రతిపక్షాలు జనతా, తెలుగుదేశం కూడ శ్రీ వి.ఆర్. కృష్ణ అయ్యర్‌ను రాష్ట్రపతి పోటీ అభ్యర్థిగా నిలబెట్టుటకు హర్యానా ఎన్నికలకు ముందే ఆమోదించారు. కాని ఎన్నికల తరువాత బూర్జువా ప్రతిపక్ష పార్టీలు మనసు మార్చుకొని, కాంగ్రెసు (ఐ) అసమ్మతివాదులు కొందరి ప్రోత్సాహంతో జైల్‌సింగును స్వతంత్ర అభ్యర్థిగా నిలబెట్టగా, కాంగ్రెసులోని మరి కొందరు బలపరచగలరని తలచారు. ఈవిధంగా అయితే, కమ్యూనిస్టులు, వామపక్షాలు తమ్ము అనుసరించివుంటవని యోచించారు. కాని సి.పి.ఐ., సి.పి.ఐ(యం) లు గత చరిత్రకారణంగా జైల్‌సింగ్‌ను బలపరచజాలమని, యేసూత్రాలకు బద్దులు కాని కాంగ్రెసు (ఐ) అసమ్మతివాదులపై ఆదారపడజాలమని స్పష్టం చేసారు.

అసలు విషయం, దేశ రాజకీయరంగంపై వామపక్షాలు బలమైన శక్తిగా అవతరించుట, బూర్జువా ప్రతిపక్షాలలో కొందరికి రుచించలేదు. అందుకే కుయుక్తులు, ఎత్తుగడలతో వామపక్షాలను ప్రక్కకు నెట్టి జైల్‌సింగ్ సహాయ సానుభూతులతో మితవాద ప్రత్యామ్నాయాన్ని రూపొందించే ప్రణాళిక చేబట్టారు. ఇది నెరవేరుట అంటే రాజీవ్‌గాంధి మొదవిడిన ఆర్థిక విధానాలు సంస్కరణలు కొనసాగించుట, అమెరికా కోరికపై మన సాంప్రదాయక ఆర్థిక విదేశాంగ విధానాన్ని త్రోసివేయుటయే అగుతుంది. నిజమైన ప్రతిపక్షం అభివృద్ధి చెందదు. అంచేతనే బూర్జువా పార్టీలు వారి యోచనలు ఆచరణలో పెట్టితే, వామపక్షాలు తమస్వతం అభివృద్ధిని నిలబెట్టగలమని సందేహానికి తావులేకుండా స్పష్టం చేసాయి. ఫలితంగా జైల్‌సింగు తాను రెండవసారి రాష్ట్రపతిఎన్నికలలో అభ్యర్థిగా పోటీ చేయుటలేదని ప్రకటించారు. మరో మార్గం లేక బూర్జువా ప్రతిపక్షపార్టీలు శ్రీ వి.ఆర్. కృష్ణయ్యర్‌ను ప్రతిపక్షాల అభ్యర్థిగా ఆమోదించాయి.

ఈ పరిస్థితులలో వామపక్ష పార్టీలు ముఖ్యంగా సి.పి.ఐ., సి.పి.ఐ(యం)లపై వామపక్ష లౌకిక ప్రజాస్వామ్య శక్తుల ఐక్యతను అఖిలభారతస్థాయిలో సత్వరం నిర్మించవలసిన భాద్యత వుంది. అట్టి ప్రత్యామ్నాయాన్ని నిర్మించిన, బృహత్తర అవకాశాలను చరిత్రముందుకు తెస్తుంది. కమ్యూనిస్టుశ్రేణులు ఐక్యతతో రూపొందే రాజకీయపరిణామాలు, అవి ప్రసరించగల ప్రభాత కాంతులను అందరూ గుర్తించారు. శ్లాఘించారు.

కొంతకాలంగా, రాష్ట్రపతి ప్రధానుల మధ్య తీవ్ర అభిప్రాయభేదాలు ప్రబలుతున్న వార్తలు వస్తున్నవి. రాజీవగాంధి అనుచరమంత్రులు కొందరు వెన్నుపోటు పొడిచే వైఖరిని

రాష్ట్రపతి యెడల అవలంభించుతున్నారనే అపవాదులు వినపడతున్నవి. పోస్టలు బిల్లుపై సాధారణ పౌరులు ప్రశ్నించే అంశాలను రాష్ట్రపతి పరిగణలోనికి తీసుకొని అభ్యంతరాలను తెలిపినపుడు, గతంలో జైలుసింగు దేశయాంగమంత్రిగా నున్నపుడు తానే ప్రతిపాదించిన బిల్లును యిప్పుడు వ్యతిరేకించుటలోని నైతిక సూత్రాలు ప్రశ్నార్ధకమైనవి. రాష్ట్రపతి భవనంలో జాతి వ్యతిరేకశక్తులకు సత్కారాలు జరుగుచున్నవని, వొక కాంగ్రెసు (ఐ) పార్లమెంటు సభ్యుదు నిందవేసారు. ప్రతిఫలంగా ఆపార్లమెంటు సభ్యుని మంత్రివర్గంలో స్థానం లభించింది. కేరళలో మరోమంత్రి పత్రికలలో ప్రకటించుటకాదంటూనే, రాష్ట్రపతి భవనం అమెరికన్ సి.ఐ.ఎ ఏజంట్లకు స్థావరమైందని పేర్కొన్నారు. కొంతమంది పార్లమెంటు సభ్యులు రాష్ట్రపతిని యింపీచమెంటు చేయుటకు ఆలోచన చేస్తున్నారనే వార్తను బయటకువదలారు. ఏకాంగ్రెసు నాయకుదు గాని, రాజీవగాంధీ కాని వీటిని ఖండించలేదు. రాష్ట్రపతి రాజ్యాంగచట్టం ప్రకారం వివరణ కోరినందున రాజకీయ ఘటనలు, పరిణామాలను తెలియజేస్తూ వుండనందున, సమాచారం అందివ్వక, రాష్ట్రపతి హక్కులను అమలు పరచనందున మంత్రి వర్గ నిర్ణయాలు తరుచు తెలుపుతూ వుండనందున, సంబంధాలు హృదపూర్వకంగా వుండుటలేదు.

రాజీవ్‌గాంధీ అతని అనుచరులు రాష్ట్రపతికి తెలుపవలసిన అవుసరం లేదనే వరకు వెళ్లారు. పైగా రాజీవ్‌గాంధీ స్వయంగా యీ అంతర్గత విషయాలను బహిరంగం చేసారు. రాష్ట్రపతికి తాను విషయాలను ఎప్పటికప్పుడు తెలియజేస్తున్నానని పార్లమెంటులో ప్రకటించారు. సమస్యను ప్రక్కదారులు పట్టించారు. ఈ అసత్యం, రాష్ట్రపతి వుత్తరం వ్రాయుటతో బహిర్గతమైంది. దీనిపై నిరసన పార్లమెంటులో చర్చ జరగాలనే బలమైన కోర్కె వెల్లడైంది. లోక్‌సభలో చర్చ విషయమై స్పీకరు రూలింగు యిచ్చుటతో, ఉత్తర ప్రత్యుత్తరాలు రహస్య పత్రాలని పేర్కొనుట జరిగింది.

ఈ సంక్షోభం, కాంగ్రెసు (ఐ) పార్లమెంటుసభ్యులు, స్టేటుమంత్రులు అందరూ తాము చట్టానికి అతీతులుగా ప్రవర్తించుటతో యేర్పడింది. అత్యవసర పరిస్థితి ఎప్పుడో ఎత్తివేయబడినా, రాజ్యాంగ సూత్రాలు, ప్రజాస్వామ్య హక్కులు పునరుద్ధరించనందున, అధికార కేంద్రీకరణ మరింత పెరిగిపోతున్నందున ప్రజలలో అసంతృప్తి పెరిగిపోయింది. వాస్తవానికి పెరిగిన నిరంకుశత్వం ప్రజాస్వామ్యానికి మధ్య జరిగే పోరాటమిది.

## ౫.౬ కాంగ్రెసుకు మరో బూర్జువా ప్రత్యామ్నాయాన్ని నిర్మించే ప్రయత్నాలు

ఈ కాలంలోనే కాంగ్రెసు (ఐ) కి కేంద్రంలో మరో బూర్జువా ప్రత్యామ్నాయాన్ని నిర్మించే ప్రయత్నాలకు నాందిగా యన్.టి. రామారావు మే 14-15, 1987లలో ప్రతిపక్ష పార్టీల సమావేశాన్ని యేర్పాటు చేసారు. హర్యానాలో కాంగ్రెసు (ఐ) చిత్తుగా వోడిన అనుభవంతో రామారావు హెగ్డేలు "కలగలుపు" ప్రతిపక్షాల కూటమిని, అస్పష్ట కార్యక్రమంతో యేర్పాటు చేసే వైఖరి చేబట్టారు. ఎన్నికల అనంతరం శ్రీ హెగ్డే "ప్రతిపక్ష పార్టీల ఫెధరేషన్" యేర్పాటు చేయాలని ప్రకటించారు. శ్రీ రామారావు "భారతదేశం"

పార్టీని నిర్మించాలనే ప్రతిపాదనను ఢిల్లీ సమావేశంలో కాన్ఫెడరేషన్‌గా చూచించారు. దీనిని సి.పి.ఐ.,సి.పి.ఐ(యం) తదితర వామపక్షాలు వ్యతిరేకించాయి. కాంగ్రెసు స్థానం "వామపక్ష, లౌకిక ప్రజాస్వామ్యశక్తులు బర్తీ చేయాలన్నవి. అంతేగాక సామ్రాజ్యవాద, గుత్తపెట్టుబడిదారి, భూస్వామ్య వ్యతిరేక ప్రజాస్వామిక కార్యక్రమం వాటికి ప్రాతిపధికగా వుండాలని కోరాయి. ఈవిధంగానే కాంగ్రెసు నమూనా సోషలిజం, లౌకిక ప్రజాస్వామ్య విధానం, అలీన విదేశాంగ విధానం, పరిరక్షింపబడుతుందని స్పష్టం చేసారు. ఈ విధంగా వామపక్షాలుముఖ్యంగా సి.పి.ఐ.,సి.పి.ఐ(యం) లు వొక బలమైన ప్రతిపక్షంగా అవతరించి, తమ చుట్టూ ప్రజాస్వామ్య లౌకిక తదితర శక్తులను కూడగట్టుకొని క్రమేణ వామపక్ష లౌకిక ప్రజాస్వామ్య శక్తుల ప్రత్యామ్నాయాన్ని జాతీయ స్థాయిలో యేర్పాటు చేయగల శక్తిని సంపాదించగలవని వాటి విశ్వాసంగావుంది. అంతేగాక, అవకాశవాదాన్నే సిద్ధాంతంగా చేబట్టే మిత, మతవాదశక్తులు యేవిధంగానైనా అధికారాన్ని హస్తగతం చేసుకొనాలనే వారి ఎత్తులను చిత్తు చేయగలమని కూడ వారి విశ్వాసం. ఆవిధంగానే, రాజ్యాంగ చట్టాన్ని పరిరక్షించగలమనుకొంటున్నారు.

ఈ సందర్భంలో రెండు ఘటనలు పేర్కొనవలసివుంది. రాష్ట్రపతికి ప్రధానమంత్రిని బర్తరఫ్ చేసే అధికారం ఉందా? లేదా? అనే ప్రశ్న వుదయించినపుడు సి.పి.ఐ (యం), సి.పి.ఐలు, జాతీయ సమన్వయ కమిటీలు పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని పరిరక్షణకు, దృఢమైన వైఖరిచేబట్టినది. ప్రధానమంత్రిని రాష్ట్రపతి బర్తరపు చేయవచ్చేనే సలహా ఎవరిచ్చినా, అది రాజ్యాంగాన్ని త్రోసి బుచ్చే కుట్ర అగుతుందని హెచ్చరించింది. ఇది మంచి ఫలితాన్నిచ్చింది. వెంటనే ప్రతిపక్షాలు రాష్ట్రపతికి అట్టి అధికారం లేదని ప్రకటించాయి. రాజ్యాంగాన్ని ధిక్కరించే కోరిక తనుకు లేదని రాష్ట్రపతి బహిరంగప్రకటన చేసి, ప్రజలసందేహాలను నివృత్తి చేసారు.

ఇట్టిదే, రాష్ట్రపతి ఎన్నికకు అభ్యర్థులను ఎంచుకొనునపుదు జరిగింది. ఏప్రిల్ 1987లో సి.పి.ఐ అందరి ఆమోదం పొందిన యేపార్టీకి చెందని వ్యక్తిని అభ్యర్థిగా ఎంచుకొనుటమంచిది అని ప్రకటించింది. రాజీవ్‌గాంధీ యీ ప్రతిపాదనను హర్షించకపోతే ప్రతిపక్షాలు తమ అభ్యర్థిని నిలబెట్టేస్థితికి త్రోసివేయబడతాయని ప్రకటించింది. అప్పుడు కూడ యేపార్టీకి చెందని వారినే అభ్యర్థిగా ఎంచుకొనాలని స్పష్టం చేసింది. రెండు కమ్యూనిస్టుపార్టీలు వొక వైఖరినే చేబట్టాయి. అంచేత, మిత, మతవాద అభివృద్ధి నిరోధకుల రాజ్యాంగేతర కుట్రలు భగ్నం చేయబడుట ఎంత తేలిక అయినదో యింతకు ముందే తెలుసుకొన్నాము. బి.జె.పి నాయకత్వంలో గుత్త వార్తాసంస్థలు కొన్ని యీ కుటిల యత్నాల పాత్రధారులని, చెప్పాలి. రాబోవుకాలంలో యీ రాజకీయ సంక్షోభం మరింత తీవ్రమయ్యే సూచనలు కన్పడుతున్నవి.

స్వాతంత్రానంతర కాలంలో దేశంలో ఆర్థిక పారిశ్రామిక, వ్యవసాయోత్పత్తిరంగాలలో కొరత అభివృద్ధిని సాధించినా, దురదృష్టకరంగా సామాజిక రంగంలో కాంగ్రెసుతో సహాబూర్జువా రాజకీయ పార్టీలు తమ రాజకీయ ప్రయోజనాల కొరకు మతాన్ని ఒకసాధనంగా వినియోగించ సాగాయి. ఇది జాతీయ జీవనం అత్యంత ప్రమాదకర

పరిస్థితిలోపడి పోవుటకు దారి తీసింది. లౌకిక, ప్రజాస్వామ్యాభివృద్ధి కుంటుపడింది. అంతేగాక 150 సంవత్సరాలక్రితం సతీసహగమన నిషేదచట్టం చేయబడినా, అది పునరుద్ధరించబడాలనే చాందసులు తలెత్తుట యిటీవల రాజస్థాన్‌లోవొక స్త్రీని బలవంతంగా సతీసహగమనం చేయించుట, రాజస్థాన్ జనతా, బి.జె.పిల నాయకులుదానిని సమర్ధించుట దురదృష్టకరము. ఈ ఘటనలు దేశం ఎంతటి ప్రమాదకర మౌఢ్యమార్గంలో పయనించే అవకాశాన్ని తెల్పుతుంది. ఇందిరాగాంధీ ప్రధానిగా చివరిరోజులో సనాతన విధానాలననుసరించి మత, పూజా మందిరాల సందర్శన, పూజలు జరిపి, ప్రభుత్వ ప్రచారం ముమ్మరంగా చేయించుకొంది. జనతా పాలన 1977-79 కాలంలో ప్రతిపక్ష రాజకీయపార్టీలు బహిరంగంగా మత మౌఢ్యకవాతు దళాలైన ఆర్.యస్.యస్.ల రాజకీయ పెంపుడు బిడ్డయైన జనసంఘంతో సహకార పొత్తును నెరపుటతో వారికి లేని రాజకీయ గౌరవాన్ని తెచ్చిపెట్టారు. ఈ తప్పిదం కొన్ని వామపక్ష పార్టీలు అప్పుడప్పుడు చేసాయి. ఈ విధానం, రాజ్యాంగంలోని లౌకికాంశాలను, ప్రజాస్వామ్య సూత్రాలను ప్రశ్నించే ప్రమాదాన్ని తెచ్చింది. ఆర్.యస్.యస్., బి.జె.పిల అక్రమసంతానం విశ్వహిందూ పరిషత్తు భారతదేశాన్ని "హిందూ మత దేశంగా" ప్రకటించాలని, కాశ్మీర్‌ను "ముస్లింరాష్ట్రంగా" ప్రకటించాలని జమాత్ ఇ యిస్లామీ; పంజాబును, "ఖలిస్తాన్"గా ప్రకటించాలని శిక్కుస్తాన్ వుద్యమాల మత మౌఢ్యచాందసశక్తులు కోరుతున్నాయి. పాలనా యంత్రాగం ముఖ్యంగా పోలీసు శాఖలో మతతత్వం, అల్పసంఖ్యాకులవ్యతిరేకత మీరటు కలహాలలో స్పష్టమైంది. అన్ని మతాల చాంధస భావాల వ్యాప్తికి రేడియో, టి.వీ., ప్రభుత్వ, ప్రవేటు సాధనాలు బాగదా వుపయోగిస్తున్నారు, యిది మన లౌకిక, ప్రజాస్వామ్య రాజ్యాంగ సూత్రాలకు వ్యతిరేకము.

ఈ నేపథ్యంలో లౌకిక, ప్రజాస్వామ్య ప్రతిపక్షాలు సూరజ్‌కుండ్‌లో బి.జ.పి మత తత్వ పార్టీలతో చేతులు కలిపి, భుజాలు రాసుకొనుట ఆశ్చర్యాన్ని కలిగించదు.

పంజాబ్‌లో ఖలిస్తాన్ హింసా దౌర్జన్యవాదులకు వ్యతిరేకంగా పోరాడుతూ సి.పి.ఐ., సి.పి.ఐ(యం) లలోని వందలకొలది కార్యకర్తలు ప్రాణత్యాగాలు చేసారు. మతశక్తులకు వ్యతిరేకంగా 1987 సెప్టెంబరు 29న బ్రహ్మాండమైన ప్రదర్శనలలో పంజాబ్, హర్యానా, ఢిల్లీ, పశ్చిమ యు.పి.రాష్ట్రాలలోని లక్షల కొలది ప్రజాసామాన్యం పాల్గొన్నది. మతతత్వశక్తులకు, వేర్పాటు వాదులకు వ్యతిరేకంగా జాతీయ కన్వెన్షను పిలుపునిచ్చి, జయప్రదంగా భారత్ బందును, ప్రదర్శనను లౌకిక, ప్రజాస్వామ్య శక్తులు జరిపాయి.

ఈ ఐక్యకార్యాచరణ 40వ భారతస్వాతంత్రోత్సవ కానుకగా సి.పి.ఐ(యం), సి.పి.ఐ., వామపక్ష ప్రజాస్వామ్యశక్తులు సమర్పించాయి.

కాంగ్రెసు పాలనకు ప్రత్యామ్నాయంగా బూర్జువా "రెండు పార్టీలు" విధానాన్ని ప్రవేశపెట్టి దేశంలో పార్లమెంటరీ బూర్జువా ప్రజాస్వామాన్ని సుస్థిరం చేయాలనే ప్రయత్నాలు 1952 ప్రథమ ఎన్నికల కాలంలోనే జరిగాయి. అప్పటి సోషలిస్టుపార్టీ

ఆవిధంగా అభివృద్ధి చెందుటకు నెహ్రూ నైతికప్రోద్బలాన్ని యిచ్చాడు. హర్యానాలో 1987లో జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో కాంగ్రెసు చిత్తుగా వోడిపోయి, లోక్‌దళ్ దేవీలాల్ నాయకత్వంలో అఖండ విజయం సాధించుటతో, ప్రతిపక్షాల ఐక్యత, ఏడు ప్రతిపక్షాలు కలసి నేషనల్ ఫ్రంటు -జాతీయ సంఘటన యేర్పడుటతో దేవిలాల్ చౌదరి, దేశంలో చివరకు "రెండు పార్టీల పార్లమెంటరీవ్యవస్థ స్థిరపడగలదని" ప్రకటించారు. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, తెలుగు దేశం అధ్యక్షుడు యన్.టి.రామారావు, అంతకుముందు మురార్జీదేశాయ్, ఆచార్యారంగా, రాజగోపాలాచారులు యీ లక్ష్య సాధనకు గతంలో విఫలయత్నాలు చేసారు. బూర్జువావర్గ ప్రయోజనాలను ఆశించే పెట్టుబడిదారీ భూస్వామ్య, మధ్యతరగతి మేథావి వర్గాలు భారతదేశంలో యిట్టి గట్టి ప్రయత్నం జరుగనిచో "వామపక్ష అరాచశక్తులు" ప్రబలి దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని రద్దు చేసి, నిరంకుశత్వం పాలిచుతుందని ప్రజలలో భయత్పాతాన్ని కలిగించ చూస్తున్నారు.

ఆవిధంగా, జవహర్‌లాల్ నుండి దేవిలాల్-రామారావుల వరకు యీ మార్గంలో ప్రతిపక్ష బూర్జవా పార్టీలు యీ విఫలయత్నాలను చేస్తూనే, పరిస్థితులు విషమించుటతో మౌనం వహించారు. అట్టి అవకాశం లభించితే అందుకు ఎప్పుడూ సంసిద్ధమే, కారణం అందరకు వివిధ మోతాదులలో కమ్యూనిస్టు వ్యతిరేకత అంతర్గతంగా వుంది, స్థానిక రాజకీయ పరిస్థితులబట్టి అది పరోక్షంగానో ప్రత్యక్షంగానో ప్రత్యక్షమగుతుంటుంది. కమ్యూనిస్టు, వామపక్షేతర రెండు పార్టీల బూర్జువా పార్లమెంటరీ విధానాన్ని లక్ష్యంగా బూర్జువా పాలక పార్టీ బూర్జువా ప్రతిపక్ష పార్టీ లేక సమాఖ్యలు మాత్రమే పాలించుతూ వుండాలని, ఆవిధంగా వామపక్షాలను ముఖ్యంగా కమ్యూనిస్టుపార్టీలను అధికార పీఠానికి దూరంగా వుంచాలనే అంతర్గత కమ్యూనిస్టు వ్యతిరేకత కొన్ని వర్గాలలో బలంగా వుండుటయే దీనికి కారణము. అభ్యుదయ కరవర్గాలు దీనికి విరుద్ధంగా ఆలోచించుతున్నా, శక్తివంతంగాలేవు.

ఈవిధంగా అవాంచనీయ పరిణామాల అభివృద్ధి, ప్రజాస్వామ్య, లౌకిక, వామపక్ష శక్తులు, ఫెడరలు విధానాలు కోరే వారందరిని కలవరపరచాయి. వేర్పాటు వాద, మత శక్తులకు వ్యతిరేకంగా, వారిని బలపరచే సామ్రాజ్యవాద, వారి తైనాతీలపై ఐక్యపోరాటాన్ని జరిపి, ఐక్యత రక్షించుటయే యేకైక మార్గం సి.పి.ఐ., సి.పి.ఐ(యం), తదితర వామపక్షాలు మాత్రమే, ధృడంగా ఎదుర్కొనుట సాధ్యం. వాస్తవానికి వారే మత, వేర్పాటు వాదులకు, విచ్ఛిన్నవాదులకు వ్యతిరేకంగా పోరాడుతున్నారు.

## 5.7 వామపక్ష, లౌకిక, ప్రజాస్వామ్య సంఘటనల నిర్మాణ పోరాటాలు

బూర్జువా, భూస్వామ్యవర్గాల మధ్య అభిప్రాయభేదాలతో సంఘర్షణలు, తిరిగి కలయికలు యెక్కువగుతున్నవనే కమ్యూనిస్టు శ్రేణుల అవగాహన వాస్తవమేనని, నేటి రాజకీయ ఘటనలు తెల్పుతున్నవి. మొదట భూస్వామ్యవర్గాలు వ్యవసాయ వుత్పత్తుల ధరలు పెంచాలనే బ్రహ్మాండమైన వుద్యమాన్ని విజయవంతంగా సాగించారు. ఈ కోర్కెలు

న్యాయమైనవే అయినా, వాటికై వుద్యమాన్ని సాగించే ముందు వారు తాము రైతులమనే భావించుకొనుటయేగాక, రైతాంగవుద్యమాన్ని వారి ప్రయోజనాలకై ప్రభుత్వంపై వొత్తిడి తెచ్చుటకు వినియోగించు కొంటున్నారు. రెండో విషయం, శక్తివంతమైన యీ వుద్యమాన్ని భూస్వాములు విద్యుచ్ఛక్తి చార్జీలు వగైరాలు తగ్గించుకొనుటకు వినియోగించారు. ఉత్తరప్రదేశ్‌లో సన్నకారు చిన్న కారు రైతుల దుర్భరకష్టాలను త్రోసిబుచ్చి, తమ ప్రయోజనాలకు ఉపయోగించుకొన్నారు. మూడో విషయం, సహకార సంఘాలలోని సన్నకారు, చిన్నకారు రైతులు అప్పులను రద్దు చేయాలనే వారి కోర్కెలను, భూస్వాముల అప్పులను రద్దుచేయుటకు వినియోగించుకొన్నారు. రైతాంగ వోటరుల సంఖ్యాబలాన్ని భూస్వాములు వారి ప్రయోజనాలకు వినియోగించే ప్రయత్నాలు యీ వుద్యమాల ద్వారానే చేస్తూనే వున్నారు. భూస్వామ్య వర్గాలు, శక్తులు వ్యవసాయ ఆదాయపన్నులు రాకుండా సూచుకొంటూనే వున్నవి. అంతేగాక, పారిశ్రామికులు తోటలు పెంపకం పేరుతో పెద్ద మొత్తాల నల్లధనాన్ని తెల్లధనంగా మార్చుకొనుటకు వినియోగించుకొంటూ తిరిగి పారిశ్రామికరంగానికి, పన్నులు తప్పించుకొని కుబేరులగుతున్నారు.

బూర్జువా, భూస్వామ్య వర్గాల మధ్య సంఘర్షణ తీవ్రమగుటతో వ్యవసాయ సంక్షోభం తీవ్రతరమైంది. ఫలితంగా గ్రామసీమల అభివృద్ధికి యిచ్చే వనరులు, సహాయ పధకాలు వెనుకాడుట, వ్యవసాయకూలీలకు అఖిలభారతస్థాయిలో "కనీసకూలి" నిర్ణయం చట్టం అమలు మూలపడింది. ఈవిధంగా బూర్జువా భూస్వామ్య ప్రభుత్వం, గ్రామీణ ప్రాంతాలలో మార్కెట్టును విస్తరింపచేయాలనే ప్రణాళికలు వెనుకాడినవి. భూస్వాములు "గ్రామీణ ప్రాంతాలలో ప్రశాంత పరస్థితులను యీ చట్టాలతో కల్లోల పరచరాదనే" నినాదాన్ని చేబట్టారు. వామపక్ష వ్యవసాయ రైతు, కూలీ వుద్యమాలు అశాంతిని రేపుతున్నవనే, అరిగిపోయిన రికార్డు పెట్టారు.

గతకొలది సంవత్సరాలుగా కాంగ్రెసు (ఐ) లో అంతర్గత సంఘర్షణలు మిన్నంటాయి. ప్రభుత్వం చేబట్టిన నిరంకుశత్వవిధానాలు, సంస్థ నిర్మాణ వ్యవహారాలలోనికి వ్యాపించాయి. సంస్థాగత ఎన్నికలు కాంగ్రెసులో 19సంవత్సరాలనుండి జరుగలేదు. నాయకత్వాలు క్రింది శ్రేణినాయకులను, కార్యకర్తలను ముఖ్యంగా సభలలో చర్చలు భయపెడుతున్నవి. పార్టీ అంతర్గత సంఘర్షణలు, నిరంకుశ విధానాలను పరిష్కరించుట, మంత్రి వర్గాలలో, నాయకత్వ శ్రేణులలో సంఘర్షణలు, మరింత తీవ్రమగుటకే దారి తీసింది. దగ్గరి దగ్గరిగా అన్ని రాష్ట్ర మంత్రి వర్గాలు ఆయా రాష్ట్ర కాంగ్రెసు నాయకత్వంతో సంఘర్షణతో వున్నవి. కాంగ్రెసు శాసనసభ్యులే గ్రూపులు గ్రూపులై సంఘర్షించు కొంటున్నారు.

ఈ కారణాలతోనే అనేక రాష్ట్రాలలో మంత్రి వర్గాలలో మార్పులు, ప్రభుత్వ వర్గాలకు అనుకూలంగా చేయబడినవి. ఈమార్పులు, సంఘర్షణలు యినుమడింప జేయుటకే తోడ్పడినవి. ఫలితంగా, రాజీవ్‌గాంధీ స్వంతరాజకీయసంస్థపై విశ్వాసాన్ని కోల్పోయి ప్రపంచబ్యాంకు, ఐ.యం.యఫ్.ల ద్వారా అందుతున్న మొత్తాలను వినియోగించుటకు, గ్రామీణ ప్రాంతాలలో విదేశ సంస్థలు యేర్పాటు చేయబడినవి. వివిధ సంస్థలను యీ

సంక్షేమ కార్యక్రమాలు చేబట్టుటకు స్వాగతం చెప్తూతున్నాయి. సామ్రాజ్యవాద శక్తులు, మన ప్రభుత్వం తనప్రభావాలను ప్రసింపజేయుటకు విదేశ సంస్థలు గ్రామీణ ప్రాంతాలలో వ్యాపించిన, మరో ఆయుధం, వారికి లభించినట్లే అగుతుంది.

భారత ప్రభుత్వం అత్యున్నతవర్గాలలోనే "అవినీతి భూతాలు" వ్యాపించి, "రక్షణ వ్యవస్థ" ను సైతం కలుషితం చేయుట," ప్రజలను ఆశ్చర్యచకితులను చేయుటయేగాక, ప్రజలు ప్రస్తుతపాలక వ్యవస్థపై విశ్వాసం కోల్పోవునట్లు చేసింది."బోఫోర్స్" ఉదంతం "జలాంతర్గాముల" వొప్పందం, అందులో బోఫోర్సు పిరంగుల నాణ్యత, సమర్థతలపై వెలిబుచ్చబడిన సందేహాలు, ప్రజలను, వాటిపై ఆధారపడి అవసరమైతే యుద్ధ రంగంలోనికి దిగవలసిన సైన్యాధికారులు, సైన్యంలో సహితం ఎంతటి "విశ్వాస సంక్షోభాన్ని" కలుగజేసామో వూహించజాలము. పాలకులు స్వప్రయోజనాలకై "ఎందరి ప్రాణాలనైనా బలిపెట్టగలరనే" భయ, సందేహాలు కలుగక మానవు.

ఈ పరిస్థితులలో ప్రతిపక్ష పార్టీలు పరస్పరం, సమిష్టిగా, సంప్రదింపులు జరుపుకొంటూ, కొన్ని తాత్కాలికంగానైనా యేకగ్రీవామోదం పొందిన అంశాలు, అవగాహనలు పెంపొందించుకొంటూ, వారి రాజకీయ చైతన్యాన్నిపెంచి, సమస్యలపై ఐక్యకార్యాచరణ చేబట్టవలసిన అవసరమెంతో వుంది. ఈ విషయాన్ని రెండు కమ్యూనిస్టుపార్టీలు సి.పి.ఐ., సి.పి.ఐ(యం)ల కాంగ్రెసులు ప్రస్తావించి యుండుట గమనించవలసిన విషయం. కుల, మత పార్టీలు మినహా అన్ని ప్రతిపక్షపార్టీలు, అందరి ఆమోదం యేకగ్రీవంగా పొందిన కనీస కార్యక్రమం భూమికగా వామపక్ష, లౌకిక, ప్రజాస్వామ్య పక్షాల సంఘటన యేర్పాటుకై అన్ని పార్టీలతో సంప్రదింపులు జరుపుతూనే వుంది. ఈ సంఘటన కుల, మత పార్టీలకు, విచ్ఛిన్నయేర్పాటు వాదులకు వ్యతిరేకంగా పోరాడాలని రెండు కమ్యూనిస్టుపార్టీల అవగాహనగా వుంది. ఆగస్టు 1987 కేంద్రకమిటి తీర్మానంలో సి.పి.ఐ(యం) యీ విషయాన్నే స్పష్టం చేసింది, "అన్ని లౌకిక ప్రతిపక్షాల ఐక్యతతోపాటు వామపక్ష ప్రజాస్వామ్యపక్షాల అందరి ఐక్యత ఏర్పడాలని, అందుకు వామపక్ష ఐక్యత భూమిక కావాలని, సందేహం లేకుండా వివరించింది. అట్టి ఐక్యత ప్రజలలో విశ్వాసాన్ని కలిగించి పోరాటోన్ముఖులను చేసింది.

పార్లమెంటు, రాష్ట్ర అసెంబ్లీలలో వామపక్షాలు ముఖ్యంగా రెండు కమ్యూనిస్టుపార్టీలు సి.పి.ఐ., సి.పి.ఐ(యం)లు కుల, మత శక్తుల వ్యతిరేక వైఖరి అవలంభించి, తీవ్ర విమర్శలకు గురిచేయుట, వారి జాతీయ ఐక్యతావ్యతిరేక వైఖరిని ఎండగట్టుటలో, కాంగ్రెసేతర ప్రతిపక్షాలు అనేక సమస్యలపై పార్లమెంటు, ప్రభుత్వ వ్యతిరేక పోరాటాన్ని సాగించుటతో బి.జె.పి వేరుపడి, కాంగ్రెసేతర శక్తులనుండి దూరమైంది. రాష్ట్రపతి ఎన్నికల విషయంలో, కాంగ్రెసు (ఐ) అభ్యర్థికి పోటీ అభ్యర్థిని ఎన్నుకొనే విషయంలో కూడ బి.జె.పికి దూరమైంది. ప్రతిపక్షాలు చాలకాలం వరకు రాజకీయాలు అభివృద్ధి నిరోధక మత, కుల తత్వాలు, వేర్పాటు వాదాలతో సంబంధం లేకుండా అందరూ కలసే కాంగ్రెసు (ఐ) వ్యతిరేక ఐక్యత రూపొందించాలనే వైఖరి వుండేది. వామపక్షాలు, లౌకిక పార్టీలతో మాత్రమే సహకరించి, మద్దతు నిస్తామని, ధృడవైఖరిని చేబట్టుటతో,

అన్ని ప్రతిపక్షాలు ఐక్యత అనే అవగాహననుండి, బి.జె.పి ని క్రమేణా, తొలగించుట జరిగింది. అనేక ప్రతిపక్షాలతో యేర్పడిన నేషనల్ ఫ్రంటు, వామపక్షాలు సూత్ర బద్ధమైన పోరాటాన్ని మతశక్తులకు వ్యతిరేకంగా సాగించుటవలన పురోగమనం సాధ్యమైంది. నేషనల్ ఫ్రంటు సామ్రాజ్యవాద వ్యతిరేక, అలీన విధానాన్ని చేబట్టుటలో వూగిసలాటను ప్రదర్శించింది. ఫ్రంటులోని పలుపార్టీలు ప్రధానంగా గ్రామీణ ప్రాంతాలలోనే అధిక బలాన్ని కలిగి, సమీకరించుకొంటూ వుండుటతో, అదేకాలంలో రైతాంగం, వ్యవసాయకూలీలు భూసంస్కరణలు, కనీస వేతనాలకై జరిగే ప్రజాపోరాటాల యెడల వూగిసలాటను. వుత్సాహలేమిని ప్రదర్శించుట సహజమైంది. కారణం బూర్జువా ప్రతిపక్షాలో కూడ భూస్వామ్య వర్గాల ప్రభావం యెక్కువగా వుంది. వీటిలో యెక్కువభాగం ప్రాంతీయ బూర్జువా భూస్వామ్యవర్గాలకు ప్రాతినిధ్యం వహించుచున్నందున, ఆవర్గాల సహజ లక్షణాలుగా వామపక్షాలు అర్థం చేసుకొనవలసినవుంటుంది. అప్పుడే నేషనల్ ఫ్రంటు, వామపక్ష, లౌకిక ప్రజాస్వామ్య సంఘటన భాగస్వామ్య వర్గాల అవగాహన, వాటికి గల పరిమితుల అవగాహనను విస్తృత పరుస్తుంది. అంచేతనే అన్ని పక్షాల ఆమోదం పొందిన కనీస కార్యక్రమ రాజకీయ అవసరాన్ని ప్రత్యేకంగా గుర్తించవలసిన అవసరం వుంది. అట్టి కనీస కార్యక్రమం ఆమోదించిన భాగస్వామ్య పార్టీలన్నీ ప్రభుత్వంలో కూడ, భాగస్వాములగుటకు తాత్కాలికంగానైనా ఆమోదం ముందుగానే తెలుపుట, ఫ్రంటుకు బలాన్ని చేకూర్చుతుంది. అదే కాలంలోయిట్టి సంఘటనలు భాగస్వామ్యపార్టీల నిర్మాణంలోని వర్గాల ఆటు –పోటులకు గురి అగుతుందనే వాస్తవాన్ని వివిధ నాయకత్వాలు మరచిన అస్థిరత్వం చోటు చేసుకొంటుంది.

నాడు వామపక్ష, లౌకిక ప్రతిపక్ష పార్టీలతో సామ్రాజ్యవాద, మత, కుల తత్వాలకు వ్యతిరేకంగా ప్రజాస్వామ్యం కొరకై జరిపే పోరాటం పాలక కాంగ్రెసు (ఐ) ప్రభుత్వంపై జరిపే పోరాటంలో భాగమే, అదే వామపక్షాలకు విజయాన్ని చేకూర్చి పెడుతుంది. అనే అభిప్రాయాన్ని రెండు కమ్యూనిస్టుపార్టీలు వెలిబుచ్చాయి.

దేశ ఐక్యతకు, మత దురహంకారానికి, ఖలిస్తాన్ వ్యతిరేకవుద్యమాలు, పోరాటాలలో కమ్యూనిస్టుపార్టీలు సి.పి.ఐ., సి.పి.ఐ(యం) లు రెండూ వందల కొలది కార్యకర్తల ప్రాణాలను కోల్పోయాయి. పంజాబ్‌లోనే గాక దేశమంతటా వామపక్షాలు ముఖ్యంగా కమ్యూనిస్టుల బలం, ప్రభావం ప్రజాస్వామ్య, జాతీయ వర్గాలలో విస్తారంగా పెరిగింది. పశ్చిమబెంగాల్, కేరళ, త్రిపురలలో వామపక్షసంఘటనల ప్రభుత్వాలు ప్రజాసామాన్యం కొరకు చేబట్టిన కార్యక్రమాల ఆచరణ, ఆయా రాష్ట్రాలలో కాంగ్రెసు (ఐ) ఎన్నికలలో ఘోర అపజయాలను వరుసగా పొందుట, వామపక్షాలు. కాంగ్రెసు (ఐ) వ్యతిరేక పోరాటంలో కనబరచిన నిజాయితీ దేశమంతటా వామపక్షాల యెడల సదభిప్రాయం కలుగజేసి, వారి బలాన్ని పెంపొందించింది. ఎన్నికల పోరాటాలలో యిదే పెట్టని పెట్టుబడి అయింది. వామపక్షాల ఐక్యకార్యాచరణ పెంపొందుటకు తోడ్పడింది.

కార్మిక, కర్షక, మధ్యతరగతి ప్రజాసామాన్యం యాదృచ్ఛికంగా జరిపే పోరాటాలు, నిర్మాణ స్వరూపాన్ని పొంది బృహత్తర సార్వజనీన సమ్మె పోరాటాలుగా అగుటతో

వామపక్షాల బలం, ప్రభావం పెరిగింది. ఈ 1985 సమ్మె పోరాటాలలో 8లక్షల 80వేలమంది పాల్గొనగా 1987లో 15లక్షల పాల్గొనుట జరిగింది. నేషనల్ ట్రేడు యూనియనులు ప్రచారోద్యమ సమితి పిలుపుననుసరించి అఖిల భారత కార్మిక ట్రేడ్‌యూనియనులు, కర్షక, మధ్యతరగతి వర్గాల సంఘాలు, విధ్యార్థి, యువజన, సమాఖ్యలు అన్ని వర్గాల ప్రజలను బ్రహ్మాండమైన పోరాటాలలో సమీకరించుటతో వామపక్షాల ప్రతిష్ట యినుమడించింది. నేషనల్‌ట్రేడు యూనియనుల ప్రచారోద్యమ సమితి నాయకత్వంలో 9 డిసెంబరు 1977 ఢిల్లీ ప్రజాప్రదర్శన, సెప్టెంబరు 1988లో రైతుల, వ్యవసాయకూలీ, ప్రజాస్వామ్య ఢిల్లీ ప్రదర్శనలు వామపక్ష ప్రజోద్యమాల నూతన శకానికి నాందిగా చెప్పవచ్చును.

ఈ పోరాటాలలో వామపక్షాలు ముఖ్యంగా సి.పి.ఐ., సి.పి.ఐ(యం)లు అత్యంతచొరవను వివిధ కార్మిక, కర్షక, మధ్యతరగతి వర్గాల సంస్థలు వర్గ చైతన్యాన్ని ప్రదర్శించుటకు అవకాశాన్ని కలుగజేసిన రాజకీయశక్తులన్నిటిని అభినందించాలి. వామపక్షాలు, మధ్యతరగతుల సంఘాలు తమ సంకోచాలను, వూగిసలాటలను, అదేవిదంగా వివిధ కమ్యూనిస్టు శ్రేణుల మధ్య సైద్ధాంతిక అభిప్రాయభేదాలున్నా కలసి చొరవను, నూతన పోరాట ఐక్యతను ప్రదర్శించుట, వామపక్ష అభిమానుల మన్నలను పొందుటయేగాక, నూతన ఐక్యపోరాట వాతావరణ ఆవిష్కరణకు సంతసించి, స్వాగతం పలికారు.

వామపక్షాల ముఖ్యంగా సి.పి.ఐ., సి.పి.ఐ (యం) తదితర అభ్యుదయకరవర్గాల ప్రతిష్ట పెరుగుట, వర్గపోరాటాలు తీవ్రమగుట, వామపక్షాల నాయకత్వంలోని రాష్ట్ర ప్రభుత్వాల ఉనికి, పరోక్షంగా వీటన్నింటికి బలాన్ని చేకూర్చుటతో మరోవైపు ప్రజల ప్రయోజనాలు కాపాడుబడుట కేంద్ర, వామపక్ష రాష్ట్ర ప్రభుత్వాల మధ్య సంఘర్షణ, పరిస్థితులు యేర్పడినవి. పశ్చిమ బెంగాల్ వామపక్ష సంఘటనా ప్రభుత్వం, నిరుద్యోగాన్ని తగ్గించే ప్రయత్నాలలో భాగంగా, లాకవుట్లు కారణంగా మూసివేయబడిన పరిశ్రమలను తెరిపించే విషయంలో కేంద్రప్రభుత్వ పక్షపాత వైఖరిని, స్వప్రయోజనపరులైన పారిశ్రామికవేత్తల, వారిని బలపరచేవారి ప్రతిఘటనను తీవ్రంగా ఎదుర్కొనవలసి వచ్చింది. అయినా, కార్మికులకు సత్వరమే సహాయక చర్యలు చేబట్టుట, పౌరహక్కులు కాపాడుట, కాంగ్రెసు యెంత రెచ్చగొట్టినా విజయవంతంగా ఎన్నికలు జరిపి, పంచాయితీయులు సక్రమంగా పనిచేయునట్లు చేయుట, వ్యవసాయదారులకు సకాలంలో విత్తనాలు, ఎరువులు అందించుటతోపాటు భూసంస్కరణలు నిక్కచ్చిగా అమలు చేయుట, గూర్ఖాలాండు సమస్యను పరిష్కరించుటతో వామపక్షశక్తుల ప్రతిష్ట, బలం పెరింగింది.

త్రిపురలో ఆటవిక తెగల రక్షణకు రాజ్యాంగ చట్టం 6వ షెడ్యూలు పరిధిలో స్వపరిపాలక జిల్లా సలహా సంఘాన్ని యేర్పాటు చేయుట, బలహీన వర్గాలకు ఉద్యోగాలు చట్టబద్ధంగా కలుగజేయుట, ఆటవికతెగలు, తదితరుల మధ్య సదవగాహన అభివృద్ధి

అగుటతో ప్రజలలో కమ్యూనిస్టులకు గల ప్రజాపునాదులు మరింత విస్తరించి, బలపడినవి.

కేరళలో వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన ప్రభుత్వంపై కేంద్రప్రభుత్వపు ప్రత్యక్ష, పరోక్ష దాడి మొదటనుండి జరుగుతు, దాని సాధారణ పాలనకు, కూడా విఘ్నం కలిగించుతూనేవున్నారు. కేంద్రం ఆర్థిక సంక్షోభాన్ని కలుగజేయుటయేగాక, ఆకారణంగానే యేర్పడిన ఆహారధాన్యాల ఇబ్బందులను, తరుగు రాష్ట్రానికి ఆహార ధాన్యాలను అందించుటలో యిబ్బందులు కలుగజేస్తున్నారు. ప్రజల సహకారంతో కష్టకాలం దాటగలిగింది. సాంప్రదాయక పరిశ్రమలు మూలపడకుండా ఉద్ధరించి వుత్పత్తులు పెంచినా, వాటిని ఎగుమతి చేయుటకు కేంద్రం ఆటంకాలు కలుగజేస్తున్నది. అయినా, వామపక్ష మంత్రివర్గం, పార్టీలు ప్రజలలో తమ పునాదిని విస్తరింపజేసుకొని బలపడినవి.

దేశంలో అత్యంత క్లిష్ట పరిస్థితులు యేర్పడుటతో సమాజం సంక్షోభంలోపడినట్లు కన్పడుతున్నది. కేంద్రంలో పాలకపార్టీయైన కాంగ్రెసు (ఐ) రాజకీయ ప్రతిష్ట అత్యంత వేగంగా కూలిపోయి, ప్రజాబలం క్షీణంచుతున్నది. పశ్చిమబెంగాల్, కేరళ, హర్యానాలలో కాంగ్రెసు ఘోరపరాజయాలు కాంగ్రెసు (ఐ) పతనాన్ని మరింత వేగిరపరచాయి. కాంగ్రెసు (ఐ) 12 రాష్ట్రాలలో అధికారాన్ని కోల్పోయింది. దాని బలమైన హిందీ రాష్ట్రాలలో అధికారం చేజారిపోతున్నట్లు కన్పడింది.

వామపక్ష కమ్యూనిస్టుపార్టీలు సి.పి.ఐ., సి.పి.ఐ(యం)లు రెండూ ప్రతిపక్ష పార్టీలో అత్యంత శక్తివంతమైనవిగా అవతరించాయి. ఇతర వామపక్షాలను, ప్రజాస్వామ్య, లౌకికశక్తులను, పార్టీలను సమీకరించి ప్రత్యామ్నాయశక్తిని రూపొందించాలంటె, వాటికి పునాదియైన వామపక్ష ఐక్యత, ముఖ్యంగా సి.పి.ఐ., సి.పి.ఐ(యం)ల ఐక్యత ప్రధమ సోపానం కావాలి. అప్పుడే జాతీయ స్థాయిలో క్రమేణా వామపక్ష, లౌకిక ప్రజాస్వామ్య శక్తుల ప్రత్యామ్నాయ నిర్మాణానికి మార్గం సులభతరమగుతుంది. జాతి క్లిష్టపరిస్థితులలో అధికార పీఠాన్ని అధిరోహించాలని, ప్రతిపక్షాలు దగ్గరిమార్గాలను" అన్వేషించుటయేగాక, అభివృద్ధి నిరోధక, రాజ్యాంగేతర మార్గాలను వెదుకుచున్నవి.

కాంగ్రెసు (ఐ) ప్రభుత్వపు ప్రజాస్వామ్య, ప్రజావ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా సి.పి.ఐ., సి.పి.ఐ(యం)లు పోరాడుటయేగాక, దీనిని ప్రక్కదారులు పట్టించాలనే వారి ప్రయత్నాలు వమ్ముచేయాలి. ఈ క్లిష్టపరిస్థితులలో సి.పి.ఐ సి.పి.ఐ(యం)లు ఐక్యతా కార్యాచరణ చేబట్టితే దేశ రాజకీయ పరిణామాలపై చెరగని ముద్రవేయగలరు.

కొంతకాలంగా వామపక్షాల మధ్య ముఖ్యంగా సి.పి.ఐ(యం), సి.పి.ఐ లు తదితరుల మధ్య నిరవధికంగా సంప్రదింపులు, కార్మిక, కర్షక, మధ్యతరగతి సంస్థల, వర్గాల సమస్యలపై వొకే విధమైన అవగాహన, వైఖరి చేబట్టి ఐక్యప్రజాపోరాటాలలో సహకారాన్ని, ఐక్యతను, ఐక్యకార్యాచరణ పెంపొందించుట, మతతత్వ శక్తులకు వ్యతిరేకపోరాటసాధనాలుగ కన్వెన్షనులు, సమీకరణలు, పోరాటాలు సాగించుట, తద్వారా అంత్యలక్ష్యమైన ఐక్యతకు చేరువయ్యేవాతావరణాన్ని రూపొందించే క్రమాన్ని అభివృద్ధి చేయుట హర్షించతగినది. ఈ వామపక్షపార్టీల ఐక్యతను పెంపొందిచేమార్గంలో

వచ్చే అడ్డంకులు, అవాంతరాలు వామపక్ష ముఖ్యంగా సి.పి.ఐ(యం), సి.పి.ఐ ల ఐక్యతను, దానిని సుస్థిరం చేయుటను, ఆలస్యం మాత్రమే చేయగలవు కాని దాని చారిత్రిక అవసరం రీత్యా యింకెంతో కాలం వాయిదా వేయజాలవు. అదొక సహజ, శాస్త్రీయ పరిణామము. ఈ పరిణామానికి సహకరించని శక్తులు పురోగమించే చరిత్రలో బలహీనపడుటయే కనుమరుగు అగుటతథ్యం.

సంయుక్త లేక ఐక్యకార్యాచరణలలో సహజంగానే భేదాభిప్రాయాలు వస్తూనే వుంటాయి. అవి సంప్రదింపులు, చర్చలు పరస్పరం "యిచ్చి పుచ్చుకునే" క్రమంలో సుముఖ అంశాలకు ప్రాధాన్యత నిచ్చుటతో ఐక్య కార్యాచరణాభివృద్ధి తద్వారా ఐక్యతకు మార్గం సుగమం అగుతుంది. అయితే, ప్రతిపక్ష పార్టీలలో కొన్నింటికి "అభివృద్ధి నిరోధకులు", "మితవాద," "అతివాదులు" అనే చక్రాంకితాలు తగిలించి, దూరం చేసుకొనుట జరుగరాదు. వామపక్ష ఐక్యత రూపొందించి, బలపరచకుండా, వామపక్షాలు మొత్తంగా బలపడకుండా దేశరాజకీయాలలో మౌలిక అభివృద్ధికర మార్పులు కొనివచ్చుట అసాధ్యమగుతుంది.

రాజకీయ పరిణామాలు వెలుగుకు తెచ్చిన , సైద్ధాంతిక సమస్యలపై సి.పి.ఐ(యం) కార్యదర్శి నంబూద్రిపాద్ కొన్ని వివరణలు యిచ్చారు. పశ్చిమబెంగాల్, కేరళలలో సంకీర్ణ ప్రభుత్వాలను యేర్పరచి ప్రయోగాలు చేస్తున్నవిధంగానే, కేంద్రంలో సంకీర్ణ ప్రభుత్వాలయేర్పాటులో అట్టి ప్రయోగాలనే ఎందుకు చేయరని నేషనల్ ఫ్రంటులోని కొన్ని వర్గాలు ప్రశ్నించుటతో నంబూద్రిపాద్ సి.పి.ఐ (యం) వైఖరిని యిలా వివరించారు.

సంకీర్ణ ప్రభుత్వాలు రాష్ట్రాలలో సాధారణంగాను, కేంద్రంలో యేర్పాటు చేయుటలోను మౌలిక భేదాలున్నవి. కేంద్రానికి అనేక శాఖలకు సంపూర్ణ నిర్ణయాధికారాలున్నవి, ముఖ్యంగా సాధార పాలన, విదేశాంగ శాఖ, రక్షణ, ఆర్థికశాఖ, రవాణా, సమాచారం, కరెన్సీ శాఖలు, ఆర్థికాభివృద్ధి సమన్వయశాఖలు దేశం మొత్తానికి సంబంధించినవి. వామపక్ష లౌకిక ప్రజాస్వామ్యసంఘటనలోని మితవాద, వామపక్ష మధ్యస్థ వైఖరులను అవలంబించే వివిధ పార్టీల మధ్య మౌలిక అభిప్రాయభేదాలున్నవి. ఆ సమస్యను పరిష్కరించే విధానాల విషయంలో కూడ మౌలిక అభిప్రాయబేధాలు సహజంగానే వున్నవి. ఈ అభిప్రాయభేదాలు సంప్రదింపులలో పరిష్కరించబడి, అందరి ఆమోదం పొందిన వొక కార్యక్రమాన్ని రూపొందించి, సంకీర్ణ ప్రభుత్వం యేర్పాటు చేయుట ఆదర్శవంతమైనదనుటలో సందేహం లేదు. అయితే, వి.పి.సింగ్ చెప్పినట్లు సమస్యల ప్రాతిపదికగా సాధారణ వుద్యమాన్ని ప్రారంభించుట సత్వరం ఆచరణీయమైనది.[1]

మన ముందు 1977-79నాటి రాజకీయ అనుభవం వుంది. కేంద్రంలో జనతా ప్రభుత్వం ప్రజావసరాలను తీర్చలేకపోయింది, కారణం హిందూమత దురహంకారులతో కలసిన పార్టీలతో యేర్పడింది. అట్టి వాటిలో జనసంఘం ముఖ్యమైనది. ఆప్రభుత్వ

---

*1. నంబూద్రిపాద్, ఇ.యం.యస్. (1987) లాంచి కామన్ మూమెంటు ఆన్ ఇష్యూస్, పీపిల్సు డెమోక్రసీ, 20 సెప్టెంబరు 1987.*

వైఫల్యం, నేడు వొకవైపు వామపక్ష శక్తులు, మరోవైపు మతతత్వశక్తులు కలసి ప్రతిపక్షాలన్నిటితో కూటమిని, పాలకపార్టీ కాంగ్రెసుకు వ్యతిరకంగా యేర్పరచాలనే వారికి కనువిప్పుకావాలి. వామపక్షాలు, లౌకిక, ప్రజాస్వామ్య శక్తులు, కాంగ్రెసుతో అసంతృప్తిచెందిన వి.పి.సింగ్ లాంటి శక్తులు సంఘటనగా యేర్పడవలసివుంది. వి.పి.సింగ్ నొక్కి చెప్పిన విధంగా "సమస్యల ప్రాతిపదికగా" రూపొందిన సమిష్టి వుద్యమం నాంది పలకాలి. ప్రజాస్వామ్య లౌకిక వైఖరి చేబట్టిన సామాజిక పార్టీలు అనేక రాజకీయ అంశాలలో సి.పి.ఐ(యం) తో యేకీభవించజాలవు. ఈ విషయాలను పరిగణలోనికి తీసుకొనకూడా, అభిప్రాయభేదాలున్నా కళ్ళు మూసుకొని కేంద్రంలో ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని యేర్పాటు చేయుట, అసాధ్యము. గత ఇందిరాగాంధీ అత్యవసర కాలపు నిరంకుశ ప్రభుత్వ వ్యతిరేక వివిధ రకాల ప్రతిపక్షాలను రాష్ట్రీయ స్వయంసేవసంఘం, జనసంఘం, ముస్లిం మతతత్వశక్తులు, షాహిఇమాం ఆఫ్ ఢిల్లీ జామా మసీదు, తదితర కరుడుగట్టిన మితవాద అభివృద్ధి నిరోధకులు వొకవైపు, వామపక్షాలు, సి.పి.ఐ(యం), రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ, ఫార్వర్టుబ్లాక్, తదితర లౌకిక ప్రజాస్వామ్యశక్తులు మరొకవైపు. కాంగ్రెసు(ఐ) ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని యేర్పాటు చేయ ప్రయత్నించారు. జనతా పాలక పార్టీగా, కాంగ్రెసు (ఐ) స్థానాన్ని ఆక్రమించింది.

జనతా ప్రభుత్వంలో వామపక్షేతర పార్టీలలో అభిప్రాయభేదాలు, అంతర్గత ఘర్షణలు పైకి వచ్చాయి. జనసంఘం జనతా ప్రభుత్వాన్ని హిందూ మతత్వాన్ని పెంపొందించు సాధనంగా చేయు ప్రయత్నంతో యీ ఘర్షణలు ప్రారంభమయ్యాయి, బలహీనవర్గాలు జనతాకు దూరమై జనతాపార్టీ, ప్రభుత్వమూ, రాష్ట్రీయ స్వయంసేవకసంఘంతో గల సంబంధాలను వదులుకొనాలనే నినాదంతో పోరాడసాగాయి. దీనితో జనతా భాగస్వామ్య పార్టీలలో సహకారం శూన్యమై చివరకు జనతా ప్రభుత్వ పతనానికి దారితీసింది.

వామపక్షాలు జనతా ప్రభుత్వానికి విచక్షణ, విమర్శనాత్మక మద్దతును యిచ్చాయి. జనతా ప్రభుత్వం, ఆర్.యస్.యస్.తో గల సంబంధాన్ని జనసంఘం వదులుకొనాలనే షరతు బలహీనవర్గాలు, పార్టీలు పట్టుపట్టిన ఫలితంగా రూపొందిన రాజకీయ పరిణామాల ప్రాముఖ్యత గుర్తించాలి. జనతాతో బలహీనవర్గాలు, పార్టీలు, అసమ్మతివాదులు వ్యతిరేకులుగా రూపొందిన వైఖరి, నిర్మాణం బలంగా వున్న వామపక్షాల కలయికతో జనతా ప్రభుత్వపతనానికి దారి తీసింది. అదే కాలంలో జనతా వ్యతిరేకపోరాటం అనే పేరుతో కొన్ని సంవత్సరాలుగా, ఇందిరాగాంధి ప్రభుత్వాన్ని బలపరచుతున్న సి.పి.ఐ తన పంథానుమార్చుకొనసాగింది. కమ్యూనిస్టుపార్టీలు సి.పి.ఐ., సి.పి.ఐ(యం) రెండూ సంప్రదింపుల ఫలితంగా, 1978లో నాలుగు వామపక్షపార్టీల సమన్వయ కమిటి యేర్పడు అవకాశాలు కలుగుటతో జాతీయ రాజకీయాలలో నూతన శకారంభమైంది. "అప్పటినుండి, కాంగ్రెసు (ఐ) వొకవైపు, కాంగ్రెసేతరప్రతిపక్షపార్టీల సంఘటన విషయంలో యేప్రశ్న వుదయించలేదు. వామపక్ష శక్తులు నెమ్మదిగా, నిలకడగా, స్వతంత్రశక్తిగా వుద్భవించి, కాంగ్రెసు (ఐ) లేక కాంగ్రెసేతర అన్ని పక్షాల ఐక్యంసఘటన అనే ప్రశ్న అంతం అయింది"[1]. ఇది 1980-84లోకసభ జనరలు

ఎన్నికలలోను, అనేక రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికలలోను ఆచరణలో స్పష్టమైంది. పశ్చిమబెంగాల్‌లో మూడవ విడత జ్యోతిబసు ప్రభుత్వం, త్రిపురలో నృపేన్ చక్రవర్తి ప్రభుత్వం కేరళలో వామపక్ష ప్రజాస్వామ్య ప్రభుత్వం యేర్పాటు చేయుట, యింకెంత మాత్రం వూహాచిత్రం కాదని, రాజకీయ పరిణామాల వాస్తవికతగా రుజువైంది.

ఇదే కాలంలో జనతాతో సహా అనేక లౌకిక ప్రతిపక్షపార్టీలు, లోక్‌దళ్ రెండు గ్రూపులు, కాంగ్రెసు (యస్) తెలుగుదేశం, ద్రవిడమున్నేట్రకజగం, తదితరులు సమిష్టి వుద్యమంలో వామపక్ష పార్టీలలో కలసి పోరాటాలు సాగించాయి. అభివృద్ధిచెందే యీ ఐక్య కార్యాచరణ, వామపక్షాలు, లౌకిక ప్రతిపక్షపార్టీల మధ్య యేర్పడిన ఐక్యత భగ్నం చేయాలా? వామపక్షేతర నాయకులలో కొందరు సూచించిన సలహాల అర్థమిది. ఐక్యసంఘటనలో వొక చివర భారతీయ జనతాపార్టీ, మరో చివర నేటి వామపక్ష పార్టీలు, వుండవలసిందేనా? అని నంబూద్రిపాద్ ప్రశ్నించి, యిలా సమాధానం చెప్పారు. "జనతాతో గతంలో చేసిన ప్రయోగం, భగ్నమగుటతో వామపక్ష పార్టీలు లౌకికపార్టీలతో ముఖ్యంగా వామపక్షాలవైపు మొగ్గిన మధ్యస్థ పార్టీలతో సంఘటనగా యేర్పడవలసిన అవసరం యెంతో వుందన్న అవగాహన బలపడింది.[2]" భారతీయ జనతాపార్టీగూడ కమ్యూనిస్టులతో ఎట్టి సంబంధం పెట్టుకొనజాలనని స్పష్టం చేసింది. ఈ పరిణామాలలో వామపక్ష పార్టీల, ప్రజాస్వామ్య, లౌకిక ప్రతిపక్షాల సంఘటన నేటి దశలో మార్గదర్శిక సూత్రంగా రూపొంది, సి.పి.ఐ(యం), సి.పి.ఐ రెండు కమ్యూనిస్టుపార్టీల వ్యూహాత్మక పంథా స్పష్టమైంది. ఎత్తుగడలలో భిన్నాభిప్రాయాలు అనే పేరుతో కమ్యూనిస్టువుద్యమాన్ని మొత్తంగా బలహీనపరచే విధానాలు, ప్రతిపక్ష బూర్జువా పార్టీల అభిమానాన్ని పొందుటలో పోటీ, వారితో మంచిగా వుండాలని అనుకొంటూనే వొకరికి తెలియకుండా మరొకరు, ఎన్నికలలో స్థానాలకై బేరాలు సాగించుతూ, వీలైన చోట్ల పరస్పరం పరోక్షంగా వ్యతిరేకం చేసుకొంటూ, వోడించుకొంటూ బూర్జువావర్గ అంటురోగాలకు అప్పుడప్పుడు గురి అగుట జరుగుతున్నది. ఈవిధంగా జరుగుటవలననే కమ్యూనిస్టుపార్టీలను బలపరచవలసిన పట్టణంలోని కార్మికవర్గంలో గణనీయమైన భాగం, గ్రామసీమలలోని వ్యవసాయకూలీలు, పేదరైతులు, బలహీన, బడుగువర్గాలు దూరమగుట జరిగింది. వర్గాల రీత్యా సహజంగా కమ్యూనిస్టులను బలపరచినవారు కమ్యూనిస్టులను వదలి, వివిధ బూర్జువాపార్టీలు కాంగ్రెసుతో సహా కొంతమంది ఎదిరిపక్షంలో చేరి, ప్రతిఫలాపేక్షతో ఎన్నికలలో బలపరుస్తున్నారు. కమ్యూనిస్టులు అప్పుడప్పుడు అవలంభించిన అవకాశవాదంతో కుల, మత సంస్థల, పార్టీలవైపుకు కమ్యూనిస్టులను బలపరచేవర్గాలలోని కొందరు వెళ్ళిపోవుటలోని తీవ్రతను గుర్తించాలి.

వామపక్షాలు లౌకిక ప్రజాస్వామ్య పార్టీలు, వ్యక్తుల యెడల అవలంభించే వైఖరికి రాజకీయ ప్రాముఖ్యత ఎంతో వుంది. ప్రజాకార్యచరణగాని, ఎన్నికల రాజకీయాలుగాని,

---

*1&2 నంబూద్రిపాద్, ఇ.యం.యస్. (1987) లెరన్ ఫ్రంది పాస్ట్, పీపిల్సు డెమోక్రసీ, 27 సెప్టెంబరు 1987.*

మార్క్సిస్టు అవగాహనపై ఆధిక్యత వహించుట శాస్త్ర సమ్మతంకాదు. అంచేత, శాస్త్రీయ సోషలిస్టు అవగాహన పరిధిలోనే, దానిని పెంపొందించుట, అదేవిధంగా ప్రజా ఐక్యకార్యాచరణ, ఎన్నికల రాజకీయాల ఆచరణ వుండాలి. అంతేగాక, కార్మిక వర్గ మంతటి నిర్మాణ బలంపై ఆధారపడి, శాస్త్రీయ సోషలిస్టు అవగాహనతో ఐక్య ఎన్నికల, రాజకీయ పోరాటాలు సాగించాలి. ఈ కారణం చేతనే వర్గ స్వాతంత్ర్యం, అవగాహనలకు రాజీపడవలసిన పరిస్థితులు గల సంకీర్ణ ప్రభుత్వాలలో చేరరాదని, మార్క్సిజం, లెనినిజం నొక్కి చెప్పుతున్నది. ఒక శతాబ్దపు పూర్వం ఫ్రెడరిక్ ఎంగెల్స్ ఇటలీ కమ్యూనిస్టులకు, "సమిష్టి విజయానంతరం నూతన ప్రభుత్వంలో, మంత్రివర్గంలో చేరమని వారు కోరవచ్చు, మీరు ఎప్పుడూ మైనారిటీగా వుంటారు, మైనారిటీగ వుంటూ, వారు చేసే అవినీతి, ప్రజావిద్రోహచర్యలకు స్వచ్ఛందంగా బాధ్యత వహించవలసివుంటుంది. అని సలహా నిచ్చారు. "ఈ కార్మికవర్గ అవగాహన సూత్రంపై ఆదారపడి సి.పి.ఐ(యం) 1967లో లోక్‌దళ్ తదితర రాష్ట్ర ప్రభుత్వాలలో మంత్రి పదవులు స్వీకరించ నిరాకరించింది. ఇదే విధానాన్ని కేంద్రంలో జనతా ప్రభుత్వం యేర్పడినపుడు అస్సాం, మేఘాలయాలలో మంత్రివర్గాలు యేర్పడినపుడు అంటె 1978లో జరిగింది. జనతా ప్రభుత్వంలో చేరమని 1977లో సి.పి.ఐ(యం)ని ఆహ్వానించలేదు. ఆహ్వానించినా నిరాకరించి వుండేది. వామపక్ష పార్టీల ప్రభుత్వాలలో మాత్రమే ముఖ్యంగా రాష్ట్ర ప్రభుత్వాలలో చేరింది. అవే కేరళ, పశ్చిమ బెంగాల్, త్రిపుర ప్రభుత్వాలు.

వామపక్షేతర పార్టీలలోని మిత్రులను పరిగణలోనికి తీసుకొని, రాజకీయ పరిశీలకులు, రాష్ట్రాలలో గత 3.4సంవత్సరాలలో యిచ్చిన సూచనలు, వామపక్షపార్టీలు ఆచరణలో పెట్టినా పురోగమించ జాలవు. ఎన్నికలలో కూడయిదే జరుగుతుంది. రాష్ట్రంలో, కేంద్రంలో ఐక్యసంఘటనలో భాగస్వాములుగా వామపక్షేతర పార్టీలు నాయకత్వం వహించే ప్రభుత్వంలో చేరమని ఆహ్వానించినా నిరాకరించింది. వామపక్షేతర ప్రతిపక్ష పార్టీల ప్రభుత్వంలో జూనియరు భాగస్వామ్య పాత్ర వహించుటకు ఆమోదించినపుడు మాత్రమే చేరవలసివుంటుంది. అట్టి పరిస్థితులలో చేరితే ఆ మూడు రాష్ట్రాలలో తమ కార్యక్రమాలను ఆచరణపెట్టుటకు ప్రయత్నించుతు, దేశమంతా విస్తరణ అవకాశాలను పోగొట్టు కొంటున్నందుకు తమ్ముతామే ఖండించు కొనవలసి వుంటుంది. అయితే, వామపక్షాలు ప్రభుత్వాలలో చేకుండా "ప్రతిపక్షాల ఐక్యతకు ద్రోహం" చేసున్నారని నిందించుటకు అవకాశం యేర్పడినా, సూత్రబద్ధ విధానాన్ని వీడజాలవు, తమ స్వతంత్ర కార్యాచరణ మానలేవు. బి.జె.పిని వ్యతిరేకించుతు, జనతా ప్రభుత్వ పతనానికి అనుకూలంగా, వామపక్షాలు స్వతంత్రపాత్రను చేబట్టివోటు చేసాయి. అదే విధంగా రాష్ట్రపతి ఎన్నికకు జ్ఞాని జైల్‌సింగు అభ్యర్థి అనే ప్రస్తావన వచ్చినపుడు గూడ వామపక్షాలు స్వతంత్ర పాత్ర వహించిన ఫలితంగా కృష్ణయ్యర్‌ను అభ్యర్థిగా వామపక్షాల వొత్తిడితో కాంగ్రెసేతర ప్రతిపక్షాలన్నీ ఆమోదించాయి. పాలకపార్టీకి, వామపక్షపార్టీలు మితవాద ప్రతిపక్ష పార్టీలనుండి తమ రాజకీయవిధానాన్ని స్పష్టం చేస్తూ దూరమగుట, కాంగ్రెసు వ్యతిరేకపోరాటం జరుపుతున్నప్పటిక "నమ్మక ద్రోహం" గానే కన్పడుతుంది. వామపక్షేతర

ప్రతిపక్ష పార్టీలతోపాటు, పాలకపార్టీ మితవాద ప్రతిపక్షాలనుండి వామపక్ష పార్టీలు, తమ రాజకీయవిధానాలను స్పష్టంగా, వేరుగా చూపుటను పాలకపార్టీని బలపరచుటతో సమానం చేస్తున్నారు. కేంద్ర ప్రభుత్వంలో మార్పులు కొని వచ్చుటకై చేసే ఎట్టి ప్రయత్నమైనా, కేంద్రంలో అనిశ్చిత పరిస్థితులు కొనిరావాలనుకొనేవారికి సహాయపడుటయేయని వారు నొక్కి చెప్పుతున్నారు. అందు భిన్నంగా వామపక్షేతర ప్రతిపక్షాలలో, వామపక్ష పార్టీల స్వతంత్రపాత్ర, కేంద్రంలో కాంగ్రెసు అధికారంలో కొనసాగింపుకు తోడ్పతున్నవనే తప్పుడు అవగాహన కలిగి వున్నవి.

"ప్రతిపక్షాల వుద్యమంలో 1967 పేర్కొనతగినదే అయినా కాంగ్రెసును బలపరచకుండా, వారిలాగ త్రోసి బుచ్చకుండుట, 1971లోక్‌సభ ఎన్నికలలో కాంగ్రెసు వ్యతిరేక "అన్ని పక్షాల గ్రాండు అలయెన్సు"లో చేరకుండుట, జనతా యెడల మనం స్వతంత్రవైఖరి అవలంబించినా, ప్రతిపక్షాలతో కలసి, వుద్యమాలలో పాల్గొనుటకు ఎప్పుడూ వెనకాడలేదు, ముఖ్యంగా ప్రతిపక్షాలు మన స్వతంత్రపాత్రను గుర్తించినపుడు కాంగ్రెసు వ్యతిరేక వుద్యమాలలో చేరని ఘటనలేదు. ఫ్రంటు భాగస్వాములు మన వర్గదృక్పదాన్ని వదిలి ప్రతిపక్షాల వుద్యమంలో చేరమని కోరినపుడు చేరినదీలేదు, మన రాజకీయ స్వతంత్ర పాత్రను వదలినదీలేదు.[1]" అని నంబూద్రిపాద్ వామపక్ష లౌకిక ప్రజాస్వామ్య సంఘటనలో వుండవలసిన సంబంధాలు, ఐక్యకార్యాచరణలు కమ్యూనిస్టుల స్వతంత్రపాత్ర యింతకు ముందు వివరించుట జరిగింది. పునరుక్తి అనవసరము.

# VI

# కమ్యూనిస్టులు - ఎన్నికలు, సైద్ధాంతిక సమస్యలు

## నాంది

**6.1**. మార్క్సిస్టు–లెనినిస్టులు ఎన్నికలలో పాల్గొనుట లేక బహిష్కరించుట అనే సమస్యను ఎల్లప్పుడూ ఎన్నికల సమస్యగానే నెంచారు. లెనిన్, స్టాలిన్‌లు రష్యను విప్లవకాలంలో ఎప్పటికప్పుడు పరిస్థితులను బట్టి ఎన్నికలలో పాల్గొనుట, బహిష్కరించుట రెండూ చేయుటను పరిశీలించిన, యిది వ్యూహానికి సంబంధించిన ప్రశ్న యేమాత్రం కాదని, ఎత్తుగడలకు సంబంధించిన ప్రశ్న మాత్రమేనని స్పష్టంగా తెలుస్తున్నది. విప్లవోద్యమాలు వెల్లువగా విజృంభించునపుడు అసంఖ్యాక, అన్ని వర్గాల ప్రజాసామాన్యం దోపిడి వర్గాలపై చివరి పోరాటం సాగించునపుడు మాత్రమే నహాత్రప్రాయంగా ఎన్నికలను బహిష్కరించుతారు. అట్టి విప్లవ పరిస్థితులలో ఎన్నికలలో పాల్గొనుట విప్లవ పోరాటాలనుండి ప్రజలను ప్రక్కదారులు పట్టించుతుంది, బూర్జువా పాలనపై భ్రమలను కలుగజేస్తుంది. అంచేత ఎన్నికలను బహిష్కరించుతారు.

---

*1. నంబూద్రిపాద్, ఇ.యం.యస్. (1988) సెక్యులర్ డెమోక్రసీ అండ్ ది లెఫ్ట్, పీపిల్సు డెమోక్రసీ, 10 జనవరి, 1988. పే. 3.*

అమెరికా, పశ్చిమ యూరోపియన్ కమ్యూనిస్టులకు పార్లమెంటును, ఎన్నికలను ఎలా వుపయోగించుకోవలసనినది, లెనన్ యిలా సలహానిచ్చారు. "బ్రిటిష్ కమ్యూనిస్టులు తమప్రభుత్వ వలసవాద వైరుధ్యాలను, పార్లమెంటరీ ఎన్నికలను 3వ ఇంటర్నేషనల్ సూచనలననుసరించి, నూతన తరహా కమ్యూనిస్టు పద్ధతిలోనికి మార్చే లక్ష్యంతో సాయుధ పోరాటానికి తోడుగా వువయోగవడు లక్ష్యంతో ట్రేడు యూనియనులను, పదవీవ్యామోహంలేని పార్లమెంటరీ విధానాలను అనుసరించాలి. పార్లమెంటులో సీట్లు సంపాదనకు మాత్రమే ప్రయత్నించరాదు. ప్రజలు ఆలోచించుటకు, వారిని పోరాటాలలోనికి తీసుకొని వచ్చుటకు, బూర్జువావర్గం చేసిన వాగ్దానాలను అమలు చేయాలని ప్రజలు పోరాడునట్టు చేయుటకు, ప్రభుత్వం నెలకొల్పిన యంత్రాగాన్ని, ఎన్నికలను, అది చేసిన విజ్ఞప్తులను వినియోగించుకొనుటకు కృషి చేయాలి. ఎన్నికల సమయంలో తప్ప సాధ్యం కాని ప్రచారాన్ని, సోషలిజం అంటే యేమిటో ప్రజలకు వివరించుటకు ప్రయత్నించాలి." అంతేగాక "కార్మికులు కలిసేచోట, వారితో మాట్లాడే అవకాశమున్నచోట, శ్రామిక ప్రజలపై ప్రభావం జరపగలిగిన చోట విప్లవ పార్టీ పాల్గొని కృషి చేయాలని" లెనిన్ విప్లవకారులు ఎన్నికలలో యేలక్ష్యంతో పాల్గొనాలి, చట్టబద్ధంగా పనిచేయగల అవకాశాలను ఎలా వనియోగించుకొనవలసింది స్పష్టం చేయుటయే గాక, యేదోవిధంగా పార్లమెంటులో సీట్లు సంపాదించు ప్రయత్నం చేయరాదని కూడ స్పష్టం చేసారు.

ఇంకా, యే లక్ష్యంతో ఎన్నికలలో పాల్గొనాలో యిలా చెప్పారు "రాజీ వొప్పందాల ద్వారా పార్లమెంటులో సీట్లు సంపాదన కార్మికవర్గ పార్టీకి ముఖ్యం కాదు. ప్రజల రాజకీయ చైతన్యాన్ని పెంపొందించేందుకు, ఉన్నత రాజకీయ స్థాయికి ప్రజలను తీసుకొని వెళ్ళేందుకు, బూర్జువా శాంతి, క్రమం, స్థిరత్వం కొరకు గాక, దోపిడి, పీడనల నుండి శ్రామికులనుపూర్తిగా విముక్తిచేయు పోరాటానికి వారి సమీకరణను తోడ్పడునంతవరకే ఆ సీట్లు ప్రాముఖ్యత కొలమానంగానెంచి, ఆ సీట్లకొరకు ఎన్నికలలో ప్రచారం అవసరం"[1] అని లెనిన్ వివరించారు. ఇంకా "ప్రమాదం పార్లమెంటులోను, పార్లమెంటు సమావేశాలలోను లేదని, నిజమైన ప్రమాదం, పార్లమెంటరీ పోరాటాలలోనే ప్రజల లక్ష్యాలు నెరవేరుతాయని దేశ భవిష్యత్తు ప్రజలను చైతన్యవంతులను చేయుట, పార్లమెంటు వెలుపలే నిర్ణయించబడుతుందనే విశ్వాసం ప్రజలలో కలుగజేయుటలో విఫలమగుటతో యేర్పడుతుందని" తెలిపారు.

ఎన్నికలలో విప్లవకారుల కర్తవ్యాన్ని స్టాక్‌హోం, అంతర్జాతీయ కమ్యూనిస్టు కాంగ్రెసు యిలా తీర్మానించింది. "ప్రభుత్వానికి – పార్లమెంటుకు, పార్లమెంటులో వైరుధ్యాలను పెంచుటకు ఎన్నికలను ఉపయోగించుకొనే లక్ష్యంతో ఎ) ప్రజలవాంఛలను పార్లమెంటుకు

1. లక్ష్మి (1985) నూతన ప్రజాస్వామ్య విప్లవంలో, ఎన్నికలు మన కర్తవ్యాలు పే. 25. ఉదహరింపులనుండి

తీసుకొని వెళ్ళి, పోరాడే ప్రతినిధిగా బూర్జువా పార్టీల అస్థిరత్వాన్ని, వూగిసలాటను ప్రజలకు వెల్లడించాలి. బి) అశేష ప్రజానీకం యీ పార్లమెంటు పూర్తిగా నిరుపయోగమని తెలుసుకొనేలా చేయలి.''[1] అని తీర్మానం నొక్కి చెప్పింది.

విప్లవోద్యమాలు ముందుకు పురోగమించక, స్థబ్దతతో మందకొండిగా వున్నప్పుడు, బూర్జువా పార్లమెంటరీ ప్రజాస్వామ్యంపై ప్రజల భ్రమలు కొనసాగునపుడు, కమ్యూనిస్టులు ఆచరణలో ప్రజలు తమ అనుభావాలద్వారా ఆభ్రమలను విడనాడుటనట్లు చేయుటకు, విప్లవ పోరాటాల అవసరాన్ని ప్రజలు గుర్తించునట్లు చేయు లక్ష్యంతో ఎన్నికలలో పాల్గొంటారు.

## 6.2 ఫాశిజం పతనాంతర బూర్జువాపార్లమెంటులలో ఫ్రాన్సు, ఇటలీలలో కమ్యూనిస్టుల అనుభవాలు

రెండవ ప్రపంచ యుద్ధం చివరకాలంలో ఫ్రాంసు, ఇటలీలలో కమ్యూనిస్టుపార్టీల నాయకత్వంలోని ఫాశిస్టు వ్యతిరేక సాయుధ సైనిక, గెరిల్లా దళాలు సాయుధ పోరాటాన్ని విరమించి, పార్లమెంటరీ ఎన్నికల పోరాటాలు చేబట్టిన ఫలితంగా విప్లవోద్యమాలు ఎలా విచ్ఛిన్నమైనవో ఫ్రాన్స్, ఇటలీ కథనాలే చక్కని ఉదాహరణలు. ఫ్రాన్సు, ఇటలీలలో కమ్యూనిస్టులు సంస్కరణ వాదంలో మునిగిపోయి, అవలంభించిన విధానాల ఫలితాలు సుస్పష్టం. ఆదేశాల అనుభవాలు కమ్యూనిస్టులందరూ అధ్యయనం చేయవలసినవి. ఫ్రాన్సు, ఇటలీలో వలెనె, మనదేశంలో కూడ రాజ్యాంగయంత్రం, ఎన్నికల విధానం అన్నీ బూర్జువా వర్గ పరిరక్షణకే గాని, ప్రజాస్వామ్యాన్ని, ప్రజల హక్కులను పరిరక్షించుటకు కాదనే విషయం స్పష్టంమైంది. మార్క్సిజం, లెనినిజం సైద్ధాంతికంగా, ఎప్పుడో చెప్పినవి మరోసారి ప్రత్యక్షంగా రుజువయ్యాయి. ఫ్రాన్సు చారిత్రాత్మకంగా, 19వశతాబ్దంలోని ఫ్రెంచి విప్లవంలో సాధించిన రాజ్యాధికారాన్ని, మధ్యతరగతి బూర్జువా వర్గాలకు కోల్పోవుట, ప్రజాస్వామ్య పేరిట అణచివేయబడిన చారిత్రిక అనుభవాలు నేర్పిన పాఠాలను కార్మికవర్గం, దాని నాయకత్వం సంస్కరణవాద వూబిలో మరచిపోయినట్లు కన్పడుతున్నది.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో నాజీ ఆక్రమిత ఫ్రాంసులో కమ్యూనిస్టుపార్టీ ఐదు లక్షల ఫాశిస్టు వ్యతిరేక సాయుధ సైన్యాన్ని నిర్మించి, పోరాడి, మిత్రరాజ్య సైన్యాల ప్రవేశానికి ముందే పారిస్ నగరాన్ని విముక్తి చేసింది. సోవియట్ రష్యాలో రక్షణ పొందిన ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి 1944 నవంబరులో తిరిగి వచ్చి, సాయుధ సైన్యాన్ని ఇంగ్లండు వలసనుండి తిరిగి వచ్చిన సైనాధిపతి జనరల్ డీగోల్‌కు అప్పజెప్పగా నిరాయుధం చేయబడి రద్దు చేయబడింది. ఫ్రెంచి జాతీయ సైన్యంలో భాగంగా చేయబడుట నిరాకరించబడింది. ఈవిధానాన్ని ఆమోదించిన పార్టీ సెక్రటరీ థోరేజ్ ఉపప్రధాని పదవిని బహుమతిగా పొందారు. బూర్జువా పార్లమెంటరీ విధానంలో

1. *లక్ష్మి (1985)* నూతన ప్రజాస్వామ్య విప్లవంలో, ఎన్నికలు మన కర్తవ్యాలు పే. *27.* ఉదహరింపులనుండి

మంత్రిపదవుల నధిరోహించుటకు, అత్యంత ధైర్యసాహసాలతో ప్రాణాలు లెక్కచేయకుండా ఫాశిస్టు నాజీ జర్మన్ సైన్యాలతో పోరాడి పారిస్ నగరాన్ని విముక్తి చేసిన సైన్యం వర్గ శతృవులకు అప్పజెప్పబడింది. జనరల్ డీగాల్ ప్రభుత్వం నవంబరు 1945 ప్రధమ జాతీయ అసెంబ్లీకి ఎన్నికలు జరిపింది. ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ 5 లక్షల ఫాశిస్టు వ్యతిరేక ప్రజాసైన్యాన్ని కలిగియుండి ఫాశిస్టు వ్యతిరేక పోరాట చరిత్రగలది, నిరాయుధం చేయబడింది. జనరల్ డిగోల్ షరతులకు ఒప్పుకొనకుండా సైన్యాన్ని రద్దు చేయుటకు అంగీకరించకుండా ఎన్నికలు బహిష్కరించి వుండవలసిందనే అభిప్రాయాన్ని సత్యఘోష్ వెలిబుచ్చారు. అప్పటికే మే 8న 1945న జర్మన్ నాజీ సైన్యాలు పూర్తిగా లొంగిపోయాయి. ఫ్రాన్సులో అంతర్యుద్ధపరిస్థితులు యేర్పడగలవని యెంచి, అసెంబ్లీలో వామపక్షాలు నాడు మెజారిటీకలిగియున్నా, ఫ్రెంచి బూర్జువావర్గం ఎన్నికల చట్టాన్ని తిరుగ వ్రాసిన ఫలితంగా గతంలో 103 స్థానాలు కలిగియుండి 1951లో ఓట్లు తగ్గికపోయినా, సీట్లు తగ్గి 79 స్థానాలు మాత్రమే పొందగలిగారు, కారణం నూతన ఎన్నికల చట్టంలో ప్రాతినిధ్య విధానాన్ని మార్చి నందున జరిగింది. ప్రజాభిమానం తరగకపోగా పెరిగినందున తిరిగి 1956లో జరిగిన ఎన్నికలలో 156 స్థానాలలో గెలుపొందారు. ఫ్రెంచి పాలక బూర్జువా వర్గాలు మరోసారి ఎన్నికల చట్టాన్ని మార్చి తమకనుకూలంగా తిరుగవ్రాసిన కారణంగా, ఓట్లు తగ్గక పోయినా గెలచిన స్థానాలు తగ్గి 10 సీట్లు మాత్రమే పొందారు.

ఫ్రాన్సు కమ్యూనిస్టు పార్టీ అగ్రనాయకత్వం 15 నవంబరు 1945న జాక్విస్‌డగ్లాసు తదితర నాయకులు నిర్మించిన, రిపబ్లికన్ సివిల్ గార్డు అనేపేరుతో నిర్మించిన వామపక్ష ఫాశిస్టు వ్యతిరేకసైన్యాన్ని నిరాయుధాలను చేసి, రద్దుచేయాలంటూ, అదేకాలంలో షిఫ్టికాలంగా పనిచేసిన, మితవాద, పాశిస్టు అనుకూల సైనికదళాలను జాతీయసైన్యంలో అలాగే కొనసాగిస్తూ, ప్రజలు సాయుధులై ఉండిన దేశంలో అరాచకం ఏర్పడుతందని చెప్పారు[1].

"గతంలో హిట్లరు ఆక్రమణకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేయుటకు, విద్రోహ విచైట్ దళాలను నాశనం చేయుటకు ప్రజలు సాయుధులై ఉండాలను కొనుటకు అర్థం, కారణం ఉంది. నేటి పరిస్థితి అందుకు భిన్నమైనది. ప్రజారక్షణ సాంప్రదాయ పోలీసు ద్వారా జరుగుతుంది. సివిల్ గార్డు, తదితర అనధికార సైనికదళాలు సాధారణంగా యింకేమాత్రం కొనసాగరాదు అనే ధోరణిని 21-23 జనవరి 1945లో ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటిలో మారిస్ థోరేజ్ జనరల్ సెక్రటరీ పదవిని చేబట్టారు. పార్టీ నాయకులు కొందరు, రిపబ్లిక్ సివిల్ గార్డు కొందరు కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలోని ప్రజాసైన్యాన్ని రద్దుచేయరాదని ప్రకటించారు. అయినా పార్టీనాయకత్వం ప్రతిఘటనా సైన్యం పార్టీ నాయకత్వంలోని దానిని తమ ఆయుధాలను ప్రభుత్వానికి సమర్పించాలని ఆజ్ఞలుజారీ చేసారు. జనరల్ డీగాల్ నాయకత్వంలోని బూర్జువా ప్రభుత్వంలో ఉపరాష్ట్రపతి పదవిని థోరేజ్ చేబట్టారు. ఫ్రెంచి రాజ్యాంగ యంత్రాంగం, పాలనాయంత్రాంగం, సైన్యం, పోలీసు, కోర్టులు పాలక బూర్జువావర్గ ప్రతినిధులతోనే నిండి ఉన్నవి అట్టి పరిస్థితులలో పున్నర్మిర్మాణం అంటే అర్థం, పెట్టుబడిదారి విధానాన్ని

బలోపేతం చేయుట తప్పమరొకటికాదు. ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ "అధికోత్పత్తికై పోరాటం" అనే కేంద్రనినాదాన్ని యిచ్చి మితవాదం వైపుపయనించింది.

"అదేకాలంలో ఎన్నికలు, రిఫరెండంలు జరుగుతున్నవి. అప్పటికే పార్టీ నాయకత్వంలో చాలామంది మంత్రిత్వాలు స్వీకరించారు. ఎన్నికలలో విజయాలు, పార్లమెంటులో సీట్లు, మంత్రి పదవులు కలలు కనసాగారు. ఆవిధంగా మారిస్ థొరేజ్ తన ప్రఖ్యాత "సోషలిజంలోనికి శాంతియుత పంథా" అనే సంస్కరణవాద సిద్ధాంతాన్ని ప్రచారం చేసారు. టైమ్సుపత్రికా బ్రిటిష్ విలేఖరికి 18 అక్టోబరు 1946లో ఇచ్చిన ఇంటర్వ్యూలో థొరేజ్ యిలా ప్రకటించారు. "ప్రపంచ మంతటా ప్రజాస్వామ్యాభివృద్ధి సూత్రానికి అనుకోని కొన్ని మినహాయింపులు, సోషలిజం ఆవిర్భావానికి, రష్యాకమ్యూనిస్టుల మార్గానికి భిన్నమైన మార్గంలో సాధ్యాసాధ్యాల వివేచనను రేకెత్తిస్తున్నవి. ఏమైనా ప్రతిఒక్క దేశమార్గం భిన్నంగా తప్పని సరిగా ఉంటుంది. అత్యున్నత సాంప్రదాయాలుగల ఫ్రెంచి ప్రజలు ఉన్నత ప్రజాస్వామ్యం, అభ్యుదయం, సామాజిక న్యాయం కొరకు తమదైన మార్గాన్ని తామే రూపొందించు కొంటారని, తలచి అలాగే చెప్పాము" అంతేగాక అపఖ్యాతిపాలైన "ఐక్యత"ను నొక్కియిలా చెప్పారు.

ప్రజాస్వామ్యానికి కార్మికుల, రిపబ్లిక్ శక్తుల ఐక్యతయే నికరమైన పునాది. కమ్యూనిస్టులు, సోషలిస్టుల సమ్మేళనంతో మనం నిర్మించ తల పెట్టిన ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ నూతన పాప్యులరు ప్రజాస్వామ్యానికి మార్గదర్శికత్వం వహించుతుంది." ఈ ప్రకటన మార్క్సిజం లెనినిజంలను త్రోసిబుచ్చిన నగ్న అవకాశవాదంగా చరిత్ర రుజువు చేసింది. పారిస్ కమ్యూన్ తరువాత 20వ శతాబ్దంలో ఫ్రెంచి బూర్జువావర్గపు ప్రజాస్వామ్యంపై అంతటి ఆశాజనక భావాల ప్రకటన ఆశ్చర్యాన్ని కలిగించక మానదు.

ఈ వైఖరి అవగాహనలతో థొరేజ్ వర్గశత్రువులైన బూర్జువా వర్గంతో, వారికి అత్యంత విశ్వాస పాత్రులైన సోషల్ డెమోక్రాట్లైన సోషలిస్టుపార్టీతో అవగాహనకు ప్రయత్నించారు. ఫ్రెంచి బూర్జువావర్గం హిట్లరు నాజీసైన్యాలదాడికి జీవంకోల్పోయి, సైనిక ఓటమితో దేశద్రోహుల కుట్రలతో అత్యంతక్లిష్ట సంక్షోభ పరిస్థితులలో ఉంది. ప్రజల విశ్వాసాన్ని పూర్తిగ కోల్పోయింది. సోషలు డెమాక్రసీవిద్రోహం చేయటతో, అధికార సోషలిస్టు పార్టీ కూడ ప్రజల విశ్వాసాన్నికోల్పోయింది. కమ్యూనిస్టుపార్టీ, వామపక్ష సోషలిస్టులు ఫాశిస్టువ్యతిరేక సాయుధపోరాటాన్ని సాగించి విజయం సాధించుటతో అత్యధికంగా ప్రజాభిమానాన్ని పొందియున్నారు. బూర్జువావర్గం, ప్రజావిప్లవం ఇంటిముంగిట ఉందని భయత్రాంతులై ఉన్నారు. ఆంగ్లో, అమెరికన్ సైన్యాలు పశ్చిమప్రాంతంలో, తూర్పున రష్యన్ ఎర్రసైన్యం ఆక్రమించియున్నది. ప్రపంచ యుద్ధశాంతి ఒడంబడిక ఇంకా జరుగలేదు. కానీ, యీ పరిస్థితి అత్యంత సైనిక రాజకీయ ప్రాముఖ్యతగలిగి, ప్రపంచరాజకీయాల నిర్ణయాత్మక చారిత్రిక అంశంగా ఉంది.

---

*1. సత్యఘోష్ (1969) లిబరేషన్. వా. 2 నం. 3. పే. 19.*

ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ అగ్రనాయకత్వంలోని ముఖ్యభాగాన్ని అత్యంత అనుభవం కలిగిన ఫ్రెంచి బూర్జువావర్గంలోని అభివృద్ధి నిరోధిక మితవాద నాయకత్వంవారు తమవర్గపోరాట పంథాను విడనాడి, ఎన్నికల భ్రమల "వలలో" ఆకర్షితులగునట్లు మంత్రివర్గాల పదవుల ఎరలకు, ఇతర ప్రలోభాలకు లోనగునట్లు చేయుటలో విజయం సాధించింది. అమెరికా సామ్రాజ్యవాద శక్తుల మద్దతులతో బలపడిన ఫ్రెంచి బూర్జువా వర్గ ప్రభుత్వానికి చక్కగా, సంక్లిష్ట పరిస్థితులలో సేవలందిరిచిన కమ్యూనిస్టు మంత్రులను తదనంతరం అగౌరవంగా, అమెరికాసలహానను సరించి బహిష్కరించింది. కమ్యూనిస్టులు "శాంతియుతపంథా"కు అంకితమైలోతుకు దిగిపోయారని, తొలగించివేసినా, ఎన్నికల పోరాటాలలోనే నిమగ్నులగుతారని, సాయుధ పోరాటాన్ని చేబట్టజాలరని, చేబట్టినా అమెరికన్ సైనిక సహాయంతో అణచివేయగలమనే విశ్వాసాన్ని బూర్జువావర్గ ప్రభుత్వం కలిగివుంది. దీనితోపాటు, రష్యన్ ఎర్రసైన్యం కూడ ఫ్రెంచి కమ్యూనిస్టులకు సైనిక మద్దతునిచ్చుటకు, అమెరికా ఆటంబాంబును కలిగి యున్నందున సాహసించదనే విశ్వాసం బలంగా కలిగియున్నది. అంతగాక, కమ్యూనిస్టులను ప్రభుత్వం నుండి తొలగించిన చర్య అమెరికన్, దేశయ గుత్తపెట్టుబడి, బూర్జువావర్గాలకు అత్యంత ప్రేమపాత్రమైనందున, తమకు అన్నివిధాలకు మరింత మద్దతులభించగలదనే విశ్వాసం ప్రబలంగావుంది. ఈ విధంగా నాడు 70 వేల సాయుధసైన్యంగల ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ సోషలిస్టు పోరాటపంథాలో పయనించుటకు బదులు, పార్లమెంటరీ సంస్కరణ వాదంలోనికి దిగజారిపోయి, చొరవను కోల్పోయి, కొన్ని పదవులు స్వీకరించి, ఆచరణలో మార్క్సిస్టు-లెనినిస్టు పంథాను విడనాడారు. ఈ క్రమంలోనే దశాబ్దాలకొలది సంస్కరణవాదం, అవకాశవాదాలలో మునిగిపోయి 1968 మే లో కార్మిక, విద్యార్థి, యువజన, నగరబడుగు వర్గాలు, మధ్యతరగతుల ప్రజోద్యమవెల్లువగా విజృంభించి, పారిశ్రామికవాడలన్నింటిని, విశ్వవిద్యాలయాలను ఆక్రమంచి, ప్రభుత్వాన్ని, సైన్యాన్నిధిక్కరించి నిలబడి, మద్దతుకై కార్మికవర్గానికి, కమ్యూనిస్టు సోషలిస్టు శక్తులకు విజ్ఞాప్తి చేసినపుడు, వామపక్షాలు ముఖ్యంగా కమ్యూనిస్టుపార్టీ ఎట్టి విప్లవ పోరాట చొరవను ప్రదర్శించలేకపోయింది. అయినా ఫ్రెంచి కార్మికవర్గం మొత్తం ఒక్కుమ్మడిగా స్వతంత్రంగా బ్రహ్మాండమైన ప్రదర్శనలు జరిపి, పోరాటశక్తులకు మద్దతుగానిలబడింది. కమ్యూనిస్టు పార్టీ సంస్కరణ వాదంలో మునిగియున్నందున చొరవను కోల్పోయి చలన రహితంగా ఉండి పోయింది. థొరెజ్ సంస్కరణవాదాన్ని ప్రశ్నించిన వారినందరిని క్రమశిక్షణ పేరుతో అపకీర్తిపాలుజేసి, పార్టీనుండి బహిష్కరించుట జరిగింది. ఫాశిస్టు వ్యతిరేక సైనిక, గెరిల్లా పోరాటాలలో నాయకత్వం వహించి, ప్రధాన పాత్రవహించిన రాజకీయ నాయకత్వాన్ని పార్టీ నుండి బహిష్కరించారు. ప్రతిఘటనా కాలంలో నాయకత్వం వహించిన ఆన్డ్రీ మార్టిన్ ఎప్పుడూ వర్గ దృక్పధాన్ని వర్గపోరాటాలనే ప్రతిపాదిస్తూ ఉండేవాడు, చార్లెస్‌టిలాన్ సైనిక ప్రతిఘటనా పోరాటాలలో ప్రధాన పాత్రను వహించేవాడు, వీరిద్దరూ కమ్యూనిస్టు సైనిక దళాలు ఆయుధాలను అప్పగించుటను, సైనికదళాలను రద్దుచేయుటను వ్యతిరేకించారు. మే 1952లో యుద్ధనేరస్థులకు,

పరోక్షంగా వారిని బలపరస్తున్న అమెరికాకు వ్యతిరేకంగా బ్రహ్మాండమైన ప్రజాప్రదర్శనలు జరిగాయి. ఇందుకు ప్రజాస్వామకేంద్రీకరణ నిర్మాణసూత్రాలను వ్యతిరేకించారని, అపనిందలు, అపఖ్యాతులపాలుచేసి, తదుపరి వీరిద్దరినీ పార్టీ నుండి బహిష్కరించారు.

ఇటలీలో కూడ ఇట్టికథనమే పునరావృతమైంది. ఫ్రాన్స్‌లో సంస్కరణవాదాన్ని చేబట్టిన థొరేజ్ లాగానే ఇటలీలో టాగ్లియాటి మితవాద సంస్కరణవాదాన్ని అనుసరించి కమ్యూనిపార్టీ విప్లవపోరాటశక్తిని నిర్వీర్యం చేసారు. నాజీనియంత ముసులోని నియంతృత్వ వ్యతిరేక ఇటలీప్రజల సాయుధపోరాటం ఉధృతంగా సాగింది. రెండవ ప్రపంచ యుద్ధాంతానికి 2 1/2 లక్షల సైనిక, గెరిల్లాదళాల, సాయుధసైన్యం వామపక్షాల, ముఖ్యంగా కమ్యూనిస్టులనాయకత్వంలో ఉంది. ఈ ఫాశిస్టువ్యతిరేక ప్రజాసైనికదళాలు మిలాన్, వెన్నిస్‌లతో పాటు 200 చిన్న పెద్దనగరాలను ఫాశిస్టుల నుండి విముక్తిచేసాయి. ప్రజలు, ప్రజాసైన్యం తిరుగుబాటులో ఇటలీ ఫాశిస్టు నియంత ముసులోనిని పట్టుకొని బహిరంగంగా ఉరితీసారు. పార్టీజనరల్ శెక్రటరీ 18 సంవత్సరాల తరువాత దేశానికి తిరిగివచ్చి లొంగుబాటు మితవాద సంస్కరణవాదాన్ని చేబట్టాడు. ఒకవిధంగా, సామాజికచట్ట నిర్మాణ సంస్కరణల మార్గంలో సోషలిస్టు నిర్మాణ పంథాను టోగ్లియాటి చేబట్టి, విప్లవ పోరాటాల మార్గంలో సోషలిజం గమ్యాన్ని చేరుపంథాను విడనాడాడు. ఉత్తర ఇటలీలో రూపొందించబడి అనేక ఫాశిస్టు వ్యతిరేకసైనిక గెరిల్లా పోరాటాలలో రాటుదేలిన వామపక్షాల, ముఖ్యంగా కమ్యూనిస్టుల నాయకత్వంలోని సైనిక, గెరిల్లా సాయుధ దళాలను అభివృద్ధినిరోధక బదోగ్లియే ప్రభుత్వ "అలయెన్సుసైన్యాల" సైన్యాధిపతి అధ్వర్యంలో ప్రజాసైన్యాన్ని, గెరిల్లాసైన్యాన్ని వాటి ఐక్యసైనిక కమాండును ఉంచుటకు టోగ్లియాటి ఆమోదించారు. అంతేగాక, గెరిల్లా సాయుధసైనికదళాలను, దేశభక్తపోలీసు దళాలను నిరాయుధులను చేసి, రద్దు చేయుటకు ఆమోదించాడు. ఈ విధంగా ఫాశిస్టు వ్యతిరేక సాయుధసైనిక పోరాటాలలో పొందిన ప్రజావిజయాలను, కార్మికవర్గ మౌలిక ప్రయోజనాలను వర్గశత్రువులకు సంప్రదింపులలో వదలివేసారు. దానికి మారుగ ఉపప్రధాన పదవిని, కొన్ని మంత్రిపదవులను అభివృద్ధి నిరోధక ఇటలీ ప్రభుత్వంలో పొందారు. టోగ్లియాటి పంథా కార్మికవర్గ విప్లవపోరాట శక్తిని నిర్వీర్యం చేసింది. కమ్యూనిస్టు పార్టీని బూర్జువారాజ్యాంగ యంత్రంలో నిర్వీర్య భాగస్వామ్య పార్టీగ టోగ్లియాటి సామాజిక చట్టనిర్మాణ సంస్కరణల పంథా మార్చివేసింది.

ఫ్రాన్స్, ఇటలీలలోనేగాదు తూర్పుయూరపు, ఆసియా, నైరృతి ఆసియాలోని దేశాలలో రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఇట్టి ప్రయత్నాలే సామ్రాజ్యవాదుల అండదండలతో జరిగాయి. చైనా, వియత్నాంలలో విఫలమయ్యాయి, ఇండోనేషియా, ఇండోచైనా, బర్మాలలో మితవాద అభివృద్ధి నిరోధకశక్తులు సామ్రాజ్యవాదశక్తులను మద్దతుతో విజయం పొందాయి.

## 6.3 భారత కమ్యూనిస్టు ఉద్యమము, ఎన్నికల దృక్పథము

భారతదేశంలో 1935 రాజ్యాంగ సంస్కరణల చట్టం క్రింద రాష్ట్రాలకు లభించిన

రాష్ట్ర స్వపరిపాలనకై 1936-37లలో భూస్వాములకు విధ్యావంతులకు 10 శాతానికి తక్కువగాగల వారికి మాత్రమే ఓటుహక్కు ఇవ్వబడింది. ఆ విధంగా రాష్ట్ర అసెంబ్లీలకు జరిగిన ఎన్నికలలో నిషేధంలోఉన్న కమ్యూనిస్టు అభ్యుదయకర కాంగ్రెసు వాదులుగానో. సోషలిస్టుగానో ఎన్నికలలో పోటీచేయదు. మిగిలిన అన్ని స్థానాలలో మిత, మతవాద పార్టీలకు వ్యతిరేకంగా జాతీయ కాంగ్రెసు అభ్యర్థుల గెలుపుకు కృషి చేయుట జరిగింది. రెండవ ప్రపంచ యుద్ధానంతరం బ్రిటిష్ సంస్కరణల ననుసరించి 1945-46లలో జరిగిన రాజ్యాంగనిర్మాణ సభ యేర్పాటుకు ప్రతినిధుల ఎన్నికలలో కమ్యూనిస్టులు పోటీచేయుట, పోటీచేయని స్థానాలలో జాతీయ కాంగ్రెసు అభ్యర్థులను మత, మితవాద శక్తుల అభ్యుర్థులకు వ్యతిరేకంగా మద్దతునిస్తూతీవ్ర ప్రచారంగావించి గెలిపించుట ద్వారా ఎన్నికలలో పాల్గొనే సుముఖదృక్పధాన్నేకలిగి యున్నారు, కాని ఎన్నికలను బహిష్కరించాలనే నివాదాన్నియిచ్చి ఉండలేదు. భారతస్వతంత్ర రిపబ్లిక్ ఏర్పడాలని, వయోజన వోటుహక్కు ప్రాతిపధికపై ఎన్నుకొనబడిన అసెంబ్లీ, పార్లమెంటు ప్రభుత్వాన్ని, మంత్రి వర్గాన్ని ఏర్పరచాలని కోరారు.

భారతదేశంలో రెండవ ప్రపంచ యుద్ధానంతరం కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో కార్మిక, కర్షక, మధ్య తరగతులవర్గ పోరాటాలతో పాటు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాల బ్రహ్మాండమైన ప్రజావెల్లువ కొనసాగింది. ఫ్యూడలు వ్యతిరేకసాయుధ పోరాటాలు తెలంగాణా, బెంగాలులో తెబాగా రైతాంగ పోరాటాలు, కేరళలో పున్నప్రా-వాయలార్ పోరాలు అన్నీ కలసి పోరాటమార్గంలో ప్రజాపోరాటాలు విజృంభించి, భారతదేశంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదపాలన ఆస్తికత్వాన్ని ప్రశ్నించాయి. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమనాయకులతో చర్చల అనంతరం, నాటికమ్యూనిస్టుల సాయుధ పోరాటం అధికార స్వాధీనం లక్ష్యంతోగాక, ఫ్యూడలు భూస్వామ్యతిరేక, రైతాంగ సాయుధ ప్రతిఘటనా లక్ష్యంతోనే కొనసాగించి ఉండవలసిందనే నిర్ధారణకు భారత కమ్యూనిస్టు ఉద్యమంవచ్చి, సాయుధపోరాటాన్ని విరమించి నెహూప్రభుత్వానికి ఆయుధాలు సమర్పించింది. భారత రిపబ్లికన్ రాజ్యాంగ చట్టం ఆమోదించబడిన తదనంతరం 1952లో జరిగిన ప్రధమ జనరలు ఎన్నికలలో సి.పి.ఐ. పాల్గొని, పార్లమెంటులో ప్రప్రధమ ప్రతి పక్షపార్టీగా ఎన్నికకాబడి, గుర్తింపు పొందింది. అప్పటి నుండి ఐక్యకమ్యూనిస్టుపార్టీ, 1964-65 తదనంతరం చీలిన సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)లు రెండూ నేటివరకు ఎన్నికలలో పాల్గొంటూ, ప్రభుత్వవ్యతిరేక పార్లమెంటరీ పోరాటాలు కొనసాగిస్తూనే ఉన్నవి. సి.పి.ఐ.(యం) నియోసంస్కరణ వాదాన్ని చేబట్టిందని 1964లో అతివాదులు చీలిపోయి సి.పి.ఐ.(యం.యల్)ను ఏర్పరచారు. భారతకమ్యూనిస్టు ఉద్యమ వర్గాలలోవీరే ప్రప్రధమంగా ఎన్నికలలో పాల్గొనుటను బహిష్కరించారు.

ఈ కమ్యూనిస్టు ఉద్యమంలోని మార్క్సిస్టు-లెనినిస్టు వర్గాలలో కూడ 1980 దశకం నుండి పునరాలోచనలు జరుగుతున్నవి, క్రమేణా 1990 దశకం వచ్చునప్పటికి ఒక్క పీపిల్సువార్ గ్రూపుతప్పమిగతా గ్రూపులన్నీ ఎన్నికలను బహిష్కరించుట విడనాడి

సర్వస్వతంత్రులుగానో, కొన్ని గ్రూపులు కలసి ఇండియన్ పీపిల్సు ఫ్రంటు (ఐ.పి.యఫ్)గానో ఏర్పడి పాల్గొంటున్నవి. వీరు తాము విప్లవపోరాట కార్యక్రమాలను విడనాడలేదని, తమరాజకీయ విధానాలను ప్రచారంచేసుకొను నిమిత్తం ప్రధానంగా పాల్గొంటున్నామన్నారు. ఏమైనా ఎన్నికలను బహిష్కరించిన వారినే విప్లవకారులుగ గుర్తించాలనే అవగాహన, ఆచరణపోయి, అనేక పోరాట రూపాలలో ఎన్నికలలో పాల్గొనుటకుకూడ, ఒకపోరాట రూపాన్ని చేజట్టుటగా, పెక్కు కమ్యూనిస్టు శ్రేణులు గుర్తించినట్లు కన్పడుతున్నది.

"ప్రజలు యేక్షణంలోనూనా తిరుగుబాటు చేయసంసిద్ధులుగా ఉన్నప్పుడు ఎన్నికలలో పాల్గొనుట, వారి ఆలోచనను సాయుధపోరాటం నుండి ఎన్నికల వైపు మళ్ళించినట్లు అగుతుంది. ప్రజలు సాయుధులై పోరాటాలలో స్వయంగా పాల్గొనే అవకాశం ఉన్నా విప్లవ పరిస్థితి, పరిపక్వత లేనప్పుడు ఎన్నికలలో పాల్గొనాలి. అంటే, ప్రజలు సాయుధులై పోరాడు స్థితి, విప్లవ పరిస్థితి, పరిపక్వతకు చేరకుండా ఎన్నికల బహిష్కరణ నినాదమిచ్చుట తప్పు" అనే స్వానుభవంతో సి.పి.ఐ. (యం.యల్) నుండి విభేదించిన "ప్రజాపంథా" వర్గం తమ ఎన్నికల దృక్పధం వివరించింది.

## 6.4 ఎన్నికలలో పాల్గొనుటకు సాధారణ మార్గదర్శిక సూత్రాలు

విప్లవోద్యమాలు ముందుకు పురోగమించునప్పుడు కూడ, బూర్జువాపార్లమెంటరీ ప్రజాస్వామ్యంపై ప్రజల భ్రమలు ఇంకా కొనసాగుతున్నపుడు, మార్క్సిస్టు-లెనినిస్టులు ఆచరణలో బూర్జువాపార్లమెంటరీ ప్రజాస్వామ్యం సంస్థలపై ప్రజలు భ్రమలను తమ అనుభవాలద్వారా విడనాడుటకు, వ్యవసాయ విప్లవం, ప్రజాయుద్ధ అవసరాన్నివారు గుర్తించుటకు ఎన్నికలలో పాల్గొంటారు.

పార్టీలో బూర్జువా ప్రజాస్వామ్య పార్లమెంటరీ భ్రమలు ప్రబలకుండా విప్లవ పోరాటాలు నేరుగా, నిరాటంకంగా కొనసాగుటకు ప్రతిసారి ఎన్నికలలో యేరూపంలో పాల్గొన వలసింది, పార్టీరాజకీయ తీర్మానాలలో స్పష్టంగా వివరించ బడింది. "నేటిపరిస్థితులలో మనకర్తవ్యాలు" అనే రాజకీయతీర్మానంలో ఎన్నికలలో అనుసరించవలసిన సాధారణ మార్గదర్శిక సూత్రాలు నిర్థిష్టంగా వివరించబడ్డాయి.

అవి : ప్రజలలో రాజకీయ పంథా, విప్లవరాజకీయాలు విస్తృతంగా ప్రచారంచేయాలి. ప్రజలలో పార్టీ పునాదిని, విస్తృతిని బలపరచాలి. ఈ ఎన్నికలు సమాజంలో ఎట్టి మౌలికమార్పులు కొని వచ్చుటకు తోడ్పడవని ప్రజలకు స్పష్టం చేయాలి. బడాబూర్జువా, బడాభూస్వామ్య రాజ్యాంగ చట్టపరిధిలో ప్రజలకు కలిగే భ్రమలను తొలగించుటకే, విప్లవకారుల ఎన్నికలలో పాల్గొంటారు. ఎన్నికల తరువాత వారిని విప్లవపోరాటాలకు సన్నద్ధులను చేయుటకు తమబలంపై ఆధారపడి మాత్రమే ఎన్నికలలో పాల్గొంటున్నారు. ఎన్నికలమిత్ర కూటమిగాకొని, సీట్లు సర్దుబాట్లుకొని పాలకవర్గ పార్టీతోనేగాక, మరేయితర జాతీయ, ప్రాంతీయ పార్టీలతోగాని లేక తదితర ప్రతిపక్షపార్టీలతోగాని, ఎట్టిఎన్నికల

అవగాహనలను పెంపొందించ తలచరాదు. నూతన ప్రజాస్వామ్య విప్లవాన్ని బలపరచే అన్ని శక్తులతో ఎన్నికల మిత్రకూటమిని ఏర్పాటు చేయుటతోపాటు, సీట్లుసర్దుబాట్ల వొప్పందాలు చేసుకొనుటకు విప్లవకారులు సంసిద్ధతను తెలిపారు. పాలక బూర్జువావర్గాల ఏభాగంతోను రాజ్యాధికారం పంచుణనులట, ఈ బడాబూర్జువా, భూస్వామ్యవర్గాల రాజ్యాంగంలో జరుగదు. ఇవే సాధారణ ఎన్నికలలో అనుసరించే మార్గదర్శిక సూత్రాలు.

## 6.5 ప్రజలకు పార్లమెంటుపై భ్రమలు లేవా?

చట్టబద్ధ, రాజ్యాంగ బద్ధ పోరాటాలలో, పార్లమెంటరీ పోరాటం వొకటి. ఇది రాజకీయ పోరాటం. దేశంలో విప్లవ వెల్లువ ఉన్నపుడు, సాయుధ తిరుగుబాటు, సాయుధపోరాటం జరుగుచున్న ప్రాంతంలో ప్రజల పాల్గొంటునప్పుడు పార్లమెంటరీ ఎన్నికలను బహిష్కరించాలని, అటువంటి పరిస్థితులు లేనందున పార్లమెంటరీ పోరాట రూపాన్ని, పార్లమెంటును, ప్రజలను విప్లవానికి సన్నద్ధులను చేయుటకు ఒక ఎత్తుగడగా వినియోగించుకొనాలని లెనిన్ భోదించారు దీనికి కాలం చెల్లిందని కాని పనికిరాని ఎత్తుగడ అని ఎవరూ పేర్కొనలేదు. కాని చారుమజుందార్ దీనిని ఎత్తుగడల సమస్యగా కాక వ్యూహాత్మక సమస్యగా గుర్తిస్తున్నారు. కాని ప్రస్తుతం దేశంలో ప్రజలకు పార్లమెంటరీ సంస్థలపై భ్రమలు లేవనేసాకుతో బహిష్కరణలకు పిలుపునిస్తున్నది. ఈ వైఖరిని పీపిల్సువార్ నాయకుడు కె.ఎస్. ఇంటర్వ్యూలో "ఇండియాలో పార్లమెంటరీ విధానంపై ప్రజలకు నమ్మకంపోతే తప్ప విప్లవంరాదని చెప్పటం పూతపదమే తప్ప వాస్తవం కాదు. పార్లమెంటుపైవారికి భ్రమలు లేవు." అని వాదించారు. పార్లమెంటరీ పోరాటాలపై ప్రజలకు భ్రమలు పోవుట మంటే రాజ్యాధికారిన్ని స్వాధీనం చేసుకొనుటకు నూతన వ్యవస్థకై రాజ్యాంగ బద్ధమైన పోరాటానికి బదులుగా, సాయుధ పోరాటానికి పూనుకొనుటమే. సాయుధ పోరాటంలో పాల్గొనకుండా కేవలం పార్లమెంటరీ ఎన్నికలలో పట్టీపట్టనట్లుగా ఉండుటకు వెనుకబాటుతనం, ప్రజచైతన్యం లేకపోవుట, నిర్లిప్తత కారణాలుగా ఉండవచ్చును. దీనినే విప్లవచైతన్యంతో పార్లమెంటరీ విధానంపై భ్రమలు కోల్పోయినట్లుగా భావించుట తప్పు అగుతుంది. స్వీయమానసిక దృక్పథానికి గురై ప్రజావుద్యమం "సాయుధపోరాటం" స్థాయికి చేరుకుందని, తాము సాయుధ పోరాటం సాగిస్తున్నామని భావిస్తున్న ఫలితంగానే ప్రజలకు పార్లమెంటరీ పోరాటంపై భ్రమలు లేవని ఊహాజనితంగా భావిస్తున్నారు. వాస్తవాలు దీనికి పూర్తి భిన్నంగా ఉన్నాయి[1].

"దేశం మొత్తంలో విప్లవకారులు పనిచేస్తున్నది చాలా కొద్ది ప్రాంతం. అక్కడకూడ అత్యధిక ప్రజలు ఎన్నికలలో పాల్గొన్నారని అనుభవం రుజువుచేస్తున్నది. వాస్తవంగా 1977లో పార్లమెంటుకు జరిగిన ఎన్నికల నుండి పాల్గొనే ప్రజల సంఖ్యపెరిగింది. ఈ వాస్తవం నేటికీ ప్రజలకు పార్లమెంటుపై ఉన్న భ్రమలను తెలియజేస్తుంది. అగ్రగామియైన పార్టీచైతన్యం, ప్రజల చైతన్యంగా భావించుట తప్పు. గత 20 సంవత్సరాల అనుభవం,

1. సత్యం (1988) పీపిల్సువార్ గ్రూపు అతివాద పెడధోరణి సి.పి.ఐ.(యం.యల్) ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కమిటీ, ప్రచురణ పే. 15-16.

సామాన్యునికి కనుపించే యీవాస్తవాన్ని గుర్తించక పోవటం నిరాకరించడం మూర్ఖత్వం తప్పమరొకటికాదు. విడివాదం, స్వీయమానసిక ధోరణులలో ఎంత లోతుగా దిగిపోయామో తెల్పుతుంది.

## 6.6 కమ్యూనిష్టు విప్లవకారులు : ఎన్నికలు

అఖిల భారత విప్లవకారుల సమన్వయ కమిటి ఎన్నికలు సమస్యపై చేబట్టిన వైఖరిపై. యు.సి.సి.ఆర్.ఐ. (యం.యల్) మొదటి రెగ్యులర్ కాన్ఫరెన్సు ఫిబ్రవరి 1989లో ఆమోదించిన రాజకీయ, నిర్మాణ, ఉద్యమ సమీక్ష. భారత విప్లవోధమం (1967-88) కొన్ని గుణపాఠాలు, అనుభవాలు, ఇలా పేర్కొన్నది. "ఎన్నికల బహిష్కరణకు సంబంధించిన సమస్య, ఎ.ఐ.సి.సి.సి.ఆర్., భారత విప్లవ దశకంతటికి వ్యూహసంబంధమైన మౌలిక సమస్యగా ఎంచింది. కాని ఆంధ్ర కమిటి యిది ఎత్తుగడల సమస్య అనే అభిప్రాయంతోనే ఉంది. అంతేగాక నిర్దేశించిన సమయంలో అంటే అక్టోబరు 1968 తర్వాత రెండు నెలలోపల ఆంధ్రరాష్ట్ర అసెంబ్లీకి రాజీనామా ఇవ్వకపోవడం ద్వారా కా. నాగిరెడ్డి, ఎ.ఐ.సి.సి.సి.ఆర్. తీర్మానాన్ని అమలు చేయుటలో విఫలుడు కావటం యీ మౌలిక విభేధం నుండి వుత్పన్నమైనదే" అని అంటూ ఎ.ఐ.సి.సి.సి.ఆర్.కూ ఆంధ్ర సమన్వయ కమిటికి మధ్యగల మౌలిక అభిప్రాయ భేదాలలో ఒకటిగా పేర్కొన్నది.

"అతివాద అవకాశవాదులు ఎన్నికలను వ్యూహాత్మక సైద్ధాంతిక సమస్యగా అభిప్రాయ పడ్డారు. జనతా ప్రజాతంత్ర విప్లవదశ అంతటా ఎన్నికలను బహిష్కరించాలని ప్రభోదించారు. ఎన్నికలలో పాల్గొనడాన్ని పార్లమెంటరీ పంధాతో సమానంచేసి, ఎన్నికల గూర్చి మాట్లాడిన వారందరిపై రివిజనిస్టులని దాడులు సాగించారు.

"ఎ.ఐ.సి.సి.సి.ఆర్. యీ సమస్యపై అతివాద అవకాశవాదంతో మౌలికంగా విభేదించింది. ఈ కాలంలోవారు అనుసరించిన వైఖరి క్లుప్తంగాయిలా ఉంది.

"ఒకటి, ఎన్నికలు ఎత్తుగడల సమస్య అని అనేక చట్టబద్ధ పోరాట రూపాలలో అదివొకటని ఎ.ఐ.సి.సి.సి.ఆర్. స్పష్టం చేసింది. సాధారణ బహిష్కరణ అనే నినాదాన్ని ఎ.ఐ.సి.సి.సి.ఆర్. విప్లవ కారులు తిరస్కరించారు. ఎ.ఐ.సి.సి.సి.ఆర్.లో లీనమయ్యే సమయంలో ఆనాయకత్వానికి వారు తమవైఖరిని స్పష్టంగా చెప్పారు.

రెండు, ఎన్నికలపై తమ అవగావనను నిర్దిష్టంగా అన్వయించడం, ఆచరణలో పెట్టడం అనే సమస్యలనైనా ఎ.ఐ.సి.సి.సి. ఆర్ విప్లవకారుల నాయకత్వంలో తేడాలున్నాయి.

కా. నాగిరెడ్డి 18 ఆగస్టు 1968లో బ్లిట్జ్ పత్రిక విలేఖరికి యిచ్చిన ఇంటర్వూలో " తమసమస్యలు విప్లవ మార్గంలో మాత్రమే పరిషార మౌతాయని ప్రజలు గుర్తించేలా చేయుటకు విప్లవకారులు ఎన్నికలల్లోనూ, శాసనసభలోనూ పాల్గొంటారు" అని వివరించారు. రాష్ట్ర శాసన సభకు రాజీనామాయిచ్చిన 1969 ప్రారంభదినాలలోనే

---

*1. భారత విప్లవోధ్యమం (1990) కొన్ని గుణపాఠాలు యు.సి.సి.ఆర్.ఐ (యం.యల్) మొదటి రెగ్యులర్ కాన్ఫరెన్సు-ఏప్రిల్ 1989లో ఆమోదించినది. జనశక్తి ప్రచురణ పే.107.*

కా॥ నాగిరెడ్డి స్వీడిష్ పత్రికావిలేఖరితో మాట్లాడుతూ "మనం సాయుధపోరాటం సాగిస్తూ కూడా, సాయుధపోరాటంలేని ప్రాంతాలలో పార్లమెంటులో కూర్చుంటాము." అని కూడా చెప్పారు. అయితే, దేవులపల్లి పార్లమెంటు, అసెంబ్లీ ఎన్నికలను పట్టించుకొనవలసిన అవసరంలేదనే విరుద్ధ అభిప్రాయాన్ని మరికొందరితో పాటు కలిగివున్నారు. వీరుకూడ ఎన్నికలు ఎత్తుగడల సమస్య అని, ఒక పోరాట రూపం అనే అభిప్రాయాన్ని కలిగి ఉన్నారు. ఇది సాధారణ బహిష్కరణ దృక్పధానికి దగ్గరగా ఉంది.

"మూడు కా.నాగిరెడ్డి 1969 మార్చిలో రాష్ట్ర అసెంబ్లీ సభ్యత్వానికి రాజీనామా చేసారు. అయినా ఎన్నికల సాధారణ బహిష్కరణకు, దీనికి ఎటువంటి సంబంధం లేదు. అదే ఇంటర్వ్యూలోనే మరో సందర్భంలో, నాగిరెడ్డి "ఈ పదహారేళ్ళు కార్మికవర్గ పోరాటాన్ని విప్లవ పోరాటమార్గంలో కొనసాగించి నట్లయితే మేము కొన్ని ప్రాంతాల్లో రైతాంగసాయుధ వ్యవసాయ విప్లవపోరాటాన్ని సాగించుతున్నా పార్లమెంటును కూడ బహుశా ఉపయోగించుకొనగలిగి ఉండేవారము" అని వివరించారు[1].

"ఎన్నికలలో పాల్గొంటే పార్లమెంటరీ భ్రమలు యెక్కువకాగలవనే భయంతో" దేవులపల్లి చాలాకాలం వరకు "ఎన్నికలు అవసరమైన పోరాట రూపాలలో భాగంకాజాలవన్న" సూత్రీకరణను అనుసరించినా, కాలానుగతంగా చర్చల క్రమంలో తన అభిప్రాయాలను మార్చుకొని, ఎన్నికలను పోరాట రూపంగా అన్వయించుకొనే మార్గంలో ఆలోచించారు. కాని తన గత అభిప్రాయాలు తప్పని అంగీకరించటానికి సిద్ధపడలేదు. తప్పు అభిప్రాయాలకు భాద్యతలను యితరులపైకి నెట్టుటకు "నిర్ధిష్టపరిస్థితి," "ఉపయుక్తత" పేరిట గత వైఖరులను సమర్ధించుకొనుటకు ప్రయత్నించారు.

"ఎన్నికల సమస్యపై తప్పుడు ఒంటెత్తు పోకడలకు దేవులపల్లి వొక్కడినే నిందించరాదు. ఎ.పి.యస్.సి చర్చల క్రమంలో ఒక సి.సి.యం వాటినుండి బయటపడినప్పటికి, మిగిలిన సి.సి.యంలకు కూడ సెక్టేరియన్ భావాలు, సందేహాలు వున్నాయి. కనుక 1977-80 కాలంలోని వివిధ ఎన్నికలలో స్పష్టమైన, సరైన మార్గదర్శికత్వాన్ని అందించుటలో సి.సి. విఫలమైందని అంగీకరించాలి"[2].

ఇక, వొంటెత్తు పోకడలలో పరాకాష్టపొందిన పీపిల్సువార్ గ్రూపు, యితర కొద్దిమంది, ఎన్నికలను శాశ్వతంగా బహిష్కరించుట తెలిసినదే.

మార్క్సిస్టు - లెనినిస్టు విప్లవ కమ్యూనిస్టు గ్రూపులలో అత్యధికులు పుల్లారెడ్డి గ్రూపుతోసహా, భారతవిప్లవ పంధాలలో నూతన ప్రజాస్వామ్య విప్లవ మార్గంగా

---

1. *భారత విప్లవోద్యమం (1990) కొన్ని గుణపాఠాలు యు.సి.సి.ఆర్.ఐ (యం.యల్) మొదటి రెగ్యులర్ కాన్ఫరెన్సు-ఏప్రిల్ 1989లో ఆమోదించినది. జనశక్తి ప్రచురణ పే.108-9.*
2. *-- అదే -- పే.262.*

పార్లమెంటరీ మార్గాన్ని త్రోసిబుచ్చి, ప్రజాయుద్ధ పంధాయే ప్రజావిముక్తి పంధాగా, భారతవిప్లవ పంధాగా గుర్తించాయి.

"సంస్కరణవాదులు, నియోసంస్కరణవాదులు పార్లమెంటరీ విధానాన్ని అనుసరించుతున్నారనే తీవ్రద్వేష ఫలితంగా, నూతన ప్రజాస్వామ్య విప్లవ దశకంతటికీ ఎన్నికల బహిష్కరణ విధానాన్ని వ్యూహాత్మకంగా మా పార్టీ ఆమోదించి, "శతృనిర్మూలన"ను వర్గపోరాటంగా, ప్రజాయుద్ధాన్ని ప్రజాసామాన్యాన్ని సమీకరించే కార్యాచరణగా ఆమోదించింది. భారతవిప్లవానికి ఆచరణలో యీ విధానం అత్యధిక నష్టాన్ని చేకూర్చింది.[1]

"ఎన్నికలు బహిష్కరించండి" అనే నినాదం మొదటినుండీ ఎప్పుడూ విజయానికి మార్గం అని రుజువు కాలేదు. మిలియనులకొలది మన ప్రజాసామాన్యానికి పార్లమెంటరీ విధానం యెడల భ్రమలు కలవని అనుభవం రుజువుచేసింది. ఎన్నికలలో ప్రజలు పాల్గొంటున్నారు, ఉన్నత పోరాట రూపాలను చేబట్టుటకు సిద్ధంగాలేరు. అట్టి పరిస్థితులలో ఎన్నికల బహిష్కరణకు అర్థంలేదు. పాలకవర్గ పార్టీలకు, సంస్కరణ వాదులకు, నియోసంస్కరణవాదులకు రాజకీయరంగాన్ని స్వేచ్ఛగా వదలివేయుట, వారు ప్రజలను ప్రక్కదారులు పట్టించే నినాదాలు, వాగ్దానాలు చేసి, మోసబుచ్చుటకు అవకాశం లభించుతుంది.

ఎన్నికలలో పాల్గొనినంత మాత్రాన్న అది పార్లమెంటేరియనిజం కాజాలదు. ప్రజలలో విస్తార ప్రచారాన్ని విప్లవలక్ష్యం కొరకు సాగించుట, పోరాడుట, సమీకరించుట, ప్రజాజీవనం మెరుగుపరచుటకు వొక రూపంగా పార్లమెంటరీ పోరాటాన్ని, విముక్తి పోరాటానికి పూర్వరంగ పోరాటంగా నెంచే అవగాహనయేర్పడి, స్పష్టత లభించింది.

"మాపార్టీ పార్లమెంటేరియన్ పంధానుత్రోసి బుచ్చుటయే గాక, ఎన్నికల బహిష్కరణ నినాదం సెక్టేరియన్ నినాదమైనందున పార్టీని ప్రజలనుండి దూరం చేస్తుంది. మా స్వంత బలం, మా వ్యవసాయ విప్లవ కార్యక్రమం, ప్రజల చైతన్యస్థాయిని బట్టి ఎన్నికలలో పాల్గొనుట ప్రజావుద్యమస్థాయిని అనుసరించే జరుగుతుంది." అంటే వ్యూహాత్మకంగా పార్లమెంటరీ విధానాన్ని త్రోసిబుచ్చుట, ఎత్తుగడగా ఎన్నికలలో పాల్గొనుటలలో పరస్పర వైరుధ్యం లేదు.

"మాపార్టీ సాధారణ రాజకీయ దృక్పధం ఎన్నికలలో తు–చ తప్పకుండా పాటించ బడుతుంది." "దీర్ఘకాల రక్షణ ప్రజాయుద్ధం కొరకు ప్రజలను సన్నద్ధులను చేయుటయే పార్టీ సాధారణ దృక్పధం, నేటి రాజ్యాంగచట్టం బడాబూర్జువా బడా భూస్వామ్యవర్గాల ప్రభుత్వమని ప్రజలకు నచ్చజెప్పుటచేస్తుంది. అది నేటి అర్థ వ్యూడలు, అర్థవలస, బడాబూర్జువారాజ్యాంగ చట్ట పరిధిలో జరిగే ఎన్నికలు ద్వారా యేర్పడే ప్రభుత్వం,

---

*1. సెలెక్టెడ్ రైటింగ్సు ఆఫ్ కామ్రేడ్ చంద్రపుల్లారెడ్డి, వా. 1 (1987) సి.పి.ఐ. (యం.యల్) కేంద్రకమిటి. పబ్లికేషన్ (ఆంగ్లంలో) పే. 132.*

పాలనా యంత్రాగం ఎట్టి మౌలిక మార్పులు తీసుకొని రాజాలదు. అందుకే తాత్కాలిక కేంద్రకమిటి తీర్మానం యీ క్రిందివిధంగా పేర్కొన్నది.

"వ్యవసాయ విప్లవం, పార్టీ రాజకీయవిధానాలను, పంధాను ప్రజలలో విస్తృత ప్రచారం చేయుటయే ఎన్నికలలో పాల్గొనుటలోని మౌలిక లక్ష్యం. మా ప్రజా పునాది విస్తరించి, బలోపేతంచేయుట లక్ష్యంలో భాగము. ఈపోరాట క్రమంలో ఎన్నికలలో కొన్ని సీట్లలో విజయం లభించితే, ఆ అవకాశాన్ని ఆలక్ష్యంకొరకే ఉపయోగించుతాము[1]

## 6.7 "రెడ్‌ఫ్లాగ్" విప్లవకారుల ఎన్నికల అవగాహనలు

"సంస్కరణవాదులు, నియోసంస్కరణవాదులు విప్లవ పంధాను త్రోసిబుచ్చి గత సంస్కరణవాదాన్ని వారసత్వంగా పొందారు. వారు సంస్కరణ వాద సిద్ధాంతాన్నిటిని, ఆచరణను వొక సమగ్ర సంస్కరణవాద పంధాగా అభివృద్ధి చేసారు. వర్గ సహకార పంధాగా చేసారు. సంస్కరణవాదులు పార్లమెంటరీవిధానాన్ని వొక పంధాగా అనుసరించుటలో నియోసంస్కరణవాదుల కంటె నిర్దిష్టంగా స్పష్టం చేసారు. అదే పంధాను నియోసంస్కరణవాదులు మోసపూరితంగా అనుసరించారు. ఇద్దరూ భారత రాజ్యాంగాన్ని, పార్లమెంటరీ పంధాని, అదిమూసి పెడుతున్న నిరంకుశ నైజాన్ని ఆమోదించుతునే వున్నారు. ఇద్దరూ పార్లమెంటరీ విధానాన్ని, పార్లమెంటేతర విధానాన్ని సంలీనం చేసి, వొక, విప్లవపంధాను గురించి మాట్లాడుతుంటారు. వారు పార్లమెంటరీ పంధాని అనేక పోరాటరూపాలలో వొక వర్గపోరాటంగా విప్లవ సమగ్ర పంధాలో వొక అంశంగా, భాగంగా నెంచుతున్నారు. కార్మికవర్గ సాధారణ ప్రయోజనాలు, విప్లవంలో కార్మికవర్గ ప్రత్యేక పాత్రకు ముడిపడివున్నాయి. "పార్లమెంటేతర పోరాటరూపం" అని మాట్లాడుట కూడ మోసపూరితమైనది"[2]. అంతేగాక "దోపిడివర్గాలకు వ్యతిరేకంగా తీవ్రమైన పోరాటాన్ని నిర్మించే ఆలోచనలేదు. కనీసకోర్కెలపై ప్రభుత్వంపై పోరాడుట కూడలేదు. తీవ్రమైన పోరాటాలను నిరశించే దశకు వారు చేరుకొన్నారు. ఈ పోరాట జ్వాలలు పాలకవర్గాలను చుట్టుముట్టాలని ఆకాక్షించుతున్నారు. అనేక పోరాటాలు యీ విద్రోహవిధానాలకు "ఎర" అయ్యాయి.

"నియోసంస్కరణవాదుల" నాయకత్వం, వారి కార్యక్రమంలో (113 అంశం) "శాంతి పంధాలో" జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని, సోషలిస్టు పరివర్తనను తెచ్చుటకు ప్రయత్నిస్తామని నొక్కి చెప్పారు. అదే కాలంలో "పాలకవర్గాలు స్వచ్ఛందంగా తమ అధికారాన్ని వదలుకొనజాలవని'' విప్లవపోరాటాలు'' అందుకు తగినరీతిలో తీవ్రరూపాలలో అడ్డుగోడలను తొలగించి పురోగమించగలవని" సంతృప్తి చెందాయి.

---

1. సెలెక్ట్ రైటింగ్సు ఆఫ్ కామ్రేడ్ చంద్రపుల్లారెడ్డి, వా.1 (1987) సి.పి.ఐ. (యం.యల్) కేంద్రకమిటీ, పబ్లికేషన్ (ఆంగ్లంలో) పే.133–4.
2. -- అదే -- పే.45–6.

"ఈ విధమైన ఆకాశాన్నంటే మాటలు తప్పుడు మార్గం పట్టించే అవగాహనను యిస్తూ, విప్లవపంథా నుండి దూరం చేస్తూ, పార్లమెంటరీ విధానాల యెడల భ్రమలను పెంచి పోషించు చున్నవి. అవి హిమాలయమంతటి భ్రమలని రుజువైంది. (?)'' అని విమర్శించారు.

"ప్రధమంగా నేడున్న పార్లమెంటరీ వ్యవస్థను, అవకాశాలను వినియోగించుట వొక విషయం, వాటిని మెచ్చుకొనుట వాటి అభివృద్ధి నిరోధకతపై ముసుగువేయుట మరో విషయము. ఇదే నియోసంస్కరణవాదులు చేస్తున్నవని. ద్వితీయంగా పాలకవర్గాలు వారి ప్రయోజనాలకు అవసరమైన పార్లమెంటరీ వ్యవస్థ, అధికార యంత్రాంగాలను నాశనం చేయుట మరో విషయము. తృతీయంగా యేదోవిధమైన ప్రాతినిధ్య వ్యవస్థలుండుట మాత్రమే చాలదు. అవి దేశంలో ప్రజాస్వామ్య రాజకీయవ్యవస్థ వున్నదనుటకు సాక్ష్యాధారాలు కావు. ఎన్నికల నిర్వహణ దాదాపు ఫార్సుగాతయారైంది. అన్ని ప్రజావ్యతిరేక ఫాశిస్టు చట్టాలకు పార్లమెంటు, అసెంబ్లీ ముద్రలు లభించాయి. పాలకవర్గాలు రాష్ట్రాలలో సైనికపాలన ప్రకటించగలవు, కల్లోల ప్రాంతాలుగ ప్రకటించగలవు, ఎట్టి శిక్షలేకుండా తప్పించుకొనగలవు. ఆర్డినెన్సుల రాజ్యాన్ని కొనసాగించగలవు. చివరఅంశంగా, నియోసంస్కరణవాద వర్గాలు విప్లవ మార్గంలో వచ్చే "మలుపులు, మెలికల''కు సంసిద్ధులై వుండాలని ప్రజలను, శ్రేణులను హెచ్చరించుట, ప్రక్కదారులు పట్టించే పెద్దకబుర్లు తప్ప మరేమికాదు. ప్రజలను నిరాయుధులను చేయుట అగుతుంది. సి.పి.ఐ(యం) పోలిట్‌బ్యూరో శ్రీనందాకు వ్రాసిన లేఖలో ప్రభుత్వ హోంశాఖ సి.పి.ఐ(యం) సాయుధపోరాటానికి నిలబడివుందనుట, నిరాధారం, అన్యాయ పూరితం అయిన నింద అని. శాంతియుత, పార్లమెంటరీ విధానానికి విశ్వాసపాత్రంగా వుందని వ్రాసారు. సంస్కరణ వాదులు, నియోసంస్కరణవాదులు గత కొన్ని దశాబ్ధాలుగా అనుసరించుతున్న పూర్వ పోరాట సాంప్రదాయాలన్నిటిని గాలికి వదలివేశారు.[1]" అనే విమర్శనాధోరణిని చేబట్టారు.

రెండున్నర దశాబ్దాల "చేదునిజాల" అనుభవాల తరువాత, 1992 ఏప్రిల్‌లో జరిగిన సి.పి.ఐ(యం.యల్) పార్టీ కాంగ్రెసు ఆమోదించిన రాజకీయతీర్మానం, ఎన్నికల యెడల పార్టీ వైఖరి, ఎత్తుగడలను యిలా వివరించింది.

"ఎన్నికలలో పాల్గొనుట లేక బహిష్కరించుట ఎత్తుగడల సమస్య అగుతుంది. అయితే, అనేక సంవత్సరాలుగా కమ్యూనిస్టు విప్లవకారులు దానిని వొక వ్యూహ సమస్యగా చూసారు." లెనిన్ "మేము యీ సమస్యను ఎల్లప్పుడూ నిర్ధిష్ట రాజకీయపరిస్థితులకు సంబంధించిన నాటి వాస్తవ పరిస్థితుల నేపధ్యంలో పరిశీలించాము.''అని వ్యాఖ్యానించారు. రష్యన్ పార్లమెంటు డ్యూమాను బహిష్కరించుటకై లెనిన్ విప్లవ కార్మికవర్గపు ఉత్సాహం, వాస్తవ పరిస్థితులను అంచనా వేయుటకు, అవి మరింత

1. *ఎలక్షన్ అండ్ ది యాటిట్యూడ్ ఆఫ్ ది కమ్యూనిస్టు రివల్యూషనరీస్ (1987) రెడ్‌ఫ్లాగ్ పబ్లికేషన్స్. పే. 46-8.*

అధ్యాన్నమగుటలపై ఆధారపడి ఎన్నికల బహిష్కరణ సమర్థించుట జరిగింది. అని వ్యాఖ్యానించారు. అంచేత ఎన్నికలలో పాల్గొనుట లేక బహిష్కరించుటను విప్లవ పరిస్థితులు బ్రద్దలుగట అనే నిర్థిష్ట పరిస్థితులపై ఆధారపడి వుంటుంది. నిర్ధిష్ట పరిస్థితులను పరిగణలోనికి తీసుకొనకుండా, ఎన్నికలను శాశ్వతంగా వ్యూహరీత్యా బహిష్కరించుట లేక ఎత్తుగడలుగా చెప్పుతూనే బహిష్కరణను శాశ్వత ఎత్తుగడగా చేయుట తప్పుమాత్రమే గాక రాజకీయ పోరాటంలో ప్రేక్షకుడుగా, నిర్వ్యాపారాన్ని, స్తబ్దతను బోధించుట అగుతుంది. బహిష్కరణ సమస్య మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పధంతో పరిష్కారాన్ని వెతుకుటకు కాదు, బహిష్కరణ దృక్పధంలో మార్క్సిజం-లెనినిజాన్ని శోధించుట అగుతుంది. బహిష్కరణ సమస్యను విప్లవకార్యాచరణకు ప్రజాస్వామ్యం సర్వసన్నాహాలతో సంసిద్ధులగుటను బట్టి నిర్ణయించబడుతుంది. విప్లవవాంఛ, కోర్కెలపైనే విప్లవ ఎత్తుగడలు ఆధారపడి వుండవని ముఖ్యంగా విప్లవకారుల వాంఛ, కోర్కెలపై అసలే మాత్రం ఆధారపడి వుండవని లెనిన్ తెలిపారు.[1]

"ఎన్నికలు వొక పోరాట రూపము. విప్లవోధ్యమ ప్రయోజనాలకే వాటిని వినియోగించాలి. మాది దీర్ఘకాల ప్రజాయుద్ధపంధా, మావ్యూహం లక్ష్యాల ప్రయోజనాలకై అన్ని పోరాట రూపాలను వినియోగిస్తాము. కొన్ని ప్రాంతాలలో బహిష్కరణ పోరాట రూపాన్ని వినియోగించు విషయమై, వుధ్యమచైతన్య స్థాయిని బట్టి నిర్ణయించుటకు ప్రజాచైతన్యం, వారి సంసిద్ధత, వుధ్యమ భవిష్యత్తు ప్రయోజనాలపై తీవ్రంగా ఆలోచించే చేస్తాము.

"ఎన్నికలలో పాల్గొనునపుడు మౌలిక లక్ష్యమైన నూతన ప్రజాస్వామ్య విప్లవ కార్యక్రమాన్ని, పంధాని ప్రచారంచేస్తూ ప్రజాపునాదిని విస్తరించే ప్రయత్నం చేస్తాము. ఎన్నికల ప్రచారాన్ని వర్గపోరాటాలు, ప్రజావుధ్యమాల వ్యాప్తికి వినియోగిస్తాము. రాజకీయవిధానాన్ని ప్రచారం చేయుటతో పాటు రైతాంగ కోర్కెలను రూపొందించి, ఎన్నికల అనంతర పోరాటాలలో సమీకరించగలందులకు విస్తార ప్రచారాన్ని సాగిస్తాము. సాధారణంగా మాబలంపై ఆదారపడే ఎన్నికలలో పాల్గొంటాము. కనీసం పోటీని సమర్థవంతంగా నిర్వహించగలందులకు తగిన రాజకీయ ప్రచారాన్ని చేయగలమా లేదా అనేదే పాల్గొనుటను నిర్ణయించే కొలమానం, పేరుకు మాత్రమే పోటీ చేయు విధానాన్ని అనుసరించము. ఎన్నికలు – అత్యంత ప్రధానమైన ఉన్నత పోరాటం రూపంగా నెంచక, వర్గపోరాట ప్రయోజనాలకు లోనైవుండాలని లెనిన్ యిలా చెప్పారు. ఎన్నికల ప్రచారోధ్యమం దానికే పరిమితమైనదిగా కాక, అందుకే ముఖ్యమైనది కాక వర్గపోరాటాల ప్రయోజనాలకు వినియోగపడు విధంగా చేబట్టుతాము.

"సాధారణంగా పాలకవర్గం యేపార్టీతోనూ ఎన్నికల సహకారము, అవి అఖిలభారతస్థాయి లేక ప్రాంతీయ పార్టీలైనా, సంస్కరణ వాదపార్టీ లైనా, మైత్రినెరపము.

---

1. *పొలిటకల్ రిజల్యూషన్స్ అడాప్టెడ్ బై ఆలిండియా పార్టీ కాంగ్రెస్, 11-16 ఏప్రిల్ 1992.* సి.పి.ఐ(యం.యల్) పబ్లికేషన్స్ పే. *42.*

నూతన ప్రజాస్వామ్య విప్లవాన్ని బలపరచేవాటితోనే ఎన్నికల సహకారము నెరపుతాము. వివిధ పాలకపార్టీల నైజాన్ని విమర్శనలతో బహిరంగపరచుతాము. చిన్నపాలకవర్గ పార్టీలను, పెద్దపాలకవర్గపార్టీలకు వ్యతిరేకంగా బలపరచాలనే వాదన, వారితోకలుగా అనుసరించుటకు దారితీస్తుంది. కారణం వాటిని ఎప్పుడూ బలపరచుట జరుగుతుంది.

"పాలక వర్గాల యేపార్టీతోగాని, గ్రూపులతోగాని అధికారంలో భాగస్వామిగా మాపార్టీ చేరదు. అవి జాతీయ, ప్రాంతీయ లేక సంస్కరణవాద పార్టీలు యేవైనా అధికారంలో భాగస్వామ్యం వహించదు. అందులో బడాబూర్జువా, బడా భూస్వామ్యపార్టీల విషయమై, వేరుగ చెప్పనవసరము లేదు."

"ఈ సాధారణ ఎన్నికల ఎత్తుగడలు, స్థానిక సంస్థల ఎన్నికలలో గూడ వీటినే అనుసరించుతుంది."

"ఐక్య కమ్యూనిస్టు ఉద్యమం బలంగా వున్న ప్రాంతాలలోనే మన వుద్యమాలుగల ప్రత్యేక ప్రాంతాలలో మనం కాంగ్రెసును గెలవగలందులకే పోటీ చేస్తున్నామని సి.పి.ఐ., సి.పి.ఐ(యం) లు ప్రచారం చేస్తూ ప్రజలను గందరగోళపరస్తున్నారు. అట్టి ప్రాంతాలలో ధైర్యంగా మాలక్ష్యాలను మేము ఎందుకు సి.పి.ఐ., సి.పి.ఐ(యం)లను బలపరచజాలమో వివరించుతాము. కాంగ్రెసును వోడించుటయే ధ్యేయమైతే యితర పార్టీలు స్వతంత్ర అభ్యర్థిని బలపరచుటకు సిద్ధమైతే మేమూ ఆ అభ్యర్థిని బలపరచుటకు సంసిద్ధులమే.[1]

## 6.8 ఎన్నికలలో పాల్గొనుటపై సి.పి.ఐ (యం.యల్), యు.సి.సి.ఆర్.ఐ (యం.యల్) ల మధ్య సైద్ధాంతిక పోరాటం

సి.పి.ఐ(యం.యల్) కేంద్రకమిటి 1977 ఏప్రిల్ 4 సమావేశంలో నూతన పరిణామాలను సమీక్షించి, "నూతన పరిస్థితి కర్తవ్యాలు"అనే తీర్మానంలో ప్రభుత్వం, సాధారణ ఎన్నికల యెడల తమ వైఖరిని స్పష్టం చేసింది.

మనదేశపు అర్థవలస, అర్థభూస్వామ్య సామాజిక, రాజకీయ ప్రతిపత్తిలో మార్పులేదని పునరుద్ఘాటించి, కార్మికవర్గ నాయకత్వాన దీర్ఘకాల ప్రజాయుద్ధం ద్వారా, జనతా ప్రజాస్వామిక విప్లవం సాధించడం, యిప్పటికే భారత ప్రజల యొక్క ప్రధమ కర్తవ్యంగానే వుంది. కానీ, ప్రజలను యీ విప్లవం కొరకు ఆయత్తం చేయాలంటే ఇందిరా ఫాసిజం వోడించడము వల్ల, జనతా దాని మిత్రులు అధికారానికి రావటంవల్ల ఏర్పడిన నూతన పరిస్థితి యొక్క నూతన లక్షణాలను పరిగణనలోనికి తీసుకొనాలి. అవి యిలా చెప్పబడినవి.

కేంద్రంలో మూడుదశాబ్దాలుగా సాపేక్షకంగా సంఘటిత, దీర్ఘకాల చరిత్రగల కాంగ్రెసు గుత్తపాలనకు స్వస్తి చెప్పబడింది. అధికారంలోనికి వచ్చిన జనతాపార్టీ, నిర్మాణరీత్యా సంఘటితంకాని "కలగూరగంప" పార్టీ దీనిలో బడాబూర్జువా, బడా భూస్వామ్య, జాతీయ

1. పొలిటకల్ రిజల్యూషన్స్ అడాప్టెడ్ బై ఆలిండియా పార్టీ కాంగ్రెస్, *11-16, ఏప్రిల్ 1992,* సి.పి.ఐ(యం.యల్) పబ్లికేషన్స్ పే.*43-44.*

బూర్జువా వర్గం, పెటీబూర్జువావర్గం, మితవాదశక్తులు కలసివున్నాయి. కాని ప్రభుత్వం, నాయకత్వం బడాబూర్జువా, బడాభూస్వామ్యవర్గాల చేతులలో వుంది. అధికారంలో వున్న జనతాపార్టీ పరస్పర వైరుధ్యాలతో, తగవులతోవుంది. ఇందిరాప్రభుత్వం, మనుగడకొరకు రాజకీయంగా, ఆర్థికంగా, ఎక్కువగా సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదంపై ఆదారపడివుంది. దక్షిణ ఆసియాలో ఆధిపత్యంకొరకు సామ్రాజ్యవాదం వేసుకొన్న పథకాలలో భారత్ భూస్వామ్యం బరువు నెత్తుకొన్నది. ఇందిరాగాంధి ప్రభుత్వంతోపాటు, సోవియట్ యూనియన్ ప్రభుత్వాన్ని నిరంకుశ గుత్తపెట్టుబడిదారుల, భూస్వాముల ప్రభుత్వం కాన అంతంచేయాలంటున్నది. ఫలితంగా దేశంలో ఆర్థికసంక్షోభం తీవ్రతరమగుతుంది. సంక్షోభభారాన్ని ప్రజలపై రుద్దుటతో ప్రజాపోరాటాల విజృంభణ ముందుకువస్తుంది. వచ్చేకాలంలో దేశంలో సంక్షోభం తీవ్రతరమై, రాజకీయ సంక్షోభానికి దారితీస్తుంది. ఎన్నికలలో ఫాశిజం, దాని నిర్బంధ చర్యలు తాత్కాలికంగా వోడించబడ్డాయి. పరిస్థితి ప్రజలకనుకూలంగా, విప్లవకారులకు అనుకూలంగా రూపొందాయి. ఈవిధమైన పరిణామాల అంచెనాలతోనే సత్యనారాయణ సింగ్ నాయకత్వంలోని సి.పి.ఐ(యం.యల్) ఎన్నికలలో పాల్గొని ప్రజలకు చేరువయ్యే అవకాశాలను వినియోగించుకొన్నది.

అయితే, యీవిధానం, సి.పి.ఐ (యం.యల్) సునిత్‌ఘోష్ (సి.ఒ.సి), మోనిగుహ (యు.సి.సి.ఆర్.ఐ) కాకస్ మజుందార్ (యూనిటిసెంటరు), కానూ సన్యాల్ ఆషించటర్జీల, ఆంధ్రలో దేవులపల్లిల తీవ్రవిమర్శలకు, ఖండనలకు గురైంది.

భారత కమ్యూనిస్టు విప్లవకారుల సమైక్యతా కేంద్రం (మా.లె.) యు.సి.సి.ఆర్.ఐ (యం.యల్) సత్యనారాయణ సింగ్, పుల్లారెడ్డి గ్రూపు రాజకీయాలు, మావో ఆలోచనా విధానపు నీడన రివిజనిజం మార్గం పట్టాయని విమర్శించారు. ఇంకా జనతా పార్టీకి తాము వ్యతిరేకులు మంటూ ప్రదర్శన చేసుకున్నారు. అయితే యిది సరిగ్గా రివిజనిస్టులు ఎన్నికల కోసం దాపరికం లేకుండా ఆడేనాటకం లాంటిదే. రాజకీయఖైదీల విడుదల విషయంలో జనతా పార్టీ విధానాన్ని విమర్శిస్తూ జూన్ అసెంబ్లీ ఎన్నికల సందర్భంలో మరొక ప్రతికాప్రకటన 22-5-1977న చేసారు. అయితే ఆ పార్టీకే జూన్ అసెంబ్లీ ఎన్నికలలో "విమర్శనాత్మక మద్దతు" నీయడానికి యీ విమర్శన అడ్డురాలేదు. చివరకు రాజహరాదల్లీ, ఫరీదాబాద్‌లలో పోరాడుతున్న కార్మికులపట్ల జనతా ప్రభుత్వవిధానం, వీరి యీ "విమర్శనాత్మక మద్దతు"ని రద్దు చేయలేదు. వారి వర్గ సంకరవిధానపు వేళ్ళు అంతలోతుగా పాదుకొని వున్నాయి. ఆచరణలో జనతా ప్రభుత్వపట్లవారి "విమర్శ" అంతా నటనగానేమి మిగిలిపోయింది. కాగా వారి మద్దతు మాత్రము వాస్తవమైనది.

"జనతాపార్టీకి విమర్శనాత్మక మద్దతు "ఉపసంహరించా" మనడం వారి యిలాంటి వ్యతిరేకతకే తాజా వుదాహరణ. అక్టోబరు ఆఖరివారంలో జరిగిన వారి పార్టీ "అఖిలభారత ప్లీనం" ఈ నిర్ణయం చేసిందంటూ తమ రాష్ట్ర కమిటీ పత్రికలో 15-12-77 తేదీన వారు ప్రకటించారు.

అయితే "నూతన పరిస్థితి మన కర్తవ్యాలు" అనే శీర్షికతో తమ గ్రూపు కేంద్రకమిటి 4-4-77న విడుదల చేసిన తీర్మానంలో ప్రస్తుత పరిస్థితిపై చేసిన విశ్లేషణ "మౌలికంగా సరైనదని, దక్షిణాది రాష్ట్రాలలో కాంగ్రెసు పార్టీని వోడించుటకు జనతాపార్టీతో ఐక్యతకు విమర్శనాత్మక మద్దతుని ఉపసంహరించడం "ప్రతిబంధకం" కాదని కూడ ఆఫీసం అభిప్రాయపడింది.

"జనతా పార్టీకి విమర్శనాత్మక మద్దతునీయడం వర్గసంకర విధానమని వారి గ్రూపు ఎక్కడా అంగీకరించలేదు. దాన్ని వుపసంహరించు కొనడం, యీ వర్గ సంకరవిధానాన్ని వదలుకొన్న దాని ఫలితమని కూడ ఎక్కడా చెప్పలేదు. దానికి బదులుగా తమకేంద్రకమిటి పూర్వపు తీర్మానంలోని అవగాహన మౌలికంగా సరైనదని చెప్పడంద్వారా మార్చి 1977 ఎన్నికల తర్వాత చేబట్టిన కొత్తతరహా రివిజనిస్టు మార్గంలోనే మరింతగా దిగజారటానికి దృఢనిశ్చయంతో వున్నట్లు మరోసారి ప్రకటించుకొన్నారు.[1]

"సత్యనారాయణసింగ్, పుల్లారెడ్డిల గ్రూపు రాజకీయాలు కొత్త తరహా రివిజనిజంగా రూపొందాయి. "ఒకవైపు మార్క్సిజం-లెనినిజం మావో ఆలోచనా విధానం పతాకాన్ని చూపుతూ అర్ధవలస, అర్ధభూస్వామ్యవ్యవస్థ, సోషలు సామ్రాజ్యవాదం, సాయుధ పోరాటం అనే విప్లవ పదజాలం వల్లిస్తూ మితవాద అవకాశవాదాన్ని అనుసరించిన యీ గ్రూపు జనతాపార్టీ అధికారంలోనికి వచ్చిన తరువాత "నూతన ఎత్తుగడలు" అనే పేరిట ఒక రివిజనిస్టు గ్రూపుగా మరింత బాహాటంగా వివిధ ప్రకటనలతో రంగంలోనికి దిగిన మొదటి వారుగా సత్యనారాయణసింగ్, పుల్లారెడ్డి గూపుకే ఆ "కీర్తి" దక్కుతుందని" సి.పి.ఐ (యం.యల్) ఆంధ్రప్రదేశ్ కమిటి తీవ్రంగా విమర్శించింది.

సి.పి.ఐ (యం.యల్) కేంద్రకమిటి, జనతా పార్టీ నాయకత్వవర్గ స్వభావాన్ని బడాబూర్జువా, బడాభూస్వామ్యనాయకత్వమని, ప్రజలకోర్కెలు తీర్చదని, సంక్షోభాన్ని ప్రజల నెత్తిపై రుద్దడానికి ప్రజాపోరాటాలను అణచివేయుటకు ప్రయత్నిస్తుందని తీర్మానం స్పష్టం చేసిందని, ఆంధ్రప్రదేశ్ కమిటి స్పష్టం చేసింది. అయితే జనతాపార్టీ నాయకత్వస్వభావాన్ని మాత్రమే చూచి, విప్లవకారులు తమ ఎత్తుగడలను నిర్ణయించుట మూర్ఖత్వమేగాక, గ్రుడ్డితనమే అగుతుంది. ప్రజలు కాంగ్రెసును వోడించారు, జనతాపార్టీ తమ వాగ్దానాలను నెరవేర్చగలదనే భ్రమలను కలిగియున్నారు. అంచేత జనతాపార్టీని వెంటనే కూలద్రోయాలనే నినాదాన్ని హర్షించేస్థితిలో ప్రజలు లేరు. అది పరిగణలోనికి తీసుకొనే జనతాపార్టీ ప్రభుత్వాన్ని వెంటనే కూలద్రోయాలనే నినాదం తప్పని స్పష్టం చేసింది.

---

*1. కొత్త తరహా రివిజనిజం వర్గసంకర విధానం (1977) ఆంధ్రప్రదేశ్ కమిటి, యు.సి.సి.ఆర్.ఐ (యం.యల్) పత్రానికి, ఆంధ్రప్రదేశ్‌కమిటి, సత్యనారాయణసింగ్, చంద్రపుల్లారెడ్డి గ్రూపు రాజకీయాలు-మావో ఆలోచనావిధాన పతాకనీడన రివిజనిజం! ఉపోద్ఘాతం పే. 1.*

## 6.9 ఎన్నికలలో పాల్గొనడం వ్యవసాయ విప్లవానికి ద్రోహం చేయడమా?

6.9.1. ఎన్నికలపై సి.పి.ఐ.(యం.యల్) తీసుకొన్న నిర్ణయం, పాల్గొనాలనేది, 1969సం॥ నుండి బహిష్కరిస్తూ వచ్చినది. అనుభవంపై ఆధారపడి ప్రస్తుత పరిస్థితులలో తప్పని నిర్ణయించింది. ఆనాడు కూడా పార్టీలోపల, బయట కొందరు వ్యక్తులు యీ నిర్ణయం తప్పని ఖండించారు. కొన్ని విప్లవగ్రూపులు ఎన్నికలలో పాల్గొనాలని తీసుకొన్న నిర్ణయం వ్యవసాయవిప్లవానికి ద్రోహం చేయుటయేనని తమపై దాడి చేస్తున్నారని స్పష్టం చేయబడింది. పార్టీలో సమగ్ర చర్చలకు ఒక సమగ్ర తీర్మానం విడుదల చేసింది. ఈ లోపల అసెంబ్లీ ఎన్నికలు ముందుగా రావడంవలన యీ ఎన్నికలలో పాల్గొనాలని కేంద్రకమిటి నిర్ణయించింది.

"చారుమజుందారు ప్రజాస్వామిక విప్లవం పూర్తి అయ్యేవరకు ఎన్నికలు బహిష్కరించాలని ప్రతిపాదించినపుడు, ఆనాటి ఆంధ్ర రాష్ట్రకమిటి తీవ్రంగా వ్యతిరేకించింది. అప్పుడు ఆకమిటిలో డి.వి., నాగిరెడ్డి, కొల్లావెంకయ్య, చంద్రపుల్లారెడ్డిలు వున్నారు. చారుమజుందార్ వైఖరిని ఖండిస్తూ పుల్లారెడ్డి ఒక వ్యాసాన్ని బహిరంగంగా ప్రకటించారు. ప్రజలకు ఎన్నికలపై భ్రమలున్నంతవరకు ఎన్నికల్లో పాల్గొనడం తప్పదని, అది లెనినిస్టు సూత్రమని వివరించారు. ఆనాడు ఆవ్యాసం అప్రస్తుతమని డి.వి. విమర్శించారు. ఈ విమర్శలకు పుల్లారెడ్డి కూడా వెనుకకు తగ్గుట అందరకూ తెలిసినదే. అయినా యీ విషయమై ఆంధ్రాకమిటి విభేదించింది.

ఈసమస్యపై సుముఖ, అసుముఖాల రెండింటి లక్ష్యం విప్లవోద్యమాన్ని ముందుకు తీసుకొపోవడమే. భారతదేశంలోని నిర్దిష్ట పరిస్థితులపై ఆధారపడకుండా కేవలం స్వీయాత్మక ఆలోచనపై ఆధారపడి మాత్రమే మా పార్టీ ఎన్నికలను బహిష్కరించిందని అది తప్పని మా పార్టీ స్పష్టపరచింది.

సి.పి.ఐ., సి.పి.ఐ(యం)లు యిద్దరూ మాటలలో యేమి చెప్పినా, ఆచరణలో వారి కార్యక్రమాలన్నీ ఎన్నికల లక్ష్యాలకు పరిమితమై ఉంది. పార్లమెంటులో ప్రాథమికమార్పులను ఎన్నికల ద్వారా తీసుకొని రాగలమని విశ్వసించుతున్నారు. ప్రజలకు విశ్వాసం ఉన్నంతకాలం అందుకు అవకాశం వున్నంతకాలం పార్లమెంటు, అసెంబ్లీవేదికలను ప్రజాకోర్కెలను ప్రతిబింబించడానికి ఆవిధంగా ప్రజావుద్యమాలను ముందుకు తీసుకుపోవటానికి వుపయోగించడం మా పార్టీ లక్ష్యం. ప్రజావుద్యమాల స్థాయి, ప్రజల చైతన్య స్థాయిని దృష్టిలో ఉంచుకోకుండా అన్ని ప్రాంతాల ఎన్నికలలో బహిష్కరణవర్తింపజేయుటం ఎంత అర్థరహితమైనదో స్పష్టమగుతుంది.

సి.పి.ఐ (యం.యల్)ను విమర్శించుతున్నవారే కాను సన్యాలు ప్రబుద్ధులు ఎన్నికలలో పాల్గొనాలని ప్రకటించినవారే, మా నిర్ణయంపై వీరి విమర్శ ఎంత అర్థరహితమైందో స్పష్టము.

"మా పార్టీ అసెంబ్లీ ఎన్నికల్లో యీ క్రింది లక్ష్యాలతో పాల్గొంటుంది. "ఫాసిజానికి ప్రాతినిధ్యం వహిస్తున్న కాంగ్రెసు, దాని మిత్రులు రివిజనిస్టులను వోడించుట. పార్టీ కార్యక్రమాన్ని పంధాను విస్తృతంగా ప్రజలలోనికి తీసుకొనిపోవుట, పౌరహక్కుల సమస్యలపై బలమైన ప్రజావుద్యమాన్ని నిర్మించుట, ప్రజల తరపున గట్టిగా నిలబడి పోరాడుటకు పార్టీ ప్రతినిధులను గెలిపించుట, కాంగ్రెసు, రివిజనిస్టుల నెదిరించుతున్న జనతా, సి.పి.యం., అకాలీదళ్ మొదలైన పార్టీలను గెలిపించుటకు ఎస్.ఎన్.సింగ్ నాయకత్వంలోని సి.పి.యం(యం.యల్) ఆంధ్రప్రదేశ్ కమిటి, కేంద్రప్రకటనలను విడుదలచేస్తూ "ముందుమాట"లో వివరించింది. "మా పార్టీ జనతా ప్రభుత్వానికి రాజకీయంగా లొంగిపోయిందని, ఎన్నికలలో మా పార్టీ పాల్గొనటమంటే వ్యవసాయ విప్లవానికి ద్రోహంచేయటమేనని, ప్రభుత్వంతో విప్లవకారుల విడుదల కొరకు చర్చలు సాగించుట తప్పని, మా పార్టీ సభ్యులు ప్రభుత్వానికి హామీ పత్రాలు యిచ్చి బయటకు వస్తున్నారని, వీరు చేస్తున్ననిందల్లో ముఖ్యమైనవి. అంతే గాక, సునీతీఘోష్ (సి.ఓ.సి) మోని గుహ (యు.సి.సి.ఆర్.ఐ), కాకస్ మజుందార్ (యూనిటి సెంటర్), కానూ సన్యాల్, ఆషించటర్జీలు, ఆంధ్రలో డి. వెంకటేశ్వరరావు గ్రూపు వారు" మా పార్టీపై వరుసగా ప్రకటనలు చేస్తున్నారు, కరపత్రాలు వేస్తున్నారని వివరించారు. మాపార్టీ నాలుగు ప్రకటనలు మొత్తంగా గత మార్చి పార్లమెంటు ఎన్నికలతో దేశంలో యేర్పడిన నూతన పరిస్థితులు మా పార్టీ ప్రస్తుత పరిస్థితులలో మావైఖరి స్పష్టమగుతుంది. ఈ విధంగా ఎన్నికలలో సి.పి.ఐ (యం.యల్) పాల్గొనుటను వివరించింది.

## 6.10 యు.సి.సి.ఆర్.ఐ (యం.యల్) ఎన్నికల వైఖరి

ప్రారంభం నుండి ఎన్నికల సమస్యపై విప్లవకారులలో మౌలికమైన చీలికవుంది. కొంతమందికి అది వ్యూహానికి సంబంధించిన సమస్య కాగా, కొందరు ఎత్తుగడల సమస్యగానే చూస్తున్నారు.

"మన వైఖరులను 1971-80లలో వివిధ సందర్భాలలో రూపొందించుకొన్నాము. ఈవైఖరులను పాల్గొనకపోవడం", "కొత్తరకంగా పాల్గొనడం" అని పిలచాము.

"మార్చి 1977 రాజకీయతీర్మానం ఎన్నికలను చట్టబద్ధ పోరాటం రూపంగా చెప్పింది. ఎన్నికలను పోరాట రూపంగా వినియోగించే నిర్ణయానికి ప్రజల చైతన్యం, ప్రజాతంత్ర ఉద్యమాల ఉన్నత స్థాయిని ముందు షరతుగా విధించింది.

"ఆంధ్రప్రదేశ్ శాసనసభకు ఎన్నికలు జరుగనున్న సందర్భంలో" గతంలోని మనం పాల్గొన్న వైఖరులలో ఎలాంటి మార్పులేదు. మన శ్రేయోభిలాషులు పోటీ చేస్తున్నచోట కూడ అలాంటి అభ్యర్థులను మనం బహిరంగంగా విమర్శించినప్పటికి, మన నిర్మాణం ఏ రూపంలోనూ కల్పించుకోదు" అని సి.సి. నిర్ణయించింది.

"ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కమిటి కామ్రేడ్స్ పాల్గొనబోమన్న వైఖరినవ్యతను అంగీకరించలేకపోయారు. ఈవైఖరి ప్రజలకు మార్గదర్శికత్వం అందించకపోగా ఎన్నికలపై మన మౌలిక అవగాహనను, ఎన్నికలను ఎత్తుగడల సమస్యగా చూచుటను సరిగా

అన్వయించలేదని వారు స్పష్టంగా అభిప్రాయపడుతున్నారు.

"ఆంధ్రప్రదేశ్‌లో పంచాయితీ ఎన్నికల సందర్భంలో 1978-79లలో రాష్ట్ర కమిటి 1945-51 అనుభవాల ప్రాతిపదికగా ఎన్నికల సమస్యను చర్చించింది. ఈ సమావేశంలో దేవులపల్లి చర్చల అనుభవాలను సమీక్షించుటలో విఫలమయ్యారు. ఈ చర్చల క్రమంలో దేవులపల్లి అభిప్రాయాలు మారాయి. సి.సి తీర్మానానికి మినహాయింపుగా, రాష్ట్రకమిటి నిర్దిష్టపరిస్థితులకు అన్వయిస్తూ స్వంతవైఖరి తీసుకొనమని దేవులపల్లి సలహాయిచ్చారు. రాష్ట్ర కమిటి నిర్దిష్ట సూచనలు అందించే పని సి.సి.దేనని స్పష్టం చేసింది. సమావేశానికి హాజరయిన సి.సి. సభ్యులు చర్చించుకొని విప్లవోద్యమ ప్రయోజనాలకొరకు ఒక లీగలు పోరాట రూపంగా ఎన్నికలను ఉపయోగించుకొనవచ్చని నిర్ణయించారు. అంటే 1977 మార్చి సి.సి రాజకీయతీర్మానంలో తీసుకొన్న వైఖరిని వారు మార్చారు.

పార్లమెంటు 1980 ఎన్నికల సందర్భంలో ఆనాటి కేంద్ర పత్రిక ప్రోలిటేరియన్ లైన్ జనవరి 1980సంచిక సంపాదకీయంలో "పాల్గొనటం లేదా బహిష్కరించుటలను ఒకపోరాట రూపంగా మనం పరిగణించుతున్నాము. బహిష్కరణ యీనాటి నినాదంగా వుండజాలదని భావిస్తున్నాం." సంపాదికీయం తీసుకొన్న వైఖరి సి.సి వైఖరికి భిన్నమైనది. ఎన్నికల బహిష్కరణ అనుకూలురను, ఎన్నికలలో పాల్గొనుటకు అనుకూలురనూ యిద్దరినీ యేదో వొకమేరకు సంతృప్తి పరచే ప్రయత్నమది. ఈవైరుధ్యపూరిత సూచనలతో, నిలకడలేమితో గందరగోళానికి దారి తీసింది. ఈ సమీక్ష "తీవ్రనిర్బంధం" వలన ఎన్నికల బహిష్కరణ నినాదమిచ్చామని (1971) మరొక సమయంలో "పూర్తిగా ఉపయుక్తత భూమికగా" పాల్గొన బోమన్న వైఖరి (1977) తీసుకున్నామని, ఇంకొక సమయంలో "విధానంలో మార్పుగా" వున్న "కొత్త రకంగా పాల్గొనమన్న వైఖరిని తీసుకొన్నామని" చెప్పారు. ఈ నిర్ణయాలు నిలకడగా, వస్తుగతంగా లేవు, స్వీయాత్మక ఆలోచనలను ప్రతిబింబిస్తున్నాయి.[1]

ఇదే సమస్యపై 1982 ఏప్రిల్‌లో సి.సి., "ఎన్నికలు ఎత్తుగడలకు సంబంధించిన సమస్య అనీ, అనేక లీగల్ పోరాటరూపాలలో ఒకటని నిర్దుందంగా"వొక తీర్మానంలో చెప్పింది. రాజకీయ ప్రచారానికి, సాధారణ కార్యకలాపాలకు పరిమితంకావడాన్ని "పాల్గొనక పోవడంగా" భావించటానికి దీనిలో కొంత అవకాశముంది. కేంద్రకమిటి దీన్ని పరిగణలోనికి తీసుకొని, 1984 రాజకీయ తీర్మానంలో దీనిని సరిచేసి, ఎన్నికలపట్ల యు.సి.సి.ఆర్.ఐ (యం.యల్) వైఖరిని మరింత వివరించింది. అంతేగాక యీమధ్యకాలంలో "కాంగ్రెసు (ఐ) ని వోడించండి" అన్న నినాదంతో ఆంధ్ర అసెంబ్లీ ఎన్నికలలో పాల్గొనుట సరైనదని 1984 రాజకీయ తీర్మానం బలపరచింది. తిరిగి 1984 పార్లమెంటు ఎన్నికలలో అదే నినాదంతో పాల్గొన్నాము. అదే విషయాన్ని బలపరుస్తూ "ముక్తిగామి"లో వ్యాసాలు ప్రచురించబడినవి.

---

*1. భారత విప్లవోద్యమం (1989) గుణపాఠాలు, అనుభవాలు యు.సి.సి.ఆర్.ఐ(యం.యల్) కాన్ఫరెన్సు ఏప్రిల్ 1989లో ఆమోదించిన సమీక్ష పే.303-5.*

ఎన్నికలలో యు.సి.సి.ఆర్.ఐ అవలంబించు వైఖరులను యిలా నిర్ధారించుకొన్నది.

1) "బూర్జువా ప్రజాస్వామ్యాన్ని అవసరమైన సామాజిక పునాది మన పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి లేదన్నది వాస్తవం. అది ఉనికికి వచ్చిన తీరు, దాని యంత్రాగం దోపిడి పాలకవర్గాల నిరంకుశ చర్యలకు లోబడే తీరు, దానిని మరింత బలహీనపరచాయి. కాన, యిది "నిజమైన" బూర్జువా ప్రజాస్వామ్యాన్ని ప్రతిబింబించుచున్నదని, సామాజిక మార్పుకు సాధనమగుతుందనే వాదనలను నిర్ద్వందంగా ఖండించాలి. దోపిడీ వ్యవస్థలోని ఎంతమంచి ప్రజాస్వామ్యమైనా పీడిత ప్రజానీకం చేతులలో సామాజిక మార్పుకు సాధనం కాజాలదనే అవగాహన స్పష్టంగా వుండాలి. దేశంలో ప్రజాస్వామ్య "అస్థిపంజరం వుంది. నిరంకుశపాలనకు ముసుగావుండి, ప్రజలచైతన్యాన్ని పోరాటాలను చట్టపరిమితులలో వుంచటానికి పాలకవర్గాలకు ఆయుధంగా ఉపయోగపడుతున్నది.

ఎన్నికల సమస్యపై మౌలికంగా సరియైన సిద్ధాంతవైఖరి చేబట్టాం. కాని, నిర్దిష్టంగా అన్వయించి ఆచరించుటలో ఒంటెత్తు పోకడలూ, గందగోళమూ, అస్పష్టత చోటు చేసుకొన్నాయి. ఐక్యతా సదస్సు ఆమోదించిన పత్రాలలో ఒంటెత్తు పోకడల పునాదులను చూడగలము. ఆ 1975 ముసాయిదాపందా "మన పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని సమర్థించే వారెవరైనా సామ్రాజ్యవాదులు, వారి తొత్తులైన పాలక వర్గాల చేతులలో పనిముట్లు అవుతారని" ప్రకటించింది. కేంద్రకమిటి 1977లో మెరుగుపరచిన పంధా, కార్యక్రమం ముసాయిదాలు 1975 ముసాయిదాలోని ప్రతి సూత్రీకరణను తొలగించాయి. అయినప్పటికి, ఒంటెత్తు ధోరణులనుండి అవి పూర్తిగా బయటపడలేదు.

2) "ఎన్నికల ఎత్తుగడల సమస్యలపై దేవులపల్లి నిలకడగా వున్నారు. కాని దీనిని నిర్దిష్టంగా అన్వయించి, ఆచరించుటకు చేసే ప్రయత్నాలు నిర్మాణంలో పార్లమెంటరీ భ్రమలను సృష్టిస్తాయనే భయ, సందేహాలతో ఆయన వున్నారు. అంచేతనే "ఎన్నికలు అవసరమైన పోరాట రూపాలలో భాగం కాజాలవన్న" సూత్రీకరణను ఆయన రూపొందించారు. రాష్ట్ర కమిటీతో చర్చల క్రమంలో అభిప్రాయాలను మార్చుకొని, ఎన్నికలను పోరాట రూపంగా అన్వయించుకొనేవైపుగా ఆయన ఆలోచించారు. కాని తనగత అభిప్రాయాలు తప్పని అంగీకరించుటకు సిద్దపడలేదు. తప్పులను యితరులపై నెట్టుటకు, సమర్థించుకొనుటకు ప్రయత్నించారు.

3) "ఎన్నికల సమస్యపై తప్పుడు వొంటెత్తు పోకడలకు యేవొక్కరిని నిందించరాదు. కేంద్రకమిటి 1977-80 ఎన్నికలలో స్పష్టమైన, సరియైన సూచనలు యిచ్చుటలో విఫలమైంది. ఈ సమస్య సైద్ధాంతిక, రాజకీయ, ఆచరణాంశాలపై సి.సి అధ్యయనాన్ని ప్రారంభించలేకపోయింది. గత అనుభవాలు, సి.సి. సూచనల అమలులో అనుభవాలపై ఆంధ్రప్రదేశ్ కమిటిలో జరిగిన చర్చలను, యీ సమస్యపై సరైన అవగాహనాభివృద్ధికి

వినియోగించలేకపోయింది.[1] ఎన్నికల ఎత్తుగడలను నిర్ధిష్టంగా అన్వయించి, ఆచరించే అనుభవాన్ని పొందలేకపోయాము. విప్లవకారులలో వున్న అతివాద, అవకాశవాద, సెక్టేరియన్ అవగాహనలనుండి బయటపడి, స్పష్టతచే కూర్చలేకపోయింది. వివిధ పెదధోరణులపై సైద్ధాంతిక పోరాటం సాగించి, ఎన్నికలపై మన పరిస్థితుల కనుగణమైన ఎత్తుగడలను, ఆచరణ విధానాలను రూపొందించుటలో నాయకత్వం విఫలమైంది.

## 6.11 పాలకవర్గపార్టీలు, సి.పి.ఐ., సి.పి.ఐ(యం)లపై విప్లవకారులవైఖరి.

భారతదేశంలో జాతీయకాంగ్రెసు పార్లమెంటరీ ప్రజాస్వామ్య ముసుగులో అన్ని ప్రజాపోరాటాలను క్రూరంగా అణచివేయు విధానాన్ని అనుసరించింది. జనతాపార్టీ 1977లో కాంగ్రెసుకు ప్రత్యామ్నాయ మరోబూర్జువా పాలకవర్గపార్టీగా అశేష ప్రజాసామాన్యాన్ని తప్పుదారి పట్టించి, మోసపూరిత ప్రజాస్వామ్య "ముసుగు" నినాదాలతో ప్రజాపోరాటాలను దారుణంగా అణచివేసింది. మౌలికాంశాలలో ఎట్టి మార్పులు చేయుటకు యేప్రయత్నము చేయలేదు. సి.పి.ఐ.,సి.పి.ఐ(యం)లు కొన్ని రాష్ట్రాలలో అధికారంలోనికి వచ్చినా, అధికారాల కేంద్రీకరణ కేంద్రప్రభుత్వం క్రింద జరిగి యున్నందున రాష్ట్రాలలో మౌలికమార్పులు లక్ష్యంగా, యెట్టి చట్టాలను తీసుకొని రాజాలకపోయారు.

బడాబూర్జువా, భూస్వామ్యవర్గాల వ్యతిరేక జాతీయ లేక ప్రాంతీయపార్టీలు అనేక రాష్ట్రాలలో "సంస్కరణవాద" "నియోసంస్కరణవాద సి.పి.ఐ.,సి.పి.ఐ(యం)లు త్రిపుర, పశ్చిమబెంగాల్, కేరళలలో కొంతకాలంగా వుంటూ వచ్చాయి. ఆచరణలో యీ ప్రభుత్వాలు కూడా బడాబూర్జువా, భూస్వామ్య ప్రభుత్వాల వలెనె అర్ధవలస, అర్థభూస్వామ్య వ్యవస్థలో ఎట్టి మౌలిక మార్పులు తీసుకొని రాజాలకపోయాయి. కారణం, అధికారాలన్నీ కేంద్ర ప్రభుత్వంలోనే కేంద్రీకరించబడి వున్నాయి. "సంస్కరణవాదుల", "నియోసంస్కరణ వాదుల" పాలకవర్గాల, ప్రభుత్వాల "మేజువాణి" పార్లమెంటరీ వ్యతిరేకతను "ఎండగట్టి" వ్యవసాయ విప్లవ పోరాటాలకు ప్రజాసమీకరణ చేయాలి. ఎన్నికలలో ప్రభుత్వ వ్యతిరేక ప్రతిపక్షపాలక బూర్జువాపార్టీలతో, సి.పి.ఐ., సి.పి.ఐ(యం)లతో మిత్రకూటములుగా యేర్పడి పాల్గొనుటపై విప్లవపార్టీల మౌలిక దృక్పధాన్ని నీరు గార్చుతుంది. కాంగ్రెసు వ్యతిరేక ప్రతిపక్ష బూర్జువాపార్టీలు గాని, సంస్కరణవాద, నియోసంస్కరణవాద" కమ్యూనిస్టుపార్టీల లేక వారి నాయకత్వంలోని లేక వారి నాయకత్వంలోని సంఘటనల ప్రభుత్వాలు గాని కష్టకాలంలో బూర్జువావర్గ ప్రయోజనాలను కాపాడే "మధ్యంతర తాత్కాలిక ప్రభుత్వాలు"గాని వ్యవసాయ విప్లవాన్ని గాని, మౌలికమార్పులను గాని తీసుకొని రాజాలవు అనే అవగాహన విప్లవ కమ్యూనిస్టులలో ప్రబలంగా వుంది.

ఎన్నికలలో బూర్జువాపక్ష పార్టీలతోగాని, సి.పి.ఐ.,సి.పి.ఐ(యం)లతోగాని "మిత్రకూటము"గా యేర్పడుటకు గాని సీట్లు సర్దుబాటులుగాని, "ఫాశిజాన్ని

1. *భారత విప్లవోద్యమం (1989) గుణపాఠాలు, అనుభవాలు యు.సి.సి.ఆర్.ఐ(యం.యల్) కాన్ఫరెన్సు ఏప్రిల్ 1989లో ఆమోదించిన సమీక్ష పే. 261–3.*

వోడించుటకు," "ఫాశిజాన్ని అధికారంలోనికి రాకుండా చేయుటకు", "నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పోరాడుటకు", "పాలకవర్గ గుత్త అధికారం బ్రద్దలు చేయుటకు" అనే మిష లేక కారణాలు చూపెడుతూ కొన్ని సీట్లకో లేక అధికారంలో భాగస్వామ్యం కొరుకోలేక శాశ్వతంగా పాలకవర్గాలతో సత్సంబంధాలను బలపరచుకొనుట ఆచరణలో ఇటీవల కాలంలో చూశాము. విప్లవకారులు ప్రతిపక్ష బూర్జువాపార్టీలతోనో, సి.పి.ఐ.,సి.పి.ఐ(యం) లతోనో సీట్లు సర్దుబాటులు లేక ఎన్నికల మిత్రకూటములను యేర్పరచుకొని, కొన్ని సీట్లు సంపాదించుకొనుటకు ప్రయత్నించరు. ఆవిధంగా యేర్పడిన పాలక వర్గ బూర్జువా, లేక బూర్జువా పార్టీల సంకీర్ణ ప్రభుత్వాలు యేర్పడి ప్రజాధనాన్ని, ఖజనాన్ని వివిధ రూపాలలో దోచివేయుట, మరోవైపు ప్రజలను, ప్రజోద్యమాలను ప్రభుత్వపోలీసు, హింసా, దౌర్జన్యాలతో నిర్దాక్ష్యణ్యంగా అణచివేయుటకు వారిని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో బలపరచిన కమ్యూనిస్టు శ్రేణులు తమవంతు భాధ్యత వహించవలసివుంటుంది.

ఈవిధంగా ఎన్నికలలో సీట్లు సర్దుబాటులు, మిత్రకూటములు ఎన్నికలలో తిరిగి తిరిగి యేర్పరచుకొంటూ దశాబ్దాల కొలదిసాగుట అంటే అర్థం సి.పి.ఐ గాని సి.పి.ఐ(యం)గాని పేరుకు మాత్రం పాలక బూర్జువావర్గ పార్టీల, ప్రభుత్వాలతో చట్టబద్ధ ఆర్థిక పోరాటాలు, సత్యాగ్రహాలు, నిరాహారదీక్షలు, మౌనయాత్రలు, ప్రదర్శనలు, అప్పుడప్పుడు బందులు, కొన్ని గంటలపాటు రాస్తారోఖోలు జరువుతూ బూర్జువాపాలకపార్టీ, బూర్జువాప్రతిపక్షపార్టీలతో వామపక్షాలు ఎన్నికలలోయేర్పరచుకొన్న "సత్యంబంధాలు" దశాబ్దాలు కొనసాగుటతో తమతమ పార్టీల నాయకత్వాలలోని ప్రజాసంఘాలలోని కార్మిక, కర్షక, మధ్యతరగతి ప్రజాసామాన్యం తమ్ము విడనాడి ఇందిరా కాంగ్రెసును అనుసరించుట, తాము తమ వర్గాలనుండి వేరగుటను యిటీవలి రాజకీయ చరిత్ర రుజువు చేసిన వాస్తవము.

కమ్యూనిస్టు విప్లవకారులు ముఖ్యంగా వివిధ యం.యల్ గ్రూపులు పాలక కాంగ్రెసు లేక మరోపాలక బూర్జువాపార్టీ యెడల అవలంభించే వైఖరికి, అదే కాలంలో సి.పి.ఐ.,సి.పి.ఐ(యం)ల యెడల ముఖ్యంగా ఎన్నికలలో అవలంభించే వైఖరులు వొకేవిధంగా వుండుట ఎంతవరకు శాస్త్రీయ సోషలిజానానికి ఆమోదయోగ్యమగుతుంది. పరోక్ష ఎన్నికలలో సి.పి.ఐ.ని, సి.పి.ఐ(యం)ని బూర్జువా పాలక, ప్రతిపక్షపార్టీల కంటె తక్కువ ప్రమాదకర పార్టీలుగానెంచి, బలపరచి, గెలిపించుట, యేవిధంగా అశాస్త్రీయమగుతుంది. ఇట్టి ప్రశ్నలు కమ్యూనిస్టు శ్రేణులలో ఉదయించకమానవు. అది జరుగనిచో కాంగ్రెసు లేక మరో బూర్జువాపార్టీ విజయానికి విప్లవకమ్యూనిస్టులు నిందలకు గురికాకుండా వుండగలరా? గతంలో కమ్యూనిస్టు ఉద్యమం బలమైన ప్రాంతాలలో సామాన్య ప్రజానీకం కమ్యూనిస్టు శ్రేణులలోగల రాజకీయ సైద్ధాంతిక భావజాలంలోగల భేదాలు ముఖ్యంగా సి.పి.ఐ.,సి.పి.ఐ(యం)లు వొకవైపున సి.పి.ఐ(యం.యల్) వివిధ గ్రూపులు మరోవైపున గల స్థితిని విచక్షణతో పరిశీలించగల చైతన్యస్థాయికి ఎదుగనపుడు పరోక్ష ఎన్నికలలో బలపరచవద్దా? ఈ మౌలిక ప్రశ్నలు వివిధ కమ్యూనిస్టుశ్రేణుల ముందున్నవి.

ఇంతకుముందు చెప్పినట్లు సి.పి.ఐ (యం.యల్) రాజకీయతీర్మానం స్పష్టంగా సి.పి.ఐ., సి.పి.ఐ(యం) లను వర్గ శత్రువులకన్న యెక్కువ ప్రమాదకారులుగా నిర్ణయించింది. అంచేతనే, ఎన్నికల మిత్రులగుట, లేక సీట్ల సర్దుబాటులు, బలపరచుటయే ప్రత్యక్ష, పరోక్ష ఎన్నికలలో గాని, స్థానిక ఎన్నికలలోగాని జరుగదు. ఆవిధమైన చర్య పార్టీ రాజకీయపందాకు భిన్నమైనది. అంతర్జాతీయ రాజకీయ అవగాహనలోని బిన్నత్వాలు దేశ రాజకీయాలు, స్థానిక ఎన్నికలలో గూడ నిర్ణయాత్మక పాత్రవహించుట అనేక వక్రీకరణలకు కారణ భూతమగుట విచారకరము.

ఈవిధమైన అశాస్త్రీయదృక్పథం, అవగాహన పెడమార్గానికి దారితీయుట, యీ క్రింది విషయం విశదం చేయగలదు. సి.పి.ఐ(యం.యల్) లోని రెడ్‌ఫ్లాగ్, పీపిల్సువార్ శ్రేణులకు చెందిన కమ్యూనిస్టు విప్లవకారుల అవగాహనలు చూద్దాము. కమ్యూనిస్టు విప్లవకారులు సి.పి.ఐ (యం.యల్)గా రూపొందక ముందు అంటె అఖిలభారత కోఆర్డినేషన్‌కమిటి ఆప్ కమ్యూనిస్టు రివల్యూషనరీస్‌గా వున్నప్పుడు మే 14, 1968న ఆమోదించిన "ఎన్నికలపై తీర్మానం"లో వారి అవగాహనలు స్పష్టం చేయబడినవి. మనం "ఎన్నికలు నశించాల"నే పిలుపునిచ్చాము. "ఎన్నికలు బహిష్కరించాల"ని విప్లవ ప్రజాసామాన్యానికి, విప్లవకారులందరికి పిలుపునిచ్చాం. అభివృద్ధి నిరోధకులు, వారి యేజంట్లు, సంస్కరణవాద సి.పి.ఐ., నియోసంస్కరణవాద, సి.పి.ఐ(యం)లు, విప్లవ ప్రతీఘాతకుల కుట్రలు, దుశ్చర్యలపై నినాదమిచ్చి భగ్నం చేయుట జరిగింది. అదే కాలంలో "ఎన్నికలు బహిష్కరించండి" అనే భిన్న నినాదం యిచ్చినా పురోగమనంలేదు. కర్తవ్యాలను రూపొందించివుండవలసింది. "ఎన్నికల బహిష్కరణోద్యమంతోపాటు, ఛైర్మెన్ మావోజండా క్రింద ప్రజలను సమీకరించి, నిర్మాణంలోనికి తీసుకొని రావాలని సూచించబడింది. నక్సలైట్ల నమూనా ఉద్యమాలు నిర్మించాలి, అటువంటి వుద్యమాలే మనం జనతా ప్రజాస్వామ్య విప్లవం వైపు పురోగమించుటకు ఉపయోగపడతవి"[1] అనే వివరణ యిచ్చారు. మూడుదశాబ్దాల "ఎన్నికల బహిష్కరణ" నినాదపు అనుభవాల తరువాత గూడ యీనాటికీ "పీపిల్స్‌వార్ శ్రేణులు అదే నినాదాన్ని, ఆచరణ కొనసాగిస్తున్నవి.

"గతంలో సమిష్టి ఉద్యమాల ఫలితంగా కమ్యూనిస్టుల బలమైన ప్రాంతాలలో ప్రజలు సి.పి.ఐ (యం.యల్)ను, సి.పి.ఐని సి.పి.ఐ(యం)లను వేరువేరుగ చూచుటలేదు. మనం పాలక కాంగ్రెసు, సి.పి.ఐ., సి.పి.ఐ(యం)ల మధ్య గెలుపు వోటములకు నిర్ణయాత్మకశక్తి అయినపుడు ఎన్నికల మిత్రకూటమి గాక సీట్ల సర్దుబాట్లు లేకుండా ప్రత్యక్ష, పరోక్ష మద్దతు నివ్వరాదు. కాని చాల జాగరూకత వహించాలి. మనం సమిష్టి ఆమోదం పొందిన అభ్యర్థిని కాంగ్రెసుని వోడించుటకు సి.పి.ఐ.,సి.పి.ఐ(యం)ల విధానాలను వ్యతిరేకించుతున్నా బలపరస్తామని ప్రకటించాలి, ప్రజల వద్దకు వెళ్ళి అదే చెప్పాలి. సి.పి.ఐ., సి.పి.ఐ(యం) లు వారి కాంగ్రెసు వ్యతిరేకతను రుజువు చేసుకొనుటకు స్వతంత్ర

---

1. నక్సల్బరీ అండ్ ఆఫ్టర్. వా. 2, డిబేట్సు అండ్ డాక్యుమెంట్సు పే. 203.

అభ్యర్థిని బలపరచాలి లేదా వారి మోస పూరిత కాంగ్రెసు వ్యతిరేకత బూటకమని ప్రజలకు విశదమౌతుందని చంద్ర పుల్లారెడ్డి అభిప్రాయం.

సి.పి.ఐ (యం.యల్) 1978లో సి.పి.ఐ(యం)ను ఎన్నికలలో బలపరచుట, అప్పుడే కౌన్సిలు ఎన్నికలలో జనతాపార్టీని బలపరచుట మితవాద పెడమార్గంలో ఆమోదించిన "నూతన పరిస్థితి మన కర్తవ్యాలు" అన్ని తీర్మాన ప్రభావంలో జరిగిన పొరపాటుగా వివరించింది.

ముగింపుగా, సి.పి.ఐ., సి.పి.ఐ(యం)లు అనుసరించిన పార్లమెంటరీ విధానాల నుండి నేర్చుకొనవలసిన గుణపాఠాలను సి.పి.ఐ (యం.యల్) యిలా వివరించింది.[1]

ఎవరైనా వర్గపోరాటాన్ని, ప్రతిఘటనా పోరాటాన్ని వదలివేసినవారు తప్పనిసరిగా చివరకు చేబట్టేది, వారికి యిష్టమున్నా లేకపోయినా పార్లమెంటరీ పంథానే అనుసరించుతారు, మరో ప్రత్యామ్నాయం లేదు.

బూర్జువాలతో ఎన్నికల మిత్రత్వాల విధానాలు, అవియే ముసుగు మాటలలోనైనా తప్పనిసరిగా వర్గాల పొత్తు విధానానికి దారితీస్తుంది. చివరకు ప్రతిఘటన పోరాటాన్ని బలహీనపరచి నాశనం చేస్తుంది.

ఐక్యకమ్యూనిస్టుపార్టీ 1952లో తన బలంపైనే పూర్తిగా ఆధారపడి ఎన్నికలలో పాల్గొన్నది. ఎన్నికలలో యీ విజయాలపై ఆధారపడి పార్టీ నాయకత్వం, ఎన్నికలలో విజయాలద్వారా అధికారాన్ని స్వాధీనం చేసుకొనవచ్చని ప్రచారం చేయసాగింది. దీనితో మెట్టుమెట్టుగా వర్గపోరాటాన్ని విడనాడుటయేగాక, పాలకవర్గాల పార్టీలతో ఎన్నికల మిత్రకూటముల ఒప్పందాలకు కూడా దిగజారిపోయింది. కమ్యూనిస్టు విప్లవకారుల నిర్మాణాలు సి.పి.ఐ., సి.పి.ఐ(యం)ల పార్లమెంటరీ చరిత్ర నుండి సరియైనగుణపాఠాలు నేర్చుకోవాలి.[2]

# VII

## సారాంశము

**7.1** పార్లమెంటరీ పోరాటాల 1980 మధ్యంతర ఎన్నికల పూర్వ అనుభవాలను యిలా చెప్పుకొన వచ్చును. వామపక్ష ప్రజాస్వామ్యం జాతీయ నూతన ప్రత్యామ్నాయం, సమీప భవిష్యత్‌లో ఏర్పడు పరిస్థితులు లేవు. అంచేతనే అన్నివిధాల వామపక్ష శక్తుల సంఖ్యాబలాన్ని నూతన పార్లమెంటులో పెంచుట అత్యవసరం. ఈ ప్రధాన లక్ష్యంకై చేపట్టే కార్యక్రమం, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యకార్యాచరణ, ఐక్యసంఘటనల నిర్మాణానికి

---

1. *సెలెక్టడ్ రైటింగ్స్ ఆఫ్ కా॥చంద్రపుల్లారెడ్డి (1987) సి.పి.ఐ.(యం.యల్) సి.సి. ప్రచురణ. పే. 150.*
2. *" -- అదే -- పే. 164.*

తోడ్పడునదిగా వుండాలి కాని, పరోక్షంగానైనా విచ్ఛిన్నకారి కారాదు.

కమ్యూనిస్టు పార్టీ, రెండు ప్రధానాంశాలపై ప్రత్యేక శ్రద్ధవహించాలి. ఒకటి దేశం వామపక్ష విధానాలవైపు మొగ్గుటకు, పెట్టుబడిదారీ అభివృద్ధి పంథా విడనాడి, సోషలిజం వైపుకు పురోగమించుటకు ఆ అభివృద్ధి పంథా తోడ్పడేది. అందుకుగాను, పెట్టుబడిదారీ వర్గాలను అదుపులో పెట్టగలిగిన, అభ్యుదయకర రాజ్యాంగయంత్రాంగాన్ని రూపొందించుకొనగలిగినది కావాలి.

నేటి ఎన్నికల పోరాటంలో, జనసంఘం దాని మద్దతు కవాతు దళాలను తిరిగి నెలకొల్పుటకు వ్యతిరేకంగా, లోక్‌దళ్–కాంగ్రెసు కూటమితో కలసి ఐక్యసంఘటన నేర్పరచి చాందస, మత మౌఢ్యశక్తులు, రాజకీయ నిరంకుశ ద్వంద శక్తులు అధికారంలోని రాకుండా అన్ని విధానాల ప్రతిఘటించుట, ఎన్నికల వ్యూహంగా సి.పి.ఐ కేంద్రసమితి చేబట్టింది. నియంతృత్వకాంగ్రెసు (ఐ), ఆర్.యస్.యస్. జనసంఘాల ప్రాబల్యం గల జనతా పార్టీకి వ్యతిరేకంగా నిలబడిన, జనతా (యస్), కాంగ్రెసులోని ప్రగతి శక్తులు, యితర వామపక్షాలు, ప్రజాస్వామ్యశక్తులు, సి.పి.ఐ తో సహా గల విస్తృత ఐక్యసంఘటనయేర్పాటు ఎన్నికలు ఎత్తుగడగా సి.పి.ఐ(యం) జనవరి 1980 తీర్మానంలో ఆమోదించింది. రెండు కమ్యూనిస్టుపార్టీల ఎన్నికల ఎత్తుగడల సారూప్యత స్పష్టం, వాటిని అమలు చేయుట, అవి విఫలమగుట, దురదృష్టకరమే గాక స్వీయ మానసిక, అన్యవర్గ ప్రభావాలు ఎంతబలంగా వున్నవో స్పష్టమగుతుంది.

జనతా ప్రభుత్వం కేంద్రంలో పతనమగుటతో సి.పి.ఐ(యం) దానితో జయప్రకాశనారాయణతో గల సంబంధాలను విడనాడుట, సి.పి.ఐ నాయకత్వంలో కేరళలోని ఐక్యసంఘటనా ప్రభుత్వం సి.పి.ఐ(యం) కోరికపై రాజీనామా చేసి, వామపక్ష ఐక్యతకై నూతనావకాశాలను కలిగించుటతో కేరళ చరిత్రలో సి.పి.ఐ; సి.పి.ఐ(యం) లు రెండూ కలిగిన ఏడు పార్టీల ఐక్యసంఘటన యేర్పడింది. ఈ పరిణామం ఎన్నికలముందే జరుగుట, సమిష్టి ఐక్యపోరాటాల ఫలితంగా యేర్పడిన సంఘటన కానందున ప్రజలలో పూర్తి విశ్వాసాన్ని కలుగజేయజాలకపోయింది. మెజారిటి లోక్‌సభ స్థానాలలో గెలుపొందినా, బ్రహ్మాండ విజయాన్ని వెంటనే పొందలేక పోయింది. కేరళలో కాథలిక్ సంస్థ, మత, కుల ప్రభావం యీ ఎన్నికలలో పెరిగిపోయింది.

**7.2** పశ్చిమబెంగాల్‌లో కమ్యూనిస్టు తదితర వామపక్ష పార్టీలు, కాంగ్రెసు (ఉ) కలసి వామపక్ష సంఘటనగా ఎన్నికలలో కాంగ్రెసు (ఐ) ని చిత్తుగా వోడించాయి.

ఇందిరా కాంగ్రెసు వొక్కటే సుస్థిర ప్రభుత్వాన్నివ్వగలదనే నినాదంతో కేరళ, పశ్చిమబెంగాలులలో అధికారాన్ని చేబట్టాలనే కాంగ్రెసు (ఐ) ఆశలు అడియాశలయ్యాయి. అయితే జాతీయ స్థాయిలో కాంగ్రెసు (ఐ)కి ప్రత్యామ్నాయం రూపొందనందున, అదేనినాదం, ప్రజలను ఆమె బాహుబంధనాలలోనికే త్రోసివేసింది. కాంగ్రెసు(ఐ) ప్రజలవిశ్వాసం అంతరించినా, ప్రత్యామ్నాయం కనుపించనపుడు ప్రజాభిప్రాయం, వోటరులు కాంగ్రెసు(ఐ) వైపే మొగ్గుట జరిగింది.

బెంగాల్‌లో కాంగ్రెసు (ఐ)కి వ్యతిరేకంగా వున్న ప్రధాన ప్రతిపక్షపార్టీ సి.పి.ఐ(యం) వామపక్ష ఐక్యత పునాదిగా, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యసంఘటనను సూత్రప్రాయంగా ఆమోదించినా, ఎన్నికల ఎత్తుగడలలో రెండు కమ్యూనిస్టుపార్టీల మధ్య మౌలిక అభిప్రాయభేదాలు తీవ్రంగా వున్నవని బహిరంగంగా చెప్పుట ప్రజల విశ్వాసాన్ని పూర్తిగా పొందజాలకపోయింది. అంతేగాక, భారతీయ జనతాపార్టీతో, సి.పి.ఐ త్రోసి బుచ్చినవారితో సి.పి.ఐకి వ్యతిరేకంగా ఎన్నికల సర్దుబాటులు చేసుకొన్నది. ఈ సిద్ధాంత, ఆచరణల పరస్పర వైరుధ్యం, సహజంగానే జాగృతి వామపక్ష అభిమానులైన బెంగాలీ ప్రజాసామాన్యంలో పూర్తి విశ్వాసాన్ని కలిగించలేకపోయింది.

ఐక్యసంఘటనలోని భాగస్వామ్యపార్టీలన్నీ బలపడాలి. సంఘటనలోని యేవొక్కరో మరొకరి బదులుగా బలపడు ప్రయత్నం విచ్ఛిన్నతకుదారి తీస్తుంది. అట్టి బలాన్ని బూర్జువా ప్రతిపక్ష పార్టీల నుండి ఐక్యసంఘటన పార్టీలన్నీ పొందగలగాలి. ఈ ఐక్యసంఘటన సామాన్య సూత్రాన్ని భాగస్వామ్యపార్టీలన్నీ గుర్తించిననాడు, సంఘటనలో వచ్చే అభిప్రాయాభేదాలెంతటి తీవ్రతరమైనవి అయినా పరిష్కారం సుసాధ్యము.

**7.3** బీహారు పరిస్థితి కేరళ, పశ్చిమబెంగాలులుకు భిన్నమైనదేగాక సంక్లిష్టమైనది. కాంగ్రెసు (ఐ) నుండి వివిధ గ్రూపులు చీలిపోయి యేర్పడినా, యింకా ప్రధాన రాజకీయశక్తిగానే వుంది. కాంగ్రెసు (ఐ) యేతర బూర్జువా గ్రూపులు లోక్‌దళ్ జనతా (యస్) చరణసింగ్‌గ్రూపు, జనతా (జె.పి), జనతా (యస్-రాజనారాయణ) గ్రూపు, కాంగ్రెసు (ఉ)లు అన్నీ కలసి, కాంగ్రెసు (ఐ) కి వ్యతిరేకంగా వొక బూర్జువా ప్రత్యామ్నాయ కూటమిగా రూపొందాలని, ప్రధానంగా లోక్‌దళ్ (జనతా) ప్రయత్నించింది. ఆర్.యస్.యస్ నిర్మాణశక్తిపై ఆధారపడిన బి.జె.పి నాయకత్వంలో యీ కూటమి యేర్పడాలనే అభిప్రాయం యీ వర్గాలలోవుంది. ఇది కనీస ప్రాతిపదికపై, కాంగ్రెసు (ఐ) తో నిర్దిష్టంగా తెగతెంపులు చేసుకొన్న వారితోనే యేర్పడాలని వుంది.

కమ్యూనిస్టులు మరోబూర్జువా ప్రత్యామ్నాయాన్ని త్రోసిబుచ్చుతూ, లోక్‌దళ్, జనతాపార్టీ (జె.పి) కాంగ్రెసు (ఉ)లు కాంగ్రెసు (ఐ) తో పూర్తిగా తెగతెంపులు చేసుకొని, వామపక్ష ప్రజాస్వామ్యశక్తుల ఐక్యసంఘటనను యేర్పరచుటకు కలసి రావాలని సి.పి.ఐ విజ్ఞప్తి చేసింది. బీహారులో కమ్యూనిస్టులు మూడు స్రవంతులుగా సి.పి.ఐ., సి.పి.ఐ.(యం), సి.పి.ఐ.(ఎం.ఎల్)గా వున్నారు. కమ్యూనిస్టుల సమన్వయకమిటి యేర్పడింది సి.పి.ఐ(యం) మూడో స్రవంతి సి.పి.ఐ (యం.యల్)ను గుర్తించనందున మార్క్సిస్టు సమన్వయ కమిటితో సంప్రదింపులు తిరస్కరించి, వొక్క సి.పి.ఐ తో మాత్రమే ఎన్నికల వొప్పందాలు చేసుకొంది. పార్వర్డుబ్లాకును కూడ తిరస్కరించింది. ఈవిధంగా సి.పి.ఐ(యం) వామపక్షాలతో సహకరించుటను తిరస్కరించుతు మరోవైపున బూర్జువా రాజకీయగ్రూపులైన లోక్‌దళ్, కాంగ్రెసు (ఉ) జనతా (జె.పి)లను సి.పి.ఐ(యం), సి.పి.ఐ పోటీ చేయని స్థానాలలో బలపరచే వైఖరిని చేబట్టింది. ఈ క్రమపద్ధతి రాజకీయ విధానంలో యిమడలేని సి.పి.ఐ(యం) విధానం, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతా మౌలిక

విధానమునకు ఎంతవరకు తోడ్పడుతుందో చెప్పజాలము కాని, పార్టీ ప్రయోజనమే ప్రధానాంశంగా వారి విధానం నిర్ణయించబడినట్లు కన్పడుతున్నది.

బీహారులో పరిస్థితులు ఎంతో అనుకూలంగా వున్నప్పటికి ఐక్యసంఘటన రూపొందించకపోవుటలో వామపక్షాల, కమ్యూనిస్టుపార్టీల వైఫల్యమే ప్రధాన కారణం. వామపక్ష పార్టీలైన సి.పి.ఐ., సి.పి.ఐ(యం); సి.పి.ఐ (యం.యల్: మా.స); పార్వర్డుబ్లాకు అన్నీ కలసి 200స్థానాలకు పోటీచేసి, క్రమంగా 23; సి.పి.ఐ(యం)6; సి.పి.ఐ(యం.సి)2; పార్వర్డుబ్లాకు 1; సీట్ల విజయం సాధించాయి. వామపక్షాలు గెలుపొందిన స్థానాలు తక్కువే అయినా కాంగ్రెసు (ఐ) ప్రత్యామ్నాయంగా ప్రజలకు కన్పించేది, వామపక్ష ప్రజాస్వామ్యసంఘటనయేనని స్పష్టమైంది. మరో ముఖ్యవిషయం, ఆలస్యంగానైనా సి.పి.ఐ.ని మినహాయించిన వామపక్ష ఐక్యత పునాదిలేని గాలిలోనిదే అగుతుందని, సి.పి.ఐ(యం) అవగాహనలోనికి వచ్చింది.

**7.4** జనతాప్రభుత్వం 1977లో రాష్ట్ర ప్రభుత్వాలను రద్దుచేసి, ప్రజాస్వామ్యాన్ని ఖూనిచేసి, రాష్ట్రాలలో తిరిగి ఎన్నికలు జరిపి ప్రజలపై భారాన్ని మోపిందో అదేవిధంగా కేంద్ర కాంగ్రెసు (ఐ) ప్రభుత్వం 1980లో మధ్యంతర ఎన్నికల తెచ్చిపెట్టింది. పైగా కేంద్రంలో అధికారంలో వున్న పార్టీయే రాష్ట్రాలలోను అధికారంలో వుండాలనే నూతన రాజకీయసిద్ధాంతాన్ని ప్రచారంలో పెట్టింది.

యు.పి.లో వివిధ రాజకీయ ప్రతిపక్షపార్టీల చీలికలకులోనై రాజకీయపరిస్థితి శోచనీయంగా వుంది. ఎన్నికలు ప్రకటించుటతో యీ చీలికలు మరిన్నిగా పెరిగిపోయాయి. జనతాపార్టీ చీలి, జనతా (జె) జనతా (జె.పి) బారతీయ జనతాపార్టీగ మూడు అయ్యాయి. చరణ్‌సింగ్–రాజనారాయణ్‌ల మధ్య అభిప్రాయబేదాలు, ఘర్షణలకు దారి తీసి లోక్‌దళ్, జనతా (యస్–రాజనారాయణ్), జనతా (చరణ్‌సింగ్)లుగా రెండు అయింది. కాంగ్రెసు (ఐ), కాంగ్రెసు (ఉ), కాంగ్రెసు (జె) లుగా మూడు అయింది. అధికారం యేకైక లక్ష్యంకాగా రాజకీయవిధానాల లేమితో అవకాశవాదం రాజకీయ సిద్ధాంతం అయింది. ఎప్పుడు, యేరాజకీయపార్టీ, యేరూపం ధరిస్తుందో అనుహ్యాం. లోక్‌దళ్ నాయకుడు చరణ్‌సింగ్ 400స్థానాలకు పోటీ చేస్తుందని నాలుగు రాష్ట్రాలలో ప్రభుత్వాలను యేర్పాటు చేస్తుందని అత్యోక్తి ప్రకటనలతో ఎన్నికల పొత్తులు, అవగాహనలకు అవకాశం లేకుండా చేసాడు.

బూర్జువాపార్టీల రాజకీయాలు ప్రజలలో అవిశ్వాసాన్ని రాజకీయ అనాశక్తిని కలిగించగా, కాంగ్రెసు (ఐ) కు సమర్థవంతమైన మరో రాజకీయ ప్రత్యామ్నాయం లేకపోవుటతో 35శాతం కొన్నిచోట్ల ముఖ్యంగా కాంగ్రెసు (ఐ) గెలచిన స్థానాలలో 20శాతం కంటె తక్కువకు ఓటింగు శాతం పడిపోయింది. అధికారంలోవున్న కాంగ్రెసు (ఐ) ప్రభుత్వ యంత్రాంగాన్ని అన్నివిధాల తన గెలుపుకు వినియోగించింది. ప్రజాస్వామ్యాన్ని మంట గలిగింది.

అన్ని చట్టవ్యతిరేక విధానాలు అవలభించినా పోలైన వోట్లలో 37.8శాతం, అనగా

మొత్తం వోటరులలో 17శాతం పొందింది. కుతుహలాన్ని కలిగించే విషయం కాంగ్రెసు (ఐ) 32.3శాతం వోట్లతో 1974లో 215 అసెంబ్లీ సీట్లను అనగా 50శాతం స్థానాలను; 1977లో 32.26శాతం వోట్లతో 46 స్థానాలను అంటె 10.09 శాతం స్థానాలలో గెలుపొందుట, బూర్జువా ప్రజాస్వామ్య సిద్ధాంతంలో "బూటక ప్రజాస్వామ్యాన్ని" బట్టబయలు చేస్తుంది. ఇది ఎన్నికల సంస్కరణలు, దామాషా ప్రాతినిధ్యపు అవసరాన్ని, అదే నిజమైన "జనతా ప్రజాస్వామ్యం" అని నిర్ధారణ చేస్తున్నది.

**7.5.** మహారాష్ట్రలో సార్వత్రిక పార్లమెంటు, రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికలు ఐదుమాసాల వ్యవధిలో జరిగా ఖ. సి.పి.ఐ; సి.పి.ఐ.(యం)లు చొరవతో పరస్పరం; పీజెంట్సు అండ్ వర్కర్స్ తదితర వామపక్ష, ప్రజాస్వామ్యపార్టీలు, గ్రూపులతో సమిష్టిగా కాంగ్రెసు(ఐ)తో ఎన్నికలలో పోరాడుటకు సంప్రదింపులు జరిపి, వామపక్షాలు ఒక అవగాహనకు వొచ్చాయి. జనసంఘంలో భాగస్వామిగావున్నంతవరకు జనతాపార్టీతో సంప్రదింపులు జరుపరాదని, వామపక్షాలు ప్రజాస్వామ్యవాదులు ఆమోదించారు. కాంగ్రెసు(ఉ), రిపబ్లికన్‌పార్టీ, జనతా (జె.పి.)తో సంప్రదింపులు జరుగుతుండగా, వై.బి.చవాన్ని నాయకత్వంలో మహారాష్ట్రంలో అన్ని స్థానాలకు పోటీ చేస్తుందని ప్రకటించుటతో, మిగిలిన అయిదు వామపక్షాలు, ఇతరులు, బొంబాయి సీట్లు మినహా అన్ని సీట్లకేటాయింపులపై ఎన్నికల ఒప్పందం కుదిరింది. నామినేషన్‌వరకు ఒప్పందం సంప్రదింపులు జరుగుతుండుట, ఎన్నికల ముందు ఎట్టి ఐక్యకార్యచరణ, ఉద్యమాలు, పోరాటాలు జరుగనందున, ఎన్నికలపై సహజంగానే ఎట్టి ప్రభావాన్ని కలుగజేయజాలక పోయాయి. కాని, కమ్యూనిస్టులు యేకాకితనాన్నుండి బడటపడుటకు కొంత వరకు తోడ్పడింది.

**7.6.** తమిళనాడులో లోక్‌సభ ఎన్నికల ముందు ఏర్పడిన కాంగ్రెసు(ఐ), డి.యం.కె., ముస్లిం లీగులకూటమియే అసెంబ్లీ ఎన్నికలలో కొనసాగింది. ఈ కూటమి, "ఎ.ఐ.ఎ.డి.యం.కె." నాయకత్వంలోని కూటమిలోని టాయిలర్స్ ప్రోగ్రెసీవ్ పార్టీ జాతీయ పార్వర్డుబ్లాకులను తమకూటమిలోనికి చేర్చుకొనినా, అధికార ఫార్వర్డుబ్లాక్ "ఎ.ఐ.ఎ.డి.యం.కె." కూటమిలోనే కొనసాగింది.

సి.పి.ఐ., సి.పి.ఐ. (యం)లు రెండు చెరి 15 సీట్లులో పోటీచేయుటకు, సంయుక్తంగా "ఎఐఎడియంకె" సంప్రదింపులుజరిపి అవగాహనకు వచ్చారు. ఏప్రిల్ 1980లో, "ఎఐఎడియంకె" నాయకత్వంలో 14 పార్టీలు సంప్రదింపులు జరిపాయి. అందులో 3 పార్టీలు సీట్లు కేటాయింపు, ఎన్నికలలో పోటీచేయతలచనందున కోరలేదు. ఈ 14 పార్టీలలో 4 కాంగ్రెసు నుండి చీలి ఏర్పడినవి, పార్వర్డు బ్లాక్, లోక్‌దళ్, తమిళనాడు ముస్లింలీగు, క్రిష్టియన్ డెమెక్రటిక్ ఫ్రంటు ఆల్ ఇండియా, రిపబ్లికన్ పార్టీ, జనతాలువున్నవి. సీట్ల కేటాయింపు ఆమోదం జరిగింది. "ఎఐఎడియంకె" ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. సి.సి.ఐ.; సి.పి.ఐ.(యం)లు క్రమంగా 10, 11 సీట్లలో గెలుపొందారు. ఎన్నికల ప్రచారోద్యమంలో "ఎఐఎడియంకె", వామపక్షాలు, ఇతరపార్టీలు సమిష్టిగా

పాల్గొనుట విజయాలకు ముఖ్యకారణమైంది. అంచెనాలకు మించిన సీట్లను "ఎఐఎడియంకె" సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)లు పొందగలిగాయి.

**3.7.8.** పంజాబ్ ఎన్నికలలో రెండు కూటములు. ఒకటి కాంగ్రెసు (ఐ) దానిని బలపరచు వర్గాలు, మరొకూటమి సంయుక్త ఎన్నికల సంఘటనలు ప్రధానంగా పోటీచేసాయి. సంయుక్త సంఘటన ప్రధానంగా అకాలీదళ్, సి.పి.ఐ.; సి.పి.ఐ.(యం) మూడు పార్టీలతో యేర్పడింది. సంఘటనలో లేక పోయినా జనతా (జె.పి.) ఇద్దరు అభ్యర్థులను, స్వతంత్రలను 5 గురను, కాంగ్రెసు (ఉ) ఒక్కరిని బలపరచింది.

కాంగ్రెసు (ఐ) గుత్తాధికారాన్ని అంతం చేయుటకు శిరోమణి అకాలీదళ్, సి.పి.ఐ., సి.పి.ఐ.(యం) 1980 మార్చిలో ఎన్నికలసీట్ల సర్దుబాటుల ఒప్పందం చేసుకొన్నారు. మూడు పార్టీలు ఏకగ్రీవామెదం పొందిన అంశాలనే అమలు చేయుటకు అంగీకరించాయి. అయినా లోపాయికారిగా బి.జె.పి.తో కొన్నిసీట్లపై సి.పి.ఐ.(యం) ఒప్పదం చేసుకొనుట జరిగింది. ఆకారణంగా అకాలీదళ్‌తో కొన్ని ఇబ్బందులను యెదుర్కొన వలసి వచ్చింది.

ప్రధానంగా సి.పి.ఐ.; సి.పి.ఐ.(యం)లు బి.జె.పి. ఎన్నికల లక్ష్యాలను వ్యతిరేకించుట, ఆర్.యస్.యస్, జనసంఘం ఆధిక్యతలోని జనతాపార్టీని బలహీనపరచి, ప్రజలనుండి దూరం చేయుట, అసెంబ్లీలో వామపక్షశక్తుల బలాన్నిపెంచుట, వామపక్ష ప్రజాస్వామ్య ప్రాతినిధ్యాన్ని పెంచుటలాంటి నాలుగు అంశాలను లక్ష్యంగా పెట్టుకొన్నారు.

వామపక్ష ఐక్యత ఏర్పడనందున, సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)లు అకాలీదల్‌తో సంప్రదింపులలో సంయుక్త వైఖరి చేబట్టనందున, యీ వైఫల్యాన్ని అకాలీదళ్ తనకు అనుకూలంగా వినియోగించుకొంది.

**3.7.9.** ఆంధ్రప్రదేశ్‌లో లోక్‌సభ, అసెంబ్లీ ఎన్నికలు 1984, 1985లలో జరిగాయి. ఇందిరాగాంధి దారుణహత్యానంతరం ప్రబలిన సానుభూతి వెల్లువను కాంగ్రెసు ప్రభుత్వం పార్టీ ప్రయోజనాలకు వినియోగించుటకై ప్రజలపై ఎన్నికల భారాన్ని మోపింది. లోక్‌సభలో 400 స్థానాలలో ఘనవిజయం పొందింది. ఈ సానుభూతివెల్లువయే మాత్రం ఆంధ్రప్రదేశ్‌లో పనిచేయలేదు. 40 స్థానాలలో 9 స్థానాలలో మాత్రం గెలుపొందుట దీనినే తెలుపుతుంది.

కాంగ్రెసు(ఐ), తెలుగుదేశం పార్టీ యం.యల్.ఎ.లను వివిధ ప్రలోభాలకు గురిచేసి, చీలికను ప్రోత్సహించి, యన్.టి.ఆర్. ప్రభుత్వాన్ని కూలద్రోసి కాంగ్రెసు మద్ధతుతో చీలివచ్చిన నాదెండ్ల భాస్కరరావు నాయకత్వంలో, కాంగ్రెసు బలపరచే ప్రభుత్వాన్ని పరోక్షంగా ఏర్పాటుచేసింది. దీనికి వ్యతిరేకంగా బ్రహ్మాండమైన ప్రజోద్యమాన్ని కమ్యూనిస్టులు, కాంగ్రెసేతర ప్రజాస్వామ్యవాదులందరూ తెలుగుదేశంతో కలసి నడిచిన ఫలితంగా జరిగిన అసెంబ్లీలో విశ్వాస ప్రకటన తీర్మానం వీగిపోయిన ఫలితంగా, రామారావు మెజారిటి రుజువుకాగా తిరిగి యన్.టి.ఆర్. ప్రభుత్వం ఏర్పడి, కాంగ్రెసు

కుట్రలు భగ్నమై, అపఖ్యాతికి, అపజయానికి గురైంది. తెలుగుదేశం, సి.పి.ఐ.; సి.పి.ఐ.(యం)ల మధ్య సీట్లకేటాయింపుల సంప్రదింపులు ముఖ్యంగా భద్రాచలం, ఖమ్మంమెట్టు, మిర్యాలగూడెం, తెనాలి పార్లమెంటు స్థానాలపై జరిగిన మల్లగుల్లాలు కమ్యూనిస్టు ఉద్యమాన్ని అప్రదిష్టాపాలు చేసాయి. ఖమ్మంలో కాంగ్రెసు గెలుపుకు కమ్యూనిస్టుల మధ్య పెరిగిన శత్రుభావమనుటకు చరిత్రకారుడు సందేహించడు.

అసెంబ్లీ 1985 ఎన్నికలలో కాంగ్రెసు (ఐ)ని ఓడించు ప్రధానలక్ష్యంతో తెలుగు దేశంతో సీట్లు సర్దుబాటు ఒప్పందం జరిగి సి.పి.ఐ. 15 సీట్లు పోటీచేసి 11 సీట్లలో గెలుపొందింది. పోటీచేయని అనేక స్థానాలలో తెలుగుదేశం, జనతా చివరకు సి.పి.ఐ.(యం) అభ్యర్థులను కూడ బలపరచింది. అయినా, అసెంబ్లీ సీట్లు కేటాయింపులలో ఖమ్మంజిల్లాలో పార్లమెంటు సీట్లు కేటాయింపుల కథనం పునరావృతమైంది. వీటికి అసలు కారణం సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)లు పరస్పరం మరొ కమ్యూనిస్టు పార్టీని సైద్ధాంతికంగా గుర్తించ నిరాకరించుట. "పోరాటం–ఐక్యత– పోరాటాలలో ఐక్యతా పోరాటానికి ఎక్కువ ప్రాముఖ్యత లేక కనీసం సమాన ప్రాముఖ్యతను యిచ్చుటలోని వైఫల్యం కమ్యూనిస్టులలో స్పష్టంగా కానవస్తున్నది.

**7.7.** దేశం 1980 దశకం మధ్యలో క్లిష్టరాజకీయ పరిస్థితుల పరిణామ దశలో పడింది. పాలక కాంగ్రెసు (ఐ) పార్టీ ప్రతిష్టను, ప్రజాభిమానాన్ని అతివేగంగా కోల్పోతున్నది. మరో ప్రత్యామ్నాయ. అఖిల భారత ప్రజాభిమానాన్ని పొందిన రాజకీయ పార్టీలేదు. దేశాని కంతటికి విస్తరించి, ప్రధానంగా దేశ సమగ్రత, దేశాభివృద్ధి, ప్రజాసంక్షేమాన్ని కాక్షించే అశయాలు, లక్ష్యాలు గల అఖిలభారత రాజకీయపార్టీ కొత్తగా ఉద్భవించే పరిస్థితులు లేవు. పాంత్రీయ పార్టీలు సంకుచిత ప్రాంతీయ ప్రయోజనాలకే ప్రాముఖ్యతనిస్తుంది. దేశ ఆర్థిక పారిశ్రామిక అభివృద్ధి అసమానతల కారణంగానే ప్రాంతీయ బూర్జువావర్గాలు ప్రాంతీయ నినాదాలపైనే బలపడ సాగాయి. ఈ ప్రాంతీయ పార్టీలు, ప్రాంతీయ సమస్యలకు ప్రాధాన్యతనిస్తూనే ఒకబలహీనమైన, ఫెదరలు సంకీర్ణరాజకీయ పార్టీ స్థాపించవలసిన పరిస్థితులు ఏర్పడుతున్నందున కాంగ్రేసేతర, మతతత్వ బి.జె.పి.యేతర లౌకిక, సామాజిక న్యాయం, ప్రజాస్వామ్యశక్తులు ఒక రాజకీయ పార్టీ వుద్భవించే పరిస్థితులతోపాటు రూపుదిద్దు కొంటుంది. జాతీయ అంతర్జాతీయ పరిస్థుతులు, సంక్షోభాలు ప్రేరణగా ఏర్పడవచ్చు. దీనికి బహుదీర్ఘకాలం పట్టినా పట్టవచ్చు.

కేరళ, పశ్చిమబెంగాలులలో 1987 ఎన్నికలలో రెండు నమూనా ఐక్యసంఘటనలు ఏర్పడినది. కేరళలో ఏర్పడిన ఐక్యసంఘటనలో సోషలిజంపై విశ్వాసం ప్రకటంచిన పార్టీలేగాక, బూర్జువాప్రజాస్వామ్యం యెడల విశ్వాసం గల బూర్జువా రాజకీయ పార్టీలు కూడావున్నవి. పశ్చిబెంగాల్ సంఘటనలోని పార్టీలన్నీ సోషలిజం యెడల విశ్వాసాన్ని ప్రకటించి ఉన్నవి. ఈ రెండుసంఘటనలలోని భేదాన్ని, దానిలో ఇమిడి ఉన్న సైద్ధాంతిక భేదాన్ని ఒకటి వామపక్ష, బూర్జువా ప్రజాస్వామ్యపక్షాల సంఘటన మరొకటి సోషలిజంపై విశ్వాసంగల వామపక్షాల సంఘటన యీ రెండింటి సైద్ధాంతిక, ఆచరణ, భేదాలతోపాటు

వర్గాల పొందికలోని వ్యత్యాసాన్ని పరిగణలోనికి తీసుకొనవలసి ఉంటుంది. పశ్చిమ బెంగాల్ సంఘటనకుగల పునాదుల స్థిరత్వం, కేరళ వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన అస్థిరత్వం, వాటి పునాది వర్గాలనైజముపై ఆధారపడి ఉండుటను. గమనించాలి.

కేరళలో ముస్లిం, క్రిష్టియన్ మత, నాయర్‌కుల సంస్థలు కాంగ్రెసు (ఐ) నాయకత్వంలో ఏర్పడిన మిత, మత. బూర్జువావర్గ పార్టీలతో ఏర్పడిన మితవాద సంఘటన. వామపక్ష ప్రజాస్వామ్య, లౌకికశక్తుల సంఘటన ఎన్నికలలో తలపడినవి; పశ్చిమ బెంగాలులో సి.పి.ఐ., సి.పి.ఐ.(యం), సోషలిస్టు. మార్క్సిస్టు, పార్వర్డుబ్లాకులు, ప్రజాస్వామ్య, లౌకిక పార్టీలు కలసిన సంఘటన నేరుగా కాంగ్రెసు (ఐ)తో ఎన్నికలలో తలపడింది. కాంగ్రెసు(ఐ) దగ్గరి దగ్గరిగా ఏకాకియై ఘోరపరాజయాన్ని పొందింది.

**7.8.** హార్యానా అసెంబ్లీ ఎన్నికలలో లోక్‌దళ్ దేవీలాల్ నాయకత్వంలో కాంగ్రెస్ (ఐ)ని చిత్తుగా ఓడించింది. అధికారాన్ని చేబట్టింది. హార్యానాలో కాంగ్రెసు(ఐ)ని చిత్తుగా ఓండించింది, అధికారాన్ని చేబట్టింది. హర్యానాలో విజయం పొందింది పురోగామి శక్తులు కావు, ఫ్యూడలు భూస్వామ్య, మత మౌఢ్య, మితవాద బి.జె.పి.దాని కవాతుదళాలు, వామపక్షాల విధానాలలో మార్పువచ్చి, సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)ల మధ్య పరస్పర సంప్రదింపుల క్రమం ఏర్పడింది. భటిండా, జలందర్ పార్టీ కాంగ్రెసుల తదనంతరం వచ్చిన రాజకీయ ఆలోచనా విధానంలో వచ్చిన మార్పుల ఫలితంగా నాలుగు వామపక్ష పార్టీలు చేరువకాసాగాయి. వామపక్షాలు కాంగ్రెసు (ఐ) బ్యాండుమేళంలో కాని, కాంగ్రెసేతర ప్రతిపక్షాల బ్యాండుమేళంలోగాని చేరక, నెమ్మదిగా, ధృఢంగా, స్వతంత్ర శక్తిగా రూపొందాలనే అవగాహన ఏర్పడింది.

**7.9.** కేంద్రంలో కాంగ్రెసు (ఐ)కి మరో బూర్జువా ప్రత్యామ్నాయాన్ని నిర్మించే ప్రయత్నంలో భాగంగా, శ్రీ రామారావు మే 1987లో ప్రతిపక్ష పార్టీల సమావేశాన్ని ఏర్పాటు చేసారు. "ప్రతిపక్ష పార్టీల ఫెడరేషను"ను శ్రీహెగ్డే. "భారతదేశం అనే కాన్ఫెడరేషనును శ్రీ రామారావు ప్రతిపాదించగా సి.పి.ఐ., సి.పి.ఐ.(యం) తదితర వామపక్షాలు వ్యతిరేకించాయి. వామపక్ష, లౌకిక ప్రజాస్వామ్య ప్రభుత్వ ప్రత్యామ్నాయమే కాంగ్రెస్ నమూనా సోషలిజం, లౌకిక ప్రజాస్వామ్యవిధానం, అలీన, శాంతి విదేశాంగ విధానం ప్రభుత్వరంగ భారీపారిశ్రామిక ప్రణాళికా బద్ధ సంక్షేమాభివృద్ధి విధానాలు పరిరక్షింపబడగలవని స్పష్టంచేసారు. ఈ నేపథ్యంలో లౌకిక. ప్రజాస్వామ్య ప్రతిపక్షాలు సూరజ్‌కుందులో బి.జె.పి. మత తత్వపార్టీలతో చేతులు కలుపుట మతమౌఢ్యశక్తులు బలపడుటను తెలుపుతుంది.

జవహారలాల్ నెహ్రూ నుండి దేవీలాల్, రామారావుల వరకు కాంగ్రెసు పాలనకు ప్రత్యామ్నాయంగా బూర్జువా "రెండుపార్టీల" పార్లమెంటరీ విధానాన్ని ప్రవేశపెట్టే విఫల ప్రయత్నం చేసారు.

**7.10.** బూర్జువా, భూస్వామ్య వర్గాల మధ్య సంఘర్షణలు తీవ్రమగుటతో వ్యవసాయ

సంక్షోభం తీవ్రతరమైంది. కాంగ్రెసులో అంతర్గత సంఘర్షణలు మిన్నంటాయి. ప్రభుత్వ ఉన్నత వర్గాలు, పాలక కాంగ్రెసును అనుసరించుటతో "అవినీతి భూతాలు" వ్యాపించి "రక్షణ వ్యవస్థ" సైతం కలుషితం అయింది. "బొఫోర్స్ ఉదంతం," "జలంతర్గాముల ఒప్పందం" ప్రజలలో ఎంతటి "విశ్వాస సంక్షోభాన్ని" కలిగించాయో చెప్పజాలము.

రెండు కమ్యూనిస్టు పార్టీల కాంగ్రెసులు ప్రజల రాజకీయ చైతన్యాన్నిపెంచి, ప్రజాసమస్యలపై ఐక్యకార్యాచరణ అవసరాన్ని ప్రస్తావించియుండుట గమనించవలసిన విషయం. ఆగస్టు 1987 కేంద్ర కమిటి తీర్మానంలో సి.పి.ఐ.(యం) లౌకిక, ప్రజాస్వామ్య ప్రతిపక్షాల ఐక్యత ఏర్పడాలని, అందుకు వామపక్షాల ఐక్యత భూమిక కావాలని వివరించింది.

పార్లమెంటు, అసెంబ్లీలలో వామపక్షాలు ప్రధానంగా సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)లు జాతీయ ఐక్యతావ్యతిరేక వైఖరిని ఎండగట్టుటతో, కాంగ్రెసేతర ప్రతిపక్షాలు, అనేక సమస్యలపై, ప్రభుత్వవ్యతిరేక పోరాటాన్ని సాగించుటతో బి.జె.పి. వేరుపడి, కాంగ్రెసేతర శక్తుల నుండి దూరమైంది. రాష్ట్రపతి ఎన్నికల ఎన్నికల విషయంలో, కాంగ్రెసు(ఐ) అభ్యర్థికి పోటీ అభ్యర్థిని ఎన్నుకొనే విషయంలోకూడ, బి.జె.పి. దూరమైంది. అనేక ప్రతిపక్షాలతో ఏర్పడిన నేషనల్ ఫ్రంటు, వామపక్షాలు సూత్రబద్ధమైన పోరాటాన్ని మత శక్తులకు వ్యతిరేకంగా సాగించుటవలన పురోగమనం సాధ్యమైంది. నేషనల్ ఫ్రంటు సామ్రాజ్యవాద వ్యతిరేక, అలీన విధానాన్ని చేబట్టుటలో భూసంస్కరణలలో వూగిసలాట ప్రదర్శించింది. అంచేతనే, అన్నిపక్షాల ఆమోదంపొందిన కనీస కార్యక్రమ రాజకీయ అవసరాన్ని ప్రత్యేకంగా గుర్తించవలసిన అవసరముంది. అట్టి కనీసకార్యక్రమం ఆమోదించిన ఫ్రంటులోని పార్టీలన్నీ ప్రభుత్వంలో భాగస్వాములైతేనే, అదిశక్తి వంతమైనదగుతుంది. ఫ్రంటు వివిధ వర్గాల కూటమి అయినందును, వర్గాల, ఆటు, పోటులకు, నాయకత్వాల వూగిసలాటలకు సహజంగా గురియగుటతో అస్థిరత్వం దానిలోనేయిమిడి ఉండుట మరువరాదు.

నేషనల్ ట్రేడుయూనియనుల ప్రచారోద్యమ సమన్వయ సమితి నాయకత్వంలో 1977 డిశెంబరు ఢిల్లీ ప్రజాప్రదర్శనతో ప్రారంభించి, 1985, 1987లలో జరిగిన ఐక్యకార్మిక సమ్మెపోరాటాలు, ప్రజా ఉద్యమ ప్రదర్శనలు, 1988 సెప్టెంబరు రైతు, వ్యవసాయకూలీల, ప్రజాసామాన్య జాతీయ ఢిల్లీ ప్రదర్శనలు వామపక్ష, ప్రజాస్వామ్య ఉద్యమాల నూతన శకానికి నాందివాచకమయ్యాయి.

రాజకీయ పరిణామాలు వెలుగుకు తెచ్చిన, సైద్ధాంతిక సమస్యలపై సి.పి.ఐ.(యం) జనరలు శెక్రటరీ నంబూద్రిపాద్ కొన్ని వివరణలు యిచ్చారు. పశ్చిమ బెంగాల్, కేరళలలో సంకీర్ణప్రభుత్వాలను ఏర్పడరచి ప్రయోగాలు చేస్తున్న విధంగానే కేంద్రంలో సంకీర్ణ ప్రభుత్వాల ఏర్పాటులో, అట్టి ప్రయోగాలనే ఎందుకు చేయరాదని, నేషనల్ ఫ్రంటులోని కొన్నివర్గాలు ప్రశ్నించుటతో నంబూద్రిపాద్ సి.పి.ఐ.(యం) వైఖరిని యిలా వివరించారు. రాష్ట్రాలలో సంకీర్ణ ప్రభుత్వాలు ఏర్పాటు చేయట, సాధారణ పరిపాలన, విదేశాంగశాఖ, రక్షణ, ఆర్థిక, రవాణా, సమాచార, కరెన్సీ, ఆర్థికాభివృద్ధి వగైరాలు దేశానికంతటికి

సంబంధించినవి. వామపక్ష, లౌకిక, ప్రజాస్వామ్య సంఘటలోని మితవాద, వామపక్ష, మధ్యస్థ వైఖరులను అవలంభించు వివిధ పార్టీల మధ్య మౌలిక అభిప్రాయ భేదాలున్నవి. ఈ అభిప్రాయబేధాలు సహజంగానే వున్నవి, సంప్రదింపులతో పరిష్కరించబడగలవు.

జనతాప్రభుత్వం, వామపక్షాలు, తదితరుల అనుభవాలను సమీక్షించి నంబూద్రిపాద్ "జనతాతో గతంలో చేసిన ప్రయోగం భగ్నమగుటతో వామపక్షపార్టీల లౌకిక పార్టీలతో ముఖ్యంగా వామపక్షాలవైపు మొగ్గిన మధ్యస్థ పార్టీలతో సంఘటనగా ఏర్పడవలసిన అవసరం ఎంతో ఉందన్న అవగాహన బలపడింది" అని, ఐక్యసంఘటనల అవగాహనల పరిణామ క్రమాన్నివివరించారు. ఈ పరిణామాలలో వామపక్షపార్టీల, ప్రజాస్వామ్య, లౌకిక ప్రతిపక్షాల సంఘటన నేటి దశలో మార్గదర్శిక సూత్రంగా రూపొంది సి.పి.ఐ.(యం), సి.పి.ఐ. రెండు కమ్యూనిస్టు పార్టీల వ్యూహాత్మక పంథా స్పష్టమైంది. ఎత్తుగడలలోభిన్నాభిప్రాయలు అనేపేరుతో కమ్యూనిస్టు ఉద్యమాన్ని మొత్తంగా బలహీన పరచేవిధానాలు, ప్రతిపక్ష బూర్జువా పార్టీల అభిమానాన్ని పొందాలనే పోటీతో స్వీయమానసికతత్వంతో పరస్పరం వోడించుకొంటూ కార్మిక, కర్షక, నగర, గ్రామిణ బడుగు వర్గాలలోకూడ విశ్వాసాన్ని కోల్పోయిన వర్తమాన చరిత్ర నుండి పాఠాలు నేర్చుకొనాలి.

**7.11.** మార్క్సిజం-లెనినిజం ఎన్నికలలో పాల్గొనుట, బహిష్కరించుట "రెండూ వ్యూహానికి సంబంధించిన ప్రశ్న ఏమాత్రం కాదని, ఎత్తుగడలకు సంబంధించిన ప్రశ్నమాత్రమేనని స్పష్టంగా తెల్పుచున్నది. పార్లమెంటులో సీట్లు సంపాదించుట ఏ కార్మికవర్గపార్టీ ప్రధాన లక్ష్యంకాదు. ప్రజల రాజకీయ చైతన్యాన్ని పెంపొందించుటమే ముఖ్యమైనది. పార్లమెంటరీ పోరాటాలతోనే దేశభవిష్యత్తు, నిర్ణయించబడుతుందనే భ్రమను ప్రజలలోనే కలుగజేయుట, ప్రమాదకరము. ప్రజాసామాన్యం తమ భవిష్యత్తుపార్లమెంటరీ పోరాటాలద్వారానే ఏమాత్రం మెరుగుపడజాలదని, తమ అనుభవాలద్వారా గుర్తించునట్టు చేయాలి. ఈ లక్ష్యాల సాధనకై ప్రజలు విప్లవపోరాటాల అవసరాన్ని గుర్తించునట్లు చేయుటకే, కమ్యూనిస్టులు ఎన్నికలలో పాల్గొంటారు.

**7.12.** ఫ్రాన్స్‌లో చారిత్రాత్మకంగా 19వ శతాబ్దంలో ఫ్రెంచి విప్లవ ఫలితంగా శ్రామిక ప్రజలు సంపాదించిన రాజ్యాధికారాన్ని, మధ్యతరగతి బూర్జువావర్గ ప్రజాస్వామ్యం భ్రమలకులోనై, ప్రజాస్వామికంపేరిట అణచివేయబడి, తిరిగి ఆ పాలకవర్గాలకే అధికారిన్ని కోల్పోయారు. రెండవ ప్రపంచయుద్ధానంతరం బూర్జువా ప్రజాస్వామ్య భ్రమలకులోనై, 5 లక్షల ఫాశిస్టు వ్యతిరేక రిపబ్లికన్ సివిల్‌గార్ద్సు అనే పేరుతో నిర్మించిన ప్రజాసైన్యాన్ని, డీగాల్ ఎరగాచూపిన ఉపరాష్ట్రపతి పదవి, కొన్నిమంత్రి పదవులను స్వీకరించుటకు, నిరాయుధులను చేసి రద్దుచేసారు. ఈ విధంగా కమ్యూనిస్టులు మితవాదాన్ని చేబట్టిన ఫలితంగా యుద్ధానంతర ప్రధమ ఎన్నికలలో 103 పొందగలిగినా, 1951లో ఎన్నికల చట్టాన్ని తిరుగవ్రాసిన ఫలితంగా 79 స్థానాలనే పొందారుకాని పోలైనవోట్లు తగ్గలేదు. అయినా 1956లో జరిగిన ఎన్నికలలో 156 స్థానాలలో కమ్యూనిస్టు గెలువగా, ఎన్నికల

చట్టాన్ని తిరిగి మరోసారి 1958లో బూర్జువావర్గాలు తిరగవ్రాసిన ఫలితంగా వోట్లు తగ్గకపోయినా 10 మంది కమ్యూనిస్టులు మాత్రమే పార్లమెంటు సభ్యులు కాగలిగారు.

ఇటలీలో కూడ యిట్టి కథనమే పునరావృత్తమైంది. ఎన్నికల ఫలితాలు రాజ్యాంగ చట్టాన్ని తిరుగవ్రాయుట, కమ్యూనిస్టుల వోట్లు తగ్గకపోయినా, ప్రాతినిధ్యం తగ్గిపోవునట్లు రాజ్యాంగ చట్టాన్ని తిరిగి తిరిగి వ్రాసి, బూర్జువా పాలనను వారి ప్రాతినిధ్యం పెరిగిపోవునట్లు చట్టాన్ని ఎప్పటికప్పుడు, సవరణలతో తమబలాన్ని పెంచుకొంటూ పోయారు.

**7.13.** భారతదేశం రెండవ ప్రపంచయుద్ధానంతర సామ్రాజ్యవాదవ్యతిరేక పోరాటాలవెల్లువతోపాటు, నావికా, సైనికదళాలు ప్రజోధ్యమాలలో పాల్గొనుటతో, ఆంగ్ల సామ్రాజ్యవాదం తమ ఆర్థిక, వ్యాపార ప్రయోజనాలను రక్షించుకొనుటకై రాజ్యాధికారాన్ని, దేశాన్ని విభజించి ఇండియా, పాకిస్తాన్‌లకు బదిలీ చేయక తప్పలేదు. ప్రధమ ఎన్నికలు 1952లో నూతన రాజ్యాంగ చట్ట ప్రకారం, భారత స్వాతంత్ర్య రిపబ్లిక్‌కు జరిగాయి. భారత కమ్యూనిస్టు పార్టీ 1946 నుండి సాగించుతున్న సాయుధపోరాటాన్ని వుపసంహరించుకొని, ఎన్నికల్లో పాల్గొన్నది. ప్రధాన ప్రతిపక్ష పార్టీగా పార్లమెంట్‌లో గుర్తింపు పొందింది. పార్టీలో బేదాభిప్రాయాలతో చీలిపోయి అతివాదులు సి.పి.ఐ.(యం)గా 1964-65లో యేర్పడ్డారు, ఎన్నికలలో పాల్గొంటున్నారు. సి.పి.ఐ.(యం) నుండి చీలిపోయి 1967-68లలో సి.పి.ఐ.(యం.ఎల్)గా యేర్పడి అత్యుగ్రవాద కమ్యూనిస్టులు ఎన్నికలు బహిష్కరించారు. వీరుకూడా అనేక చీలికలై పార్టీలు, గ్రూపులుగా యేర్పడినా ఒక్క పీపుల్స్‌వార్ గ్రూపు తప్ప మిగిలిన ప్రధాన గ్రూపులన్నీ, పార్టీలు తిరిగి ఎన్నికలలో పాల్గొంటున్నవి. ఎన్నికలలో పాల్గొనుట కూడా ఒక పోరాట రూపంగా నెంచి, ఎత్తుగడగా ప్రజా చైతన్యాన్ని పెంపొందించుటకై పాల్గొంటున్నవి.

**7.14.** విప్లవోద్యమాల పురోగమనానికి, బూర్జువా ప్రజాస్వామ్యంపై భ్రమలను విడనాడుటకు, వ్యవసాయ విప్లవం, ప్రజా యుద్ధ అవసరాన్ని వారు గుర్తించి, ఎన్నికలలో పాల్గొంటున్నారు, అనుసరించవలసిన మార్గదర్శికం అయింది.

**7.15.** పార్లమెంటరీ పోరాటం రాజ్యాంగ చట్టబద్ధ రాజకీయ పోరాటం, దేశంలో విప్లవ వెల్లువ వున్నప్పుడు, తిరుగుబాట్లు, సాయుధపోరాటం జరుగుతున్నప్పుడు ఎన్నికలను పోరాటప్రాంతాలలో బహిష్కరించాలని, విప్లవ పరిస్థితిలేని ప్రాంతాలలో ఎన్నికలపోరాటాలను ఒక ఎత్తుగడగా వినియోగించుకొనాలని లెనినిజం బోధించుచున్నది. కాని చారుమజుందార్ ప్రజలకు పార్లమెంటరీ విధానంలో భ్రమలు లేవని ఎన్నికలను వ్యూహాత్మక, శాశ్వత, అన్ని ప్రాంతాల సమస్యగా అమలు చేశారు. అగ్రగామి పార్టీ చైతన్యాన్ని స్వీయ మానసిక దృష్టితో ప్రజల చైతన్యంగా భావించుట తప్పు, గత మూడు దశాబ్దాల అనుభవం నేర్పే పాఠం ఇదే.

ప్రారంభంలోనే ఏ.ఐ.సి.సి.అర్. ఎన్నికల బహిష్కరణను భారత విప్లవ దశకంతటికి మౌలిక వ్యూహాత్మక సమస్యగా తప్పుగా నిర్ణయించింది. కాని ఆంధ్రా కమిటీ ఎత్తుగల సమస్యగానే తలచి, కేంద్ర అవగాహనను విమర్శించి, వ్యతిరేకించింది. స్వీడిష్ పత్రికా విలేఖరికి కా॥ టి. నాగిరెడ్డి 1969లోనే "సాయుధ పోరాటం సాగిస్తూ కూడా, సాయుధపోరాటం లేని ప్రాంతాలలో పార్లమెంటులో కూర్చుంటాము" అని, మరో మాటలో ఎన్నికలలో పాల్గొంటామన్నారు.

ఒంటెత్తు పోకడలలో పరాకాష్టకు చేరిన పీపల్స్‌వార్ తదితరులు కొద్దిమంది మాత్రమే ఎన్నికలను శాశ్వతంగా బహిష్కరించే తప్పుడు నినాదం ఇచ్చారు.

**7.16.** కమ్యూనిస్టులు ఎన్నికలలో పాల్గొన్న అనుభవాల నుండి సి.పి.ఐ(ఎం.ఎల్), పీపుల్స్‌వార్, వర్గప్రతిఘటనా పోరాటాలను విడనాడినవారు పార్లమెంటరీ పోరాటాన్ని చేబట్టుతారు, మరోప్రత్యామ్నాయం లేదని, అవి రాజీ, పొత్తు విధానాలకు దారితీసి, ప్రతిఘటన పోరాటానికి హాని చేస్తాయనే హెచ్చరికను, నొక్కిచెప్పారు. ఎన్నికలు ఒక పోరాటరూపంగా గుర్తించ నిరాకరించారు.

# 4

# వామపక్ష ఐక్యత

## (వామపక్ష ఐక్యతా సిద్ధాంత సమాలోచన-ఆచరణల అధ్యయనం)

### i

### నాంది

**1.1** నేడు మార్పుచెందే రాజకీయపరిస్థితి అనుభవవెలుగులో గతకొన్ని దశాబ్దాలుగ వామపక్షశక్తుల సమీకరణ విఫలయత్నాలు, గణనీయమైన అనుభవపాఠాలను నేర్పు తున్నవి. సోవియట్ యూనియన్ తూర్పు యూరపులలో సోషలిజం పతనానంతరం, ప్రపంచ సామ్రాజ్యవాదం అమెరికా నాయకత్వంలో ఫిలిప్పైన్స్ నుండి ఇండియా, పశ్చిమాసియాలలో, నూతన ప్రపంచ ఆర్థిక విధానమనే ప్రేరుతో ప్రజల జీవనాన్ని పరోక్షంగాను, కొన్ని చోట్ల ప్రత్యక్షంగాను శాసించు ప్రయత్నాలు జరుగుతున్న నేట్టి పరిస్థితులలో వామపక్ష ప్రజాస్వామ్యపక్షాల ఐక్యత అత్యంత ప్రాముఖ్యత వహించుతుంది. ప్రపంచ సామ్రాజ్యవాద వ్యతిరేకంగా అన్ని ప్రజాస్వామ్య, వామపక్షాల, ప్రజల ఐక్యత ఒక్కటే దీనిని ఎదుర్కొనగలదు. ఇది చారిత్రిక అవసరము.

అంతర్జాతీయ రాజకీయ పరిణామాల నేపధ్యం, భారత రాజకీయాలపై నెరపగల ప్రభావాలను నిరవధికంగా, ప్రతి సంక్షోభ పరిస్థితులలో అతిశయోక్తులతో అంచెనాలను వేసి, భారత విప్లవ వ్యూహానికి విరుద్ధమైన యెత్తుగడలను అవలంభించుటతో 1930, 40, 60 దశకాలలో కమ్యూనిస్టు ఉద్యమం బలహీన పడింది. అంతేగాక, ఇందిరాగాంధీ భ్రమలలో సి.పి.ఐ., జయప్రకాశ్ ప్రభావంలో సి.పి.యం.లు తమ వైఖరులు విధానాలు నిర్ణయించుటలో, మార్క్సిస్టు లెనినిస్టు శాస్త్రీయ పంధాలను విడనాడుటతోను దేశంలో కమ్యూనిస్టు ఉద్యమాభివృద్ధి కుంటుపడింది అనుట చారిత్రక సత్యము.

అంతర్జాతీయ రాజకయ పరిస్థితుల నేపధ్యంలో భటిండా సి.పి.ఐ. కాంగ్రెసులో రూపొందించబడిన సమీక్షానివేదిక, రాజకీయ, నిర్మాణ తీర్మానాలు సాంప్రదాయకంగా అనేక అంశాలను పునరుక్తి చేయుట తప్పశాస్త్రీయ పరిశీలను, వివేచన, భారతదేశవాస్తవ పరిస్థితులకు అన్వయం కానరాదు. అదే విధంగా, జలందరు కాంగ్రెసులో సి.పి.ఐ.(యం) రూపొందించిన తీర్మానంలో అంతర్జాతీయ పరిస్థితులను వివరంగా పేర్కొన్నది, కాని శాస్త్రీయంగా, భారతదేశంలోని రాజకీయ పరిస్థితులను అవి ఏవిధంగా ప్రభావితం చేసేది, తదనుగుణంగా చేబట్టవలసిన రాజకీయ విధానాన్ని వివరించుటలో సమగ్రత లోపించుట స్పష్టము. అంతేగాక, రాజకీయ తీర్మానం, సోవియట్ యూనియన్, చైనా రెండూ తమ విదేశాంగ విధానాలకు అనుకూలంగా, వర్ధమాన దేశాల విప్లవశక్తుల

అభివృద్ధిని బలిపెట్టుతున్నవనే అవగాహనతో. రెంటికి సమదూర విధానాన్ని పాటించుటతో, గతదశాబ్దంపైగా ప్రపంచ బ్యాంక్, బహుళ జాతి కార్పోరేషనులను ఆహ్వానించు పంధాను పశ్చిమ బెంగాల్ సి.పి.ఐ.(యం) చేబట్టుటకు దారి తీసింది. ఈ విధంగా భారత ప్రాగ్దేశ ప్రాంతాంలో ప్రపంచ బ్యాంక్, విద్రోహచర్యలకు అవకాశం కలుగజేసింది. ఇది, ప్రపంచబ్యాంక్‌కి తలుపులు బార్లాగా తెరచిన" సిద్దార్థ శంకరరాయ్ విధానాలను కొనసాగించుటయే అగుతుంది. ఏ మార్క్సిస్టు పదజాలంతో యీ వాస్తవికతనుకప్పి పెట్టజాలము. అంతేగాక, నేటి సోషలిస్టుదేశాలైన చైనా, వియత్నాంలు ఇదేవిధంగా చేస్తున్నవని మనలను నమ్మించ ప్రయత్నించుచున్నారు. ఆదేశాలు భిన్నషరతులపై, అత్యధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని, భారిమౌలిక పారిశ్రామికీకరణ విషయంలో మాత్రం కొన్ని సరిళీకృత విధానాలు చేబట్టుటను మరుగు పరుస్తున్నారు.

అదేవిధంగా, అత్యవసర పరిస్థితుల కాలంలో, భారత రాజకీయ విధానంపై ఆమెరికా బయటనుండి "సంపూర్ణ విప్లవం" అనేనినాధాలకు మద్దతునిచ్చుట, ప్రధానమంత్రి వంటయింటి "కాకనీ" ద్వారా లోననుండి ద్విముఖదాడిని సాగించుటలోని వైఫల్యాన్ని "ఆత్మవిమర్శనా" రాజకీయ సమీక్షానివేదికలో సి.పి.ఐ. ఆమోదించింది. ధైర్యంగా ఆత్మవిమర్శనా పదజాలంతోకాక పోయినా దగ్గరి దగ్గరిగా అట్టి మాటలలోనె 1968 జలందర్ రాజకీయతీర్మానంలో సి.పి.ఐ.(యం) అన్యాపదేశంగా, ధ్వనించురీతిలో మనం చూడగలము.

అంతర్జాతీయ పెట్టుబడి దీర్ఘకాల సంక్షభంలో పడిపోయింది. డల్లెస్ "కమ్యూనిజాన్ని చాపచ్చుగా" చేయువిధానం, గత 1990 దశకంలో తాత్కాలికంగా, పాక్షివిజయాన్ని సాధించింది. నేడు అమెరికా అధ్యక్షుడు బిల్‌క్లింటన్ "నూతన ప్రపంచ ఆర్థిక విధానం", "మానవ హక్కుల" పేరుతో వర్ధమాన దేశాలను నూతనవలసలుగా చేయ సామ, దాన, భేద, దండోపాయాలన్నిటిని వినియోగించుతున్నాడు.

వ్యూహం, ఎత్తుగడలలో సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)లు రెండూ, రెండవ ఇంటర్నేషనల్, 6వ, ఇంటర్నేషనల్, ప్రాగ్దేశాల విశ్వవిద్యాలయంలో 1925లో స్టాలిన్ ప్రతిపాదించిన, "బూర్జువావర్గపు ద్వందపాత్ర, జాతీయ బూర్జవావర్గం, జాతీయ విప్లవ బూర్జువావర్గంగా, జాతీయ సంస్కరణవాదబూర్జువావర్గంగా, రెండగా చీలుటపై ఆధారపడి తమ తమ వ్యూహాలను, ఎత్తుగడలను రూపొందించుకొని, ఒకటి చీలికకు యీవైపు, మరొకటి ఆవైపుకొనసాగుతు గతకాలమంతా గడిపాయి.

"సాంఘిక సమాజంపై నాయకత్వం వహించుటకై అనుసరించే ప్రధాన ఎత్తుగడ, ఒక రాజకీయ పార్టీ నిర్మాణ నాయకత్వాన్ని ఏర్పరచుటకై చేయు ప్రయత్నం మాత్రమే కాదు, సామాజిక జీవితంలో గణనీయంగా వివిధస్థాయిలలో అచరణ కార్యక్రమాన్ని సమన్వయం చేయుట. అధికారాన్ని పొందకముందు తక్షణంచేపట్ట, తగిన ఆచరణ కార్యక్రమం, అధికారం చేబట్టిన అనంతరం, చారిత్రక సంఘటన శక్తులు తగిన శక్తి, సామర్థ్యాలను పొందిన తరువాత పునర్నిర్మాణంకై మౌలికంగా నిర్మాణం పరిమితకాలంలో

లేక దీర్ఘకాలంలో చేబట్టవలసిన కార్యక్రమాలు పార్లమెంటు విధానాల ద్వారాకాని, పార్లమెంటేతర విధానాలద్వారా కాని చేబట్టవలసిన ఆచరణ కార్యక్రమాలలో నాయకత్వాన్ని ఏర్పరచుటగా అర్థం చేసుకొనాలి, అని, భౌధ్యాయన్‌చటోపాధ్యాయ వివరించారు[1].

రెండు పార్టీలు సి.పి.ఐ. భటిండా, సి.పి.ఐ.(యం) జలందర్ పార్టీ కాంగ్రెసులలో పార్టీల మధ్య సహకారం విషయంపై నిర్దిష్ట చర్చలు నిర్ణయాలు జరిగాయి. ఐక్యకార్యాచరణ, ఐక్యత ప్రధానంగా నిర్దిష్టలక్ష్యం, నిర్మాణాత్మక సహకారం ప్రాతిపధికగా, బహుశా రెండు, మూడు లేకనాలుగు పార్టీల వ్యూహాత్మక చట్రం పరిధిలలో జరగాలని ఇర్ఫన్ హబీబ్ అభిప్రాయము[2]. అంతేగాక, వామపక్ష ఐక్యసంఘటన లక్ష్యాలు, కార్యక్రమాల సహకారాల యెడల వామపక్షపార్టీలలో ఒక సాధారణ ఆమోదం లభించనిచో వామపక్ష లేక కమ్యూనిస్టు ఐక్యతలు నినాధాలవరకే పరిమితమై ఉంటాయి, వివాదాస్పదాంశాలు అలాగే ఉంటాయి. అంచేత అది ఐక్యకార్యాచరణకు ప్రారంభ అంశంగా చెప్పజాలమని అంటున్నారు. కమ్యూనిస్టు ఉద్యమంలో చీలిక, కొందరి నాయకుల వ్యక్తిగత తగాదాలు, విదేశ పార్టీలు కలుగజేసుకొనుట కారణమని తాను అనుకొనుట లేదని, ప్రాంధమికంగా లక్ష్యాల వలననే చీలికకు మార్క్సిస్టు పార్టీ నిర్మాణానికి, తదుపరి మార్క్సిస్టు లెనినిస్టు పార్టీ నిర్మాణానికి కారణమని స్పష్టం చేసారు. ఇంకా "చీలిక, మౌలిక సమస్యలపై అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంపై మౌలిక భేదాభిప్రాయాల కలిగివున్నందున, ఏర్పడినవని, నేను అనుకొంటున్నాను" అని వ్రాసారు. "ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం నడుపబడుతున్నతీరు, ఒక దేశపు విదేశాంగ విధానానికి తగ్గిన విధంగా ప్రతిదానిని రూపొందించుట, సోషలిస్టు దేశాలలో అంతర్గత విషయాలపై మార్క్సిస్టుల అవగాహనలు ఏర్పడుతీరు, ఇవి అన్నీ యేదేశంలోని పార్టీలోనైనా చీలికలు ఏర్పడుటకు హేతుబద్ధ ప్రాతిపదికలు అగుతవి, భారతదేశంలో కూడా చీలికలు ఏర్పడుట కొంతవరకు అవేకారణ భూతమ్యాయి[3]."

## ii

## వామపక్ష ఐక్యతావివేచన

**2.1** "భారతవాస్తవ పరిస్థితులలో సంస్కరణవాదపునైజము, స్వరూపాలను అంతర్జాతీయ చర్చల దృక్పదాలలో భాగంగానే 1964 లోని భారత కమ్యూనిస్టుల చీలికనుతలచాలి. బహశా, అదేకాలంలో భారతవిప్లవదృక్పధం ఏది? అన్న ప్రశ్నపై ప్రధానంగా చీలికతోపాటు, అంతర్జాతీయ, జాతీయ సమస్యలు చారిత్రికాంశాలు అయ్యాయి. కమ్యూనిస్టు ఉద్యమ లక్ష్యం జనతా ప్రజాస్వామ్యం లేక సోషలిజం, ఏమైనప్పటికి ఆచరణలో కార్మిక, కర్షక మైత్రితో, బూర్జువర్గంలోని కొన్ని శక్తుల సహకారమైత్రి

---

1. *భౌధ్యాయన్ ఛటోపాధ్యాయ (1979) ప్రోస్పెక్ట్ ఆఫ్ లెఫ్ట్ యూనిటి పే.10*
2. *ఇర్ఫన్ హబీబ్ (1979) ప్రోస్పెక్ట్ ఆఫ్ లెఫ్ట్ యూనిటి పే.13*
3. *భౌధ్యాయన్ ఛటోపాధ్యాయ (1979) ప్రోస్పెక్ట్ ఆఫ్ లెఫ్ట్ యూనిటి పే.15*

ప్రాతిపధికగా వ్యూహం రూపొందించబడింది. రెండవది జాతీయ ప్రజాస్వామ్యసంఘటన, బూర్జువావర్గంలోని, బడాబూర్జువా వర్గంతో సహా అన్ని వర్గాలు కార్మిక, కర్షకవర్గాల పునాది ఐక్యతతో సహకరించుటగా నెంచబడింది." భారత కమ్యూనిస్టు ఉద్యమంలో చీలికలపై యీ విధమైన అభిప్రాయాలను వెలిబుచ్చిన ఇర్ఫన్‌హబీబ్, కమ్యూనిస్టు పార్టీ, తదితర వామపక్ష సంబంధాలు, ముఖ్యంగా నాయకత్వం విషయమై వెలిబుచ్చిన అభిప్రాయాలను చూద్దాము.

" కార్మికవర్గపు లేక పార్టీ నాయకత్వం విషయమై మాట్లాడునపుడు అది వొక "వడపోత" తో యేర్పడదని తెలుసుకొనాలి. వాస్తవానికి అధిక ప్రభావం వలన, ఆచరణలో అధికచొరవ, అవగాహన, నిర్మాణంలో అధిక విజయాలతోనే, అది లభించుతుంది. మాటవరసకు వామపక్ష సంఘటన సి.పి.ఐ(యం) నాయకత్వం క్రింద యేర్పడిన దాని చట్రము జాతీయ ప్రజాస్వామ్యం అయినపుడు, అది స్పష్టంగా జాతీయ సంఘటనయే అగుతుంది. అది, స్పష్టంగా నిర్వచించబడిన సి.పి.ఐ(యం) వ్యూహానికి విరుద్ధమైన దగుతుంది. వామపక్షసంఘటన స్పష్టంగా నిర్వచించబడిన సి.పి.ఐ (యం) వ్యూహానికి వ్యతిరేకమైనది అగుతుంది. అంతేగాక మొదటి విషయం, వొక పార్టీ ఇందిరా కాంగ్రెసుతో మైత్రిపై విశ్వాసం గలది, మరోపార్టీ జనతాపార్టీ యింకా అంత అంటరానిది కాలేదంటుంది. అటువంటి పరిస్థితులలో ఎన్నికలలోగాని మరో విషయంలోగాని, సహకార మైత్రి యెలా సాధ్యపడుతుంది? అట్టి పరిస్థితులలో సహకారం, మైత్రి కుప్పగా కూలిపోతుంది. అంచేత, నేను నొక్కి చెప్పదలచుకొన్నది. ప్రారంభంలో ఎట్టి షరతులు లేకుండా సంఘటన యేర్పడినా, దాని అర్థం మనం యేవిషయం మాట్లాడరాదని కాదు. మనకు మాట్లాడవలసింది. చాలా వుంటుంది. మనం శక్తివంతంగా వామపక్ష ఐక్యతను ఆచరణలో పెట్టేముందు, వామపక్ష ఐక్యత సాధించవలసిన విజయాలు, లక్ష్యాలు కనీసం స్పష్టం చేయుట ముఖ్యం, కనీస లక్ష్యాలను వివరించబడాలి."[1]

"కమ్యూనిస్టుల ఐక్యకార్యాచరణకు సంబంధించినంతవరకు, మార్క్సిస్టు-లెనినిస్టు కమ్యూనిస్టు పార్టీ ఆకార్యాచరణలో భాగస్వామి కాకుంటే, అది అసంపూర్ణమైనదిగా నేను తలంచుతానని" ఇర్ఫన్ హబీబ్ స్పష్టం చేసారు. వైఫల్యం విధానం సరియైనది కాదనుటకు గీటురాయి కాదు. సరియైన వ్యూహం ఎత్తుగడలు గల అనేక పార్టీలు వైఫల్యాన్ని చవిచూచాయి. అంచేత, నేటి ప్రభుత్వాన్ని తమ హింసా చర్యలతో కూలద్రోయుటలో మార్క్సిస్టు-లెనినిస్టు కమ్యూనిస్టుపార్టీల వైఫల్యం చెందుట, భారతదేశంలో విప్లవపరిస్థితులు లేవనుటను స్పష్టం చేయజాలదు. ఈ విషయాన్ని స్పష్టం చేయుటకు, మార్క్సిస్టు-లెనినిస్టు కమ్యూనిస్టుపార్టీల వ్యూహం వైఫల్యమే గాక, మార్క్సిస్టుల బలహీనత, ప్రజాసంఘాల బలహీనత, మార్క్సిస్టు సిద్ధాంతబలహీనత మేదావివర్గాల బలహీనత, పార్లమెంటులో యిది స్పష్టంగా విదితమైందికూడ, యీ అంశాలన్నీ గుణాత్మకమైనవి, అత్యంత ముఖ్యమైనవి, స్వీయాత్మకంగా భారతదేశంలో విప్లవకర పరిస్థితులు లేవని సూచించుతున్నవి."

---

1. ఇర్ఫన్ హబీబ్ (1979) ప్రాస్పెక్ట్స్ ఆఫ్ లెఫ్ట్ యూనిటీ పే.15

"సోషలిస్టు దేశపు ఎంత పెద్ద పార్టీయైనా, ఎంతటి చరిత్రగలదైనా విమర్శన లేక జీహో అవును అంతే అనువ్యక్తులచే చుట్టుముట్టబడినదైన, అది తప్పులు చేయుటకు దారి వేయుబడిందనవచ్చు. మన మార్క్సిస్టు-లెనినిస్టు మిత్రులు, తమజాతీయ, అంతర్జాతీయవిధానాలను పునర్విచారించుకొనవలసి వుంటుంది." అని ఇర్ఫన్ హబీబ్ వివరించారు.

జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయ విద్యార్థులనుద్దేశించి, 1973లో కా॥దామోదరన్ వుపన్యసించుతు, భారతదేశపు వామపక్షాల చరిత్రను అధ్యయనం చేయునపుడు రెండు అంశాలను దృష్టిలో వుంచుకొనాలని చెప్పినట్లు బిపిన్‌చంద్ర పేర్కొన్నారు. అవి మన వుద్యమ చరిత్ర ప్రధానంగా చేజార్చుకొన్న అవకాశాల చరిత్రగా; మార్పు, మార్క్సిస్టు అగుట అంటే అర్థం, ధైర్యంగా, నిర్భయంగా విమర్శన చేయగలిగివుండుట; అదేకాలంలో వర్తమాన కమ్యూనిస్టు వుద్యమం, గత చరిత్ర అత్యంత గౌరవప్రదంగా పరిగణించాలి. ఎంతో విశ్వాసంతో ఎంతో సాహసంతో కమ్యూనిస్టులు వుద్యమనిర్మాణ కర్తవ్య నిర్వహణ గావించారు. అంచేత, ఒకవైపు నిర్మోహమాట విమర్శనను, మరో వైపు గతంలోని, వర్తమాన కాలంలోని ప్రయత్నాలను సానుభూతితో అర్థం చేసుకొనుటకు ప్రయత్నించాలన్నారు.

ప్రజలకు వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన వొక ప్రత్యామ్నాయాన్ని ప్రత్యామ్నాయ రాజకీయాలను అందిచ్చుతుంది.లేనిచో ప్రజలు అనిశ్చిత రాజకీయ సంక్షోభంలో మునిగిపోతారు. స్వాతంత్ర్యానంతరం, స్వాతంత్ర్యోద్యమంలో జనించిన ఆశలు, సంస్కరణ కార్యక్రమాలు ప్రజలను సమీకరించాయి. జవహర్‌లాల్ నెహ్రూ సామాజిక న్యాయం, సోషలిజం, జాతిపునర్నిర్మాణం, జాతి ఆత్మగౌరవములకై విజ్ఞప్తులు చేస్తూ, దేశ, విదేశాంగ విధానాల ఆదర్శాలు నిరంతరం విస్తృతపరచారు. "గరీబీహటావో" నినాద రాజకీయాలతో 1969 తదనంతరం ఇందిరాగాంధీ ప్రజలను సమీకరించారు. ప్రజలు 1974-75లలో జయప్రకాశ్ నారాయణ చేబట్టిన "లంచగొండి ప్రభుత్వ వ్యతిరేక ప్రచారంలో" సమీకరించబడ్డారు. ప్రజాస్వామ్య పునరుద్ధరణ నినాదంతో 1977 ప్రారంభంలో ప్రజలు సమీకరించబడ్డారు. ఇందిరాగాంధీ స్థిరమైన ప్రభుత్వం న్యాయం, చట్టబద్ధత, సామాజిక న్యాయం అనే నినాదాలతో జాతిస్వాతంత్ర్యం, జాతి ఆత్మగౌరవం అనే ప్రచారంతో సమాజంలోని అట్టడుగు కులాలకు, స్త్రీలకు విజ్ఞప్తులు ప్రారంభించింది. ఈ దశలలో వామపక్షాలు ఎప్పుడూ రాజకీయ ప్రత్యామ్నాయాన్ని రూపొందించు ప్రయత్నం చేయలేదు. ముఖ్యంగా జాతీయస్థాయిలో, రాష్ట్రాలలో కొన్ని ప్రయత్నాలు జరిగినా వాటి ప్రభావం దేశ రాజకీయాలపై అంతగా ప్రసరించలేదు. అటువంటి జాతీయస్థాయి ప్రయత్నం లేకుండా వామపక్షశక్తులు, రాజకీయ నూతన శకాన్ని తీసుకొని రాజాలవు. సోషలిజం, సామాజిక విప్లవం, సామాజిక మార్పు తక్షణ వాస్తవికతగా కనీసం అవకాశం కలదానిగా, మౌలిక మార్పులకు ముందు అనుసరించవలసినదిగా ప్రజల ముందుంచుటలో వైఫల్యం స్పష్టం. అట్టి రాజకీయచైతన్యాన్ని కలిగించుటలో వెనుకబాటు తనము స్పష్టంగా కానవస్తుంది. వామపక్షశక్తులు 1950లో బలహీనంగానే వున్నవి. అయినా,

కమ్యూనిస్టులు, సోషలిజం, కాంగ్రెసు, జవహర్‌లాల్ నెహ్రూ విఫలమైతే ప్రత్యామ్నాయ రాజకీయశక్తులుగా ప్రజలు తలచారు, ఆశించారు. ప్రజలు అది వొక వాస్తవ రాజకీయ ప్రత్యామ్నాయంగా కాకపోయినా, కనీసం అట్టి అవకాశాలు భవిష్యత్తులో చూడగలిగారు. అంతేగాక, కమ్యూనిస్టులు, సోషలిస్టులు కూడ ఆవిదంగానే తలచారు.

ఈవిధంగా, వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన, వామపక్ష ఐక్యతా నినాదాల మరోపార్శ్వం, రాజకీయ ప్రత్యామ్నాయ నిర్మాణాంశాన్ని వెలుగులోనికి తెచ్చి, అది ఎన్ని సంవత్సరాలు పట్టినా, ప్రయత్నించుట ముఖ్యాంశమగుతుంది. ఇది 1977మార్చి నుండి కొంతవరకు సాధ్యమైన కర్తవ్యంగా నెంచబడింది. ప్రజలు వారి అంతటవారే ప్రత్యామ్నాయానికి ఎదురు చూస్తున్నారు. ఇందిరా కాంగ్రెసు, రాజకీయ ఆధిక్యతగల పెత్తందారి తనం మార్చి 1977లో అంతరించినా, జనతా "కలగూరగంప" ఆధికత్యత బలమైనదిగా నిలబడజాలక పోయింది. ఈ తాత్కాలికంగా నాయకత్వ లోపాన్ని వామపక్షశక్తులు, రాజకీయపురోగమనానికి వినియోగించుకొనజాలక పోయాయి. జులై-ఆగష్టు 1977లలో విలువైన కాలాన్ని వృధా చేసుకొన్నవి. ప్రజాభిప్రాయం, చైతన్యం రూపొందించే మార్గాలు అతిత్వరగా మూసివేయబడినని. రాజకీయకళానైపుణ్యంకొరవైంది. ఆర్థిక, రాజకీయాంశాలపై జరిగే స్థానిక ప్రజాపోరాటాలకు అఖిలభారత ప్రజోద్యమాలుగామలచి, వామపక్ష ప్రజాస్వామ్యశక్తుల ఐక్యతా మార్గంలో పురోగమించే మౌలిక ప్రధాన కార్యక్రమం మృగ్యమైంది. అనేక సంవత్సరాలు వామపక్ష రాజకీయాలను వాంఛించేవర్గాలు, నాయకత్వ వైఫల్యాలతో విచారంలో మునిగిపోయారు. నాయకత్వంలో గుణాత్మకమైన మార్పులు లేక సంస్కరణలతోనే భవిష్యత్తులో ఎంతవరకు యిదిసాధ్యమో చూడవలసి వుంది.

ఒక నిర్ధిష్ట కార్యక్రమం, కోర్కెల ప్రణాళిక, ఎంత మేధావివంతం, సమర్థతగల నాయకత్వమైనా పైనుండి మాత్రమే రూపొందించజాలదు. ప్రజాకార్యాచరణ, పోరాటాలనిర్ధిష్ట ఆచరణలోనే అవి రూపొంది, నాయకత్వంచే సమగ్ర స్వరూపం పొందాలి. వామపక్షం మొత్తంగా, సమగ్ర దృక్పదాన్ని కలిగిలేదు. వ్యూహాత్మక లక్ష్యాలు, విప్లవదశలు; జాతీయ విముక్తి, జాతీయ ప్రజాస్వామ్యం, జనతా ప్రజాస్వామ్యం, సోషలిజం పేర్కొనబడుతున్నవి. కాని ఆలక్ష్యాలను చేరుటకు నిర్ధిష్ట యంత్రాగంపై సమగ్ర అవగాహన, తదనంతర దశ దృక్పధాలలో వైఫల్యం కన్పదుతుంది. నేటి రాజకీయ ఆచరణ, తదనంతర దశ లేక మరో దశకు యేవిధంగా సమన్వయం చేయబడినదో అనే విషయంపై స్పష్టతలేదు. వామపక్ష ప్రజాస్వామ్యసంఘటన జరిపే పోరాటాలు ఆవిధమైన దృక్పధం రూపొందుటకు తోడ్పడాలి. మన వ్యూహ లక్ష్యాలలో యేది సరియైనది అనే ప్రశ్నను నేడు లేవనెత్తవలసిన అవసరంలేదు. వివిధ వ్యూహ లక్ష్యాలను ఆచరణ ప్రయోగశాలలో నిర్ధిష్ట పరిస్థితులలో, వాటిని ప్రయోగించి పరిశీలించుటకు తగిన పరిస్థితులను రూపొందించుట వామపక్షాలు ప్రయత్నించవలసివుంటుంది. ఆవిధంగా, నేటికి రేపటికి తగిన, సరైన దృక్పధం రూపొందుటకు తోడ్పడవలసి వుంది. అంతతేలికగా వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన సోషలిజం, జనతా ప్రజాస్వామ్యం, జాతీయ ప్రజాస్వామ్యం

ఆవిష్కరించబడదు. వామపక్ష శక్తులు మహోన్నత ప్రజోద్యమాలకు, పోరాటాలకు కావలసిన శక్తులను రూపొందించుటకు మార్గాలను విశదీకరిస్తుంది, తదనంతర సామాజిక విప్లవ దశ పురోగమనానికి సంలీన సంబంధాలను యేర్పరచుతుంది. ఆవిధంగా నిర్దిష్ట రాజకీయ ఆచరణలో. సమగ్ర అనుభవాలతో, ఆచరణ సాధ్యమైన విప్లవవ్యూహం, నాయకత్వంచే రూపొందించబడుతుంది.

వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనలో పెట్టుబడిదారి పంథాలో అభివృద్ధి కొనసాగించుటను వ్యతిరేకించే అన్ని పార్టీలు, గ్రూపులు. వ్యక్తులు అందరితో కలసి యేర్పడుతుంది. అంటే, వొక విధమైన ప్రజాస్వామ్య సోషలిజాన్ని ఆమోదించేవారు, స్వాతంత్ర్యాన్ని పరిరక్షించాలనేవారు, దానిని రాజకీయ ప్రజాస్వామ్యానికి, పౌరహక్కులకు, విదేశాంగ విధానానికి విస్తరింపజేయాలనే సామ్రాజ్యవాద వ్యతిరేక, శాంతి శక్తులు అన్నీ నేటి రాజకీయ పరిస్థితులలో కలిసివస్తాయి. ఈ సంఘటనను ఏర్పాటుచేయుటలో నేటి కమ్యూనిస్టు పార్టీలు ప్రధాన పాత్ర వహించవలసిఉంటుంది. కాని ఏవొక్క పార్టీ ఆధిక్యత లేక నాయకత్వం వహించే ప్రశ్నయే లేదు. అంతేగాక ప్రతి పార్టీ, గ్రూపు, వ్యక్తి తమతమ సామ్రాజ్యవాద వ్యతిరేక పంథాల దృక్పధాలతోనే కలిసి. విస్తృత ఆమోదం పొందిన ప్రత్యామ్నాయ రాజకీయ, సామాజిక, సాంస్కృతిక. ఆర్థిక కార్యక్రమాలకై కలసిపోరాడుతారు.

మన పరిస్థితులలో వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన సామాజిక పొందిక లేక కూర్పు, నిర్ణయించటకష్టమైన పనికాదు. కార్మికవర్గము, గ్రామీణ వ్యవసాయ కూలీలు, పేద, మధ్యతరగతి రైతులు, విద్యార్థి యువకులు. మేధావివర్గాలు, వివిధ సాంకేతిక, చేతివృత్తులవారు, నగర బడుగువర్గాలు, పేదలు, మధ్యతరగతిరైతులు, విద్యార్థి యువకులు, మేధావివర్గాలు, ఆఫీసులలో పనిచేసే అనేకమంది, ఉపాధ్యాయులు, న్యాయవాదులు, ప్రతికారచయితలు, ఇంజనీర్లు, డాక్టర్లు, కొట్టుగూమాస్తాలు, చిన్నషాపుల వ్యాపారులు సంఘటన కార్యక్రమం, రాజకీయాలతో ఆకర్షితులైన వారందరూ సంఘటనలో చేరుతారు, వుంటారు. సైనిక, పోలీసు ఆఫీసరులు, క్రింది సాధారణ శ్రేణులు సానుభూతి తెలుపుతవి. రాజకీయాలకు దూరంగా వుండే వారి సాంప్రదాయాన్ని కొనసాగిస్తూనే సానుభూతిని తెలుపుతారు. అదేవిధంగా, పౌరసర్వీసులలోని నిజాయితీ పరులు యీ విధమైన అభివృద్ధికి సంతసించుతారు. అదేవిధంగా చిన్న పారిశ్రామికులు, వ్యాపారులు బలపరుస్తారు.

వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనలోని భాగస్వామ్య పార్టీలు గ్రూపులు, వ్యక్తుల మధ్య నిజమైన, పరస్పర సహకార, మైత్రి, సౌభాతృత్వాలు వెల్లివిరవాలి, వారి లక్ష్యం, ధ్యేయం సంఘటనను బలవత్తరం చేసేదిగా, దానిని అభివృద్ధి పరచేదిగా వుండాలి గాని, దానిని విచ్ఛిన్నచేసి. యితరపార్టీలను బలహీనపరస్తూ, తాను బలపడు నీచ

ఎత్తుగడలతో చేరరాదు. అదేకాలంలో, నిజమైన విప్లవ, వర్గ రాజకీయశక్తుల అభివృద్ధికి తోడ్పడునదిగా వుండాలిగాని, దానిని అడ్డుకొని బలహీనపరచేదిగా వుండరాదు. అంటే వొకవైపు విప్లవశక్తుల అభివృద్ధి, మరొవైపు నిజమైన సౌభాతృత్వ పరస్పర సంబంధాల అభివృద్ధి జరగాలి, సంఘటనాభివృద్ధికి భాగస్వామ్య పార్టీలు, గ్రూపులు, వ్యక్తులు మిత్రులుగా, శతృభావం విడనాడిపోటీపడాలి. ఎవరు తప్పో, ఎవరు వొప్పో చారిత్రిక ఘటనల అభివృద్ధికి వదలివేయాలి. ఒకటి మాత్రం స్పష్టం, వామపక్ష ప్రజాస్వామ్యసంఘటనలోని పార్టీలు తమ నిర్మాణాలను బలపరచుకొనుట, విస్తరించుటకు వ్యతిరేకంకాదు, కానియేపార్టీ సంఘటనలోని వొక పార్టీని బలహీనపరచి, తానుబలపడే ఎత్తుగడలను వొప్పుకొనదు. అయితే స్నేహ పూర్వక వొప్పించే విధానంలో జరిగే విమర్శలను ఆమోదించుతుంది. భారత సమాజ నైజము, ఆర్థికవిధానం, రాజ్యాంగయంత్రం, రాజకీయాలపై అందరి ఆమోదంపొందిన వొప్పందాంశాలపై ప్రస్తావించుతుంది. భారతదేశ విప్లవపంథా, విప్లవశక్తులు, వ్యూహం, ఎత్తుగడలు, విప్లవదశలు గురించిన ప్రశ్నలు లేవనెత్తదు.

వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనను, సైద్ధాంతికంగాకాని, ఆచరణలోకాని విప్లవకర్తవ్యాలను త్రోసిబుచ్చేదిగాను, దాటవేసేదిగాను, ప్రక్కదారిపట్టించే సాధనంగా పరిగణించరాదు. అంతేగాక, సంఘటనను అసెంబ్లీ, పార్లమెంటు ఎన్నికల పోరాటాలు జరిపే సాధనంగాను ఎంచరాదు. దేశంలో వొక నూతన ప్రజాస్రవంతికి నాందీ ప్రస్తావన కావాలి.

ఒక్కమాటలో వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనలో భాగస్వామ్య పార్టీలన్నీ పరస్పరం స్నేహపూర్వక, విమర్శనా వైఖరిని, పరస్పరం సరిదిద్దుకొంటూ అభివృద్ధి చెందుటకు, సంఘటన రాజకీయ ప్రజాకార్యచరణను పెంపొందించాలి.

భారతదేశంలోని సంక్లిష్ట సామాజిక స్వరూపం దృష్ట్యా, వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనా నిర్మాణం, తద్వారా సామాజిక విప్లవం వైపు పురోగమించుట, గతంలో భారత వామపక్ష శక్తులు అవగాహనను పెంపొందించుకొనుటలో విఫలమైనందున, యీ కర్తవ్యం క్లిష్టతరమైంది. ఈ కర్తవ్యనిర్వహణకు అత్యున్నత స్వతంత్ర వివేచన, బహిరంగ సమాలోచన, హృదయపూర్వకపరస్పరసహనము, ప్రజల విప్లవశక్తిపై అచంచల విశ్వాసం అవసరము. పరిస్థితుల సంక్లిష్టతను, కర్తవ్యాలకొన్నింటి ద్వంద్వనైజాన్ని తెలుసుకొన్నచో మన అవగాహన విస్తృతి పెరుగుతుంది.

వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనపై యీ విధమైన అభిప్రాయాలను వెలిబుచ్చిన బిపిన్‌చంద్ర కర్తవ్యాలను గురించి ప్రత్యేకంగా యీ క్రింది అంశాలు పేర్కొన్నారు. క్లుప్తంగా అవి యిలా వున్నవి.[1]

*1. బిపిన్ చంద్ర (1979) ప్రోస్పెక్ట్స్ ఆఫ్ లెఫ్ట్ యూనిటి సింపోజియం పే. 38-41.*

1) నియంతృత్వం, ఫాశిజం, మరొకటి అయినా రూపొందకుండా మనం చూడాలి. సంఘటనను దానికే పరిమితం చేస్తే, బూర్జువా రాజకీయాల పరిధిలోనే వుంచినట్లవుతుంది. కాన, అదేకాలంలో విప్లవశక్తుల పురోగాభివృద్ధి పెంపొందించాలి. అవే మధ్యంతర దశల ద్వారా దేశాన్ని సోషలిజం వైపు తీసుకొని వెళ్ళగలవు.

2) ప్రజల కనీస కోర్కెలకై పోరాడుతు, అదేకాలంలో గ్రామపంచాయితీ, మునిసిపాలిటి, రాష్ట్రాలలో అధికారం కొరకు జరుగేపోరాటలతో సంలీనం చేసి, ప్రజాచైతన్యాన్ని పెంపొందించే లక్ష్యంతో విస్తృత రాజకీయపోరాటాలు జరపాలి. ప్రజలు కొన్ని రాయితీలను పొ.దగలుగుతారు, అవి యెంత స్వల్పమైన వైనా కావొచ్చు, అవిప్రజాచైతన్యాన్ని, పోరాట శక్తిని పెంపొందిస్తాయి. అదేకాలంలో భారతసమాజం గత దశాబ్దాలుగా అభివృద్ధి చెందుతున్న పంధాలో మౌలికమార్పులుకై ప్రయత్నిస్తూ, ఆచరణలో సోషలిజం వైపు పురోగమించే పంధాచేబట్టుతాము.

3) కార్యక్రమం నేటికి సంబంధించినదై వుండాలి. ప్రజలు దానిని వూహాజనితంగా నెంచరాదు. ప్రజా రాజకీయచైతన్యాన్ని, సమీకరణను పెంపొందించుకు అది ప్రాతిపధికగా వుండాలి. ప్రజాస్వామ్యం, సోషలిజంకై జరిగే పోరాటానికి అనుసంధించబడాలి. మరోమాటలలో మార్పుకు లోనయ్యే తాత్కాలికనైజం, స్వరూపం కలిగి వుండాలి.

4) వామపక్షాలు, గ్రూపులు కార్మికవర్గాన్ని పునాదిగా చేసుకొనాలి. దోపిడికిలోనయ్యే వ్యవసాయ కూలీలు, పేదరైతులు, గుమస్తాలు వగైరాలను నిర్మాణాలలో సమీకరించాలి. ప్రజలశక్తిని, చొరవను విడుదల చేయాలి. ప్రజల ధైర్యసాహసాలన్నీ పెంపొందించి వుత్సాహపరచాలి. ఇదే మౌలిక కర్తవ్యం, అదేకాలంలో జాతి నాయకులుగా రూపొందాలి. నాయకత్వం వహించుట అంటే అర్థమిది.

5) వామపక్ష. ప్రజాస్వామ్య సంఘటన; పెటీ బూర్జువా నాయకత్వ ప్రభావంలోపడకుండా, తన కార్యక్రమం, రాజకీయాలు దాని అవసరాలకే పరిమితం కాకుండా పెటీబూర్జువా మెజారిటిని తమ పక్షాన సమీకరించాలి. చిన్న, మధ్యతరగతుల రైతులను శతృవులుగా చేసుకొనగుండా, సంఘటన వ్యవసాయ కూలీలను, పేదరైతులను పునాదిగా చేసుకొనాలి. అణచబడిన వర్గాల, కులాల సమస్యలను చేబట్టాలి.

6) సంక్షిప్త పరిస్థితిలో పరిపక్వ అవగాహన, ఆచరణ అవసరము. జాతీయ, అంతర్జాతీయ పరిస్థితి సత్వర చర్యను కోరుతుంది.

7) సోషలిస్టు విప్లవ పరిణామాలకు అనువగు పరిస్థితులు రూపొందించుటకు విప్లవ పార్టీలు, గ్రూపులు పోటీపడుతూ, అదేకాలంలో తమనిర్మాణాలను, రాజకీయవిధానాలను అభివృద్ధి పరచుకొనాలి. పరస్పరం స్నేహసంబంధాలను పెంపొందించుకొంటూ వొంటెత్తు పోకడలు విడనాడాలి.

8) వామపక్షశక్తుల ఐక్యసంఘటనలోని ప్రజాస్వామ్యశక్తులతో గల ఐక్యత రాజకీయ

నిజాయితీ, నైతికతపై ఆధారపడివుంటుంది. పరస్పర రాజకీయాభిప్రాయాలను గౌరవించుట అవసరం అదేకాలంలో స్నేహ పూర్వకవిమర్శనకు స్వతంత్ర్యం ప్రతిపార్టీకి వుంటుంది. మన బలహీనతలను అధిగమించుటకు వారిని వుపయోగించుకొనే లక్ష్యంతో ఐక్యం కారాదు. సంఘటనలోని భాగస్వాములను బహిరంగంగా ఖిన్నపరచరాదు. వారిని గౌరవించుట, వారి రాజకీయాలను సమన్వయం పరచుకొనుట, కొంతవరకైనా చేయుట, సంఘటన లక్ష్యంకు తోడ్పడుతుంది. సంఘటనపేరుతో సోషలిస్టు చైతన్యాన్ని పెంపొందించుటలో అశ్రద్ధతగదు. అదేవిధంగా వర్గశక్తులబలాన్ని పెంపొందించుటలో, ప్రజాసంఘాల నిర్మాణంలో అశ్రద్ధవహించరాదు.

చివరిఅంశం, రాజకీయపరిణామాలు అత్యంతవేగంగా మారుతున్నపుడు, సంక్షోభపరిస్థితులలో, సరియైన రాజకీయ విధానాన్ని చేబట్టుటయేగాక, శక్తివంతంగా, సమర్ధతతో ముందుకు తీసుకొని పోవుట అత్యంత ప్రాధాన్యత వహించుతుంది. నింపాదిగా పార్టీ కాంగ్రెసులలో నిర్ణయాలు తీసుకొనువరకు చారిత్రికపరిణామాలు ఆగవు, ఆలస్యంగా సంఘటన రూపొందిన ఆశించిన ఫలితాలను యివ్వజాలదు, పైగా వైరుధ్యాంశాల ప్రాబల్యం పెరిగిపోవచ్చు. ఈ పోరాటం విజయం వరకు అనంతంగా సాగుతుంది. తదనంతరం కూడ నూతన రూపంలో కొనసాగుతూనే వుంటుంది. ఇదే మనకు చారిత్రిభౌతిక వాదం నేర్పే పాఠం.

జి.యస్. భల్లా అభిప్రాయంలో వామపక్ష ఐక్యతకు "ప్రధమ సోపానం. రెండు కమ్యూనిస్టుపార్టీల సి.పి.ఐ; సి.పి.ఐ(యం) మధ్య ఐక్యత", యిది అందరూ అంగీకరించే విషయము. ఈ ఐక్యతను తదనంతరం యితర వామపక్షపార్టీలకు, గ్రూపులకు, యితర రాజకీయపార్టీలలోని వామపక్షశక్తులకు విస్తరించవలసి వుంటుంది. భారతపరిస్థితులలో వామపక్ష ఐక్యత, విస్తృత ప్రజాస్వామ్య ఐక్యసంఘటనను రెండు కమ్యూనిస్టుపార్టీలను వొక అవగాహనతో దగ్గరకు చేర్చబడనిచో, నిర్మించుట అసాధ్యమగుతుంది. ఈసందర్భంలో "సి.పి.ఐ; సి.పి.ఐ(యం)ల మధ్య ముఖ్య మౌలికసైద్ధాంతిక భేదాభిప్రాయాలున్నవని" గుర్తుచేసారు. కె.యం. ఛెనాయ్ రెండు పార్టీల మధ్యగల భేదాభిప్రాయాలను ప్రస్తావిస్తూ, రెండూ వామపక్షపార్టీలని, ప్రధానంగా జనతా ప్రజాస్వామ్య సంఘటనా, జాతీయ ప్రజాస్వామ్యసంఘటనా అనే వ్యూహాత్మక భేదాభిప్రాయం మౌలికమైనదన్నారు. ఇదీ అందరూ అంగీకరించేదే. మార్క్సిస్టు లెనినిస్టు సైద్ధాంతిక దృక్పధంలో పరిశీలించితే రెండు పార్టీలు, ముఖ్యంగా సి.పి.ఐ కూడ ప్రజాస్వామ్యసంఘటన నాయకత్వంలో గుత్తపెట్టుబడిదారివర్గం భాగస్వామిగా వుండాలనుటలేదు. అంతేగాక బూర్జువా వర్గం మొత్తంగా పరిగణించినపుడు దాని విప్లవపాత్ర చాలా తగ్గిపోయిందని రెండు పార్టీలు గుర్తించాయి. ప్రజాస్వామ్య సంఘటనలో జాతీయ బూర్జువావర్గానికి స్థానముందనికూడ రెండు పార్టీలు గుర్తించాయి. జాతీయ బూర్జువా వర్గంలో సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక శక్తులున్నవని, ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాల పరిపూర్తికి-శేషకర్తవ్యాలు కావచ్చు-ఆశక్తులు తమవంతు పాత్ర నిర్వహించుటకు సంఘటనలో చురుకుగా పాల్గొనగలవని తలచినపుడు, నాయకత్వంలో

ఆధిపత్య నిర్ణయాత్మక పాత్ర కాక, పదుగురితో కలసిన భాగస్వామ్యులు చేయుటకు అంతగా అభ్యంతరముండరాదని సి.పి.ఐ అవగాహన కాగా, జాతీయ బూర్జువావర్గంలో ఎవరితోను నాయకత్వాన్ని పంచుకొనరాదని సి.పి.ఐ(యం) సైద్ధాంతిక అవగాహన గావుంది. ఒకటి ఆచరణను ముందుకు తీసుకొనిపోయే అవగాహన కాగా, మరొకటి ఆచరణను వెనుక నెట్టివేయు అవగాహన, పిడిసూత్రంగా వుంది.[1]

దేశంలో వాస్తవ పరిస్థితియేమిటి? వామపక్షాల వెన్నెముక అయిన కార్మికవర్గం కమ్యూనిస్టుపార్టీల జెండాల క్రింద, ఆర్థిక కోర్కెలకై పోరాడుతుంది. అదే కాలంలో ప్రధానంగా బూర్జువా వర్గానికి వోటు చేస్తున్నది. అంటే కార్మికవర్గం నగ్న ఆర్థిక వాదాలనుండి బయటపడలేదని, రాజకీయ, వర్గ చైతన్యాలకు యింకా దూరంగా వుందని అర్థం. మరోమాటలలో బూర్జువావర్గ అధిపత్య నాయకత్వంలో వుందని స్పష్టం. ఇదీ, ప్రధానంగా కమ్యూనిస్టు వుద్యమం ఛేదింపజాలకపోయింది, ఆచరణలో పరిగణలోనికి తీసుకొనజాలకపోయింది. ఈ విషయమై కమ్యూనిస్టు సాహిత్యంలో ఎంతో పునశ్చరణ చేయబడింది కాని ఆచరణాత్మక వివరణ లేకుండా, పిడిసూత్రమైంది. ప్రజాకార్యాచరణ, ప్రధానంగా మౌలికవర్గాలలో అనుభవాలద్వారానే వివరణ, ఆచరణ ప్రాతిపధికలభించుతుంది. అందుకు ప్రజాపంధా అనుసరించాలి. ఇంతవరకు అనుసరించిన పంధా పెటీ బూర్జువాలతో కలసి అసెంబ్లీ పార్లమెంటులలో కొన్ని సీట్లు సంపాదించుట, యిది నగ్న పార్లమెంటేరియ నిజం. ఇంతవరకు పెటీ బూర్జువా పార్టీలైన కేరళ కాంగ్రెసు, అకాలీపార్టీ, బంగ్లాకాంగ్రెసు, ఎడియంకె, డి.యం.కె, కాంగ్రెసు, కాంగ్రెసు(ఐ), జనతపార్టీ, తెలుగుదేశంలతో కలసి కమ్యూనిస్టులు మొత్తంగా 25-35 పార్లమెంటు స్థానాలు గెలుపొందగలిగారు. కమ్యూనిస్టువుద్యమం అంతగా పార్లమెంటేరియనిజంలో దిగిపోకుండా వుండలేదా? పార్లమెంటును వొక వేదికగా పరిగణించువరకు అభ్యంతర ముండదు. అయితే కమ్యూనిస్టుపార్టీ పార్లమెంటులో తమ వునికిని స్వర్ణోత్సవంగా జరుపుట అర్థం చేసుకొనుట కష్టము. విప్లవ వర్గాలను సమీకరించుటలో రెండు కమ్యూనిస్టుపార్టీల వైఫల్యం చారిత్రిక సత్యం. పశ్చిమబెంగాల్‌లో సి.పి.ఐ(యం) దగ్గరిదగ్గరిగా రెండదశాబ్దాలుగా రాష్ట్ర పాలన చేస్తున్నది. కార్మికవర్గానికి సరైన ప్రాతినిధ్యంలేదనే విమర్శన వుంది. సి.పి.ఐలో కూడ, నాయకత్వవర్గాలలో వుండవలసినంత ప్రాతినిధ్యంలేదని, నివేదికలే స్పష్టం చేస్తున్నవి. పార్టీలో తరచుగా మితవాద, అతివాద సంస్కరణవాదాలు తలెత్తుటకు యింతకంటె కావలసిన వర్గాల ప్రాతిపధికయింకేమి అవసరములేదు.

వామపక్ష ఐక్యతా వ్యూహాన్ని, నివేదిక, తీర్మానాలు, సిద్ధాంత వివేచనలతోనే రూపొందించజాలము అది వొక్క విస్తృత ప్రజాకార్యాచరణ ద్వారా మాత్రమే సాధ్యమగుతుంది. ఈ ఐక్యతపై నుండి గాక ప్రధానంగా క్రింది నుండే రూపొందించబడాలి. కాన, కార్మిక, కర్షక, యువజన విద్యార్థి సమస్యలపై ప్రజాసమీకరణ

*1. భల్లా, జి.యస్ (1979) ప్రాస్పెక్ట్స్ ఆఫ్ లెఫ్ట్ యూనిటి సింపోజియం పే.61.*

కావించుట, ఐక్యపోరాటాలు జరుపుట రెండు కమ్యూనిస్టు పార్టీల కర్తవ్యం. ప్రజల సమీకరించి ఐక్యతా వ్యూహాన్ని, కార్యక్రమాన్ని రూపొందించి, వామపక్ష ఐక్యతా ధ్యేయాన్ని చేరుకొనాలి.

రాహుల్ జలాని కూడా జి.యస్. భల్లా వలెనె వామపక్ష ఐక్యతకు కార్మికోద్యమ మౌలిక సమస్యలపై వివరణలభించవలసివుంటుందని అన్నారు. రెండు కమ్యూనిస్టుపార్టీల ధ్యేయాలు, ఆచరణ, జయాపజయాలపై తీవ్ర చర్చల అవసరమెంతోవుంది. వామపక్ష ఐక్యత, జనతా ప్రజాస్వామ్య పంథా, లేక జాతీయ ప్రజాస్వామ్య పందాయా అని చర్చించేటప్పుడు, అసలు పొరపాట్లుయేమిటి అని ఆలోచించవలసివుంది. ఈ సమస్యలు, ప్రశ్నలకు సమాధానాలు వివరించవలసివుంది, అయితే అవి వుత్తరోత్తరదశలలోనే లభించగలవు. మెట్లమొదటి ప్రధానకర్తవ్యం, సైద్ధాంతిక విశ్లేషణకు ముందు చేబట్టవలసినది, రెండు కమ్యూనిస్టుపార్టీల ప్రజాసంఘాల సమీకరణపునాదిగా సంయుక్త పోరాటాలను సాగించాలి. ఆ సంయుక్త పోరాటాల క్రమంలోనే సరియైన నిర్దిష్ట కార్యక్రమం రూపొందుతుందని జలాని ధృదతర అభిప్రాయము.[1]

షఫీక్ నక్వి, గతంలో వామపక్ష ఐక్యతా ప్రయత్నాలు విఫలమగుటకు గల కారణాలను యిలా పేర్కొన్నారు. (1) తమ తమ విధానాలే సరియైనవనే ఆత్మవిశ్వాసం (2) రెండు పక్షాలు మరోపక్షం తమ కాళ్ళముందు సాష్టాంగపడాలనే, బయటకు వుచ్ఛరించనికోరిక 3) నిరవధిక, కంట్రోలు లేని, వుద్రేకపూరిత, యేమాత్రం సహన, సౌభాతృత్వాలు లేని పరస్పరదాడులు, నిందారోపణలు, యిద్దరినైజంగారూ పొందుట ప్రధానాంశాలు. రెండు ప్రధాన బూర్జువా భూస్వామ్య పార్టీలు కలుగజేసిన భ్రమలతో, రెండు ప్రధాన వామపక్షాలు, ఎన్నికలలో యేదోవిధంగా కొన్ని స్థానాలలో గెలుపొందాలనే ప్రధాన లక్ష్యంతో, బూర్జువా వ్యూడలు కూటములయేదో వొక కూటమిని అనుసరించాయి.[2]

అంతేగాక, తన వుద్దేశ్యం ప్రకారం, ప్రదాన పోరాటాలను సంయుక్తంగా నడిపే కార్యాచరణ మొదట ప్రారంభించాలి. అంతేగాని, ప్రజాసమ్యలపై ఐక్యకార్యాచరణకు ముందే మౌలిక సమస్యలపై వొప్పందం కుదరాలని తలచరాదు. ఈ సమస్యపై చర్చ జరిగిన ప్రతిసారి, ఒక పక్షం యేక పక్ష దృక్ఫధాన్ని చేబట్టితే, రెండో పక్షం కూడ అదేవిధంగా మరోయేకపక్ష అవగాహననే తీసుకొన్నది, ఫలితం ప్రయత్నవైఫల్యం. ఐక్యసంఘటన ప్రజాపోరాటాలలో పాల్గొన్నందున యేర్పడే సమిష్టి అవగాహన, వివిధ స్థాయిలలో జీవిత వాస్తవాలను, సామాజిక సత్యాలను వెలుగులోనికి వచ్చుట చిన్న తగాదాలను నివారించి ఐక్యతా అవగాహనకు తోడ్పడేవి. ఇట్టి చర్చలు సంప్రదింపులు జరుగునపుడు ముందు షరతలు విధించబడితే, దృక్పధం సమిష్టి అవగాహనకు చిక్కులు యేర్పడుతవి.

ఫలితంగా ఏవిధమైన వొడంబడిక సాధ్యపడలేదు. అని నక్వీ వివరించారు. మరో ముఖ్యాంశాన్ని చెప్పాలంటూ, గత కొన్ని దశాబ్దాలుగా, అంతర్జాతీయ రాజకీయాల

1. రాహుల్ జలాని *(1979)* ప్రాస్పెక్ట్స్ ఆఫ్ లెఫ్ట్ యూనిటీ పే. *78-9*
2. రాహుల్ జలాని *(1979)* ప్రాస్పెక్ట్స్ ఆఫ్ లెఫ్ట్ యూనిటీ పే. *81*

యెడలవైఖరి, భారతపరిస్థితి విశ్లేషణ, ఆర్థికాంశాలవిశ్లేషణ అంటూ "మంత్రాలను పునశ్చరణ" చేయుట తప్ప, నిరవధిక విశ్లేషణ. పరిశీలన, భారత రాజకీయపరిస్థితి, భారత ఆర్థికస్థితి. భారతసమాజం, మార్పులు, అంతర్జాతీయ మార్పుల నేపథ్యంలో జరుగలేదు. ఈ అధ్యయన క్రమమే కాలం గడచిన కొద్దీ, తప్పులను సరిదిద్దగలదు. అని నక్వీ మరికొంత వివరించారు.

ఇర్ఫన్ హాబీబ్ సింపోజియంలో వచ్చిన ప్రశ్నలకు సమాదానం చెప్తూతూ, సి.పి.ఐ; సి.పి.ఐ(యం)లు బూర్జువా పార్టీల యెడల అవలంభించిన ఐక్యసంఘటనా యెత్తుగడలలోని భేదాలను యీ క్రిందివిధంగా వివరించారు. కాంగ్రెసు యెడల సి.పి.ఐ వైఖరి నిర్మాణాత్మక సహకారం. ఐక్యత, ఐక్యసంఘటన వైపు దారితీసే పంథా, ఇందిరాగాంధీ సహాయంతో జాతీయ ప్రజాస్వామ్య నిర్మాణము. జనతా పార్టీ యెడల సి.పి.ఐ(యం) దృక్పథం కుదించుకుపోయే ఐక్యత, పెరిగే ప్రత్యర్థివ్యతిరేకత. జనతాపార్టీలో సంక్షోభం పెరిగిన కొలదీ చివరకు పూర్తి వ్యతిరేకతగా స్పష్టమైంది. సంక్లిష్ట రాజకీయపరిస్థితులలో పార్టీ స్వతంత్ర ఎత్తుగడలు తాత్కాలికంగా విమర్శకులోవైనా, జనతాపార్టీ యెడల సి.పి.ఐ(యం) సుముఖవైఖరి, కాంగ్రెసుపార్టీ యెడల సి.పి.ఐ సుముఖవైఖరులలో గల బేధాలను ప్రదానంగా పరిగణించాలని, సమాధానం చెప్పారు. చివరి అంశంగా, కమ్యూనిస్టు ఐక్యత నిర్మించే ముందు, కమ్యూనిస్టుపార్టీల నేటి నాయకత్వాన్ని తొలగించివేయాలనే కొందరిమిత్రుల అభిప్రాయాన్ని ఖండించుతూ, కమ్యూనిస్టుపార్టీల మధ్య సహకారాన్ని మరింతకష్టతరం, అసాధ్యం చేస్తున్నారు. క్రింది కమ్యూనిస్టుశ్రేణులను, నాయకత్వాలను పోగుడుట, క్రింది నుండి ఐక్యతను నిర్మించాలనుట మాటలలో చక్కగానే కన్పదుతుంది. దానికి ఎటువంటి ఆచరణ ప్రాముఖ్యతలేదు. పైగా, పార్టీలో దురభిప్రాయాలను కలుగచేస్తున్నారనే వైఖరి ప్రబలితే అసలు ధ్యేయమైన ఐక్యసంఘటనకే ముప్పు వస్తుంది. అని అన్నారు.

మరో విషయం, కార్మికవర్గ నిర్మాణ సంస్థ అంటే ఏమిటి అనే విషయంలో కూడ అస్పష్టత చోటు చేసుకొన్నది. ఒక వ్యక్తి తాను కార్మికవర్గ సంస్థను నిర్మాణం చేస్తున్నానని అనుకొనవచ్చు, మరొకరు దానిని పెటీ సంస్కరణ సంస్థగా, ఇంకొకరు పెటీబూర్జువా సంస్కరణవాద సంస్థగా అనవచ్చు. కాన, కార్మికవర్గం అంటేయేమిటి? కార్మికవర్గ నిర్మాణసంస్థ అంటే యేది? ఇదీ కూడ చర్చనీయాంశమైంది. ప్రజల సంఘం కార్మికవర్గ సంఘం అవుతుందా? సిటు,ఎ ఐటియుసి లు కార్మికసంఘాలా? కార్పొరేషనులగురించి ప్రస్తావించునపుడు, తాత్కాలికంగా యివి కూడ ప్రశ్నలుగా నెంచాలి. కార్మికవర్గపు, కార్మికుల మనోవిదులలో యీ ప్రజాసంస్థలు కార్మికసంస్థలుగా ఆమోదించుదాము.

ఈ విషయాలలో, కొంత సందేహానికి తావిచ్చినా, అవి అన్నీ మార్క్సిస్టు లేక కమ్యూనిస్టుసంస్థలు. ఆవిధంగానే గుర్తించి గౌరవిద్దాము. భవిష్యత్తులో సహకారం నెరపువిషయంగా వాటి నేటి నాయకత్వాలను త్రోసిబుచ్చుటగాదు, అదివొక షరతుగా పేర్కొనుటగాదు పైగా అన్ని కమ్యూనిస్టులు పార్టీలు, గ్రూపులతో వుత్సాహంగా సహకారాన్ని నెరపుట ముఖ్యము.

వామపక్ష ఐక్యతా నిర్మాణానికి, నేటి పార్టీలలో పొరపాటులు సరిచేయబడాలని, రాజకీయ పరిష్కారంగా వాటి నాయకత్వాలు తప్పులు దిద్దుకోవాలనే అభిప్రాయాన్ని వెలిబుచ్చినట్లు ప్రొ. భల్లా నమ్మినట్లు కన్పడుతున్నది. వాస్తవానికి నా ప్రసంగంలో "తప్పులు దిద్దుకొనుట" అనే విషయం, దానిని ఖండించు సందర్భంలో తీసుకొని రాబడింది. ఇతర పార్టీలను, గ్రూపులను విమర్శించునపుడు వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనలో ఎట్టి వైఖరి అవలంభించాలో సూచించుటకు మాత్రమే ఆ మాటలు వాడబడినవి.

"రెండోవిషయం, కొంతమంది నేటివర్గ పోరాటపు నైజము, పునాదుల విషయమై మనందరకు సరియైన అవగాహన వుండాలన్నారు. ఉపన్యాసాలలో భారతదేశంలోని కమ్యూనిస్టు, వామపక్ష వుద్యమాలపై చారిత్రిక విశ్లేషణ యివ్వబడలేదని కూడ అన్నారు. అంతేగాక, నేడున్న వర్గ, సామాజిక, ఆర్థిక, రాజకీయ నిర్మాణాల విశ్లేషణ కూడ యివ్వబడలేదన్నారు. నా వాదనలలో ప్రతిపాదించిన అభిప్రాయాలకు మౌలికంగా అట్టి విశ్లేషణ అవసరంలేదు. భారత సామాజిక పరిస్థితి విశ్లేషణపై కమ్యూనిస్టు సోషలిస్టు వుద్యమాల పాత్రలపై వొక ఆమోదానికి వచ్చిన పిమ్మటనే ఐక్యం అవ్వాలని మనం కోరుతున్నామా అనేదే ప్రశ్న ఇవి సంక్లిష్ట సమస్యలు వీటిపై అనేక భేదాభిప్రాయాలు వుండవచ్చు. అంచేత వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత విషమై మాట్లాడక ముందు బేధాభిప్రాయాలను పరిష్కరించుట అవసరమనజాలము. అదేకాలంలో వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతకు ముందుగానే భారతసమాజ, రాజకీయ వాస్తవికతపై, యితర విషయాలపై కూలంఖషచర్చ జరగాలని తాను పేర్కొన్నానని బిపినచంద్ర వివరించారు. అది అతి ముఖ్యాంశముగా తలంచుతున్నానని, దానిని కూలంఖషంగా పరిశీలించాలని, ఎవరైనా యీ విషయాన్ని ముందుగానే పరిశీలించాలంటే, వామపక్ష ఐక్యతకు వ్యతిరేకంగా వాదించపూనుతారు. మరోమాటలలో భారతదేశానికి అవసరమైనది వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత కాదని, స్వతంత్ర కమ్యూనిస్టుపార్టీ అభివృద్ధి అనేది సరైన రాజకీయ పరిస్థితి అవగాహనయని చెప్పవచ్చును అని బిపిన్‌చంద్ర వివరించారు. సంగ్రహంగా వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతా నిర్మాణానికి, ముందుగానే నేడున్న వర్గ, సామాజిక, ఆర్థిక, రాజకీయ నిర్మాణాల విశ్లేషణలపై యేకాభిప్రాయాలు, అవగాహనలు, ఐక్యత యేర్పడాలనుటను బిపిన్‌చంద్ర ఖండించుటయేగాక, అట్టి సైద్ధాంతిక ఐక్యత, ఐక్యకార్యాచరణ పోరాటాల క్రమంలోనే యేర్పడుతుందని స్పష్టం చేసారు.

"ఇది పరస్పర విమర్శన కాలంకాదని, ఆత్మవివేచన పరిశీలన చేయవలసిన, కమ్యూనిస్టు సంక్షోభ కాలమని నిఖిల్ చక్రవర్తి అన్నారు. లెనిన్ మనం చర్చలను కోరుకొనాలని, వాటితోపాటు తీవ్ర విమర్శలను ఆహ్వానించాలని, వాగ్వివాద చర్చలు వాస్తవమైనవి వుపయోగకరమైనవియని చెప్పారు. ఒకే వొక ముఖ్య అంశం, ధ్యేయం, లక్ష్యం మరచిపోరాదు. నేను వినమ్రుడనై విన్నవించేది, మన కార్యాచరణలో, దృక్పధంలో, జీవిత సరళిలో మనం కార్మికవర్గంతో పాటు గుర్తింపబడలేదు, అయితే మనం వారికే నాయకత్వం వహించినదుపవలసివున్నది. ఇది పార్టీ శ్రేణుల, నాయకుల త్యాగాలను చిన్న చూపుచూచుటగాదు" అని కూడ తుదిపలుకులలో పేర్కొన్నారు.

## iii

## ఐక్యపోరాట క్రమంలో వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత

**3.1** ప్రభుత్వం కార్మికులకు చేసిన వాగ్దానాలను భగ్నం చేయుటతోపాటు. ఉక్కు బొగ్గు, విద్యుత్శక్తి, బ్యాంకులు, జీవిత భీమా తదితర రంగాలలో వేతన స్తంభన విధానాన్ని విస్తరించే ప్రయత్నాలు సాగించింది. దీనిని అమలు చేయుటకు భూతలింగం కమిటి చేసిన సూచనలు చేబట్టి కేంద్ర ప్రభుత్వం "పారిశ్రామిక సంబంధాల బిల్లు" ను రూపొందించి, చట్టం చేయసమకట్టి, కార్మికోద్యమంపై "చావుదెబ్బకొట్టుటకు" కార్మిక సంఘాల హక్కులు, సమ్మెహక్కులను హరించి వేయుటకు, వుద్యమాలను అణచివేయుటకు సమకట్టింది. ట్రేడు యూనియన్ కాంగ్రెసు చొరవతో వేతన స్తంబనకు, భూతలింగం కమిటి సూచనలకు వ్యతిరేకంగా, స్వాతంత్ర్యానంతరం ఎన్నడూ జరుగనంతటి, ఐక్యకార్మిక సంఘాల ప్రతిఘటన వుద్యమం వెల్లువగా సాగింది. వామపక్షాలు ముఖ్యంగా రెండు కమ్యూనిస్టుపార్టీలు ఐక్యంగా విడివిడిగా తీవ్రంగా వ్యతిరేకించాయి. వాస్తవానికి యీ కార్మికోద్యమ పోరాట వెల్లువ అక్టోబరు 1978లో "బోనసు" వుద్యమంతో ప్రారంభమైంది. అనేక రాష్ట్రాలలో, పరిశ్రమలలో కార్మికసంఘాల ఐక్యకార్యాచరణ, ఫ్యాక్టరీ, పరిశ్రమ, రాష్ట్రస్థాయిలలో ప్రారంభమై, పోరాటాలు తీవ్రమగుటతో, ప్రభుత్వం ఆమోదించిన గరిష్టపరిమితులకుమించే, బోనసులను కార్మికవర్గం పొందగలిగింది.

ఈ నేపధ్యంలో, గతంలో ఎన్నడూ జరుగని అన్ని కేంద్ర ట్రేడు యూనియన్ సంఘాల ఐక్యకార్యాచరణలో జాతీయ ఫెడరేషనులు పాల్గొన్న నవంబరు "పార్లమెంటెకు ఊరేగింపు ప్రదర్శన," పారిశ్రామిక సంబంధాల బిల్లు ఉపసంహరించాలనే నినాదాలతో జరిగింది. ఈప్రదర్శన భారతట్రేడుయూనియన్ ఉధ్యమ చరిత్రలో అతిముఖ్య ఘట్టంగా పేర్కొనబడింది, తాత్కాలికంగానైనా బిల్లువుపసంహరించుకొనబడింది. ఈప్రదర్శనలో ఎనిమిది జాతీయ ట్రేడు యూనియన్ సంస్థలు, 41 పారిశ్రామిక ఫెడరెషనులు పాల్గొన్న భారత కార్మికోద్యమ చారిత్రాత్మక ఐక్యకార్యాచరణ, మార్గదర్శికమైనది.

ఈ పోరాటాన్ని విజయం వరకు కొనసాగించుటకు "ఒక జాతీయకమిటి"ని యేర్పాటు చేయుట జరిగింది. రాష్ట్రాలస్థాయిలో అనేక కన్వెన్షనులు జరిగి, "అన్ని ట్రేడు యూనియనుల ఐక్యతా" విధానాన్ని వేగవంతం చేసాయి. ఇంతటి ప్రాముఖ్యతగలదే అయిన అఖిలభారత బ్యాంకిఉద్యోగులు 5లక్షలమంది ఐక్యసమ్మెపోరాటం, భారత కార్మికోద్యమంలో అఖిలభారత ప్రజాకార్యాచరణలలో చెప్పకొనదగిన పోరాటము. బ్యాంకి ఉద్యోగుల పోరాటవెల్లువను అణచివేయుటకు ప్రభుత్వం చేబట్టిన చర్యలను వ్యతిరేకించుతు, కార్మికవర్గం దేశమంతటా ముందు కొచ్చింది. వాస్తవానికి, కార్మికవర్గం సమిష్టిగా తమ కోర్కెలను వెల్లడించే విధానంపై ప్రభుత్వపుదాడిగా, మౌలికసమస్యగా, కార్మివర్గం- ఉద్యోగవర్గాలు రాబోయే వేతన స్తంబన విధానానికి నాందిగా తలచి,

సమిష్టిగా వ్యతిరేకించి, పోరాడి విజయాన్ని పొందారు. పశ్చిమబెంగాల్ కార్మికవర్గం ఎఐటియుసి, సిఐటియు ల ఐక్యనాయయత్వంలో 2 లక్షలమంది 2 మాసాలు సమ్మె పోరాటం సాగించారు. అదేవిధంగా హైదరాబాద్‌లో ఐడిపిఐ మందుల పరిశ్రమ కార్మికులు 5వేలమంది వీరోచిత సమ్మె పోరాటాలు సాగించారు. వేతనస్తంబనకు వ్యతిరేకంగా లక్ష మంది. విద్యుశ్చక్తి కార్మికులు యు.పి.లో బృహత్తరపోరాటాన్ని సాగించారు, ప్రభుత్వం వారి కోర్కెలను మన్నించక తప్పలేదు. బొగ్గుకార్మికులు 5 లక్షలమంది మద్దతుగా వొక రోజు సమ్మెజేసారు. రాష్ట్రప్రభుత్వ కార్మికవిధానాలకు వ్యతిరేకంగా, మద్రాసులో తమిళనాడు "బంధు", బొంబాయిలో గుడ్డలమిల్లుల కార్మికులు "ఒక రోజు నిరసన సమ్మె"; గుజరాత్‌లో 5000 ప్రతినిధుల ప్రదర్శన, రాజస్థాన్‌లో బస్సులను జాతీయం చేయాలని, రోడ్‌ట్రాన్స్‌పోర్టు కార్మికులు సమ్మె చేసారు. బీహార్‌లో 40వేలమంది విద్యుత్చక్తి కార్మికులు సమ్మె చేసారు.

ఈ ప్రజాపోరాటాల అనుభవం, అందరిని కలిపే ఐక్యకార్యాచరణ సాధ్యమని, ప్రభుత్వ ప్రజా వ్యతిరేక చర్యలను ప్రతిఘటించి పోరాటగలరని స్పష్టంగా తెలియజేస్తున్నవి. సి.పి.ఐ., సి.పి.ఐ(యం) లు భటిండా, జలంధర్ పార్టీల కాంగ్రెసుల విధానాలను ఆచరణలో హృదయ పూర్వకంగా అనుసరించి, ఐక్యకార్యాచరణను పెంపొందించితే శక్తివంతమైన ఐక్యపోరాట వుద్యమాలను నిర్మించుటకు అనువగు వాస్తవపరిస్థితులున్నవనుట స్పష్టం.

గత సంవత్సరం (1981) నిరవధిక ప్రజాపోరాటాలు ఎప్పుడూ జరగనివిధంగా కొనసాగాయి, నూతన పోకడ రైతాంగంకూడ పోరాటాలలోనికి దిగింది. బూర్జువావర్గం, భూస్వామ్య వర్గాల మధ్యగల అంతర్గత సంఘర్షణలు, కొన్ని రాష్ట్రాలలో రైతాంగ అసంతృప్తి పోరాట రూపాలుచేబట్టుటకు తోడ్పడింది, అవి అఖిల భారతస్థాయిలో పరిణామాలకు అంకుర్పారణ చేసాయి.

ప్రభుత్వ వ్యవసాభివృద్ధి కార్యక్రమాలతో బలపడిన ధనిక రైతాంగవర్గాలు తమపై వేయ తలపెట్టిన పన్నుల భారాన్ని, ఆదాయపన్నును, అధిక విద్యుచ్ఛక్తి చార్జీలను, అప్పులను వసూలు చేయుటను వ్యతిరేకించసాగాయి. ఆర్థిక సంక్షోభవం తీవ్రమగుటతో నూతన పన్నులు రాయితీలను రద్దుచేయుట రైతాంగవర్గాలనుండి తీవ్రనిరసనను ఎదుర్కొనవలసివచ్చింది. ప్రభుత్వం కొన్నింటిని వుపసంహరించుకొనవలసి వచ్చింది.

ఈ నిరసన, ప్రతిఘటన, నగరాలకు వ్యతిరేకంగా గ్రామాలు, వికేంద్రీకరణ, భారీ పరిశ్రమలకు వ్యతిరేకత, గ్రామ, కుటీర, చిన్న పరిశ్రమలకు ప్రాధాన్యత, స్వయంశక్తిపై ఆధారపడే గాంధీవిధానాల నినాదాల రూపంలో ప్రత్యక్షమైంది.

ఆర్థిక పరిస్థితి క్షీణించుటతో 1980-81లో కాంగ్రెసు (ఐ) ప్రభుత్వం ఆయిల్, ఎరువులు, తదితర వనరులపై ధరలను పెంచవలసివచ్చింది. అధికలాభాలు పైవర్గాలపై యీ ప్రభావం బాగాపడింది. నూతన పన్నులను బర్తీ చేసుకొనుటకు వనరుల అధికధరలు,

ఎరువులధరలు పెరుగుటతో వ్యవసాయ ఉత్పత్తుల ధరలు పెంచాలనే కోర్కెలతో "గిట్టుబాటు ధరల" నినాదాన్ని చేబట్టారు.

కొన్ని రాష్ట్రాలలో యీ వర్గాలు నేరుగా "రైతాంగ నిరసన ఐక్యకార్యాచరణకు పిలుపునిచ్చారు. అనేక రాష్ట్రాలలో రైతాంగ ప్రచార ఆందోళనలకు యిది దారితీసింది. తమిళనాడు, కర్నాటక, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, పంజాబులలో బ్రహ్మాండమైన నిరసన ప్రదర్శనలకు, వేలకొలది రైతుల అరెస్టులకు, పోలీసుకాల్పులకు, అనేక మంది రైతులు ప్రాణాలు కోల్పోవుటకు దారితీసింది. తమిళనాడు, కర్నాటకలలో యీ పోరాట చొరవ ధనికరైతులు, భూస్వాముల చేతులలోనికి, ఆంధ్రప్రదేశ్, పంజాబులలో అనేక వామపక్షాల సంఘటన చేతులలోనికి పోయింది. మహారాష్ట్రలో ధనికరైతులు, భూస్వాములు ఆందోళనను ప్రారంభించినా, తరువాత చొరవ ఆరుపార్టీల సమితి చేబట్టి "రైతాంగ దీర్ఘయాత్ర" రూపంతో వుద్యమం తీవ్రమైంది.

మహారాష్ట్రలో గిట్టుబాటు ధరలు, తదితర కోర్కెల చార్టరుతో పాటు వ్యవసాయకూలీలకు కనీసవేతనం 7రూపాలయలు యివ్వాలనే కోర్కెకూడా చేర్చబడింది.

కర్నాటకలో ధనికరైతాంగం తమ వుద్యమన్నా వుపసంహరించుకొన్న తరువాత సి.పి.ఐ (యం) "అభివృద్ధి లెవీ"కి వ్యతిరేకంగా "మాలప్రభ" ఆందోళనను ప్రారంభించింది. "నరగుందు" ఘటనతోవుద్యమం రాష్ట్రమంతటా వ్యాపించగా, భూస్వాముల సంస్థలు, భూస్వామ్య బూర్జువా పార్టీలు వుద్యమాన్ని తమ కనుకూలంగా రూపొందించ ప్రయత్నించాయి. ప్రభుత్వం కఠినచర్యలతో అణచివేయ ప్రత్నించుతు, చెరకు, వరి ధాన్యం, ధరలను పెంచుటను, రాయితీలను ప్రకటించింది. నాలుగుపార్టీలు కలసి అభ్యుదయ ప్రజాస్వామ్య సంఘటన యేర్పాటు చేసి, ఫిబ్రవరి 5, 1981, విధాన సభకు రైతాంగయాత్ర ప్రారంభించి, భూస్వాములనుండి చొరవను తమచేతులలోనికి సంఘటన తీసుకొన్నది. రైతాంగం నూతన పోరాట రూపాలను "రాస్తాతోడో" రాస్తారోకో" లను సృష్టించుకొని రవాణా సౌకర్యాలను స్తంబింపచేసిది. ప్రారంభంలో రైతాంగ వుద్యమానికి బూర్జువా భూస్వామ్య నాయకత్వాలు చొరవ చూపించినా, పరిమితులువిదించినా, గ్రామీణ స్వప్రయోజనపరలను అధిగమించి, వుద్యమం పురోగమించింది. కమ్యూనిస్టులు సరియైన కాలంలో ప్రవేశించి, యితర పార్టీల సమాకారంతో వుద్యమాన్ని ముందుకు నడిపించారు.

రైతాంగ వుద్యమాలతోపాటు విద్యార్థి, మహిళా వుద్యమాలు ధరలుపెరుగుదలకు వ్యతిరేకంగా అభివృద్ధి చెందసాగాయి. విద్యార్థులు కొన్ని చోట్ల పోలీసులతో తీవ్రంగా సంఘర్షించారు. విశ్వవిద్యాలయాలుకొన్ని నెలలపాటు మూసివేయబడినవి, పోలీసులు ఆక్రమించారు.[1]

---

*1. రాజకీయ తీర్మానం సి.పి.ఐ(యం) 11వ. కాంగ్రెసు ఆమోదించినది (ఆంగ్లంలో) విజయవాడ, జనవరి 1982.*

**3.2 జాతీయ కన్వెన్షన్** ఆరు ప్రతిపక్షపార్టీలు, ప్రజాసంస్థల, కార్మిక, కర్షక, వ్యవసాయకూలిసంఘాల, విద్యార్థి, యువజన, మహిళా సంఘాల ప్రతినిధుల జాతీయ కన్వెన్షన్ జాతి జీవన క్లిష్టపరిస్థితులలలో సమావేశం జరిగింది. ఆరుపార్టీల కో ఆర్డినేషన్ కమిటి ఐక్యకార్యాచరణకు విజ్ఞప్తి, కోర్కెలు కొరకు పోరాడుటకు పిలుపు నిచ్చింది.[1]

కాంగ్రెసు (ఐ) తిరిగి, సంవత్సరం ప్రారంభంలో, అనేక ఎన్నికల వాగ్దానాలు చేసి ఇందిరాగాంధీ నాయకత్వంలో అధికరాంలోనికి వచ్చింది. ఇందిరాగాంధీ ధరల పెరుగుదలను అదుపులో పెడతానని, లా అండ్ ఆర్డరు మెరుగుపరుస్తానని, లక్ష్య శుద్ధి పాలన అందిస్తానని వాగ్దానం చేసింది. కాంగ్రెసు (ఐ) ప్రభుత్వం కేంద్రంలోకాని, రాష్ట్రాలలోగాని, యీ వాగ్దానాలను అమలు చేయక, ప్రజల ఆశలను, నిరాశలు చేసారు.

ఎన్నడూ లేనంతగా నిత్యావసరవస్తువుల ధరలు పెరిగిపోయాయి, ద్రవ్యోల్బణం, తిరుగుముఖంపట్టే సూచనలు లేవు. సామాన్యమానవునికి నిత్యావసరాలు అందుబాటులో లేకుండా పోయినవి. కొన్ని అదృశ్యమయ్యాయి. పంచదార 3-4 రెట్లు పెరిగిపోయింది, కాంగ్రెసు (ఐ) ప్రభుత్వం సమస్యలను పరష్కరంచజాలదనుటకు యీ ఉదాహరణ వొక్కటి చాలు.

దేశంలో అనేక ప్రాంతాలలో యాదృచ్ఛికంగా ప్రజా వెల్లువ కన్పదుతున్నది. అభ్యుదయకర, ప్రతిపక్షాలు యీ వెల్లువకు సారధ్యం వహించముందు కొస్తున్నవి, ప్రభుత్వ ఆర్థికవిధానాలను వ్యతిరేకించుతున్నవి.

పారిశ్రామిక వుత్పత్తిలో పెరుగుదలలేదు, విద్యుచ్ఛక్తి కొరత ఆర్థికవిధానాన్ని కుంటుపరుస్తున్నది. రిజర్వాయరులలో నీరు సమృద్ధిగా వున్నా, అసమర్థతకారణంగా, విద్యుత్ఛక్తి వుత్పత్తి అసంతృప్తికరంగా వుంది.

ఈ సంవత్సరం తొలకరివర్షాలు సంతృప్తికరంగా పడినా, వరదలు విపరీత కష్టాలకు ప్రజల గురిచేసినా, ప్రభుత్వ సహాయ, సహకారాలు సంతృప్తికరంగాలేవు. కాంగ్రెసు (ఐ) ప్రభుత్వాల అసమర్థత, ప్రజల కష్టాలు భరించజాలని పరిస్థితులను సృష్టించాయి.

ఈశాన్య ప్రాంతాలలో విద్రోహచర్యలు, విచ్ఛిన్నకార్యకలాపాలు మిన్నంటినా ప్రభుత్వం అరికట్టుటలో యిప్పటివరకు విఫలమైంది. ఆర్థికాభివృద్ధి, ఉద్యోగావకాశాలు పెంపొందించి, విచ్ఛిన్నకరశక్తుల బలాన్ని నిర్వీర్యం చేయుటలో ప్రభుత్వ వైఫల్యం స్పష్టం.

నేటి పరిస్థితులలో అత్యధికంగా కలతచెందించేది ఉత్తరప్రదేశ్‌లోని మతవైషమ్యాల పరిస్థితి. ప్రభుత్వం పరిస్థితి విషమించకముందే సత్వర చర్యల చేబట్టుటలో వైఫల్యామైంది. సాయుధ పోలీసుదళాల, మైనారిటీ కమ్యూనిటి మధ్య ప్రారంభమైన ఘర్షణ,

---

1. *ప్రెజంట్ సిట్యుయేషన్ అండ్ కాల్ టుయాక్షన్ (1980) డాక్యుమెంటు ఆరుపార్టీలు కన్వెన్షన్ సప్టెంబరు 27-28, 1980 ఢిల్లీలో ఆమోదించబడినది. పేజీ.ర.*

మొరాదాబాద్ మైనారిటీ ప్రజల హత్యాకాండలుగా పరిణమించింది. మత సంఘర్షణలుగా చిత్రించుట జరిగింది. రాష్ట్రీయ స్వయంసేవక్‌సంఘం, జమాయితే ఇస్లామి, అమర్‌బంగాలీ. ఉత్తర భారతంలో ముస్లింలీగుల పాత్ర ప్రత్యేకంగా ఖండించవలసియున్నది. ఇప్పటికీ ప్రభుత్వం పరిస్థితిని కంట్రోలులోనికి తీసుకొని రాలేకపోవుట దురదృష్టకరము. ప్రజలకు రక్షణలేని పరిస్థితి యేర్పడింది.

కేంద్రప్రభుత్వ ప్రత్యేక అధికారాలను ఇందిరాగాంధీ ప్రభుత్వం, రాష్ట్రాల స్వపరిపాలనా విధానాలలో కలుగజేసుకొనుటకు వినియోగించుటకు జాతీయ కన్వెన్షన్ విచారాన్ని వ్యక్తం చేస్తున్నది, గర్హించుచున్నది. కన్వెన్షన్ మన పార్లమెంటరీ విధానాన్ని మార్చివేయు ప్రయత్నాలను తీవ్రమైనవిగా పరిగణించుచున్నది. అధికార నియంతృత్వ అధ్యక్షపాలనను ప్రవేశపెట్టాలనే ప్రయత్నాలను వ్యతిరేకించుతున్నది.

ప్రస్తుత పరిస్థితిని చక్కబెట్టుటకు చేబట్టవలసిన మౌలిక మార్పులకు చాలకాలం పట్టును గాన, యీ క్రింది స్వల్పకాలచర్యలను కన్వెన్షన్ సూచించుచున్నది.

వినియోగదారులకు, నిత్యావసర వస్తువుల ధరలు తగ్గించివేయాలి. ఇందుకు అధికోత్పత్తి, రవాణా యిబ్బందులు తొలగించుట, పంపకాన్ని చక్కబరుచుట, దొంగనిల్వను, దొగవ్యాపారాన్ని అరికట్టుట చేయాలి. గ్రామీణ, నగర పేదలను దృష్టిలో పెట్టుకొని ప్రజాపంపక విధానాన్ని పునర్నిర్మాణం చేయాలి. ఆహారపదార్థాలు, పప్పులు, పంచదార, వంటనూనెలు, గుడ్డలు, కిరోసిన్, అత్యవసరమందులు, తగిన ధరలకు అందచేయాలి. ప్రభుత్వం ఆహార పదార్థాలసేకరణ కావించాలి. రైతులకు, మద్దతుధరలు, గిట్టుబాటుధరలు నిర్ణయించాలి. ప్రభుత్వసంస్థలు కొనుగోలు చేయాలి. అందుకు అవసరమైన పెట్టుబడిని రిజర్వుబ్యాంకు ప్రభుత్వ సంస్థల కివ్వాలి. రైతుల వుత్పత్తులు అతిచవకగా మార్కెట్టులో పోవుట ఆపాలి. రైతులకు ఎరువులు, విత్తనాలు, పనిముట్లు ధరలు తగ్గించాలి. నీటితీరువా, కరెంటు, తదితర చార్జీలు తగ్గించాలి. వ్యవసాయ వుత్పత్తులను పెంచుటకు అన్ని సౌకర్యాలు కలుగజేయాలి అప్పులు, తక్కువవడ్డీకి సహకారసంస్థలు, రైతుబ్యాంకుల ద్వారా అందచేయాలి. గ్రామీణ పేదలకు, పనిగ్యారంటీ ప్రణాళిక అమలు, వ్యవసాయకూలీలకు కనీసవేతన చట్టం అమలు, సీలింగు చట్టాలలోని లోపాలను సరిచేసి మిగులు భూమిని వ్యవసాయకూలీలకు పంచాలి. అప్పులతో అణచివేయబడుతున్న రైతులకు, చేతివృత్తువారికి సహాయాలను అందించాలి. వ్యవసాయకూలీల అప్పులు రద్దుచేయాలి.

కార్మికులకు, ధరలపెరుగుదలకు రక్షణ, ట్రేడు యూనియన్ హక్కులు, సమ్మె హక్కుతో సహా-రక్షణ, యజమానులు లాకవుటులు, గూండాలనుపయోగించి సమ్మెలను అణచివేయు ప్రయత్నాలను అరికట్టాలి. జీవిత ప్రమాణ సూచికలలో మోసాన్ని అరికట్టి, రాత్ కమిటి సిఫార్సులను అమలు చేయాలి. కనీస బోనస్ గ్యారంటీ 8.33 శాతం కార్మికులందరికి యివ్వాలి.

చేతిపనివారికి. వారి వుత్పత్తులు గృహ, వికేంద్రీకరణ పరిశ్రములుగా రక్షణ

కల్పించాలి, అవి వారికే కేటాయించాలి. అప్పులు ముడిసరుకుల, మార్కెట్లు, సాంకేతిక పరిజ్ఞానాన్ని అందుబాటు చేయాలి. చేతిమగ్గాలకు కొన్ని ప్రత్యేకరకాలు కేటాయించాలి, మిల్లులు చేపట్టరాదు.

అప్పులు రాయితీలు, చిన్న పరిశ్రమలకు, బడావ్యాపార వర్గాల అధీనంలోని సిక్ యూనిట్లకు యిచ్చే అప్పుల రాయితీలను, కష్టాలలో వున్న చేతివృత్తులవారికి, చిన్న పరిశ్రమలకు యివ్వాలి.

యువజనులకు ఉద్యోగ అవకాశాలు కల్పించుట స్వల్పకాలిక, దీర్ఘకాలిక ప్రణాళికలు రూపొందించి, విద్యాధికులైన యువజనులను నిరుద్యోగ మహమ్మారి నుండి కాపాడాలి. పని గ్యారంటీ చేయాలి. నిరుద్యోగ భృతినివ్వాలి. విద్యార్థులకు, విద్యావిధానాన్ని సంస్కరించి, తిండిపెట్టేదిగా, లౌకిక ప్రజాస్వామ్యానికి అనుగుణమైన, ప్రజాస్వామ్య విద్యావిధానాన్ని ప్రవేశపెట్టాలి.

మహిళలపై సమాజిక వ్యతిరేకశక్తుల గుండాయిజం, పోలీసుల దౌర్జన్యాలు అరికట్టాలి. స్త్రీల అత్యాచారాలు, దుర్మార్గచర్యలు చేయువారిని కఠినంగా శిక్షించాలి. కట్నపిచాచిని తొలగించాలి.

పరిపాలనలో లంచగొండితనాన్ని రూపుమాపాలి. నిరుపయోగ ఖర్చులను తగ్గించివేయాలి. పబ్లిక్ సెక్టరుల యాజమాన్య సమర్థత, యంత్రాల మెయింటనెన్స్, పని నైపుణ్యత, వుత్పత్తి సామర్థ్యం పెంచాలి. కార్మికుల సహకారాన్ని పొందాలి, వారి న్యాయమైన యిబ్బందులను సరిచేయాలి.

లా అండ్ ఆర్డరు, సిబ్బందికి నూతన దృక్పధంలో తిరిగి శిక్షణ యివ్వాలి, మహిళలకు, బలహీనులకు, మైనారిటీలకు పౌరులకురక్షణ యివ్వాలి. కొట్లాటలు, దౌర్జన్య, హింసాకాండలను ఆపాలి.

వెనెకబడిన వర్గాలకు, మైనారిటీలకు, షెడ్యూల్డు తరగతులు, షెడ్యూల్డు తెగలకు, ప్రభుత్వశాఖలలో, పోలీసు,రెవెన్యూశాఖలలో తగిన ప్రాతినిధ్యమివ్వాలి.

మతసామరస్యం, కొరకు మత తత్వవాదులకు వ్యతిరేకంగా రాజకీయోద్యమాన్ని చేబట్టాలి, శాంతికమిటీలను యేర్పాటు చేయాలి. వివిధమతాల, కులాల మధ్య సామరస్యాన్ని కొనసాగించాలి.

ఆర్థిక నేరస్థులను కఠినంగా శిక్షించాలి. బ్లాక్ మార్కెటు దారులు, దొంగవ్యాపారులు, సామాజిక వ్యతిరేకశక్తులు, ఆర్థిక, ద్రవ్యనేరస్థులను కఠినంగా విక్షించాలి. కొత్త చట్టాల అవసరంలేదు.

రాష్ట్రాల రాజకీయ, ఆర్థిక అధికారాలను యింకే మాత్రం తగ్గించరాదు. పౌర హక్కులను పునరుద్ధరించాలి. ప్రజాస్వామ్యవిధానాల వ్యతిరేకచట్టాలన్నిటిని రద్దుచేయాలి. పత్రికాస్వాతంత్ర్యాన్ని కాపాడాలి.

తొలకరి మాన్సూను వర్షాలు విఫలమైనా, వరదలలో నష్టాలకు సహాయ, సహకారాలను యివ్వాలి, నివారణోపాయాలు కల్పించాలి.

జాతీయ కన్వెన్షన్ కోర్కెలపై ఐక్యపోరాటాలను, వుద్యమాలను నిర్మించండని పిలుపునిచ్చింది. ఈ ఐక్యవుద్యమం, వూరేగింపుప్రదర్శనలు, సమావేశాలు, సత్యాగ్రహాలు, దర్నాలు, కన్వెన్షనులు, సెమినారులు, హర్తాళ్ళు, బందులు రూపాలలో సాగుతుంది. జాతీయ ఐక్యతను, సమగ్రతను విశ్వసించే అన్ని లౌకిక, ప్రజాస్వామ్య శక్తులకు దేశవ్యాపిత వుద్యమాన్ని దుష్టమత, నియంతృత్వ సిద్ధాంతాల వ్యతిరేకంగా ఐక్యవుద్యమాన్ని సాగించండని విజ్ఞప్తి చేస్తున్నది, అని ప్రకటించింది.

వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత, సంఘటన నిర్మాణాల ఆచరణలోపై కార్యక్రమ ప్రాముఖ్యత రీత్యా, కన్వెన్షన్ విధానాన్ని వివరంగా, చాలా వరకు యధాతధంగా యివ్వటం జరిగింది. ఇప్పుడు కన్వెన్షన్ యిచ్చిన స్ఫూర్తితో జరిగిన పోరాటాలను చూద్దాము.

కేంద్రంలో వామపక్ష ప్రజాస్వామ్య లౌకిక పార్టీల ఐక్యకార్యాచరణ ప్రయత్నాలు జరుగునపుడు రాష్ట్రాలలోకూడ అట్టి ప్రయత్నాలను రాష్ట్రనాయకత్వాలు కొనసాగించాయి. అనేక రాష్ట్రాలలో సత్ఫలితాలు కలుగుట, ఐక్యప్రజోధ్యమాలు రూపొందుట జరిగింది.

మహారాష్ట్రలో అధిక ధరలకు, నిర్బంధచర్యలకు, ఆర్డినెన్సులపై వ్యతిరేకంగా వివిధ వర్గాల ప్రజాపోరాటాలు, బందులు కొల్హాపూర్, సాంగ్లీ, సతారా, అహమ్మద్‌నగర్‌లో జరిగాయి. రైతాంగం చెరకు, ఉల్లిపాయలకు గిట్టుపాటు ధరలకు, ప్రత్తి గుత్త కొనుగోలు స్కీము సరిగా అమలు చేయాలని కోరుతూ పోరాటా సాగించుతున్నారు. వీటిని రాష్ట్రస్థాయిలలో కొనసాగించుకై సమన్వయ పరచే ప్రయత్నాలు ప్రారంభించారు. రాష్ట్రస్థాయి కన్వెన్షన్‌ను సి.పి.ఐ,సి.పి.ఐ(యం), పీజెంట్సు అండ్ వర్కర్స్ పార్టీ, కాంగ్రెసు (ఉ), జనతాపార్టీ, లోక్‌దళ్, రిపబ్లికన్ పార్టీ ఆఫ్ ఇండియా (గవాయ్) ఎ ఐటియుసి, సి ఐటియు, హెచ్‌యంయస్, కిసాన్‌సభలు, యితర ప్రజాసంస్థలు, ధరలు పెరుగుదల వ్యతిరేక మహిళా కమిటీలు బొంబాయిలో ఆగస్టు 31న కలసి జరిపాయి. పైన పేర్కొన్న పార్టీలు, సంస్థలనుండి 4వేలమంది ప్రతినిధులు సమావేశమై, ధరలు కంట్రోలు చేయాలని, ప్రజల తక్షణ కోర్కెలపై వొక విజ్ఞప్తిని ఆమోదించారు. అట్టి కన్వెన్షనలను జిల్లాస్థాయిలలో జరుపుటకు ఆచరణ కార్యక్రమాన్ని రూపొందించి, అక్టోబరు 2న అన్ని జిల్లా, తాలూకా కేంద్రాలలో సత్యాగ్రహ వుద్యమాన్ని ప్రారంభించాలని, 15న మహారాష్ట్ర బందు జరపాలని నిర్ణయించారు. అక్టోబరు 2, సత్యాగ్రహంలో 50వేలమంది పాల్గొన్నారు, 15న బందును విజయవంతంగా జరిపారు. రాష్ట్రప్రభుత్వం బందు జరుగకుండా విఫలయత్నాలు అరెస్టులు, నిషేదాలు ఎన్నింటినో చేసింది.

ఆంధ్రప్రదేశ్‌లో రైతాంగం గిట్టుబాటు ధరలను కోరుతు పెద్ద వుద్యమాన్ని చేబట్టారు. గిట్టుబాటుధరలు, ఎరువులు, విత్తనాలు చవకధరలకు, కరెంటు చార్జీలుతగ్గించాలని, అప్పులు రద్దుచేయాలనే కోర్కెలు ప్రధానంగా వుద్యమం సాగింది. అఖిలపక్ష

రైతాంగప్రదర్శన 2లక్షల మందితో సెప్టెంబరు 17న విజయవాడలో జరిగింది. సమావేశంలో సెప్టెంబరు 24న బందు రాష్ట్రమంతటా జరపాలని నిర్ణయించారు. కరువు కాటకాలకు తరచుగా గురయ్యే రాయలసీమకు కృష్ణానది జలాలను అందిచ్చాలని కోరుతు విద్యార్థి, యువజన, రైతాంగం ప్రజాప్రదర్శనలు జరిపారు. సెప్టెంబరు 24 ఆంధ్రప్రదేశ్ సంపూర్ణ బందు విజయవంతంగా జరిగింది, కార్మికవర్గం ప్రదాన పాత్ర వహించింది. చెరకు, ప్రత్తి, ధాన్యం వుత్పత్తిదారుల సమస్యలపై రైతాంగాన్ని సమీకరణ చేసారు.

కేరళలో ఆగస్టు 14న రాష్ట్రబందు, జనరల్ సమ్మెను రాష్ట్రం యెడల కేంద్రపు చిన్నచూపును నిరశించుతూ ప్రదర్శనలు, వూరేగింపులు జరిపారు.

బీహారులో ఆటవిక తెగలు సాంప్రదాయకంగా, అడవులలో వుత్పత్తుల సేకించుకొనే విషయమై, పోలీసులతో జరిగిన సంఘర్షణలో సింగ్భూమి జిల్లాలలోని గువాలో యిద్దరు పోలీసులు చనిపోగా తీవ్రపరిస్థితులు యేర్పడినవి. ఆటవిక తెగలు సి.పి.ఐ, ఎ ఐటియుసి ల నాయకత్వంలో 30వేల మంది సత్యాగ్రహం చేయగా అనేక మందిని ప్రభుత్వం అరెస్టుగావించింది. చివరకు ప్రభుత్వం వారి కోర్కెలను అంగీకరించి, వారిని విడుదల చేసింది. సత్యాగ్రహం విరమించబడింది.

విద్యుచ్ఛక్తి కార్మికులు 40వేలమంది, 1975నుండి వేతనాల రివిజను వొప్పందాన్ని బోర్డు అమలుచేయనిరాకరించినందున సమ్మె చేసారు. సమ్మె పూర్తి విజయమైంది, ప్రభుత్వమే 90-95 శాతం సమ్మెలో చేరారని అన్నది. సమ్మె చట్టసమ్మతంకాదని నిర్బంద విధానాన్ని చేబట్టి, అణచివేయ ప్రయత్నించి, సమ్మెనాయకులందరిని అరెస్టు చేసింది. నిర్బందకాండ సమ్మెను భగ్నం చేయలేకపోయింది. అనేక యూనియనులు, నాన్‌గెజెడ్ వుద్యోగులు, బ్యాంకి వుద్యోగులు సానుభూతి సమ్మె జేసారు. సి.పి.ఐ, సి.పి.ఐ(యం)లోక్‌దళ్ నాయకులు, ముఖ్యమంత్రిని కలుసుకొని పరిష్కారం చేసారు.

ఐదు పార్టీలు సి.పి.ఐ, సి.పి.ఐ(యం), పార్వర్డ్‌బ్లాక్, కాంగ్రెసు (ఉ) లోక్‌దళ్‌లు ఐక్యంగా పాట్నాలో రాష్ట్రస్థాయి కన్వెన్షన్‌ను జాతి ఐక్యతకు, గిట్టుబాటు ధరలకు, ఉద్యోగాలకు, నిరుద్యోగ నివారణకు, హరిజనులపై, మహిళలపై అత్యాచారాలకు వ్యతిరేకంగా, ప్రదర్శనను జరిపారు.

పంజాబ్‌లో సి.పి.ఐ, సి.పి.ఐ(యం), అకాలీదళ్‌లు సంయుక్తంగా ధర్నాలు, కన్వెన్షనులు జరిపారు. జలందరులో రాష్ట్రస్థాయి కిసాన్ కన్వెన్షన్ జరిపి, జిల్లాస్థాయిలో సంయుక్త వూరేగింపులు ప్రదర్శనలు సెప్టెంబరు 22న ఆందోళనలుజరపమని పిలుపునిచ్చారు. సంయుక్తంగా మూడుపార్టీలు, కిసాన్‌సభలు ప్రదర్శనలు, దర్నాలు జరిపారు. కార్మికవర్గ పోరాటాలతో పాటు విద్యార్థి, యువజనులు తమ కోర్కెలపై సమ్మెలు ప్రదర్శనలు జరిపారు. విద్యార్థులు బస్సుచార్జీలుతగ్గించాలని ఆందోళన చేసారు.

గుజరాత్‌లో ధరలు పెరుగుదల వ్యతిరేకంగా సి.పి.ఐ(యం), సి.పి.ఐ, జనతాపార్టీలు సంయుక్తంగా ఆందోళనసాగించగా, రాష్ట్రప్రభుత్వం నిర్బందకాండచేబట్టింది.

ప్రత్యామ్నాయంగా సి.పి.ఐ(యం) సి.పి.ఐలు సంయుక్తంగా సత్యాగ్రహం ప్రారంభించారు. ప్రభుత్వం లాఠీచార్జీలు, అరెస్టులు గావించింది.

సంయుక్తంగా సెప్టెంబరు అక్టోబరు 1980లో సి.పి.ఐ(యం) సి.పి.ఐలు అనేక ఆర్థిక, రాజకీయ సమస్యలపై ఐక్యప్రజాకార్యాచరణలలో, ప్రదర్శనలలో పాల్గొన్నారు. రెండు పార్టీలు చేరువయ్యే విధాన క్రమం కొనసాగింది. అదే కాలంలో కొన్ని విముఖ పరిణామాలు ముఖ్యంగా ఆల్ఇండియా బ్యాంక్ ఎంప్లాయిస్ అసోషియేషన్‌ను దురదృష్టకరంగా చీల్చుట జరిగింది. పత్రికలలో సాగిన పార్టీలవిధానాల విమర్శ ప్రతి విమర్శనలలో వాడబడిన పరుషపదజాలం వామపక్ష ఐక్యతకు తోడ్పకపోగా, మొత్తం లక్ష్యాలకే విరుద్ధమైనది.

పశ్చిమ బెంగాల్‌లో 6 అసెంబ్లీ స్థానాలు 1 పార్లమెంటు స్థానంలో బై ఎలక్షన్‌లు రాగా, అన్ని స్థానాలలో సి.పి.ఐ(యం) పోటీచేయుట, వారి పార్టీ జలందర్‌కాంగ్రెసు విధానమైన, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యత అమలులో, ఒంటెత్తు పోకడలు ఎలా కొనసాగుతున్నవో అర్థమగుతుంది, బద్నపూర్‌స్థానంలో సి.పి.ఐ వాస్తవానికి హేతుబద్ధంగా నిలబడవలసిన అసెంబ్లీస్థానంలో, ప్రజాసామాన్యంలో మంచిపలుకుబడి, మద్దతువున్నా. సి.పి.ఐ రాష్ట్రనాయత్వం యీ విషయం ఎంతనచ్చజెప్ప ప్రయత్నించినా వుపయోగం లేకపోయింది. మరోమార్గం లేక సి.పి.ఐ రాష్ట్ర నాయకత్వం, సి.పి.పై(యం) తమ అభ్యర్థిని నిలబెట్టినా, పోటీచేయుటకు నిర్ణయించింది. మిగతాస్థానాలలో సి.పి.ఐ(యం) అభ్యర్థులను బలపరచింది. అదేకాలంలో సి.పి.ఐ రెండు పార్టీలు మిత్రుగా వుండాలని, సయోధ్యతను కోరుతున్నామని స్పష్టంచేసింది.

ప్రజాపోరాటాలు చురుకైనవిగా ఉన్నతపోరాట వటిమను, సౌహార్థతను ప్రదర్శించుతున్నవి. ప్రజావ్యతిరేక, ప్రజాస్వామ్య వ్యతిరేక విధానాలను కాంగ్రెసు ప్రభుత్వంచేబట్టుటతో, ప్రజలు పోరాట సన్నద్ధులు అగుటను, గత సంత్సరకాలంలో జరుగుతున్న పోరాటాలే తెలియజేస్తున్నవి. ప్రజలు సానుభూతి సమ్మెలతో పోరాడుతున్న కార్మిక, కర్షకుల యెడల సౌహార్థత స్పష్టం చేయుచున్నారు.

కురుక్షేత్ర విశ్వవిద్యాలయ విద్యార్థులు సానుభూతి సమ్మెను చేయుట, అదే జయపూరు విద్యార్థులు చేయుట, బెంగుళూరు పబ్లిక్‌రంగంలో కార్మికులు, యితర కార్మికుల పోరాటాలను బలపరస్తూ సానుభూతి సమ్మెలు చేసారు. రైతాంగం గిట్టుబాటులకై రాస్తారోకో, ప్రజావుద్యమాలు నడుపుతున్నపుడు కార్మికవర్గం సానుభూతి సమ్మెలు కొనసాగించి, కార్మిక కర్షక ఐక్యతకు పునాదులు వేసి, బలపరుస్తున్నది.

బస్సు చార్జీలు పెంచుటకు వ్యతిరేకంగా, పోలీసు హింసాకాండలకు వ్యతిరేకంగా జరిగిన పోరాటం, కాంగ్రెసు ప్రభుత్వంపై వొత్తిడి తీసుకొనివచ్చి, విచారణ కమిటీని వేయునట్లు చేసింది.

ఈ కాలంలో రెండు పరిణామాలు ప్రత్యేకతను సంసాదించుకొన్నవి. ఒకటి, రోజురోజుకు వృద్ధిచెందుతున్న వామపక్ష ప్రజాస్వామ్య శక్తుల, సంస్థల ఐక్యత,

ఐక్యకార్యాచరణ పోరాటాలు రెండవది, ప్రజలు పోరాటాలు సాగించుటయేగాక, ముఖ్యమైన రాయితీలను కూడ పొందగలుగుతున్నారు. ఈ రెండు నొక్క చెప్పవలసి వుంటుంది. ఫలితంగా ప్రజలలో దృఢమైన విశ్వాసం కలుగుతుంది. ప్రజలు పోరాటాలకు విజయం చేకూర్చుతారు.

## 3.3. వామపక్ష ప్రతిపక్షాల సమిష్టి అవగాహనలు.

ఈ కాలంలో కొన్ని ముఖ్య రాజకీయ పరిణామాలలో, వామపక్షాలు ముఖ్యంగా, సి.పి.ఐ తదితర ప్రతిపక్షాల సమావేశాలు, ప్రధాన రాజకీయ సమస్యలపై సమిష్టి సాధారణ రాజకీయ అవగాహనాభివృద్ధికై ప్రయత్నాలు జరిగాయి. తెలుగుదేశం పార్టీ ప్రథమ వార్షిక సమావేశం సందర్భంలో శ్రీరామారావు 28మే 1983న ప్రతిపక్ష పార్టీల, కాంగ్రెసేతర రాష్ట్రప్రభుత్వాల ముఖ్యమంత్రుల సమావేశాన్ని విజయవాడలో యేర్పాటు చేసారు ఆహ్వానలేఖలో "జాతీయ సమస్యలపై పార్టీలు పరస్పర అభిప్రాయాలను తెలుసుకొంటూ వొక సమిష్టి సాధారణ అవగాహనలకు వచ్చునట్లు చర్చలు జరుపుకొనుటకు యేర్పాటు చేయబడిందని స్పష్టం చేసారు. వార్తా సంస్థలు, చర్చల పరిధి చాలవిస్తృతమైనందున కాంగ్రెసు (ఐ) కు జాతీయ ప్రత్యామ్నాయాన్ని రూపొందించే ప్రయత్నంగా వ్యాఖ్యానించాయి.

సి.పి.ఐ కేంద్రకార్యవర్గం, సమావేశానికి హాజరుకానిచో మనమిత్రలకు గూడ దూరమగుతామని, అంతేగాక బి.జె.పి మితవాద అభివృద్ధి నిరోధక కూటమిని యేర్పాటు చేయుటకువీలు కలుగజేసిన వారమగుతామని నిశ్చయించగా, శెక్రటరీ రాజేశ్వరరావు సమావేశంలో పాల్గొన్నారు. సమావేశానికి ముందు, సి.పి.ఐ(యం) నాయకత్వం, మరికొందరి ప్రతిపక్షపార్టీలు నాయకులతోప్రాథమిక సంప్రదింపులు కూడా జరిపింది. ముఖ్యంగా మత, అభివృద్ధి నిరోధక శక్తులపై పోరాటానికి సమిష్టి అవగాహన, యితర లౌకిక శక్తులతో కలసి రూపొందించే ప్రయత్నంచేసింది. సి.పి.ఐ తన ప్రకటనలో ఇందిరాగాంధీ అభ్యుదయకర విదేశాంగ విధానంతో దేశభక్త వర్గాలకు ఎట్టి వ్యతిరేకతలేదని, ప్రధాన రాజకీయ సమస్యలపై మౌలిక భేదాభిప్రాయాలను ప్రతిపక్ష రాజకీయ పార్టీలు కలిగియేన్నందున, యీ సమావేశం ద్వారా జాతీయ ప్రత్యామ్నాయం రూపొందించు ప్రశ్న వుదయించదని స్పష్టం చేసింది. అంతేగాక, అవకాశవాద, "కాంగ్రెసు వ్యతిరేక అన్ని పక్షాల ఐక్యసంఘటన" అనే ప్రాతిపదికను గూడ త్రోసిబుచ్చింది. అట్టి సంఘటనలో సామ్రాజ్యవాద అనుకూలురు, మతత్వదురహంకారరాష్ట్రీయ స్వయం సేవక్ సంఘంతో సంబంధమున్న మతప్రాతిపధిక భారత జనతా పార్టీ కూడా వుంటుంది. కాన తాము వ్యతిరేకిస్తున్నామని సి.పి.ఐ స్పష్టంచేసింది.

జాతీయ ప్రత్యామ్నాయం విషయంపై తమవైఖరిని స్పష్టం చేసిన తరువాత "దేశప్రజల సమస్యలను పరిష్కరించుటలో ఇందిరాగాంధీ వైఫల్యాలను తీవ్రంగా ఖండించుట మాత్రమే చాలదని, ప్రతిపక్ష పార్టీలు వివిధ సమస్యలపై పరిష్కార మార్గాలను సూచించాలన్నారు."[1] సమావేశం, పంజాబ్, అస్సాం, ఎన్నికల సంస్కరణలు,

కేంద్రరాష్ట్రాల నిర్దిష్ట సమస్యలను చర్చించాలని ప్రతిపాదించారు. అంతేగాక ఇందిరాగాంధీ ప్రజావ్యతిరేకచర్యలవలనేగాక, మత, కుల, దురహంకార, వేర్పాటు వాదశక్తుల చర్యలతో దేశ ఐక్యతకు ముప్పుయేర్పడిందని, దానికి సామ్రాజ్యవాదశక్తులు ఆజ్యం పోస్తున్నవని కూడ స్పష్టం చేసారు. ఆశించిన విధంగానే బి.జె.పి జనరల్ సెక్రటరీ యల్.కె. అద్వాని తమపార్టీని విమర్శించుటకు నిరసన తెలిపారు. సి.పి.ఐ బహుగుణనాయకత్వంలోని ప్రజాస్వామ్యసమాజ్‌వాద పార్టీ, కాంగ్రెసు (జె)ల ప్రతినిధులు మత, వేర్పాటు వాద శక్తులను దుయ్యబట్టారు. చివరకు సమావేశపు ప్రకటనలలో కుల, మత వేర్పాటు శక్తులపై విమర్శ చేర్చబడింది. అప్పటికి బి.జె.పి ప్రతినిధి, కాశ్మీర్‌లో ఎన్నికలలో పాల్గొనే నిమిత్తం వెళ్ళుతున్నానని వెళ్ళిపోవుట జరిగింది. తదుపరి సమావేశంలో పంజాబు సమస్యపై చర్చలు జరిపి, పరిష్కార మార్గాలనుశోదించాలని నిర్ణయించింది.

విజయవాడ ప్రతిపక్షపార్టీల సమావేశంలో సి.పి.ఐ పాల్గొనుటను వామపక్ష వర్గాలు కొన్ని ప్రశ్నించకపోలేదు. "సర్వప్రతిపక్ష ఐక్యతా" నిర్మాణం, "సి.పి.ఐ" సమావేశంలో బి.జె.పితోపాటు పాల్గొన్నదనే ఆ విమర్శలు. అయితే ఆ సమావేశ ఫలితాలు పరిశీలించిన, విమర్శకులు తమ అవగాహనలు మార్చుకొనక తప్పదు. ఆ సమావేవంలో సి.పి.ఐ పాల్గొని నందున, మతత్వశక్తులు బలపడకపోగా, వారు లౌకిక, ప్రజాస్వామ్య శక్తులనుండి వేరుచేయబడుట, ఫలితంగా పురోగామ శక్తులు బలపడుట జరిగింది.

విజయవాడ సమావేశానంతరం ఢిల్లీ, శ్రీనగర్‌లలో మరో రెండు సమావేశాలు జరిగాయి. ప్రతిపక్షాలు ఐక్యతవైపు పురోగమించుట, విజయవాడ సమావేశానంతరం శ్రీనగర్ సమావేశం, 5మాసాల కాలంలో బాగా పురోగమించుటతో సి.పి.ఐ కేంద్రనాయకత్వపు అవగాహనకు మరింత బలంచేకూరింది. విజయవాడ, ఢిల్లీ ప్రతిపక్షాల సమావేశాలు, ప్రధమంగా సమావేశాలు తాజా ప్రజా సమస్యలపై శ్రద్ధాశక్తులు కేంద్రీకరించబడ్డాయి. ద్వితీయంగా ప్రజాస్వామ్య లౌకికశక్తుల నుండి మత, బి.జె.పి శక్తులను తదితర ప్రతిపక్ష పార్టీల నుండి వేరుచేయు ప్రయత్నం విజయవంతంగా జరిగింది. అయితే యీ విధంగానే ఎల్లప్పుడు కొనసాగుతుందని, వామపక్ష, ప్రజాస్వామ్య, లౌకికశక్తులు ఐక్యతలో ఆటుపోటు లు వుంటాయని పరిగణలోనికి తీసుకొనవలసి వుంటుంది.

అక్టోబరు 1983లో జరిగిన శ్రీనగర్ సమావేశంపై విధానాన్ని మరి కొంతమంది ముందుకు తీసుకెళ్ళింది. అక్టోబరు 17-19, 1983లో ఢిల్లీలో జరిగిన సి.పి.ఐ కేంద్రకార్యవర్గ సమితి సమావేశం, శ్రీనగర్ సమావేశపు సుముఖ ఫలితాలకు స్వాగతం చెప్పింది. అటువంటి ప్రతిపక్ష సమావేశాలు సరియైనవనే తమ పార్టీ విశ్వాసాన్ని బలపరచిందని స్పష్టం చేసింది.

---

1. రాజేశ్వరరావు సి. *(1983)* ఆన్ ఢిల్లీ మీటింగ్ ఆఫ్ నాన్ కాంగ్రెసు (ఐ) పార్టీస్, పార్టీలైఫ్ నం.*13, 1983.* పే. *1-2.*

"మేము రెండు అంశాలను స్పష్టం చేయదలచాము." అని ఫరూఖీ యీవిధంగా వివరించారు. "ప్రథమంగా. కొందరి ప్రయత్నమైన "సర్వ ప్రతిపక్ష ఐక్యత" అనగా వామపక్ష, మితవాద, మధ్యేమార్గవాదులందరి ఐక్యతను కాంగ్రెసు (ఐ)కు ప్రత్యామ్నాయంగా నిర్మించుటను త్రోసివేయబడింది. మా సూత్రబద్ధ ధృఢవైఖరి. వామపక్ష, ప్రజాస్వామ్య, లౌకిక శక్తులతోవిజయవాడ సమావేశంలో మా సంప్రదింపులు యీ సుముఖ పరిణామాలకు దారి తీసింది. విజయవాడ సమావేశాన్ని కొంతమంది సూచించిన విధంగా బహిష్కరించినచో, యీసత్ఫలితాలు సంభవించేవికావు. అయినా, "సర్వప్రతిపక్ష ఐక్యత" ప్రతిపాదనలు రాజకీయరంగం నుండి పూర్తిగ వదలివేయబడలేదు.[1]

అదే కాలంలో "బి.జె.పి ప్రతిపాదనయైన జాతీయ ప్రజాస్వామ్య ఐక్యసంఘటన", కమ్యూనిస్టులు లేని అన్ని ప్రతిపక్ష పార్టీల సంఘటన అనే అంశం పైకి వచ్చింది. బి.జె.పి నాయకత్వం, అభివృద్ధి నిరోధక, జాతీయ ప్రజాస్వామ్య సంఘటనను రూపొందించే ప్రయత్నంలో లోక్‌దళ్‌నాయకత్వాన్ని చేరువ కాగలిగింది. దీనితో పాటే, ఐదు పార్టీల లౌకిక ప్రజాస్వామ్య వైఖరి గల ఐక్యసంఘటన రూపొందింది. రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ పునాదిగా బి.జె.పి నాయకత్వంలో చేరుటకు నిరాకరించారు. ఐక్యసంఘటన నాయకులు బి.జె.పికి ఆర్.యస్.యస్ తో గల సంబంధాన్ని ప్రధానాంశంగా చేసి మైనారిటీలు ఆర్.యస్.యస్ పై భయ, ఆందోళనలు వెలిబుచ్చి ప్రధానాంశం చేసారు.

ప్రతిపక్షాల నుండి, లౌకిక ప్రజాస్వామ్య శక్తుల నుండి, కరుదు గట్టిన అభివృద్ధి నిరోధక పార్టీయైన బి.జె.పిని వేరుచేయుటనే ద్వితీయాంశాన్ని మన దృష్టికి తెచ్చింది. ఇది సి.పి.ఐ ఎత్తుగడలలో అంత్యంత కీలకమైనది, వామపక్ష ప్రజాస్వామ్య శక్తుల ఐక్యతా నిర్మాణంలో ప్రాముఖ్యత గల అంశంగా చెప్పవచ్చు. ప్రతిపక్ష పార్టీల, విజయవాడ, ఢిల్లీ, శ్రీనగర్ సమావేశాలలో యీమార్గంలో గణనీయమైన విజయాన్ని సాధించామని సి.పి.ఐ పేర్కొన్నది.

విజయవాడ సమావేశంలో, దేశ ఐక్యత కాంగ్రెసు (ఐ) ప్రజావ్యతిరేకచర్యలతోనే గాక, వేర్పాటు వాద మతశక్తుల చర్యలతో ప్రమాదంలో పడుతున్నదన్న వాస్తవాన్ని తీర్మానంలో పేర్కొన బడాలని సి.పి.ఐ పట్టుబట్టింది. అంచేతనే బి.జె.పి నాయకుడు అద్వాని ఆ సమావేశం మధ్యలో వెళ్ళిపోయారు.

ఢిల్లీ సమావేశంలో కమ్యూనిస్టులను మినహాయించి అన్ని ప్రతిపక్ష పార్టీల సంఘటనను జాతీయ ప్రజాస్వామ్య సంఘటన యేర్పాటుకు బి.జె.పి ప్రయత్నాలను అందరు వ్యతిరేకించుటతో అపజయం పొందింది. ప్రతిగా, ఐదు ప్రతిపక్షాల, లౌకిక ప్రజాస్వామ్యశక్తుల సంఘటన రూపొందే సుముఖ పరిణామం అభివృద్ధి చెందింది.

మరో పేర్కొనదగిన పరిణామం, కాంగ్రెసు (ఐ) నుండి సయ్యద్ మీర్ ఖాశిం

---

1. *ఫరూఖి. యం.(1983) ఫ్రమ్ విజయవాడ నుండి శ్రీనగర్ ప్రతిపక్ష ప్రజాస్వామ్య ఐక్యతాభివృద్ధి క్రమం. పార్టీలైఫ్ నం.21, 1983. పే.2-3.*

రాజీనామా చేసి, శ్రీనగర్ ప్రతిపక్ష పార్టీల సమావేశాలలో పాల్గొన్నారు. అతివాదంవైపు మొగ్గుచూపే మధ్యేమార్గ రాజకీయ విధానాలవైఖరిని ప్రధానంగా అవలంబించాడు.

శ్రీనగర్ ప్రతిపక్ష పార్టీల సమావేశంలో మరోసారి "సర్వప్రతిపక్ష ఐక్యత" పేరుతో బి.జె.పి లోక్‌దళ్‌ను కూడ తీసుకొని వచ్చే ప్రయత్నంరం కొందరు చేసినా అది నెరవేరలేదు, ముఖ్యంగా బి.జె.పి.ని ప్రత్యేకంగా స్పష్టంగా అందరూ వ్యతిరేకించారు. ఈవిధంగా లౌకిక, ప్రజాస్వామ్య వామపక్ష ఐక్యత రూపొందుమార్గంలో శ్రీనగర్ సమావేశం, వొక నూతన దశకునాంది అయింది. ఈవిజయాలను ఐక్యకార్యాచరణలో పతిష్ట మొనర్చ వలసిన అవసరం యేర్పడింది. సంయుక్త ప్రజాకార్యాచరణకు పునాది అయ్యే ప్రజాసమస్యలపై చర్చలుజరిపి, ధరలు పెరుగుదలపై వామపక్షాలతో కలసి పోరాటాలు జరుప నిర్ణయించారు.

ఈ సందర్భంలో ఢిల్లీలో సెప్టెంబరు 1980లో ధరల పెరుగుదల, మతసామరస్యం, పౌరహక్కులపై జరిగిన జాతీయ కన్వెన్షన్ "నేటి పరిస్థితి కార్యాచరణకు పిలుపు" అన్న పత్రాన్ని విడుదలచేయుట గుర్తుంచుకొనవలసి వుంది. ఆ జాతీయ కన్వెన్షన్ లో కాంగ్రెసు (యు), లోక్‌దళ్, సి.పి.ఐ, సి.పి.ఐ(యం) రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ, ఫార్వర్డ్ బ్లాక్‌లు పాల్గొన్నవి. ఎంచేతనో యీ సమావేశానంతరం, కాంగ్రెసేతర ప్రతిపక్షాల సమావేశ నిర్ణయాలు ప్రజలలో ప్రచారం పొందజాలకపోయాయి. కాని జూన్ 1981లో జాతీయ ట్రేడు యూనియన్ కాంగ్రెస్ మినహా మిగతా జాతీయ ట్రేడు యూనియనులు కలసి నేషనల్ కాంపెయిన్ కమిటిని యేర్పరచుకొన్నవి. ఈ కమిటి భారత కార్మికవర్గాన్నంతా సమీకరించే సంస్థగా రూపొందింది. దీని ఆధ్వర్యంలోనే నవంబరు 1981లో బ్రహ్మాండమైన కార్మికవర్గ ప్రదర్శనలు జరిగాయి. కాంగ్రెసు (ఐ) ఢీల్లీ కిసాన్ మేలాకు ప్రతిగా మార్చి 1981లో భారత రైతాంగ ఢీల్లీ యాత్ర, ప్రదర్శన జరిగాయి. అదే సంవత్సరంలో భారత విద్యార్థి, యువజన ప్రదర్శన ఢీల్లీలో జరిగింది. వీటి శిఖరాగ్రంగా మార్చి 1982లో ఢీల్లీలో చరిత్రాత్మక."శాంతియాత్ర" జరిగింది. ఈ ఐక్యకార్యాచరణలన్నీ, బహుళ సంఖ్యాకులైన కాంగ్రెసేతర రాజకీయ పార్టీల ప్రజాసామాన్యం పాల్గొన్నందువలననే విజయవంతమయ్యాయి. పాలక కాంగ్రెసు (ఐ) నియంతృత్వ పోకడలను ప్రతిఘటించుటకై యింకా అప్పటికి కాంగ్రెసేతర ప్రతిపక్ష పార్టీలు సమావేశాలు జరుగటలేదు. కాని యీ ఐక్యకార్యాచరణల నేపథ్యంలో అట్టి అవగాహనలు 1983లో కార్యరూపం ధరించాయి. మొదటి, కాంగ్రెసేతర ప్రతిపక్ష పార్టీల సమావేశం మే 1983లో యన్.టి.రామారావు, ఆంధ్రప్రదేశ్ ఛీఫ్ మినిష్టరు చొరవతో జరిగింది. ఈ విజయవాడ సమావేశానంతర కాలంలో అభిప్రాయాలను పరస్పరం తెలుసుకొని చర్చించికొనుటకు నాలుగు సమావేశాలు జరిగాయి. జాతీయ ప్రాముఖ్యతగల కేంద్ర–రాష్ట్రాల మధ్య సంబంధాలు, పంజాబ్, అస్సాం, తదితర జాతీయైక్యతా సమస్యలపై చర్చలు, సంప్రదింపులు జరిపి కాంగ్రెసు (ఐ) ప్రభుత్వపు ప్రజావ్యతిరేక ఆర్థికవిధానాలపై ప్రజా ఐక్యకార్యాచరణకై కార్యక్రమాన్ని ఆమోదించారు. నిరుద్యోగం, దారిద్ర్యం, దీనస్థితితో యేర్పడిన ప్రజా అసంతృప్తికి నిర్మాణరూపమిచ్చారు. రైతాంగంలో కూడా ఎరువుల ధరల పెరుగుదలతో యేర్పడిన

అసంతృప్తి "రాస్తారుకో" వుద్యమంగా మహారాష్ట్రలో పెల్లుబుకుట వుదాహరణగా చెప్పవచ్చును.[1]

"విజయవంతమైన కాంగ్రెసేతర ప్రతిపక్షాల సమావేశాలను, తాజాగా కలకత్తా సమావేశం కూడ, ప్రతిపక్షాల ఐక్యసంఘటనగా కాని లేక ఏకపక్ష గుత్త ప్రజావ్యతిరేక పాలనకు ప్రత్యామ్నాయాంగా చెప్పుట తప్పు అగుతుంది. పదకొండు అంశాల కోర్కెల ప్రకటన రూపొందించుట విజయం సాదించుట, అదియేకగ్రీవంగా ఆమోదించబడుట, ఆ ఆశయసాధనకై పనిచేయుట ఎంతో వుత్సాహాన్ని, ఆశ, సాహసాల నిచ్చింది. ఆకర్యక్రమాంశాలో గల భేదాభిప్రాయాలు, దేశవిదేశాంగ విధానంపై అనేక ప్రశ్నలు వుదయించుతునే వుండుట తక్కువగా చేసి చెప్పుటగాదు, వాటిని మరుగుచేయుటగాదు, వాస్తవికతను గుర్తించుట అవసరము.

"ఈ నాలుగు సమావేశాలు ప్రత్యేకంగా జనవరి 1984 కలకత్తా సమావేశం, కరుడుగట్టిన హిందూత్వ బి.జె.పి రాజకీయ ఎత్తుగడలపంధాని, పచ్చి కమ్యూనిస్టు వ్యతిరేక, సిగ్గులేని సామ్రాజ్యవాద అనుకూల, వేర్పాటు వాద విధానాలను చర్యలను సహించుతు, కాంగ్రెసు (ఐ) శక్తులను, వామపక్ష, ప్రజాస్వామ్య శక్తులను మత, కుల, శక్తుల నుండి వేరుచేయుట జఠిలమైనది. ఆశక్తులే జాతీయ ఐక్యతకు, ప్రజాస్వామ్య పరిరక్షణకు పోరాడగలవనుటతో యీ సమస్య మరింత జఠిలమైంది. ఈ చర్యలన్నిటిలో పార్టీ క్రియాశీలంగా పాల్గొనుట, సి.పి.ఐ(యం) రాజకీయపంధాననుసరించే జరుగుతున్నది. సి.పి.ఐ(యం) వొక తీర్మానంలో వామపక్ష ఐక్యతను నొక్కిచెప్పింది.

అంతేగాక అనేక బూర్జువా ప్రతిపక్షపార్టీలు, దేశంలోని నిర్మాణయుతమైన వామపక్షపార్టీతో కలసి ఐక్యసంఘటన నేర్పరచి, పనిచేయుటకు ముందుకువచ్చుటతో, బి.జె.పి లోక్‌దళ్‌ల జాతీయ ప్రజాస్వామ్య ఐక్యసంఘటనలో వొత్తిడిచేసి బూర్జువా పార్టీలతోయేర్పాటు చేద్దామనుకొన్నవారి ఎత్తుగడల పునాదులు కదలిపోయాయి. దీనిని పరిగణలోనికి మేము తీసుకొన్నా జాతీయ ప్రజాస్వామ్యసంఘటన, బి.జె.పి. లోక్‌దళ్‌ల భవిష్యత్తుల గురించి యెట్టి వూహగానాలు చేయజాలము. యేదుష్టశక్తి, జాతీయ ప్రజాస్వామ్య ఐక్యతను అడ్డుకొనజాలదు, జాతీయ ప్రత్యామ్నాయంగా మలచుటకు ప్రజలలో అట్టి ఆశా వాతావరణాలను కలుగజేయజాలదు" అని నివేదిక వివరించింది. భవిష్యత్తుని గురించిన యీవూహాగానం అంచెనా తప్పని 1990 దశకపు పరిణామాలు స్పష్టం చేసాయి.[2]

## 3.4. వివిధ సమస్యలపై ఐక్య ప్రజాపోరాటాలు

ఈ శీర్షిక క్రింద పేర్కొనిన ప్రజలదైనందిన సమస్యలపై జరిగిన సత్యాగ్రహాలు,

---

1. సి.పి.ఐ(యం) ఫిబ్రవరి 1984లో కేంద్రకమిటీ. ఆమోదించిన నివేదిక (ఆంగ్లంలో) పే.64.
2. సి.పి.ఐ(యం) ఫిబ్రవరి 1984లో కేంద్రకమిటీ. ఆమోదించిన నివేదిక (ఆంగ్లంలో) పే.65.

ప్రదర్శనలు, సమ్మెలు, ఐక్యపోరాటాలతోపాటు వివిధ పార్టీలు స్వతంత్ర ముఖ్య పోరాటాలు తెలుసుకుందాము.

అక్టోబరు 4. 1982న ఢిల్లీలో జరిగిన శాంతియాత్రప్రదర్శన పొడవు, బోటు క్లబ్‌నుండి ఇండియాగేటు వరకు వున్నది, ప్రపంచశాంతి సంఘపు మాజీ అధ్యక్షుడు రమేశ్‌చంద్ర, ప్రపంచంలో ఎన్నో ప్రదర్శనలు చూసానని. అత్యంతపెద్దది న్యూయార్క్‌లో జరిగిందని దానికి దీటుగాయిది వున్నదని వ్యాఖ్యానించారు. అఖిలభారత శాంతి, సౌహార్దతల సంఘం రెండు దశాబ్దాలు పైగా ప్రజలలో యుద్ధ వ్యతిరేక, అణుబాంబుల వ్యతిరేక శాంతి మహోద్యమాన్ని కొనసాగించుచున్నది. అందులో అన్ని రాజకీయ పార్టీలకు, మతాలకు, విశ్వాసాలకు చెందినవారు, రచయితలు, కళాకారులు, శాస్త్రజ్ఞులు విద్యావంతులు యెందరో వున్నారు. వారందరి కృషి, సహకారాల ఫలితమే 15 లక్షలమంది శాంతి ప్రదర్శనలో పాల్గొనుట జరిగింది. భారత వామపక్ష ప్రజోద్యమాలు, ప్రజలు యుద్ధం-శాంతి, అణుప్రపంచయుద్ధ ప్రలాపి అమెరికా విధానాల యెడల అప్రమత్తతా ప్రదర్శనగా తలచవచ్చును.

ప్రపంచ ట్రేడు యూనియన్ కాంగ్రెసు, సెప్టెంబరు 1న యుద్ధ వ్యతిరేకదినంగా జరుపండని యిచ్చిన పిలుపు ననుసరించి, "ఎఐటియుసి" "సిటు"లు సంయుక్తంగా వేరువేరుగా వేలకొలది సమావేశాలు. ప్రదర్శలు దేశమంతటా జరిపారు. అనేక యితర సంస్థలు యీ కార్యక్రమాలలో పాల్గొన్నవి. ఈ స్ఫూర్తి కొనసాగింపుగానే, ఢిల్లీ శాంతి యాత్రకు వూపు, వుత్సాహం లభించింది. బీహారులో అన్ని ప్రాంతాలలో ప్రతి గ్రామీణ అభివృద్ధి సమితులలో సమావేశాలు ప్రదర్శనలు 400లు జరిగాయి. అందులో వొక్క సెప్టెంబరు 1వ తేదీనే 250 సమావేశాలు జరిగాయి. అదేవిధంగా తదనంతరం కూడా జరిగాయి.

ఈ శాంతి పోరాటాలు సాంప్రదాయకంగా సామ్రాజ్యవాద వ్యతిరేకతను శాంతి యుద్ధవ్యతిరేక, అలీనవిధానాలను, జాతీయ విముక్తి పోరాటాలను, భారత-సోవియట్ యూనియన్ స్నేహ, సంబంధాలను బలోపేతం చేయుటకు తోడ్పడినవి. ప్రజాసామాన్యానికి ఆవిధంగా వివరించినపుడు వారి స్పందన సుముఖంగా వుంది. అంతేగాక యీ శాంతి పోరాటాలు, తమ జీవితాలను మెరుగుపరచుకొనే దైనందిన పోరాటాలతో సమ్మేళనమయ్యాయని. పరస్పరం బలపరచుకొంటున్నవని. అనుభం స్పష్టం చేస్తున్నది. ఈ పోరాటాలు సామ్రాజ్యవాదుల యుద్ధ ప్రలాపాలపై కేంద్రీకరించబడినా, ప్రజలలో వారిలో స్వాతంత్ర్య పరిరక్షణ, దేశ సమగ్రత, వారి జీవన పరిస్థితులను మెరుగుపరచుకొనే పోరాటాలలో అనుసంధించబడి యుండుటతో, వారి పోరాట వుత్సాహాన్ని పెంపొందించాయి., ఇదే శాంతిపోరాటాల రాజకీయ ప్రాముఖ్యత. బీహారులో యీ పోరాటాలే, ప్రెస్‌బిల్లు, ఇండియన్‌పీనల్, క్రిమినల్ పీనల్‌కోడుల సవరణల పోరాటంగా రూపొందింది, జగన్నాథ్‌మిశ్రా ప్రభుత్వపు తొలగింపు రాజకీయపోరాటాంగా రూపొందాయి. జర్నలిస్టులు, న్యాయవాదుల, యువకులు, విద్యార్థులు, కార్మికులు, కర్షకులు అన్ని వర్గాల వారు పాల్గొన్నారు. పాట్నా బందు, బీహారు బందు పోరాటాలుగా

పరిణామమొంది, మిశ్రా ప్రభుత్వాన్నిదించివేసాయి. పంజాబులో కమ్యూనిస్టు వుద్యమం యీ శాంతి పోరాటాన్నే పాకిస్తాన్ ప్రమాదకర ఆయుధీకరణ వ్యతిరేకపోరాటాలతో సమ్మిశ్రం చేసి, వేర్పాటు వాదులకు వ్యతిరేక పోరాట వైఖరిని చేకూర్చింది.

రాజస్తాన్ యు.పి, యం.పి లలో అనేక సదస్సులు, సమావేశాలు, ప్రదర్శనలు అన్ని ప్రధానకేంద్రాలలో జరిగాయి. వీటిలో సి.పి.ఐ: సి.పి.ఐ (యం): పార్వర్డ్ బ్లాక్, రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ, డెమోక్రటిక్ సోషలిస్టుపార్టీల అగ్రనాయకులు పాల్గొన్నారు. వీటన్నిటి ప్రభావంలోనే కలకత్తా, విజయవాడ, హైదరాబాద్, త్రివేంద్రం, కాలికట్, బెంగుళూరు, మద్రాసులలో బ్రహ్మాండమైన శాంతియాత్రలు, ప్రదర్శనలు, బహిరంగసభలు జరిగాయి. ప్రజలను కదిపివేసే, జాతీయ, ఆర్థిక, ప్రజాస్వామ్య సమస్యలపై బ్రహ్మాండమైన ప్రజాసమీకరణ, వుద్యమాలు కొనసాగించవచ్చు అనే గుణపాఠాన్ని, వామపక్ష, ప్రజాస్వామ్య శక్తులు నేర్చుకొన్నాయి. విజయం సాధించగలమనే విశ్వాసాన్ని పెంపొందించాయి.

బెంగాల్ రాష్ట్ర పార్టీ కమిటి నివేదికలో "సెప్టెంబరు 3, యుద్ధ వ్యతిరేక ప్రజాసమీకరణ, యీ కాలంలో ముఖ్య కార్యక్రమం అయింది. పాలస్తీనా విముక్తి సంస్థ నాయకత్వం భారత సందర్శన సందర్భంలో వారిని బలపరస్తూ సాగించిన సౌహార్ద వుద్యమంలో సి.పి.ఐ, సి.పి.ఐ(యం)లు ప్రధాన పాత్ర వహించాయి." అంతేగాక రాష్ట్రంలోని "అన్ని పార్టీలు, వివిధవర్గాలు" పాల్గొన్నవని, కేంద్రాకమిటికి నివేదించింది.[1]

సామ్రాజ్యవాద వ్యతిరేక, ప్రపంచయుద్ధ వ్యతిరేక, శాంతిపోరాటాల, రాజకీయ ప్రాముఖ్యతపై సి.పి.ఐ జాతీయ సమితి యిలా వ్యాఖ్యానించింది. "ప్రథమంగా, వివిధ రాజకీయశక్తుల విస్తృత వర్ణచక్రానికి, వామపక్షాలు నిర్మించిన ప్రజాబాహుళ్య ఢీల్లీ ప్రదర్శన ప్రతిబింబిస్తున్నది. ఆకాలంలో పార్టీ లౌకిక, ప్రజాస్వామ్య ప్రతిపక్ష పార్టీలతో రూపొందించి, పెంపొందించిన రాజకీయ అవగాహనలవలన, రెండు లక్షలు పాల్గొన్న బ్రహ్మాండ ప్రదర్శన సాధ్యమైంది." అని సి.పి.ఐ వివరించింది. ద్వితీయంగా, "సదస్సులో ఆమోదించిన, ప్రకటన, ప్రపంచంలో ఘర్షణ తీవ్రత పరుగుటకు, నూతన ఆయుధీకరణ వ్యాప్తికి అమెరికన్ సామ్రాజ్యవాదం దాని మిత్రులు భాధ్యత వహించవలసివుంటుందని నిర్దిష్టంగా వొక్కాణించి, తమ యుద్ధవ్యతిరేకతను స్పష్టం చేసింది. జియా పాకిస్తాన్ ప్రభుత్వానికి విస్తృత ఆయుధ సహాయాన్ని అందించుతు మనదేశ జాతీయ సమగ్రతకు ముప్పు తెస్తున్నదని నొక్కి చెప్పింది. భారతదేశం యుద్ధ వ్యతిరేక శాంతి పోరాటాలలో ప్రముఖ పాత్ర వహించుచున్నదని విశ్వసించుతున్నది"[2] అని స్పష్టం చేసింది.

ఈ కాలంలో కమ్యూనిస్టు వుద్యమ వివిద శ్రేణులు అధిక దరలపై, నిరుద్యోగం, వ్యవసాయ వుత్పత్తులకు గిట్టుబాటు ధరలు వేతనాల పెరుగుదలలకై, ప్రభుత్వ

1. *గత కేంద్రకమిటి సమావేశానంతర కార్యాచరణపై పశ్చిమ బెంగాల్ (సి.పి.ఐ) నివేదిక పార్టీలైఫ్. నం.21. 1982. పే.10-11.*
2. *సి.పి.ఐ జాతీయ సమితి. ఏప్రిల్ 1984లో ఆమోదించిన. నివేదిక. తీర్మానాలు (ఆంగ్లంలో) సి.పి.పబ్లికేషన్ పే.18.*

ప్రజాస్వామ్యవ్యతిరేక చర్యలను ప్రతిఘటించుటకు అనేక కార్మిక, కర్షక, విద్యార్థి, యువజన ప్రజోద్యమాలను నడిపారు. కొన్ని ముఖ్యవుద్యమాలను, ఆందోళనలను పేర్కొనవలసివుంది.

ఒరిస్సాలో 1983లో అక్టోబరు చివరలో ప్రకృతి అవాంతరాలతో కలిగిన యీతి బాధలకు సహాయం అర్థించుతు 25వేలమంది అందులో 15వేలమంది స్త్రీలు సత్యాగ్రహం చేసి అరెస్టు అయ్యారు. బ్రహ్మాండమైన ప్రజాసమీకరణ, వూరేగింపులు, సమావేశాలు, ఆందోళన కొనసాగించారు.

తమిళనాడులో అక్టోబరు 20న, 14 ప్రతిపక్ష పార్టీల పిలుపుననుసరించి వేలకొలది ప్రజాసామాన్యం ప్రదర్శనలు చేసారు. తిరిగి డెశెంబరు 15వ తేదీన లక్షా పదిహేనువేల మంది ప్రదర్శన జరిపి 435 ప్రభుత్వ ఆఫీసుల వద్ద పికెటింగులు ప్రదర్శనలు చేసారు. ఈ ఆందోళనలో ప్రధానంగా డి.యం.కె; సి.పి.ఐ; సి.పి.ఐ(యం) ల కార్యకర్తలు విస్తారంగా పాల్గొన్నారు. మహారాష్ట్రలో మూడు వామపక్ష పార్టీల పిలుపుతో నవంబరు 22న ప్రతి తాలూకా కేంద్రంలో ప్రదర్శనలు జరుపగా 40వేల మందిని అరెస్టు కావించబడ్డారు. ఈసందర్భంలో బొంబాయి సమీపంలోని ఊరాన్‌లో జరిగిన రైతాంగ పోరాటాన్ని ప్రత్యేకంగా వుదహరించవలసిన వున్నది. వారి భూములను నూతన హార్బరు నిర్మాణం కొరకై ప్రభుత్వం స్వాధీనం సేసుకొనునపుడు ప్రతిఫలం తగిన విధంగా యివ్వాలని కోరుతూ, ప్రభుత్వం గతంలో చేసిన వాగ్దానాలను పాటించాలని ఆందోళన సాగించారు. శాంతియుతంగా జరుపుతున్న ఆందోళనపై పోలీసులు కాల్పులు జరిపి ఆరుగురు మరణానికి కారణ భూతులయ్యారు. ప్రతివక్ష రాజకీయ పార్టీలన్నీ, ట్రేడు యూనియనులన్నీ ఉరాన్ రైతాంగానికి అండగా ఆందోళన చేసాయి. జనవరి 31న బొంబాయి-బెలాపూర్ ప్రాంతమంతా బ్రహ్మాండమైన బందు జరిగింది. మహారాష్ట్ర అంతటా వేలకొలది అరెస్టు కాబడ్డారు. అన్ని పక్షాలు పాల్గొన్న సంయుక్త పోరాటం చివరకు పూర్తి విజయం పొందింది. పోరాటకాలం కార్మిక, కర్షక ఐక్యత ప్రగాఢంగా ప్రదర్శితమైంది. మహారాష్ట్ర విద్యుత్శక్తి కార్మికులు 75వేలమంది మొదట 3రోజులు, తదుపరి మరో 7రోజులు సమ్మె పోరాటం జరిపారు.

గుడ్డల మిల్లుల కార్మికులు 1983లో రిట్రెంచిమెంటు, మిల్లులు మూసివేయుట, లాకౌట్లకు వ్యతిరేకంగా హిస్సార్, పుదుచ్చేరి, ఢిల్లీ, అహమ్మదాబాద్, బొంబాయిలలోని 21 మిల్లులులో సమ్మెపోరాటం సాగించారు. ఈపోరాటం ప్రధానంగా మిల్లులు తెరచి పనిచేయించుటకై జరిగింది. కొన్ని మిల్లులను ప్రభుత్వం తన యాజమాన్యంలోనికి తీసుకొన్నది. లాకౌట్లకు మూసివేతలకు వ్యతిరేకంగా జనవరి 1983లోట్రేడుయూనియన్‌ల జాతీయ సమన్వయ కమిటి కన్వెన్షన్ జరిపింది. కన్వెన్షన్ ప్రత్యామ్నాయ పంథాను కార్మికవర్గం ముందుంచి, సమస్యపై ప్రజోద్యమనిర్మాణానికై పిలుపు నిచ్చింది.

ఈ కాలంలోని మరో ముఖ్య పోరాటం, 3లక్షల రేవు కార్మికులు 26 రోజులు జరిపిన సమ్మె పోరాటాము., ప్రభుత్వం దిగివచ్చి తగినంతగా వేతన పెంపును, గృహ

అద్దె అలవెన్సులను పెంచింది. జాతీయ ట్రేడుయూనియన్ కాంగ్రెసు అధ్వర్యంలో జూట్, విద్యుత్శక్తి, రేవు కార్మికులు యీ సమ్మె పోరాలలో పాల్గొనుట నూతనాంశము. ఇది ఐక్యకార్యాచరణకు యెంతో దోహదకారి అయింది. మరో ముఖ్యాంశం. జూట్, గుడ్డలమిల్లుల కార్మికులు యీ పరిశ్రమలను జాతీయం చేయాలనే రాజకీయ విధానాన్ని చేబట్టుట.

పంజాబ్‌లో ప్రత్తి, తదితర వ్యవసాయ పంటలకు గిట్టుబాటు ధరలకై జరిగిన ఆందోళనలో సి.పి.ఐ, సి.పి.ఐ(యం)లు తమ కిసాన్ సభల ద్వారా సంయుక్తంగా పాల్గొన్నారు. అకాలీదళ్‌నాయకత్వంలోని రైతాంగం తదితర సంస్థలు పాల్గొని, పోరాడి ప్రభుత్వం నుండి గణనీయమైన రాయితీలను పొందగలిగారు. ఈ పోరాటాలు ఐక్యకార్యాచరణకు యెంతో దోహదపడ్డాయి.

ఈ కార్మిక, కర్షక పోరాటాలు మధ్యతరగతి వర్గాలు ముఖ్యంగా ఉపాధ్యాయులు, ప్రభుత్వోద్యోగులు పడిపోతున్న తమ జీవప్రమాణాలకు వ్యతిరేకంగా, వేతనాల పంపుకు, కరువుబత్తెం, ఇంటి అద్దె అలవెన్సులకై జరిపే పోరాటాలకు పరోక్షంగా బలపరచి, ప్రోత్సహించాయి. కేరళలో, నాన్‌గెజెటెడ్ ప్రభుత్వోద్యోగులు, ఉపాధ్యాయులు జనవరి 1984లో రెండు వారాలు సమ్మె పోరాటం కొనసాగించి, నెలకు రు35-45లు వరకు తాత్కాలిక సహాయాన్ని పొందగలిగారు. కేంద్రప్రభుత్వోద్యోగులు ధర్నా, నిరాహారదీక్షలతో పాటు, ప్రదర్శనలు, యివ్వవలసివున్న కరువు బత్తెపు బకాయిలను విడుదలచేయమని, ఆందోళన చేసారు. ప్రభుత్వం మూడు విడతలను మాత్రం విడుదలచేసి, యింకా బకాయిలను పెట్టుతో తమ ఆందోనను కొనసాగించవలసివచ్చింది. అఖిలభారత బ్యాంకి ఎంప్లాయిసీ అసోషియేషన్ స్టేటు బ్యాంక్ ఆఫ్ ఇండియా ఫెడరేషనుల నాయకత్వంలో, నాల్గవ పాక్షిక సంప్రదింపులలో ఆమోదించిన కోర్కెలకై ఆందోళన కావించారు. జీవిత భీమా వుద్యోగులు ఒక గంట పనిని ఆపు చేయుట, ప్రదర్శనలు వారి సంఘాన్ని రెండుగా చీల్చే బిల్లును ప్రవేశపెట్టినందుకు వ్యతిరేకంగా చేసారు. జి.ఐ.సి వుద్యోగులు సమిష్టిగా వారి కోర్కెలు ప్రకటించుహక్కును హరించు, చట్టాన్ని సవరించుటకై ఆందోళన జరిపి, విజయం సాధించారు. ఈవిజయం వారికి హైకోర్టు నుండి లభించింది.

వీటితోపాటు, పశ్చిమబెంగాల్‌లో 50వేలమంది లేసు అల్లికపనివారు, మూడు మాసాలు తమ వేతనాలపెంచుటకు, పనికి సదుపాయాలు కలుగజేయుటకై సమ్మె చేసారు. రవాణాకార్మికులు హిమాచల్‌ప్రదేశ్‌లో కొన్ని మార్గాలను విజాతీయకరణ చేయుటను వ్యతిరేకించుతు సమ్మె ప్రదర్శన కావించారు.

తమిళనాడులో శ్రీరామచంద్రన్ ప్రభుత్వపు కార్మికవ్యతిరేక విధానాలను నిరసించుతు సెప్టెందరు 12 మేజువాణి సమ్మె, ప్రదర్శనలు చేసిన 9,500మందిని ఎ ఐటియుసి, కార్యకర్తలను అరెస్టు చేసారు. ఈ ఐక్యకార్యచరణలో ఎఐటియుసి, సిటు, డి.యం.కెల నాయకత్వాలలోని రమారమి 10లక్షల కార్మికులు పాల్గొన్నారు. 50వేల మందిని అరెస్టుచేసారు. అదే కాలంలో పుదుచ్చేరిలో పికెటింగ్ చేసినందుకు అరెస్టు కావించబడ్డారు.

ఇంటర్నేషనల్ ఇన్స్ట్రుమెంట్ ఫ్యాక్టరీ యాజమాన్యానికి కర్నాటక ప్రభుత్వానికి ఫ్యాక్టరీని తెరిపించుటకై వేతన తగ్గింపుకు వ్యతిరేకంగా జరిగిన ఆందోళన ప్రదర్శనలలో బెంగుళూరులోని 120 ఫ్యాక్టరీలలోని కార్మికులు మద్దతుగా సహకార, సౌహార్ద్ర ప్రదర్శనలలో పాల్గొనుట ప్రత్యేకంగా చెప్పవలసివుంది.

సెప్టెంబరు 4న 35లక్షల మునిసిపలు, రాష్ట్ర ప్రభుత్వ, తత్సంబంధ వుద్యోగులు, చాల రాష్ట్రాలలో సమాన పనికి సమాన వేతనాలు, బోనసులు కొరకు వొక రోజు మేజువాణి సమ్మెచేసి, ఆందోళనలు కొనసాగించారు. కేంద్ర ప్రభుత్వోద్యోగులు కూడ ప్రజాపదర్శనలు, ధర్నాలు నాల్గవ పేకమిషన్, కరువు బత్తెం విడతల చెల్లింపులకై జరిపారు. రాంచి భారీ ఇంజనీరింగు పరిశ్రమలోని కార్మికులు ఎఐటియుసి, ఐయన్టియుసీ ల నాయకత్వాల సమిష్టి పోరాటం గావించాయి.

జూన్-జులై 1984లో సి.పి.ఐ, భారత కృషీకార్ మజ్దూర్‌యూనియన్, అఖిలభారత కిసాన్ సభలు వ్యవసాయ భూముల ఆక్రమణ పోరాటాన్ని సాగించాయి. ఇది ప్రధానంగా ఆధ్రప్రదేశ్‌లోని చల్లపల్లిలో, బీహార్‌లోని 78మంది భూస్వాములపై ప్రారంభచర్యగా జరిగింది. బీహార్‌లోని ముజఫర్‌పూర్ జిల్లాలోని మోతిపూర్ ప్రాంతంలోని పంచరోడ్కి భూస్వాముల గరిష్టపరిమితికి మించిన భూములను, వ్యవసాయకూలీలు, భూములు లేని పేదరైతాంగం ఆక్రమణ రూపంలో కొనసాగింది. తీవ్రపోలీసు నిర్బంధవిధానానికి గురైంది. ప్రారంభంలో కొంత తటపటాయించినా, సి.పి.ఐ(యం) శ్రేణులు కొన్ని కేంద్రాలోల పాల్గొన్నవి. తమిళనాడు, యు.పి; యంపి, పశ్చిమబెంగాలులోని కొన్ని ప్రదేశాలలో యీ పోరాటం జరిగినట్లు పత్రికలు ప్రకటించాయి, కాని విస్తృత అఖిలభారత ప్రజాపోరాటంగా రూపొందలేదు. కేంద్ర ప్రభుత్వం వ్యవసాయకూలీల సమగ్రచట్టం రూపొందించు ప్రతిపాదనను వదలివేయుటతో, ప్రెసిడెంటుకు సంతకాలవిన్నపము సమర్పించు వుద్యమంతోపాటు కొన్ని ప్రతాలలో భూఆక్రమణ పోరాటాలు సమస్యను వెలుగులోనికి తెచ్చాయి. పరిమిత లక్ష్యం మాత్రమే నెరవేరింది కాని ప్రభుత్వంపై ప్రభావాన్ని కలుగజేసినట్లు కన్పించదు. ఆగస్టు 2, 1984న జాతీయ వ్యవసాయ కూలీల కన్వెన్షన్ ఢిల్లీలో జరిగింది. భారత కృషీకార్ మజ్దూర్ యూనితోపాటు మరో మూడు సంస్థలు, సి.పి.ఐ(యం) నాయకత్వంలోని ఆల్ఇండియా అగ్రికల్చరల్ వర్కర్స్ యూనియన్, ధారా నాయకత్వంలోని ఇండియన్ నేషనల్ అండ్ అలైడ్ వర్కర్స్ ఫెడరేషన్, హింద్ కేత్ మజ్దూర్‌సభలు కలసికన్వెన్షన్ జరిపి, జాతీయ వ్యవసాయ కూలీల సమగ్ర చట్టానికై ఆందోళనకు పిలుపునిచ్చాయి. ప్రాదమికచర్యగా కన్వెన్షన్ యీ క్రింది నాలుగు అంశాల కార్యక్రమాన్ని ఆమోదించింది. అవి 1) జిల్లా, రాష్ట్రస్థాయిలో సెప్టెంబరు 30న సంయుక్త కన్వెన్షనలు, కేంద్ర సమగ్ర చట్టానికై జరుపుట 2) సమగ్ర చట్టానికై ప్రెసిడెంటు విజ్ఞప్తిపై మిలియన్ వ్యవసాయకూలీల సంతకాలు సేకరించుట 3) డిశెంబరు 15లోగా బ్రహ్మాండ ప్రదర్శనలు జరిపి రాష్ట్ర గవర్నరులకు యీ విజ్ఞప్తిని సమర్పించుట 4) జనవరి 1985న జాతీయ వ్యవసాయ కూలి సంఘాల ప్రతినిధులు, ప్రెసిడెంటుకు, ప్రదానమంత్రికి, విజ్ఞప్తిని సమర్పించుటగా కార్యక్రమాన్ని రూపొందించారు. రాష్ట్రాలలో

యీ కార్యక్రమాన్ని సంయుక్తంగా కొనసాగించుటకు వివిద చర్యలు నిర్ణయించారు. బీహార్, ఆంధ్రప్రదేశ్‌లలోని, కొన్ని ప్రాంతాలలో మాత్రమే యీ వుద్యమం కొంత ప్రభావాన్ని కలుగజేసింది. అఖిలభారత ప్రాతిపధికయేర్పడినా, అఖిలభారత పోరాటంగా అభివృద్ధి చెందలేదు. కారణం వ్యవసాయ కూలి వుద్యమం, అఖిలభారత సంఘాలు వున్నా, అఖిలభారతవుద్యమంగా అభివృద్ధి చెందలేదు. భారత వామపక్షాలు, రైతాంగ వుద్యమాన్ని మద్యతరగతి రైతాంగ వుద్యమంగా మాత్రమే అభివృద్ధి చేసారు కాని వ్యవసాయరంగంలోని పునాది వర్గాల వుద్యమంగా అబివృద్ధి చేయుటలో విఫలమయ్యాయి.

## 3.ర. కాంగ్రెసేతర రాష్ట్ర ప్రభుత్వాల రద్దు నియంతృత్వపోకడలు

ఆర్థిక, రాజకీయరంగాలలో కాంగ్రెసు (ఐ) వైఫల్యం, ప్రజలు మరింత దారిద్ర్యహీనస్థితికి దిగజారుట, కార్మికవర్గం వ్యతిరేక విధానలను కాంగ్రెసు ప్రభుత్వం మరింత తీవ్రం చేయుట, ఉన్నతస్థానాలలో లంచగొండితనం ప్రబలుట, ప్రజలను కాంగ్రెసు నుండి దూరం చేసాయి. పాలకపార్టీ ప్రజలలో తమ ప్రభావాన్ని కోల్పోవుట మరింత తీవ్రమైంది. కొన్ని రాష్ట్రాలలో శాసనసభలకు, లోక్‌సభకు జరిగిన బై ఎలక్షనులలోని ఫలితాలు యీ క్రమాన్నే తెలియజేస్తున్నవి. కాంగ్రెసు ప్రజల సానుభూతిని కోల్పోవుట ప్రత్యేకంగా హిందీ రాష్ట్రాలలో యు.పి; బీహార్, మధ్యప్రదేశ్‌లలో గణనీయంగా జరిగింది. బలహీనవర్గాలలో ముఖ్యంగా ముస్లిం ప్రజాసామాన్యం కాంగ్రెసుకు మరింతదూరం కాసాగింది. ఈనేపధ్యంలో పాలకపార్టీ కాంగ్రెసు(ఐ), ప్రభుత్వం, రాష్ట్రకాంగ్రెసేతర ప్రభుత్వాలయెడల, బూర్జువాపార్లమెంటరీ ప్రజాస్వామ్య సూత్రాలను కూడ త్రోసిబుచ్చి, అసహనాన్ని ప్రదర్శించుటయేగాక, కుట్రలు చేసి శాసన సభ్యులను కొనే హీనమార్గాలు అవలంభించి, కూలద్రోచే ప్రయత్నాలు చేయుట, అది సాధ్యంకానిచో అల్లర్లుతో సంక్షోభాన్ని సృష్టించి, గవర్నరు ద్వారా రాష్ట్ర ప్రభుత్వాలను రద్దు చేసే విధానాన్ని అవలంబించింది.

కాశ్మీర్, కర్నాటక రాష్ట్ర ప్రభుత్వాలను కూలద్రోసే ప్రయత్నాలలో భాగంగా యం.యల్.ఏలను కొనుగోలు చేయుట, కేంద్ర ప్రభుత్వ అధికారాలను రాష్ట్రాల గొంతునులిమే విధానాలు అవలంబించారు. కాశ్మీర్ నాటి చీఫ్ మినిష్టరు గులాం మహమ్మద్‌షా, చీలికదారుని వినియోగించి కాశ్మీర్ జాతీయ కాన్ఫరెన్సునుచీలికలతో భగ్నం చేయ ప్రయత్నించారు. సున్నీ రాజకీయాల సరిహద్దు జమ్మూ-కాశ్మీర్ ముస్లింలు ఆధిక్యతగల రాష్ట్రంలో యీ ప్రయత్నాలు ఎంత ప్రమాదకరమైనవో కాంగ్రెసు(ఐ) స్వప్రయోజనాల కొరకు అనుసరించుట చరిత్ర క్షమించజాలదు.

పంజాబ్‌లో స్వర్ణదేవాలయంపై దౌర్జన్యవాదులను తొలగించుటకు జరిపిన సైనిక చర్యలతో యేర్పడిన పరిస్థితులలో, అన్ని ప్రజాస్వామ్య సూత్రాలను త్రోసివేసి, ఫరూక్ అబ్దుల్లా ప్రభుత్వాన్ని రద్దుచేసి,గవర్నర్ శ్రీ జగ్‌మోహన్ గులాం మహ్మద్‌షా ప్రభుత్వాన్ని యేర్పాటు చేయుట జరిగింది. ఇది యెంత దూరదృష్టి లేని చర్యయో తదనందర

కాశ్మీర్ ఘటనలే రుజువు చేసాయి. అసెంబ్లీలో తన మెజారిటిని రుజువు చేయగలనని, డా.ఫరూక్ అబ్దుల్లా ప్రకటించినా, అట్టి అవకాశాన్ని యివ్వక తిరస్కరించుట జరిగింది. నిజానికి రాష్ట్ర, కేంద్ర శాసనసభల అధ్యక్షుల సమావేశంలో సంక్షోభ పరిస్థితులలో శాసనసభలలో మెజారిటిని నిరూపించుకొనే అవకాశమివ్వాలని ఆమోదించబడిన నిర్ణయాన్ని త్రోసిబుచ్చారు.

ప్రధాన మంత్రి ఇందిరాగాంధీ, డా.ఫరూక్అబ్దుల్లా, పాకిస్తాన్ అనుకూలవర్గాలతో చేతులు కలుపుతున్నాడని ప్రచారం చేసి, కాశ్మీర్ ప్రజలను, యితరులను నమ్మించగలనని, తప్పు అంచెనా వేసింది. ఇది, ముఖ్యంగా తాను అధికారం స్వీకరించిన నాటినుండి డా.ఫరూక్అబ్దుల్లా జమ్మూ-కాశ్మీర్, ఇండియాలోని వేరుచేయజాలని భాగమని, కాశ్మీర్ భారతలో భాగంగా చేరుట తిరుగులేని అంత్యచర్యగా స్పష్టం చేసినపుడు, అనుసరించుట అసంగతము. కేంద్రప్రభుత్వానికి కీలుబొమ్మగా అగుటకు తిరస్కరించి, అబ్దుల్లా దేశంలో సమస్యలను పరిష్కరించుటలో ప్రతిపక్షపార్టీలతో సహకరించు చున్నందున, యిది ఇందిరాగాంధీ ప్రతీకారచర్యగా యెంచవలసి వుంటుంది.

డా. ఫరూక్ అబ్దుల్లా ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేసిన తదనంతరం కూడ కేంద్రప్రభుత్వం అతనిపై కక్షతత్వాన్నే అనుసరించింది, షా ప్రభుత్వం కట్టుకథలను, నిందలను చేసింది. ఈచర్యలన్నీ, పాకిస్తాన్ అనుకూలవర్గాలకు, అగ్నికి అజ్యంగా తోడ్పడుతున్నవి, జాతీయ ఐక్యతకు విచ్ఛిన్నచర్యలుగా పరిణమించుతున్నవి.

ఆంధ్రప్రదేశ్‌లో రామారావు అధ్వర్యంలోని తెలుగుదేశం ప్రభుత్వంపై, కాశ్మీర్‌లో అబ్దుల్లా ప్రభుత్వం బర్తరఫ్ అనంతరం, కేంద్రప్రభుత్వం తన దాడిని ప్రారంభించింది, కుట్రలు కొనసాగాయి. అయితే అసెంబ్లీలో 3లో 2వంతుల మెజారిటీ అసెంబ్లీలో గల రామారావు ప్రభుత్వాన్ని పడగొట్టు ప్రయత్నాలను, కాంగ్రెసు(ఐ), కేంద్ర ప్రభుత్వం చేబట్టగలవని యెవరు తలచలేదు. అమెరికాలో ముఖ్యమంత్రి రామారావు గుండె ఆపరేషన్ చేయించుకొను సమయంలో, మంత్రివర్గంలోని భాస్కరరావుతోకుట్రచేసి అసంతృప్తి చెందియున్న యం.యల్.ఎ లతో ముఠాకట్టించి, రామారావు దేశానికి వచ్చునప్పటికి అగస్టు 14న భాస్కరరావు బలాన్ని పరీక్షకు కూడపెట్టకుండా రామారావు మంత్రివర్గాన్ని బర్తరఫ్‌చేసి, గవర్నర్ రాంలాల్ బాస్కరరావు మంత్రివర్గంచే ప్రమాణ స్వీకారం చేయించాడు. గవర్నరుకు అసెంబ్లీలో రామారావుకుమెజారిటి వున్నదని సి.పి.ఐ; సి.పి.ఐ(యం) లు కూడ బలపరస్తున్నవని తెలుసు. వారి బలం 19వరకు వున్నది. ఒకసారి మంత్రివర్గాన్ని యేర్పాటు చేసిన తరువాత, యేవిధంగానైనా భాస్కరరావు తెలుగు దేశం యం.యల్.ఎ లలో మెజారిటి పొందగలడని కాంగ్రెసు (ఐ) ప్రభుత్వం అంచెనావేసినట్లు కన్పడుతుంది. ఈ ప్రయత్నాలన్నీ ఎదురుతిరిగి పత్రికలకు, ప్రెసిడెంటుకు 294 అసెంబ్లీ సభ్యులలో 165మంది తన వైపు గలరని రామారావునిరూపించగలిగాడు. ఇందిరాగాంధీ కాశ్మీర్‌లో ఫరూక్ అబ్దుల్లా ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేసి కొంత ప్రజాసామాన్యాన్ని మోసపుచ్చగలిగింది కాని, రామారావు మత్రివర్గాన్ని కూలద్రోయుట, రామారావు తన బలాన్ని నిరూపించుట ప్రజాస్వామ్య భారత ప్రజానీకంలో కోపోద్రేకాలను,

అసంతృప్తిని అగ్నిజ్వాలాలా వ్యాపించునట్టు చేసింది. ఆంధ్రప్రదేశ్‌లోనేగాదు దేశమంతటా ప్రజాస్వామ్యాన్ని ఖూనీ చేసినందుకు, బ్రహ్మాండమైన ప్రజానిరసన ప్రదర్శనలు జరిగాయి. రోజులకొలది బందులు ఆంధ్రప్రదేశ్‌లోని రాయలసీమలో జరిగాయి. ప్రతిపక్షపార్టీలు ఆగస్టు 25ను "ప్రజాస్వామ్య పరిరక్షణ," ప్రభుత్వచర్యల "నిరసనదినము"గా జరుపమని యిచ్చిన పిలుపుకు బ్రహ్మాండమైన స్పందన లభించింది. ప్రతిచోట బ్రహ్మాండమైన ప్రదర్శనలు జరిగాయి. కర్నాటక, కేరళ, తమిళనాదు, బీహారు, పశ్చిమబెంగాల్, త్రిపుర, కాశ్మీర్‌లోని కొన్ని ప్రాంతాలలో విజయవంతమైన బందులు జరిగాయి. ఢిల్లీ, బెంగుళూరు, మద్రాసులలో లక్షల కొలది ప్రజాసామాన్యం సమావేశాలలో పాల్గొన్నది. సెప్టెంబరు 5న ప్రతిపక్ష పార్టీలు వూరేగింపులు, ప్రదర్శనలు, సమావేశాలు, సత్యాగ్రహాలకై పిలుపునిచ్చి, సత్వరం ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీ సమావేశాన్ని యేర్పాటు చేయవలసిందిగ కోరందని, కోరాయి. ఆంధ్రప్రదేశ్‌లో తిరిగి సెప్టెంబరు 14న మరో బందు హెచ్చరికగా జరిగింది. దీనిని బలపరుస్తూ, సెప్టెంబరు 20న, "భారత్‌బంద్"కై పిలుపు యివ్వబడింది. వామపక్ష పార్టీలు, ప్రజాస్వామ్యశక్తులు బలంగా వున్న రాష్ట్రాలలో, ప్రాంతాలలో బి.జె.పి బలంగా వున్న రాష్ట్రాలు, ప్రాంతాలలో యీ ప్రభుత్వ నిరశనోద్యం విస్తారంగా, బలంగా ప్రజాసామాన్యం పాల్గొనసాగింది. ఈ మహోద్యమాన్ని చీల్చుటకు, గణేశ్ నిమజ్జన వుత్సవాల సందర్భంలో హైదరాబాద్‌లో భాస్కరరావు అనుచరవర్గాలు మతకలహాలను రెచ్చగొట్ట ప్రయత్నించారు. బి.జె.పి రాష్ట్రీయ స్వయంసేవక్ వర్గాలు యీ అవకాశాన్ని వినియోగించుకొన ప్రయత్నించాయి.

ఈవిధంగా ప్రజోద్యమాలు విజృంభించుటతో, సెప్టెంబరు 14 ఆంధ్రప్రదేశ్ బందు, సెప్టెంబరు 20న భారత్‌బందుకు ప్రయత్నాలు ప్రారంభమగుటతో గవర్నరు తమ అక్రమమార్గాలను విడనాడి, ప్రజావొత్తిడితో భాస్కరరావు రాజీనామా చేయగా ముఖ్యమంత్రిగా శ్రీరామరావు తిరిగి ప్రమాణస్వీకారం చేసి మంత్రివర్గాన్ని యేర్పాటు చేయుట జరిగింది. ఆంధ్రప్రదేశ్ దేశప్రజలు తమ విజయాలతో బలమైన విశ్వాసం వారిలో యేర్పడింది. శ్రీరామారావు వామపక్షాలను, బి.జె.పిని మంత్రివర్గంలో చేరవలసిందిని, కోరగా అవి సిద్ధపడలేదు. వామపక్షాలు ఇందిరా కాంగ్రెసు ప్రభుత్వం, భాసర్రావు నాయకత్వంలోని తెలుగుదేశపు చీలికవాదులు కలసి, రాష్ట్ర ప్రభుత్వాన్ని అస్థిర పరిస్థితులలో ముంచివేయాలని చేసిన ప్రయత్నాలను వమ్ము చేసారు.

కార్మిక సంఘాల కార్యకలాపాలను, ప్రజోద్యమాలను ఆరికట్టుటకు ఇందిరాగాంధీ ప్రభుత్వం మరింత నిరంకుశ విధానాలను చేబట్టింది. తిరిగి అధికారంలోనికి వచ్చిన ఎనిమిదిమాసాలలో జాతీయ రక్షణ ఆర్డినెన్సు ప్రకటించి, తదుపరి చట్టంగా చేసింది. జూన్ 1981లో అదే చట్టానికి మరింత అధికారాలనిచ్చింది. "ఎస్మా" ఆర్డినెన్సు ప్రకటించి, తదుపరి చట్టంగా చేసింది. ఇది కార్మిక హక్కులను హరించి, వారిపై హింసాచర్యలు చేబట్టుటకు అధికారాలను యిచ్చింది. ఈ అధికారాలతోనే కోల్ ఇండియా లిమిటెడ్ కంపెనీలో ఎట్టి సమ్మెలు జరుగరాదని నిషేదించింది. వేతన కోతలకు నిరసనగా

పోరాడుతు, గతంలో కుదుర్చుకొన్ని వొప్పందాలను అమలు చేయాలని ఆందోళన చేయుచున్న బొగ్గు కార్మికులను అణచివేయుటకు యీ చర్యలు తలపెట్టబడినవి.

సవరణ చేయబడిన "నాసా", ఆరోపించబడిన నేరాలన్నీ వొక్కటి తప్పనిరాధారమని రుజువైనా డిటెయిన్, అధికారాలను పోలీసు యంత్రాగానికి యిస్తున్నది. డిటెయిన్ కాలం కూడ 6 మాసాలనుండి 12 మాసాలకు పెంచబడింది. "దౌర్జన్యప్రాంతాలుగా ప్రకటించబడిన" తాలూకా, జిల్లాలలో మరిన్ని పరిమితిలేని అధికారాలు యివ్వబడినవి. ఇది పంజాబ్, నాగాలాండు ప్రాంతాలకు ప్రథమంలో ఉద్దేశించబడినా, "అల్లర్లు వ్యాపించిన ప్రాంతమనే" మిషతో యేప్రాంతానికైనా యీ చట్టాన్ని విస్తరించు అవకాశాలు చాలావున్నవి. ఈ చట్టంలో "దౌర్జన్యవాది" నిర్వచనము రవాణా సౌకర్యాలు, మరే యితర సౌకార్యాలనైనా చిన్నాభిన్నం చేయు యేవ్యక్తియైనాయని చేయబడింది. ఈవిధంగా రైతులు, బస్సు, లారీల, కార్మికులు సమ్మెలు కూడ, పాల్గొనే కార్మికులు గూడ, దౌర్జన్యచర్యలు, దౌర్జన్యవాదులుగా చెప్పబడి, రహస్యవిచారణ జరిపి శిక్షించే అధికారాలు యివ్వబడినవి. సాధారణన్యాయచట్టాలు, ఎవిడెన్స్‌చట్టాలు త్రోసివేయబడి, శిక్షింపబడే అవకాశం, అపీలు అవకాశం లేకుండా చేయబడినది. శిక్ష 3సంవత్సరాలు వరకు వేయు అధికారాలు యివ్వబడినవి. ఈవిధమైన నిరంకుశ అధికారాలతో కేంద్రప్రభుత్వం ప్రజోద్యమాలను అణచివేయుప్రయత్నం తప్ప మరొకటి గాదు.

ఈవిధమైన విశేషాదికారాలతో ప్రధానమంత్రి ఇందిరాగాంధీ నిరంకుశపాలనకు సుస్థిరమార్గాలు యేర్పరచుకొన ప్రయత్నించింది. ఈపరిస్థితి సి.పి.ఐ 12వ, వారణాసి పార్టీ కాంగ్రెసు "స్వాతంత్ర్యానంతరం పాలకపార్టీ అనుసరించిన పెట్టుబడిదారి అభివృద్ధి పంథా సంక్షోభం తీవ్రమై, బూర్జువర్గ రాజకీయ సంక్షోభంగా, బూర్జువావర్గపాలన సంక్షోభంగా" రూపొంది, "రాజకీయ అస్థిరత, రాజకీయసంక్షోభం దశకు చేరిందని" రాజకీయ తీర్మానంలో వివరించింది.[1]

ఆంధ్రప్రదేశ్‌లో ఎన్.టి.రామారావు ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయుటను కొన్ని జాతీయవర్గాలు ఇందిరాగాంధీ తప్పుగా అంచెనావేయుటతో ఆమె చుట్టూ చేరిన రాజ్యాంగేతర శక్తులలో గవర్నర్ రాంలాల్ ఆమెకు ఎరుకలేకుండా చేసిన చర్య అని, యేమైనా "పెద్దపొరపాటు" అని చివరకు సరిచేయబడిందని చెప్పుట జరిగింది. ఇది అనేక నిరంకుశాదికారాలను చేబట్టి, నిరంకుశపాలను సుస్థిరం చేయు ప్రయత్నాల క్రమంలోనే అర్థంచేసుకొనవలసిన వుంటుంది. ప్రజోద్యమం యీ చర్యకు వ్యతిరేకంగా విజృంభించిన తరువాతనే యీ తప్పునరిచేయబడింది కాని, తప్పుగుర్తెరిగి దిద్దుకొనుటకాదని స్పష్టం.

"శ్రీమతి ఇందిరాగాంధీ ప్రభుత్వం యన్.టి.రామారావు మంత్రి వర్గాన్ని బర్తరఫ్ చేయుట, తన గుత్తాధికారాన్ని కొనసాగింపుకు, నియతృత్వపార్టీ ఎంతదూరం వెళ్ళగలదో

---

*1. సి.పి.ఐ (1984)యన్.సి. అక్టోబరు 1984లో ఆమోదించిన నివేదిక తీర్మానాలు సి.పి.ఐ పబ్లికేషన్ (ఆంగ్లంలో) పే.38లోని ఉదహరింపు.*

తెలియజేస్తుంది. ప్రతిపక్ష వామపక్ష పార్టీలు విస్తృత బందులకై యిచ్చిన పిలుపులు, ఆంధ్రప్రదేశ్‌లో విస్తృత ప్రజాసామాన్యపు ప్రతిఘటనయే, పాలకపార్టీ తిరోగమించునట్లు చేసాయి.

"ప్రజాస్వామ్య వుద్యమ శక్తులు నిర్మాణంతో నిరసనకు ముందుకు వచ్చినపుడు నిరంకుశ ప్రభుత్వం ఎంతటి అణచివేతకు వొడి గట్టుతుందో స్పష్టంగా ప్రజానీకానికి తెలిసింది.

"నాసా," తిరిగి "ఎస్మా" చట్టాన్ని చేయుట ప్రత్యేక కోర్టుల చట్టము, కాంగ్రెసు పాలనలోని రాష్ట్రాలలో పత్రికలు, జర్నలిస్టులు అణచివేయుటకుచేయబడిన వివిధ చట్టాలు అన్నీ, నిరంకుశత్వం వైపుకు పయనించే తీవ్ర ప్రయత్నాన్ని తెలియజేస్తాయి." అని సి.పి.ఐ (యం) కలకత్తా 12వ, పార్టీ కాంగ్రెసు రాజకీయ తీర్మానం పేర్కొంది.[1]

ప్రధానమంత్రి ఇందిరాగాంధీ, ప్రజాస్వామ్య ప్రమాణాలనన్నిటిని నాశనం చేసి వ్యక్తిగతంగా అదికారాన్ని స్థిరపరచుకొనుట, తన కాంగ్రెసుపార్టీలో గూడ, దశాబ్దంకొలది ఎన్నికలుజరుపకుండా అదే పనిని కొనసాగించింది. ముఖ్యమంత్రులు ఆమె చల్లని చూపులతోనే ఆగుతున్నారు. పాలకపార్టీలోనే యీ పరిస్థితులు కొనసాగుతూన్నపుడు దేశంలో ప్రజాస్వామ్య ప్రమాణాలు కాపాడగలవని ఆశించుట పొరపాటు అగుతుంది. ఇదేకాలంలో వొకవైపునియంతృత్వంవైపు పురోగమిస్తూ, మరోవైపు ప్రెసిటెంటు తరహ ప్రభుత్వపాలన అనుసరణీయమా అనే చర్చను, పాలకపార్టీ ప్రజలలో ప్రవేశపెట్టుట, వున్న ప్రజాస్వామాన్ని దోషపూరితమని ముద్రవేసి, నిరంకుశత్వం వైపు ప్రత్యునానికి మార్గం సుగమం చేయు ప్రయత్నం తప్పమరొకటిగాదు.

## 3.6. లౌకిక వామపక్ష, ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయము

ప్రజలలో అత్యధికులు నేటి కేంద్రప్రభుత్వం తొలగించబడాలనే మార్పును కోరుతున్నారు. అంతేగాక యేదొరకమైన మార్పుగాక, కేంద్రంలో వామపక్ష, లౌకిక, ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయాన్ని ప్రజలు కోరుతున్నారు. నేటి పరిస్థితులలో అదే పరిష్కారమార్గంగా కన్నపడుతున్నది.

శక్తివంతమైన అట్టి వామపక్ష, లౌకిక, ప్రజాస్వామ్యశక్తుల ప్రత్యామ్నాయం యింకా వుద్భవించలేదు. ప్రజాసామాన్యంలో యిదే కొంత గందరగోళాన్ని కలుగజేస్తున్నది, పరోక్షంగా యిదే కాంగ్రెసుకు బలంగా రూపొందింది.

ఈ ప్రత్యామ్నాయం రూపొందించు విషయంలో వామపక్ష శక్తుల, ముఖ్యంగా రెండు కమ్యూనిస్టుపార్టీలవైఖరులు స్పష్టం చేయబడ్డాయి. ప్రప్రథమంగా, యిది మితవాద ప్రత్యామ్నాయం కాదు. వారు రూపొందించ ప్రయత్నించే వామపక్ష, ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయం యింకా వుద్భవించలేదు. అంచేత, సామ్రాజ్యవాద వ్యతిరేక

*1. రాజకీయ తీర్మానం (1985) సి.పి.ఐ(యం) కలకత్తా 12వ పార్టీ కాంగ్రెసు, డిశెంబరు 1985లో ఆమోదించినది (ఆంగ్లంలో) పే.40-41.*

యేకూటమినైనా, మన జాతీయ అభ్యుదయకరవిదేశాంగ విధానాన్ని కొనసాగించే కలయకను బలపరచుటకు వామపక్ష శక్తులు సిద్ధంగా వున్నవి. ఆకూటమిలో, బి.జె.పి వంటి సామ్రాజ్యవాద అనుకూల శక్తికి మతతత్వశక్తికి స్థానముండరాదు. నేటి ప్రజలసత్వర సమస్యలకు పరిష్కరణలను చేబట్టాలి.

రాబోవు ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని మితవాద ప్రతిపక్ష పార్టీలు వివిధరకముల కలయికలకు, కూటములకు ప్రయత్నాలు మొదలుపెట్టాయి.

ఈ పరిస్థితులలో రెండు ముఖ్య కమ్యూనిస్టు వామపక్షాలు తమ కనీస కార్యక్రమాలను ప్రజల ముందుంచుటయేగాక, వామపక్షాల సమిష్టి కనీస కార్యక్రమాన్ని వొక రాజకీయ మౌలిక పునాదిగా, వామపక్ష ఐక్యతాభివృద్ధిని ప్రకటించాయి. ప్రజల కోర్కెలను బలపరస్తూ వామపక్షాలు రెండూ, ప్రజలను పోరాటానికై సమీకరించ మొదలు పెట్టాయి. నూతన కలయికలకు సుముఖంగా మార్గదర్శికత్వాన్ని యిచ్చుటకు ప్రయత్నించాయి. ఎన్నికల పూర్వరంగంలో యీ కార్యక్రమాల ఆచరణ వేగం వుధృతం చేయబడింది.

సామ్రాజ్య వాద అనుకూల అభివృద్ధి నిరోదక బి.జె.పి లక్ష్యం కమ్యూనిస్టులు మినహా అన్ని ప్రతిపక్షపార్టీలను ఐక్యం చేయుట, వారు చెప్పే జాతీయ ప్రజాస్వామ్య సంఘటనను యేర్పాటు చేయుట దానిలో ఆధిక్యత అధికారం స్వీకరించుట. దీనిలో వైఫల్యం చెంది, లోక్‌దళ్‌తో కలసి జాతీయ ప్రజాస్వామ్య అలయన్స్‌ను యేర్పాటు చేసింది. అయితే తన అసలు లక్ష్యం విడనాడలేదు. ఇండోరు తాజాగా అహమ్మదాబాద్ సమావేశాలలో తమ యీ వైఖరిని పునరుద్ఘాటించారు. ఈ లక్ష్యసాధనకై సంక్షోభ, గందరగోళ పరిస్థితులను ముఖ్యంగా వామపక్షేతర ప్రతిపక్షాలలోని గందరగోళ పరిస్థితులను వినియోగించు కొనదలచింది.

ఐదు ప్రతిపక్ష పార్టీలు జనతా, కాంగ్రెసు(యస్), డెమోక్రటిక్ సోషలిస్టుపార్టీ, జనవాదిపార్టీ, రాష్ట్రీయ కాంగ్రెసు, తదనంతరం రిపబ్లికన్ పార్టీలోని వివిధ గ్రూపులతో కలసి ఐక్యసంఘటనను యేర్పాటు చేయుట సుముఖ రాజకీయ పరిణామము. ఈ ఫ్రంటు యెడల కమ్యూనిస్టుపార్టీలు స్నేహసహకారవైఖరి నవలంభించాయి.

ప్రధమ విజయవాద సమేశానంతరం, వివిధ ప్రతిపక్ష పార్టీలు ఢిల్లీ, శ్రీనగర్, కలకత్తాలలో సమావేశమై సంప్రదింపులు జరుపుకొనుట యీ కాలంలో పేర్కొనదగిన పరిణామము.

ఐక్యసంఘటన యేర్పాటు మూడుప్రతిపక్ష పార్టీలు సమావేశాలు, బి.జె.పిని కలుపుకొనకుండా జరుపుకొనుట పేర్కొన దగిన ముఖ్యాంశము తన లక్ష్యసాధనకు బి.జె.పి లౌకిక ప్రజాస్వామ్య వైఖరి అవలంబించిన శక్తుల నుండి కమ్యూనిస్టులను వేరుచేసి, వుపయోగించుకొన ప్రయత్నించి విఫలమైంది. ఈవిషయంలో వామపక్ష కమ్యూనిస్టుపార్టీలు బి.జె.పి ప్రయత్నాలను వమ్ముచేయుటలో విజయం పొందాయి.

అయితే, కమ్యూనిస్టుపార్టీలు బి.జె.పిని ప్రజాశక్తులనుండి వేరుచేయుట, బి.జె.పి కమ్యూనిస్టులను వేరుచేయుట పరస్పర ఎత్తుగడల ప్రయత్నాలు కొనసాగుతూనే వున్నవి.

ప్రతిపక్షాల ఐక్యతా సమస్య అనిశ్చితంగానే వుంది. ప్రధమ అంశం, ఐక్యసంఘటన అస్థిరత్వలో వుంటుంది. ఇప్పటికి, వొక కార్యక్రమాన్ని రూపొందించలేకపోయింది. ద్వైవార్షిక రాజ్యసభ, విధానసభ ఎన్నికలలో ఐక్యసంఘటనల బలహీనతలు, అభ్యర్ధులను నిర్ణయించునపుడు సమిష్టి అవగాహనకు వచ్చుటలో బహిర్గతమయ్యాయి. ద్వితీయంగా జనతాపార్టీ పాట్నా, ప్లీనరీ సమావేశంలో "ప్రతిపక్షాల కేంద్రీకృత ఐక్యత" సిద్ధాంతాన్ని ద్విముఖవైఖరి, జనతా పార్టీలో కొన్ని పార్టీలను లీనం చేయుట, ఏకలక్ష్యం గల పార్టీలతో ఎన్నికల ఐక్యత ప్రతిపక్ష మితవాద, వామపక్ష పార్టీలతో ఎన్నికల సర్దుబాటులు ఎత్తుగడలుగా నిర్ణయించారు. తృతీయంగా మే 1984లో విజయవాడ బూర్జువా ప్రతిపక్ష పార్టీల సమావేశంలో కమ్యూనిస్టుపార్టీలు త్రోసిబుచ్చిన "అన్ని ప్రతిపక్ష పార్టీల ఐక్యత" సిద్ధాంతాన్ని కొన్ని బూర్జువా ప్రతిపక్ష పార్టీలు యింకా పట్టుకొని కూర్చున్నవి. ఇవన్నీ ప్రజలలో సందేహాలను సృష్టిస్తూ వున్నది.

కమ్యూనిస్టుపార్టీలు రెండూ వామపక్ష, లౌకిక ప్రజాస్వామ్యశక్తుల ఐక్యతను నిర్మించుటకు తగిన రాజకీయ ఎత్తుగడలను రూపొందించుకొన్నవి. ప్రధమంగా కమ్యూనిస్టులను వేరుపరచి "అన్ని పార్టీల ప్రతిపక్ష ఐక్యత నిర్మిచాలనే, అత్యంత మితవాద అభివృద్ధి నిరోధకపార్టీయైన బి.జె.పినే ప్రజాస్వామ్యశక్తులనుండి వేరుపరచి, దాని లక్ష్యాన్ని ప్లానులను వమ్ముచేయుట. ద్వితీయంగా కమ్యూనిస్టువర్గాలు 1984వరకుతమ నిరంతర కార్యాచరణతో, జాతీయ ప్రజాస్వామ్య అలయెన్స్‌లోని పార్టీలు వాటికి నాయకత్వం వహించే బి.జె.పిలను దూరంచేయుటలో విజయం పొందాయి. శ్రీనగర్ ప్రతిపక్ష పార్టీల సమావేశం నాటికి, యీ విషయంలో సంబంధంగల పార్టీలన్నీ వొక మంచి అవగాహనకు వచ్చాయి. మూడవ అంశం, కమ్యూనిస్టుపార్టీలు ప్రజాసమస్యలపై ప్రతిపక్ష పార్టీలు కార్యకర్తలతో సన్నిహిత నంబంధాలను అభివృద్ధి చేసాయి. ఫిబ్రవరి 13న దేశమంతటా జరిపిన సంయుక్త సమావేశాలు అట్టి ఐక్యతా నిర్మాణంలో ముఖ్య పురోగమనంగా చెప్పవచ్చును. నాలుగవ అంశము, విదేశాంగ విధాన సమస్యపై ఎనిమిది వామపక్ష, ప్రజాస్వామ్య ప్రతిపక్షాలు, "అణుయుద్ధం ప్రమాదం, దేశరక్షణ" సమస్యపై జాతీయ కన్వెన్షన్ మార్చి 1984లో జరిగినపుడు వొక సమిష్టి అవగాహనకు వచ్చాయి. కన్వెన్షన్ స్పష్టంగా సోవియట్ యూనియన్ వార్సా వొప్పంద దేశాలను బలపరస్తూ రీగన్‌పాలనను, అతని "నాటో" మిత్రులను, వుద్రిక్త పరిస్థితులకు బాధ్యులుగా స్పష్టం చేసింది. కన్వెన్షన్ తదనంతరం ఏప్రిల్ 13న సంయుక్త సమావేశాలుదేశమంతటా జరిగాయి.

జీవితం, యీపంధా సరియైనదిగా రుజువు చేసింది. ఈవిధానక్రమం యింత సరళంగా కొనసాగుతుందనే నమ్మకం ఎవ్వరికీ లేదు. ముఖ్యంగా రెండు కమ్యూనిస్టుపార్టీలకు లేదు. పట్టువిడుపులతో కూడిన ఎత్తుగడలు చేబట్టవలసివుంటుంది. కాని లక్ష్యం వామపక్ష, ప్రజాస్వామ్య ఐక్యతా నిర్మాణం, కార్యక్రమపు మౌలికాంశాంగా

గుర్తించాలి. ఈ సందర్భంలో ప్రతిపక్ష రాజకీయపార్టీల వివిధ సమావేశాలు, వాటి అవగాహనలు, యిచ్చిన పిలుపులు యింతకుముందే ఆయా సందర్భాలలో వుదహరించి వున్నందున, పునరుక్తికారణంగా ప్రస్తావించుటలేదు.

## 3.7. సి.పి.ఐ - సి.పి.ఐ(యం)ల మధ్య సంబంధాలు, ఐక్యత.

ఈరోజులలో జరిగిన ప్రజోద్యమాలు, పోరాటాలు వాటిలో సి.పి.ఐ; సి.పి.యం ల పాత్ర, ఆపోరాటాల నిర్వహణ క్రమంలో రూపొందిన ఐక్యత, వామపక్ష ఐక్యత మొత్తంగా, రెండు కమ్యూనిస్టుపార్టీల మధ్య యేర్పడిన సదవగాహన లేక ఐక్యత కొంత తెలుసు కొందాము.

నాటి రాజకీయ పరిస్థితులలో వామపక్ష పార్టీల ఐక్యకార్యాచరణ ఐక్యత మాత్రమే, వామపక్ష, లౌకిక, ప్రజాస్వామ్య పక్షాల గ్రూపుల ప్రత్యామ్నాయాన్ని నిర్మించుటకు సరిపోదు. అది ప్రజాకార్యక్రమంగా రూపొందజాలదు. అత్యధికప్రదేశాలలో సి.పి.ఐ; సి.పి.ఐ(యం) ల మధ్య వొక సరికొత్త ఉన్నతస్థాయి ఐక్యకార్యాచరణ మాత్రమే పరిస్థితులలో తగినదిగా తలచవచ్చును. ప్రస్తుత రాజకీయపరిస్థితులలో జాతీయస్థాయిలో రెండు పార్టీల మధ్య సన్నిహిత సంబంధానికి, సహకారానికి ఐక్యంగా కృషిచేయుటకు ప్రత్యేకప్రాముఖ్యత వుంది.

"అనేక బూర్జువా పార్టీలు వొక్కొక్కటిగా లేక రకరకాల కలయికలతో కాంగ్రెసు (ఐ) కి ప్రత్యామ్నాయంగా రావడంలో, నిజమైన ప్రత్యామ్నాయ విధానాలను యివ్వడంలో యేవిధంగా విఫలమైందో ప్రజలు చూశారు. అందువలన ప్రగతి శీల వామపక్ష దృక్పథం గల ప్రజాబాహుళ్యం వామపక్ష ఐక్యత కొరకు, కమ్యూనిస్టు ఐక్యత కొరకు ఆసక్తిగా చూస్తున్నారు.

"అయితే యిదేదో సులువైనదన్న భ్రమలు మనకు లేవు. "అని వారణాసి రాజకీయ తీర్మానం యిలా పేర్కొన్నది.

"కమ్యూనిస్టు ఐక్యత, వామపక్ష ఐక్యత నిర్మాణానికి వామపక్ష ప్రజాతంత్ర శక్తుల విశాల ఐక్యతను నిర్మించే కృషిలో అంతర్భాగంగా వోర్మితోకూడిన పట్టువిడవని, నిలకడైన రాజకీయ సైద్ధాంతిక పోరాటం అవసరం, అట్టి ఐక్యత మనదేశంలో కమ్యూనిస్టు వుద్యమం వొక సూత్రబద్ధప్రాతిపధికపై అంతిమంగా పునరేకీకరణయ్యేందుకు బాటవేస్తుంది. సి.పి.ఐ అట్టి పునరేకీకరణనుకోరుతున్నది.[1]

"చీలిక దరిమిలా, సి.పి.ఐ (యం) ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం నుండి వాస్తవంగా వైదొలగి దూరమైంది. ఆ తరువాత, ముఖ్యంగా దాని జలంధర్ మహాసభ తరువాత, అది తన అనేక తప్పుడు వైఖరులను సమర్థనీయంకాని వైఖరులను మార్చుకొని, దగ్గరకు రావడం ప్రారంభించింది. ఈమార్పులు యుద్ధం శాంతి సమస్యపై, సామ్రాజ్యవాద

---

*1. వారణాసి పార్టీల మహాసభ అనంతర జాతీయ, అంతర్జాతీయ పరిణామాల సమీక్ష 1980 మార్చిలో పాట్నాలో సి.పి.ఐ 13వ మహాసభ ఆమోదించినది (తెలుగులో) పే. 72.*

వ్యతిరేకత, సోవియట్ యూనియన్, యితర సోషలిస్టు దేశాలతో మైత్రి, భారతదేశ విదేశాంగ విధానం సమస్యలపై అలాగే జాతీయ రాజకీయ సమస్యలపై కూడ వచ్చాయి. ఉదాహరణకు నిరంతర పెత్తందారీతనానికి వ్యతిరేకంగా సువిశాల ఐక్యసంఘటన అనబడే తన పూర్వనినాదాన్ని అది విడిచిపెట్టింది.

"దీనివలన మన రెండు పార్టీల మధ్య సన్నిహిత సహకారం, అనేక అంతర్జాతీయ, జాతీయ సమస్యలపై సంయుక్త కార్యాచరణలు, చొరవలు సాధ్యమైనాయి. రెండు పార్టీల మధ్య సంబంధాలు మెరుగైనాయి. కేంద్రం స్థాయిలో సంప్రదింపులు సమన్వయం తరచుగా జరుగుతూ వచ్చినా, వున్నవిభేదాలను కూడ ద్వైపాక్షికంగా, సౌభాతృత్వభావనలో చర్చించుకోవచ్చు.

"అయితే ఎన్నికల సమయంలో మనది "రివిజనిస్టుపార్టీయని మనపై సి.పి.ఐ(యం) దాడి ప్రారంభించింది. గతసంవత్సరకాలంలో సంబంధాలు మరింతగా క్షీణించాయి. సి.పి.ఐ(యం) నాయకత్వం అంతకుముందు సాధించిన పురోగతి నుండి వెనుకడుగువేసి, 1964నాటి చీలికను సమర్థించుకునే నిమిత్తం గత వివాదాలన్నిటిని తిరుగుతోడింది.[1]

"సి.పి.ఐ అసలు "కమ్యూనిస్టు" పార్టీయేకాదు, మహా అయితే వామపక్ష పార్టీయని ప్రకటించే వరకు వెళ్ళారు. ఇది అనుమతించరాని విషయం. మనం మనలను సమర్థించుకోవలసివున్న, వాస్తవాన్ని తేటతెల్లం చేయవలసివున్నా అనేక సందర్భాలలో మనం మాటకుమాట జవాబు చెప్పటానికి తిరస్కరించాయి.

"సి.పి.ఐ(యం) వైఖరి పెంపొందుతున్న వామపక్ష ఐక్యత క్రమానికి, రెండు పార్టీల మధ్య సౌభ్రాతృత్వసంబంధాలు అభివృద్ధిచెందున్న క్రమానికి ఎదురుదెబ్బకొట్టింది. ఐక్యతాపంథాతో రెండు పార్టీలు మరింతముందుకుసాగాలని, ప్రజాబాహుళ్యం కోరుకొంటున్న సమయంలో యిది జరిగింది. ఈలోపు రెండు పార్టీలు, వాటి ప్రజనంఘాలు కొన్ని ఐక్యకార్యాచరణలు సాగించాయి. ఈపరిస్థితిలేనట్లయితే సాధ్యమైవుండేదానికన్నా, ప్రస్తుత పరిస్థితులలో తప్పనిసరిగా ఆశించినదానికన్నా చాలా తక్కువస్థాయిలో అవి జరిగాయి.

"ఈ సమస్యపై సి.పి.ఐ(యం) తప్పు అవగాహన రెండు పార్టీల మధ్య సన్నిహిత సహకారానికి పెరుగుతున్న ఐక్యకార్యాచరణకీ వాస్తవంలో అవరోధమైంది. వామపక్ష ఐక్యతను, ప్రస్తుత పరిస్థితులలో వామపక్ష ప్రజాతంత్ర దృక్పధంగల ప్రజాబాహుళ్యం సమీకృతమయ్యే స్థాయికి పెంపొందించే పెంచేభావనకు వారు వ్యతిరేకం. ఒంటెత్తు అవగాహన పెత్తనం చేయాలన్న కాంక్షవల్ల మనపై ఆధిపత్యం వహించగల స్థాయిలో తాములేమని భావించినచోట మనతో కలసిరావటానికి వారు యిష్టపడటంలేదు. అందువలననే వారు కేంద్రంలోస్థాయిలో యేర్పాటైన రెండు పార్టీల సమన్వయ కమిటీతోపాటు, రాష్ట్రస్థాయిలో కూడా రెండు పార్టీల సమన్వయకమిటీలను యేర్పాటు

---

1. వారణాసి పార్టీల మహాసభ అనంతర జాతీయ, అంతర్జాతీయ పరిణామాల సమీక్ష 1980 మార్చిలో పాట్నాలో సి.పి.ఐ 13వ మహాసభ ఆమోదించినది (తెలుగులో) పే. 73.

చేయాలన్న మన ప్రతిపాదనను వారు ఎల్లప్పుడూ వ్యతిరేకిస్తూవస్తున్నారు. ఈ ఒంటెత్తుపోకడ ప్రభావంలో, మన పార్టీకి వ్యతిరేకంగా అలాగే యితర వామపక్ష పార్టీల విషయంలో కూడ ప్రదర్శితమౌతున్నది.[1]

సి.పి.ఐ(యం) ఐక్య ప్రజాకార్యాచరణ, వామపక్ష ఐక్యత, కమ్యూనిస్టు ఐక్యతా సమ్యలయెడల "మూరెడు ముందుకు బారెడు వెనక్కు" వైఖరులను చేబట్టుటకు గల అవగాహనలను విస్తృత పరచుటకు తోడ్పడింది.

నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పోరాడే శక్తుల ప్రధమ కర్తవ్యం, వామపక్షశక్తుల ఐక్యతానిర్మాణం. ఇది వామపక్షశక్తుల ఐక్యపోరాటాశక్తిని పెంపొందించకుండా అసాధ్యము. "పార్లమెంటు, అసెంబ్లీ ఎన్నికల, అభిప్రాయభేదాలు వామపక్షాల రాజకీయస్థాయిని దిగజార్చాయి. కాంగ్రెసు యీ పరిస్థితిని పూర్తిగా వినియోగించుకొన్నది. ఎన్నికల కాలంలో వామపక్ష ఐక్యత కొనసాగునట్లు సి.పి.ఐ(యం) తాను చేయగిలిగినంతా చేసింది. కాని సి.పి.ఐ అవకాశవాద వైఖరి, హేతురహిత విధానాన్ని అవలంభించుటతో విభేదాలు, ఘర్షణలు తీవ్రమగుటకు దారి తీసింది." అంతేగాక, "వామపక్ష పార్టీలు రాజకీయ ప్రాముఖ్యతగల సమస్యలపై వివిధ వైఖరులకు ప్రాతినిధ్యం వహించుతున్నవి, తక్షణ రాజకీయ పరిస్థితిపై వివిధ అంచెనాలను కలిగివున్నందున అనుసరించే ఎత్తుగడలలో భేదాలను కలిగివున్నవి. భారత ప్రభుత్వవర్గ స్వభావం, విప్లవక్రమం, విప్లవదశ, వర్గ ప్రయోజనాల యెడల విస్తృత అభిప్రాయభేదాలను కలిగివున్నవి. ఈవిభేదాలను అధిగమించి, విప్లవోధ్యమ క్రమాభివృద్ధిని బలహీనపరచకుండా ఐక్యసంఘటనను నిర్మించుటకు, మౌలికవిధానాలను సూత్రద్ధంగా వోర్పుతో ధృడవైఖరితో చేబట్టవలసి వుంది. కొన్నిపార్టీల తప్పుడు వైఖరి, అంచెనాలు, ఎత్తుగడలపై తరచురాజకీయ చర్యలు, సైద్ధాంతికి పోరాటాలు చేయవలసివుంటుంది.[2]

"అభిప్రాయభేదాలు, అవరోధాలు వున్నప్పటికి, వామపక్ష ఐక్యతావాతావరణం మెరుగైంది. ప్రజాస్వామ్య వుద్యమానికి అది అత్యంత అవసరమైనందున వామపక్ష ఐక్యతను బలపరచుట కొనసాగుతుంది. ఇందుకు భిన్నంగా "సి.పి.ఐ నాయకత్వం, శాంతి వుద్యమాన్ని విస్తృతపరుస్తూ తమ సహకారాన్ని అందించని వైఖరిని మార్చుకొంటే ఐక్యతకు సుముఖ పరిస్థితులు అంత్యంత వేగంగా యేర్పడుతవి. దురదృష్టవశాత్తు యిది జరుగుటలేదు, శాంతి వుద్యమం నష్టపడుతున్నది." ఇంకా కొన్ని సమయాలలో మా పార్టీ చొరవతీసుకొని, సి.పి.ఐ నాయకత్వం సహకారాన్ని అందించనందున విజయ ఫలాలను పొందజాలకపోయాము. రెండు పార్టీలు శాంతిరక్షణ యెడల పూర్తి విశ్వాసాన్ని కలిగివున్నందున ఫలితం యిలా వుండవలసినది కాదు. యుద్ధ వ్యతిరేక, శాంతి పరిరక్షణ పోరాటానికై, శాంతి వుద్యమం విస్తృత పరచబడివుండవలసింది.[3]" అదే నూతన వైఖరిగా

---

1. *వారణాసి పార్టీల మహాసభ అనంతర జాతీయ, అంతర్జాతీయ పరిణామాల సమీక్ష 1980 మార్చిలో పాట్నాలో సి.పి.ఐ 13వ మహాసభ ఆమోదించినది (తెలుగులో) పే. 73.*
2. *రాజకీయ తీర్మానము (1985), కలకత్తా సి.పి.ఐ(యం) 12వ. కాంగ్రెసు 28 డిశెంబరు, 1985న ఆమోదించబడింది. (ఆంగ్లంలో) పే.61–2.*
3. *-- అదే -- పే.62–3.*

చేబట్టి సి.పి.ఐ.పై నింద మోపింది. సంవత్సరాలకొలది, సోవియట్ రష్యా, సి.పి.ఐ శాంతి పోరాట విధానాలను అమెరికా అనుకూల విధానలుగా విమర్శించి, కాలంగడచిన తరువాత యీ విధంగా వ్యాఖ్యానించుట ఆశ్చర్యానికలుగజేయకమానదు.

వామపక్ష ఐక్యతా పోరాటము సైద్ధాంతిక పోరాటాలను యేక కాలంలో నిరవధికంగా సాగించాలనే ప్రాధమిక అవగాహనతోనే రెండు కమ్యూనిస్టుపార్టీలు రాజకీయ పోరాటాలను సాగించాయి. వామపక్ష ఐక్యతా పోరాటం వ్యూహాత్మక ప్రాధాన్యత గల పోరాటం సైద్ధాంతిక పోరాటం వ్యూహాత్మక ప్రాధాన్యత పరిధిలోనే జరుగవలసి వుంటుందనే శాస్త్రీయ అవగాహన అంటే వామపక్ష ఐక్యతా నిర్మాణావకాశాలను పెంపొందించు పరిధిలోనే సైద్ధాంతిక పోరాటం జరుగవలసివుంటుంది. సైద్ధాంతిక పోరాటం పేరుతో తమ తమ ఆధిక్యతలను పెంపిందించుకొనే లక్ష్యంతో కొనసాగించిన ఆశించిన ఫలితాలను యివ్వకపోగా భేదాభిప్రాయాలను మరింత యెక్కువగ చేసుకొనుట జరిగినా ఆశ్చర్యపడనక్కరలేదు. ప్రధానలక్ష్యమైన వామపక్ష ఐక్యత కనుమరుగై తమ తమ పార్టీల రాజకీయ, నిర్మాణ, సైద్ధాంతిక బలాలను పెంపొందించుకొను లక్ష్యంతో పురోగమించిన పోరాటం అశాస్త్రీయ, స్వీయమానసిక ధోరణులలో కొనసాగి, ఐక్యతవైపు పురోగమించజాలదనుట స్పష్టమైంది.

## 3.8. ఐక్యకార్యాచరణ సోపానాలు

ఈ శతాబ్దపు చివరపాదంలో వామపక్ష, ప్రజాస్వామ్యశక్తుల ఐక్యత రోజురోజుకు అభివృద్ధి చెందుతువుంది. ఈ వామపక్ష, ప్రజాస్వామ్య ఐక్యతకు పునాది కమ్యూనిస్టుపార్టీల, శ్రేణుల ఐక్యత, అదే వామపక్ష ప్రజాస్వామశక్తుల ఐక్యకార్యాచరణ, ఐక్యతకు మూలకందమౌతుంది. ఐక్యకమ్యూనిస్టుపార్టీ చీలి సి.పి.ఐ; సి.పి.యంలు యేర్పడిన తరువాత మరోచీలికతో సి.పి.ఐ (యం.యల్) గా మూడు కమ్యూనిస్టుపార్టీలు యేర్పడినా సైద్ధాంతికంగా కమ్యూనిస్టు ఐక్యతను గురించి మాట్లాడుట, తీర్మానాలలో పేర్కొనుట జరుగుతూనే వుంది. కారణం అదే కార్మికవర్గ ఐక్యత, కార్మిక, కర్షక ఐక్యతయేగాక, కార్మికకర్షక యితర బడుగువర్గాల ఐక్యతకు కమ్యూనిస్టు ఐక్యతేయే పునాది.

అందుకే సి.పి.ఐ 9వ, పార్టీ కాంగ్రెసు, రాజకీయనివేదికలో "మా ఎనిమిదవ పార్టీ కాంగ్రెసు, కమ్యూనిస్టు శ్రేణులలో పెరుగుతున్న ద్వేషభావాన్ని అధిగమించుటకు కమ్యూనిస్టు వివిధ వర్గాలలో వివిధ ప్రజాసంఘాలలో ఐక్యకార్యాచరణను పెంపొందించ వలసిన అవసరాన్ని నొక్కి చెప్పింది. అన్ని స్థాయిలలో పార్టీ దీనిని సాధించుటకు కృషి చేసింది. సి.పి.ఐ(యం) పొలిట్‌బ్యూరోతో కేంద్రకార్యదర్శులవర్గం ద్వైపాక్షిక సంభాషణలు మే 1969లో జరిపింది. కొన్ని నిర్దిష్ట ప్రతిపాదనలను, రెండు పార్టీల మధ్య సంబంధాలను కనీసం ప్రజాసంఘాల సంబంధాలను మెరుగుపరచి ప్రజాకార్యాచరణకు సమర్పించింది." అని పేర్కొన్నది అంతేగాక "ఎ.ఐ.టి.యుసి"లో ఐక్యతను కాపాడుటకు,రెండు అఖిలభారత కిసాన్ సభల సంయుక్త కార్యాచరణ పెంపొందిచుటకు, రెండు పార్టీల ప్రతినిధుల సంప్రదింపులు జరిపి, సమిష్టి ఆమోదంపొందిన అంశాలతో సంయుక్త ప్రకటనకూడ

చేసారు. ఈ ప్రయత్నాలన్నీ, సి.పి.ఐ(యం) నాయకత్వం ఐక్యకార్యాచరణను కూడ ఎప్పుడు వాఛించని కారణంగా ఫలించలేదు.[1]

వొప్పందాన్ని కిసాన్‌సభ స్థాయిలో యేర్పడిన దానిని సి.పి.ఐ(యం) నాయకత్వం బహిరంగంగా త్రోసిబుచ్చింది. అప్పటికి "ఎ.ఐ.టి.యుసి రెండుగా చీలిపోయింది మాపార్టీ ప్రదర్శించిన నిజాయితి దూషణలకు గురైంది. "వాస్తవానికి సి.పి.ఐ ని పశ్చిమ బెంగాల్, కేరళలలో ప్రధానశతృవుగా సి.పి.ఐ(యం) పరిగణించి, కమ్యూనిస్టు శ్రేణులను ద్వేషంతో నింపివేసింది. పశ్చిమబెంగాలులలో సి.పి.ఐ. దానిని బలపరచే వారిపై భౌతికదాదులకు సి.పి.ఐ(యం) వొడిగట్టింది.[2]

"రాజకీయ సైద్ధాంతిక పంధా కారణంగా సి.పి.ఐ(యం) నాయకత్వం, రెండు పార్టీల మధ్య పెరిగిన ద్వేష, శతృభావాలను అధిగమించలేకపోయింది.

"వామపక్ష, కమ్యూనిస్టు ఐక్యతా దృక్పధంతోమా (సి.పి.ఐ) పార్టీ సైద్ధాంతిక రాజకీయ పోరాటాన్ని సాగించినందున కేరళ పశ్చిమబెంగాల్‌లో తప్ప మిగతా అన్ని రాష్ట్రాలలో వామపక్ష, కమ్యూనిస్టు శ్రేణులు సి.పి.ఐ(యం) పంధాను, రాజకీయ విధానాలను తిరస్కరించాయి అఖలభారత స్థాయిలో సి.పి.ఐ.(యం) విధానాలకు వ్యతిరేకత ప్రబలింది.

"మనదేశంలో కమ్యూనిస్టు ఐక్యతా సమస్య, సి.పి.ఐ(యం) సైద్ధాంతిక రాజకీయ విధానాలను, సి.పి.ఐ వ్యతిరేకతను, సోవియట్ వ్యతిరేకతను వోడించవలసిన సమస్యగా ముందుకువచ్చుట, అదేకాలంలో వామపక్ష, ప్రజాస్వామ్య పక్షాల ఐక్యతా సమ్యగా అయింది." అంచేతనే పురోగమనం శూన్యమైంది.[3]

"పాలక పార్టీలోని కాంగ్రెసు అభ్యుదయకర శక్తుల బయటనున్న వామపక్ష, ప్రజాస్వామ్యశక్తుల ఐక్యకార్యాచరణ, ఐక్యత, జాతీయ ప్రజాస్వామ్య ఐక్యసంఘటనా నిర్మాణం ఆచరణలో ప్రధాన ఎత్తుగడగా అయింది. అంచేతనే బూర్జువా రాజకీయ పార్టీలపై సైద్ధాంతిక, రాజకీయ పోరాటాల ప్రాధాన్యత వచ్చే రోజులలో యెక్కువగా వుంటుంది.[4]

ఈ కమ్యూనిస్టుల ఐక్యత సమస్యపై సి.పి.ఐ(యం) 9వ పార్టీ కాంగ్రెసు జులై 1972లో మధురై అధికార పత్రాలు యిచ్చిన అవగాహన చూద్దాము.

సి.పి.ఐ.ని "స్వతంత్ర వామపక్ష ప్రతిపక్ష పార్టీగా శిధిలమగుట త్వరితమగు తున్నందున ప్రత్యేక సంబంధాలను పాలకపార్టీతో పెరిగే మిత్రత్వాన్ని, మితవాద కమ్యూనిస్టుపార్టీగా అంచెనావేసి,"ప్రజాస్వామ్య సంఘటనలో సి.పి.ఐ.ని భాగస్వామిగా

---

1. *డాక్యుమెంట్సు ఆఫ్ ది 9వ కాంగ్రెసు ఆఫ్ ది సి.పి.ఐ (1971) పొలిటికల్ రిపోర్టు పే.64.*
2. *రాజకీయ తీర్మానము (1985). కలకత్తా సి.పి.ఐ(యం) 12వ. కాంగ్రెసు 28 డిశెంబరు, 1985న ఆమోదించబడింది. (ఆంగ్లంలో) పే.65.*
3. *-- అదే -- పే.67.*
4. *-- అదే -- పే.153.*

చేయుటకు అన్ని ప్రయత్నాలు చేస్తూ, ఐక్యసంఘటనలో ప్రజాసంఘాలలో దాని విచ్ఛిన్నకరపాత్రను, ఇందిరా కాంగ్రెసు జాతీయ బూర్జువవర్గానికి ప్రాతినిధ్యం వహించుచున్నదనే సైద్ధాంతిక అవగాహనపై తీవ్రమైన పోరాటం సాగించాలనే"[1] నిర్ణయించుట, ఐక్యసంఘటనా నిర్మాణం బలోపేతం చేయాలనే వ్యూహలక్ష్యం కంటే, సి.పి.ఐ.ని వేరుచేయు ఎత్తుగడల ఆచరణ విధానం ప్రాధాన్యత వహించుటతో ఐక్యకార్యాచరణలతో ఐక్యసంఘటనను బలపరచుటనే ప్రధానకర్తవ్యంలో అపజయాలను యెదుర్కొనవలసి వచ్చింది.

"మనప్రధాని దాడి పాలకపార్టీకి పిష్ఠకాలంగా" పనిచేయు సి.పి.ఐ.పాత్ర, విచ్ఛిన్నకర విధానలపై" కేంద్రీకరించాలనే సి.పి.ఐ(యం) అవగాహన బలమైన ఐక్యకార్యాచరణ, ఐక్యసంఘటన యేర్పడుటకు పురోగమించుటకు అవకాశం లేకుండా చేసింది. ఒకవైపు సి.పి.ఐని ఐక్యసంఘటనలో భాగస్వామిగా చేయు ప్రయత్నం చేయాలంటూనే, దానిని "పంచమాంగదళంగా" అనగా, ఇందిరా కాంగ్రెసు యేజంటుగా, తీవ్రమైన దాడి చేయుట, శత్రుభావంతో చేయు విమర్శనయేకాని, ఐక్యసంఘటనలోని భాగస్వాముల యెడల ఐక్యతను, ఐక్యకార్యాచరణను, ఐక్యసంఘటనను బలపరచే సుహృద్భావంతో చేయువిమర్శనకాదు. సైద్ధాంతిక విమర్శన చేయవలసినదే, ఐక్యకార్యాచరణ, ఐక్యసంఘటనను విచ్ఛిన్నంచేయునదిగా వుండరాదు. ఐక్యసంఘటనలోని భాగస్వాములపై చేయుదాడి, వారిలో కొందరిని వేరుచేసి బలహీనపరచి, తాము బలపడాలనే నీచ ఎత్తుగడ, వ్యూహధ్యేయమైన బలమైన ఐక్యసంఘనా నిర్మాణాన్నే వమ్ముచేస్తుంది. ఐక్యకార్యాచరణను ఐక్యసంఘటనలోని భాగస్వాములందరూ చురుకుగా ఆచరణలో పెట్టుట ద్వారా క్రమేణా బలపడాలిగాని, యేవొక్కరో బలపడుటకు సాధనంగా ఐక్యసంఘటన పనిచేయరాదు, వుపయోగపడరాదు. అంతేగాక, ఐక్యసంఘటనలోని బలమైన పెద్దపార్టీ, బాగస్వామ్య పార్టీలపై "పెత్తనందారీ" విధానాన్ని అనుసరించరాదు. అలా జరిగినాదు వామపక్ష ఐక్యతయే గాక ఐక్యకార్యాచరణ, సంఘటనలకు తావు లేకుండా పోతుంది.[2]

"సి.పి.యం నాయకత్వం, సోషలిస్టుపార్టీలు యిట్టి వైఖరి అవలంభించినంతమాత్రంచేతనే మాపార్టీ (సి.పి.ఐ) నిరుత్సాహం చెందదు. మేము (సి.పి.ఐ) వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతా నిర్మాణ ప్రయత్నాలను కొనసాగించుతూనే వుంటాము.

"మేము సి.పి.యం సోషలిస్టుపార్టీల వామపక్షాల అనైక్యతా అవకాశవాదవిధానాన్ని కొనసాగించుట అసాధ్యం చేస్తాము. కాంగ్రెస్, సి.పి.యం., సోషలిస్టు పార్టీలను

1. వర్క్ రిపోర్ట్ (పొలిటికల్) ఆఫ్ ది సెంట్రల్ కమిటి నైన్త్ కాంగ్రెస్ (సి.పి.ఐ(యం) జూన్–జులై 1972లో మధురైలో ఆమోదించినది పే. 57–58.
2. వర్క్ రిపోర్ట్ (పొలిటికల్) ఆఫ్ ది సెంట్రల్ కమిటి నైన్త్ కాంగ్రెస్ (సి.పి.ఐ(యం) జూన్–జులై 1972లో మధురైలో ఆమోదించినది పే. 58.

అనుసరించు ప్రజాసామాన్యం చైతన్యవంతులై సంయుక్త పోరాటాలలో ముందుకు వస్తున్నారు." అనే నిర్మాణాత్మకవైఖరిని సి.పి.ఐ చేబట్టింది.[1]

## వామపక్షాల 1974 సమావేశం

**3.9** జాతీయ సమితి సమావేశం ముగిసిన వెంటనే వామపక్ష పార్టీల సమావేశానికి అందరూ కలసి రావలసి వచ్చింది. ఈ సమావేశం, 4-5 ఏప్రిల్‌లో జరుగవలసివచ్చింది. ప్రధాన మూడు అతివాద పార్టీలు సి.పి.ఐ; సి.పి.ఐ(యం) ఫార్వర్డుబ్లాక్ విప్లవబంగ్లా కాంగ్రెసు వర్కర్సుపార్టీ, సోషలిస్టు యూనిటి సెంటరులు సోషలిస్టు పార్టీలు కలసి వచ్చాయి. సి.పి.ఐ నాయకులు సి.రాజేశ్వరావు, భూపేష్‌గుప్తాలు తమ పార్టీ వైఖరిని వివరించుతు వొకనోటు, వొక ముసాయిదా తీర్మానాన్ని చర్చల నిమిత్తం సమర్పించారు. మిగతా పార్టీలేవి యే ముసాయిదా ప్రతిపాదనలు సమావేశానికి సమర్పించలేదు. సి.పి.ఐ ప్రతిపాదనలు చర్చించబడినవి. సి.పి.యం అఖిలభారత ప్రజాకార్యచరణ చేబట్టాలని, రాజకీయపరిస్థితిని చర్చించిన వొక సమిష్టి అవగాహనకు రాజాలమని ప్రతిపాదించింది. మధులిమాయి భారతబంధు దానితో పాటు రైల్వే సమ్మెను ప్రతిపాదించారు. సి.పి.ఐ భారతబంద్, రైల్వేసమ్మె రెండూ వొకే సారి చేబట్టిన ప్రభుత్వం ప్రజలను గందరగోళం పెట్టి, కార్మికులపై దమన కాండ జరుపుతుందని, అంచేత వాటిని రెంటిని కలుపకుండా విడివిడిగానే సాగించాలన్నది. బంధు విషయమైకూడ, ఢిల్లీనుండి వొక జనరల్ పిలుపునిచ్చుటలో ఆచరణ సౌలభ్యంలేదని రాష్ట్రాలలో పరిస్థితులు భిన్నభిన్నంగా వున్నందున అన్ని పోరాట రూపాలు ప్రదర్శనలు, బంద్‌లు, ఘొరావ్‌లు ఆయా రాష్ట్రాలు చేబట్టవలసివుంటుందన్నారు. కేరళలో సి.పి.యం; సోషలిస్టుపార్టీలు ప్రతివారితో కలసి, ఐక్యసంఘటన అచ్చుతమీనన్ ప్రభుత్వాన్ని పడగొట్టు ప్రయత్నం జరుగుతున్నందున అక్కడ సమిష్టి కార్యాచరణ సాధ్యంకాదని సి.పి.ఐ స్పష్టం చేసింది. మితవాద అభివృద్ధి నిరోధకులు బెంగాలులో అసెంబ్లీ రద్దు చేయాలని కోరుతున్నందున బంద్ సాధ్యమా, అది వొక్క అభివృద్ధి నిరోధకులకే తోడ్పడుతుంది. అని సి.పి.ఐ. వెలిబుచ్చిన అభిప్రాయాన్ని సి.పి.యం. నాయకులు సుందరయ్య రైల్వేసమ్మె బంద్ రెండూ కలుపుట వాంఛనీయం కాదన్నారు. తదుపరి రాష్ట్రాలు వాటికనువగు పోరాట రూపాలను చేబట్టాలని, కేంద్రం నుండి బంద్ పిలుపు నిచ్చుట వాంఛనీయంకాదనే అభిప్రాయానికి అందరూ వచ్చారు.

మరుసటి రోజున అఖిలభారత ప్రజాకార్యాచరణపై వొకచిత్తు తీర్మానం, వివిధ వర్గాల కోర్కెలతో ప్రతిపాదించబడి, సవరణలతో మార్పులు, చేర్పులతో ఆమోదించబడింది. ఎనిమిది సంవత్సరాల తరువాత వామపక్షాలు కలసి ప్రజాకోర్కెలు ప్రతిబింబించుతు, అఖిలభారత ప్రజాకార్యచరణకు పిలుపునిచ్చుట ప్రత్యేకతను సంతరించుకొన్నది. ఐక్యతకై వామపక్షాలు చేబట్టిన ప్రపథమ చర్యగా ప్రజలు హర్షించారు. బడా వ్యాపార వర్గాలు పత్రికలు సి.పి.ఐపై విషాన్ని వెదలగ్రక్కాయి. మే 3న అఖిలభారత

1. *రిజల్యూషన్స్ అండ్ డాక్యుమెంట్సు (1974) యస్.సి.ఆఫ్ సి.పి.ఐ న్యూఢిల్లీ, జులై- ఆగస్టు 1974లో ఆమోదించినది. సి.పి.పబ్లికేషన్ పే. 14.*

కోర్కెల ప్రకటనదినోత్సవంగా వామపక్షాలు నిర్ణయించాయి. అనేక రాష్ట్రాలలో బంద్‌లు, ప్రదర్శనలు, నిరసనలు విజయవంతంగా జరిగాయి. కేరళలో ఎట్టిప్రజాకార్యాచరణ సాధ్యం కాలేదు. సి.పి.యం దాని మిత్రులు కలసి బంద్‌కు పిలుపు నిచ్చినా సాధ్యం కాలేదు.

## iv

# సారాంశము

**4.1 వామపక్ష ఐక్యతావకాశాలు"** అనే మేధావుల సింపోజియంలో సి.పి.ఐ భటిండా, సి.పి.ఐ(యం) జలందర్ పార్టీ కాంగ్రెసులలో పార్టీల మధ్య సహకారంపై నిర్దిష్ట చర్చలు విశ్లేషణాత్మకంగా జరిగాయి. ఐక్య కార్యాచరణ, ఐక్యత ప్రధానంగా నిర్దిష్ట లక్ష్యం, నిర్మాణాత్మక సహకారం ప్రాతిపధికగా, బహుళపార్టీల వ్యూహాత్మక చట్రం పరిధిలో జరగాలని, కమ్యూనిస్టుపార్టీల భటిండా, జలందర్ రాజకీయ విధానాలపై ఇర్ఫాన్ హబీబ్ చరిత్రకారుడు వ్యాఖ్యానించాడు.

ఐక్యసంఘటన లక్ష్యాలు, కార్యక్రమాలు, మైత్రీ సహకారాలతో వామపక్షాలలో వొక సాధారణ ఆమోదం లభించనిచో, వామపక్ష లేక కమ్యూనిస్టు ఐక్యతలు నినాదాల వరకే పరిమితమైవుంటవి. వివాదాంశాలు అలాగే వుంటవి. ఐక్యకార్యాచరణ అట్టి స్థితిలో ప్రారంభ అంశంగా చెప్పజాలము. కమ్యూనిస్టు వుద్యమంలోని వివిధ చీలికలు ప్రధానంగా లక్ష్యాలు, వ్యూహాలలోని భేదాలే కారణం, వీటికి అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలో మౌలిక భేదాభిప్రాయాలు తోడయ్యాయని, అంచేతనే ఐక్యకార్యాచరణ, సంఘటన లక్ష్యాలు, కార్యక్రమాలు, మైత్రీ సహకారాలపై వామపక్షాల సాధారణ ఆమోదపు అవసరం యెంతోవుందని ఇర్ఫాన్‌హబీబ్ అభిప్రాయము.

అంతేగాక, భారతకమ్యూనిస్టు 'ఉద్యమ లక్ష్యం జాతీయ ప్రజాస్వామ్యం లేక జనతా ప్రజాస్వామ్యం" యేమైనప్పటికి ఆచరణలో కార్మిక, కర్షకమైత్రితో బూర్జువావర్గంలోని కొన్ని శక్తుల సహకార, మైత్రి ప్రాతిపధికగా వ్యూహం రూపొందించబడింది." అని ఇర్ఫన్ హబీబ్ అవగాహనగావుంది. "మనం శక్తివంతంగా వామపక్ష ఐక్యతను ఆచరణలో పెట్టుటకు, దాని లక్ష్యాలు, సాధించవలసినవి ధ్యేయాలు స్పష్టం చేయుటతోపాటు కనీస లక్ష్యాలు వివరించాలి అన్నారు." "కమ్యూనిస్టు ఐక్యకార్యాచరణలో మార్క్సిస్టు-లెనినిస్టు కమ్యూనిస్టులు భాగస్వాములు కాకుంటే, అది అసంపూర్ణమైనదిగా నేను తలంచుతానని" ఇర్ఫన్ హబీబ్ స్పష్టం చేసారు.

ఈ సంఘటనను యేర్పాటు చేయుటలో కమ్యూనిస్టుపార్టీలన్నీ ప్రధానపాత్రవహించాలి. కాని, యేవొక్కపార్టీ ఆధిక్యత లేక నాయకత్వం వహించే ప్రశ్నయేలేదు. ప్రతిపార్టీ. గ్రూపు, వ్యక్తి సామ్రాజ్యవాద వ్యతిరేక పంథాలతోనే కలసి, విస్తృత ఆమోదం పొందిన ప్రత్యామ్నాయ రాజకీయ. సాంస్కృతిక, ఆర్థిక కార్యక్రమాలకై కలసి పోరాడుతారు.

**4.2** మన సమాజ స్వరూప సంక్లిష్టత దృష్ట్యా, వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనానిర్మాణం, తద్వారా సామాజిక విప్లవం వైపు పురోగమనం, గతంలో వామపక్షశక్తులు సరియైన అవగాహన పెంపొందించుకొనుటలో విఫలమైనందున, యీ కర్తవ్యం క్లిష్టతరమైంది. ఇందుకు, స్వతంత్ర వివేచన, బహిరంగ సమాలోచన, చర్చలు, హృదయపూర్వక, పరస్పర విశ్వాసం సంప్రదింపులు, నిర్భయంగా, నిజాయితీతో ప్రయోగాలు చేయు సంసిద్ధత, తప్పులకు పెడదారులు పట్టుటకు భయపడకుండుట, పరస్పర సహనము, ప్రజల విప్లవశక్తిపై అచంచల విశ్వాసం అవసరము. పరిస్థితుల సంక్లిష్టతను, కర్తవ్యాల కొన్నింటి ద్వందనైజాన్ని తెలుసుకొన్నచో మన అవగాహన విస్తృతి పెరుగుతుంది. ఇవి వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనపై బిపిన్‌చంద్ర వెలిబుచ్చిన అభిప్రాయాలు. అంతేగాక, బిపిన్‌చంద్ర వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనకు ఎనిమిది అంశాల కర్తవ్యాలను ప్రతిపాదించారు.

వామపక్ష ఐక్యతకు "ప్రదమ సోపానం రెండు కమ్యూనిస్టుపార్టీలు సి.పి.ఐ; సి.పి.ఐ(యం)ల ఐక్యత," యిది అందరూ అంగీకరించే విషయమని జి.యస్.భల్లా అభిప్రాయము. ఇదే అభిప్రాయాన్ని కె.యం ఛెనాయ్ కలిగి యుండుటయేగాక రెండు పార్టీల మధ్య గల భేదాభిప్రాయాలను ప్రస్తావిస్తూ రెండు వామపక్షపార్టీలని, ప్రధానంగా జనతా ప్రజాస్వామ్య సంఘటనా, జాతీయ ప్రజాస్వామ్య సంఘటనా అనే వ్యూహాత్మక భేదాభిప్రాయం మౌలికమైనదన్నారు. సి.పి.ఐ కూడ ప్రజాస్వామ్య సంఘటన నాయకత్వంలో గుత్తపెట్టుబడిదారి వర్గం భాగస్వామిగా వుండాలనుటలేదు. బూర్జువావర్గం మొత్తంగా పరిగణలోనికి తీసికొనినపుడు దాని విప్లవకరపాత్ర చాల తగ్గిపోతుందని రెండు పార్టీలు గుర్తించాయి. ప్రజాస్వామ్యసంఘటనలో జాతీయ బూర్జువావర్గానికి స్థానముంటుందని కూడ రెండు పార్టీలు గుర్తించాయి. జాతీయ బూర్జువా వర్గంలో సామ్రాజ్యవాద ప్యూడలు వ్యతిరేక శక్తులు వున్నవని, ప్రజాస్వామిక విప్లవ శేషకర్తవ్యాలు పరిపూర్తిచేయుటకు, ఆశక్తులు తమవంతుపాత్ర నిర్వహించుటకు సంఘటనలో చురుకుగా పాల్గొనగలవని తలచినపుడు సంఘటన నాయకత్వంలో భాగస్వాములను చేయుటకు అంతగా అభ్యంతరము ఉండరాదని సి.పి.ఐ అవగాహన కాగా జాతీయ బూర్జువావర్గంలో ఎవరితోనూ నాయకత్వాన్ని పంచుకొనరాదని సి.పి.ఐ(యం) సైద్ధాంతిక అవగాహనగా వుంది. ఒకటి ఆచరణను ముందుకు తీసుకొనిపోయే అవగాహనకాగా, మరొకటి ఆచరణ పురోగమనాన్ని త్రోసిబుచ్చే పిడిసూత్ర అవగాహనగావుంది.

గతంలో వామపక్ష ఐక్యతా ప్రయత్నాలు విపలమగుటకు గల కారణాలను షఫీక్‌నక్వీ, తమ తమ విధానాలే సరియైనవనే ఆత్మవిశ్వాసం; రెండు పక్షాలు తమ కాళ్ళముందు మరోపక్షం సాష్టాంగపడాలని లోలోనకోరుకొనుట, నిరవధిక, అసహన, ఉద్రేకపూరిత, నిందారోపణలు పరస్పరం దాడులు యిరు పక్షాలు చేబట్టుటయని చెప్పారు.

**4.3 ఇర్ఫన్ హబీబ్ సింపోజియంలో** వచ్చిన ప్రశ్నలకు, సమాధానాలు వివరించారు. కాంగ్రెసు యెడల సి.పి.ఐ వైఖరి నిర్మాణాత్మక సహకారం, సఖ్యత ఐక్యసంఘటన వైపు దారి తీసే పంథా, ఇందిరాగాంధీ సహాయంతో జాతీయ ప్రజాస్వామ్య నిర్మాణం,

జనతాపార్టీయెడల సి.పి.ఐ(యం) వైఖరి, కుదించుకుపోయే సఖ్యత, పెరిగే ప్రభుత్వ వ్యతిరేకత, జనతాపార్టీలో సంక్షోభం పెరిగేకొలది పూర్తి వ్యతిరేకతగా స్పష్టమైంది. చివరి అంశంగా కమ్యూనిస్టు ఐక్యత నిర్మించేముందు, కమ్యూనిస్టుపార్టీల నేటి నాయకత్వాన్ని తొలగించాలనే కొందరి మిత్రుల అభిప్రాయాన్ని ఖండించుతూ, కమ్యూనిస్టుపార్టీల మధ్య సహకారాన్ని మరింత కష్టతరం, అసాధ్యం చేస్తున్నారని ఇర్ఫన్ హబీబ్ విమర్శించారు. క్రింది నుండి ఐక్యత నిర్మించాలనుటకు ఆచరణ ప్రాముఖ్యత లేదని కూడ స్పష్టం చేసారు. వామపక్ష వుద్యమాలపై ఎట్టి చారిత్రిక విశ్లేషణ యివ్వబడలేదన్నారు. అంతేగాక, నేడున్నవర్గ, సామాజిక, ఆర్థిక, రాజకీయ నిర్మాణ విశ్లేషణ కూడ యివ్వబడలేదన్నారు. సామాజిక పరిస్థితి విశ్లేషణపై, వివిధ కమ్యూనిస్టు ఉద్యమాలు, శ్రేణులువొక ఆమోదానికి వచ్చిన పిమ్మటనే ఐక్యం అవ్వాలని కోరుతున్నామా యని ప్రశ్నించి, దానిని ఖండించి, అట్టి సైద్ధాంతిక ఐక్యత, ఐక్యకార్యాచరణ, ఐక్యపోరాటాల క్రమంలోనే యేర్పడుతుందని బిపిన్‌చంద్ర స్పష్టం చేసారు. ఇది పరస్పర విమర్శన కాలంకాదని, ఆత్మవిచారం, పరిశీలనచేయలసిన, కమ్యూనిస్టు సంక్షోభకాలమని నిఖిలచక్రమర్తి అన్నారు. అంతేగాక, కార్యాచరణలో, దృక్పథంలో, జీవిత సరళిలో మనం కార్మికవర్గంతోపాటు గుర్తింపబడలేదు, కాని వారికే నాయకత్వం వహించవలసివుంది.

**4.4** కమ్యూనిస్టుపార్టీల భటిండా, జలందర్ కాంగ్రెసుల నూతన రాజకీయవిధానాల నేపధ్యంలో అన్ని కేంద్ర ట్రేడు యూనియనుల ఐక్యకార్యాచరణలో జాతీయ ఫెడరేషనులు పారిశ్రామిక సంబంధాల బిల్లు ఉపసంహరించాలనే నవంబరు "పార్లమెంటుకు ఊరేగింపు ప్రదర్శన, ట్రేడుయూనియను ఉద్యమ చరిత్రలో నూతన మలుపు అయింది. ఈప్రదర్శనలో ఎనిమిది జాతీయ ట్రేడు యూనియనులు, 41 పారిశ్రామిక ఫెడరేషనలు పాల్గొన్న చారిత్రాత్మక, మార్గదర్శిక ఐక్యకార్యాచరణ అయ్యేది. ఈ పోరాటాన్ని విజయం వరకు నడుపుటకు "ఒక జాతీయ కమిటిని యేర్పాటు చేసారు. రాష్ట్రాలలో అనేక కన్వెన్షనులు జరిగి అన్ని ట్రేడుయూనియనుల ఐక్యతా విధానాన్ని" వేగవంతం చేసాయి. వివిధ రాష్ట్రాలలో కార్మిక, కర్షక, విద్యార్థి, యువజన, వుద్యోగుల, మధ్యతరగతుల ఐక్యపోరాటాలకు నాంది వాచకమై, ప్రోత్సాహన్నిచ్చింది.

మునుపెన్నడు జరగని విధంగా వివిధ రాష్ట్రాలలో రైతాంగం పోరాటాలు జరిపింది. ఈ పోరాటాలను నూతన ధనిక రైతాంగం, నగర కార్మిక, మధ్యతరగతి, యితర బడుగు వర్గాలకు, పారిశ్రామిక వ్యతిరేక పోరాటాలుగా చేయు ప్రయత్నాలను, వామపక్ష పార్టీలు సకాలంలో యితర పార్టీల సహకారంతో అత్యధిక రైతాంగ ప్రయోజనాలకై, ముందుకు నడిపించాయి.

ఆరు ప్రతిపక్షపార్టీల, ప్రజాసంస్థల, కార్మిక, కర్షక, వ్యవసాయకూలి, విద్యార్థి, యువజన, మహిళా సంఘాల ప్రతినిధుల జాతీయ కన్వెన్షన్ ధరల పెరుగుదలకు, మత మౌఢ్యానికి వ్యతిరేకంగాను, పౌరహక్కుల కొరకు పోరాటం జరిగింది. ఆరుపార్టీల కోఆర్డినేషన్ కమిటి యేర్పడి, కోర్కెల చార్టరు ప్రకటించి, ఐక్యకార్యాచరణకై

పిలుపునిచ్చింది. ఈ అఖిల భారత కేంద్ర ప్రయత్నాలననుసరించే, రాష్ట్ర నాయకత్వాలు ఐక్యకార్యాచరణ, పోరాటాలు కొనసాగించాయి.

మహారాష్ట్రలో ఆర్డినెన్సులు, అధికధరలు, నిర్బంధ చర్యలకు వ్యతిరేకంగా కొల్హాపూర్, సాంగ్లీ, సతారా, అహమ్మద్‌నగరులలో, చెరకు, ఉల్లిపాయలు ప్రత్తి పంటలకు గిట్టుబాటు ధరలకు, కొనుగోలుకు రైతాంగ, తదితర ప్రజాఐక్యపోరాటాలు జరిగాయి. ఆంధ్రప్రదేశ్‌లో గిట్టుబాటుధరలకు, విత్తనాలు, ఎరువులు చవకధరలకు, కరెంటు చార్జీలు తగ్గింపుకు, బీదల అప్పుల రద్దుకు రైతాంగం, ప్రజాసామాన్యం ఐక్యపోరాటాలు సాగించారు.

బీహారులో సాంప్రదాయంగా ఆటవికతెగలు అడవులలో ఉత్పత్తులను సేకరించుటపై సింగ్భూమి జిల్లాలో పోలీసుల సంఘర్షణలో మృతుల విషయంగా తీవ్రపరిస్థితులు యేర్పడుట, 30వేలమంది సత్యాగ్రహపోరాటం సాగించి విజయం పొందారు. పంజాబ్‌లో సి.పి.ఐ; సి.పి.ఐ(యం) అకాలీదళ్‌లు ప్రజాకోర్కెలపై సంయుక్తంగా ధర్నాలు, కన్వెన్షన్‌లు జరిగాయి. అన్ని వర్గాలు తమ కోర్కెలపై సమ్మె పోరాటాలు సాగించారు. గుజరాత్‌లో ధరల పెరుగుదల వ్యతిరేక వుద్యమంపై ప్రభుత్వం జరిపిన నిర్బంధకాండకు వ్యతిరేకంగా వామపక్షాలు సంయుక్తంగా సత్యాగ్రహం జరిపారు.

ఈ కాలంలో ప్రత్యేకతను సంపాదించుకొన్న రెండు ముఖ్యపరిణామాలలో వొకటి, వామపక్ష ప్రజాస్వామ్య శక్తుల, సంస్థల ఐక్యకార్యాచరణ, పోరాట ఐక్యత రోజురోజుకు అభివృద్ధి చెందుచుండుట, రెండు ప్రజలు పోరాటాలు సాగించుటయేగాక, ముఖ్యమైన రాయితీలు పొందగలుగుటతో ప్రజలలో ఆత్మవిశ్వాసం, వామపక్షాలయెడల విశ్వాసం పెరిగింది.

**4.5 యన్.టి. రామారావు** ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి మే 1983లో కాంగ్రెసేతర ప్రతిపక్ష రాష్ట్రాల ముఖ్యమంత్రుల సమావేశం జరిపారు. పరస్పరం అభిప్రాయాలు తెలుసుకొంటూ వొక సమిష్టి సాధారణ అవగాహనలకు, చర్చల అవసరం గుర్తించి యీ సమావేశం యేర్పాటు చేయబడినట్లు ఆహ్వానాల లేఖలోనే స్పష్టంచేసారు. పత్రికలు చర్చల విస్తృత విస్తారమైనందున, కాంగ్రెసు (ఐ) కు జాతీయ ప్రత్యమ్నాయాన్ని రూపొందించే ప్రయత్నంగా వాఖ్యానించాయి. సి.పి.ఐ; సి.పి.ఐ(యం) నాయకత్వాలు పాల్గొనుటయేగాక, మత, మితవాద, అభివృద్ధి నిరోధక శక్తులపై పోరాటాలకు సమిష్టి అవగాహన అభివృద్ధి చేయుటకు సంప్రదింపులు జరిపారు. రాష్ట్రీయ స్వయంసేవక సంఘపు రాజకీయపార్టీ భారతీయజనతా పార్టీతో సహా "అవకాశవాద కాంగ్రెసు వ్యతిరేక అన్ని పక్షాల ఐక్యసంఘటనను" సి.పి.ఐ, వ్యతిరేకించింది. ఈ సమావేశంలో సి.పి.ఐ. పాల్గొనుటను వామపక్ష శక్తులు కొన్ని విమర్శించినా, సి.పి.ఐ.పాల్గొనుటవలననే మతతత్వ నియంతృత్వశక్తులు వేరుచేయబడుట, అభ్యుదయకర శక్తులు బలపడుట జరిగింది. విజయవాడ సమావేశానంతరం ఢిల్లీ, శ్రీనగరులలో మరో రెండు సమావేశాలు జరిగాయి. బి.జె.పి ప్రతిపాదనయైన జాతీయ ప్రజాస్వామ్య ఐక్యసంఘటన "కమ్యూనిస్టులు లేని" అన్ని ప్రతిపక్షపార్టీల సంఘటన" అనే ప్రతిపాదన వచ్చింది. బి.జె.పి.ని వేరుచేయుటలో

కమ్యూనిస్టుపార్టీలు విజయాన్ని సాధించాయి. ప్రతిగా ఐదు ప్రతిపక్షాల, లౌకిక ప్రజాస్వామ్యశక్తుల సంఘటన రూపొందే సుముఖ పరిణామం జరిగింది. ఈవిధంగా బి.జె.పి, లోక్‌దళ్‌ల జాతీయ ప్రజాస్వామ్య ఐక్యసంఘటనను యితర బూర్జువా పార్టీలపై వొత్తిడిచేసి, యేర్పరుద్దామనుకొన్నవారి యెత్తుగడల పునాదులు కదలి పోయాయి.

కమ్యూనిస్టుపార్టీలు సి.పి.ఐ; సి.పి.ఐ(యం) రెండూ వామపక్ష, ప్రజాస్వామ్య, లౌకిక శక్తుల ఐక్యతను, కాంగ్రెసుపాలనకు ప్రత్యామ్నాయాన్ని రూపొందించుటకు రాజకీయ ఎత్తుగడలను రూపొందించుకొన్నవి. ప్రథమంగా కమ్యూనిస్టులను వేరుపరచి, అన్ని ప్రతిపక్ష పార్టీల ఐక్యసంఘటనను యేర్పరచాలనే మిత, మతవాద బి.జె.పి లోక్‌దళ్ ఎత్తుగడలు వమ్ము అయ్యాయి. ద్వితీయంగా, కమ్యూనిస్టు పార్టీలు రెండూ తమ నిరవధిక ఐక్యకార్యాచరణ పోరాటాలలో బి.జె.పిని ప్రజాస్వామ్య పార్టీలు అలయెన్సుల నుండి వేరుచేయుటతో ప్రతిపక్షపార్టీలు, శ్రీనగర్ సమావేశంలో వామపక్ష, లౌకిక, ప్రజాస్వామ్య శక్తుల ఐక్యతవైపు మొగ్గుచూపాయి. తృతీయాంశంగా, ప్రజానమస్యలపై కమ్యూనిస్టుపార్టీలు, ప్రతిపక్షపార్టీలు, కార్యకర్తలతో సన్నిహిత సంబంధాలు అభివృద్ధి చెందాయి. చివరి అంశంగా, విదేశాంగ విధానంపై ఎనిమిది వామపక్ష, ప్రజాస్వామ్య ప్రతిపక్షాలు, సమిష్టి అవగాహనకు వచ్చాయి, కన్వెన్షన్ ప్రపంచ ఉద్రిక్త పరిస్థితులకు రీగన్, అతని నాటో మిత్రులు భాద్యులని స్పష్టం చేసింది. కన్వెన్షన్ ఏప్రిల్ 13న దేశమంతటా సంయుక్త సమావేశాలు జరుపుట పిలుపునిచ్చింది.

**4.6 కార్మికుల, కర్షకుల,** యితర మధ్యతరగతుల, ఉద్యోగుల ఐక్యకర్యాచరణ పోరాటాలెన్నో ముమ్మరంగా వివిధ రాష్ట్రాలలో జరిగాయి. ఈ పోరాలాల శిఖరాగ్రంగా, 1984 ఆగస్టులో మూడు సంస్థల జాతీయ వ్యవసాయకూలీల కన్వెన్షన్ ఢిల్లీలో జరిగింది. జాతీయ వ్యవసాయకూలీల సమగ్ర చట్టానికై ఆందోళనకు పిలుపునిచ్చింది. నాలుగు అంశాల కార్యక్రమాన్ని యిచ్చింది.

**4.7 ప్రజావ్యతిరేక,** కార్మిక వర్గ వ్యతిరేక ఆర్థిక, రాజకీయ విధానాలను అవలంబించుటతో పాలకపార్టీ కాంగ్రెసు ప్రజలలో బలాన్ని, ప్రాపకాన్ని కోల్పోయింది. లోక్‌సభ, శాసనసభలకు జరిగిన బై ఎలక్షనులలో కాంగ్రెసు వోటమి దీనినే సూచించుతున్నది. ఈనేపథ్యంలో కాంగ్రెసు (ఐ) ప్రభుత్వం కాంగ్రెసేతర రాష్ట్ర ప్రభుత్వాలను, బూర్జువా పార్లమెంటరీ సూత్రాలను, రాజ్యాంగచట్టాన్ని కూడ త్రోసిబుచ్చి, కుట్రలతో కూలద్రోయుట, స్వపక్షీయులతో అల్లర్లు సృష్టించి, ఆమిషతో గవర్నర్లచే రాష్ట్ర ప్రభుత్వాలను రద్దు చేయునిరంకుశ, రాజ్యాంగ చట్ట వ్యతిరేక విధానాలను అవలంబించింది. కాశ్మీర్, కర్నాటక రాష్ట్రాలలో యం.యల్.ఎ లను కొనుగోలు చేయుట చేసింది. ఆంధ్రప్రదేశ్‌లో అసెంబ్లీలో మూడింటరెండువంతులు మెజారిటీగల రామారావు ప్రభుత్వాన్ని కుట్రలతో , అనారోగ్యంతో వైద్యానికి అమెరికా వెళ్ళిన రామారావు తిరిగివచ్చే లోపల తెలుగుదేశం పార్టీలోని అసంతృప్తి యం.యల్.ఎలను ప్రలోభాలకు గురిచేసి భాస్కరరావు నాయకత్వంలో బలపరీక్ష పెట్టకుండా, గవర్నరు రాంలాల్‌చే రామారావు ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయించి,

భాస్కరరావు 30 రోజుల ప్రభుత్వం యేర్పడునట్లు చేసింది. ఆంధ్రప్రజానీకం దీనికి వ్యతిరేకంగా ప్రజావుద్యమం ఉవ్వెత్తుగాలేచుట, దేశమంతటా ప్రదర్శనలు, బందులు జరుగుట రాష్ట్రపతికి 294 అసెంబ్లీ సభ్యులలో 165 మంది తనను బలపరచుతున్నారని రామారావు నిరూపించుట, భాస్కరరావు రాజీనామా తిరిగి రామారావు ప్రభుత్వం యేర్పడుటతో ఇందిరాగాంధీ రాంలాలులకు శృంగభంగమైంది.

**4.8** ప్రతిపక్షాల ఐక్యత అనిశ్చతకు సమస్యగానే వుంది. ఐక్యసంఘటనా నిర్మాణం రూపొందలేదు. రాజ్యసభ, విదానసభ ఎన్నికలలో అభ్యర్థులను నిర్ణయించుటలో ప్రతిపక్ష ఐక్యసంఘటనల బలహీనత స్పష్టమైంది. పైగా జనతాపార్టీ పాట్నా ప్లీనరీ సమావేశంలో "ప్రతిపక్షాల కేంద్రీకృత ఐక్యత సిద్ధాంతాన్ని" చేబట్టి జనతాపార్టీలో కొన్ని ప్రతిపక్షపార్టీలను సంలీనం చేసుకొనుట, ఏక లక్ష్యంగల పార్టీలతో ఎన్నికల ఐక్యత, ప్రతిపక్ష మితవాద, అతివాద పార్టీలతో సీట్లు సర్దుబాటులుతోబాటు, రహస్య ఏజెండాలోని "కమ్యూనిస్టేతర ప్రతిపక్ష పార్టీల ఐక్యతా సిద్ధాంతాన్ని" అమలు చేయుట కమ్యూనిస్టులను ఏకాకులను చేయు ప్రభుత్వం, మే 1984న విజయవాడలో జరిగిన బూర్జువా ప్రతిపక్షపార్టీల సమావేశంలో జరుగుటతో ప్రజలలో అనేక సందేహాలు ప్రబలినవి. ఈమితవాద, జనతాపార్టీల యత్నాలకు ప్రతిగా, కమ్యూనిస్టుపార్టీలు రెండూ తమ పూర్వ వామపక్ష లౌకిక ప్రజాస్వామ్యశక్తుల ఐక్యత నిర్మించుటకు ఎత్తుగడలను రూపొందించాయి.

ప్రధానంగా అత్యంత మితవాద, అభివృద్ధి నిరోధక, మతతత్వ పార్టీయైన బి.జె.పి.ని ప్రజాస్వామ్య శక్తుల నుండి వేరుపరచి, దాని లక్ష్యాన్ని, ప్లానులను వమ్ముచేయుట, కమ్యూనిస్టులు జాతీయ ప్రజాస్వామ్య అలయెన్సులోని పార్టీలనుండి, ముఖ్యంగా వాటికి నాయకత్వం వహించుచున్న బి.జె.పి.ని దూరం చేయుట బ్రహ్మాండమైన విజయాన్ని సాదించాయి. ప్రజాసమస్యలపై ప్రతిపక్ష పార్టీలతో సన్నిహిత అవగాహన పెంపొందించుట, విదేశాంగ విధానంపై గూడ వొక సమిష్టి అవగాహనకు వచ్చుటలో కూడ విజయం పొందాయి. జీవితంలో యీ పంథా 1977-79 జనతా ప్రభుత్వం పతనం తరువాత భవిష్యత్తుకు మార్గదర్శికంగా మరోసారి రుజువైంది.

**4.9 వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతకు** పునాది, కమ్యూనిస్టుల మధ్య సహోదర సత్సంబంధాలు అభివృద్ధి చెంది, పార్టీల మధ్య ఐక్యతయేర్పడుట, వారణాసి సి.పి.ఐ పార్టీ కాంగ్రెసు రాజకీయ తీర్మానం, యిది అంత తేలికైనదనే బ్రమలు లేవని స్పష్టం చేసింది. కమ్యూనిస్టు ఐక్యత, వామపక్ష ఐక్యత, నిర్మాణానికి వామపక్ష ప్రజాస్వామ్యశక్తుల ఐక్యతను నిర్మించుటలో పట్టువిడవని, నిలకడైన, రాజకీయ, సైద్ధాంతిక పోరాటం, సూత్రబద్ధంకంగా పునరేకీకరణ అంతిమ లక్ష్యం చేరుకొనుటకు బాటకావాలని తీర్మానం వివరించింది.

రెండు పార్టీల మధ్య జాతీయ, అంతర్జాతీయ సమస్యలపై సమిష్టి అవగాహన, సన్నిహిత సహకారం, సంయుక్త కార్యాచరణలు సాధ్యమై సంబంధాలు మెరుగైనాయి.

కేంద్రస్థాయిలో సంప్రదింపులు సమన్వయపరచుట జరుగుచున్నది. ఇంకా వున్న అభిప్రాయభేదాలను ద్వైపాక్షికంగా, సౌభాతృత్వంగా చర్చించి, అవగాహన పెంపొందించు కొనవచ్చు.

ఎన్నికల సమయంలో, పార్టీల జనరల్ బాడీ సమావేశాలలో మార్క్సిస్టు లెనినిస్టు పదజాలంలోని అన్ని నిందా, ప్రతినింద, దూషణ, దుష్ప్రచార, వక్రీకరణ, సైద్ధాంతిక తిట్టు పదజాలాన్ని వొక్క మాట కూడ వదలకుండా పరస్పరం తీవ్రంగా, హాస్యోక్తులు జోడించి వినియోగించారు. ఈ పదజాలంతో సభ్యులపై సైద్ధాంతిక రాజకీయస్థాయిని పెంచుటలో విఫలమైనా వారిలో రాగద్వేషాలను, ఉద్రేకాలను పెంచుటకు, పరోక్షంగా తమ తమ నాయకత్వాలను పతిష్టమొనర్చుటకు బాగా వినియోగపడిందని తలచుట పొరపాటు.

అంతేగాక బహిరంగంగా సి.పి.ఐ కమ్యూనిస్టు పార్టీయేకాదని, సోషలు డెమోక్రటిక్‌పార్టీ, మహా అయితే, వామపక్ష పార్టీయని సి.పి.ఐ (యం) ప్రకటించింది. పరస్పరం "మితవాదపార్టీ" "అతివాదపార్టీ" యని, యింకా "సంస్కరణవాద పార్టీ" యని, "పిడివాదపార్టీ"యని పరస్పరం పిలుచుకొన్నారు. సి.పి.ఐ(యం) సి.పి.ఐ.ని కమ్యూనిస్టుపార్టీగానే గుర్తించలేదు. అంతరంగాలలో, అవగాహన, ఆలోచనలలో యీ వైఖరితో ఐక్యత యేర్పడుట వూహించరానిది.

వామపక్ష ఐక్యతా పోరాటము సైద్ధాంతిక పోరాటాలను యేకకాలంలో నిరవధికంగా సాగించాలనే ప్రాధమిక అవగాహనతోనే రెండు కమ్యూనిస్టుపార్టీలు రాజకీయ పోరాటాలను సాగించాయి. వామపక్ష ఐక్యతా పోరాటం వ్యూహాత్మక ప్రాధాన్యతగల పోరాటం, సైద్ధాంతిక వ్యూహాత్మక ప్రాధాన్యత పరిధిలోనే జరుగవలసివుంటుందనే శాస్త్రీయ అవగాహన అంటే, వామపక్ష ఐక్యతా నిర్మాణావకాశాలను పెంపొందించే పరిదిలోనే సైద్ధాంతిక పోరాటం జరుగవలసివుంటుంది. సైద్ధాంతిక పోరాటం పేరుతో తమ తమ ఆధిక్యతలను పెంపొందించుకొనే లక్ష్యంతో కొనసాగించి, ఆశించిన ఫలితాలను పొందక పోగా భేదాభిప్రాయాలను మరింత ఎక్కువగా చేసుకొనుట జరిగింది. ప్రధానలక్ష్యమైన వామపక్ష ఐక్యత కనుమరుగై, తమ తమ పార్టీల రాజకీయ, నిర్మాణ, సైద్ధాంతిక బలాలను పెంపొందించుకొను లక్ష్యంతో పురోగమించిన పోరాటం అశాస్త్రీయ స్వీయ మానసిక ధోరణులలో కొనసాగి, ఐక్యతవైపు పురోగమించజాలదనుట స్పష్టమైంది.

# 5

# దేశ ఐక్యత సమగ్రతలకై పోరాటము

## (ప్రాంతీయ పార్టీలు దేశ ఐక్యతా, సమగ్రతా సమస్యలు)

భారత దేశము అత్యంత ప్రమాదకర, క్లిష్ట పరిస్థితులలో పయనిస్తున్నది. ప్రప్రధమంగా వేర్పాటువాద, మతతత్వ, కులతత్వ, ప్రాంతీయ, జాతీయ దురహంకార, విచ్ఛిన్నకరశక్తులు దేశభద్రత, సమగ్రతలకు, దేశ ఐక్యతకు, లౌకిక, ప్రజాతంత్ర వ్యవస్థకు తీవ్ర ప్రమాదాన్ని తెచ్చి పెట్టాయి. కాంగ్రెసు తాత్కాలిక రాజకీయ ప్రయోజనాలకై కుల, మత శక్తులను బుజ్జగించుతు, లౌకిక, ప్రజాస్వామ్యశక్తులను బలహీన పరచే వైఖరులను చేబట్టింది. మరో అంశం, ఇందిరాగాంధీ నాయకత్వాన కాంగ్రెసు (ఐ) యేకపార్టీ పాలనను స్థాపించుటకై కాంగ్రెసేతర ప్రభుత్వాలను పడగొట్టుట ద్వారా పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని, సాంప్రదాయాన్ని, సూత్రాలను బహిరంగంగా ఉల్లంఘించుతు, ప్రజాతంత్ర వ్యతిరేక పద్దతులను పాల్పడుతున్నది. పార్లమెంటరీ ప్రభుత్వం స్థానే అధ్యక్ష తరహప్రభుత్వాన్ని యేర్పాటు చేయప్రయత్నిస్తున్నది. ఇందుకు విదేశ సామ్రాజ్యవాద శక్తులు, దేశంలో బడాబూర్జువావర్గాలు, మితవాద అభివృద్ధి నిరోధక వర్గాలు పూర్తి మద్దతు నిస్తున్నాయి.

కాంగ్రెసు (ఐ) 1980 ఎన్నికలలో అనేక రాష్ట్రాలలో పెద్ద మెజారిటీ సంపాదించినా, అధి ప్రభుత్వ స్థిరత్వాలను కాపాదలేకపోయింది. ఈదశలో అనేక ప్రజావుద్యమాలు, జీవన ప్రజాపోరాటాలు తమ కోర్కెలకై సాగాయి. కాంగ్రెసు (ఐ) ప్రభుత్వాలు, రాష్ట్రాలలోని యితర బూర్జువాపార్టీల ప్రభుత్వాలు ప్రజావ్యతిరేక, కార్మిక, కర్షక వ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా, తమ జీవన ప్రమాణాలను కాపాడు కొనేందుకు సాగించిన ప్రజా పోరాటాలకు కార్మికవర్గం నాయకత్వం వహించింది.

దేశంలోని పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని కాపాడుకొనేందుకు, వివిధ రాజకీయపార్టీలను అనుసరించే ప్రజాసామాన్యం గొప్ప రాజకీయ పోరాటాలు సాగించింది. వివిధ ఆర్థిక, రాజకీయ పోరాటాలలో రెండు, సి.పి.ఐ; సి.పి.ఐ(యం) కమ్యూనిస్టు పార్టీలు ముఖ్యపాత్ర వహించాయి. అమెరికా ద్రవ్యవ్యవస్థల మార్గదర్శికత్వంలో ప్రజావ్యతిరేక, స్వార్థపరవర్గ అనుకూల విధానాలు అవలంబించుటతో 1980 దశకంలో ఇందిరాగాంధీ ప్రభుత్వం క్రమేణా ప్రజాపునాదను కోల్పోయింది. దీనితోపాటు ముఖ్యంగా పంజాబ్, అస్సాం సమస్యలు లాంటి తీవ్రమైన రాజకీయ సమస్యలను పరిష్కరించుటలోని వైఫల్యం, వివిధ రాష్ట్ర ప్రభుత్వాలను కూలదోయుటకు అనుసరించిన కుటిల విధానాలు ఆజ్యంపోసాయి. అయినా, స్వర్ణదేవాలయం నుంచి, శిక్కు హింసావాదులను తొలగించుటకై తీసుకొన్న సౌనికచర్య అనంతరం, ప్రజానీకంలోని విస్తృత భాగాలలో కోల్పోతున్న అభిమానాన్ని ఇందిరాగాంధీ, తిరిగి కొంత పొంద

గలిగింది. కాని శిక్కుమత దురహంకార వేర్పాటు వాదులు రెచ్చిపోవుటకు కారణం కూడఅయింది. ఆలస్యం అమృతం విసయం అగుటకు యింతకంటె మరో రాజకీయ వుదాహరణ కన్పించదు. అక్టోబరు 1984లో ఆమె హత్య చేయబడుటతో దేశ ఐక్యత, సమగ్రత, భద్రతలపట్ల ప్రజలలో దేశవ్యాపిత తీవ్ర ఆందోళన, ఆదుర్దావ్యాపించింది.

భారతదేశాన్ని చక్రబంధంలో వుంచుటకుఅమెరికా తన ప్రయత్నాలను వుధృతం చేస్తున్నది. పాకిస్థాన్‌కు అధునాతన ఆయుధాలను విపరీతంగా ఉచితంగా అందజేస్తున్నది. అణ్వాయుదాల తయారిలో, కాశ్మీర్ టెర్రరిస్టుల పరోక్షంగా శిక్షణ, ఆయుధ సామాగ్రులను విస్తారంగా యిచ్చుటయేగాక, స్థావరసౌకర్యాలను వారికి కలుగజేస్తున్నది.

అమెరికా సామ్రాజ్యవాదపు సైనిక దాడులకు హిందూ మహాసముద్రం దక్షిణ ఆసియా, ఆగ్నేయ ఆసియా, ప్రాచ్య, పశ్చిమ ఆసియా, ఆఫ్రికా, మధ్య ఆమెరికాలు ప్రధాన కేంద్రాలుగా వున్నవి. కంపూచియా, ఆఫ్ఘనిస్తాన్, నికారుగువా సామ్రాజ్యవాద జోక్యాలను, యుద్ధాలకు బలి అయ్యాయి. పాలస్తీనా, ఇజ్రాయిల్, అంగోలాలు, ఆరబ్ జాతీయ విముక్తి వుద్యమాల సామ్రాజ్యవాదుల కుట్రలు, కుతంత్రాలకు, సైనికదాడులకు గురి అయ్యాయి. ఈ రోజులలోనే ప్రపంచ వ్యాప్తంగా శాంతి వుద్యమం, యుద్ధ వ్యతిరేక వుద్యమం, అణ్వాయుధాల వ్యతిరేక వుద్యమం, వాటిని తగ్గించే వొప్పందాల ప్రపంచ ప్రజావొత్తిడి యెక్కువైంది. నక్షత్ర యుద్ధ వూహనిర్ణేతలు, లేజరు ఆయుధాల నూతన ప్రయోగాలతో ముందుకొస్తున్నారు. ఈ స్థితిలో సామ్రాజ్యవాదంలో అంతర్గతవైరుద్యాలు పెరిగాయి. నక్షత్ర యుద్ధ తయారీలో, వాటి కార్యక్రమాలలో అమెరికాతో కలియుటకు ఫ్రాంసు సిద్ధంగాలేదు. కొన్ని దేశాలలో అమెరికా అణు ఆయుధాలను నిలువ జేయుటకు ఆదేశాలు వ్యతిరేకించుతున్నవి.

అంతర్జాతీయ పరిస్థితులలో యుద్ధమా. శాంతా అన్న ప్రశ్న, అణుయుద్ధాన్ని ఎలా నివారించాలా అన్నది కేంద్ర సమస్య అయింది. ప్రపంచ యుద్దాన్ని ప్రేరేపించేశక్తులకు, శాంతిని పెంపొందించే శక్తులకు ప్రపంచ వ్యాప్తంగా సంఘర్షణ మరింత తీవ్రమైంది. యుద్ధశక్తులకు అమెరికా, శాంతిశక్తులకు సోవియట్ యూనియన్‌నాయకత్వం వహించు తున్నవి. శాంతి పరిస్థిలతులలో ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ సామ్రాజ్యవాదం మధ్య వైరుధ్యం ప్రధాన వైరుధ్యము. ఆర్థిక రాజకీయ రంగాలలో సామ్రాజ్యవాదానికి, వర్ధమాన దేశాలకు మధ్య ఘర్షణలు పెరుగుతున్నవి. అమెరికా సామ్రాజ్యవాదులు వర్ధమాన దేశాలపై జరిపే హింసా, దౌర్జన్య, దురాక్రమణలకు, ప్రధానవైరుధ్యం నేపద్యం నుంచే గమనించాలి. శాంతి పరిస్థితులలోనే జాతీయ విముక్త వుద్యమం, శాంతి శక్తులు నూతన విజయాలను పొందగలుతాయి. సోషలిస్టు వ్యవస్థ, నూతన స్వాతంత్ర దేశాలు బలపడగలవు.

శ్రీలంకలోని పరిణామాలు మనదేశ ప్రజలకు ఆందోళనను కలుగజేస్తున్నవి. మనకు జాతీయ సమస్య అయింది. అమెరికా తమ దురాక్రమణ చర్యలకు, లంకను బలమైన సైనిక స్థావరంగాను, భారతపై దురాక్రమణకు కేంద్రంగాను తయారుచేస్తున్నారు. కుట్రలు

కొనసాగిస్తున్నారు. శ్రీలంకలో తమిళులు అధికసంఖ్యాకులు మైనారిటీలుగా వున్న ప్రాంతానికి, స్వయంప్రతిపత్తి కల్పిస్తూ, సంప్రదింపులు ద్వారా రాజకీయ పరిష్కారాన్ని కనుగొనాలన్నది కమ్యూనిస్టుపార్టీ వైఖరిగావుంది. ఆ విధంగానే పార్టీ, ప్రధాని రాజీవ్‌గాంధీకి లేఖ వ్రాసింది. ప్రభుత్వం సంప్రదింపులద్వారా రాజకీయ పరిష్కారం కనుగొనాలని. అందుకు శ్రీలంక ప్రభుత్వానికి లంకలోని తమిళసంస్థకు మధ్య సంప్రదింపులు యేర్పాటు చేయవలసిందిగా సూచించింది. ఈ చొరవను రెండు కమ్యూనిస్టుపార్టీలు బలపరచాయి.

అమెరికా సామ్రాజ్యవాద అణు, ఆయుధ పోటీకి వ్యతిరేకంగా, దేశ ఐక్యత, సమగ్రత, భద్రలను రక్షించుటకు వామపక్ష పార్టీలు ముఖ్యంగా కమ్యూనిస్టుపార్టీలు సామ్రాజ్యవాద వ్యతిరేక, దేశభక్తి, రాజకీయశక్తులను సమీకరిచుటకు చొరవను తీసుకొన్నవి. అక్టోబరు 4. 1982న ఢిల్లీలో వామపక్ష శక్తులశాంతి ప్రదర్శన, కలకత్తా, విజయవాడ, తిరువాన్కూరులలో తరువాత ప్రజాప్రదర్శనలు జరిగాయి. ఈ సందర్భంలో ప్రపంచ ట్రేడు యూనియన్ కాంగ్రెసు విజ్ఞప్తి ననుసరించి, సెప్టెంబరు 1న, "యుద్ధ వ్యతిరేకదినము" పాటించుట, ప్రదర్శనలో 25లక్షల మంది పాల్గొన్నారు. సి.పి.ఐ; సి.పి.ఐ(యం) తదితర వామపక్ష పార్టీలు పాల్గొన్నవి. పశ్చిమయూరపులో పెరిషింగ్-2 మిసిలీలు, క్రూయిజ్ మిసిలీలు మోహరించుట వలన అణుయుద్ధ ప్రమాదం పెరిగింది. అణుయుద్ధ ప్రమాదం పెరుగుట, జాతీయ భద్రతకు ముప్పుయేర్పడుటతో1984 మార్చిలో జాతీయసదస్సు జరిగింది. వామపక్ష పార్టీలు, డి.యస్.పి., కాంగ్రెసు (యస్), కాంగ్రెసు (జె), సమాజ్‌వాద్ పార్టీలు సదస్సు సంయుక్తంగా నిర్వహించాయి. బ్రహ్మాండమైన ప్రదర్శన జరిగింది.

కాంగ్రెసు (ఐ) ప్రభుత్వం శాంతి, సామ్రాజ్యవాద వ్యతిరేక, ప్రగతిశీల అలీనోద్యమ విధానాలను, విదేశాంగ విధానాన్ని మొత్తం మీద అవలంబించింది. ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికన్, అరేబియన్ సామ్రాజ్యవ్యతిరేక జాతీయ విముక్తి పోరాటాలకు తోడ్పాటు ప్రకటించింది. సోవియట్ యూనియన్, సోషలిస్టు దేశాలతో మైత్రికొనసాగించింది.

నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థకై జరిగే పోరాటం, నూతన తక్షణావశ్యకతను సంతరించుకొన్నది. నూతన అంతర్జాతీయ ఆర్థికవ్యవస్థ కొరకై చేసిన అన్ని ప్రతిపాదనలను అమెరికా మొండిగా వ్యతిరేకించింది. పైగా వర్థమాన దేశాలపై నయావలస విధానాలను బలవంతంగా రుద్దే ప్రయత్నాలను తీవ్రతరం చేసింది. సోవియట్ యూనియన్, సోషలిస్టు దేశాలన్నీ సంపూర్ణంగా బలపరచాయి.

పారిశ్రామిక రక్షణవాదం, ఎక్కువవడ్డీరేటు, అంతిమ ద్రవ్యవస్థ, అసమషరతులతో కూడిన వాణిజ్యం, ప్రపంచబ్యాంకి, అంతర్జాతీయ ద్రవ్యనిధిపై అదుపులాంటి ఆర్థికపరమైన వత్తిళ్లు ద్వారా సామరస్యవాదం, బడుగుదేశాలను శాశ్వతమైన ప్రతికూల వాణిజ్య అసమతూకం వూబిలోనికి, ఋణవలయం లోనికి త్రోసివేసింది. ఈవిధంగా సామ్రాజ్యవాదం ఆదేశాలపై తన దోపిడిని అధికంచేస్తుంది. స్వతంత్ర ఆర్థిక అభివృద్ధి పంథానుండి ఆదేశాలను ప్రక్కదారులు పట్టిస్తుంది. వర్థమాన దేశాలు నూతన

అంతర్జాతీయ ఆర్థికవ్యవస్థకై చేస్తున్న తక్షణ కోర్కెలను ఆసామ్రాజ్యవాదం తీవ్రంగా వ్యతిరేకిస్తున్నది.

## 1. విజయవాడ సి.పి.ఐ(యం) 11వ; వారణాసి సి.పి.ఐ 12వ. పార్టీ కాంగ్రెసులు

కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) 11వ, పార్టీ కాంగ్రెసు విజయవాడలో జనవరి 1982 ఆఖరివారంలో, భారతకమ్యూనిస్టుపార్టీ 12వ, పార్టీ కాంగ్రెసు వారణాసిలో మార్చి 1982 చివరివారంలో జరిగాయి. రెండు పార్టీలు వివాదాంశాలపై అనుసరించిన విధానాలు, అవగాహనలు, చేబట్టిన వైఖరులు, ప్రత్యేకంగా వామపక్ష ప్రజాకార్యాచరణ, ఐక్యప్రజాపోరాటాలు, ఐక్యత, ఐక్యసంఘటనలు రూపొందించు దృక్పధాలు తెలసుకొందాము.

1. ఎన్నికలలో జనతా పార్టీ వోటమితో ఇందిరాగాంధీ ప్రభుత్వం తిరగినెలకొల్పబడుటతో ఆర్థిక, సామాజిక పరిస్థితులు మరింత విషమించాయి. జనతా కొద్దికాలం పరిపాలించినపుడు కూడ, గతంలో మూడు దశాబ్దాలపాటు కాంగ్రెసు దేశాన్ని పెట్టుబడిదారి విధాన వంధాలో అభివృద్ధి చేయప్రయత్నించిన విధానాలనే కొనసాగించింది. ఇందిరాగాంధీ ప్రభుత్వం తిరిగి యేర్పడిన తరువాత, అదేవిదంగా ఆర్థికపరిస్థితిని సంక్షోభమార్గంలో త్వరితంగా చేరుటకు నూతనాంశాలను అనుబందంగా చేర్చింది, ఫలితంగా ఆర్థిక సంక్షోభం మరింత తీవ్రమైంది. దీనిని అవకాశంగా తీసుకొని సామ్రాజ్యవాదశక్తులు మన ఆర్థిక విదానాన్ని శాసించమొదలుపెట్టాయి. ఇది ఐ.యం.యఫ్. ప్రపంచబ్యాంక్ అప్పులకొరకై భారతదేశం ఆమోదించిన షరతులబట్టి స్పష్టమౌతుంది. ఆరవ పంచవర్ష ప్రణాళికలో 13వేలనుండి 15వేల కోట్లరూపాయాల వేరకు సామ్రాజ్యవాదుల విదేశ అప్పులపై ఆధారపడవలసివుంది. ఎగుమతి-దిగుమతుల వాణిజ్యంలో వారిపైనే అత్యధికంగా ఆదారపడియుండుట, సోవియట్ యూనియన్, తూర్పుయూరప్ నుండి దిగుమతులు 11శాతం, ఎగుమతులు 9.1శాతం మేరకే సహాయం లబించుటతో, ఎంత ఎక్కువగా పశ్చిమదేశాలు, ముఖ్యంగా అమెరికాపై ఆదారపడవలసివుంటుందో స్పష్టంగా అర్థమగుతుంది. ప్రపంచబ్యాంకి, ఐ.యం.యఫ్;లు భారత ఆర్థిక విదానంపై వహించే మౌలిక ఆర్థిక ప్రాదాన్యత పాత్ర విశదం కాగలదు. ఈవిధమైన అవగాహనతో, సామ్రాజ్యవాద శక్తులు భారతదేశంపై ఎంతటి ఆర్థిక వొత్తిడులకు గురిచేయగలవో సి.పి.ఐ(యం) యీ క్రింది విధంగా వివరించింది.

"ప్రభుత్వం అన్నిటినిమించి. "ఆహార సబ్సిడీలు" వుపసంహరించుకోవాలనే సామ్రాజ్యవాదశక్తుల షరతులకు లొంగిపోతున్నట్లు కన్పడుతున్నది. అధికార పూర్వకంగా కొన్ని ప్రాంతాలో "ఆహార సబ్సిడీ"లు వుపసంహరించుకోబడకపోయినా దేశంలో అత్యధికభాగంలో సామాన్య ప్రజానీకం, అధిక దరలకు ఆహారపదార్థాలను కొనవలసి వచ్చింది. అంతేగాక, ప్రపంచబ్యాంకి వ్యాపార పద్ధతులలో బ్యాంకులనుండి అప్పులు తెచ్చుకొనమని సలహాయిచ్చుటతో, ఆనతిగా పాటించకతప్పలేదు. అదేవిధంగా,

ఆరవపంచవర్ష ప్రణాళికకు బ్యాంకులనుండి, 4వేలకోట్లరూపాయాలు అప్పులు తీసుకొనుటను, ప్రణాళికలో సూచించబడింది. రైల్వేల అభివృద్ధికి కావలసిన 500కోట్ల రూపాయలు అప్పు ప్రపంచబ్యాంకి, యీ క్రింది షరతులు ఆమోదించి తీసుకొనవలసి వచ్చింది. అవి; 1) ప్రతిసంవత్సరం ప్రయాణీకుల, సరుకులరవాణా చార్జీలను పెంచాలి. 2) ఐ.బి.యం సప్లయి చేసే కంప్యూటర్లు దిగుమతి చేసుకొనాలి. వాటితో ఆఫీసు పనులు నిర్వహించబడాలి. విదేశీ పెట్టుబడులతో సంయుక్తంగా, దేశీయ పెట్టుబడి కలసి, కంప్యూటరైజేషన్ చేయాలనే షరుతు కూడ ఆమోదించబడింది. ఈవిధంగా దిగుమతి అయిన విదేశీ పెట్టుబడి 1980లో 1979తో పోల్చినపుడు రెట్టింపు అయింది. మూడవ ప్రపంచంలో ముఖ్యంగా చిలీ, దక్షిణ అమెరికా దేశాల అనుభవాలు, ఆసియాదేశాలలో కుతంత్రాలు, ఐక్యరాజ్యసమితిని, యీ ఆర్థికశక్తుల "కంచుకోటలు", "రాజకీయ కుట్రలు" విచారించి, పరిశీలించి, వొత్తిడి చేయగా అధ్యయనంచేయబడింది. తృతీయ ప్రపంచంలో వారి యీ చర్యలు నూతన వలసవిధానం యొక్క సాధనాలుగా గుర్తించింది.[1]

ఇండియాలో ప్రభుత్వ ఆజ్ఞలను, సూచనలను ముఖ్యంగా దేశ, విదేశపెట్టుబడుల నిష్పత్తులను ఉల్లంఘించినపుడు చర్యతీసుకొనుటకు బదులు, వారికి రాయితీలను యివ్వట జరిగింది. ఇది ముఖ్యంగా "మందులు" తదితర బహుళజాతుల మందుల కంపెనీల విషయంలో జరిగింది. వారి నిరసనతో "ఫెరా" నిబంధలను ఉల్లంఘించిన అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని యివ్వటమేగాక, వుత్పత్తిలో అత్యధికభాగాన్ని ఎగుమతి చేస్తున్నామనే నెపంతో 74శాతం పెట్టుబడులను విదేశ కంపెనీలు పెట్టి నిబంధనలను వుల్లంఘించుట జరిగింది. వారు ఎంతబలంగలవారంటే, జనతా ప్రభుత్వంగాని, ఇందిరాగాంధీ ప్రభుత్వంగానీ బహుళజాతుల కంపెనీలను జాతీయం చేయమని, "హాతి" కమిటీ సూచనను, అమలు చేసే ధైర్యంలేకపోయిందని ఆచరణలో రుజువైంది.

సామ్రాజ్యవాదం మనదేశ ఆర్థివిధానంలో కలుగజేసుకొనుట, మనదేశ స్వాతంత్ర్య ఆర్థికవిధానాన్ని తీవ్ర ప్రమాదకర పరిస్థితులకు తీసికొనిపోయింది. ఈవిధంగా చేయి మెలిపెట్టగలిగిన శక్తితో అమెరికా, దానిశాఖలు దేశ ఆర్థిక సార్వభౌమాధికారాన్ని, సమగ్రతను దెబ్బతీయుటకు అన్ని విదాల ప్రయత్నిస్తున్నారు.

దేశపు ఈ శాన్య ప్రాంతాలలో విదేశీ క్రిష్టియన్ మతసంస్థలు, తదితర సామ్రాజ్యవాద సంస్థలు దేశ సమగ్రతకు చిచ్చుపెట్టుచున్నవి. అస్సాం ఆందోళనలలో సామ్రాజ్యవాదుల హస్తం స్పష్టంగా వుంది.

పై సి.పి.ఐ(యం) అవగాహనలకు, దృక్పధాలకు రెండు మాసాల తరువాత జరిగిన సి.పి.ఐ 12వ కాంగ్రెసు అవగాహనలు ఎంత సన్నిహితంగా వున్నావో చూడండి.

"కేంద్రంలో రాజకీయపాలన జనతానుండి, ఇందిరాగాంధీ పాలన క్రిందికి వచ్చినా,

---

1. *రాజకీయ తీర్మానం (1982) సి.పి.ఐ (యం) 11వ. కాంగ్రెసు, విజయవాడ, 31 జనవరి, 1982న ఆమోదించబడింది. (ఆంగ్లంలో) పే.20-21.*

ఆర్థిక సంక్షోభం క్రమంగా తీవ్రతరమగుతూనే వుంది. జనతా ప్రభుత్వకాలంలో ప్రారంభించబడిన విధానాలు వాస్తవంగా, అత్యవసర పరిస్థితుల కాలంలో ఇందిరాగాంధీ ప్రవేశపెట్టిన విధానాలనేది స్పష్టం. తిరిగి వాటినే ఇందిరాగాంధీ కొనసాగిస్తున్నది.

"జులై 1980లో ప్రకటించబడిన నూతన పారిశ్రామిక విధానం, గతంలో స్వశక్తిపై ఆధారపడినది. జాతి మొత్తంచే ఆమోదించబడిన దానిని, మెట్లు మెట్లుగా తిరుగతోడిన దానిని ఆమోదించుట జరిగింది. సామాజిక న్యాయం, పబ్లిక్ రంగం ఆధిక్యతగలదిగా ప్రణాళిక పునాదిగా గల అభివృద్ధిని త్రోసిబుచ్చుట జరిగింది. పబ్లిక్ రంగం గతంలో "ఆర్థిక రంగంలో అత్యున్నత శిఖరాలనధిరోహించి, నిర్ణయాత్మక స్థాయికి ఎదుగునట్లు ప్రణాళికారచన ధ్యేయాలనుండి, పారిశ్రామిక సౌకర్యాలను, ఇన్ఫ్రాస్ట్రక్చరు సౌకర్యాలను నిర్మించే ప్రభుత్వరంగంగామార్చబడింది. ఐ.యం.యఫ్ మెమొరాండంకు స్వాగతం పలికారు. నూతన విధానం, ప్రవేటు శెక్టరు పాత్రనేగణనీయంగా మార్చివేసింది. అధికార వర్గాలు గత సూత్రాలను, సూచనలును, విధానాలను తిరుగతోడి, విదేశీ మార్కెట్టు కంటె దేశీయ మార్కెట్టునే ఎక్కువగా ఆకర్షణీయంచేయు ప్రయత్నంలో నిమగ్నులయ్యారు.

"అవమానకర ఆరు బిలియనుల డాలరుల ఐ.యం.యఫ్ "అప్పు వొప్పందం" విధానం, నూతన ప్రమాదకర దశకు చేరింది. మూడు మాసముల కొకసారి ఐ.యం.యఫ్, భారత ప్రభుత్వ "పనిని" సమీక్షించే అధికారం యివ్వబడింది. సర్దుబాటు చేయుటకు, ఆమోదించదమైనది. మౌలిక ఆర్థిక విధానాలను, భారతప్రభుత్వ స్వతంత్ర కార్యాచరణను తీవ్రంగా అదుపులో పెట్టగల షరతులను ఆమోదించారు. అటువంటి విధానం, మనజాతి ఆర్థిక స్వాతంత్ర్యాన్ని, స్వశక్తిపై ఆదారపడేవిధానాన్ని తీవ్ర ప్రమాదంలోపడవేసింది. అంతర్జాతీయ గుత్తపెట్టుబడి వర్గాలకు, బహుళజాతుల సంస్థలకు మన తలుపులు తెరువబడి, మన ఆర్థిక విధానాన్ని మార్కెట్టుకుదించి, జలహీనపరస్తుంది.[1]

రెండు కమ్యూనిస్టుపార్టీలకు, జనతా ప్రభుత్వతదనంతర ఇందిరాకాంగ్రెసు తిరిగి అధికారంలోనికి వచ్చి చేబట్టిన ఆర్థికవిధానాలు, ఐ.యం.యఫ్ ప్రపంచబ్యాంక్ ద్వారా వచ్చే విదేశపెట్టుబడులపై, ఎట్టి భ్రమలులేవు అని స్పష్టంగానే తెలుస్తున్నది. మన ప్రభుత్వాలు వారు పెట్టే షరతులను, రెండు కమ్యూనిస్టుపార్టీలు తీవ్రంగానే వ్యతిరేకించుతున్నవి. అంతేగాక రెండు పార్టీలు మనదేశ సమగ్రతను, ఆర్థికస్వాతంత్ర్యాన్ని ఐ.యం.యఫ్ ప్రపంచబ్యాంకుల సలహాసంప్రదింపులతో వారు విధించిన షరుతులకు లోబడిన చేబట్టే విధానం, మనకు అత్యంత ప్రమాదకారియని స్పష్టం చేసాయి. ఈవిషయంలో మాటలలో తేడా లేకుండా, రెండు పార్టీలు వొకే వైఖరిలో వున్నవి.

2. సి.పి.ఐ(యం) తీర్మానం సంక్షోభ తీవ్రత లక్షణాలను యిలా తెలిపింది. ఆర్థిక, రాజకీయ పోరాటాలలో పాల్గొనే సామాన్య ప్రజానీకం, లా అండ్ ఆర్డర్ పరిస్థితి

---

*1. రాజకీయ తీర్మానం (1982) వారణాసి. సి.పి.ఐ 12వ, పార్టీ కాంగ్రెసు, మార్చి, 1982లో ఆమోదించినది (ఆంగ్లంలో) పే.10-11.*

ప్రభావానికి, అటు-పోటులకు లోనగుతూ వుంటుంది. చట్టబద్ధపరిస్థితులు భగ్నమైతే యాదృచ్ఛికంగా ప్రజానీకం కోపతాపాలకు గురి అగుతారు. చట్టబద్ధంగా ప్రజల పరిస్థితి కాపాడబడుతూ వుంటే, నేరస్థులను శిక్షించమని ప్రజలు పోలీసు స్టేషనులచుట్టూ మూగుతుంటారు. గూండాలతో పోలీసులు కుమ్మక్కయితే ప్రదర్శనలతో తమ కోర్కెలను బలంగా తెలియజేస్తారు. ఆకలితో చెలరేగే ప్రదర్శనలు కావు. పరిపాలన సాధారణంగా భగ్నమైన, రాజకీయ కార్యాచరణతో సంబంధం లేకుండానే నిరసన ప్రదర్శనలు, సామాన్య ప్రజానీకమే ధైర్య, సాహసాలతో ప్రదర్శనలు చేస్తారు. అవి వారి ఆర్థిక కోర్కెలతో సంలీనం చేయబడినపుడు శక్తివంతమైన విప్లవపోరాటం లేక వర్గపోరాటమగుతుంది.

సంక్షోభం తీవ్రస్థాయికి చేరుతుందనే దానికి సూచన, పోలీసు, అధికార తత్వ ఆఫీసరుల, సమాజ శత్రువర్గాలమధ్య కలయికలు యేర్పడుట స్పష్టం చేస్తుంది. ఇందిరాగాంధీ తిరిగి అధికారంలోనికి రావటంతో సంవత్సరకాలం నుండి యిదియేర్పడుతున్నది, ఆరుమాసాలనుండి కానవస్తున్నది. మరో ముఖ్యలక్షణం సమాజ శత్రువర్గాలు పాలక పార్టీ రాజకీయ వాదుల మధ్య "లింకులు" యేర్పడుతవి. తీవ్రసంక్షోభపు మరో ముఖ్య లక్షణం, పాలకపార్టీల మంత్రులు, ఎన్నికైన ప్రతినిధులు, పోలీసు, తదితర అధికార తత్వ అధికారులను అదుపులో పెట్టలేకపోవుట జరుగుతుంది. "లంచగొండులను, కూనీకోరులు, దోపిడిదొంగలు, స్త్రీలపై అత్యాచారాలు జరిపే, నగ్న నేరస్థులను శిక్షించలేని పరిస్థితులలో ఉన్నతాధికారులు వుందుట మరో ముఖ్యలక్షణము. అరెస్టు కాబడిన వారిని కొందరిని పోలీసులు హత్య చేసి "ఎన్‌కౌంటరు"లో చనిపోయారని ప్రకటించిన ఘటనలు లేకపోలేదు. "పాలకపార్టీ నిరంకుశ విధానాలను చేబట్టి "పోలీసు రాజ్యం" క్రమేణా రూపొందుట, అత్యవసరపరిస్థితి ప్రకటించబడదని ప్రకటించబడినా, అట్టి అడుగుజాడలు కన్పడుతూనే వున్నవి.

"ప్రభుత్వం వార్తాపత్రికలపై క్రమేణా వొకవిధమైన "సెన్సారు" విధించుట, పత్రికలు వాస్తవాలను ప్రకటించుటను పాలక పార్టీ భయపెట్టుతు పత్రికలనోరునొక్కి వేయుట, ధైర్యశాలులైన పత్రికావిలేఖరులపై పాలకపార్టీ రౌడీమూకలు, ఒరిస్సా, కర్నాటకలో వలె దాడి చేయుట జరుగుతున్నవి.

"రాజ్యాంగం యిచ్చిన రాష్ట్రాల అధికారాలను కేంద్రం హరించివేయుట, నిరంకుత్వానికి చేరుకునే మార్గం తప్ప మరొకటి కాదు. "సుప్రీంకోర్టులో అనేకమంది జడ్జీలు ప్రజల ప్రాథమిక హక్కులను ప్రజాస్వామ్య సూత్రాలను పరిరక్షించుటపై పరిపాలన చేయు పార్టీ తనదాడిని కేంద్రీకరించుట. ఆవిధంగా న్యాయవ్యవస్థపై దాడి చేయుట జరుగుతున్నది.

ఈ సమస్యపై సి.పి.ఐ కార్యక్రమం వెల్లడిచేసిన అభిప్రాయాలు, సి.పి.ఐ(యం) అభిప్రాయాలతో ఆశ్చర్యకరంగా యెంతో సారూప్యత కలిగివున్నవి. ఈక్రింది విషయాలు దానిని స్పష్టం చేస్తాయి.

"ఇందిరాగాంధీ ప్రభుత్వ ఆర్థికవిధానము, బూర్జువా విధానాన్ని చుట్టుముట్టుతున్న తీవ్ర ఆర్థికసంక్షోభ ప్రతిబింబము. పాలకపార్టీని, ప్రభుత్వాన్ని చుట్టుముట్టుతున్న లంచగొండితనము, అంతర్గత సంఘర్షణలపై నుండి క్రింది వరకు చట్టబద్ధపాలనను భగ్నంచేసి, హింసా, దౌర్జన్యాలను వ్యాప్తిచేసింది. ఈపరిస్థితులలో ప్రభుత్వం, కార్మికవర్గం, ప్రజలరైనందిన పోరాటాలపై దాడి చేయుటకు అధికారతత్వ పోలీసు ఆఫీసర్లుకు పూర్తిస్వేచ్ఛ లభించింది. అంతేగాక, రాజకీయనాయకులు, అధికారతత్వ పోలీసు ఆఫీసర్లు, సమాజ విద్రోహక, శత్రువులమధ్య "అత్యంత సన్నిహిత సంబందాలు" అభివృద్ధి చెందుటతో సమ్మెలను విచ్ఛిన్నచేయుటకు, కార్మికుల ప్రతఘటనను అణచివేయుటకు, కార్మికసంఘాలను నాశనం చేయుటకు వీలుకలిగింది. సమాజశత్రువులు విజృంభించుటకు అవకాశం లభించింది, భారతీయ జనతాపార్టీ, తదితర అభివృద్ధి నిరోధక పార్టీలు సమాజశత్రువులను యిదే విధంగా వినియోగించుకొన్నారు.[1]

"జాతీయ రక్షణ చట్టం, అత్యవసర సర్వీసుల మెయింటనెన్స్‌ల చట్టం, సమ్మెలను కార్మివర్గాన్ని, నిర్దయతో అణచివేయుట, కాంగ్రెసేతర ప్రభుత్వాలను, ప్రత్యేకంగా వామపక్ష సంఘటనలపై ప్రత్యేక దాడులను పశ్చిమబెంగాల్, త్రిపురలపై దాడులను తీవ్రతరం చేయుట, కేరళ ఐక్యసంఘటనా ప్రభుత్వాన్ని ప్రజాస్వామ్యవ్యతిరేక కుళ్ళుకంపు విధానాలతో రద్దు చేయుట, కేరళ, అస్సాంలులలో కాంగ్రెసు(ఐ) పాలనను, మంత్రివర్గాన్ని యేర్పాటుచేయుట, కేంద్ర ప్రభుత్వం అనుసరించే విధానము.గార్వాల్ పార్లమెంటరీ ఉపయోగాన్నికలలో ప్రభుత్వయంత్రాంగాన్నంతా వినియోగించి, "రిగ్గింగు" విస్తృతంగా చేయుట, స్థలాభావంతో కొన్నిటినైనా అలా వుదహరించవలసివచ్చింది. కాంగ్రెసు (ఐ) పాలకపార్టీలో ప్రజాసామ్యానికి చరమగీతం పాడారు. ప్రెసిడెంటు సర్వాధికారాలు చేబట్టే ప్రయత్నిస్తున్నారు. ఈ చర్యలు కాంగ్రెసు (ఐ) ప్రజాపలుకుబడిని, కాంగ్రెసు (ఐ) ప్రజాబలాన్ని నీరుగార్చి వేసాయి.[2]

ఆర్థిక సంక్షోభం అధిగమించుటకు, దాని కారణంగా కలిగే ప్రజా అసంతృప్తి, ఫలితంగా సమ్మెలు వగైరాలను అణచుటకై పాలకవర్గ పార్టీ నాయకులు, అధికార తత్వ ఆఫీసర్లవర్గం, సమాజ శత్రువులు కూటమిగా యేర్పడికార్మికవర్గాన్ని ప్రజాస్వామ్యాన్ని అణచివేసి, నియంతృత్వ ప్రెసిడెంటుపాలనవైపు పురోగమించే అవకాశాలను గురించి రెండు కమ్యూనిస్టుపార్టీలు మౌలికంగా స్పందించిన తీరులో సారూప్యత యెక్కువగా వుంది. వాడిన మాటలలో కూడ సారూప్యతయే యెక్కువగా వుంది.

3. కేంద్ర కాంగ్రెసు ప్రభుత్వం, రాష్ట్రాలలో బూర్జువా ప్రతిపక్ష పార్టీలుగాని, లేక వామపక్ష ప్రతిపక్షపార్టీలు అధికారంలో వున్నపుడు, కేంద్ర, రాష్ట్ర సంబంధాలలో పొడచూపే, వివిధ అభిప్రాయభేదాల గురించి, కొంత తెలుసు కొందాము. ఈ సమస్యపై

1. రాజకీయ తీర్మానం (1982) సి.పి.ఐ (యం) 11వ. పార్టీ కాంగ్రెసు, విజయవాడ జనవరి, 1982లో ఆమోదించినది (ఆంగ్లంలో) పే. 33.
2. రాజకీయ తీర్మానం (1982) సి.పి.ఐ 12వ. పార్టీ కాంగ్రెసు. ఆమోదించినది (ఆంగ్లంలో) పే. 13-14.

సి.పి.ఐ(యం); సి.పి.ఐ ల అవగాహనలలోని సారూప్యతా, బేదాభిప్రాయాలు చూద్దాము.

ప్రజాస్వామ్యశక్తులు, నిరంకుశశక్తుల మధ్య గల నిరంతరపోరాటం, కాంగ్రెసు (ఐ) ప్రభుత్వం, వామపక్ష నాయకత్వంలోని రాష్ట్ర ప్రభుత్వాల మధ్యగల సంబంధాలలో ప్రతిబింబిస్తుంది.

కేంద్రంలో అధికారంలో వున్న కాంగ్రెసు (ఐ) పశ్చిమబెంగాలులో యెంతటి బాధ్యతాయుత లేక భాద్యత లేని ప్రతిపక్షంగా వ్యవహరించింది, ఆకారణంగా కేంద్రకాంగ్రెసు (ఐ) ప్రభుత్వం, రాష్ట్రంలో సి.పి.ఐ(యం) నాయకత్వంలోని ఐక్యసంఘటనా ప్రభుత్వాల మధ్య యేర్పడిన, లేక అభివృద్ధిచెందిన అవగాహనలలోని సుముఖ, విముఖ అంశాలు చూద్దాము.

బెంగాల్ రాష్ట్ర కాంగ్రెసు (ఐ) అబద్దాలు, ఆధారరహిత నిందలు వుపయోగించులో యితర అభ్యుదయ నిరోధకశక్తుల సహాయంతో చేతులు కలిపి, లా అండ్ ఆర్డరు పరిస్థితి విషయమించుటకు చర్యలు చేపట్టింది. కాంగ్రెసు (ఐ) పశ్చిమబెంగాలులో బందుకై పిలుపునిచ్చి, కలకత్తాలో, బొంబాయిలో అల్లకల్లోలాను రేకేత్తించారు. పశ్చిమబెంగాలలులో స్టేటు కాంగ్రెసు (యస్) కూడ, మంత్రివర్గ వ్యతిరేక ప్రచారోద్యమంలోపాత్ర వహించింది. కాంగ్రెసు (ఐ)కు సహాయ కారిగా, కాంగ్రెసు (ఐ) నిందా ప్రచారోధ్యమం, సి.పి.ఐ(యం) తల బిరుసుతనంతో, దౌర్జన్యానికి వొడిగట్టుతుందని నిందా ప్రచారాన్ని సాగించింది.

త్రిపురలో వామపక్ష సంఘటన ప్రభుత్వం, ఎడతెగకుండా కేంద్రప్రభుత్వపు, కాంగ్రెసు (ఐ) వొత్తిడులకు లోనగుతూనే వుంది. కేంద్రం తన అధికారాలను దుర్వినియోగం చేస్తూ, ప్రజలకు నిత్యావసరవస్తువులు, ఆహార పదార్థాలు కూడా సప్లయి చేయకుండా, కరువు పరిస్థితులను కల్పించింది. అంతేగాక, స్థానిక కాంగ్రెసు (ఐ) వర్గాలు వేర్పాటు వాదులైన తెగలతో చేతులు కలిపి, సరిహద్దులనుండి సమాయాన్ని అందించుతు, త్రిపుర ప్రజానీకంపై దాడులు చేయుటను పోత్సహించుచున్నది. మరోవైపు తెగల వ్యతిరేక అమర్‌బెంగాలీ, ఆనందమార్గవాదులను బలపరుస్తూ రాష్ట్రంలో అనిశ్చిత పరిస్థితులను సృష్టించ ప్రయత్నించుచున్నది.

కేరళలో కాంగ్రెసు (ఐ) రాష్ట్రీయ స్వయం సేవక సంఘాన్ని, నక్సలైట్లను వినయోగించి అల్లరులను సృష్టించి, రాష్ట సంకీర్ణ ప్రభుత్వాన్ని దేశమంతటా నిందా ప్రచారానికి గురిచేయు ప్రయత్నిస్తున్నది. ఇందిరాగాంధీ తన కేరళయాత్రలో ఆర్.యస్.యస్. కొనసాగించే హత్యా ప్రచారానికి వ్యతిరేకంగా వొక్కమాటైనా మాట్లాడలేదు. నక్సలైట్ల హింసాచర్యలను మంత్రివర్గాన్ని ఖండించుటకు, లా అండ్ ఆర్డర్ భగ్నమైందనే నిందా ప్రచారానికి వినియోగించుకొన్నది.

ఈవిధంగా బహిరంగంగా రాష్ట్ర వ్యతిరేక ప్రచారంగావించుటయేగాక కాంగ్రెసు (ఐ) కేంద్రప్రభుత్వం, రాష్ట్ర అసెంబ్లీ ఆమోదించిన బిల్లులకు రాష్ట్రపతి ఆమోద ముద్రరాకుండా, అడ్డుపడుతూ, తన అధికారాలను దుర్వినియోగం చేస్తున్నది. ఈవిధంగా

బెంగాల్, కేరళ, త్రిపుర మూడు రాష్ట్రాలలో చేస్తున్నది. అనేక పశ్చిమబెంగాల్ బిల్లులు, మూడు కేరళ బిల్లులు రాష్ట్రపతి ఆమోదముద్రకు ఎంతో కాలం నుండి వేచివున్నవి. అతిముఖ్యమైన భూసంస్కరణల చట్టపు సవరణల బిల్లు ఆమోదానికి, పశ్చిమబెంగాల్ ప్రభుత్వం అనూహ్యంగా దీర్ఘకాలంవేచివుండాల్సివచ్చింది.[1]

నియంతృత్వ కాంగ్రెసు (ఐ) యీ బిల్లులు చట్టాలై, అమలు చేయుట జరిగితే రాష్ట్ర ప్రజలపై చాలా ప్రభావాన్ని కలుగజేస్తుందని, వామపక్ష ప్రత్యామ్నాయ కార్యక్రమాలు ప్రజలకు స్పష్టంగాను, అదేవిధంగా కాంగ్రెసు (ఐ) కార్యక్రమాలు భూస్వాములకు, పైవర్గాలకు యేవిధంగా ప్రయోజనాలకై వున్నది. కేంద్ర ప్రభుత్వ దుష్టపన్నాగం వెల్లడి అగుతుందని, కాంగ్రెసు (ఐ) కేంద్ర ఇందిరా కాంగ్రెసు ప్రభుత్వం భయపడుతున్నది.

కాంగ్రెసు (ఐ) కేంద్ర ప్రభుత్వం వామపక్ష మంత్రివర్గాలను కూలద్రోయాలని చేసిన ప్రయత్నాలువిఫలమయ్యాయి. ఆర్థిక సంక్షోభం మధ్యలో ఇందిరాగాంధీ తిరిగి అధికారంలోనికి వచ్చిన తరువాత కాంగ్రెసేతర ముఖ్యంగా వామపక్ష ప్రజాస్వామ్య ప్రభుత్వాలకు, అనేక కేంద్ర, కాంగ్రెసు (ఐ) అడ్డంకులను ఆధికమించవలసివచ్చింది. ప్రజాస్వామ్యశక్తులు పూర్తి మద్దతును యిస్తూ వుండుటవలన ప్రజాస్వామ్య అగ్రగామి ప్రభుత్వాలను మనగలిగాయి. పార్టీ కూడ నియంతృత్వ వ్యతిరేక శక్తులన్నిటిని సమీకరించ గలుగుట మరో ముఖ్యకారణం. దేశ మొత్తంమీద పార్లమెంటరీ ప్రజాస్వామ్యం కొనసాగాలనే ప్రజావాంఛ మరోబలమైన కారణంగా చెప్పవచ్చును. ఈవిస్తృత మద్దతును పొందుటకు మంత్రివర్గ ప్రజానుకూల విజయాలు కూడా తోడ్పడినవి. ప్రత్యామ్నాయ కార్యక్రమాల అమలుచేబట్టిన మంత్రివర్గాలు ప్రజల మన్నలను మద్దతును పొందగలిగాయి. ప్రభుత్వాలు ప్రజల ప్రజాస్వామ్య హక్కులను కాపాడసాగాయి. ఇందిరాగాంధీ తిరిగి వచ్చుటతో వామపక్ష రాష్ట్ర ప్రభుత్వాలు మనజాలవని, కూలద్రోయబడునని ఆశించిన మితవాద అభివృద్ధి నిరోధకవర్గాల ఆశలు నిరాశలయ్యాయి. ఈవిధంగా వామపక్ష రాష్ట్ర ప్రభుత్వాలు కొనసాగుట, ప్రజాస్వామ్య శక్తులు బలపడుటకు వామపక్ష ఐక్యత అభివృద్ధిచెందుటకు అవకాశాలు ఎక్కువయ్యాయి.

కేరళరాష్ట్ర వామపక్ష, తదితరుల ప్రభుత్వాన్ని కాంగ్రెసు (ఐ), ఆర్.యస్.యస్. నక్సలైట్లు బయటనుండి కూలద్రోయలేకపోయినా, మంత్రివర్గంలోని కాంగ్రెసు (యస్), కేరళ కాంగ్రెసు (మణి) గ్రూపులు విడిపోవుటతో, మంత్రివర్గం రాజీనామా చేసింది.

వాస్తవానికి కేరళ వామపక్ష, ప్రజాస్వామ్య సంఘటన ప్రభుత్వం వామపక్షాల సంకీర్ణ ప్రభుత్వం కాదు. వామపక్షాల కొన్ని బూర్జువా ప్రతిపక్షాల సంకీర్ణ ప్రభుత్వం, వామపక్ష మంత్రివర్గమంతటి ఐక్యతను, సర్వసాధారణ సమస్యలపై కూడ ఆశించినంతటి ఐక్యతను ప్రదర్శించజాలకపోయింది. బూర్జువాపార్టీలు వాటి వర్గనైజం కారణంగా మంతివర్గ చేబట్టే అభ్యుదయ కర చర్యలను హర్షించలేకపోయారు. ఆవిధానాలు ఎన్నికల వుమ్మడి వేదికలోఆమోదించబడినవి, ప్రజల ప్రయోజనాలకు వుద్దేశించినవి. ఈ రెండు కాంగ్రెసు

---

*1. రాజకీయ తీర్మానం (1982) సి.పి.ఐ (యం) విజయవాద పార్టీ కాంగ్రెసు పే. 34-35.*

(యస్) ముఖ్యంగా మంత్రివర్గంలోని తమస్థానాన్ని అధికార వికేంద్రీకరణ, ప్రజాస్వామ్య విధానాలను అమలు చేయుటను అడ్డుకొనుటకు వినియోగించసాగింది. రాష్ట్ర ప్రభుత్వపు కొన్ని అధికారాలను జిల్లాకౌన్సిలుకు బదలీచేయుటను, వ్యవసాయకూలీలకు పెన్షనుయిచ్చుటకు, కార్మికశాఖను ప్రజాస్వామ్యవిధానాలలో పనిచేయించుటకు వ్యతిరేకించింది.

కాంగ్రెస్ (యస్) లోని కొన్ని వర్గాలు చీలిపోయినంతమాత్రనా వామపక్ష సంఘటన, నియంతృత్వశక్తుల వ్యతిరేక విస్తృత ఐక్యతను, సంఘటన నిర్మించే యత్నాలను మానక కొనసాగిచింది.[1]

ఈసమస్యపై సి.పి.ఐ(యం) అభిప్రాయాలు, సి.పి.ఐ అభిప్రాయాలు అత్యంత సారూప్యతను కలిగివుండుటను యీ క్రింది అంశాలు స్పష్టం చేస్తున్నది.

"ప్రధానమంత్రి ఇందిరాగాంధీ పశ్చిమబెంగాల్ ఐక్యసంఘటన ప్రభుత్వాన్ని కూలద్రోచేయుటకు అన్ని రకాల ప్రజాస్వామ్య వ్యతిరేక విధానాలను అవలంభించింది. త్రిపుర, కేరళ రాష్ట్ర ప్రభుత్వాలను శ్రామిక జనావళికి, సాధ్యమైనంత సహాయాన్ని, రాయితీలను కలిగించి, దేశంలోని యితర ప్రాంతాల ప్రజాసామాన్యానికి ఆశాజ్యోతులు మార్గదర్శికులుగా వున్న వాటి యెడల అదేవిధంగా ప్రవర్తిచింది. ప్రజల ప్రయోజనాలకై యీ ప్రభుత్వాలు అనుసరించిన విధానాలు చేబట్టిన చర్యలు, ఆ ప్రభుత్వాలు వాస్తవ ప్రత్యామ్నాయాలుగా ప్రజలదృష్టిని ఆకర్షించుట, కాంగ్రెసు (ఐ) నాయకత్వం చూచి సహించజాలకపోయింది. చట్టవ్యతిరేక మార్గాలెన్నిటినో అనుసరించి కేరళ వామపక్ష ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని కూలద్రోయుటలో విజయాన్ని సాధించింది. అంటే, దేశంలో ఏకపార్టీ పాలనను యేర్పరచాలని నిర్ణయించుకొన్నది. కేరళలోని వామపక్షాలు తాము చేసినయే పొరపాట్లనైనా వినియోగించుకొని, కాంగ్రెసు (ఐ) తన కుట్రలను సాగించి మంత్రి వర్గాన్ని కూలద్రోయుటలో విజయాన్ని ఎలా సాధించగలిగిందో తప్పనిసరిగా తీవ్రంగా పరిశీలించు కొనవలసివుంది.[2]

"తన దేశీయ విధానాన్ని తిరోగమన మార్గంలో నడిపించుటకు, మనదేశపు సంక్షోభంలో మునిగిన బూర్జువా సామాజిక ఆర్థిక విధానాన్ని రక్షించుటకు, పార్లమెంటరీ ప్రజాస్వావిధానాన్ని గాలికి వదిలివేసి, ఇందిరాగాంధీ దాని స్థానంలో సర్వ అధికారాలను హస్తగతం చేసుకొని అధ్యక్ష పాలనా విధానాన్ని ప్రవేశపెట్ట ప్రయత్నించింది. తన వాంఛలను న్యాయవస్యవస్థ తీర్చేందుకు గాను దానిని విమర్శించుతు, వెన్నుపోటు పొడున్తున్నది. ఈవిధంగా నిరంకుశపాలన యేర్పాటుకు ప్రయత్నాలు తీవ్రతరంచేయబడినవి.

---

1. రాజకీయ తీర్మానం (1982) సి.పి.ఐ (యం) 11వ. విజయవాడ కాంగ్రెసు ఆమోదించినది (ఆంగ్లంలో) పే.36-37.
2. సి.పి.ఐ. 12వ, పార్టీ కాంగ్రెసు మార్చి 1982లో ఆమోదించిన సమీక్ష (ఆంగ్లంలో) సి.ఇ.ఐ.- పబ్లికేషన్ పే-22.

"ఇందిరాగాంధీ తన" వ్యక్తి పూజా" విధానాన్నేగాక "వంశపారంపర్యంగా" కుటుంబ పాలనావిధానాన్ని, శాశ్వతం చేయ ప్రయత్నించింది. కాంగ్రెసు (ఐ) కు ఆమె మాట సిలాశాసనం. ఆమె విధానాలపై ఎవ్వరూ నోరుమెదపలేరు. అన్ని రకాల "జీహుజూర్" దారులు, దొంగ వ్యాపారులు, నేరస్థులు, అన్ని రకాల సమాజ శత్రువులుకాంగ్రెసు (ఐ)లో చేరారు. కాంగ్రెసు (ఐ) ప్రభుత్వపు ఉన్నత స్థానాలలో కూడ నేడు స్థిరమైన స్థానాన్ని లంచగొండి తనం ఆక్రమించింది. కాంగ్రెసు (ఐ) వర్గనైజం మౌలికంగా మారలేదు. కాని కాంగ్రెసు (ఐ) మాత్రం ప్రజాస్వామ్య సాంప్రదాయాలు గల పాత కాంగ్రెసు కాదు.

సి.పి.ఐ 12వ, కాంగ్రెసు ఆమోదించిన "రాజకీయ పరిణామాలు, పార్టీ కార్యాచరణ, 11వ, పార్టీ కాంగ్రెసు అనంతర సమీక్ష" పైవిధంగా, ఇందిరాగాంధీ కేంద్ర ప్రభుత్వం, రాష్ట్రాలలోని కాంగ్రెసేతర ముఖ్యంగా వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన, బెంగాల్, కేరళ, త్రిపుర ప్రభుత్వాల యెడలచేబట్టిన ఇందిరాగాంధీ ప్రభుత్వ వైఖరిని తీవ్రవిమర్శకు గురిచేసి, పార్లమెంటరీ ప్రజాస్వామ్య విధానాన్ని త్రోసిబుచ్చి నిరంకుశ విధానాలను అనుసరించుటను తెగనాడింది. వారణాసి, కాంగ్రెస్ ఆమోదించిన తీర్మానం గూడ అంత తీవ్రంగా విమర్శించుటను, యీ క్రింది వుదహరింపులు నుండి స్పష్టం కాగలదు.

"జాతీయ రక్షణ చట్టము, అత్యవసర సర్వీసుల కొనసాగించు చట్టము, కార్మికుల సమ్మెలను హింసాకాండలతో అణచివేయుటకు కాంగ్రెసేతర రాష్ట్ర ప్రభుత్వాలపై దాడులను ద్విగుణీకృతం చేయుటకు ప్రత్యేకంగా వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన ప్రభుత్వాలైన పశ్చిమబెంగాల్, కేరళ,త్రిపురలలో అమలు కుద్దేశించబడినవి. గార్వాల్ అసెంబ్లీ, పార్లమెంటు బై ఎలక్షనులలో పాలకపార్టీ ప్రభుత్వయంత్రాంగాన్ని విస్తృత "రిగ్గింగు"కు వినియోగించుట, పార్లమెంటులోని కార్యాచరణలో ప్రతిపక్షాలపై "నల్లేరుపై బండి" త్రోలుచందాన ప్రవర్తించుట, సాంప్రదాయంగా వస్తున్న ప్రతిపక్షాల హక్కులను నేలరాచుట, వార్తా పత్రికలను, న్యాయవ్యవస్థపై రాజకీయ వొత్తిడినుపయోగించుట, అనేక రాష్ట్రాలలో కమ్యూనిస్టు వ్యతిరేక హింసాకాండలను ప్రోత్సహించుట, యివి అన్నీ ప్రజాస్వామ్య హక్కులు, పార్లమెంటరీ ప్రజాస్వామ్యాలకు అత్యంత ప్రమాదాన్ని తెస్తున్నది. పార్లమెంటును ప్రక్కకు నెట్టి ఆర్డినెన్సులతో, పాలనా ఆజ్ఞలతో వనరులను పెంపొందించుట, అందున పార్లమెంటు సమావేశాలు జరుగుతున్న కాలంలో అనుసరించుట సర్వసాధారణమైంది.

"అధికారపార్టీలో ప్రజాస్వామ్యానికి భరతవ్యాక్యం చెప్పబడింది. దాని స్థానంలో నాయకత్వాన్ని ప్రశ్నించని విశ్వాసం, సేవాభావం చొప్పించబడినవి.

"పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి స్వస్తివాచకం పలికే ప్రయత్నం దాని స్థానంలో అధ్యక్ష పాలనావిధానాన్ని ప్రవేశపెట్టే ప్రయత్నం కొనసాగింపు జరుగుచున్నది.

ఈ ఉదహరింపులలోని సి.పి.ఐ అవగాహనలు సి.పి.ఐ(యం) అవగాహన పరస్పరం బలపరచుకొనే విధంగా వున్నవి.

4. బూర్జువా ప్రతిపక్ష రాజకీయ పార్టీలు, వాటిని నియంతృత్వవ్యతిరేకపోరాటాల యెడ సి.పి.ఐ(యం), సి.పి.ఐల అవగాహనలు, అవలంభించనెంచిన వైఖరులు తెలుసుకొందాము.

పాలకపార్టీ ఇందిరా కాంగ్రెసు, పార్లమెంటరీ ప్రజాస్వామ్యంపై దాడులు సాగిస్తూ, అధ్యక్షతరహా పాలనాదికారాన్ని ప్రవేశపెట్టుటకు చేయుప్రయత్నాలు, విస్తృత ప్రజాశక్తులలో, బూర్జువా ప్రతిపక్ష పార్టీలలో ప్రజాస్వామ్యరక్షణ పోరాటావకాశాలను యెక్కువ చేసింది. దీనికి తోడు ఆర్థిక సంక్షోభం పాలక, ప్రతిపక్ష బూర్జువాపార్టీలలోని శక్తులుఅధికారానికై జరిపే పోరాటాన్ని తీవ్రతరం చేసాయి. ఈ వైరుధ్యం తీవ్రమై విస్తరించుమార్గంలో వుంది. జలందర్ సి.పి.ఐ(యం) పార్టీ కాంగ్రెసు రాజకీయ తీర్మానం యీ అంశంప యీ విధంగా పేర్కొంది. "ప్రజాస్వామ్య శక్తులు నియంతృత్వశక్తులపై జరిపే పోరాటంలో సాధ్యమైనంత విస్తృత సమీకరణ కావించి, ప్రతిఘటనను పెంపొందించుటకు పార్టీ సర్వశక్తులను తప్పక వినియోగిస్తుంది. నియంతృత్వానికి వ్యతిరేకంగా వారి రాజకీయ మద్దతు మారుతు వూగిసలాటలకులోనగుతూ వుండవచ్చును. పాలకపార్టీలు, శక్తులు నియంతృత్వవ్యతిరేక వైఖరిచే వారిని సమీకరించుట అత్యవసర, ఆవిధంగా ప్రజాస్వామ్యానికై జరిగే పోరాటం, ప్రజలలో విస్మృత వర్గాలకు వ్యాపిచుతుంది." ఈ అవగాహనను తదనంతర కాలంలోని ఘటనలు పూర్తిగా బలపరచాయి.

జలందరు రాజకీయ తీర్మానం, బూర్జువా పార్టీలు ఐక్యంగా యెంతోకాలం నిలబడజాలవని స్పష్టం చేసింది. "అంచేతనే యీ కాలంలో యీ బూర్జువా ప్రతిపక్షపార్టీలలో చీలికలు యేర్పడి కొన్ని వర్గాలు ఇందిరా కాంగ్రెసులో అనగా పాలకపార్టీలలో చేరుట తరుచుగా జరిగింది. కాంగ్రెసు (ఉ) నుండి చావన్, జగజీవన్‌రాంలు చీలిపోవుట జరిగింది, మరికొన్ని వర్గాలు అదే మార్గంలో వున్నవి." జనతా అంతర్గత ఘర్షణలతో చౌరవను ప్రదర్శించజాలకుంది. లోక్‌దళ్, ప్రముఖనాయకుల బహిష్కరణ చేబట్టుటతో అంతర్గత ఘర్షణలతో చౌరవను కోల్పోయింది.

భారతీయ జనతాపార్టీ దైనందిన సమస్యలపై కొంత స్పదించుచున్నది. కాంగ్రెసు (ఐ) కు ప్రత్యామ్నాయంగా బి.జె.పిని బూర్జువా పత్రికలన్నీ వెలుగులోనికితెస్తున్నది. బి.జె.పి కదంత్రొక్కి విద్రోహ ఆర్.యస్.యస్ వర్గాలపునాదితో కుట్రలు చేస్తున్నది. తన అభ్యర్థులు లేనిచోట ప్రతిపక్షాలను బలపరచక, కాంగ్రెసు (ఐ)ను బి.జె.పి బలపరచున్నది. తను తప్ప మరొకరు కాంగ్రెసుకు ప్రత్యామ్నాయంగా ప్రజలముందుకు రారాదు. అనే ఎత్తుగడలనే 1980 ఎన్నికలలో బి.జె.పి అవలంభించింది. గార్వాల్ లోకసభ స్థానంలో బహుగుణను బలపరచక కాంగ్రెసు (ఐ) ని బలపరచింది. ఎన్నికలలో బి.జె.పి తదితర బూర్జువా ప్రతిపక్ష పార్టీలు కాంగ్రెసు (ఐ) వ్యతిరేకంగా ఐక్యఎన్నికల ప్రతిపక్షాల కూటమిగా నిలబడజాలకుండుటలో ఆసక్తిని ప్రదర్శించాయి. వైఫల్యపుగుణపాఠంగా వామపక్ష

1. *సి.పి.ఐ(యం) విజయవాడ కాంగ్రెసు (1982) తీర్మానం (ఆంగ్లంలో) పే. 38-39.*

పార్టీలను మినహాయించి, తదితర బూర్జువాపార్టీలన్నీ తమ కార్యాచరణలను సమన్వయం పరచుకొన్నవి.

అల్ప సంఖ్యాకుల సమస్య స్వాతంత్ర్యానంతరం, అల్పసంఖ్యాలు చీలి విడిపోవుట, మత సామరస్య సమస్యరూపంలో ప్రత్యక్షమైంది. రాజ్యాంగరక్షణలు వున్నా బూర్జువా భూస్వామ్య ప్రభుత్వంలో విచక్షణ, అవమానకర అమానుష దౌర్జన్యాలకు అల్ప సంఖ్యాకవర్గాలు గురి అగుతున్నవి. కమ్యూనిస్టులు ఎల్లప్పుడూ అల్పసంఖ్యాక ముస్లిం, హరిజన వర్గాల రక్షణకై తమ శక్తి కొలది నిలబడుతున్నది. విచక్షణను, అణచివేయుటను నిస్సంకోశంగా వ్యతిరేకించి నిలబడుతున్నది. కలహాలలో హిందూమత మౌఢ్య హింసావాదులకువ్యతిరేకంగా పార్టీనిలబడి పోరాడింది. హరిజనులు వాస్తవానికి అల్ప సంఖ్యాకమనస్తత్వ దృక్పథం నుండి బయటపడి, ప్రధానస్రవంతిలో చేరి ప్రజాస్వామ్యనికై పోరాడుటతోనే వారి ఆర్థిక, సామాజిక బానిసత్వ విముక్తి వుంది.[1]

నేడు ప్రజాసామాన్యపు ప్రజాస్వామ్య వర్గపోరాటాలలో ముస్లిం ప్రజలు దూరంగా వుండిపోయారు. ప్రజాసంఘాలు ముస్లిం ప్రజల సమస్యలకు తగు ప్రాధాన్యతనిచ్చి పోరాడినచో, మత, కుల వర్గాల ప్రజలను తమ విజ్ఞప్తులతో వారిని ఆహ్వానించినచో వారు వామపక్ష ప్రజాస్వామ్యశక్తులకు దూరంగా వుండగలిగేవారు కారు. ప్రధాన స్రవంతి పోరాటాలలో తమ వంతు పాత్ర శక్తి వంతంగా నిర్వహించగలిగేవారు. ముస్లిం ప్రజాసామాన్యం ఆర్థిక అసమానతలతోపాటు, పాక్షిక విచక్షణకు గురి అగుటతో ముస్లిం మతతత్వ వేర్పాటు వాదుల విజ్ఞప్తులకు త్వరగా ఆకర్షింపబడుట, జాతీయ ఐక్యతకు ప్రమాద కారులుగా తయారగుట కొంతవరకు జరిగేదికాదు. కాంగ్రెసు (ఐ) యీ ప్రమాదానికి వ్యతిరేకంగా పోరాడ జాలకపోయింది.

అదేవిధంగా ఆర్.యస్.యస్ మతతత్వ ప్రాతిపధికగా "హిందూ జాతితత్వానికి" చేసే విజ్ఞప్తులు, ప్రజలను చీల్చే ప్రయత్నాలను, ముస్లింలను విదేశీయులుగా చిత్రించే ప్రయత్నాలను కాంగ్రెసు (ఐ) వమ్ము చేయజాలక పోయింది. అనేక మతకలహాలకు ఆర్.యస్.యస్. ప్రధానకారణమని విచారణలలో తేలిన విషయము. మత ఆర్.యస్.యస్ ల హింసాపూరిత దౌర్జన్య ప్రచారం ముస్లిం మతతత్వవాదుల వేర్పాటు వాదానికి మరింత బలాన్ని పరోక్షంగా చేకూర్చింది.

బూర్జువా, భూస్వామ్య వివిధ పాలక పార్టీలు, ప్రతిపక్ష పార్టీలు ప్రజాస్వామ్య, ప్రజావ్యతిరేక నిరంకుశత్వం యెడల అవలంభించే వైఖరులను సి.పి.ఐ వేసిన అంచెనాలు, అవగాహనలు ఎలా వున్నవో చూద్దాము.

ఆర్థిక సంక్షోభం, రాజకీయ అస్థిరతతో దేశం సంక్షోభమార్గంలో పయనించు తున్నపుడు, జనతాపార్టీగాని లేక కాంగ్రెసు (ఐ) గాని పరిపాలనాధికారంలో కొనసాగుట వలన దేశం రక్షింపబడదని భటిండా కాంగ్రెసు అవగాహనను వారణాసి సి.పి.ఐ పార్టీ కాంగ్రెసు పునరుద్ఘాటించింది. అంతేగాక గత మూడు సంవత్సరాల పరిణామాల

*1. సి.పి.ఐ(యం) విజయవాడ కాంగ్రెసు (1982) తీర్మానం (ఆంగ్లంలో) పే. 54.*

అనుభవాలు భటిండా పంథా పూర్తిగా రాబోయే కాలానికంతటికీ అనుసరణీయమని రుజువైందని, వారణాసి తీర్మానం పేర్కొన్నది.

వారణాసి తీర్మానం ఇంకా "కాంగ్రెసు (ఐ) నేటికి రెండుసంవత్సరాలుగా అధికారంలో వుంది. స్వాతంత్ర్యానంతరం అధికారాన్ని చేబట్టిన కాంగ్రెసుకు నేటి కాంగ్రెసు (ఐ) యేమాత్రం కాదని అనుభవం నిర్ధిష్టంగా రుజువు చేసింది. దాని వర్గ పొందిక అలాగే వుంది." అయినా నేటి కాంగ్రెసు (ఐ) నాటి కాంగ్రెసు కాదు. "ఈ కాలంలో కాంగ్రెసు (ఐ) లోనికి సామ్రాజ్యవాద వ్యతిరేక, ప్రజాస్వామ్య సాంప్రదాయాలు లేని అనేకవర్గాలు, సమాజ ద్రోహులు, లంచగొండులు, ప్రజావ్యతిరేకవర్గాలు చేరాయి." ఈ వర్గాలే నియంతృత్వ పోకడలకు బలాన్ని చేకూర్చేవి అని వేరుగ చెప్పవలసిన అవసరంలేదు.

"దేశంలోని వివిధ ప్రాంతాలలో భారతీయ జనతాపార్టీ బలాన్ని చేకూర్చుకొంటున్నది. నగ్న మత, కుల, చాందస భావాలలో విజ్ఞప్తులు చేయుటయేగాక, వాగాడంబరంతో ఇందిరాగాంధీ ప్రభుత్వ ఆర్థిక విదానాలపై గల అసంతృప్తిని వినియోగించుకొని, తన సిద్ధాంతాలను ప్రభావ బలాలలను విస్తరించుకొంటున్నది. దాని కండబలశక్తియైన రాష్ట్రీయ స్వయంసేవక సంఘం కార్యకర్తవర్గాలు యీ విషయంలో పూర్తి సహకారాన్ని అందిస్తున్నవి. హరిజనులు, ఆటవికతెగలలో విస్తరించ ప్రయత్నించుచున్నది. రాష్ట్రీయస్వయంసేవక సంఘం విద్యార్థి, యువజన లోకాలలో ప్రమాదకరంగా వ్యాపించుచున్నది. సామ్రాజ్యవాద అనుకూల దృక్పధాలనుండి ప్రభుత్వ విదేశాంగ విధానంపై బి.జె.పి తీవ్రదాడి చేస్తున్నది. మనదేశంలో అభివృద్ధి నిరోధశక్తులకు అది ప్రాతినిధ్యం వహించుచున్నది. సామ్రాజ్యవాద, గుత్తపెట్టుబడి వర్గాల అనుకూల, కమ్యూనిస్టువ్యతిరేకశక్తిగావుంది. గుత్తపెట్టుబడి సంస్థలను, గుత్తవ్యాపారాన్ని జాతీయం చేయుటను వ్యతిరేకించుచున్నది. అంచేతనే బూర్జువా అన్ని వర్గాలు, వార్తాసంస్థలు బలపరస్తున్నవి.[1]

ప్రతిపక్ష బూర్జువాపార్టీలైన యితర పార్టీలు చీలికలు, సంఘర్షణలకు లోనగుతున్నవి. కాంగ్రెస్ (యస్) లో వివిధ వైఖరుల మధ్య సంఘర్షణలు తీవ్రమయ్యాయి. లోక్‌దళ్, జనతా పార్టీ రెండూ భిన్న వైరుధ్య రాజకీయ వర్గాల సమ్మేళనంగా వున్నవి. అవి తలావొక వైపుకు పోతున్నవి. ఈ పార్టీల నాయకత్వాలు పూర్తి అవకాశవాదాన్ని చేబట్టి, బి.జె.పితో కలసిన ప్రతిపక్ష సంఘటనను యేర్పాటు చేయ ప్రయత్నిస్తున్నవి. ఆచరణలో అట్టి సంఘటనకు బి.జె.పి, ఆర్.యస్.యస్ నాయకత్వం వహించుతున్నవి. ఆవిధంగా బి.జె.పి అభివృద్ధి నిరోధక, బూర్జువా ప్రత్యామ్నాయానికి నాయకత్వం వహించాలనే, దాని వ్యూహం నెరవేరుతుంది. అంచేత వామపక్షాలు సత్వరమే బి.జె.పిని వేరుగావించే అన్ని ప్రయత్నాలు చేసి, అన్ని వైపులకు విస్తరించాలనే దాని ఎత్తుగడలను వమ్ము చేయాలి. ఈవిధమైన పోరాటం, బూర్జువా పాలనకు ప్రత్యామ్నాయంగా వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతను నిర్మించాలనే వొకే వొక కేంద్ర కార్యక్రమానికి మౌలికమైనది.

---

*1.* రాజకీయ తీర్మానం *(1982)* సి.పి.ఐ వారణాసి కాంగ్రెసు ఆమోదించినది. పే. *18-19.*

"అంచేత వచ్చేరోజులలో మన పార్టీ (సి.పి.ఐ) ఎడతెగని తీవ్రపోరాటాలను మత, కుల, వేర్పాటు వాద శక్తులపై అన్ని రంగాలలో భారత సార్వభౌమాధికారాన్ని, సమగ్రత, దేశ ఐక్యతలను రక్షించుటకై సాగించుతుంది పాలకపార్టీ ప్రజాస్వామ్య, ప్రజావ్యతిరేకంగా జరిపే పోరాటంతోపాటు బి.జె.పిపై నిరవధిక పోరాటం చేస్తుంది. అదే వామపక్ష జాతీయ ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయాన్ని నిర్మించే పోరాటంగా రూపొందుతుంది. అంటే కుల, మత, వేర్పాటువాద శక్తులపై పోరాటం, పాలకవర్గాల ప్రజావ్యతిరేక విధానాలపై పోరాటం, వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతకై జరిగే పోరాటం అన్ని మిళితమై వొకే వొక సమగ్ర బహుముఖ పోరాటమగుతుంది. అదే వామపక్ష ప్రజాస్వామ్య జాతీయ ప్రత్యామ్నాయ నిర్మాణానికై జరిగే పోరాట మగుతుంది.

జాతీయ సమైక్యతకు, సమాజంలోని అల్పసంఖ్యాక, బలహీన వర్గాల ప్రజాస్వామ్య హక్కుల రక్షణకై పోరాడుట మౌలికాంశం అగుతుంది. మత, కుల, భాషా, ఆటవిక తెగల ప్రాతిపధికలపై ఆధారపడిన విచక్షణను, అసమానతను, రూపుమాపుటను చట్టాలకే పరిమితంచేయక, నిజజీవితంలో పోరాడి రూపుమాపాలి. సమాజంలోని అల్పసంఖ్యాకుల, బలహీనవర్గాల ప్రజాస్వామ్యహక్కులను రక్షించుట పార్టీ, ప్రజాసంఘాల కర్తవ్యం. మత, కుల, వేర్పాటువాద, దురహంకార, మతత్వపునరుద్ధరణ శక్తుల విచ్ఛిన్నచర్యలకు వ్యతిరేకంగా పోరాడాలి. అల్పసంఖ్యాకుల, బలహీనవర్గాల భవిష్యత్తు, అభివృద్ధి ప్రధాన స్రవంతిలో ముఖ్య పాత్ర వహించి, దేశ ప్రజాస్వామ్యంకై జరిగే పోరాట క్రమంలో భాగస్వాములగుటవలనేగాని, దానికి దూరంగా వుండుటవలన జరుగదని గుర్తించునట్లు చేయవలసిన కర్తవ్యం పార్టీకి వుంది. ఇది సామ్రాజ్యవాద వ్యూహాలు తదితర అభివృద్ధినిరోధక వ్యతిరేక, ప్రజాస్వామ్య వర్గ ఐక్యతను నిర్మించే కార్యక్రమం నుండి విడదీయరాని కర్తవ్యం.[1]

సి.పి.ఐ(యం) విజయవాడ కాంగ్రెసు తీర్మానం, జలందర్ పార్టీ కాంగ్రెసులు రెండూ, పాలకపార్టీ ఆర్థిక సంక్షోభాన్నుండి రాజకీయసంక్షోభంలో మునిగిపోయినపుడు పార్లమెంటరీ విధానాన్ని త్రోసిబుచ్చి, నియంతృత్వ విదానాన్ని చేబట్టుతుందనే అవగాహన రుజువైందని, పునరుద్ఘాటించాయి. ఇదేవిధమైన సి.పి.ఐ భటిండా కాంగ్రెసు అవగాహనను వారణాసిలో జరిగిన తదనంతర పార్టీ కాంగ్రెసు పునరుద్ఘాటించింది. ఇదేవిధంగా యితర బూర్జువా ప్రతిపక్ష పార్టీల యెడల సి.పి.ఐ(యం), సి.పి.ఐల అవగాహనలలో మౌలిక బేదాభిప్రాయాలు లేవనుటకూడస్పష్టము. ఈ అవగాహనలననుసరించి చేసిన నిర్ధారణలు వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతా నిర్మాణంపై రెండు పార్టీలలో యేకాభిప్రాయం ముంది.

అంతేగాక, సి.పి.ఐ; సి.పి.ఐ(యం) లు యితర బూర్జువా ప్రతిపక్ష పార్టీల ఆర్థిక, రాజకీయ, సామాజిక విధానాలపై చేసిన పరిశీలనాత్మక అంచనాలు, అవగాహనలు, చేబట్టిన కర్తవ్యాలలో చాలా సారూప్యతగల అవగాహనలే ఎక్కువగా వున్నవి.

---

1. *రాజకీయ తీర్మానం (1982) సి.పి.ఐ 12వ. కాంగ్రెసు వారణాసిలో మార్చి. 1982లో ఆమోదించబడింది. పే. 20.*

5. వామపక్ష ప్రజాస్వామ్య జాతీయ ప్రత్యామ్నాయ నిర్మాణం తత్సంబంధ వివిధ అంశాలపై సి.పి.ఐ; సి.పి.ఐ(యం) కాంగ్రెసుల అవగాహనలను తెలుసుకొందాము.

కాంగ్రెసు (ఐ) ను 1980లో పలుపార్టీల ఐక్యసంఘటనలు అసెంబ్లీ ఎన్నికలలో వోడించాయి. నియంతృత్వశక్తులకు వ్యతిరేకంగా ప్రజాస్వామ్య శక్తులు జరిపే ప్రజా పోరాటాలు పెంపొందాయి. ప్రజా ప్రయోజనాలకై కేరళ మంత్రివర్గం చేబట్టిన కార్యక్రమాలను పార్టీలు హర్షించలేకపోయాయి. బూర్జువాపార్టీలు రెండు, కాంగ్రెసు (యస్), కేరళ కాంగ్రెసు (మణి)లు ముఖ్యంగా మంత్రివర్గంలో కాంగ్రెసు(యస్)కు స్థానం యిచ్చుటను, ప్రభుత్వాన్ని ప్రజాస్వామ్య ఏకీకరణలో భాగంగా, అధికారాలను జిల్లా కౌన్సిళ్ళకు వికేంద్రీకరణలో భాగంగా బదలీచేయుటను, వ్యవసాయ కార్మికులకు పెన్షనులను యిచ్చుటను, కార్మికశాఖ ప్రజాస్వామ్య వర్గాలలో పనిచేయు ప్రయత్నాలను వ్యతిరేకించారు. ఈ కార్యక్రమాలన్నీ "ఎన్నికల సమిష్టి వేదిక"లో ఆమోదించబడినవి. కాంగ్రెసు (యస్) లో చీలిన వర్గాలు వామపక్ష ప్రజాస్వామ్య రాష్ట్ర ప్రభుత్వం పడిపోవునట్లు చేసాయి. కాంగ్రెసు (ఐ) చేయలేని పనిని యివి చేసాయి. అయినా సి.పి.ఐ(యం) సి.పి.ఐలు వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనా, నిర్మాణ యత్నాలను పునరుద్ధటించి, తిరిగి నిర్మించే కార్యక్రమాన్ని విజయవాడ, జలందర్ పార్టీ కాంగ్రెసులు నిర్ణయించాయి.

ఈ సందర్భంలో వామపక్షాల నాయకత్వపు రాష్ట్ర మంత్రి వర్గాల విజయాలలోని ముఖ్యాంశాలను తెలుసుకొందాము.

ఈ మంత్రివర్గాలు వాగ్దానాలకు కట్టుబడి, సాధారణ ప్రజల ప్రజాస్వామ్యహక్కులకు పరిరక్షణకు నిలబడినది. అల్పసంఖ్యాకులైన ముస్లిం, హరిజనులకు మంచి రక్షణలు కల్పించబడినవి. మత కలహాలు అంతరించాయి. వాటి స్థానంలో సోదర, సౌహర్థ, స్నేహబావాలు పెంపొందాయి. హరిజనులపై దౌర్జన్యాలు తాత్కాలికంగా లేకుండా పోయినవి. ప్రజాస్వామ్య హక్కులు ప్రజల నుండి హరింపబడకుండా రక్షింపబడి, కార్మికుల సమ్మె హక్కు పరిరక్షించబడింది. సమ్మెలలో పోలీసులు కలుగజేసుకొనుట ఆగిపోయింది.

పశ్చిమ బెంగాల్ వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన ప్రభుత్వం, చేసిన వాగ్దానాలలో పెక్కింటిని అమలు చేసింది. వ్యవసాయకూలీల వేతనాలను పెంచింది, భూసంస్కరణలు చట్టానికి సవరణలు ఆమోదించింది. కౌలుదారులు ఎట్టి పరిస్థితులలోను పంటలో తమ పాలు పొందునట్లు గ్యారంటీ చేసింది. గ్రామీణ పేదలకు 17లక్షల 50వేల యకరాల వ్యవసాయ భూములు పంచింది. వారికి అప్పులు యిచ్చింది. ప్రభుత్వం "పనికి–ఆహారం" కార్యక్రమాలను అమలుచేసిన తీరు అందరి ఆమోదం పొందింది. షెడ్యూల్డు కులాలు తెగలకుగృహవసతి కలుగజేయుటతో కలుగజేసిన రాయితీలు అందరి దృష్టిని ఆకర్షించింది. నిరుద్యోగభృతి, పేద, ముదుసలి రైతులకుపెన్షనులు యిచ్చింది. ప్రజల మన్నలను పొందింది.

కేరళ వామపక్ష ప్రజాస్వామ్య ప్రభుత్వం చేబట్టిన ప్రజాపంపిణి వ్యవస్థ దేశంలోని అన్ని అట్టి యేర్పాటులకు మిన్నగా వుంది. ఆదర్శమైంది. కేరళ ముఖ్యపండుగ ఓనమ్

వచ్చేటప్పటికి అన్ని వస్తువులధరలు ఆకాశాన్ని అంటేవి, కాని వామపక్ష ప్రజాస్వామ్య ప్రభుత్వం యేర్పడిన గత రెండు సంవత్సరాలనుండి, 1980-82లలో కూరగాయలు, బట్టలుతో సహా అన్నిటి ధరలు పెరుగుటను అరికట్టి, చవకగా ప్రజలకు అందునట్లు చేసారు. ఆవిధంగా బయటి మార్కెట్టు ధరలలో కూడ సహజంగా కొంత అదుపు యేర్పడింది. ప్రభుత్వం అవలంబించిన కార్మిక విధానాల కారణంగా ఉద్యోగుల, కార్మికుల వేతనాలు పెరుగుటయేగాక సమ్మెలు, పోరాటాలు లేకుండానే బోనసుకూడ పొందగలిగారు. పశ్చిమబెంగాల్‌లో వలెనె వ్యవసాయ కూలీలు, వృద్ధులు పెన్షనలు పొందగలిగారు.

త్రిపుర వామపక్ష ప్రజాస్వామ్య ప్రజా ప్రభుత్వం ఆటవిక తెగలు కోరుతున్న స్వపరిపాలన జిల్లా కౌన్సిలును యేర్పాటు చేసింది. కోక్ బోరక్ తెగ భాషను గుర్తించింది. మైదాన ప్రాంతాలవారు ఆక్రమించిన కొండ ప్రాంత భూములను ఆయా తెగలకు చెందునట్లు చేసింది. పేదలపై పన్నులుతగ్గించబడినవి. గ్రామీణ పేదలు సహకార సంఘాలలో సమీకరించబడ్డారు.

## ౭. వామపక్ష శక్తుల ఐక్యత

కమ్యూనిస్టుపార్టీలు రెండూ అనేక సంవత్సరాలనుండి శక్తివంతమైన వామపక్ష ప్రజాశక్తుల సంఘటనను నిర్మించ ప్రయత్నాలుచేస్తూనే వున్నవి.

వామపక్షశక్తుల ఐక్యతను నిర్మించాలంటే వాటి మధ్య సదవగాహనను పెంచాలి, అది అత్యవసరము.గత నాలుగు సంవత్సరాల నుండి అనగా భటిండా, జలందర్ పార్టీ కాంగ్రెసుల అనంతరం నుండి, వామపక్ష ఐక్యత అనేక ఘటనలలో చొరవతో పెక్కు విజయాలను సాధించింది. అనేక ఆటు పోటులకు రాటుదేలి పశ్చిమ బెంగాల్ వామపక్ష ఐక్యత మరింత బలపడింది. అనేక వామపక్షాలు సి.పి.ఐ; సి.పి.ఐ(యం) రెండింటితో సహా, వామపక్ష ఐక్యత బలపడింది. కేరళలో 1977 తరువాత పరిస్థితులలో అభివృద్ధి కరమార్పులు వచ్చాయి. సి.పి.ఐ(యం) నాయకత్వంలోని వామపక్ష సంఘటనకు ప్రతిగా సి.పి.ఐ నాయకత్వం కాంగ్రెసు వర్గాల మద్దతు పొందిన వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన అనే నూతన విధానం అవలంభించి, మంత్రి వర్గాల నుండి నిష్క్రమించుటతో సంఘటన ప్రభుత్వం కూలిపోయింది. ఇదే వామపక్ష నూతన ఐక్యతకు మార్గమేర్పడింది. భారతదేశంలో నూతన పరిణామాలకు వామపక్ష ఐక్యతా నిర్మాణ ప్రయత్నాలు వేగాన్ని పుంజుకొన్నది. ఇదే సి.పి.ఐ; సి.పి.ఐ(యం) ల మధ్య సదవగాహన పెంపొందుటకు తోడ్పడింది.

పార్లమెంటులో వామపక్ష సమన్వయ కమిటి, అన్ని పార్టీలు కలసి యేర్పడి పనిచేయ ప్రారంభించింది. అది తరచు సమావేశమై సమిష్టి నిర్ణయాలు తీసుకొంటూ, తదుపరి యితర పార్టీలతో సంప్రదింపులు, ఐక్యకార్యాచరణను రూపొందించే ప్రయత్నాలు చేస్తున్నది. రాష్ట్రాలలో అనేక సమస్యలపై సమిష్టిగా వామపక్షాలు ముఖ్యంగా సి.పి.ఐ(యం),

సి.పి.ఐ లు కలసి పనిచేస్తున్నది. అస్సాంలో హత్యాకాండలు, హరిజనులపై హింసా, దౌర్జన్యచర్యలకు వ్యతిరేకంగా, వతకలహాలు, ప్రజాసామాన్యపు ఆర్థిక, రాజకీయ హక్కుల పరిరక్షణకు, విదేశాంగ తదితర సమస్యలపై ఒకే రాజకీయ విధానాన్ని అనుసరించుట, జాతీయ రాజకీయాలలో వామపక్షాల పాత్ర, ప్రతిష్టలను, వారిపై ప్రజలలో సదభిప్రాయాన్ని పెంపొందించింది.

వామపక్షాల విస్తృత ఐక్యకార్యాచరణ సంయుక్త సమ్మె పిలుపులు, మోర్చాలు, ప్రజాప్రదర్శనలు, ప్రజాజీవిత ముఖ్య సమస్యలపై మరింత విస్తృత ప్రజాసామాన్యాన్ని సమీకరించుటలలో వామపక్ష ఐక్యత బలపడింది. అన్ని రాష్ట్రాలలో సి.పి.ఐ(యం), సి.పి.ఐ ల మధ్య అభిప్రాయభేదాలున్నప్పటికి ముఖ్యంగా మహారాష్ట్ర, రాజస్తాన్, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా, బీహార్, పంజాబ్, గుజరాత్, హర్యానా, యు.పిలలోసహకారం పెంపొందినందున వామపక్ష శక్తుల ఐక్యత బలపడింది. ఈ వామపక్ష పాక్షిక ఐక్యతా విజయం, కలతలు-కార్పణ్యాలు లేకుండా, కలిగినతనుకొనరాదు, సరియైన విధానాలకై జరిగిన పోరాటాల ద్వారానే అదే క్రమంలో జరిగింది.

రాజకీయ పరిస్థితి, తక్షణ కార్యక్రమాలపై, వామపక్షపార్టీలు, వివిధ అవగాహనలు కలిగియుండుటయేగాక, అనేకసారులు వివిధ ఎత్తుగడలు అవలంబించుట కూడ జరుగుతున్నది. అంతేగాక, అంతర్జాతీయ అనేక ముఖ్య సమస్యలపై కూడ భిన్నాభిప్రాయాలను కలిగివున్నవి. వీటన్నిటను అదిగమించి విప్లవపోరాటాలకై, ఐక్యకార్యాచరణను రూపొందించుట, మౌలిక రాజకీయ విధానాలపై సూత్రబద్ధవైఖరిని, దృఢంగా అనుసరించుటకు ఎంతో సహనం, ఓర్పు అవసరం. అంతేగాక సైద్ధాంతిక పోరాటమేగాక, రాజకీయచర్చలు, పెదథోరణులు, అంచెనాలు, ఎత్తుగడలపై జరుగుట, వొక సమగ్ర అవగాహనకు వచ్చు ప్రయత్నం చేయుట ఎంతో అవసరము. ఆవిధంగా యేర్పడిన వామపక్ష ఐక్యతయే ఆటు-పోటులమధ్య దృఢంగా నిలబడగలుగుతుంది. సి.పి.ఐ; సి.పి.ఐ(యం) నాయకుల మధ్య న్యూయేజ్, పీపిల్సు డెమ్రోకసీ, కమ్యూనిజం పత్రికలలో యింతకాలం జరిగిన విమర్శలు, ప్రతివిమర్శలు యీకోవకు చెందినవే. అవే రాజకీయవిధానాలు, ఎత్తుగడలపై సైద్ధాంతిక చర్చలు, వాగ్వివాదాలు జరిగాయి. అయితే అవి వామపక్ష ఐక్యతను పెంపొందించేవిగా వున్నచో హర్షామోదాలను, అవి అలక్ష్యాలకు వ్యతిరేకంగా వున్నచో మనస్తాపాన్ని, అన్ని కమ్యూనిస్టు శ్రేణులలో కలిగిస్తాయి. పరస్పరం వొకరినొకరు వొప్పించుకునే విధంగా వుండాలని ఆశించుట అత్యాసకాదు.

సి.పి.ఐ (యం) వైఖరి సి.పి.ఐ యెడల యీ క్రింది విధంగా వుంది. "ఇండియా పరిస్థితిపై సి.పి.ఐ తన మౌలిక విధానాన్ని రాజ్యాంగం, ప్రభుత్వాలవర్గ నైజ విశ్లేషణ, విప్లవదశలపై తమ ప్రాధమిక అవగాహనలను వదిలివేయలేదు. అంచేతనే నేటి రాజకీయవిధానలపై అభిప్రాయ భేదాలు వూగిసలాటలు వూహించవచ్చు. అంతర్జాతీయ అవగాహలపై కూడ భేదాభిప్రాయాలు వుదయించవచ్చు. వీటిని తేలికగా త్రోసిబుచ్చ

జాలము" అనే అభిప్రాయం సి.పి.ఐ(యం)లో బలంగావుంది. అదే కారణంగా, భటిండా నూతన పంథాను కూడ తీవ్రదాడికి గురిచేసింది. కాని సి.పి.ఐ కేరళ మంత్రివర్గం నుండి నిష్క్రమించే విధానాన్ని చేబట్టుట, వారిలో విభేదాలకుకారణమైన డాంగేవర్గం గుర్తింబడుటను" గుర్తించినా, సముఖ అంశాలకంటే, భేదాభిప్రాయాలనే సి.పి.ఐ(యం) సందర్భం లేకుండా నొక్కి చెప్పుట వామపక్ష ఐక్యతకు యెలా తోడ్పడుతుందో, సామాన్యమానవునికి అర్థం కాకుండా వుంది.

సంయుక్త కార్యాచరణలు, ప్రజా ఆందోళనలు, నిరసన ప్రదర్శనలు 1982లో కొన్ని మసాలుగా మరింత ఎక్కువగా జరుగుతున్నవి. రెండు పార్టీల మధ్య సహకారం పెంపొందుతున్నది.

ఈ బలహీనతలు, అవాంతరాలులోకూడ, వామపక్ష ఐక్యత బలపడుట కొనసాగుట, వాస్తవపరిస్థితులనుండి వుద్భవిస్తుంది. దాని ఆవశ్యకతను తెలియజేస్తుంది. అయినా అది యాధృచ్ఛికంగా అభివృద్ధి చెందే విధానంకాదు. కమ్యూనిస్టుపార్టీలు రెండూ వుద్యమంలో వూగిసలాటలను వొంటెత్తు పోకడలను సహచరపార్టీలలో పెరుగుటపై పోరాటం సాగించుతు, అప్రమత్తులై వుండవలసిన అవసరముంది. పరస్పర అవగాహనలనుపెంపొందించుకొంటూ, చేరువగుతూ, పెరుగుటకై పోరాటం సాగించుతు, అప్రమత్తులై వుండవలసిన అవసరముంది. అవగాహనలను పెంపొందించుకొంటూ, చేరువగుతూ, అట్టి పోరాటాలను సూత్రబద్ధంగా సాగించుటవలననే వామపక్ష ఐక్యత పోరాటం యిమిడి వుంటుంది, డి.యం.కె; ఎ.ఐ.ఎ.డి.యం.కె; అకాలీ, తెలుగుదేశం పార్టీలతో వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతానిర్మాణపోరాటం యిమిడి వుంది. ఈ శక్తులను సమిష్టి పోరాటంలో సమీకరించుటలో పాక్షిక విజయం లభించిందని, సి.పి.ఐ (యం) యీ క్రింది విధంగా వివరించింది.

"బస్సు చార్జీలను పెంచుటకై పంజాబ్ అసెంబ్లీ ముందు సంయుక్త ప్రదర్శనను గెరావో జరువుటలో అకాలీదళ్ భాగస్వామియై పాల్గింది. అంతేగాక, కిసాన్ సమన్వకమిటీలో భాగస్వామియై, కిసాన్ యాత్రా ప్రదర్శనలో పాల్గొన్నది. కొన్ని మాసాలక్రిందట, దానిలో చీలికయేర్పడి వొక వర్గం, తమ పంథాను వదలి, ఖలిస్తాన్ నినాదంతో పాటు, అమృత్‌సర్ పవిత్రనగర నినాదాన్ని చేబట్టింది. అయితే అత్యధిక భాగపు అకాలీదళ్ యీ చీలిక వాదులను బలపరచక నిరాకరించారు. కాని భారత విమానాన్ని హైజాక్ చేయుటను వీరు ఖండించలేదు. అటువంటి పార్టీలలో అట్టి పెడధోరణులు సర్వసాధారణము. గుజరాత్‌లో రిజర్వేషన్ ఉద్యమాన్ని వ్యతిరేకించిన ప్రతిఘాతక వుద్యమాన్ని బలపరచిన బూర్జువా ప్రతిపక్ష పార్టీలలో కూడదీనిని చూడగలము.

"కాంగ్రెసు (ఐ) తో అవకాశవాద సహకారాన్ని నెరపుతున్నన డి.యం.కె., లోక్‌సభ, రాజ్యసభలలో బయటా విశ్వాసంతో పాలకపార్టీని బలపరచుట కొనసాగిస్తూనేవుంది. ఎ.ఐ.ఎ.డి.యం.కె నాయకత్వం డి.యం.కె పై పోరాటంలో కేంద్రికరించి, నియంతృత్వ

వ్యతిరేక పోరాటంలో అభిలాషను చూపుటలేదు. 'ఎ.ఐ.ఎ.డి.యం.కె' ప్రభుత్వంపై, కేంద్ర కాంగ్రెసు(ఐ) నాయకత్వం, మంత్రులుచేయు దాడులపై స్పందించుతు, గతంలో ఎఐఎడియంకె ప్రభుత్వం, రాష్ట్రాలస్వపరిపాలనకై పోరాటాన్ని చేబట్టి, పొందిన ప్రాంతీయ ప్రతిష్టను నిలబెట్టుకొన ప్రయత్నిస్తున్నది. కాని, నేడున్న రాష్ట్ర ప్రభుత్వ అధికారాలను హరింపజూస్తున్న కేంద్రప్రభుత్వవిధానాలను ఖండించలేదు. కొన్ని వుత్పత్తులపై అమ్మకం పన్నులపై లెవీని కేంద్ర ప్రభుత్వం విధించుటను ప్రతిఘటించలేదు. కార్మిక వ్యతిరేక చట్టాన్ని ప్రతిపాదించుటయేగాక, డి.యం.కె తోపాటు "నాసా", "ఎస్మా"లను కేంద్రం చట్టాలుగా చేసి, అమలు చేయుటకు పూర్తి మద్దతును యిచ్చింది.

వారణాసి సి.పి.ఐ 12వ, పార్టీ కాంగ్రెసు, అతివాదుల, వామపక్ష ఐక్యతపై యీ క్రింది అభిప్రాయాలను వెలిబుచ్చింది.[1]

"భటిండా పార్టీ కాంగ్రెసు తదనంతరం కాలంలో అనేక అవాంతరాలను అధిగమించి సి.పి.ఐ., సి.పి.ఐ(యం) ల ఐక్యకార్యాచరణ గణనీయంగా అభివృద్ధి చెందింది. అతివాద, ప్రజాస్వామ్య ఐక్యత ప్రత్యేకంగా కమ్యూనిస్టు వుద్యమ ఐక్యతను భటిండా కాంగ్రెసు నొక్కి చెప్పుటతో నూతన మార్గాలు, అవకాశాలు అభివృద్ధిచెందాయి. అనేకసమస్యలపై సి.పి.ఐ(యం) తనదృక్పదాన్ని ముఖ్యంగా సి.పి.యస్.యు విప్లవకరపాత్రను, సోవియట్‌తో స్నేహ, మైత్రీ సంబంధాలు బలపరచుకొనవలసిన అవసరాన్ని గుర్తించుట, జనతాపార్టీని బలపరచుటను అనగా మురార్జీదేశాయిని బలపరచుటను వుపసంహరించుకొనుట, రెండు పార్టీల మధ్య ఐక్యత పెంపొందుటకు అవకాశాలు యేర్పడినవి. చైనా కమ్యూనిస్టు పార్టీ అమెరికాను, ప్రతి అభివృద్ధి నిరోధక శక్తులను బలపరచుటను సి.పి.ఐ(యం) విమర్శనాత్మకంగా పునర్విచారించుకొనుటను ప్రారంభించుట, రెండింటి మధ్యగల అభిప్రాయభేదాలను మరింత తగ్గించి వేశాయి. నేటి పరిస్థితి రెండు పార్టీలు మరింత సదవగాహన, ఐక్యకార్యాచరణలతోనే కార్మికవర్గ ఐక్యత, కార్మిక, కర్షక ఐక్యత సాధ్యమౌతుందని" తీర్మానం స్పష్టం చేసింది. అంతేగాక, "నేటీ రాజకీయ పరిస్థితులలో వామపక్ష ఐక్యత మాత్రమే, వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయాన్ని, నిర్మాణాన్ని ప్రజానీకం ముందుంచగలుగుతుంది. అనేక ప్రాంతాలలో, దీనర్థం నూతనంగా పైస్థాయిలో సి.పి.ఐ, సి.పి.ఐ(యం)ల మధ్య ఐక్యకార్యాచరణగా చెప్పవచ్చును.

"బలమైన ఐక్య వామపక్షం లేకుండా, ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయం మనదేశంలో వుద్భవించదు. బూర్జువా పార్టీలలో ప్రజాస్వామ్య శక్తులు వామపక్ష ఐక్యత చుట్టూ సమీకరించబడకుండా వుండుటకు, వామపక్షాలు వాటిలో విశ్వాసాన్ని కలిగించ జాలకపోవుటయే కారణము. అంచేత మనపార్టీ యితర వామపక్షాలు బలపడుట, వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయం అవతరించుటకు అత్యవసరము.

"ప్రత్యేక సమస్యలపై అనేక పర్యాయములు మనపార్టీ బూర్జువాపార్టీలతోగాని, కొన్ని

---

1. *రాజకీయ తీర్మానం (1982) సి.పి.ఐ, 12వ పార్టీ కాంగ్రెసు, వారణాసిలో ఆమోదించింది. (ఆంగ్లంలో) సి.పి.ఐ పబ్లికేషన్ నం.3. 1982. పే.24-7.*

గ్రూపులతోగాని పరిమిత లక్ష్యాల కొరకు కొన్ని ఒప్పందాలు చేసుకొంటున్నది. యివి తాత్కాలికనైజాన్ని కలిగి వున్నవి. ఇవి యే మాత్రం వామపక్ష ఐక్యతను, ముఖ్యంగా వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయాన్ని రూపొందించు ప్రాముఖ్యతను తగ్గించజాలవు" అని సి.పి.ఐ స్పష్టం చేసింది. అంతేగాక, ప్రత్యామ్నాయ నిర్మాణానికి సోపానాలుగా తోడ్పడనూగలవు. తీర్మానం ఐక్యకార్యాచరణను నొక్కి చెప్తూతూ దీనర్థం, మాపార్టీ వామపక్ష ఐక్యతను బలపరచుటకు ప్రత్యామ్నాయాలను తీవ్రతరం చేస్తుంది. ప్రత్యేకంగా సి.పి.ఐ; సి.పి.ఐ(యం)ల మధ్య ఐక్యకార్యాచరణను, రాజకీయ ఉన్నత స్థాయికి పెంపొందిస్తుంది.

"వామపక్ష ఐక్యతకై ఓర్పు, సహనం, దృఢవిశ్వాసంతో రాజకీయ, సైద్ధాంతిక పోరాటాన్ని, విస్తృత వామపక్ష ప్రజాస్వామ్య శక్తుల ఐక్యతను రూపొందించు నిరవధికపోరాటంలో భాగంగానే కొనసాగించాలి. అలా నిర్మించబడిన ఐక్యతే చివరకు కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతకు మార్గాన్ని సుగమం చేస్తుంది.

సి.పి.ఐ తన ఐక్యకార్యాచరణ, ఐక్యతా విధానాలను చొరవతీసుకొని ఆచరణ కొనసాగిస్తూనే "చైనా నాయకత్వం యెడల సి.పి.ఐ(యం) అవలంభించిన రాజకీయ సైద్ధాంతిక వైఖరి, బి.జె.పి తోసహా అన్ని ప్రతిపక్ష పార్టీలు నిరంకుశత్వానికి వ్యతిరేకంగా ఐక్యం కావాలనే వైఖరి, కార్మికోద్యమంలో యింకా, "చీలిక" ధోరణి, వామపక్ష ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయం యేర్పడుటకు ప్రతిబంధకాలుగ వున్నవని తీవ్రంగా విమర్శకు గురిచేసింది.[1]

తీర్మానం కేంద్ర కర్తవ్యాలుగా, భారతదేశ సార్వభౌమాధికారాన్ని సమగ్రతను పరిరక్షించుట, విదేశాంగవిధానం, సామ్రాజ్యవాద వ్యతిరేక కర్తవ్యాలు, విచ్ఛిన్నకర శక్తులకు వ్యతిరేకంగా జాతి సమైక్యత, కుల, మత, చాందస పునరుద్ధరణ శక్తులకు వ్యతిరేకంగా పోరాటం, లౌకిక, అల్పసంఖ్యాక సమస్యలు ప్రధానమైనవి గానెంచి వాటి రక్షణ చేబట్టుట, కర్తవ్యాలుగా గుర్తించింది. అంతర్జాతీయంగా యుద్ధమా, శాంతియా అనేది ముఖ్య సమస్య అయిందని; అంతర్జాతీయ శాంతిశక్తులకు పూర్తి మద్దతును నిర్థిష్టంగా ప్రకటించింది.

కాంగ్రెసు (ఐ)ని అనుసరించే ప్రజాసామాన్యాన్ని కాంగ్రెసు ప్రభుత్వ ప్రజావ్యతిరేక చర్యలను ప్రతిఘటించుటకై సమీకరించుట ద్వారా పోరాట శక్తిని, వాడిని, సి.పి.ఐ పెంపొందించనెంచింది. బూర్జువావర్గపాలనకు విస్తృత ప్రజాసామాన్యానికి మధ్య యేర్పడుతున్న తీవ్రవైరుద్యాల కారణంగా యిది సుసాధ్యమంటున్నది. రాబోవు కాలంలో రాజకీయ వర్గపోరాటాలు తుఫానులగా విజృంభిస్తాయని ఆశిస్తున్నది. వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యతకై జరిపే పోరాటంలోనే విస్తృత ప్రజాస్వామ్య శక్తులను సమీకరించి, వివిధ రాజకీయ శక్తుల బలాబలాలలో మార్పుతేగలమనే విశ్వాసాన్ని ప్రకటించింది.

కమ్యూనిస్టుపార్టీలు రెండింటికి, జనతా ప్రభుత్వం తదనందరం తిరిగి యేర్పడిన

---

1. *రాజకీయ తీర్మానం (1982) సి.పి.ఐ వారణాసి, 12వ. పార్టీ కాంగ్రెసు ఆమోదించినది (ఆంగ్లంలో) పే. 26.*

ఇందిరాగాంధీ ప్రభుత్వం అనుసరించిన ఆర్థికవిధానాలు, ఐ.యం.యఫ్ ప్రపంచ బ్యాంకులద్వారా వచ్చే విదేశ పెట్టుబడులపై ఎట్టి భ్రమలు లేవని, రెండు పార్టీల కాంగ్రెసుల తీర్మానాలలో స్పష్టం చేయబడింది. రెండు కమ్యూనిస్టుపార్టీలు విదేశసంస్థలు పెట్టే షరతులను మన ప్రభుత్వాలు ఆచరణలో ఆమోదించుటను తీవ్రంగా విమర్శించాయి. ఆ అప్పులు తీసుకొనుట మన సార్వభౌమాధికారానికి, దేశ సమగ్రతకు అంత్యంత ప్రమాదకారియని హెచ్చరించాయి.

ఆర్థిక సంక్షోభం ఫలితంగా ప్రజా అసంతృప్తి పెరిగి సమ్మెలు, ఆర్థిక పోరాటాలు విజృంభించుటతో పాలకవర్గం, ప్రజలను నిరంకుశ విధానాలతో అణచివేయు క్రమంలో ప్రెసిడెంటు పాలనా విధానంవైపు పయనించే అవకాశాలపై రెండు కమ్యూనిస్టుపార్టీలు మౌలికంగా వొకే తీరులోస్పందించాయి. తీర్మానాలలో వాడిన మాటలలో కూడ సారూప్యత యేయెక్కువగా వుంది.

ఇందిరా కాంగ్రెసు కేంద్ర ప్రభుత్వం కాంగ్రెసేతర రాష్ట్రాల ప్రభుత్వాల యెడల అవలంభించే ఆర్థిక, రాజకీయ వొత్తిడులు పక్షపాత ధృక్ఫదం, ఆరాష్ట్ర ప్రభుత్వాలను కూలదోయుటకు అవలంబించే విధానాలను రెండు కమ్యూనిస్టు పార్టీలు వొకే విధంగా తీవ్రంగా విమర్శించాయి.

విజయవాడ సి.పి.ఐ(యం) వారణాసి సి.పి.ఐ పార్టీ కాంగ్రెసులు అనేక దేశ, విదేశ విదానాలలో సారూప్యతలనే యెక్కువగా కలిగియుండుట, మౌలిక సైద్ధాంతిక బేదాభిప్రాయాలున్నవనే సాకుతో అనేక దైనందిన కార్మిక, కర్షక పోరాటాలలో సైతం, రాష్ట్ర, దేశ వ్యాపిత పోరాటాలుగా అభివృద్ధి చెందకుండుటకు పరోక్షంగా కారణ భూతములగుచున్నవి.

## 3. రాష్ట్రీయ పార్టీలు దేశ ఐక్యత, సమగ్రతా సమస్యలు

రాష్ట్రీయ రాజకీయ, పార్టీల నిర్మాణం ఇటీవల కాలంలో కొన్ని రాష్ట్రాలలో యేర్పడుటయేగాక, అనతికాలంలో బలమైన ప్రజా పలుకుబడిని సంపాదించాయి. తమ భాషా, సంస్కృతులు జాతివికాశం చెందాలని, తమరాష్ట్రం సాధ్యమైనంత యెక్కువగా అభివృద్ధి చెందాలని, ప్రగతిపథంలో పురోగమించాలని, న్యాయమైన ఆశలు, వాంఛలు ఆధారం చేసుకొని ప్రాంతీయ రాజకీయ పార్టీలు ప్రజా విశ్వాసాన్ని పలుకుబడిన సంపాదించుట గుర్తించాలి. ఈ పార్టీలలో కొన్ని ప్రగతి నిరోధక, జాతీయ దురహంకార పూరిత నాయకత్వం కలిగివున్నప్పటికి, ఆపార్టీలన్నిటిని వొకే గాటను కట్టి, దేశ సమగ్రతకు విఘ్నకారులుగా నిర్ధారణలు చేయరాదు. ఈ పార్టీలను అనుసరించే ప్రజలను వామపక్ష ప్రజాతంత్ర ఐక్యసంఘటనలోనికి తీసుకొని రావలసివుంది.

ఆంధ్రప్రదేశ్‌లో 1983లో, కర్నాటక తదితర చోట్ల ఎన్నికలు ముగిసాక యీ సమస్యలు గతంలో కంటె ప్రధానమైనవిగా బలంగా ముందుకొచ్చాయి. స్వాతంత్ర్యా నంతరం ఆంధ్రప్రదేశ్‌లో తొలిసారిగా, ఏదేశంలో ఎప్పుడూ జరుగని విదంగా

అతికొద్దికాలంలో వొక పూర్తి ప్రాంతీయ తెలుగుదేశం పార్టీ, ఆశ్చర్యకరంగా పెద్ద మెజారిటిని ఎన్నికలలో సంపాదించి అధికారంలోనికి వచ్చింది. కర్నాటకలో జాతీయ పార్టీయే అయినప్పటికి జనతాపార్టీ అధికారంలోనికి వచ్చింది. ఇవి, వొకే వొకవిషయాన్ని, కేంద్రం వివిధ ప్రాంతీయ సమస్యలను యెంతగా చిన్నచూపు చూస్తుందో స్పష్టం చేస్తున్నవి.

పంజాబ్ సమస్యలపై వొప్పందం కుదరగానే సెప్టెంబరు 1985లో ఎన్నికలు జరిగాయి. అకాలీదళ్ విజయం పొందింది. అస్సాంలో డిశెంబరు 1985లో జరిగిన ఎన్నికలలో కొత్తగా యేర్పడిన అస్సాం గణతంత్ర పరిషత్తు అనే ప్రాంతీయ పార్టీ ఘనవిజయాన్ని సాధించింది. ఈవిధంగా దేశంలోని వివిధ రాష్ట్రాలలో ప్రాంతీయ పార్టీలు యేర్పడి, బలపడి, కొన్ని రాష్ట్రాలలో అధికారాన్ని కూడ స్వీకరించాయి. ఏప్రిల్ 1983లో సి.పి.ఐ జాతీయసమితి ప్రాంతీయ పార్టీల అవతరణను పరిశీలించి, యీ క్రింది అంశాలను గమనించి ప్రకటించింది.

అవి "కాంగ్రెసు (ఐ) అనుసరిస్తున్న విధానాలకు, ఆచరణలకు వ్యతిరేకంగా నిర్దిష్ట ప్రాంతాలలో ప్రజలు అసంతృప్తిని ప్రకటించే వస్తుగత పరిణామం మొదటిది, ఇకరెండవది "బూర్జువా వర్గ వ్యవస్థలోని తీవ్ర సంక్షోభం యొక్క లక్షణం" అని మూడవది, వామపక్షం బలహీనంగా వున్నపుడు, కాంగ్రెసునుంచి విడిపోయే గ్రూపులతో సహా స్థానిక బూర్జువాపార్టీలు, పెటీ బూర్జువా పార్టీలు ప్రాంతీయ పార్టీలుగా యేర్పడుతాయి. నాల్గవది ఆర్థికంగా వెనుకబడివున్న రాష్ట్రాలలోనే కాదు, బాగా అభివృద్ధి చెందిన రాష్ట్రాలలో గూడ, అనగా స్థానిక బూర్జువావర్గాలు ఆశలు పెంచుకొన్న చోట్ల గూడ యిలాంటి ప్రాంతీయ పార్టీలు యేర్పడుతాయి. ఇక అయిదవది కాంగ్రెసు (ఐ)కి రాజకీయాధికారంపై అత్యధిక కేంద్రీకృత అధికారముండుట, ప్రజలచే ఎన్నుకొనబడిన రాష్ట్ర ప్రభుత్వాలను రద్దు చేయుటలో కాంగ్రెసు (ఐ) నిరంకుశపద్ధతులు అవలంభించుట, తమ ఆత్మగౌరవం, ప్రత్యేక భాషా, సాంస్కృతిక, వ్యక్తిత్వాలను గుర్తింపుకోసం, రాష్ట్రాలు గట్టిగా వాంఛించుట, కేంద్రం- చిన్నచూపు, ప్రాంతీయ పార్టీల జననానికి, అభివృద్ధికి- కారణాలుగా చెప్పవలసివుంటుంది. వీటితోపాటు యితర అంశాలు కారణాలువున్నవి. "ఇవన్నీ కలసి కేంద్ర రాష్ట్ర సంబంధాల పునర్వ్యవస్థీకరణ సమస్యను ముందుకు తెచ్చాయి"[1].

## 4. కేంద్ర-రాష్ట్ర సంబంధాలు

భారతదేశంలోని కేంద్ర-రాష్ట్ర సంబంధాల సమస్య ప్రధానంగా అసమాన ఆర్థిక, పారిశ్రామిక అభివృద్ధి కారణంగా జనించిన సామాజిక వైరుధ్యాలతో పాటు బాషా, సంస్కృతి, మతాల వైరుధ్యాలు కూడా అంతటి ప్రాముఖ్యతనే కలిగి ఉన్నవి. ఈ రెండు కారణాలు సంలీనమైనపుడు కేంద్రరాష్ట్ర సంబంధాలలోని వైరుధ్యం తీవ్రసంఘర్షణలకు దారితీస్తున్నది. ఇది గుర్తించిన భారత దేశ ఐక్యత సంరక్షింపబడుతుందని, పరిష్టపడుతుందని దేశంలోని కమ్యూనిస్టు శ్రేణుల ఆకాంక్ష, అవగాహన.

1. *వారణాసి కాంగ్రెసు అనంతరం, సి.పి.ఐ., సి.సి. "జాతీయ, అంతర్జాతీయ పరిణామాలపై సమీక్ష, మార్చి 1986లో 13వ పార్టీ కాంగ్రెసు ఆమోదించినది. తెలుగు పే. 29-30*

మితవాద అభివృద్ధి నిరోధకశక్తులు, సామ్రాజ్యవాదులు ప్రాంతీయ దురహంకారాన్ని, ప్రాంతీయ భావాలను ఉపయోగించుకొనే ప్రమాదం ఉన్నదని కమ్యూనిస్టు వర్గాలు హెచ్చరిస్తూనే ఉన్నవి. కాని, ప్రస్తుతమున్న ఆర్థిక, రాజకీయ అసమానతలను అధిగమిస్తూ దేశం యొక్క సమగ్ర ఆర్థికాభివృద్ధిని, అసమానాభివృద్ధిని నిర్మూలించే దృక్పథంతో కొనసాగించి దేశాభివృద్ధిని పరిష్ఠ పరచాలిసిన ఆవశ్యకతను వామపక్షాలు నొక్కి చెప్తూతు ముందుకు రావాలి.

వామపక్ష పార్టీలు ప్రాంతీయ పార్టీల పట్ల "పట్టు-విడుపుల" ధోరణి అవలంభించాలని, సి.పి.ఐ. జాతీయసమితి నొక్కి చెప్పింది. ఈ విషయంలో సి.పి.ఐ.(యం) భిన్నాభిప్రాయాలను కలిగిలేదు. ప్రాంతీయ పార్టీలు సంకుచిత ప్రాంతీయవాద పంథా అనుసరించకుండా నిరోధించుటకు, దేశం ఐక్యతను ప్రాంతీయ సామాజిక వ్యతిరేక భావాన్ని పరిష్ఠం చేసేందుకు, వాటిని కలుపుకొనుటకు అట్టివైఖరి అత్యంత అవసరము. అన్ని ప్రాంతీయ పార్టీలు ప్రగతి నిరోధమైనవనీ, విచ్ఛిన్నకరమైనవని అనరాదని వామపక్షాలు హెచ్చరికలు చేసాయి.

ఈ దశలో నిజమైన ఫెడరల్ ప్రాతిపధికపై కేంద్ర రాష్ట్ర సంబంధాలు పునర్వ్యవస్థీకరణ సమస్య గొప్పప్రాముఖ్యతను, తక్షణావశ్యకతను సంతరించుకొన్నది. ఈ సమస్యపైదేశ వ్యాపితంగా జరిగిన చర్చా క్రమంలో మూడు అభిప్రాయాలు స్పష్టంగాపైకి వచ్చాయి. మొదటిది, పాలక కాంగ్రెసు (ఐ) ఎలాంటి మార్పునైనా వ్యతిరేకిస్తుంది, కేంద్ర-రాష్ట్ర సంబంధాలను పునర్వ్యవస్థీకరణ చేయాలన్న డిమాండు జాతీయైక్యతను, సమగ్రతను, విచ్ఛిన్నంచేస్తుందని భావిస్తుంది. ఇక రెండవది ప్రధానంగా ప్రాంతీయ పార్టీలకున్న అభిప్రాయం విదేశాంగవ్యవహారాలు, రక్షణ, కమ్యూనికేషన్స్, కరన్సీలనే నాలుగు అంశాలను మాత్రమే కేంద్రానికి ఇవ్వాలనీ, మిగతా వన్నీ రాష్ట్రాలకే చెందాలనీ, అంటే ప్రణాళికా, సాధారణ ఆర్థికాభివృద్ధిలను కూడా రాష్ట్రాలకే వదలాలని ప్రాంతీయ పార్టీలు వాదిస్తాయి. కేంద్రం అంటే "వూహాత్మక మిధ్య" అనేదాక ప్రాంతీయ నాయకులు వెళ్ళారు. ఇక మూడవ అభిప్రాయం సి.పి.ఐ. ఇతర వామపక్ష పార్టీలకు, ప్రజాతంత్ర విభాగాలకు వున్న అభిప్రాయం మన వ్యవస్థను నిజమైన ఫెడరల్ వ్యవస్థగా మార్చేందుకు, కేంద్ర-రాష్ట్ర సంబంధాలను ప్రజాతంత్ర యుతంగా పునర్వ్యవస్థీకరణ చేయాలని భావిస్తాయి. కేంద్రంబలంగా ఉండాలనీ, సమగ్ర ఆర్థికాభివృద్ధి కేంద్రం బాధ్యతగా ఉండాలని, అవి భావిస్తాయి. అయితే రాష్ట్రాలకు మాత్రం ఇప్పటి కంటె, ఎక్కువ ఆర్థికాధికారాలు ఉండాలంటాయి. రాష్ట్రాలలోని ఎన్నికైనా ప్రభుత్వాల పట్ల కేంద్రం అధికారాల నిరంకుశ వినియోగంపై రాజ్యాంగ బద్ధమైన అదుపు ఉండాలంటాయి."[1]

ఇష్టం ఉన్నా లేక పోయినా కేంద్రం, రాష్ట్ర సంబంధాలను పునర్వ్యవస్థీకరించాలన్నీ కోరికనుమన్నించి, సర్కారియా కమిషన్‌ను వేసింది. ఇదికేంద్రం రాష్ట్రాల డిమాండులోని వాస్తవికతను గుర్తించుటయే అగుతుంది. విచ్ఛిన్నకర శక్తులకు వ్యతిరేకంగా పోరాడి

1. వారణాసి సి.పి.ఐ. మహాసభ అనంతరం జరిగిన జాతీయ, అంతర్జాతీయ పరిణామాలసమీక్ష, *1986* మార్చి, పాట్నామహాసభచే ఆమోదించబడినది. (తెలుగు) పే. *31*. విశాలాంధ్ర పబ్లికేషన్.

జాతీయ సమగ్రత, ఐక్యతను పటిష్టంచేయవలసిన అవసరం ఉంది. కాబట్టి, కేంద్ర-రాష్ట్ర సంబంధాలను ప్రజాతంత్ర బద్ధంగా పునర్వ్యవస్థీకరణ కావించాలన్న డిమాండు కోసం కమ్యూనిస్టులు పోరాటం సాగించారు.

ఈ దేశంలో విచ్ఛిన్నకర, వేర్పాటువాద, మతకులతత్వవాదులు, ప్రాంతీయ దురహంకార శక్తులకు, సామ్రాజ్యవాదం నుండి అండదండలు అందుతూనే ఉన్నాయి, ఆ మద్దతుతో అత్యంత విషపూరిత దాడికిదిగాయి. ఇందు మూలంగా దేశపు లౌకిక ప్రజాతంత్ర వ్యవస్థకు, దేశసమైక్యతకు, సమగ్రతల బద్ధతులకు నిజమైనముప్పు ఏర్పడింది. ప్రజల జాతీయ ఐక్యతావ్యతిరేకులకు నిరసనగా స్పందిస్తారనుకొనుటకు, పంజాబు శాసనసభ ఎన్నికలలో 'ఒప్పందం' వ్యతిరేకుల వోటమితో స్పష్టమగుతుంది.

"మీరట్, బరోడా, హైదరాబాద్, సులేగాం, అహమ్మదాబాద్, మానత్‌భంజన్, బీహార్ షరీఫ్ వగైరాచోట్ల దారుణమైన మత మౌఢ్యహింసా, దౌర్జన్యకలహాలు జరిగాయి. ఇవి ప్రధానంగా ముస్లిం మైనారిటీలకు వ్యతిరేకంగా ఎక్కుపెట్టబడినవి. ప్రధానంగా ఆర్.యస్.యస్. విశ్వహిందూ పరిషత్‌లు వీటిని ప్రోత్సహించాయి.

అస్సాంలో 1983 అసెంబ్లీ ఎన్నికల సందర్భంలో మతకలహాలు జరిగాయి. శ్రీమతి ఇందిరాగాంధి హత్యానంతరం ఢిల్లీ, కాన్పూర్, ఇండోర్, బొకారో తదితర ప్రాంతాలలో శిక్కులకు వ్యతిరేకహింసాకాండలుసాగాయి. రాష్ట్రీస్వయం సేవకసంఘం యొక్క మరో రాజకీయ సంస్థగా విశ్వహిందూ పరిషత్ రూపొందుట ప్రమాదకర పరిణామము. అది 1983 డిసెంబరులో చేసిన ఏకాత్మతాయజ్ఞం, దేశమంతటా ప్రదర్శనలు, లౌకికవాదాన్ని రూపుమాపి, వాతావరణాన్ని మతతత్వంతో విషపూరితం చేయుపథకము, ప్రగతినిరోధకము, చాంధససనాతన భావాలను ప్రచారం చేయుటకుద్దేశించబడింది. ఏకాత్మ యజ్ఞం, నిజానికి మతతత్వకలహాను ప్రజ్వరిల్లేటట్లు కొంతవరకు చేసింది. ప్రారంభంలో ఏకాత్మతా యజ్ఞానికి శ్రీమతి ఇందిరాగాంధీ ఆశీస్సులుండుట దురదృష్టకరము. వామపక్షశక్తులు విశ్వహిందూ పరిషత్తు యీ విషపూరిత పథకాలను ఎండగట్టుటవలన, ఇందిరాగాంధీ తదితర కాంగ్రెసు నాయకులు, తరువాత ఆ కార్యక్రమాన్ని వొక్క బి.జె.పి. లోక్‌దళ్‌లు మినహా అన్ని పార్టీలు వ్యతిరేకించాయి. ఈ దశలోనె మరోవైపు ముస్లిం మతచాంధసవాదం, జమాయత్-ఇ-ఇస్లామీ, మజ్లీస్, ఇత్తేహాదుల్ ముసల్మీన్ ఆది ముస్లిం మతసంస్థలు మతతత్వకలాపాలను ముమ్మరం చేసాయి. షాహబాన్ కేసుపై సుప్రీంకోర్టు తీర్పును, ముస్లింమతచాందసవాదులు, మత దురహంకారాన్ని పెంచింది, వాతావరణాన్ని కలుషితం చేయుటకు వినియోగించారు. మొత్తం మీద యీ దశలో "లౌకిక వాదం గణనీయంగా, వొత్తిళ్ళకు" గురైంది. బూర్జువాపార్టీలు దాదాపు అన్నీ, ఎన్నికల ప్రయోజనాలకు, సంకుచిత, అవకాశవాద, మత, కులతత్వ రాజీవిధానాలను ప్రోత్సహించాయి, అదే కాలంలో యీ చర్యలకు, ఆర్థిక సమస్య కార్మిక, తదితర బడుగువర్గాల ప్రయోజనాలకై వారు జరిపే పోరాటాలను సైతం, కొన్ని ప్రాంతాలలో వినియోగించుకొన్నారు.

## 5. సర్కారియా కమిషన్

కేంద్ర, రాష్ట్ర సంబంధాలు అనే సున్నిత సమస్య వాస్తవానికి రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణకు సంబంధించినది. దశాబ్దాల పోరాటం అనంతరం అయిష్టంగానే కేంద్రం, కేంద్ర కాంగ్రెసు నాయకత్వం. అసంపూర్తిగానైనా పరిష్కరించకతప్పలేదు. ఈ సమస్యను బాషా ప్రయుక్త రాష్ట్రాల రూపంలో చరిత్ర ముందుకు తీసికొనిరాగా రాజకీయంగా రాష్ట్రాల స్వపరిపాలన రూపంతో సమగ్రంగా పాలక వర్గాలు పరిష్కరించ వలసిందిపోయి, కొన్ని భాషాప్రయుక్త రాష్ట్రాలను యేర్పాటు చేయుట జరిగింది. నాడు యీ సమస్యను విచారించుటకు వేసిన స్టేట్స్ రీ ఆర్గనేజేషన్ కమిషన్ కూడ, బాషా ప్రయుక్త, పాలనా సౌలభ్యదృక్పథాలనుండి మాత్రమే పరిశీలించింది కాని. సమగ్ర కేంద్ర – రాష్ట్రాల సంబంధాల సమస్యలను గూడ కలిపి చూడజాలకపోయింది. కారణం, ఆకమీషన్‌కు పరిమిత లక్ష్యాలనే నిర్దేశించారు. ఈ భాషాప్రయుక్త రాష్ట్రాల నిర్మాణ ప్రజోద్యమాలకు కమ్యూనిస్టులు నాయకత్వం వహించి, స్వదేశీసంస్థానాలను రద్దు చేయాలనే వుద్యమాలతో సంలీనం చేసినదుపుటతోనే బ్రహ్మాండమైన జాతీయ ప్రజోధ్యమాల స్వరూపంయేర్పడి, పోరాటాలు విజయవంతమై, ఫలితంగా రాష్ట్రాల పునర్నిర్మాణం జరిగింది. ఈవుద్యమాలు 1952. 1959లలో మరోసారి 1967లో ప్రజలు సాగించారు. వాటి ఫలితంగానే 1967లో అత్యధికరాష్ట్రాలలో కాంగ్రెసు పాలన తాత్కాలికంగా అంతరించింది.

తమిళనాడులో 1969లో డి.యం.కె అధికారంలో వున్నపుడు రిటైర్డు మాజీ చీఫ్ జస్టిస్, మద్రాసు హైకోర్ట్, పి.వి. రాజమన్నార్ అధ్వర్యంలో యేర్పడిన కమిటి కేంద్ర–రాష్ట్ర సంబంధాలపై మే 1971లో వొకనివేదికను సమర్పించగా, అది విస్తారంగా చర్చించబడింది. కాని ఆ కమిటి సిఫార్సులు తీవ్రవిమర్శలకు గురై ఆమోదం పొందలేదు, నివేదిక చరిత్ర అడుగుపుటలలోనికి వెళ్ళింది.

వామపక్ష సంఘటన ప్రభుత్వాలు పశ్చిబెంగాల్, త్రిపురలలో 1975లో యేర్పడుటతో మరోసారి యీ సమస్యలు పైకి వచ్చాయి. ఈ రెండు ప్రభుత్వాలు కేంద్ర రాష్ట్ర సంబంధాల సమస్యలపై ప్రజలను సమీకరించే ప్రధాన పోరాట కేంద్రాల్ళయ్యాయి. అంత్యంత ఆందోళనకరమైన జాతీయ సదస్సు 1977లో ప్రజలను కదిలించింది. కేరళలో 1980లో వామపక్ష సంఘటన ప్రభుత్వం యేర్పడుటతో అది కూడ రాష్ట్రాల రాడికల్ పునర్వ్యవస్థీకరణ వుద్యమాలలో చేరి బలపరచింది. తన 18 మాసాల పాలనా కాలంలో కేరళ వామపక్ష సంఘటనా ప్రభుత్వ కేంద్ర ప్రభుత్వ సంబంధాల సమస్యలపై కేంద్ర ప్రభుత్వంతో పోరాడుతూనేవుంది.

ఆంధ్రప్రదేశ్‌లో, కర్నాటకలో జరిగిన 1983 అసెంబ్లీ ఎన్నికలలో కాంగ్రెసు వోడిపోవుటతో, దక్షిణాదిలోని కాంగ్రెసేతర నాలుగు రాష్ట్ర ప్రభుత్వాల ముఖ్యమంత్రులు బెంగుళూరులో ఏప్రిల్ 1983లో సమావేశమై యీ సమస్యను తిరిగి లేవనెత్తగా కేంద్ర ఇందిరాగాంధీ ప్రభుత్వం సర్కారి యాయేకసభ్య కమిషన్‌ను యేర్పరచింది. తదనంతర 10 మాసాలు కమీషన్ నత్తనడకను మరపించింది. అయితే ఉద్యమపురోగతి వేగోధృతి పొందింది.

శ్రీనగర్‌లో కాంగ్రెసేతర ప్రతిపక్షాలు సెప్టెంబరు 1983లో సమావేశమయ్యాయి. కేంద్ర, రాష్ట్ర సంబంధాలు పునర్వ్యవస్థీకరణానికై సూచనలు చేయు వొక మౌలిక పత్రాన్ని ఆమోదించారు. కేంద్ర రాష్ట్ర సంబంధాలు న్యాయబద్ధ, సమానత్వ ప్రాతిపదికపై సరియైన మార్గంలో నిర్ధారణ చేయుటకు తోడ్పడే సూచనలను పత్రంలో చేసారు. అవి రాష్ట్రాల స్వపరిపాలనాధికారాలను, హక్కులను పరిరక్షించనవిగా స్పష్టం చేయబడినవిగా, భారతజాతీయైక్యతను పెంపొందించేవిగా వున్నవి.

కాంగ్రెసేతర రాష్ట్ర ప్రభుత్వాలు ముఖ్యంగా, వామపక్ష రాష్ట్ర ప్రభుత్వాలు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల సంబంధాలను, సమస్యలను తీవ్రంగా చేబట్టి పోరాటాలను సాగించుటతో కాంగ్రెసుపాలనలోని అనేక రాష్ట్ర ప్రభుత్వాలు కూడ ఈ సమస్యలపై సుముఖంగా స్పందించ నారంభించాయి. ఇవి ప్రధానంగా కేంద్ర ప్రభుత్వం రాష్ట్రాల అధికారాలను "కరిమ్రింగిన వెలగపండు"గా చేయుటతో జరిగింది.

జనవరి 15, 1984న కాంగ్రెసేతర 18 పార్టీలు కలకత్తాలో ఆమోదించిన తీర్మానం, కాంగ్రెసు కుటిలనీతినవలంభించి, రాష్ట్రాలలోని కాంగ్రెసేతర మంత్రివర్గాలను భర్తరపు చేయువిధానాన్ని తీవ్రంగా విమర్శించింది. కాంగ్రెసేతర పార్టీలు ముక్తకంఠంతో, ఏకగ్రీవంగా, అక్టోబరు 1983 శ్రీనగర్ ప్రకటనను పునరుద్ఘాటించి, కాంగ్రెసు ఆర్థిక, రాజకీయ విధానాలను, పక్షపాతవైఖరులను తీవ్రంగా విమర్శించింది. కాంగ్రెసు ఆశలను కోల్పోయి, పాలనాతదితర సంస్కరణలు కావాలని కోరేవారు దేశభక్తులు కారని నిందించ ప్రారంభించింది.

"కాంగ్రెసు తమ వైఫల్యాలకు ప్రతిపక్షాలు కారణమని నిందించే రోజులు గతించాయని" హెచ్చరించింది. అంతేగాక "కాంగ్రెసేతర రాష్ట్ర ప్రభుత్వాలను ఆవిధంగా రద్దు చేయుట యికముందు భారత ప్రజలు ఐక్యశక్తితో ప్రతిఘటించుతారని, మరోసారి హెచ్చరించింది. ఎన్నికలలో ప్రజలు యిచ్చిన తీర్పును మన్నించక కాంగ్రెసు కుటిల రాజకీయాలతో వాటిని రద్దు చేయుటను, దేశంలో ప్రజాస్వామ్యాన్ని రూపుమాపుటను, స్వాతంత్ర్యాన్ని, ప్రజాస్వామ్యాన్ని కోరే ప్రజలందరు ప్రతిఘటించాలని విజ్ఞప్తి చేసింది." ప్రతి పక్షాల సమావేశము. ఈ తీర్మానం చేయబడిన సమావేశానికి, కాంగ్రెసేతర 18 ప్రతిపక్షాల నాయకులు, ఐదుగురు ముఖ్యమంత్రులు, ముఖ్యంగా పశ్చిమబెంగాల్, త్రిపుర, ఆంధ్రప్రదేశ్, కర్నాటక, జమ్మూ-కాశ్మీర్ మంత్రులు సమస్య తీవ్రతపై మాట్లాడుటయేగాక, భారత దేశ ఐక్యత, సమగ్రతలపై తమ గాఢవిశ్వాసాన్ని ప్రకటించారు. రాష్ట్రాల అభిప్రాయాలను కేంద్రం చెవిని పెట్టకపోవుట తీవ్ర పరిణామాలకు దారి తీస్తుందని హెచ్చరించారు.

"కేంద్ర-రాష్ట్ర సంబంధాల సమస్య, పాలక పార్టీ కాంగ్రెసు కేంద్ర ప్రభుత్వం, కాంగ్రెసేతర ప్రతిపక్షాల, రాష్ట్ర ప్రభుత్వాల సమస్య మాత్రంగానే యింకే మాత్రం లేదని, ప్రధాన కేంద్ర రాజకీయ సమస్యగా రూపొందించిందని, పరిష్కారమార్గాలు వెంటనే శోధించి, అమలు చేయవలసిన అత్యవసర పరిస్థితికి చేరిందని స్పష్టం చేసింది. ఆవిధంగా

ప్రతిపక్షాల కలకత్తా సమావేశం. జాతీయ ఐక్యత, పూర్తి జాతీయ సమగ్రతలపై తమ విశ్వాసాన్ని ప్రకటించింది.[1]

ముగింపుగా, "కాంగ్రెసేతర ప్రతిపక్షాలు, గత ఎనిమిది మాసాలలో యే సమావేశం లోను ఎన్నికల ఎత్తుగడలు, వ్యూహాలగురించి సంప్రదింపులు జరుపలేదనే వాస్తవాన్ని బహిరంగంగా ప్రకటించవలసి వుంది. అటువంటి సమస్యలు చర్చించుటకు, ఎజెండాలో చేర్చుటకు ప్రతిపక్షాల పార్టీలలో యేవొక్కటీ అవసరంగా నెంచలేదు. కారణం, ప్రధమంగా అటువంటి సమస్య చర్చించుటకు పరిస్థితులు పరిపక్వతకు చేరలేదు. ద్వితీయంగా, అట్టి ప్రశ్నలను చేబట్టుటకు చాలా ప్రాథమిక చర్చలను జరిపి పునాది నేర్పరచవలసివుంటుంది. చివరి విషయంగా, కాంగ్రెసేతర ప్రతిపక్షాల సమావేశాలు ఆవిషయాలు చర్చించుటకు వేదికలు కావు, ఎన్నికల సర్దుబాటులను, సంఘటనలను, అవగాహనలపై ఆ సమావేశాలు చర్చించజాలవు.

కాంగ్రసేతర రాష్ట్ర ప్రభుత్వాలు కేంద్రం కల్పించే అనిశ్చిత పరిస్థితులు కారణంగా వొక ఐక్యసంఘటనగా కాంగ్రెసు(ఐ) కు ప్రతిపక్షంగా నిలబడజాలవని కొందరి అభిప్రాయం. అందుకు వుదాహరణంగా వారు "ఎఐఎడియంకె" యీ సమావేశం నుండి నిష్క్రమించుటకు చూపించుచున్నారు. విజయవాడ ప్రతిపక్షాల కన్వెన్షన్ తరువాత "ఎఐఎడియంకె" నిష్క్రమించుట, కలకత్తా సమావేశంలో "డియంకె" చేరుట, మొదటి రెండు సమావేశముల తరువాత బి.జె.పి లోక్‌దళ్‌లు నిష్క్రమించుట, దేశం యెదుర్కొంటున్న ప్రధాన సమస్యలపై, వొక ఆమోద యోగ్యమైన దృక్పదాన్ని చేబట్టి, ప్రతిపక్షాలపై పాలకపార్టీ కాంగ్రెసు (ఐ) చేయుదాడులను త్రిప్పికొట్టి, కాంగ్రెసు వెనకడుగు వేయునట్లు చేయజాలకపోయాయి. ఇది, జాతీయ సమిష్టి సమస్యలపై, ముఖ్యంగా అన్ని పక్షాలు ఆమోదించిన సమస్యలను చేబట్టి, కాంగ్రెసు (ఐ) ప్రభుత్వ విధానాలను, ముఖ్యంగా ప్రజావ్యతిరేక ప్రజాస్వామ్య వ్యతిరేక విధానాలను త్రిప్పి వెనుకకు కొట్టటంలోనే తమ తమ రాష్ట్ర సమస్యలపై కేంద్రం వహించే పక్షపాతవైఖరిని త్రిప్పికొట్టగలమనే అవగాహన వున్నట్లు కనుపించదు. అందువలననే కాంగ్రెసు విధానాలకు ప్రతిఘటన బలమైనదిగా రూపొందుటలేదు. కేంద్ర-రాష్ట్ర సమస్యలను సరిగా రాజకీయ సంలీనంచేసి అందరినీ కదలించే సర్వసాధారణ సమస్యగా చేబట్టి జాతీయోద్యమంగా ఆందోళనోద్యమాలను నిర్మించుటలోనే యిది సాధ్యమౌతుంది. వామపక్షాలు యీ వైఫల్యాన్ని అధిగమించుటలోనే వారి భవిష్యత్ పురోగమనం వుంటుంది. ఈవిధంగానే, పాలక వర్గాల నియంతృత్వవైఖరులకు వారధికట్టగలుతారు.

## 6. సర్కారియా కమిషన్ ప్రశ్నావళికి కమ్యూనిస్టుల సమాధానాలు

కేంద్ర రాష్ట్ర సంబంధాలపై తన అభిప్రాయాలను 3 ఆగస్టు 1983లో వొక పత్రాన్ని దేశంలోని వివిధ వర్గాల ప్రజల, రాజకీయపార్టీల, మేధావివర్గాల చర్చల నిమిత్తం

1. నివేదిక (1984) సి.పి.ఐ(యం) కేంద్రసమితి. ఫిబ్రవరి. 1984 సమావేశంలో ఆమోదించినది. (ఆంగ్లంలో) సి.పి.ఐ(యం) పబ్లికేషన్ పే. 68-69.

సి.పి.ఐ. వెలువరించింది. సర్కారియా కమిషన్ ప్రశ్నావళికి సమాధానాలుగా వాకమెమొరాండంగా సమర్పించింది. ప్రధానాంశాలు సంక్షిప్తంగా యిలా వున్నవి.[1]

1. మన రాజ్యాంగం విస్తృతిలో ఫెడరల్ విధానంగా వుంది, కాని కేంద్రీకరణ ఆధిక్యతా లక్షణాలను కలిగివుంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య అధికారాల పంపకంలో ప్రధానంగా 1935 భారత ప్రభుత్వ చట్టంలోని మౌలికాంశాలను పొందుపరచుకొంది. మన రాజ్యాంగం చట్టంలో అనేక అధికరణాలలో స్పష్టంగా వున్నవి. రాజ్యాంగం 7వ షెడ్యూలులో కేంద్ర యూనియన్ ప్రభుత్వం, చట్టాలు చేయు అధికారాలు ప్రత్యేకంగా జాబితా 1లో పేర్కొనబడినవి. అదేవిధంగా జాబితా2లో రాష్ట్రాల అధికారాలు, జాబితా 3లో కేంద్ర, రాష్ట్రాల ఆమోదించవలసిన చట్టాలు పేర్కొనబడినవి. కేంద్ర, రాష్ట్ర శాసనసభలు తమ పరిధులలో అధికారాలను కలిగియున్నవి. శేష అధికారాలు, పన్నులతో సహా కేంద్ర అధికారంలోనే వుంటవి.

2. రాజ్యాంగం 7వ, షెడ్యూలులోని చట్ట అధికారాలు రాష్ట్రాల స్వయం నిర్ణయం, తదితర అధికారాలు, ఆర్థిక, ద్రవ్య, పాలనాధికారాలు పరిమితులకులోనై వున్నవి. మూడు దశాబ్దాలు పైగా రాజ్యాంగంలోని రాష్ట్రాల స్వపరిపాలన, తదితర అధికారాలు అణచివేయబడి, నీరు గార్చబడి యూనియను ప్రభుత్వంలోనే కేంద్రీకరించబడినవి. రాజ్యాంగంలోని కొన్ని అధికరణలేగాక రాజకీయ, ఆర్థిక, అవాంఛనీయ, దుర్భర అంశాలు అభివృద్ధినిరోధకాంశాలు స్పష్టంగానే వున్నవి. నేడు ప్రముఖంగా కేంద్ర-రాష్ట్ర సంబంధాలలోని అసమానతయే కన్పడుతున్నది. రాష్ట్రాలు తమ స్వయం పరిపాలనాధి కావశాలను అత్యధికంగా కోల్పోయాయి.

3. పెట్టుబడి దారి విధానంలో అభివృద్ధి, గుత్తపెట్టుబడి బూర్జువా అధికారం, కేంద్రంలో రాష్ట్రాలలో ఒకే పార్టీపాలన, రాజ్యాంగంలోని ఫెడరల్ లక్షణాలను నీరుగార్చి, కేంద్రలోనే పాలనాధికారాలన్నిటి కేంద్రీకరించుట జరిగింది.

4. అభివృద్ధి కార్యక్రమాలు చేబట్టవలసిన బాధ్యత రాష్ట్రాలది. కాని వనరులు, ఆదాయం చాలా తక్కువగా వుంటున్నవి. ఈ కారణంగా రాష్ట్రాలు మరింతగా కేంద్రంపై ఆధారపడి యుండుటవలన అభివృద్ధి కార్యక్రమాలు కుంటుపడుతున్నవి. ప్రజాస్వామ్య లక్షణాలు రాష్ట్రం-ప్రజాసంబంధాలు, రాష్ట్రం కేంద్రం సంబంధాలు, జాతీయ ఐక్యత, సమగ్రతలు చెడిపోయి, బేదాభిప్రాయాలు పెరిగిపోతున్నవి. చీలికలు, యేర్పాటు వాద తత్వాలు అభివృద్ధి చెందుటకు మూలకారణాలు అగుతున్నవి.

5. ఫెడరలు వ్యవస్థలో కేంద్రం, భాగస్వామ్య రాష్ట్రాల ఇచ్ఛా పూర్వకంగా యిచ్చే సహకారం నుండే దాని బలం, అధికారాలు వుంటాయి. రాష్ట్రాలు కూడ అని ప్రజాస్వామ్య పునాదులపై బలంగా వుండుటకు, కేంద్ర-రాష్ట్ర సంబంధాలు బలమైనవి, అధికారాలు, వనరులు, తమ కర్తవ్యాలను నిర్వహించుటకు అవకాశాలు గలిగినపుడే తమ బాధ్యతలను

---

1. సి.పి.ఐ స్టాండు ఆన్ మేజర్ ఇస్యూస్ *(1985)* సి.పి.ఐ *60*వ. జయంతి సందర్భంలో కమ్యూనిస్టుపార్టీ పబ్లికేషన్ పె. *143-147.*

ప్రజలు, దేశం యెడల నిర్వహించగలుగుతవి. మనం ఎదుర్కొంటున్న సమస్య కేంద్రంలో అధికారాలు, వనరులు అన్నీ కేంద్రీకరించబడి యుండుటతో రాష్ట్రాలు అభివృద్ధి చేయు బాధ్యతను యేమీలేకుండా జరుగుతున్నది.

6. ఇది ముఖ్యంగా ద్రవ్య, ఆర్థికాభివృద్ధి, రంగాలలో జరుగుతున్నది. జాతీయాభివృద్ధి మౌళికంగా సామాజిక ఆర్థికాభివృద్ధి, పెట్టుబడిదారి పంథాలో, గుత్తపెట్టుబడిదారి వర్గాలు, తదితర స్వార్థపరవర్గాల ప్రభావం నుండి స్వేచ్ఛగాకొనసాగవలసివుంటుందని, పునురుద్ఘాటించవలసి వుంటుంది. ఈ అంశం, బూర్జువా ప్రభుత్వపు ఆర్థికవిధానాల పంథాలలో కేంద్ర, రాష్ట్రాలలో జరుగవలసివున్నందున క్లిష్టతరమైంది. రాష్ట్రాలకు వనరులవిషయంలో కేంద్రం సంక్షోభాలను కలుగజేస్తూ వుండుటతో అది కూడ సంక్షోభపు ఆటు పోటులకు గురి అగుతున్నవి.

7. రాష్ట్రాల వనరులు అపరిమితమైనవి కాక పరిమితమైనవి, అవి వాటి అభివృద్ధిపనులకు, సంక్షేమ పధకాలకు యే మాత్రం సరిపోవు ఫలితంగా న్యాయమైన సమాజ అవసరాలకు యేమాత్రం సరిపోవు. అన్నిరకాల అప్పులు, ఓవరుడ్రాఫ్టులు, అన్ని మార్గాలలో కేంద్రం నుండి పొందే "అడ్వాన్సులు" అవసరాలకు తగినంతగా లేవు.

8. కేంద్ర ప్రభుత్వ అధికారాల పరిధిలోనికి వచ్చే బ్యాంకింగు, ఇన్సూరెన్సు, పబ్లిక్‌ఫైనాన్స్, ఇన్‌స్టిట్యూషన్స్ నుండే వనరుల సమీకరణ, కేంద్ర-రాష్ట్ర సంబంధాలపై ఆధారపడి వుంటుంది.

9. కేంద్ర ఆదాయవనరులైన, యివే ప్రధానమైనవి కూడ, కష్టమ్స్, ఎగుమతి, దిగుమతి సూకాలు, తదితర కార్పొరేటు పన్నులనుండి ఎట్టిభాగమూ, రాష్ట్రాలకు లభించుటలేదు. "కేంద్రసహాయం"; "విచక్షణాగ్రాంటు" రాజ్యాంగ చట్టం ప్రకారం లభించే, గ్యారంటీ సహాయం కాదు. పూర్తి కేంద్రపు యిష్టాల, అయిష్టాలపై ఆదారపడి వుంటుంది. కేంద్రంలో ఒకే పార్టీ కేంద్రీకృతపాలనకారణంగా, ఆ ప్రభుత్వం, ఆ రాజకీయ పార్టీ యిష్టా అయిష్టాలపైనే ఆధారపడి వుండుట శోచనీయము.

10. కేంద్ర ప్రభుత్వంచే నియమించబడిన ఫైనాన్స్ కమీషన్, దాని కూర్పు అదికారాలు, పనివిధానం, రాష్ట్రాల యెడల దాని పాత్రపై ఎన్నో ప్రశ్నలు వచ్చినా, కేంద్ర-రాష్ట్రాల విషయంలో ముఖ్యంగా వనరులు రాష్ట్రాలకు కొంతైనా అందించవలసిన విషయంపై ఆలోచనలో యెట్టి మార్పురాలేదు. రాష్ట్రాలుకు కొంత భాగం యిచ్చే ఆలోచనే రాకపోవుట ఆశ్చర్యాన్ని కలిగించదు.

11. పంచవర్ష ప్రణాళికల సమన్వయం, ప్రణాళిక, ప్రణాళికేతర అభివృద్ధి కార్యక్రమాల సమన్వయం, సమగ్ర అభివృద్ధి పేరుతో పాలనా యంత్రాగం, రాష్ట్ర కేంద్ర సంబంధాలలో అధికారాలను కేంద్రీకరింపజేసుకొన్నది, రాష్ట్రాల అభివృద్ధి కార్యక్రమాలపై కూడ క్రమేణా కేంద్రపు ఆధిక్యత నెలకన్నది. రాష్ట్రాలకు కేటాయించిన జాబితాలోని అంశాలలో కూడ కేంద్రమే నిర్ణయాత్మకపాత్ర వహించసాగింది. కన్సర్వేటివ్ సంస్కరణ

కమిటి యీ విషయం పేర్కొనక తప్పలేదు. ముఖ్యంగా ప్లాను, శాంక్షను అధికారాలు రాష్ట్రాల పరిధిలోనివి కూడ కేంద్రప్లానింగు ఆథారిటి చేతులలోనికి, సమన్వయం పేరుతో, కేంద్రం చేతులలోనికి తీసుకొనబడ్డాయి. ఈవిధంగా రాష్ట్రాల చొరవ, స్థానిక ప్రణాళికలలో కూడ లేకుండా పోయింది. కేంద్ర ప్రభుత్వ బురాక్రటిక్ యంత్రాంగం రాష్ట్రాల అధికారాలను ప్రణాళికల సమన్వయం పేరుతో హరించి వేయుట, సహజవనరులు వున్నచోట్ల కాకుండా, విమానాశ్రయాలు, రవాణా సౌకర్యాల పేరుతో పరిశ్రమలను యేర్పాటు చేయుటతో అసమానాభివృద్ధికి మరింత యెక్కువగునట్లు చేయుటతో రాష్ట్రాల మధ్య అసమానత పెరిగిపోయింది.

12. కేంద్ర ప్రభుత్వంలో అధికారాల కేంద్రీకరణ ఆర్థిక, ద్రవ్యరంగాలలోనేగాక పారిశ్రామిక రంగంలో మరింతగా సాగింది. ప్రత్యేక రాష్ట్రాల పరిధిలో అంశాల విషయంలో కూడ యేదో వొక మిషతో రాష్ట్రాల అధికారాలను, రాజ్యాంగం స్పష్టంగా చెప్పిన వాటిని కూడ కేంద్రం హరించివేయుట, ఇద్దరి ఆమోదం పొందవలసిన జాబితాలోని వాటిని కేంద్రం హరించివేయుట జరిగింది. ఉదాహరణకు అనేక పరిశ్రమలను అన్యాయంగా రాష్ట్రాల పరిధిలోని వాటిని, కేంద్ర ప్రత్యేక అధికారయంత్రాగాల క్రిందికి తీసికొనబడినవి. కేంద్రం విస్తృతాధికారాలను అపరిమితంగా తన కంట్రోలు క్రిందికి అనేక రాష్ట్ర పరిశ్రమలను హరించుట జరిగింది. రాష్ట్రాల పరిధిలో వుండవలసిన అనేక పరిశ్రమలను కేంద్రం తన చేతులలోనికి తీసుకొనుట జరుగుటతో రాష్ట్రాల అభివృద్ధి కుంటుపడింది. ఈవిధంగా రాష్ట్రాల వనరులుతో రాష్ట్రరాజధానుల ప్రాంతాలలో కేంద్రపాలిత ప్రాంతాలు, పరిశ్రమలు, వ్యవస్థలు, రాష్ట్రాల వనరులు కూడ, రాష్ట్రాల అధికారంలో, పాలనాధికారంలో, రాష్ట్రాభివృద్ధికి అందుబాటులో లేకుండా పోయాయి. సామ్రాజ్యవాదులకాలంలో జరిగిన అసమానాభివృద్ధి "వొకవిధమైన వలస అసమానాభివృద్ధి" కేంద్ర విధానాలవలన యేర్పడి, అప్పుడప్పుడు కేంద్రం-రాష్ట్రాల మధ్య సంబంధాలలో ప్రతిబింబించసాగింది.

13. అధికార పార్టీ తన ప్రయోజనాల కొరకు విచక్షణా రహితంగా రాష్ట్రాలలో 356 అధికరణను వినియోగించి రాష్ట్రపతిపాలనను విధించుట, రాష్ట్ర అసెంబ్లీలు ఆమోదించిన కొన్ని బిల్లులకు రాష్ట్రపతి ఆమోద ముద్రలభించినచో చట్టాలుగా అమలులోనికి రాకుండుట, కేంద్రమంత్రివర్గ శిఫార్సులేకుండా, అవి వెలుగులోనికి రాకుండా పడివుండుట, రాష్ట్ర ప్రజల ప్రయోజనాలు త్రోసిబుచ్చి, పాలకపార్టీ ప్రయోజనం ఆధిక్యత వహించుట సాధారణమైపోయింది. కేంద్రంలోని పాలకపార్టీ కాక, రాష్ట్రంలో ప్రతిపక్షపార్టీయో, లేక ప్రాంతీయ స్వతంత్ర పార్టీయో అధికారంలో వున్నపుడు యీ 356 అధికరణను దుర్వినియోగపరచిన ఘటనలు అనేకం వున్నాయి. ఇది ప్రజాస్వామ్యానికి చేటు తెచ్చే విషయంగా గత చరిత్ర రుజువు చేసింది. దేశంలో అనేక రాజకీయ వర్గాలలో, రాజ్యాంగ నిపుణులలో యీ అధికరణ వినియోగానికి ప్రజాస్వామ్య పరిధులు, రాజ్యాంగ చట్టంలో సవరణలుగా చేయవలసిన అవసరముందని అభిప్రాయం ప్రబలంగానే వుంది. మరో విషయం, రాష్ట్ర ప్రభుత్వపాలనలో పనిచేసే అఖిలభారత

ఉద్యోగ శ్రేణులు. రాజ్యాంగ చట్టం 18వ భాగం క్రింద అనేక అత్యవసర అధికారాలను నేరుగా కలిగివుండి, రాష్ట్రాల ప్రభుత్వాల స్వపరిపాలనాధికారాలను, ఫెడరలుసూత్రాలను నీరుగార్చే అవకాశాలను ఇటీవలి 50 సంవత్సరాల చరిత్ర బహిర్గతం చేసింది.

14. రాజకీయ పరిస్థితులలో గణనీయమైన మార్పు, అనేక కాంగ్రెసేతర రాష్ట్ర ప్రభుత్వాలు యేర్పడుట, వారిహక్కులు, అవసరాలు వివిధ ఆటవికతెగలు ఉపజాతులలో సత్వరాభివృద్ధి విషయాలపై పెరిగిన ప్రజాచైతన్యం, నేడు కేంద్రం-రాష్ట్రాల సంబంధాలలో పెరిగిన అసమానత, కొన్ని వర్గాలు వారి ప్రయోజనాలకు, వారిని దోపిడిచేయుటకు విచ్ఛిన్నకర, వేర్పాటు శక్తులు పెరుగుటకు వినియోగించబడుట, కేంద్ర-రాష్ట్ర సంబంధాలు నూతనంగా రాజ్యాంగం పునర్నిర్మించబడాలనే ప్రజాస్వామ్య కోరికశక్తివంతంగా అభివృద్ధి చెందింది.

కేంద్ర-రాష్ట్ర సంబంధాలు పునర్నిర్మాణంతో విస్తృత చట్ట నిర్మాణాధికారాలు, ఆర్థికవనరులు రాష్ట్రాల పెరిగే అవసరాలకు తగిన విధంగా కేటాయింపులు విస్తృత అభివృద్ధితో ప్రజాజీవన పరిస్థితులు మెరుగు అగుటయేగాక దేశ ఐక్యత, సమగ్రతలకు బలంచేకూరుతుందని, విచ్ఛిన్నకర యేర్పాటు వాద శక్తులు ప్రజలలో బలాన్ని కోల్పోయి నిర్వీర్యమై, దేశ ప్రయోజనాలు కాపాడగలవని వివిధ కమ్యూనిస్టులు విశ్వసించుతున్నారు. దేశంలో ప్రజాస్వామ్యం బలపడుటకు యిది యెంతో తోడ్పడుతుంది. అసమానాభివృద్ధి తొలగుటకు కొంతవరకు అవకాశాలు యేర్పడి దేశం 21శతాబ్దంలో బలమైన శక్తిగా ఆవిర్భవిస్తుంది.

కేంద్రానికి రక్షణ, విదేశాంగవ్యవహారాలు, సమాచార-రవాణా, కరెన్సీ-నాణాల ముద్రణాధికారాలు మాత్రమే వుండాలనే కొందరి వాదనలు వ్యతిరేకించుతు, సమగ్ర ఆర్థికాభివృద్ధికి, సమిష్టి ఆర్థికవిధానాన్ని బలోపేతం చేయుటకు వెనుకబడిన ప్రాంతాలు-రాష్ట్రాలను అభివృద్ధి చేయుటకు అవసరమైన అన్ని అధికారాలుండాలని కమ్యూనిస్టులు కోరుతున్నారు.

## 7. మండల కమీషన్

పాలకపార్టీ కాంగ్రెస్ గతకొన్ని దశాబ్దాలుగా సాంప్రదాయంగా వస్తున్న కులతత్వ మహమ్మారిని రూపుమాపుటకు ఏవిధమైన సంస్కరణలు తీసికొని రాలేదు. అదేవిధంగా షెడ్యూల్డు కులాలు, తెగలకు సమాజంలో అట్టడుగునవున్న తదితర అనేక వెనుకబడినకులాల అభివృద్ధిలో ఎట్టిపురోగతి కన్పించలేదు. రాజ్యాంగంలో వారి అభివృద్ధికి యిచ్చిన గ్యారంటీలు ఎట్టి ఆచరణ రూపాన్ని సంతరించుకొనలేదు. దారిద్ర్యరేఖకు అట్టడుగున యింకా మానవ కనీస అవసరాలు కరువై నానాబాధలు పడుతున్నారు. అవకాశవాద రాజకీయవాదులు అనేకమంది, అధికార పార్టీ కాంగ్రెసుతోపాటు, వారి వ్యక్తిగత ముఠా, శాఖల ప్రయోజనాలకై అప్పుడప్పుడు బూర్జువా పాలక పార్టీలపై పోరాటాలు జరుపుతూ, రాజీలతో అధికార పదవులకు ఎగబ్రాకే

ప్రయత్నాలు సంప్రదాయకంగా చాలా కాలంనుండి జరుగుతూనేవున్నవి. ఉద్యోగాలలో తగినంత ప్రాతినిధ్యం లేని వెనుకబడిన వర్గాలవారికి రిజర్వేషన్లు చేయవచ్చని రాజ్యాంగంలో స్పష్టంగానే వున్నది. దానిప్రకారం షెడ్యూల్డు కులాలకు, తెగలకు రిజర్వేషన్ల క్రింద ఎంతోకాలంగా వుద్యోగాలు ఇస్తూనే వున్నారు. ఇప్పటికీ ప్రశ్న ఇదే. రాయితీలను ఇతర వెనకబడిన వర్గాలకు విస్తరింపజేయుట.

మొట్టమొదటి వెనకబడిన తరగతుల కమిషన్ 29 జనవరి 1953లో ఏర్పరచబడగా అది 31 మార్చి 1955న నివేదికను సమర్పించింది. కమిషన్ తాను రూపొందించుకొనని కుల మతాలతో 2399 కులాలు సామాజికంగా, విద్యలో వెనుకబడిన వారుగా పట్టికలో పేర్కొనబడ్డారు. నివేదిక వారికి ఉద్యోగాలు, విద్యలలో రిజర్వేషన్ చేయాలని సిఫారసు చేసింది. కాని కేంద్రప్రభుత్వం ఆమోదించలేదు. కమిషనర్లు చేయాలని సిఫారసు చేసింది. కాని కేంద్రప్రభుత్వం ఆమోదించలేదు. కమిషన్ సభ్యులలోని 11 మందిలో 5గురు భిన్నాభిప్రాయాల నోట్‌ను సమర్పించారు. కమిషన్‌ను జనాభాలో అత్యధిక భాగానికి రిజర్వేషన్లు సిఫారసు చేయుట, కులాన్ని అందుకు ప్రాతిపదిక చేయుటకు ఆమోదించుట, ఆర్థిక ప్రాతిపదికను ముందుకు తెచ్చి ప్రభుత్వం అడ్డుపడింది. రాజ్యాంగ చట్టంలోని 340 అధికరణము సామాజికంగా చదువులలో వెనకబడిన వారిని గుర్తించుటకు ఆర్థిక ప్రాతిపదికను అనుసరించాలని ప్రభుత్వం అభిప్రాయపడింది. రాష్ట్రప్రభుత్వాలు దగ్గర దగ్గిరగా 100 సంవత్సరాలనుండి అణచివేయబడిన వెనకబడిన వర్గాలకై ప్రత్యేక అభివృద్ధి కార్యక్రమాలను చేబట్టుతూనే ఉంది. మద్రాసు రాష్ట్రప్రభుత్వం 1885లోనే విద్యాలయాలకు, వెనకబడిన తరగతుల విద్యార్థులకు సహాయ నిధుల ఏర్పాటును క్రమబద్ధం చేసింది. అదే విధానాన్ని తదుపరి మైసూరు ప్రభుత్వం క్రమంగా దక్షిణాది రాష్ట్రాలన్నీ అమలు చేశాయి. తదనంతరం వెనుకబడిన జాతులు, వర్గాలకు 1980 దశకానికి 16 రాష్ట్రాలు, 2 కేంద్రపాలిత ప్రాంతాలు ప్రత్యేక సహాయాన్ని తదితర వెనుకబడిన వారికి అందచేస్తున్నవి. ఇందునిమిత్తం రాష్ట్రాలు ఏర్పాటు చేసిన వెనుకబడిన తరగతుల కమిషన్‌ల సిఫారసులను అమలు చేస్తున్నవి. ఇవన్నీ తాత్కాలిక ఏర్పాట్లుగానే వుంటున్నవి.

ప్రత్యేక రాయితీలు ప్రభుత్వ ఉద్యోగాలలో, విద్యాలయాలలో సీట్లు రిజర్వేషను పనులు తదితర వెనుకబడిన వర్గాలకే విద్యాలయాలకు ద్రవ్య సబ్సిడీలు అనేక రాష్ట్రాలు యిస్తున్నవి. దక్షిణాది రాష్ట్రాలు యితర రాష్ట్రాలతో పోల్చితే "తదితర వెనుకబడిన తరగతులకు" అనేక చర్యలు చేబట్టాయి. కర్నాటక రాష్ట్రం షెడ్యూల్డు కులాలకు, తెగలకు యిచ్చిన 18% రిజర్వేషను కాక, తదితర వెనుకబడిన వర్గాలకు అదనంగా 48% రిజర్వేషనులను ప్రభుత్వ ఉద్యోగాలు, విద్యాలయాలలో సీట్లును కలుగజేసింది. తమిళనాడు యస్.సి., యస్.టిలకు చేసిన 18శతానికి అదనంగా ఓ.బి.సీలకు 50% స్థానాలను రిజర్వు చేసింది.

వెనుకబడిన వర్గాల రిజర్వేషనులు జాతీయ సమస్యగా అగుటతో కేంద్ర ప్రభుత్వం 1978లో మండల్ కమీషన్‌ను నియమించి, తదితర వెనుకబడిన వర్గాల సమస్యను పరిశీలించకోరింది. కమీషన్ 1980లో నివేదికను, ఉద్యోగాలలో ఓ.బి.సిలకు

రిజర్వేషనులను సిఫార్సులను సమర్పించింది. దేశంలో అనేక ఉద్రేక ఘటనలకు, ఉద్యమాలకు, వ్యతిరేక వుద్యమాలకు, ఆత్మత్యాగాలకు దారి తీసి అత్యంత వివాదాంశంగా, తాత్కాలికంగా అయింది. ప్రశాంతంగా ఆలోచించిన మొత్తం మీద కొన్ని రంగాలలో సామాజిక న్యాయం చేకూర్చే ప్రయత్నంగా నెంచవచ్చు వివరాలలోని వివాదాంశాలను సమగ్ర పరిశీలను సంప్రదింపుల ద్వారా పరిష్కరించుట అసాధ్యం కాదు. ముఖ్యాంశాలు యిలా వున్నవి.

కేంద్ర ప్రభుత్వోద్యోగాలలో జనాభాలో 52శాతంగా వున్న తదితర వెనుకబడినవారు, ఒ.బి.సీలు 13శాతం, క్లాస్ 1 ఉన్నత ఉద్యోగాలలో 5శాతం ఉన్నారని పేర్కొని, 27శాతం ఉద్యోగాలు రిజర్వేషను చేయబడాలని సిఫార్సు చేసింది. ఒ.బి.సీలలోని పైవర్గాలలో కొన్ని ప్రాంతాలలో భూస్వాములు వుండవచ్చు, వాటి విశేషాంశాలుగా పరిగణించాలి. కాలక్రమంలో ఒ.బి.సిలలో ఆర్థిక, సామాజిక ఉన్నతి పొందుటతో సమాజంలోని ఉన్నతవర్గాలలోనికి చేరుట జరుగుతుంది. కాన ఒ.బి.సీలలో కూడ విభజన వర్గీకరణ దానిలోని రిజర్వేషనులు విడివిడిగా పేర్కొనవలసిన అవసరమేర్పడుతుంది. అనగా ఆర్థిక అంశాన్ని కూడ వర్గీకరణ ప్రాతిపదిక, సామాజికాభివృద్ధి అంశాలతోపాటు చేర్చు అవసరం భవిష్యత్తులో కలుగవచ్చు.

కొంతమంది ప్రభుత్వ సర్వీసులలో యీ రిజర్వేషను విధానము కార్యాచరణలో అసమర్థతను పెంచుతున్నదనే మిషతో తీవ్ర ఆందోళనతో వ్యతిరేకించుతున్నారు. దక్షిణాది రాష్ట్రాలలో ఒ.బి.సీలకు ప్రభుత్వోద్యోగాలు, విద్యాలయాలలో సీట్లు రిజర్వేషనుల విధానము చాలాకాలం క్రిందటనే అమలుచేయుట జరిగింది. దక్షిణాది రాష్ట్రాల ప్రభుత్వ సర్వీసుల కార్యకలాపాలు, ఉత్తరాధి రాష్ట్రాల ప్రభుత్వ సర్వీసులలో కంటె తక్కువపాలనా సమర్థతను కలిగివున్నవని చెప్పగలమా? వాస్తవంగా ఉత్తరాది రాష్ట్రాల పాలనా సామర్థ్యం కంటె దక్షిణాది రాష్ట్రాల ప్రభుత్వపాలనా సామర్థ్యం మిన్నగా వుంది.

## 8. రిజర్వేషన్ల విషయంలో పరిగణించవలసిన కొన్ని ముఖ్యాంశాలు

కులం ప్రాతిపదికగా ప్రభుత్వ, ప్రవేటు, పబ్లిక్ రంగాలలో ఉద్యోగాలలో రిజర్వేషను సమస్యను పరిశీలించునపుడు వామపక్ష, ప్రజాస్వామ్యశక్తులు పరిగణలోనికి తీసుకొనవలసిన కొన్ని ముఖ్యాంశాలను తెలుసుకుందాము.

1. భారత రాజ్యాంగ చట్టం కులం, తెగ, మతం, స్త్రీ, పురుషభేదం, విచక్షణ లేకుండా పౌరులందరికి సమానత్వసూత్రాన్ని, అమలును ప్రకటించింది. అయినా కొన్ని కులాలు తరతరాలుగా విచక్షణకు, సామాజిక అణచివేతకు గురై, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, రాజకీయరంగాలలో చాలా వెనుకబడి యున్నందున, సమానత్వప్రాతిపదికపై ప్రభుత్వోద్యోగాలలో ప్రవేశం అసాధ్యమైంది. ఫలితంగా, ప్రభుత్వపాలనలో భాగస్వాములు కాలేక పోయారు. నేడు కూడ షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తెగలకు సంబంధించినంతవరకు యిదే కొనసాగుతున్నది. పరిపాలనపై

ప్రతికుల, మతస్థులకు విశ్వాసం పెంపొందించుటకై రాజ్యాంగ నిర్మాతలు ప్రభుత్వోద్యోగాలలో షెడ్యూలు కులాలు, తెగలకు రిజర్వేషనులు కల్పించారు. గతంలో అగ్రవర్ణాలకే ప్రధానంగా పరిమితమైన పాలనా యంత్రాంగంలో అణచివేయబడిన వర్ణాలకు సామాజిక సమానత్వం, భాగస్వామ్యం రిజర్వేషనుల ద్వారా కలుగజేయు లక్ష్యం నిర్దేశించబడింది.

2. రాజ్యాంగ చట్ట నిర్మాతలు షెడ్యూల్డు కులాలు, తెగలునేకాక తదితర వెనుకబడిన కులాల సమస్యలు పరిగణలోనికి తీసుకొన్నారు. రాజ్యాంగ చట్టంలో తదితర వెనుకబడిన కులాల వారికి రిజర్వేషనులు కలుగచేయకపోయినా, రాష్ట్రపతికి ఆసమస్యలను పరిశీలించుటకు కమీషన్‌ను యేర్పాటు చేయుటకు అధికారాల నిచ్చింది. ఆ విధంగానే 1953లో కాకా కలేక్కర్ కమీషన్ యేర్పాటు చేయగా, అది ప్రభుత్వసర్వీసులలో తదితర వెనుకబడిన కులాలవారికి తగుప్రాతినిధ్యం లేదని, కొంతశాతం వారికి రిజర్వేషనులు కల్పించాలని సిఫార్సు చేసింది. ఏలక్ష్యం, కారణాలకై షెడ్యూల్డు కులాలు, తెగలకు రిజర్వేషనులు కల్పించారో అలాగే వెనుకబడిన కులాలకు రిజర్వేషనులు కల్పించారు. నెహ్రూ 2 డిశెంబరు 1954న పార్లమెంటులో "ఇది చాల ప్రమాదకరవైఖరి, ప్రత్యేకంగా కులతత్వంపై నొక్కి చెప్పదలచుకొన్నాను. కులతత్వాన్ని నిరశించుతు కులాల గురించి మాట్లాడుతాము. ఆరు లేక పదికులాలు, అగ్రకులాలు అనబడేవి, హిందువులను, భారతదేశంపై పెత్తనం చేస్తున్నవి. అనేది వాస్తవం, ఎట్టి సందేహం లేదు. మనం సమానత్వాన్ని సాధించలేకపోతే, నిస్సందేహంగా అత్యంత ప్రమాదకరస్థాయికి కులతత్వం ఎదుగుతుంది." అని భారత భవిష్యద్వాణిగా ప్రవచించారు.

3. ఈ విధంగా కులాల ప్రాతిపధికపైగల అసమానత్వాన్ని అధిగమించుటకు ఉద్యోగాలలో రిజర్వేషను విధానం ఆమోదించబడింది. రాజ్యాంగంలో షెడ్యూలు కులాలు, తెగలకు, కాకాకలేల్కర్ కమిషన్ తదితర కులాలకు యేర్పాటు చేసిన రిజర్వేషను విధానం ఆచరణలో అమలు జరుగలేదు. పాలకపార్టీపై అగ్రవర్ణాల ఆధిక్యత ప్రబలంగా వుండుట, నిరంకుశ ప్రభుత్వ యంత్రాంగంపై గూడ వారి ఆధిక్యతయే కారణంగా చెప్పవచ్చును. క్రింది కులాలలో విద్యావంతులు పెరిగిన కొలది, యీ వివక్షణ యెడల సహజంగానే ద్వేషభావం అవిశ్వాసం పెరిగింది.

4. ఆర్థికవర్గీకరణ షెడ్యూల్డు తెగలలో నామమాత్రమే జరిగింది. ఒక్క పెట్టుబడి దారుడుగాని, పెద్ద భూస్వామిగాని పెద్ద వ్యాపారిగాని అభివృద్ధి చెందినట్లు సాధారణంగా కనుపించదు. నామమాత్రంగా మధ్యతరగతి మేధావివర్గం రూపొందింది. దీనికి భిన్నంగా షెడ్యూలు కులాలలో మధ్యంతర గతిమేధావివర్గం అనేక రాష్ట్రాలలో, వారిలో ఆధిక్యత గల కులాల నుండి అభివృద్ధి చెందింది. అయినా, వారిలో పరిగణన లోనికి తీసుకొనదగిన బూర్జువావర్గం అభివృద్ధి చెందలేదు.

కాని, తదితర వెనుకబడిన కులాలలో బూర్జువావర్గాలు రూపొందుట జరిగింది. వ్యవసాయంలో పెట్టుబడిదారి విధానం, ధాన్యం తదితర వ్యాపారం అభివృద్ధి

చెందుటతో, బలమైన పెట్టుబడిదారులు గ్రామసీమలలో రూపొందారు. శ్రామిక దోపిడి వర్గాలు వెనుకబడిన కులాలలో అభివృద్ధిచెంది, సాంఘిక అణచివేతను నిరాటంకంగా సాగిస్తున్నారు. క్రిందికులాలపై యీ సామాజిక అణచివేత, హరిజనులపై దౌర్జన్యాలు యెక్కువయ్యాయి.

గ్రామీణ ప్రాంతాలలో యీ నూతన బూర్జువావర్గశక్తులు, ఉద్యోగాలలో రిజర్వేషను లను పెద్దసమస్యగాచేసి తమ ప్రయోజనాలను కాపాడుకొనుటకు కులతత్వాలను, ద్వేషాలను రెచ్చగొట్టుతు ప్రజాశక్తులలో చీలికలు తెచ్చి, అనైక్యతను పెంపొందిస్తున్నారు. గ్రామీణ బూర్జువా, భూస్వామ్యవ్యతిరేక వర్గ పోరాటశక్తులలో కులతత్వాలతో సమిష్టివర్గ పోరాటాన్ని నీరు గార్చుతున్నారు. ఫలితంగా గ్రామీణవర్గ పోరాటం బలహీనపడింది.

అగ్రవర్ణాల కులతత్వం వెనుకబడిన కులాల కులతత్వం రెండూ గ్రామీణ ప్రజాసామాన్యాన్ని కులాల ప్రాతిపధికపై చీలికలను తెచ్చి, ద్వేషాలు పెంచి, పోషించుటతో గ్రామీణ వర్గపోరాటాల ఐక్యత భగ్నమై, కులపోరాటాల హింసాకాండ ప్రబలుట బీహారులో స్పష్టంగా చూడగలము.

5. నానాటికి పెరిగిపోతున్న నిరుద్యోగం రిజర్వేషను సమస్యను మరింత క్లిష్టం చేసింది. ఉద్యోగాలు చాల కొద్దిగా వున్నపుడు రిజర్వేషను నిరుద్యోగులను ఉద్రేకాలకు గురి అగునట్లు చేస్తుంది. షెడ్యూలు కులాలు, తెగలు; తదితర వెనుకబడిన కులాలు విచక్షణకు వారిలో వారు గురి అగుటయేగాక, నిరుద్యోగ మహమ్మరికి అందరు గురి అగుతారు. ఒకరికొకరు ఎక్కువశాతం తమకు రిజర్వుచేయాలనే ఉద్రేకాలకులోనై కులఉద్యమాలకు ఎర అగుతారు. అసలు సమస్య నిరుద్యోగాన్ని నిర్మూలించాలని అందరికి వుద్యోగాలు అనే నినాదం చేబట్టక తమ తమ కులాలకు అధికశాతం ఉద్యోగాలు అనే కులతత్వ ఉద్యమాలను రెచ్చగొట్టే కొన్ని శక్తుల ప్రయోజనాలకు సమిధలు అగుతారు. ఇదే మననం చేసుకొనవలసిన మరువరాని విషయం అందుకే నిరుద్యోలందరూ సంఘటితమై "అందరికీ ఉద్యోగాలు" అనే నినాదాన్ని చేబట్టి శక్తివంతమైన వుద్యమాన్ని నిర్మించి, సాధించాలి.

6. ఉద్యోగ రిజర్వేషనులు కార్మికవర్గంలో తీవ్ర అనైక్యత, విచ్ఛిన్నతను సృష్టించింది. పారిశ్రామిక, వ్యాపార సంస్థలకు ఉద్యోగాల రిజర్వేషన్ విస్తరించబడింది, ముఖ్యంగా పబ్లిక్ రంగమునకు కూడ, కులప్రాతిపధికపై కార్మికవర్గాన్ని చీల్చి వేసింది. ఈ సమస్యను విస్తృతవిద్యాధికులు నిరుద్యోగం, కార్మికవర్గం చీలికను మరింతగా తీవ్రతరం చేసింది. ఉద్యోగులలో ప్రమోషనులకు కూడ రిజర్వేషనుల విధానాన్ని విస్తరించుట సమస్యను మరింత క్లిష్టతరం చేసింది. ఉన్నత పదవులలో షెడ్యూలు కులాలు, తెగలుకు తగినంత ప్రాతినిధ్యం లేదనుట వాస్తవం. ప్రాతినిధ్యం ఉన్నవర్గాలలో ఉద్యోగులలో కులవిచక్షణ ఉన్న పదవులకు వారి ప్రమోషనులలో చాల యెక్కువగా వుంది. ప్రమోషనులలో రిజర్వేషను షెడ్యూలు కులాలు, తెగలవారు సీనియరులైన అన్ని అర్హతలు కలిగిన ఉన్నత కులాలవారిపై ఆఫీసరులగుట అతి సంక్లిష్ట పరిస్థితుల, సమస్యల అధికంగా చేస్తుంది.

వివిద ట్రేడుయూనియనులు యాజమాన్యంతో వారి పిల్లలకే రాయితీగా వుద్యోగాలను యిచ్చునట్లు వొప్పందాలు చేసుకొన్నవి. ఇది కొంతవరకు రిజర్వేషనులకు వ్యతిరేకంగా వుండుటవలన పారిశ్రామిక అశాంతి ప్రబలుతున్నది. షెడ్యూలు కులాల, తెగల ప్రత్యేక ట్రేడు యూనియనులు కూడ యేర్పడుటతో కార్మికవర్గ ఐక్యత విచ్ఛిన్నమగుటకు అవకాశాలు ఎక్కువగుతున్నవి. ఒకప్పుడు ప్రతి అఖిలభారత రాజకీయపార్టీయేవిధంగా తమ తమ ఆధ్వర్యంలో ట్రేడుయూనియనులను యెలా యేర్పాటు చేసాయో, చివరకు కార్మికవర్గ పార్టీలని చెప్పు కొనే కమ్యూనిస్టు పార్టీలు కూడ 1970దశకంలో యెలా, యేర్పాటు చేసాయో అదేవిధంగా కులాలవారిగా యేర్పాటు చేయ ప్రయత్నించుట భారతకార్మికవర్గానికి అన్ని కులాలలోని బూర్జువావర్గ అప్రభావాలకులోనైన స్వార్థపరవర్గాలు చేసిన ద్రోహం, పరోక్షంగా బూర్జువా, భూస్వామ్యవర్గాలకు, ప్రభుత్వాలకు చేస్తున్నసేవగా గుర్తించాలి.

7. వామపక్షాలు, ప్రజాస్వామ్యవాదులుపై మౌలిక అవగాహనలతో పాటు, మండల్ కమీషన్ సిఫార్సులు అనుసరించి, వెనుకబడిన వర్గాలకు ఉద్యోగాలలో రిజర్వేషనులు చేయుటకు తగిన సూత్రాలను రూపొందించాలని కోరాలి, బలపరచాలి. వెనుకబడిన కులాల రిజర్వేషనులుకు, నిర్దిష్ట ఆదాయ సీలింగు రు. 15,000లు సంవత్సరమునకు, కేంద్ర సర్వీసులలో పరిమితి సిఫార్సు చేసిన విధంగా ప్రతిరాష్ట్రం అట్టి ఆదాయ సీలింగును విధించాలి. కమీషన్ సూచించిన విద్యాలయాలలో రాయితీలు, ద్రవ్య సహాయం పరిశీలించి అమలు చేయాలి.

8. మండల్ కమీషన్ సిఫార్సుల ననుసరించి వివిధ రాష్ట్రాలలో వెనుకబడిన కులాలకు ఉద్యోగాలలో రిజర్వేషనులు సూత్రాలను రూపొందించాలని వామపక్షాలు ఆందోళన చేయాలి, అగ్రవర్ణాలవారికి నచ్చచెప్పే ప్రయత్నం చేయాలి. కమీషన్ వెనుకబడిన తరగతులకు రిజర్వేషనుల కాలపరిమితిని సిఫార్సు చేసియుండిన చోట్ల పునర్విచారించి, తగురీతిని వ్యవహరించాలి.

9. ఉద్యోగాలలో షెడ్యూలు కులాలు, తెగలకు అనుసరించిన రిజర్వేషను సూత్రాలనే ఉన్నత సాంకేతిక విద్యాలయాలలో విద్యార్థులకు సీట్లు కేటాయింపులో అనుసరించాలి. వెనుకబడిన యితర కులాల విషయంలో కూడ అదే విధానాన్ని అనుసరించాలి.

10. రిజర్వేషనుల సమస్యను సామాజిక న్యాయం, దేశ ఐక్యతా, సమగ్రతల అవగాహనల దృష్టిలో ఆలోచించాలి. బలపరచాలి

## లి. పంజాబ్ సమస్య

పంజాబ్, అస్సాం, మణిపూర్ సమస్యలు రాజకీయ రంగాన్ని విషపూరితం చేశాయి. దేశ ఐక్యతకు, సమగ్రతకు తీవ్ర ఆందోళనను కలిగించుటయేకాక, ముప్పును తెచ్చిపెట్టాయి. పంజాబ్‌లో చెలరేగిన మంటలను సామ్రాజ్యవాదులు, పాకిస్తాన్ సైనిక ప్రభుత్వం ప్రజ్వలింపజేశాయి. "ఖలిస్తాన్ హింసావాదుల"కు శిక్షణ, ఆయుధాలు,

అందదండలు అందజేశారు. సామ్రాజ్యవాదులు "విదేశ జాతీయుల" సమస్యపై చెలరేగిన ఆందోళనను వినియోగించుకొంటూ, అస్సాంలో కల్లోల పరిస్థితులను ప్రోత్సహించి, స్వప్రయోజనాలకు వినియోగించుకొంటున్నారు. మణిపూర్‌లో సాయుధ తిరుగుబాటును అణచివేయుటకు అను పేరుతో స్వార్థప్రయోజనాలకు పెంపొందించు కొనుటకు అన్నిరకాల పౌరహక్కులు, ప్రజాతంత్ర హక్కులు నేలరాచి, "సాయుధ దళాల ప్రత్యేకాధికార చట్టం" చండశాసనాల ద్వారా ప్రజలను కష్టాలపాలు చేశారు.

పాలక కాంగ్రెసు పార్టీ 1956 నుండి పంజాబ్ మాతృభాష మాట్లాడే ప్రాంతానికి ప్రత్యేక రాష్ట్ర నిర్మాణాన్ని వాయిదాల ఎత్తుగడలతో వ్యతిరేకిస్తూనే వచ్చింది. ఆయా రాష్ట్రాలలోని హిందువులను వారి మాతృభాష పంజాబీ కాదని, జనాభా లెక్కలలో డిక్లేరు చేయునట్లు చేసింది. ఆ విధంగా హిందువులు, శిక్కుల మధ్య విద్వేషాలను సృష్టించింది. ఈ విధంగా పంజాబీ రాష్ట్రం యేర్పాటు పోరాటచొరవను అకాలీదళ్ నాయకత్వాలకు అర్పించింది. తారాసింగ్ నాయకత్వంలో అకాలీదళ్ "శిక్కులకు, పంజాబీ భాషను మాట్లాడేవారికి ప్రత్యేక రాష్ట్రం" నినాదంతో మత, విచ్ఛిన్నకర శక్తుల నాయకత్వంలో సమీకరించబడునట్లు చేసింది. నాటినుండి రాజకీయ సమస్యను, శిక్కు మతసమస్యలతో మిళితం చేసింది. ఆ విధంగా సమస్యకు విచ్ఛిన్నకర, మత నైజాన్ని చేకూర్చింది. ఇదంతా పాలక పార్టీ కుటిల రాజనీతికి పరాకాష్ట అయింది. హిందూ-శిక్కు మత సంస్థల సంఘర్షణలను రెచ్చగొట్టి, భాషాప్రయుక్త రాష్ట్రాల యేర్పాటు విధానానికి స్వస్తిచెప్పింది.

ఈ విధంగా పంజాబీ మాతృభాష మాట్లాడు వారికి ప్రత్యేక రాష్ట్రాన్ని 1966లో రాష్ట్రాల పునర్నిర్మాణ కమీషన్ యేర్పడువరకు, తదుపరి 17-18 సంవత్సరాలు రాష్ట్ర రాజధాని చండీఘర్ విషయం తేల్చకుండా, సమస్యను జఠిలం చేయుటకు నదీజలాల వాటా వివాదాంశాలను పరిష్కరించకుండా, చండీఘర్ రాజధాని యేరాష్ట్రానికి చెందాలో తేల్చకుండా, అవి హిందూ-శిక్కుల వివాదాంశాలుగా రూపొందించింది. హిందూ-శిక్కుల ఐక్యతను, జాతీయ ఐక్యతా సమస్యలుగా, రాజకీయ ప్రాముఖ్యతాం దృష్టితో పరిష్కరించజాలకపోయింది. ఆ విధంగా రాష్ట్రపతిపాలనను ఏర్పాటు గావించి, శాంతినిగాని, చండీగర్ రాజధాని నగర సమస్యనుగాని పరిష్కరించజాలక పోయింది.

అమెరికా సామ్రాజ్యవాదులు, పాకిస్తానీయులు, మనదేశంలో ఏర్పాటువుద్యమాలను చేబట్టిన శిక్కులకు, కాశ్మీరీయులకు, అస్సాం, నాగాలాండులలో వివిధ తెగలకు అన్నివిధానాల, ఆయుధాలతో సహాయాన్ని మద్దతుయిచ్చుట మన ప్రభుత్వానికి తెలిసిన విషయము .అమెరికా, సి.ఐ.ఎ.లు శిక్కు దౌర్జన్య, హింసావాదులకు ఆయుధాలు, శిక్షణ ఇచ్చుట కూడ తెలిసిన విషయం చండీఘర్‌నగర్ పంజాబ్, హర్యానాలలో ఎవరికి చెందాలో, ఇచ్ఛాపూర్వకంగా తేల్చకుండా, నిర్ణయాన్ని వాయిదావేయుట బాధ్యతారహిత రాజకీయ చర్యనెంచాలి. ఆవిధంగా హిందూ-శిక్కు సంఘర్షణలకు శాశ్వత పునాదులు వేసి, సమస్యను తీవ్రతరం చేసిందని చెప్పాలి. పాలకపార్టీ కాంగ్రెసు పార్టీ

ప్రయోజనాలనుద్దేశించి, మత సంఘర్షణలకు పరోక్షంగా ప్రోత్సహించునవిగా ఉన్న వనుటలో సందేహంలేదు.

"మతసంత్" వేషంలో బింద్రన్‌వాలా నాయకత్వంలోని హింసాదౌర్జన్యాలు సాగించే ముఠాలు పంజాబ్‌లో "హింసావాదాన్ని" చేబట్టి పోషించారు. దేశప్రజలందరికి యిది తెలుసు. భారత ప్రభుత్వదేశయాంగ మంత్రి త్వశాఖకు యిది తెలియదని అనుకొనము. అకాలీనాయకత్వం "శిక్కుజాతి" సిద్ధాంతాన్ని, రాజకీయాలను మతాలతో సంలీనం చేయుట, మత సంఘర్షణలను రెచ్చగొట్టు చర్యలుగా నెంచాలి[1].

పోటీ అకాలీగ్రూపులు విపరీతంగా మతచాంధస భావాలను, ఉద్రేకాలను రెచ్చగొడు తున్నారు. "సిక్కులు ఒక జాతి" అన్న సిద్ధాంతాన్ని ప్రచారం చేస్తున్నారు. రాష్ట్రంలోని రెండు ప్రధాన కాంగ్రెసు (ఐ) గ్రూపులు తమ ముఠాకీచులాటలో అకాలీదళ్‌లోని ఏదో ఒక భాగాన్ని వాడు కొంటూవున్నవి. వాస్తవానికి బింద్రన్ వాల్‌కాంగ్రెస్ (ఐ) సృష్టియే. అదే సమయంలో బి.జె.పి., ఆర్.యస్.యస్.ల నాయకత్వాన హిందూ మతతత్వశక్తులు, హిందూ జాతీయ దురహంకార శక్తులు తమ కార్యకలాపాలను ఉధృతం చేసారు.

పరిస్థితి 1984 మధ్య ప్రాంతానికి అందోళనకరమైంది. స్వర్ణదేవాలయము నుండి, మతదురహంకార విద్రోహులను, హింసావాదులను సైనికచర్య "బ్లూస్టార్" అమలు చేసి గెంటివేసారు. రెండు వైపులా మరణాలు గణనీయంగానే సంభవించాయి. "ఆపరేషన్‌బ్లూస్టార్" సైనికచర్య విచారకరమే అయినా అవసరమూ, అనివార్యమూ అయిందని[2] సి.పి.ఐ. కేంద్రకార్యవర్గం తన ప్రకటనలోనే స్పష్టం చేసింది.

"ఈ విషాదకర పరిణామలకు ప్రధాన భాధ్యత బింద్రన్‌వాలే, అతని అనుచరుల నందరిదని 1984 జులైలో జరిగిన సమావేశంలో పార్టీ కేంద్ర కార్యవర్గం తెలిపింది. అమాయకులను హత్యచేయుటకు, విద్రోహకార్యకలాపాలకు, పంజాబులలో అరాచకంవ్యాప్తి చేయుటకు, "ఖలిస్తాన్" అనబడే దానికి మార్గం వేయుటకు, వారుస్వర్ణ దేవాలయాన్ని ఒక దుర్గంగా మార్చుకున్నారని, కేంద్ర కార్యవర్గం హెచ్చరించింది. అంతేగాక, అకాలీదళ్, బింద్రన్‌వాలే వర్గాలనుండి రాజకీయ విధానలను స్పష్టంచేసుకొనందుకు సి.పి.ఐ. తీవ్రంగా విమర్శించింది. ఈ పంథాసరియైనదని తదనంతరపరిణామాలు నిరూపించాయి. అకాలీధల్‌లోని విచ్ఛిన్న కారులకు వ్యతిరేకంగా పోరాడుతు, పార్టీమిత వాదులకు ఉగ్రవాదులకు మధ్య వ్యత్యాసాన్ని గుర్తించింది. ప్రధాని రాజీవ్‌గాంధీ, సంత్‌హర్చన్ సింగ్ లాంగో వాలాల మధ్య జరిగిన ఒప్పందం, తదనంతరం జరిగిన పంజాబ్ ఎన్నికలలో అకాలీనాయకత్వం పాల్గొనుట ఇందుకు నిదర్శనం. ఈ జులై 1985 పంజాబ్ ఒప్పందం వలన పంజాబ్ పరిస్థితులలో సానుకూలత ఏర్పడింది.

---

1. సి.పి.ఐ.(యం) ఫిబ్రవరి *1984*. కేంద్ర సమితినివేదిక (ఇంగ్లీషులో) పే *56-57*.
2. వారణాసి జనంతర జాతీయసమితి, సమీక్ష, సి.పి.ఐ.పాట్నా కాంగ్రెసులో మార్చి *1986*లో ఆమోదించినది. పే. *36*.

తీవ్రవాదులు వేరుపడిపోతారన్న భయంతో సంత్‌లాంగోవాలాను హత్యచేసారు. ఫలితంగా తీవ్రవాదులపై మరింత విరుద్ధ, వ్యతిరేక భావం ప్రబలింది. వారు భయపడినట్లే ప్రజలనుండి మరింతగా దూరమయ్యారు.

పంజాబ్ రాష్ట్రశాసనసభకు 1985 సెప్టెంబరులో లోక్‌సభ ఎన్నికలతో పాటు జరిగాయి. ఒక విధంగా పంజాబ్ ఒప్పందంపై రిఫరెండంగా భావించబడింది. ఉగ్రవాదులు ఎన్నికలు బహిష్కరణ పిలుపునిచ్చినాప్రజలు దానిని పాటించలేదు. ఈ ఎన్నికలలో సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)లు కలసి పోరాడుట అన్నదిఒక ముఖ్యవిషయం, ప్రత్యేక నూతనావకాశాలు ఆవిష్కరించబడినది.

## 10. అస్సాంలో అన్యజాతీయుల సమస్య

బంగ్లాదేశ్ నుండి నిరవధికంగా ప్రజా సామాన్యం సరిహద్దులుదాటి, చట్టాల నుల్లంఘించి వచ్చిన విదేశీయులను పంపించివేయాలనే ఆందోళన 1979లో ప్రారంభమైతదనంతర కాలంలో పెద్దవుద్యమంగా అభివృద్ధిచెందింది. అస్సాంలోని యీ ప్రజావుద్యమలెల్లువకు మూలకారణం అస్సాంప్రజలలో పెరుగుతున్న భయాందోళనలకు గురిఅగుటగావుంది. అధికారులు తక్షణం తగుచర్యలు తీసుకొనాలని ఉద్యమం కోరుతున్నది. అస్సాంలోని అన్నిమతాలకు చెందినవారు తమ ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక వ్యక్తిత్వాలు కాపాడుకొనుటకు ప్రజాతంత్రయుతంగా అభివృద్ధి చెందుటకు, తమ హక్కులను కాపాడు కొనుటకు చట్టనమ్మతం, రాజ్యాంగ బద్ధమైనరక్షణలు కల్పించాలని కోరుతున్నారు. ఈ ఉద్యమానికి గల కారణాలను సి.పి.ఐ., ఆర్.యస్.పి.ఐ., ఇంకా యస్.యు.సి.ఐ., సి.పి.ఐ. (యం) ఆర్.యస్.పి., లోక్‌దళ్, కాంగ్రెసు (యస్)లు 21 జూన్ 1980లో సంయుక్తంగా విడుదల చేసిన ప్రకటనలో ఇలా వివరించారు.

"మొదటిది : అస్సాం ప్రజల భాషా, సాంస్కృతిక, విశిష్టతను పరిరక్షించుకొనాలన్న ప్రగాఢవాంచ, అవిహరించుకు పోతాయన్నభయము.

రెండవది : అస్సాంరాష్ట్రంలో ఒకవైపు వెనుకబడిపోయిన తనము, మరోవైపున పుష్కలంగా ప్రకృతి వనరులు వగైరావున్నప్పటికి, నిరుద్యోగం, దుర్భరదారిద్ర్యం పెరిగి పోతున్నవి.

మూడవది : నూనెశుద్ధి కర్మాగారాలు, బ్రహ్మపుత్ర వంతెనతో రైల్వేబ్రాడ్‌గేజ్‌లైను, వరదల నిరోధకం వగైరా, వరదల ప్రధాన ప్రాజెక్టులకు సంబంధించి, అస్సాం అభివృద్ధి విషయమై, భారత ప్రభుత్వ ఉదాసీన వైఖరులపై లోగడ అస్సాం ప్రజలు ప్రతిసందర్భంలోను ఉద్యమం ప్రారంభించవలసి వచ్చింది.[1]

"అస్సాం ఆందోళనకు అవలంభించిన పద్ధతులు హానికరమైనవనీ" అయినా "ఆందోళన వెనుక నిజమైన ఇబ్బందులున్నవని" సి.పి.ఐ. 1981 జనవరి కేంద్ర కార్యవర్గ

---

1. వారణాసి పార్టీ కాంగ్రెసు అనంతరం, సి.పి.ఐ. జాతీయ సమితి సమీక్ష, 1986 మార్చి. పాట్నాలో జరిగిన పార్టీ కాంగ్రెసు ఆమోదించింది. పే. 40.

తీర్మానంలో వ్యక్తంచేసింది. అస్సాం ఉద్యమకారులు వారి కార్యకలాపాలను వ్యతిరేకించే జాతీయ రాజకీయ పార్టీలకు, మైనారిటీలకు వ్యతిరేకంగా ఉగ్రవాదులు ఉద్యమాన్ని మళ్లించ ప్రయత్నించారు. వామపక్షాల కార్యకర్తలు 200 మందికిపైగా చంపుటో. గాయపరచుటో చేసారు. భారతకమ్యూనిస్టు పార్టీ జూన్ 1979లో రాష్ట్ర కార్యవర్గం 1971 నాటికి ముందు వచ్చిన విదేశీయులను గుర్తించి బయటకు పంపించివేయాలని. ఇక మీదట బయటిజనం రాకుండా నిరోధించుటకు బంగ్లాదేశ సరిహద్దులను మూసివేయాలని కోరింది. ఆందోళన కారులు 1951ను ప్రాతిపధికగా తీసుకొనాలని కోరారు. ఈ సమస్య పరిష్కారం కాకపోగా మరింత జటిలంకాగా, డిసెంబరు 1982లో సి.పి.ఐ. జాతీయ సమితి క్రింది విధంగా ప్రతిపాదించింది.

"ప్రస్తుతం ఉన్నచట్టాల మేరకు 1961-71 మధ్య జాతీయ నిబద్ధతలమేరకు ఇక్కడ స్థిరపడిన, నమోదైన విదేశీయులకు ఇక్కడే క్రమబద్ధం చేయాలని, వారిని కదలించరాదని సి.పి.ఐ. జాతీయ సమితి భావిస్తున్నది. ఈ బాపతల ప్రజలకు ఈ దశలో పౌరసత్వసర్టిఫికేట్లు పొందిన వారిని అస్సాంలో నివసించుటకు అనుమతించాలి. ఈ రెండు తెగల క్రిందికి రాని వారిని గుర్తించి రాష్ట్రంనుంచి బయటికు పంపించాలి. రాష్ట్రం వెలుపలవారికి వాసం కల్పించాలి. ఇది జాతీయ సమస్య అందువలన, భారాన్ని జాతిమొత్తం పంచుకోవాలి.

అంతేగాక, "1961కి మూందు వచ్చిన వారినిక్రమపద్ధం చేయాలని, 1971 తర్వాత వచ్చిన వారిని బయటకు పంపించి వేయాలని" సి.పి.ఐ. కోరింది. ఓటర్ల జాబితా వివాదాంశమైంది, 1983లో జరిగిన ఎన్నికలను ఆందోళనాకారులు వ్యతిరేకించి, హింసాకాండలు సాగించుటతో వేలాది ప్రజలు మరణించారు. కొన్ని జాతీయ పార్టీలు ఈ ఎన్నికలను వ్యతిరేకించాయి. ఫలితంగా వోటర్ల జాబితాపై చర్చలు జరిపేందుకు జాతీయ, రాష్ట్రస్థాయి పార్టీలతో కేంద్ర ఎన్నికల కమిషన్ సమావేశాన్ని ఏర్పాటు చేయుట జరిగింది. సి.పి.ఐ. 1971 జాబితాను, కాంగ్రెసు (ఐ), సి.పి.ఐ. (యం) 1979-జాబితాను ప్రాతిపదికగా చేసుకొనాలని కోరాయి. ఎన్నకల కమిషన్ 1971 జాబితాను ప్రాతిపధికగా చేసుకొవాలని నిర్ణయించింది. శాంతి యుతంగా ఎన్నికలు జరుగుటకు ఇది తగిన వాతావరణాన్ని కలుగజేసింది[1].

ఎన్నికల కమిషన్ 1971 నాటి వోటరుల జాబితాను ప్రాతిపదికగా నిర్ణయించుటను సి.పి.ఐ.(యం) అకారణంగా, ఇది 1979 వోటర్ల జాబితాను దేని ఆధారంగా 1980, 1983 ఎన్నికలు జరిగాయో అందులోని అనేక లక్షలమందికి వోటుహక్కు లేకుండా చేయుటయే అగుతుంది. కాంగ్రెసు (ఐ) ఆందోళన కారులు ఈ విషయంలో ఒక అవగాహనకు వచ్చినట్లు కన్పడుతున్నది. అయినా ఆందోళనా కారులు, జరుగబోయే లోక్‌సభ ఎన్నికలలో పాల్గొంటారని తలంచుట తొందరపడిన నిర్ణయం అగుతుంది.

1. వారణాసి పార్టీ కాంగ్రెసు అనంతర హరిణామాలను జాతీయ సమితి చేసిన సమీక్షను. *1986* మార్చిలో పాట్నాలో జరిగిన సి.పి.ఐ. పార్టీ కాంగ్రెసు ఆమోదించింది. పే. *40*

ఈ ఒప్పందం విచ్ఛిన్నకర ప్రమాదాన్ని యేమాత్రం తొలగించజాలదూ. ఆందోళన కారుల అస్సాం ప్రజానీకం అధికంగా ఉన్న స్థానాలలో విజయంపై ఆధారపడి, అదే కాలంలో కాంగ్రెసు (ఐ) అస్సాం యేతర ప్రజానీకం అధికంగా ఉన్న స్థానాలలో విజయంపై ప్రాతిపధికగా, ఒప్పందానికి వచ్చినట్లు కన్పడుతున్నది. "విదేశీయులు" అన్నపేరుతో చట్టవిరుద్ధంగా ఆందోళన కారులను సంతృప్తి పరచేప్రయత్నం, మరోప్రమాదానికి మూలంకావచ్చు. ఏమైనా, అస్సాంయేర్పాటు ఉద్యమం సజీవంగానే ఉంది." అని విమర్శించుతు వ్యతిరేకించింది.

అంతేగాక, "అస్సాంలో ఏర్పాటు వాదులతో పోరాడుటకు ప్రజాస్వామ్య లౌకిక జాతీయ శక్తులతోకలసి పోరాడుటకు సహకారాన్ని కోరేరాజకీయ విధానంలేదు. అంచేతనే ఏర్పాటువాదాన్ని ఓడించుట లేదు[1]" అని సి.పి.ఐ.(యం) కేంద్ర కమిటీ వివరించి పార్టీకి గతంలో వలెనే ధైర్యసాహసాలతో పోరాడాలని విజ్ఞప్తి చేసింది.

అస్సాం అభివృద్ధికి, దేశ ఐక్యత, సమగ్రతులుకు "విదేశీయులసమస్యను అనివార్యంగా పరిష్కరించబడాలని "అంటూనే ప్రభుత్వమూ ఆందోళనకారులు చేసుకొన్న ఆగస్టు 1985 ఒప్పందాన్ని సి.పి.ఐ. హర్షించింది. అయితే సి.పి.ఐ.(యం) దానితో సహకరించే కొన్ని వామపక్షపార్టీలు తమపూర్వవైఖరిని మార్చుకొని అస్సాం ఒప్పందాన్ని తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాయి.

జాతీయ ఐక్యతాసమస్యను కేంద్ర రాష్ట్ర సంబంధాలు, ప్రాంతీయ భాషాప్రయుక్త రాష్ట్రాలు ప్రాతిపధికపై, రాష్ట్రాల పునర్విభజన, పునర్నిర్మాణం, సమస్యలు, జాతులు, ఉపజాతులు, సమస్యలు, వెనుకబడిన జాతులు, సంచార తెగలు మతకుల రిజర్వేషనుల నుండి విడదీసి, అవగాహన చేసికొనుటకు ప్రయత్నించరాదు. వీటితో యేర్పాటువాదుల సమస్యలను సమగ్ర అధ్యయనం, సమానత్వ ప్రాతిపధికలపై బహుముఖ పరిష్కార మార్గాలు చేపట్టుట ఆర్థిక అసమానాభివృద్ధి తొలగించే ప్రణాళికాబద్ధ కార్యక్రమాలను ఆచరించుటతో జాతీయ ఐక్యతాభివృద్ధికి పాత్రిపధిక మౌలికంగా ఏర్పడుగలదు.

దేశ ఐక్యతకు, భద్రతకుముప్పు పెరిగిపోతున్న పరిస్థితులు దేశంలోను అంతర్జాతీయంగా ప్రపంచశాంతికి ప్రమాదం ఏర్పడుతున్నది. ప్రపంచ శాంతిని దేశభద్రతను కోరేవారందరూ ఒక సమిష్టి అవగాహనలకు పురోగమించవలసిన అవసరముంది.

సి.పి.ఐ. జాతీయసమితి 1983 ఏప్రిల్‌లో తన సమీక్షా నివేదికలో ఇలాస్పష్టంచేసింది. "జాతీయ ఐక్యతా సమగ్రతల పతాకాన్ని ఈనాడు ప్రధానంగా కార్మికవర్గం, దాని మిత్రులు, శ్రమజీవులు పార్టీలు, వామపక్షమూ చేపట్టాలి. ఈ విషయంలో సి.పి.ఐ. తదితర వామపక్షాలు కాంగ్రెసు (ఐ) వెనుకనిల్చే వారితో సహా జాతీయైక్యత కోసం నిల్చే", సర్వ ప్రజాస్వామ్య శక్తుల ఐక్యతను నిర్మించుటకు సహాయంతోనే గాక ఆ శక్తులను

*1. సి.పి.ఐ.(యం) జాతీయ, అంతర్జాతీయ సమస్యలపైనివేదిక, ఫిబ్రవరి 1984 న్యూఢిల్లీ సమావేశంలో ఆమోదించింది. (ఆంగ్లంలో) పేజి 58-9.*

సమీకరించాలి అని ఆచరణ సాధ్యమైన పిలుపునిచ్చింది. ఈ ఐక్యతా నిర్మాణానికి చోధక శక్తిగా పనిచేసే కార్మికవర్గ ఐక్యతకు ప్రత్యేకంగా కార్మికవర్గం అనేక కార్మిక సంఘాలలో చీలిపోయి, కనీసం ఆర్థిక సమస్యలపైన కూడ, ఐక్యంగా అఖిలభారత లేక రాష్ట్ర స్థాయిలలో పోరాడజాలని స్థితిలో ఉన్నపుడు, దీనిప్రాముఖ్యత గురించి ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు.

సి.పి.ఐ. జాతీయ సమితి తిరిగి ఏప్రిల్ 1984లో "జాతీయ భద్రత జాతీయైక్యత, లౌకికవాద రక్షణ సమస్యలపై జాతీయయేకాభిప్రాయాన్ని సాధించాలన్న విషయమై వామపక్ష, ప్రతాతంత్ర శక్తులు సుముఖతవ్యక్తం చేసారు. అయితే, ఇందిరాగాంధి బొంబాయి ఎ.ఐ.సి.సి. కాంగ్రెసు సమావేశంలో యీ విషయమై ప్రస్తావించినప్పటికి, ఆ తరువాత మాత్రం ఉపసంహరించుకొన్నారు, అనిప్రకటించింది. జాతీమైక్యత, సమగ్రతల పోరాటానికి, కేంద్ర బిందువుగా ఇందిరాగాంధీని చేయుటతో స్వతంత్రతపాత్ర, చొరవకొంత కుంటుబడిందనుటలో సందేహంలేదు.

సి.పి.ఐ.(యం) కేంద్రసమితి సెప్టెంబరు 1983లో భారతదేశంలో అనిశ్చిత పరిస్థితులపెంపొందించి, వేర్పాటు శక్తులను అమెరికా పెంపొందించుచున్నదనే అవగాహన గత ఐదు మాసాలలో మరింతబలపడిందని ఏప్రిల్ 1984 కేంద్ర సమితి సమావేశంలో స్పష్టం చేసింది. భారత ప్రభుత్వం యీ పరిస్థితిని ఎదుర్కొనుటలో వైఫల్యం స్పష్టమని సమితిఅవగాహన. "విప్లవకార్మిక వర్గం ప్రజాస్వామ్యవాదులు నిజమైనదేశ భక్తశక్తులు మత, కుల, వేర్పాటు వాద శక్తులపై పోరాటంలో సమీకరించిబడకపోతే వేర్పాటు వాద శక్తులను ఓడించజాలము, వర్గ, ప్రజాసంఘాల ఐక్యతను కాపాడజాలము, దేశ ఐక్యత, సమగ్రతలను సంరక్షించ జాలమని" ముగింపుగా స్పష్టం చేసింది[1].

(ప్రథమ భాగం సమాప్తం)

1. సి.పి.ఐ. (యం) ఫిబ్రవరి కేంద్రసమితిని వేదిక (ఆంగ్లంలో) పే. 51.

"కమ్యూనిస్టుల ఐక్యసంఘటన అన్వేషణ" పై

## అభిప్రాయాలు

"పరిశోధకులకు ఒక ఘనిగా", "పార్టీ సభ్యులకు గుణపాఠాలకు" తోడ్పడుతుంది.

- వై.వి. కృష్ణారావు
ఎ.ఐ.కె.ఎస్. గౌరవాధ్యక్షులు

"ఇది వినూత్న ప్రక్రియ - అందరూ చదవవలసినదే"

- కీ॥ శే॥ నండూరి ప్రసాదరావు
సి.పి.ఐ.(యం) కేంద్ర కమిటి సభ్యులు

"దశాబ్దంపైగా వందలాది పత్రాలను పరిశీలించి, విశ్లేషించిన రాజకీయ పరిశోధనా ప్రయత్నమిది"

- సి.రాధాకృష్ణదాసు,
ప్రధాన కార్యదర్శి, సర్వోదయ ట్రస్టు, విజయవాడ.

"పరిశీలన వామపక్షాల మార్క్సిస్టు సిద్ధాంత అవగాహనతో కూడినది"

- ప్రొ॥ వి.వి. కృష్ణారావు.

---

**రాజకీయ, సైద్ధాంతిక అవగాహనలను పెంపొందించుకొనే కార్యకర్తలు, రాజకీయ పాఠశాలలకు హాజరయ్యే విద్యార్థులు, ముఖ్యంగా కమ్యూనిస్టు శ్రేణులు తప్పక అధ్యయనం చేయవలసిన గ్రంథాలు.**

---

1. సంపుటి - 1 : ఆది, జాతీయ సంఘటన, విగ్రహ, పోరాట పర్వాలు.
2. సంపుటి - 2 : సాగర మధన, అమృత, భిన్న దృక్పధాల సంఘర్షణ, బృహద్వివాద పర్వాలు.
3. సంపుటి - 3ఎ : సరిహద్దు యుద్ధ పర్వం
4. ॥ 3బి : చీలికల పర్వం
5. ॥ 3సి : నక్సల్బరీ పర్వం
6. సంపుటి - 4ఎ : ఐక్య సంఘటనల పర్వం
7. సంపుటి - 5ఎ : సైద్ధాంతిక సంక్షోభ పర్వం

త్వరలో ఐక్యసంఘటనల పర్వం (జాతీయ అనుభవాలు)
సైద్ధాంతిక సంక్షోభ పర్వం (2వ భాగం)
అత్యవసరపరిస్థితి పర్వం
అడుగుజాడల పర్వం

**రచయిత : డి.వి సుబ్బారావు**